ఓం

# శ్రీ బుద్ధ చర్య

అనువాదకులు:

బ్రహ్మశ్రీ రామకృష్ణ బ్రహ్మచారిగారు
శ్రీ భూమానందాశ్రమము, గండిక్షేత్రము



నమోతస్స భగవతో అరహతో సమ్మా సంబుద్ధస్స

ప్రకాశకులు:

శ్రీ వ్యాసాశ్రమము

ఏర్పేడు, చిత్తూరు జిల్లా.

# అంజలి

శ్రీ గండిశైల నిలయాయ మహోన్నతాయ
పాపఘ్ని నామక నదీతట శోభితాయ
దివ్యాయ దివ్యచరితాయ నమో నమస్తే
వీరాంజనేయ! మమదేహి కరావలంబమ్.

ఆదినారాయణు నవతారమూర్తి ము
జ్జగములు మన్నించు యుగపురుషుడు
ఆసియాఖండంబునకు ననారత మాఱి
పోని దీపము మహాబోధిసత్త్వు
డచ్చుబోసిన యహింసావిగ్రహము శాంతి
దాంతి ప్రేమలకు నాదర్శ గురుడు
నిర్వాణ సామ్రాజ్యనిలయంబునకు పట్ట
భద్రుండు శాంతవిప్లవవినోది

బుద్ధదేవుండు ఆతని పుణ్యచరిత
మాంధ్ర మొనరింప ప్రేమతో నాజ్ఞ నొసగి
నట్టి, యేర్పేడు వ్యాసాశ్రమాధిపతికి
కరములు మొగుడ్తు మలయాళ గురువరునకు.

# విషయసూచిక







ఓం

# అనువాదకుని పీఠిక

పీఠిక లేనిదే పాఠకులకు కడుపునిండదు. గ్రంథము చేతికి వచ్చినంతనే పీఠికవైపు పరు గెత్తుట ఆధునిక ప్రథ. ఆ పరిపాటిని పాటిస్తూ పేర్కొనదగిన విషయములను పీఠికా ముఖమున మనవి చేయుచున్నాను.

దరిదాపు ముప్పై నెలలనాటి మాట. మిత్రుడు శ్రీకంఠంగారు వ్యాసాశ్రమములో ఉండే తరుణము. ఆదర్శగురుదేవుడు శ్రీ శ్రీ శ్రీ మలయాళస్వాముల వారినుండి 'బుద్ధచర్య' ను అనువదిస్తావా? అని ఆజ్ఞాపత్రము వచ్చినది. ఆ – ఊ అననిదే రిజిస్టర్డ్ పోస్టులో పుస్తకమే దిగినది. శ్రీవారి ఆజ్ఞను పరిపాలించుటకు లోకములో తలలు వంచి యెందఱులేరు? ఆ కృపాఫలము నా దోసిట్లోనే పడవలెనా? ఇచ్ఛామయుని యిచ్చను యెవ్వరె ఱుంగుదురు? ''దీనిం దెనింగించి నా జననంబుఁ సఫలంబు జేసెద'' నని మహాకవి పోతన్నగారి మధుర మంత్రాన్ని మననము జేశాను. శుభమస్తు.

ముప్పదిరెండు భాషల అద్వితీయ విద్వాంసుడు, బౌద్ధవాఙ్మయమున దిగ్గజ పండితుడు, త్రిపిటకాచార్యుడునగు రాహుల సాంకృత్యాయనుని రచన యిది. దీని పేరు బుద్ధచర్య. ఇది హిందీభాషలో వ్రాయబడిన గ్రంథము. త్రిపిటకములలోని పాలీమాటల నిటునటు కదిపి 'హిందీ, అనిపించారు. పారిభాషికపదాలు పట్టిన చోటల్లా గుదుళ్లు గుదుళ్లు పునరుక్తులు సంకేతాలు పై పెచ్చు అచ్చుతప్పులు కూడ.

స్వయముగ గ్రంథకర్తే చెప్పినట్లు భాష గడుసుబాఱుటతో– రోచకము కాక పోవుటతో చదువవలెనన్న తలనొప్పి. పండ్లుకొఱికి చదవాలి. అందులోనూ యెన్నడూ మూచూడని బౌద్ధదార్శనిక విషయములు, పాలీజాతీయములు, అవధి బీహార్ ప్రాంతీయులకు మాలిమియైనవి కాబట్టి వారికి తేలిక కావచ్చును గాని దక్షిణ ప్రాంతీయులకవి మ్రింగరాని కబళాలు. ఎట్లెట్లో ఒకతపస్సే చేసితిని. నాకు కొఱక

రాని ఘట్టములను మక్కికి మక్కి అనువదించితిని. శ్రీ మలయాళస్వాముల వారు సెలవిచ్చినట్లు వీలైనంత సులభ సరళముగ రచనను దించవలెనని యెంచితిని గాని యెన్నో చోట్ల ఆశాభంగమే యెదురైనది. అందుకు కారణము కొంత నా అసమర్థత, మరికొంత గ్రంథగౌరవము.

కొఱమాలిన వర్ణనలను, అక్కఱకు మీఱిన పునరుక్తులను అనువాదమునందు వదలిపెట్టితిని. చెత్తచెత్తగ నున్నచోట్ల యథాసాధ్యముగ విషయమును మెదిపి తెలుగు నుడికారమునకు పొందిక కలుగునట్లు ఒక పాకము నిచ్చితిని. భాష పాతది. వేషము క్రొత్తది. అయినను 'నామూలం లిఖ్యతే' అనెడి మల్లినాధీ ప్రతిజ్ఞను అక్షరశః నిభాయించితిని.

వినుటలో యింపు-చదువుటలో సారళ్యమునందే యెక్కువ నిగా పెట్టుటతో సంధులను-వ్యాకరణాంశములను అంతగ పాటించలేదు. పాఠకులకు బౌద్ధపరిభాషా పదములు పరిచయము చేయదలంచి ''భంతే- బోధిసత్త్వ-శ్రమణ-శ్రావక'' ప్రభృతుల నందందు వాడితిని. ఎంత జెప్పినను పరిభాషా బహుళమగు యీ గ్రంథమును ఒక్క పర్యాయము పఠించి జీర్ణింపజేసికొనుట మాత్రము దుస్సాధ్యము. ఓపికబట్టి కొన్నితడవలు చదువుటతో అనంత లాభము చేకూరుననుటకు ఆవంతయు సందియము లేదు.

బౌద్ధవాఙ్మయ మతివిశాలము. అందు ప్రామాణికములు త్రిపిటకములు. వాటి నానుకొని చెప్పదగినవి వ్యాఖ్యానప్రాయములగు జాతకములును, అట్ఠకథలును. వాటి నుండి యేర్చికూర్చిన దీ పుస్తకము. బుద్ధజీవిత ప్రసంగముల నింతటి ప్రామాణికముగ- యింతటి విస్తారముగ ప్రవచించిన గ్రంథము ప్రపంచభాషలలో- లేదా భారతీయభాషలలో యిదియే మొదటిది యనుట నిక్కము. మహానుభావుడగు శ్రీమలయాళస్వాములవారు ఆంధ్రలోకమునకు ప్రసాదించు ఆధ్యాత్మిక భిక్ష యందు యిదిగూడ నొక కబళము. పేరెన్నికగన్న యే సమర్థలేఖకులో నిర్వహింపదగిన యీ దుర్ఘటకార్యమును క్షుద్రసేవకుడనైనన నా కప్పగించి అండన దండన- వీపున మూపున తమ ఆశీర్వాదబలమును నిలిపి తెనుగు చేయింపించిన ఆ వ్యాసాశ్రమ విహారిని- ఆంధ్రులపాలిటి బుద్ధదేవుని, పదింబది భక్తి వినమిత భావమున తలంచి నమస్కరింతును.

పీఠికయందు బౌద్ధధర్మమును దిగ్దర్శనముగ కొంత పరిచయము చేయించుట పాఠకులకు మున్ముందు మార్గమును సులభము జేసినట్ల గుటబట్టి త్రిరత్నముల

నియు, శరణత్రయ మనియు బౌద్ధులు జెప్పు బుద్ధుడు- ధర్మము- సంఘము ననెడి మూడింటిని యథోచితముగ వివరింతును. కావలసిన విషయసామగ్రి యంతయును యీ మూడింటిలోనే అంతర్భూతమై రాగలదు.

## బుద్ధుడు

భగవంతుడు బుద్ధుడు యీ విశాల విశ్వమునకు ఒక అసామాన్య విభూతి. తన ధార్మికోపదేశములచే సంఖ్యాతీత మానవకోటికి శ్రేయోమార్గమును జూపించిన ఆదర్శజ్యోతి బుద్ధుడు. అపారత్యాగము, అఖండవిశ్వప్రేమ, అద్భుతశీలసంపదతో అచ్చుబోసిన దివ్యవిగ్రహము బుద్ధుడు. కర్మకలాపములను చెత్త చెదారములలో అడుగున బడిపోయిన 'అహింసాపరమోధర్మః' యనెడి సనాతన వైదిక సిద్ధాంత మును మఱొకసారి గగనవీధుల కెత్తించి విశ్వప్రపంచముతో బ్రహ్మరథము పట్టించిన మహాప్రవక్త బుద్ధుడు. యజ్ఞాదికర్మలకంటె ప్రజ్ఞాలాభమే శ్రేష్ఠమని, శుష్కతర్క సిద్ధాంతములకంటె సదాచార జీవనమే సర్వోత్తమ మని, బ్రాహ్మణత్వము ప్రయత్న సాధ్యమేగాని పరంపరాహక్కుగాదని సారెసారెకు ఉద్ఘోషించిన ప్రబుద్ధుడు బుద్ధుడు. సంప్రదాయమునకంటె సత్యమే గొప్పదియని చెప్పి, పరప్రత్యయ బుద్ధిని వదలి స్వానుభవముననే సాక్షాత్కారమును సంపాదింపవలెనని బోధించిన పుణ్యాత్ముడు బుద్ధుడు. 'శీలశుద్ధిని సంపాదించుకొని నిర్వాణ సుఖమును చూఱగొని మనుష్య జన్మము దేవదుర్లభమను మాటను సార్థకము జేయుడో' యని లోకమునకు చాటిన మహానుభావుడు బుద్ధుడు. గడచిన అవతారము లందలి లోపమును నివారింప జేసికొనుచు 'హింసను హింసచేతగాదు; ప్రేమచేతనే జయింపవలె' ననెడి అపూర్వ సిద్ధాంతమును ఆవిష్కరించిన శ్రీమన్నారాయణుని నవమా వతారము బుద్ధుడు.

రాజాధిరాజులు బౌద్ధమతానికి పల్లకిమోసిన దినాలను, బౌద్ధధర్మ విజయ దుందుభి లోకమంతటను జైత్రయాత్రచేసిన దినాలను, సమగ్రవిశ్వములో మొత్తము నకు సగముమంది చేతులుకట్టి 'బుద్ధం శరణం గచ్ఛామి; ధర్మం శరణం గచ్ఛామి; సంఘం శరణం గచ్ఛామి' అని ఉద్ఘోషించిన దినాలను, గత ప్రపంచ చరిత్ర గర్వించి వ్రాసుకొన్నది,

''యశోవా మృత్యుర్వా'' యని భీష్మప్రతిజ్ఞచేసి బోధిజ్ఞానసిద్ధికై దృఢనిష్ఠ బూనిన వజ్రసంకల్పము, పుట్టిపెరిగిన పురములో భిక్షకై బయలు దేరిన నిరభి మానము, ఏకైక పుత్రుడగు రాహుల కుమారునకు సంన్యాస మిప్పించిన ఆదర్శప్రీతి,

బోధిరాజ కుమారుడు పఱిచిన బట్టలపై అడుగు పెట్టననిన ధీరనియమము, ఏభైయైదేండ్ల వఱకు పరిచారకుని వెంటగొనని స్వావలంబనము, ''యెందఱో మహానుభావులు; నేనొక లెక్కేమిటి'' యని సారిపుత్రుని మందలించిన సౌజన్యము, మొత్తము జీవిత మునకంతయు నొకేయొక పర్యాయము నవ్విన గంభీరస్వభావము- నీయొక్కని యందు తప్ప కంచుకాగడాలతో వెదకినను, దేవా! మఱెచ్చటను లభింప బోదు. ఇల్లు వదలితివి. భార్యను వదలితివి. రాజ్యమును వదలితివి. భోగములను వదలితివి. ఎందుకొఱకు? దుఃఖదావాగ్నిలో కుతకుతలాడెడి ఆర్తమానవకోటికి శాంతిరసాయ నమును త్రాపించుటకొఱకా? అహో! ఏమాదయ! ఏమిటా కరుణ. నమోతస్స భగవతో అరహతో సమ్మా సంబుద్ధస్స-

వివేకమును జ్ఞానమును సచ్చారిత్రమును మానవయత్నమున సాధింప శక్యమగు నంతకు సాధించి లోకోద్ధారదీక్షయందు ప్రవృత్తుడగు వానిని బుద్ధుడం దురు. అట్టి స్థితిని బొందుటకై ప్రయత్నముజేయు సాధకుని బోధిసత్త్వుడందురు.

బుద్ధుడు యిరువదితొమ్మిదవయేట మహాభినిష్క్రమణము ( గృహత్యాగము) జేసి ముప్పదియైదవయేట సంబోధినిపొంది యెనుబదియవయేట మహాపరి నిర్వాణమును జెందెను.

ఆయన జన్మించినట్టి, సంబోధిని పొందినట్టి, పరినిర్వృతుడైనట్టి వైశాఖ పౌర్ణ మియు, మాతృగర్భప్రవేశము జేసినట్టి, ధర్మచక్ర ప్రవర్తన మారంభించినట్టి ఆషాఢ పౌర్ణమియు బౌద్ధులకు మహాపర్వదినములు.

అయిదునూట యేబది జన్మముల నుండియు, దాన శీల నైష్కర్మ్య ప్రజ్ఞావీర్య క్షాంతి సత్య అధిష్ఠాన మైత్రీ ఉపేక్షలను పారమితలను పదింటిని సంపాదించుచు వచ్చి చివరకు బుద్ధత్వమును- పూర్ణజ్ఞానమును పొందగల్గినాడని బౌద్ధజాతక కథలు చెప్పును. మతస్థాపకుల ప్రసంగములందు అతిమానుష చర్చలను జొనుపని మతమనునది ప్రపంచమున నింతవఱకు లేదు.

పండితభాషయగు సంస్కృతమును వదలి, తన ధర్మసందేశము సామాన్య జనహృదయ గుహలలోకూడ జొచ్చునట్లు లోకభాషయగు పాలీని బుద్ధదేవు డాశ్ర యించినాడు. దానినే మాగధీభాష యని కూడ నందురు.

కాశ్యప ప్రభృతులగు బ్రాహ్మణులకు, బింబిసారాదిరాజులకు, అనాథపిండ కాది వైశ్యులకు, సింహుడు మొదలగు సేనాపతులకు, ఉపాలి మొదలగు నిమ్న

జాతులకు, విశాఖ– అమ్రపాలి మున్నగు స్త్రీలకు బుద్ధుడు సర్వసమానముగ తన మతములో స్థానమొసగినాడు.

శ్రావస్తి నివాసియగు అనాథపిండక శ్రేష్ఠియొక్క పేరు బౌద్ధధర్మ– ఇతిహాస ములో సువర్ణాక్షరములతో వ్రాయదగినది. ఆనాడు వైశ్యులకు ప్రాబల్య ముండినది. కాని దానికి మించినది క్షత్రియ జాతి. అందుకయ్యే లోకమాన్యమగు ఆ జాతి యందు బుద్ధభగవంతు డవతరించినాడు.

మగధరాజు బింబిసారుడు, కోసలరాజు ప్రసేనజితుడు, కౌశాంబీరాజు ఉదయనుడు, ఉజ్జయినీరాజు ప్రద్యోతనుడును బుద్ధునియెడల విశేషాదరములను చూపెట్టువారు.

గౌతమబుద్ధుని జీవితచర్యలు మనకు తగినంత విరివిగ లభించుటలేదు. కర్తకంటె కార్యమే గొప్పదనుమాట మహాపురుషులపక్షమున సార్థకముగదా! బుద్ధోపదేశము లెన్నియో కాలప్రవాహమునబడి విస్మృతిగర్భమును జేరినవని బౌద్ధులు చెప్పుదురు.

''స్వప్రయత్నమున సదాచారము నవలంబించి మానవుడు నిర్వాణమును చూఱగొన గల్గుచున్నా'' డని బుద్ధధర్మము భేరీనినాదము జేయుచున్నది.

ఆనాటి సంఘమునకు సంభవించిన రోగమునకు చికిత్సకుడు. కావున అందుకు అవసరమగు పనులను జేసెను. దానివలననే ఆయనకు ''మహాభిషక్కు'' డని పాలీగ్రంథ ములు పేర్కొన్నవి.

బుద్ధుని సమయములో సమాజముయొక్క పరిస్థితి చాల యెగుడు దిగుడుగ నుండినది. బ్రాహ్మణులు నివృత్తిపరతనుమాని ప్రవృత్తి పరాయణులైనారు. జనసామాన్యమునకు వారిపై ఆదరములేక పోయినది. రాజులు ప్రకృతిరంజకతను మాని అల్ప స్వల్పవిషయాలపై కయ్యము చేయుట ఆ దినములలో మామూలై యుండినది. స్త్రీలదశ మఱింత హీనము. వారు ధర్మమును అంటనేరాదు. సంఘములో వారి స్థానము తక్కువ.

పశుయజ్ఞ ప్రాబల్యమున హింసలు మెండగుటచే ప్రకృతి క్షోభించి లోకము నందు పాపము పెఱిగి తొంబదియెనిమిది విధముల రోగము లుప్పతిల్లినవి. ధర్మము యొక్క కళేబరముపై లక్ష్యముంచి లోకులు జీవశక్తిని ఉపేక్షించిరి.

పూర్ణకాశ్యపుని అక్రియావాదము. అజితకేశకంబలుని ఉచ్ఛేదవాదము, ప్రకృతకాత్యాయనుని అకృతతావాదము, మస్కరీగోశాలుని దైవవాదము, సంజయుని సంశయవాదము, నిర్గ్రంథజ్ఞాతృపుత్రుని చాతుర్యాను సంవరము, ఒకవైపు కర్మాడంబర విస్తారము. ఒక్కెడ హఠయోగ సాధనాలంపటత, ఒక్కచో శుష్కదార్శనిక ప్రచండా ర్భాటము, మరొక్కచోట పాశవిక భౌతిక భోగవిలాసలాలసత- సమస్తమును శాశ్వతమని కొందఱు, సర్వము నశ్వరమని కొందరు, భోగ మగ్నతయే చరమప్రయోజనమని కొందరు, ఉపవాసాది కాయక్లేశములే శ్రేయస్సని కొందరు, ఆకస్మిక సంయోగముననే సర్వము నడచుచున్నదని కొందరు, సుఖ దుఃఖములు స్వయంకృతములని కొందరు, పరాధీనములని మరికొందరును- యీ విధమున 'ఆది'ని గూర్చి పదునెన్మిది మతములును, 'అంతము'ను గూర్చి నలుబదినాలుగు మతములును మొత్తము బుద్ధుని కాలమున అఱువైరెండు మతవాదము లుండెనని దీర్ఘనికాయము జెప్పుచున్నది.

ఇట్టి విషమకోలాహల విపరీత వాతావరణమున తన క్రియాశక్తిని ప్రదర్శించి యెట్టి అతిరేకమునకును తావియ్యక సాక్షాత్కారబలమున మధ్యమమార్గము నావిష్కరించి గౌతమబుద్ధుడు నూతనమతమును స్థాపించినాడు.

తార్కిక దార్శనిక చర్చయొక్క వ్యామోహమునందు అతడు చిక్కొనక తేలికగ పోయెను. అతడు పరలోకసంబంధమగు వివిధకల్పనలపై తన ధర్మమును నిర్మింప లేదు. ఆత్మ పరమాత్మల జంజాట మతనికి పట్టలేదు. అతి ప్రశ్నల సందర్భములో బుద్ధుడు మౌనాన్ని అవలంబించేవాడు. వాటిని అవ్యాకృతములు (వివరింపవీలు గానివి) అవికూడ యనువాడు.

ఆనాడు దార్శనికవిచారములకు దరిద్రము లేదు. యుక్తిప్రయుక్తులకు కొదువ లేదు. కాని వచ్చినలోటు సదాచారమువద్ద; శీలమువద్ద.

జీవితమునందు దుఃఖము దొలగుటకు, నిర్వాణమును బొందుటకు వలయు ఆచార ధర్మములను-శీలసాధనములను మాత్రమే బుద్ధు డుపదేశించెను. కర్తవ్య నిష్ఠుడగువానికి ఫలము తనంతన తాను లభించునుగాన శ్రావకులను కర్తవ్యమార్గము నందు అగ్రేసరుల జేయుటకై ఆచారనిర్మాణమునందే అతడు సర్వోపర్వకృషి జేసెను. ప్రజ్ఞాశీలసమాధులతో తన సిద్ధాంతమునకు 'ఇతిశ్రీ' చెప్పెను.

జీవనరహస్యమేమి? దాని సాఫల్యత యెచ్చట నున్నది? అదెట్లు పొందదగు? ననెడి విచారములే అతని నాకర్షించినవి. జీవనముయొక్క నిజస్వభావమును గుర్తింప

చేయుటకును, దాని నత్యంత మూల్యవంత మొనర్చుటకునునై అయిష్టమైనను కూడ బుద్ధమతము అనాత్మవాదమునకు పాల్పడినది.

భాగ్యముపైన, యీశ్వరునిపైన ఆధారపడి ప్రాణికోట్లు కోల్పోయిన ఆత్మ విశ్వాసమును బుద్ధుడు భర్తీ చేసినాడు.

ఉపనిషత్తులలోని సారతత్త్వమును కాలానుకూలముగ జనసామాన్యమునకు తెలియజేసి వారి జీవితములను ప్రభావాన్వితములుగ జేయుటకు బుద్ధుడు ప్రయత్నించెనని రాధాకృష్ణ పండితుడు చెప్పుచున్నాడు.

బుద్ధుడు సంపూర్ణముగ బుద్ధివాది. బంగారునువలె ధర్మమును యెవని పాటికివాడు పరీక్షించి గ్రహించుమని చెప్పును.

తక్కిన సంప్రదాయములు యీశ్వరుని పీఠముకంటె గురుపీఠమును గొప్ప జేసి గురు శరణాగతిని శిష్యునకు పరమ కర్తవ్యముగ నాదేశించుచుండ బుద్ధుడు 'యుక్తిని శరణు బొందండి– వ్యక్తినిగాదు' అంటూ గురువు పెత్తనమును హద్దులో బెట్టి శిష్యుని గొప్ప తనమును ప్రతిపాదించినాడు. ప్రపంచములో యీ విషయమున దీని కిదే సాటి.

బుద్ధుడు వైదిక మతముయొక్క కర్మవిపాక సిద్ధాంతమును క్రొత్తమాటలలో చెప్పినాడు. సంన్యాసపద్ధతి పూర్వమునుండి యుండియుకూడ సంఘరూప వ్యవస్థనిచ్చి లోకహితార్థము ప్రవర్తింపజేసిన ఘనత బుద్ధునకే దక్కినది.

ఉపనిషత్తులలో చెప్పినట్లు స్పష్టముగ ఆత్మనుగుఱించి చెప్పక ఆ విషయమున బుద్ధుడు మౌన పక్షపాతి యయ్యెను. అందుకయ్యే గౌడపాదాచార్యుడు తమ కారికలలో (నైతద్బుద్ధేవ భాషితం) 'ఆ తత్త్వము బుద్ధునిచే చెప్పబడలే' దని సెలవిచ్చినాడు. అద్వయ వస్తువును గూర్చి చెప్పక దానిప్రాప్తికి వలయు సాధనములను బుద్ధుడుపదేశించెనని భాష్యకారుల ప్రసంగము.

సృష్టినిగూర్చి కూడ యేమియు చెప్పలేదు. ప్రపంచము దుఃఖమయమనుట తప్ప దాని ఆదికారణమునుగూర్చి యేమియు ముచ్చటించలేదు. వైదిక ఋషులు కూడ జగత్తుయొక్క మూలస్వరూప నిర్ణయము దురూహ్యమగుట బట్టి మౌనావలంబనమే శ్రేయస్కరమనిరి. ఈశ్వరుని గూర్చికూడ బుద్ధుడు కంఠోక్తిగ జెప్పలేదు. కర్మబంధ ములను ద్రోసిపుచ్చుటకు యెవ్వరిని ప్రార్థించియు లాభము లేదనియు

తన మార్గమును తానే కల్పించుకొనవలెననియు బుద్ధుని ఆదేశము. తన అభ్యున్నతికి మానవులు తన పురుష కారముపైననే నిర్భరుడై యుండవలెనని ఊది చెప్పుటచే దాని పరిణామము అనీశ్వర వాదమునకు దారితీసినది.

బుద్ధుని మౌనమును కాలక్రమమున విచారకులు తమ విచారానుకూలముగ పొందించుకొనిరి. పాశ్చాత్యులు పలువురు బుద్ధుని నాస్తికుడనినారు. విచారకుల తీర్మానము బహుశా వారి విచారాధీనమై యుండుట కూడ సహజము. కాని రవీంద్రనాథ, రాధాకృష్ణ పండితు లందుకు సహమతులు గాలేదు.

ఏదెట్లుననను బుద్ధునిమౌనము అధికారి భేదమును గుర్తెఱిగిన సాధకుని మౌనమే గాని నాస్తికుని మౌనముగాదు.

ఈశ్వరు డున్నాడనుమాటకు సమ్మతింపని పూర్వమీమాంసా- సాంఖ్యదర్శన కారులను నాస్తికులనినచో, ప్రత్యక్షానుమానములనే ప్రమాణముగ గైకొనిన వైశేషిక మతమును నాస్తికమత మనినచో, పశు యజ్ఞములను తెగనాడిన ఉపనిషత్తులను నాస్తిక సిద్ధాంత ప్రబోధము లనినచో అవశ్యము బుద్ధునిగూడ నాస్తికుడన జెల్లును.

ఆచార్యపాదుడు శంకరుడు కూడ 'భగవాన్ బుద్ధ' యని వ్యవహరించి ఆయనయెడ తనకు గల గౌరవాతిశయమును వెల్లడించినాడు.

అనేక ఋషులవలె బుద్ధదేవుడుగూడ వైదిక తత్త్వజ్ఞానముయొక్క ఒకానొక మార్గమును లోకప్రజకు వ్యక్తీకరించినాడు. వైదికజ్ఞాన పూర్ణమగు వాతావరణమున బుట్టి పెరిగి- శిక్షాదీక్షలను బొందిన బుద్ధుడు ఆ విజ్ఞానమునకు యేకాంత భిన్నుడనుట యెన్నడును పొసగని మాట. వైదిక సిద్ధాంతములకును అతని సిద్ధాంత ములకునుగల పోలికల కొన్నింటి క్రింద నుదహరించు చున్నాను. చదువరులు గమనింతురుగాక!

1. భవచక్రమని సంసారమునకు పేరిడుట. 2. జీవనము క్షణికమనుట. 3. ప్రపంచమును దుఃఖమయమనుట. 4. తృష్ణ దానికి కారణమనుట. 5. అవిద్య ఆదిమూలమనుట. 6. సర్వము కర్మాధీనమనుట. 7. కర్మప్రభావము నగ్గించుట. 8. విశ్వసంఘటనల యన్నింటియందును కార్యకారణ సంబంధము జాగరూకమై యున్నదనుట. 9. పరలోకమును సమ్మతించుట. 10. పునర్జన్మము నంగీకరించుట. 11. యమనియమముల నాదేశించుట. 12. సంన్యాస స్వీకరణము. 13. భిక్షాచరణదీక్ష. 14. అవధూత (ధుతంగ) లక్షణగ్రహణము. 15. సమాధిసాధన.

16. ముక్తికి పర్యాయముగ నిర్వాణమును. 17. జీవన్ముక్తునకు ప్రతినిధిగ అర్హతుని నిర్దేశించుట.

మరియు, ఉపనిషత్తులవలె 18. భక్తిప్రాధాన్యము గాక జ్ఞానమూలమై యుండుట. 19. అందందు సంబోధనలయందు 'సౌమ్య' పదమును పాళీత్రిపిటక ములలో ప్రయోగించుట. 20. ధమ్మపదములోని శ్లోకములు చాలమట్టుకు భగవద్గీత- మనుస్మృతులలోని శ్లోకములకు బోలియుండుట.

ఇన్ని కారణములబట్టి, ఉపనిషత్తులలోని జ్ఞానకాండయొక్క యేకాంగీ వికాసమునకు పాల్పడిన బుద్ధదేవుని అవైదికుడని గాని, నాస్తికుడనిగాని పలుకుట మిక్కిలి యనుచితము.

ఎవడు జన్మించుటతో ఖండఖండాతర వాసులకు సైతము భారతభూమి యొక్క మట్టిగూడ పరమపవిత్రమై విరాజిల్లినదో అట్టి పుణ్యావతారుని ఋషిపుంగ వుని నాస్తికుడని అధర్మవాదియని నిరసించుటకంటె ఘనఘోర భయంకర మహాపచారము మఱియొకటి యుండబోదు.

## బుద్ధధర్మము

బుద్ధధర్మము విశ్వమునందలి మహనీయ ధర్మములలో నొకటి. దేశకాలపరి స్థితుల ననుసరించి ఆనాడు బుద్ధుడు చేసిన ధర్మచక్రప్రవర్తనము నేటికి యిర్వై అయిదు శతమానములు గడచినను తగ్గకుండ మ్రగ్గకుండ నున్నదనిన దానిలోని సజీవత్వమెట్టిదో మన మూహించుకోవచ్చును.

పశ్చిమభాగమందలి యేదో కొంత ప్రదేశఖండమును వదలి తక్కిన యావత్తు ఆసియాఖండమం దంతటను దాని ప్రభావము అసదృశమై పోయింది. ప్రపంచ జనసంఖ్య యందు సుమారు నాలిగింట నొకడు బౌద్ధుడు. బౌద్ధధర్మము సిలోన్, బర్మా, సయాం, కంబోడియా, టిబెట్టు, చీనా, కొరియా, మంగోలియా, జపాన్ మొదలగు విదేశాలకు ప్రాకుట అబ్బురము గొలిపే విషయము. అశోకుడు తన కొడుకును మహేంద్రుని, కూతురును సంఘమిత్రను, మొట్టమొదట లంకకు బంపి ధర్మప్రచారము నొనర్పించినాడు. బౌద్ధధర్మానికి అశోకుని రాజకీయాశ్రయమే లేకపోతే జైనధర్మమువలె ఒక ప్రాంతీయ ధర్మమై యుండేది.

క్రైస్తవధర్మముయొక్క అనేక అంగములపై బౌద్ధధర్మప్రభావము పడినది. క్రైస్తవ ధర్మములోని (ఫాదరీల) బ్రహ్మచర్యజీవనమును, యింద్రియదమనమును ఖుద్దున

బౌద్ధ ధర్మము పెట్టిన భిక్ష. క్రీస్తుయొక్క 'సర్మన్ ఆన్‌ది మౌంటు' నకును, బుద్ధుని ధమ్మపదమునకును మిక్కిలి పోలిక గలదు.

ఆయా గొప్ప మతధర్మములవలెనే బుద్ధధర్మముకూడ అతి గహనమైనది. బుద్ధుని కాలానంతరము ఆ మతసిద్ధాంత మనేక శాఖోపశాఖలు సాగి ఒక విరాట్స్వ రూపము దాల్చినది. అగాధమగు ఆ సముద్రములోనికి దిగక అవశ్యక విషయము లను ముచ్చటించు కొందము.

బుద్ధుడు సాక్షాత్తు బోధించిన ధర్మమును బుద్ధధర్మమనియు, కాలాంతర మున విలువలు పలువల్లి అతని అనుయాయులు పెంచిన ధర్మమును బౌద్ధధర్మ మనియు ప్రస్తుతప్రసంగమున వ్యవహరింతము. ఇచ్చట బుద్ధధర్మము తోడనేగాని బౌద్ధధర్మముతో ప్రసక్తి లేదు.

బుద్ధుని ఉపదేశగ్రంథములను త్రిపిటకము లందురు. సుత్తపిటకము, వినయపిటకము, అభిధమ్మపిటకమని వాటికి పేర్లు. ధర్మమును ప్రతిపాదించు గ్రంథము సుత్తపిటకము. ఆచారప్రధానమగు గ్రంథము వినయపిటకము. సుత్తపి టకములోని సిద్ధాంతములకు విశదీకరణమే అభిధమ్మపిటకముయొక్క ఉద్దేశ్యము.

ధమ్మపదము బౌద్ధసాహిత్యములో సర్వోన్నత ప్రసిద్ధినిగన్న లోకప్రియ గ్రంథము. దాని అనువాదము ప్రపంచములోని అన్నిసభ్యభాషలలోను జరిగినది.

బుద్ధుడు సాక్షాత్కారమును బొందిన తత్త్వమును ధర్మమందురు. సమస్త లోకవ్యాపా రములు ధర్మాధిష్ఠితములై నియమబద్ధముగ వర్తించుచున్నవని బౌద్ధుల నమ్మిక. దీనికై ఆత్మయొక్క, ఈశ్వరునియొక్క ఆపేక్ష వారికి లేదు. పూర్వకల్ప వర్తులగు బౌద్ధులు బోధించినదే గాని యీధర్మము క్రొత్త అపూర్వమార్గము గాదని బౌద్ధుల అభిప్రాయము.

బుద్ధధర్మము మానవుడైనవానికెల్లను సమానాధికారము నంగీకరించి నేటికి యిర్వై అయిదు శతాబ్దముల క్రిందటనే ప్రజాతంత్రవాదమునకు ప్రాతిపదిక వేయుట నిజానికి అభూతపూర్వ సాహసకార్యము. బుద్ధివాదము, సమానాధికార ప్రపత్తి, సదాచారము, సంయమము, అహింసయు బుద్ధధర్మములోని విశిష్టతలు.

ప్రపంచములోని యే వస్తువుకూడ సుతరాం క్రొత్తదిగాదు. నితాంతము పాతదియును గాదు. పునర్జన్మమున అదే జీవుడును ఉండడు. క్రొత్తవాడును రాడు. ఒక జన్మముయొక్క అంతిమవిజ్ఞానము లయించుచుండ రెండవ జన్మముయొక్క

ప్రథమవిజ్ఞాన మావిర్భవించుచున్నది. జగత్తునందలి సంఘటనల యన్నింటి యందును కార్యకారణ సంబంధము నిరపవాదముగ ప్రవర్తించుచున్నది. అని బుద్ధధర్మము చెప్పు దార్శనికములగు పొడిపొడి సిద్ధాంతములు.

బుద్ధుని ధర్మము వేదాంతుల బ్రహ్మమునకును, సాంఖ్యుల గుణమునకును, వైశేషికుల ద్రవ్యమునకును కొంత కొంత పోలినది.

బుద్ధుడు సమ్యక్ సంబోధిని పొంది కనుగొన్న తత్త్వములను ఆర్యసత్యములు (Noble truths) అందురు. నిర్వాణ మార్గమునకు అభిముఖులైనవారికి ఆర్యులని పేరు. స్రోతాపన్న–సకృదాగామి–అనాగామి–అర్హతులు, ఆర్యులలోని తరగతి భేదములు, ఆర్యులు కానివారు పృథగ్జనులు. ఆర్యులు మాత్రమే గ్రహింపదగినవి కావున వీటికి ఆర్య సత్యములని పేరు. అవి నాలుగు. దుఃఖము, దుఃఖకారణము, దుఃఖనిరోధము, దుఃఖనిరోధగామినీ మార్గము అని వాటి పేర్లు. ఈ చతుర్వ్యూహము వైద్యశాస్త్రము నందును, ఆధ్యాత్మశాస్త్రముననుకూడ గలదు. రోగము–రోగహేతువు, ఆరోగ్యము– ఔషధము అనునవి వైద్యశాస్త్రము నందును; సంసారము–సంసారకారణము, మోక్షము– మోక్షోపాయమునని ఆధ్యాత్మశాస్త్రమందును వివేచింపబడినవి. బుద్ధదేవుడును అదే ప్రథ ననుసరించెను.

దుఃఖము:– ''దుఃఖమే సర్వం వివేకినః'' అని పతంజలి చెప్పినట్లే బుద్ధుడును సమస్తమును దుఃఖమయ మనినాడు. అక్కడికే నిలిచినచో బుద్ధమతము నైరాశ్యవాదము యగునుకాని అంతతో నాగక దానికారణమును నిరోధమునుకూడ బుద్ధుడుపదేశించినాడు.

రూప వేదనా సంజ్ఞా సంస్కార విజ్ఞానములు దుఃఖము. ఈ అయిదింటిని ఉపాదానస్కంధము లందురు. మొదటి స్కంధమును రూపమనియు, తక్కిన నాల్గింటిని నామమనియు బుద్ధుడు నామరూపములను గూర్చి చెప్పిన విభాగము. స్థూలదేహ సంబంధమైనది రూపము. భావనలకు సంబంధించినది వేదన. గ్రహణశక్తి సంబంధమైనది సంజ్ఞ. నానావృత్తులకు సంబంధించినది సంస్కారము. ఆలోచనలకు సంబంధించినది విజ్ఞానము. ఈ పంచస్కంధముల సంఘాతమునే పుద్గలుడందురు. పుద్గలుడు–జీవుడు– ఆత్మ యనునవి పర్యాయపదములు. ఆత్మకు వ్యావహారిక సత్తాయేకాని పారమార్థిక సత్తా లేదు.

బుద్ధధర్మమునందు 'సర్వమనిత్యం–సర్వమనాత్మం– నిర్వాణం శాంతం' అనెడి మూడు సూక్తులు ప్రసిద్ధములు. సర్వమనాత్మ మనెడి పలుకు యీ

పుద్గలవాదమునకు సంబంధించినది. బుద్ధుడు అనాత్మవాది యని పిలువబడెను. ఐనను అవి యే రూపములోవో విచారింతము.

రూప వేదనా సంజ్ఞా సంస్కార విజ్ఞానము లనెడి స్కంధముల సంఘాతమే నేను నేనను ప్రవాహమునకు కారణము. వీటి కూటమియే పుద్గలుడు. దీనినే అనాత్మవాదమనియు, నైరాత్మ్యవాదమనియు చెప్పుదురు.

దేహాదులకు సంబంధములేక కర్మల నాచరించు నొక శాశ్వతమగు ఆత్మ యను వస్తువు లేదనియు దేహమును మనస్సును ఆత్మగాదనియు బుద్ధుడు చెప్పినాడు. దేహాదివ్యాపా రముల నవలంబించి అవి మార్పడుచుండ తాను మార్పడక శాశ్వతకర్త యనదగు ఆత్మయొక్కటి లేదని బుద్ధుని అభిప్రాయము.

పూర్వ పూర్వ కారణములు ఉత్తరోత్తరకార్యములై జీవనధారను యేకాకా రముగ చూపెట్టుచున్నవి. ఈ ప్రవాహమునకు శాశ్వతత్వములేదు. పరిణామమే సత్యము. కొఱవిని ద్రిప్పినప్పుడు ప్రకాశము యేకాకారముగ నున్నదని భ్రమించినట్లు కర్మసంతాన తరంగములందు వంచితుడై పురుషుడు యిది నాది, యిది నేనని భ్రమించుచున్నాడు. తనదియు లేదు. తానును లేడు. ఇంతకూ కర్తయగు ఆత్మలేడని బుద్ధుని సిద్ధాంతము. ఆత్మకర్తగాడని శంకరునిమాట. ఇంతే వ్యత్యాసము. ఒకటి అనాత్మవాదమైనది. మరియొకటి అకర్త్రాత్మవాదమైనది.

ఇదమిత్థమని నిర్ధారణగ చెప్పకపోవుటయు, పుద్గలవాదమును నెలకొల్పు టయు, అవ్యాకృతములని చెప్పుటయు, విశేషించి మౌనమున నుపేక్షించుటయును బట్టి బుద్ధుని ఆత్మవిషయకమగు తీర్మానము పలుశంకల కాలవాలమైనది.

పంచస్కంధములకు వేఱుగ కర్తయై పనిచేయు నేననునది లేదని చెప్పుటకును, అసలే నేనను వస్తువే లేదని చెప్పుటకును హస్తిమశక భేదమున్నది. జీవాత్మయే ఒకడు లేనిచో స్కంధములన్నియు ఉపాధులన్నియు నశించిన మీదట లభించు నిర్వాణము పరమసుఖమని, శాశ్వతమని చెప్పుమాటలకు సార్థక మెట్లు? అప్పు డది సర్వశూ న్యమే కాగలదు.

ఆత్మ నిత్యమనుట శాశ్వతవాదము. అనిత్యమనుట ఉచ్ఛేదవాదము. ఈ రెండు వాదముల వలనను ఆచారమునకును- శీలమునకును విలువ లేకపోవును గాన మధ్యమమార్గ పక్షపాతి యగు బుద్ధుడు ఆత్మవిషయమును మౌనముచే ఉపేక్షించెను.

ఆ మౌనమును దుర్వినియోగము చేసికొని కాలక్రమమున బౌద్ధులు సృష్టించిన పుద్గల వాదము-సంఘాతవాదము-క్షణికవాదములను వైదికదార్శనికులు చండప్రచండముగ ఖండించినారు. పరిస్థితు లిట్లు విపరిణామము చెందునని బుద్ధునకు మాత్ర మేమి తెలియును? మానవకోటిలోనివారే గాన మతాచార్యులు సైతము సర్వజ్ఞపీఠము నారోహించ లేక పోయిరి. ఖాళీగా నుండుటయే ఆ సర్వజ్ఞ సింహాసన మునకు సొగసు కాబోలు.

<u>దుఃఖకారణము;-</u> దుఃఖమునకు కారణము తృ ష్ణ. అది కామతృష్ణ-భవ తృష్ణ- విభవతృష్ణయని మూడు విధములు తృ ష్ణకు కారణము అవిద్య. కారణము న్నంతకు కార్యము తప్పదు.

1. అవిద్య = అజ్ఞాన మోహ లోభముల కూటమి.
2. సంస్కారము = సంస్కృతధర్మములకు అన్నింటికి అంకురశక్తి.
3. విజ్ఞానము = గర్భవాసము చేయు చిత్తధార.
4. నామరూపములు = ఉపాదానస్కంధము లయిదు.
5. షడాయతనములు = యింద్రియములు.
6. స్పర్శము = విషయములు.
7. వేదన = సుఖము - దుఃఖము - అసుఖ మదుఃఖము.
8. తృ ష్ణ= కామ - భవ - విభవములు.
9. ఉపాదానము = కామ - శీల - ఆత్మోపాదానములు (వీటినే సత్కాయ దృష్టి - విచికిత్స - శీలవ్రత పరామర్శ యనెడి సంయోజనము లందురు.)
10. భవము = పునర్భవ జనకములగు ధర్మాధర్మములు.
11. జాతి = జన్మము.
12. జరామరణములు = జన్మాంతర అవస్థలు.

ఈ పంద్రెండింటిని ద్వాదశనిదానములనియు, ఈ పరంపరను భవచక్రమనియు బౌద్ధులు చెప్పుదురు. ఇందు పూర్వపూర్వములు ఉత్తరోత్తరములకు కారణములు. కారణ మున్నంతకు కార్యము అనివార్యము. కార్యనాశమునకు కారణనాశమవసరము. కారణ కార్య నియత సంబంధము జగత్తునందు దేశకాల విషయములందంతటను రాజ్యమేలు చున్నది. ఈ సాపేక్ష కారణతావాదమును బౌద్ధపరిభాషలో ప్రతీత్యసముత్పాద మందురు.

<u>దుఃఖనిరోధము:-</u> దుఃఖనిరోధమునకు లోకప్రియ సంజ్ఞ నిర్వాణము. వేదాంతుల జీవన్ముక్తికి నిర్వాణమనియు, విదేహముక్తికి పరినిర్వాణమనియు బౌద్ధుల సంకేతము. సాధనాబలమున ఉత్పత్తిధర్మములన్నియు, అనుత్పత్తి దర్మములుగ మారుటయే నిర్వాణము.

బౌద్ధులు శూన్యమని చెప్పు నిర్వాణము అభావాత్మక పదార్థము గాదు. 'నిర్వాణం పరమం సుఖ'మ్మని ధమ్మపదమున బుద్ధదేవుడు సెలవిచ్చినాడు. భవనిరోధమే నిర్వాణమని పాలీగ్రంథములు చెప్పినవి. అచ్యుతము, అమృతము,, అనుత్తర యోగక్షేమమని నిర్వాణ మునకు బౌద్ధులు వాడు పర్యాయవాచీ శబ్దములు.

శూన్యశబ్దము బ్రహ్మముయొక్క అనిర్వచనీయతాప్రతీకము. బుద్ధధర్మము జగత్తునకు మూలమున వ్యాపకసత్తాను అంగీకరిస్తుంది. కాని దానిని నిషేధముఖ మున వివేచించును. పరమతత్త్వవివేచనకు, సత్‌ధార - అసత్ ధార యని రెండు ధారలు గలవు. సత్‌ధార బ్రాహ్మణధర్మమందును, అసత్‌ధార బౌద్ధధర్మమందును వర్తించినది. వస్తుతః పరమార్థము అనిర్వచనీయము. మాయికములగు శబ్దములు మాయికల జగత్తుకు విషయమగువాటినే చెప్పునుగాని మాయావిరహిత పరమ తత్త్వమును మాటలు చెప్పలేవు. ఉపనిషత్తులు చెప్పే 'నేతి నేతి' మహావాక్యముయొక్క స్వారస్యమిదియే. బుద్ధుని మౌనమునకు గూడ నిదియే తాత్పర్యము. సత్తని చెప్పుట యెంత సముచితమో అసత్తని నిర్వచించుట కూడ అంతే ఉచితము. నిజమున కది 'న సత్తన్నా సదుచ్యతే' బౌద్ధులు చెప్పినట్లే ఛాందోగ్యోపనిషత్తుకూడ అసత్తే ముందుం డినదనియు దానినుండి సత్తు పుట్టిన దనియు చెప్పినది.

<u>దుఃఖనిరోధగామినీ మార్గము:-</u> గంతవ్యస్థానమున్నప్పుడు మార్గముకూడ అవశ్యముండును. నిర్వాణము గంతవ్యస్థానమైనపుడు దాని మార్గమునుకూడ వెదకి కల్పించుకొనుట న్యాయసంగతము. ఆమార్గమునే అష్టాంగికమార్గమని చెప్పుదురు.

బాటసారికి దారిబత్తెమువలె నిర్వాణపథికునకు పుణ్యసంభారమును జ్ఞానసంభార మును అవసరము. పుణ్యసంభారమును శీలమువలనను, జ్ఞానసంభా రమును ప్రజ్ఞవలనను బొంది ఈ రెండింటికి సహాయసాధనముగ సమాధినికూడ సాధకుడు ఆశ్రయించవలెను. బుద్ధధర్మమునకు శీలసమాధి ప్రజ్ఞలు మూడును ఆధార స్తంభములు. శీలవంతుడు సమాధిమూలమున ప్రజ్ఞను బడసి నిర్వాణము నధిష్ఠించుచున్నాడు.

బుద్ధుడు కేవలము బుద్ధివాదిమాత్రమే కాదు. తన ధర్మముయొక్క సాక్షాత్కారము పొందిన వ్యక్తి .బుద్ధధర్మమునందు సాక్షాత్కారమునకు సాధనములు శీల సమాధి ప్రజ్ఞలు. శీలము వలన కాయశుద్ధి. సమాధివలన చిత్తశుద్ధి. ప్రజ్ఞవలన అవిద్యానాశమును సిద్ధించు చున్నవి. ఈ త్రివిధ సాధనములయొక్క పల్లవితరూపమే అష్టాంగికమార్గము.

1. యోగ్య (సమ్యక్) దృష్టి. 2. యోగ్య (సమ్యక్) సంకల్పము. 3. యోగ్య (సమ్యక్) వచనము. 4. యోగ్య (సమ్యక్) కర్మము. 5. యోగ్యజీవిక (సమ్యగాజీవము). 6. యోగ్యప్రయత్నము (సమ్యక్ వ్యాయామము). 7. యోగ్య (సమ్యక్) స్మృతి. 8. యోగ్య (సమ్యక్) సమాధి. ఈ యెనిమిదింటిని కలిపి ఆర్యాష్టాంగిక మార్గమందురు.

బుద్ధుని ధర్మము మధ్యమమార్గము. ఏచివరకును పోక యే అతిరేకమునకును చోటివ్వక సాధకు డుండవలెను. దేనికైనను అతి పనికిరాదు. ఇదియే బుద్ధుని మధ్యమ ప్రతిపదమున కంతరార్థము. దానిని సూచించుచు యోగ్య (సమ్యక్) శబ్ద ముపయోగింపబడినది.

1. యోగ్యదృష్టి = యథార్థ దర్శనము. కుశలధర్మములను అకుశలధర్మములను ఉన్నవి యున్నట్లెఱుంగుట. బుద్ధధర్మమునందు అకుశలధర్మములు పది చెప్పబడును. ప్రాణాతిపాతము (హింస), అదత్తాదానము (చౌర్యము), కామవ్యభిచారము, మృషావచనము, పిశునవచనము, పరుషవచనము, వదరుబోతుతనము, లోభము, మోహము, మిథ్యాదృష్టి ఈ దుష్కర్మలు పదింటిలో మొదటి మూడును కాయికములు. తర్వాతి నాల్గును వాచికములు. చివరి మూడును మానసికములు. ఈ పదింటిని విడిచి భిక్షువు కుశలధర్మి యగుచున్నాడు.

2. యోగ్యసంకల్పము.

3. యోగ్యవచనము.

4. యోగ్యకర్మము = అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, మద్యనిషేధమనెడి పంచశీలములతో గృహస్థశిష్యుడు కూడియుండవలెను. భిక్షువులకు మరియు నైదు నియమములు చెప్పబడినవి. 'అపరాహ్ణభోజన, మాలాధారణ, సంగీత, సువర్ణ, అమూల్యశయ్య' అనెడి అయిదింటిని భిక్షువు వదలవలెను. మొత్తము పదియును భిక్షువు అనుష్ఠింపదగిన దశ శీలములు.

5. యోగ్యజీవిక = శస్త్ర, ప్రాణి, మాంస, మద్య, విష వాణిజ్యములను వదలవలెను. వృత్తియందు వంచనయు కుటిలతయు లంచము గొనుటయు లేకుండవలెను.

6. యోగ్యప్రయత్నము.

7. యోగ్యస్మృతి = కాయానుపశ్యన, వేదనానుపశ్యన, చిత్తానుపశ్యన, ధర్మానుపశ్యన యని స్మృతిప్రస్థానములను నాల్గింటిని కలిగియుండుట. వీటి వివరము 'మహాస్మృతి ప్రస్థానసూత్రము' నందు పాఠకులు మున్ముందు చదువగలరు.

8. యోగ్యసమాధి = సమాధి ( ధ్యానయోగము) యొక్క సహాయము లేక సాధకుడు కామధాతువును ( వాసనా జగత్తును) అతిక్రమించి, రూపధాతువు లోనికి పోలేడు. రూపధాతువులో ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ ధ్యానములు గలవు. ఆపై అరూపధాతువు. దానిలో ఆయతనములు నాలుగు. ఆకాశానంత్యాయ తనము. విజ్ఞానానంత్యాయతనము. అకించన్యాయతనము, నైవసంజ్ఞానాసంజ్ఞాయత నము అని వాటిపేర్లు. వీటి చివర భవాగ్రము.

బౌద్ధుల ధ్యానయోగ మొక విస్తారప్రసంగము. ఆనాపాన స్మృతి ( ప్రాణాయా మము). కృత్స్నములు, అనుస్మృతులు, మైత్రీ కరుణా ముదితా ఉపేక్ష లనెడి బ్రహ్మ విహారములును ధ్యానసమాధియుక్క విభిన్నాంగములు. వీటి మూలమున బుద్ధులను సిద్ధులను భిక్షువు పొందగలుగుచున్నాడు.

ఈ ఆర్యాష్టాంగిక మార్గసాధనములందు మొదటి రెండును ప్రజ్ఞకును తర్వాత మూడును శీలమునకును చివరి మూడును సమాధికిని ప్రాపకములు.

బుద్ధుని దార్శనికపద్ధతిని, ఆచారనీతిని గూర్చి సుప్రసిద్ధములైయున్న రెండు శ్లోకముల నుదహరించి యీ ప్రకరణమును ముగింతును.

**యేధర్మా హేతుప్రభవాః । హేతుం తేషాం తథాగతోహ్యవదత్ ।**
**అసదచ్చయెూ నిరోధో । ఏవం వాదీ మహాశ్రమణః ॥**

''జగత్తునందలి ధర్మములన్నియు హేతువుకలిగి పుట్టుచున్నవి. వాటి హేతువును తథాగతుడు చెప్పియున్నాడు. అవి నిరోధమునుకూడ పొందును. మహాశ్రమణుడా నిరోధమునుకూడ ఉపదేశించియున్నాడు'' ఈ శ్లోకమున బుద్ధుని దార్శనిక విచారమంత యును సంగ్రహింపబడినది. ఈ తత్త్వమును సాక్షాత్కరించు కొనుటయే విరజధర్మ చక్షువును పొందుట.

**సర్వపాపస్య అకరణం । కుశలస్యోప సంపదా ।**
**సచిత్త పర్యోదపనం – ఏతత్ బుద్ధానుశాసనమ్ ॥**

తే. గీ. పాపజాలంబు లన్నిటి బాసియుంట, పుణ్యకర్మ సమూహంబు బొందియుంట
చిత్తమత్యంత శుద్ధంబు చేసియుంట, యిదియె బుద్ధుని సందేశ మెఱిగి కొనుడు.

ఈ శ్లోకమునందు బుద్ధుని ఆచారనీతియొక్క సారాంశము చెప్పబడినది.

## బుద్ధ సంఘము

బుద్ధుడు తన ధర్మము స్థిరముగ నిలుచుటకొఱకు సంఘమును స్థాపించినాడు. ఆసంఘరచన లోకతంత్రాత్మకమైనది. అసలే శాక్యులు గణతంత్ర ఉపాసకులు. ఆసంఘము ద్వారా 'మిశనరీ స్పిరిట్' ప్రబుద్ధమైనది. సంఘశక్తివలన బుద్ధధర్మము అతి లౌకికశక్తిని ఆర్జించినది.

బుద్ధధర్మమునకు బుద్ధుడు – ధర్మము – సంఘము ననునవి మూడును రత్నములు. ఈ మూడింటిని శరణు బొందినవాడే బౌద్ధుడు. వాడు సంఘనియమములను సావధానుడై పాలించవలెను. లేనిచో సంఘమే వానికి దండన విధిస్తుంది. ఇట్టి సువ్యవస్థత ఉండబట్టే బౌద్ధధర్మ మిన్నాళ్ళు స్థాయిగ నిల్వగలిగినది.

బుద్ధశిష్యులై సంన్యాసమును గ్రహించిన పురుషులు భిక్షువులనియు, స్త్రీలు భిక్షుణులనియు చెప్పబడిరి. గృహస్థశిష్యులగు పురుషులను ఉపాసకులనియు, స్త్రీలను ఉపాసికలనియు వ్యవహరించిరి. శరణత్రయ వాక్యములను జెప్పి దీక్షను బొందుట పై యందఱికిని ధర్మసంప్రదాయ పద్ధతి.

భిక్షువులలో వృద్ధులగువారిని స్థవిరులందురు. భిక్షువునకు నొసగు దీక్షను 'ఉపసంపదా' దీక్ష యందురు. భిక్షు దీక్షను అపేక్షించువానికి తొలుత ''శ్రామణేర'' దీక్ష నిచ్చెదరు. శ్రామణేరుడు ఒకానొక స్థవిరభిక్షువు నాశ్రయించి శుశ్రూష జేసి యుక్తరీతిని తన దీక్షయందు ఉత్తీర్ణుడైన పిదప ''ఉపసంపద'' నిచ్చెదరు. ఉపసంపన్నుడైనవాడు భిక్షువనియు శ్రమణుడనియు చెప్పబడును.

ఉపాసకులు పంచశీలములను, భిక్షువులు దశశీలములను పాలించవలెను. బౌద్ధభిక్షువు లలోని అవధూతలను ధుతంగులందురు. వారు కేవల విరక్తశీలురై యుందురు.

భిక్షునియమములు వినయ పిటకమందు విస్తారముగ చెప్పబడినవి. ప్రస్తుత గ్రంథమునందుకూడ విపులముగనే దొరకగలవు. పాఠకులు మున్ముందు గ్రహింప గల్గుదురు గాక.

గురువువద్దజేరి ధర్మమును నేర్చుకొనువాడు శ్రావకుడు. వాని భూమికాభేద ములు నాలుగు. స్రోతాపన్నుడు - సకృదాగామి - అనాగామి అర్హతుడు. ఈ సాధనా మార్గమును శ్రావకయా నమని లేదా అర్హతయానమని చెప్పుదురు. నిర్వాణపథము నకు అభిముఖుడై జాఱిపోని వాడు స్రోతాపన్నుడు. మరొక్కసారి జన్మమునెత్తి సిద్ధిని పొందగల్గువాడు సకృదాగామి. తిరిగి జన్మింపనివాడు అనాగామి. నిర్వాణమును బొందిన జీవన్ముక్తుడు అర్హతుడు.

గురు సహాయములేక స్వప్రయత్నబలమున ప్రాతిభచక్షువును బొందినవాడు ప్రత్యేకబుద్ధుడు. ఈ మార్గమును ప్రత్యేకబుద్ధయాన మందురు. ఈ రెండు యానములందును సిద్ధులైనవారు తమ తమ దుఃఖములను నివారించుకొన జాలు దురే గాని యితరుల నుద్ధరింప సమర్థులుగారు.

మూడవమార్గము బోధిసత్త్వయానము లేదా బుద్ధయానము. పది పార మితలనార్జించి నవాడు దీనికి అధికారి. పారమిత యనగా పూర్ణత్వమని యర్థము. తన ముక్తికొఱకు మాత్రముగాక సకలలోక కల్యాణార్థము, సర్వప్రాణి దుఃఖ విమోచనార్థము బుద్ధజన్మము సిద్ధించుచున్నది. బుద్ధత్వమును పొందుటకై ప్రయ త్నించుసాధకుని పేరు బోధిసత్త్వుడు. పూర్ణజ్ఞానమును బొందినవాడు బుద్ధుడు.

సాధకుడైనవాడు తన శక్తిని - రుచిని అనుసరించి యీ మూడు యానము లలో దేనినైన నేర్చుకొనవచ్చును. తీవ్రసంవేగులకు ఫలము సన్నిహితము.

బుద్ధచర్యను అనువదించిన పరిశ్రమలవలన కలిగిన బుద్ధధర్మ విషయకమగు పరిచయమును పాఠకులకెదుట బెట్టితిని. త్రిపిటక సారమని చెప్పదగిన ముందటి గ్రంథ ములోనికి ప్రవేశించువానికి యింతమాత్రమైనను బుద్ధునియొక్క ధార్మిక దార్శనిక పరిజ్ఞానమును కల్గించుకొనుట అవసరము. ఈ నిబంధనము నింతటితో ముగింతును.

ఆగంతుక పరిస్థితులతో మా భూమానందాశ్రమమును వదలి తెనాలి ఓంకా రాశ్రమము నందు రెండునెలలు నివసించి ఈ గ్రంథమును అనువదించితిని. శ్రీవారి శిష్యుడును ఓంకారాశ్రమ స్థాపకులును నగు కాకుమాను శ్రీరాములుగారి

సహకారము నాకు చిరస్మరణీయము. ''నహికృత ముపకారం సాధవో విస్మరంతి'' అని కదా ఆర్య జన వాక్యము. వారి ఆదరములో యీ పుష్పము వికసించినది.

మరియు నాకు వ్యక్తముగ నవ్యక్తముగ తోడ్పడి యీ పవిత్ర కార్యమునందు సఫలీకృతునిగ జేసిన పరమబుుషి పుంగవులను, నాయిష్టదైవమగు శ్రీ గండి వీరాంజనేయ స్వామిని ప్రశాంతచిత్తమున తలపోసి చేతులు జోడింతును.

యదక్షర పదభ్రష్టం మాత్రాహీనంతు యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తుతే ॥

యత్కరోమి యదశ్నామి యజ్జుహోమి దదామి యత్ ।
యత్తపస్యామి గోవింద! తత్కరోమి త్వదర్పణమ్ ॥

ఆశ్వీజ శుద్ధ పాడ్యమి
12-10-1950

శ్రీ రామకృష్ణ బ్రహ్మచారి,
మకాం, వ్యాసాశ్రమం.

# గ్రంథకర్తయొక్క తొలిపలుకు

ఈ గ్రంథమున బుద్ధదేవుని జీవితమును, తదుపదేశములును సంగ్రథిత ములు. బుద్ధుని జీవితఘటనలు పాలీత్రిపిటకములందు ఒకేక్రమముగలేక అందందు విడివిడిగ చెప్పబడినవి. వాటిని నేనిందు సంగ్రహించితిని. వెలితిపడిన కథాభాగము లను అట్ఠకథల ఆధారమున పూరించితిని. మూలమునందలి పాలీభాషకు యిది అప్పటము మాటకు మాట అనువాదము. అనువాదము ముక్కకు ముక్క యగుటచే భాష గడుసు బాఱినది. ఈ బాధ దొలగుటకై కొందఱు పండితులు అనువాదము స్వతంత్రరీతి నుండుట మంచిదని సలహా నొసగిరి. త్రిపిటకము లందుండెడి భౌగోళిక ఐతిహాసిక సామాజిక రాజనైతిక విషయ సామగ్రిని యీ గ్రంథమున నొకచో గూర్చ బూనెడి నేను స్వతంత్ర రచనకు కడంగుచో ఐతిహాసికుల దృష్టియందు వాటి విలువ తగ్గిపోవును. దానికి సహింపలేక శబ్దానువాదమునకే తలపడితిని. ఆచార్య నరేంద్రదేవుకూడ యీ విషయమున నాతో సహమతుడు. నిజమునకు భాష బిగుసు కొని క్లిష్టమై తోచినను పాఠకులు వందపుటలు దాటినంతకు ఓపికతో చదివినచో ఆపై సులభముగ మాలిమి యైపోవును. పాలీ జాతీయ ములు హిందీప్రాంతీయులకు వాడుకలోనివై విశేషించి అవధి బీహార్ భాషలకు అందిపొంది యుండును గాన వారికీ విషయమున పెద్ద చిక్కు లేదు. స్వయముగ కొన్ని పారిభాషిక శబ్దములు బౌద్ధులకు గలవు. వాటిని వీలైనంతకు విశదము చేయుటకై కోష్ఠకము (బ్రాకెట్) లందును, పాదటీకలందును యత్నించి చూపితిని. అంతటితో తృప్తి లేక గ్రంథపు చివర శబ్దసూచీని చేర్చితిని. అన్నింటిని కలిపికొనిగాని పాఠకులు సులభముగ గట్టెక్క జాలరు గదా? దార్శనిక భావములను పట్టించుటకు సామాన్యమగు బౌద్ధదర్శన జ్ఞానమును పాఠకులకు పరిచయము చేయుట అవశ్యము. విక్రమసింహాదులకు సమ్మతమౌటచేతను యవనరాజుల కాల నిర్ణయ సంబంధమునకు యోగ్యమగు పొందిక కల్గుచుండుటచేతను బుద్ధజన్మ నిర్వాణాదికమును గూర్చి సింహలక పరంపరయందు అరువదియేండ్లు తగ్గించి సమయమును (కాలమును) నిశ్చయించి తిని.

త్రిపిటకములందు కాలముయొక్క క్రమపద్ధతి లేదు. సుత్తపిటకమునుండి త్రిపిటకముల ఆరంభము. సుత్తపిటకము బ్రహ్మజాల సుత్తతో ఆరంభమైనది. కాని యీ సూత్రము సుగతుడు బుద్ధత్వ ప్రాప్తితోడనే యుపదేశింపలేదు. దాని తర్వాతనుండు సామన్న (శ్రామణ్య) ఫలసుత్త డెబ్బదిరెండవయేట జెప్పినది. ఆ సమయమున అజాత శత్రువు మగధరాజ్యపీఠమున నున్నాడు. ఇట్లు సంఘటనల

నన్నింటిని, ఉపదేశముల నెల్లను క్రమమగు కాలనిరూపణ బద్ధముగ చేయవలెననిన తేలికపని గాదు. ఈ ప్రయత్నమునందు ముందు దారి చూపించిన పూర్వుడెవ్వడును కూడ నాకు లేడు. నా యీ కూర్పునందు చక్కగ కాలక్రమానుసారముగ విషయములను కూర్చితి ననికూడ నిక్కచ్చిగ జెప్పజాలను. అయినను ప్రజాపతి సంన్యాసము, భిక్షుణులు కాగలుగుటకు స్త్రీలకు అధికారప్రదానము, బుద్ధత్వప్రాప్తి తర్వాత అయిదవయేట జరిగినట్లు చేసిన నానిర్ణ యము యెంతయు సత్యము. ఇట్లే బుద్ధత్వప్రాప్తికి పిదప మూడవయేట అనాథపిండకుడు జేతవనమును దాన మొసగినాడనియు ఆ సంవత్సరమున బుద్ధుడందే వర్షావాసము (చాతుర్మాస్యము) నొనర్చినాడనియు సూత్ర వినయ పిటకముల సహాయమున నేను నిశ్చయించితిని. కాని యీ విషయము అట్ఠకథకు విరోధము. త్రిపిటకముల యెదుట అట్ఠకథ విరోధ మొక లెక్కలోనిది గాదు. ఈ పుస్తకమునందు కొన్నిచోట్ల ఒకే సంఘటనను గూర్చి అట్ఠకథ వినయపిటక సూత్రపిటకముల మాటలలో ఉద్ధరించి చెప్పియున్నాను. దానిని చూచినచో ప్రామాణికతయం దేదేది యెంత విలువ గలదియు తేటతెల్లమగును. సూత్రముల కంటె వినయమునందు అలౌకికమగు అతిశయోక్తులు మెండు. దానికంటె అట్ఠకథమరింత ముందుకు పోయినది. ఇందుచే ప్రామాణికత యందు తారతమ్య మెంచుట సహజము. కాలక్రమ నిర్ణయమునందు కొన్నిపట్ల నాకును సందియము గలదు. అయినను వీలైనంతకు రెండవ క. ప్రనందు సరిజేసి కొందును. పిటకములను కంఠస్థము చేసికొనువారు కాలపరంపరను లిపిబద్ధము చేయక గతించిన నాడె అందటికిని ఆయాశ నిరాశయైనది.

విక్రమీయ సంవత్సరములు 1985-86 నందు లంకలో నుండునపుడు త్రిపిటకములను చదువుచు నే నప్పటికప్పుడు ఆయావిషయములను నోటు చేసి కొనుచు వచ్చితిని. త్రిపిటకము లందును అట్ఠకథలయందును లభింపగల ఐతిహాసిక భౌగోళిక సామగ్రులను గూర్చి గ్రంథమొకటి వ్రాయవలెనని ఆనాడు నాకు కలిగిన ఆలోచన. ఆ యోచనతోనే లంకయం దుండగనె శ్రావస్తీ జేతవనముపై నొక యధ్యాయము వ్రాయను కూడ వ్రాసితిని. ఆ నిబంధము కాశీవిద్యాపీఠ త్రైమాసిక పత్రిక యగు ''విద్యాపీఠము'' నందు ప్రకటింప బడినది. ఈ గ్రంథము నింత తొందరగ వ్రాయబోదునని తలంచను గూడ లేదు. టిబెట్టు పోవనెంచి లంకనుండి నేను భారత దేశము వచ్చితిని. ఇందు ప్రసంగ వశాత్తు యిట్టి పుస్తకముతోగల అవసరము గోచరించినది. నేపాలునందలి లహాసాయందలి బౌద్ధులతోగూడి సంభాషించు నప్పుడు వారితో పరిస్థితి అనుకూలించినంతట అట్టి గ్రంథరచనకు పూనుకొందు ననికూడ మాట యిచ్చితిని. నా యాత్ర నింత తొందరగ పదునాల్గు నెలలలో ముగించి రాగల్గుదునని ఆనాటికి నాకు నమ్మకము లేదు.

వి. శ. 1987 నందు టిబెట్టునుండి మరలి లంకకేగితిని. అచ్చట జ్యేష్ఠుడు సబ్రహ్మచారి ఆయుష్మాన్ ఆనందుని ప్రేరణ తోడైనది. ఫలతః 1987 వి. శ. ఆశ్వయుజ పౌర్ణమి ( మహాప్రవారణము) నుండి వ్రాయనారంభించి పుష్యకృష్ణ అష్టమీలకు మొత్తము అరువది యెనిమిది దినములకు ముగించితిని. ముగించిన మూడవనాడే పుష్యకృష్ణ దశమినాడు భారతదేశమునకు రావలసియున్నది. అందుచే తెలిసి తెలిసియే సమయాభావమున బ్రహ్మజాలసుత్తను, సిగాలోవాదసుత్తను గ్రంథమున చేర్చలేక పోయితిని. కాని చివరకు ముద్రించు సమయమునకు సిగాలోవాదసుత్తను మాత్ర మతికించితిని. బ్రహ్మజాలసుత్తపై నుండు మక్కువను మళ్ళించుకోవలసియే వచ్చెను.

రాజకీయాందోళనమున పాల్గొనుటకై భారతమునకు వచ్చినవాడ నౌటచే పుస్తక రచన యందంతగా లక్ష్యముంచ వీలయినదిగాదు. మరిమించి ఆ సమయమున కాశీవిద్యాపీఠమున సంస్కృతమందు ముద్రింపబడుచున్న 'అభిధర్మకోశము' యొక్క ప్రూఫ్ సంశోధనమునందు సంలగ్నుడనైతిని. అట్టి తరుణమున గ్రంథనామ మును గూర్చిన ప్రస్తావన వచ్చుటచే వెంటనే ''బుద్ధచర్య'' యను పేరు ముందు పడినది. గ్రంథమును రెండవసారి చూచుటకు వీలులేక ఆ పనిని భదంత ఆనందునిచే నిర్వర్తింపజేసితిని. జనవరి అంతమున నా కార్యరంగమున నేజొచ్చితిని. తిరిగి వర్షావాసమున కొక స్థలమవసరము గాన అందుకై కాశీనగర మేరికొంటిని. అచ్చట నా మిత్రులు విశేషించి శ్రీధూపనాథసింహగారు బుద్ధచర్యను ముద్రింపవలెనని మిగుల పట్టుబట్టిరి. అచ్చుపని ఆరంభమైనది. ఇంతలో బాబూశివప్రసాద గుప్తగారితో సంప్రదించుటచేత వారు సమగ్రగ్రంథమును తమద్వారా ముద్రించుటకు అంగీక రించిరి. ఇంతకు యీ పుస్తకమింత త్వరగ వెలువడుటకు ముఖ్యకారకుడు శ్రీ ధూపనాథసింహగారు. బాబూ శివప్రసాదగుప్తగారి ఔదార్యమునుగూర్చి యెంత జెప్పినను తక్కువయే. మిత్రుడు ఆచార్యనరేంద్రదేవు ఈ పుస్తక ముద్రణమునందు నాకంటె మిగుల ఉత్సాహి. వారెంతో పాటుపడుటచేతనే ఫలిత మీరూపమున ప్రత్యక్షమయినది.

ఆతురత – అసావధానత – అజ్ఞానతాదిబహుకారణములచే అచ్చుతప్పు లనేకము దొర్లినవి. అనవసరమని ఆలస్యహేతువని శుద్ధాశుద్ధ పత్రమును జోడించ లేదు.

అశ్విన కృష్ణ 14 1988 } శ్రీ రాహులసాంకృత్యాయన, కాశీవిద్యాపీఠ.

# భూమిక

## భారతదేశములో బౌద్ధధర్మముయొక్క ఉత్థానమును, పతనమును:

భారతదేశము బౌద్ధధర్మానికి పురిటిగడ్డ. దీని స్థాపకుడగు గౌతమబుద్ధుడు కోసీ కురుక్షేత్రములు హిమగిరి వింధ్యపర్యంతము లోలోపలనే విహరించుచు నలభై అయిదు యేండ్లు ధర్మప్రచారము జేసెను. చక్రవర్తులు మొదలుకొని సాధారణప్రజ వఱకు విపులజనసంఖ్య యీ ధర్మము నవలంబించి బహుకాలము యావద్భారత మును వ్యాపించియుండిరి. భిక్షువులతో మఠములతో విహారములతో శూన్యమైన భూభాగము దేశమునం దరుదుగనుండి యుండినదేమో! దీని దార్శనిక విచారకులు వేలేండ్లు తరుబడి తమ ఉజ్జ్వల విచారములచే భారత విజ్ఞానము నుద్దీప్తము జేసి యుండినారు. దీని కళావేత్తలు భారతీయకళామూర్తికి తమ ప్రభావమును తాపినారు. దీని శిలాశిల్పులు మైనమువలె మహాశిలలను తొలిచి వేలకొలది యేండ్లు సజీవముగ నిలువగలిగిన అజంతా యెల్లోరా కార్లే నాసిక్ మొదలగు శిల్ప గుహావిహారములను నిర్మించినారు. గురుగౌరవములైన దీని ధర్మసిద్ధాంతములతో బంధుత్వము నెఱపు టకు సభ్య సమున్నతజాతులగు యవన చైనీయు లువ్విళులూరెడివారు. దీని ఆచార విచారములు ఆనాటినుండి నేటివఱకును విద్వాంసులకు గణ్యామాన్యములై యొప్పి నవి. వెయ్యేల! ఈనాటికిని బౌద్ధులమని చెప్పుకొనెడివారి సంఖ్య ప్రపంచములోని యే యితర మతమునకును తీసిపోదు.

ఇంతటి ప్రతాపముగల బౌద్ధధర్మము తన జన్మభూమియగు భారతమునందు లోపించుటకు కారణమేమి? ఈ గంభీరప్రశ్న నిజమునకు విస్మయావహమైనది. యథోచితముగ సంక్షిప్తరూపమున ఈ ప్రశ్నను చర్చింతును. భారతదేశమున బౌద్ధధర్మము పడిపోయినకాలము విక్రమీయ శకము పదుమూడు పదునాల్గు శతాబ్దములు. ఈ సమయ పరిస్థితులను గమనించుటకై మనము కొంత గతచరిత్రను త్రవ్వుకొనవలసి యున్నది.

విక్రమ పూర్వము 426 వ యేట గౌతమబుద్ధుని నిర్వాణము జరిగినది. వారు వారి ఉపదేశములను ముఖతః చెప్పుచుండువారు. అతని శిష్యు లతని జీవితకాల మందే వాటిని కంఠస్థము జేసియుండిరి. ఆ ఉపదేశములు రెండు విధములు. ధర్మ మును దర్శనమును గూర్చి చెప్పునవి యొక రకము. భిక్షుణీ భిక్షువుల నియమము లను ఆచారములనుగూర్చి చెప్పునవి రెండవరకము. మొదటి రకమును పాలీభాష

యందు ధమ్మ(ధర్మ) మని చెప్పుదురు. రెండవ రకమును వినయమని చెప్పుదురు. బుద్ధుడు నిర్వాణము జెందిన వైశాఖ పూర్ణిమకు తర్వాత ఆ సంవత్సరమందే మున్ముందు అభిప్రాయ భేదము లేర్పడరాదని దలంచి అతని ప్రధాన శిష్యులు పాట్నాజిల్లాయందలి రాజగృహపురమునకు చెంత సాతపర్ణీగుహయందు ధర్మమును వినయమును సంగాయనము జేసిరి. అదియే ప్రథమ సంగీతియని పిలువబడినది. ఆసమయమున భిక్షుసంఘమునకు ప్రధాన సంచాలకుడు (కంఠస్థవిరుడు) మహాకాశ్యపుడు. ఆ సంగీతియందు బుద్ధునకు చిరకాల మనుచరుడుగ నుండిన ఆనందునితో ధర్మవిషయమునుగూర్చి ప్రశ్నించుచు వచ్చిరి. బుద్ధప్రశంసితుడగు ఉపాలిని వినయ విషయమునుగూర్చి ప్రశ్నించుచు వచ్చిరి. పాలీ పరిభాషయందు అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాది సుకర్మములను 'శీల' మందురు. స్కంధము ఆయతనము ధాతువు మొదలగు సూక్ష్మదార్శనిక విచారములను ప్రజ్ఞయని, దృష్టియని, దర్శన మని లేదా విపశ్యన యనికాని చెప్పుదురు. బుద్ధోపదేశములందు శీల ప్రజ్ఞల రెండింటి పై యెక్కువ గౌరవము చెప్పబడినది. ధర్మశబ్దమునకు బదులుగ పాలీయందు 'సుత్త' (సూత్ర - సూక్త) యనిగాని సుత్తాంతమని గాని వాడుట గలదు. ఇట్లు ప్రథమ సంగీతియందు స్థవిర భిక్షువులు ధర్మవినయములను సంగ్రహించిరి. ఆ వెనుక వాటిని వేరువేరుగ ఆ యా భిక్షువులు కంఠస్థము జేయుటకును ప్రచారము చేయుటకును పూనుకొనిరి. ధర్మమును (ధమ్మ - సుత్త) రక్షించుటకు బూనినవారు ధర్మ (ధమ్మ) ధరులనియు, సుత్తధరు లనియు, సుత్తంతికులనియు, సౌత్రాంతికులనియును చెప్పబడిరి. వినయమును పోషింపబూనుకొనినవారు వినయధరులు నాబడిరి. ఇంతియేగాక సూత్రములందు అందందు పాడిపాడిగ దర్శన సంబంధాంశములు మిగుల సంక్షేపముగ చెప్పబడి యుండినవి. వాటిని మాతిక (మాత్రిక) లని జెప్పుదురు. ఆ మాత్రికలను కాపాడు భారమునకు తలకొనినవారిని మాత్రికాధరు లని పేర్కొనిరి. ఆ మాత్రికలలోని విపులవ్యాఖ్యానమె అభిధమ్మపిటకము. దానిని ధరించినవారు అభిధర్మికులని చెప్పబడిరి. (అభిధర్మ - ధర్మం అభి = ధర్మము నుండి)

ప్రథమసంగీతి గడచిన నూటేండ్లకు పైన వైశాలిభిక్షువులు వినయమునందలి కొన్నినియమముల నవహేళన జేయుచు వచ్చిరి. దానిని గూర్చి వివాదములు బయలు దేఱెను. ఫలతః వెండియు భిక్షుసంఘము సమావేశమై వివాదగ్రస్త విషయములపైన తమ యభిప్రాయములను వెల్లడించిరి. ఇట్లు ధర్మముయొక్కయు వినయము యొక్కయు సంగాయనము జరిగినది. ఇది ద్వితీయ సంగీతి. ఎందఱో భిక్షువులీ

సంగీతితో నొడబడలేక తమ మహాసంఘముయొక్క సమ్మేళనమును కౌశాంబి యందు వేఱుగ నేర్పఱుచుకొని తమకు నచ్చినట్లు ధర్మవినయములను సమకూర్చిరి. స్థవిర (వృద్ధ) భిక్షువుల ననుసరించిన మొదటి సముదాయ (నికాయ) మును ఆర్యస్థవిరులనియు లేదా స్థవిరవాదులనియు, రెడవసముదాయమును మహాసాంఘి కులనియు పేర్కొనిరి. ఈ రెండు సముదాయముల మూలమున మరి నూటయిరు వదియైదేండ్లకు పదునెన్మిది సముదాయ (నికాయ)ము లావిర్భవించినవి. అందు మొదటిదగు 1. స్థవిరవాదమునుండి 2. వజ్జిపుత్తక 3. మహీశాసక 4. ధర్మగుప్తిక 5. సౌత్రాంతిక 6. సర్వాస్తివాద 7. కాశ్యపీయ 8. సంక్రాంతిక 9. సమ్మితీయ 10. షణ్ణాగరిక 11. భద్రయానిక 12. ధర్మోత్తరీయ నికాయములును, రెండవదియగు 1. మహాసాంఘిక వాదములోనుండి 2. గోతులిక 3. ఏకవ్యావహారిక 4. ప్రజ్ఞప్తి (లోకోత్తర)వాద 5. బాహులిక 6. చైత్యవాద నికాయములును ప్రాదుర్భవించినవి. వీటి మత భేదము వినయము నందలి – అభిధర్మము నందలి విషయములనుబట్టి వర్తించినది. ఒకానొక నికాయము ఆర్యస్థవిరులవలె బుద్ధుని మనుష్యమాత్రునిగ తలంపక లోకోత్తరపురుషుడని భావింపసాగెను. వారు బుద్ధునియందు అద్భుత దివ్యశక్తుల నావెూదించిరి. మరియు నొక్కొక్కడు బుద్ధుని జన్మమును నిర్వాణమును వాస్తవములు గావనియు, ప్రతీతి మాత్రములనియు నిర్ణయింప బూనుకొనెను. ఇట్టి వివిధ ఉద్దేశ్యముల మూలమున వారి వారి సూత్రవినయము లందుకూడ వైవిధ్యమేర్పడెను. బుద్ధుని అమానుష లీలలను ప్రతిపాదించుచు క్రొత్త క్రొత్త సూత్రములయొక్క సృష్టి ప్రారంభమయ్యెను. బుద్ధుడు నిర్వాణము జెందిన పిదప రమారమి రెండు వందల యిరువదియైదేండ్లకు అశోకచక్రవర్తి బౌద్ధధర్మ దీక్షితుడయ్యెను. అతని గురువగు మౌద్గలిపుత్ర తిష్యుడు ఆనాటి ఆర్యస్థవిరసంఘము నకు పెద్ద. ఆయన వివిధ మతభేద నిరాసమునకై పాట్నాయందు అశోకుడు నిర్మించిన అశోకారామమను మఠములో సంఘమున యెన్నికగన్న వేయిమంది భిక్షువులను సమావేశపఱచెను. వారందఱును కలిసి వివాదగ్రస్త విషయములను పరిష్కరించి ధర్మవినయములను గూర్చి సంగాయనము జేసిరి. ఇది తృతీయ సంగీతి. ఇదే సమయమున ఆర్యస్థవిరులనుండి చీలికలైన సర్వాస్తివాదము మున్నగు పదునొకండు నికాయములవారు నాలందయందు విడిగ తమ సంగీతిని చేసికొనిరి. అప్పుడప్పుడు బుద్ధదేవుడు నివసించుచు వచ్చుటబట్టి పవిత్రస్థానములందు గణుతివహించిన నాలం దాపట్టణ మానాటినుండి సర్వాస్తివాదులకు నునికిపట్టయి యొప్పినది.

తృతీయ సంగీతిని ముగించి మౌద్గలిపుత్రతిష్యుడు అశోకభూపాలుని సహాయముతో ధర్మప్రచారకులను భిన్నభిన్న దేశములకు బంపించెను. ఒకానొక భారతీయ ధర్మము సంఘటిత రూపమున భారతభూమిని గడచి విదేశముల కెగబ్రాకుట అదియె మొదటిసారి. ఆ ప్రచారకులు పశ్చిమమందు గ్రీసు – మిస్ర – సిరియా మున్నగు యవనరాజ్యములలోనికి, ఉత్తరమున మధ్య ఏశియాలోనికిని, దక్షిణమున తామ్రపర్ణి (లంకా) ద్వీపము, సువర్ణద్వీపముల (బర్మా) లోనికిని ప్రవేశించి పర్యటించిరి. స్వయముగ అశోకుని కొడుకును, మౌద్గలిపుత్రతిష్యుని శిష్యుడును నగు మహేంద్రభిక్షువు – నతని సోదరియగు సంఘమిత్రయు లంకకు బంపబడిరి. ఆనాడు లంకకు రాజగు దేవానాం ప్రియతిష్యుడు బౌద్ధధర్మదీక్షను గైకొనెను. కొన్నాళ్ళలోనే అచ్చటి జనులందఱును బౌద్ధులైపోయిరి. మొదటి నుండియుకూడ యిచ్చట ఆర్యస్థవిరవాదమె వ్యాపించి యుండినది. మధ్యకాలమున పదిరెండవ పదుమూడవ శతాబ్దములలో బర్మాయందును శ్యామదేశమునందును మహాబౌద్ధధర్మము వికృతమై వికలమై వినష్టమై పోయిన తర్వాత అచ్చట కూడ ఆర్యస్థవిరవా దమె అలముకొనినది. అంతవఱకు కంఠస్థము జేయుచు రక్షించుచు వచ్చిన సూత్ర వినయ అభిధర్మము లనెడి పిటకముల మూడింటిని క్రీస్తుశకము ప్రథమ శతాబ్దమున లంకయందు లిపిబద్ధము జేసిరి. వాటినే నేడు పాలీత్రిపిటకము లనుచున్నారు.

మౌర్యరాజులకు బౌద్ధధర్మమనిన ప్రీతిమెండు. అందువలన వారికాలము నందనేక స్థానములలో ధరణీపతులును ధనికులును గొప్ప గొప్ప సంఘారామములను (మఠములు) స్తూపములను విస్తారముగ నిర్మించిరి. వాటియందు సుఖపూర్వకముగ నివసించుచు భిక్షువులు ధర్మప్రచారమును చక్కగ చేయగల్గిరి. క్రీస్తుశకమునకు ముందు రెండవ శతాబ్దమునందు మౌర్యసేనాపతియగు పుష్యమిత్రుడు అంతిమ మౌర్యచక్రవర్తిని సంహరించి తన శుంగవంశీయ రాజ్యమును నెలకొల్పెను. ఈ నూతన రాజవంశము సామయిక రాజనీతియొక్క అవసరమునకై చొక్కముగ బ్రహ్మణధర్మము ననుసరించి అబ్రాహ్మణ ధర్మముపై కత్తిగట్టెను. శతాబ్దముల తరబడి మూలబడిపోయిన అశ్వమేధాది పశుబలి యజ్ఞములు మహాభాష్యకారుడగు పతంజలి పౌరోహిత్యమున మరొక్కసారి తలలెత్తి తిరిగినవి. బ్రాహ్మణులయొక్క మాహాత్మ్యములతో కూరిపోసిన మనుస్మృతివంటి గ్రంథముల రచనకు సూత్రపాతము జరిగినది. ఆ యదనున మహాభారతముయొక్క ప్రథమ సంస్కరణ మొదవినది. మృత సంస్కృతభాషకు జీవముపోయుటకు గగనప్రయత్నములు జరిగినవి. పరిస్థితులు

ప్రతికూలమౌటచే చేయునదిలేక బౌద్ధులును బౌద్ధధర్మమును తమ కేంద్రములగు మగధ కోసలములనుండి మెల్ల మెల్లగ వైదొలగి ఆ యా యితర దేశములలోనికి జాఱుకొనవలసి వచ్చెను. ఆర్యస్థవిరవాదము మగధరాజ్యమునుండి ప్రక్కకు తప్పుకొని విదిశాప్రాంతమునందలి చైత్యపర్వతము (ఇప్పటి 'సాంచీ') పై కాలూదుకొనినది. సర్వాస్తివాదము మథురానికటమున గోవర్ధనగిరి నెక్కినది. తక్కిన నికాయములుకూడ నిట్లే తమ తమ కూడలితావులను వదలి అబ్బినట్లు ఆ యా చోట్లకు వలసపోయెను.

అన్నిటికంటె ప్రాచీన సముదాయము (నికాయము) ఆర్యస్థవిరవాదము. అది ప్రాచీన విషయముల నన్నింటిని పట్టుదలతో పాలించుచువచ్చెను. తక్కిన సముదా(నికా)యములు దేశకాల పాత్రముల ననుసరించి పలుమార్పుల కనుకూలించినవి. యుక్త ప్రాంతముయొక్క తూర్పుభాగమునకును, బీహారమునకును సాధారణ భాషయై యుండిన మాగధియందే యింతవఱకు త్రిపిటకము లుండినవి. పిమ్మట సర్వాస్తివాదులు మథురలో నెలకొని తమ త్రిపిటకములను బ్రాహ్మణసంఘమునకు మాన్యమైయున్న సంస్కృతభాష యందు రచించిరి. అట్లే మహాసాంఘికులు లోకోత్తర వాదులు మున్నగు యెన్నో నికాయములవారు తమ పిటకములను సంస్కృతములో వ్రాసిరి. కాని యీ సంస్కృతము పాణినీయ సంస్కృతము గాదు. దాని నిప్పుడు గాథాసంస్కృతమని పేర్కొనుచున్నారు.

మౌర్యసామ్రాజ్యము కూలిన పిదప పశ్చిమభారతమును యవనరాజగు మినాందరు డాక్రమించెను. వాడు తన రాజధానిగ శాకలమును (స్యాల్‌కోట) యేర్పఱచెను. వానియొక్కయు వాని వంశీయులయొక్కయు రాజప్రతినిధులు (క్షత్రపులు) మథురయందును, ఉజ్జయినియందును నివసించుచు రాజ్యపాలనమును సాగించుచుండిరి. యవనరాజులు మొత్తముమీద బౌద్ధధర్మపక్షపాతులు. అందువలన ఉజ్జయిని క్షత్రపుడు సాంచీయందలి స్థవిరవాదులపైనను, మథురా క్షత్రపుడు సర్వాస్తివాదులపైనను ప్రాణమైత్రియు, ప్రగాఢశ్రద్ధయు నెఱపుచు వచ్చిరి. మథుర ఆనాడొక క్షత్రపునకు రాజధాని యగుట మాత్రమేగాక తూర్పు దక్షిణముల నుండి తక్షశిలకు బోవు విశాలమార్గమునందు ప్రధాన వర్తకకేంద్రమై యుండినది. దీనిచే సర్వాస్తివాదప్రచారమునకు వలసినంత ప్రబలసహాయ మేర్పడినది. మగధ దేశీయ సర్వాస్తివాదమునకును యిందలి సర్వాస్తివాదమునకును వ్యత్యాసమేర్పడుటచే దీనిని ఆర్యసర్వాస్తి వాదమని పిలుచుచువచ్చిరి.

యవనుల నోడించి యూచియులు పశ్చిమభారతమున నధికారముద్రవైచిరి. వారిని కుషాణజాతికి చెందిన శాఖ యందురు. ఆ వంశమున మహాప్రతాపియగు కనిష్కసమ్రాట్టుదయించెను. కనిష్కుని రాజధాని పురుషపురము (పేశావర్). ఆ సమయమునకు సర్వాస్తి వాదము గాంధారము వఱకు ప్రాకియుండినది. కనిష్కుడు స్వయముగ సర్వాస్తివాదమునకు అనుయాయి. అతని సమసామయితులు మహాకవి అశ్వఘోషుడు, ఆచార్య వసుమిత్ర ప్రభృతులు. ఆనాడు మూలసర్వాస్తివాదమని చెప్పబడుచున్న గాంధారమందలి సర్వాస్తివాదమునుగూర్చి కశ్మీర గాంధార దేశీయులగు ఆచార్యులకు మతభేదము లేర్పడియుండినవి. దేవపుత్ర కనిష్కుని సహాయమున వసుమిత్రుడు అశ్వఘోషుడు మున్నగు ఆచార్యులు సర్వాస్తివాద మును మన్నించు బౌద్ధభిక్షువుల మహాసభ నొక్కదానిని సమావేశపఱచిరి. ఆ సభయందు అన్యోన్య మతభేద నిరాసముకొఱకై వారు తమ త్రిపిటకములపై నిభాషయనెడి టీకను రచించిరి. ఆ నిబాషకు అనుకూలురౌటచే మూల సర్వాస్తి వాదులు వైభాషికులనబడిరి. దుఃఖ నివృత్తికిని – నిర్వాణమునకును బౌద్ధధర్మము నందు మూడుతెన్ను లెన్నబడినవి. దుఃఖమునుండి గట్టెక్కగోరి ఆర్యాష్టాం గిక మార్గమున బయనించి జీవన్ముక్తుడైనవాడు అర్హతుడు. అంతకంటె మఱికొంత పరి శ్రమజేసి జీవన్ముక్తిని సాధించిన వాడు ప్రత్యేక బుద్ధుడు. అసంఖ్యజీవ కల్యాణమునకు మార్గదర్శకుడయి స్వీయముక్తి లాభమును సరకుచేయక ప్రగాఢ పరిశ్రమము చేసిచేసి తానంతకు తావచ్చిన నిర్వాణమును చూఱగొనువాడు బుద్ధుడు. వీటినే క్రమముగ అర్హత (శ్రావక) యానము, ప్రత్యేక బుద్ధయానము. బుద్ధయాన మని పేర్కొనిరి. ఆచార్యుడు అశ్వఘోషుడు మొదటి రెండింటికంటె చివరిదియగు బుద్ధయానముపై విశేషగౌరవమును ప్రదర్శించి దానిని మహాయాన నామమున శ్లాఘించినాడు.వెనుక వెనుక వారా పుంతనె ద్రొక్కి ముందటి యానముల రెండింటిని స్వార్థపూర్ణములని తెగడి కేవల బుద్ధయానమును (మహాయానమును) యెంతయు కొండాడిరి. ముందుచెప్పిన పదునెన్మిది నికాయములకును ఈ మూడు యానములు సమ్మత ములనుట గుర్తింపదగిన విషయము. ముముక్షువుయొక్క స్వాభావిక రుచినిబట్టి వాడువాడు ఆ యా యానమును యేరుకొనుట యుండునని వారు చెప్పుదురు.

క్రీస్తుశకము ప్రథమ శతాబ్దములో వైభాషిక సంప్రదాయము ఉత్తరభాగమున విస్తరించి పోవుచుండ ఆ సమయమున ఆచార్యుడు నాగార్జునుడు విదర్భ (బరార్) దేశమున నుత్పన్నమయ్యెను. అతడు మాధ్యమిక వాదమనబడు శూన్యవాద దర్శనముపై గ్రంథములను రచించెను. కాలాంతరమున మాధ్యమిక, మహా

యానముల పొత్తుచే శూన్యవాదీ మహాయాన సంప్రదాయము ప్రవర్తించినది. త్రిపిటకములతో వికట సంబంధమగు అష్టసాహస్రికా – ప్రజ్ఞాపారమితాది గ్రంథములు దానికి రూపనిరూపణము జేసినవి. నాల్గవ శతాబ్దమునందు పేశావరమున ఆచార్యుడు వసుబంధుడు వైభాషికులతో వైమత్యము చెంది సౌత్రాంతిక వాదమునకు పట్టుకొమ్మగు అభిధర్మకోశమును రచించెను. అతని అగ్రజుడు అసంగుడు విజ్ఞానవాదమనబడు యోగాచార సంప్రదాయమునకు ప్రవర్తకుడయ్యెను. ఇట్లు నాల్గవ శతాబ్దిలోగా వైభాషిక, సౌత్రాంతిక, యోగాచార, మాధ్యమికులనెడి దార్శనిక సంప్రదాయములు నాలుగు బౌద్ధులయం దేర్పడినవి. ఇందులో మొదటి యిరుతెగల వారును త్రివిధ యానముల నంగీకరింతురు. అందుచే వారిని హీనయానులని మహాయానులు పేర్కొనిరి. మిగిలిన రెండు తెగలకును కేవలము బుద్ధయానము మాత్రము సమ్మతము. దానిచే వారు తమ్ముతాము మహాయానులని పిలుచుకొనిరి.

మహాయానులు బుద్ధయానమునకు యేకాంతభక్తులు. ఇంతేకాదు; వారు తమ ఉత్సాహావేశమున కడమ యానముల రెంటిని దూయబోయుటయందు వెనుకబడలేదు. బుద్ధుని గూర్చిన అలౌకిక చరిత్రలు వారికత్యంతోపయుక్తముగ, తోపట్టుటచే మహాసాంఘికులనుండియు, లోకోత్తరవాదులనుండియు ఆవశ్యక విషయముల నెన్నింటినో గ్రహించిరి. రత్నకూటము – వైపుల్యము మున్నగు సూత్రగ్రంథముల నెన్నో వ్రాసిరి. బుద్ధయానమున చక్కగ నెలకొని, బుద్ధత్వమునకు పూర్ణాధికారియగువానిని బోధిసత్త్వుడందురు. ప్రతివానికూడ బోధిసత్త్వమార్గమున నడువుమని మహాయాన సూత్రములు నిర్బంధముగ నాదేశించును. దాని సారాంశమేమనిన ప్రతివాడును తన తన ముక్తికై దేబరించుటమాని సకలలోక ప్రాణికోటి కల్యాణకామనయందు కటిబద్ధుడు గమ్మనుట. బోధిసత్త్వుల మహత్త్వమును శిఖర శిఖరముల కెక్కించుటకు అవలోకితేశ్వర – మంజుశ్రీ – ఆకాశగర్భుడాది వందల కొలంది బోధిసత్త్వులను గల్పించి, పై పెచ్చు అర్హత (ముక్త) శిష్యులగు సారిపుత్ర మౌద్గల్యాయనులను అముక్తులనుగ బోధిసత్త్వులనుగ నిరూపించుటయందు మహాయానులు చేయని కృషి లేదు. తొలుతటినుండియు పదునెన్మిది నికాయములును ప్రామాణికతతో మన్నించుచు వచ్చిన ప్రాచీన సూత్ర పరంపరను బోధిసత్త్వులుగ బుద్ధులుగ అప్పుడప్పుడె కావలెననెడి చండావేశమున నొక్కుమ్మడి తల్లక్రిందు తాఱుమాఱు జేయుటయందు మహాయానులు యేమాత్రము సంకోచించ లేదు.

బుద్ధుని ప్రతిమా నిర్మాణములు మొట్టమొదట కనిష్కుని సమయమున నేర్పడినవి. మహాయాన ప్రచారముయొక్క ప్రాబల్యముతోబాటు బుద్ధవిగ్రహముల పూజారాధనలు కోలాహలముగ నడువసాగినవి. మరియు నూర్లకొలంది బోధిసత్త్వుల ప్రతిమలుకూడ సృష్టికాజొచ్చెను. బ్రాహ్మణధర్మమునందలి దేవీ దేవతలతోడి సాటి ఉద్యోగమును బోధిసత్త్వుల కొప్పించిరి. తార ప్రజ్ఞాపారమిత విజయ మున్నగు దేవీ విగ్రహములను వారు కల్పించి ప్రతిష్ఠించిరి. ఆ దేవీ విగ్రహములకును బోధిసత్త్వ ప్రతిమలకును మహామహామందిరములు తరుచుగ నిర్మాణము లాయెను. వారిని గూర్చిన స్తోత్రపాఠములుకూడ మిక్కుటముగ నుప్పతిల్లసాగెను. మన యీ చేతల వలన ప్రాచీనభిక్షు పరంపరా నియమములకు యెంతెంత అఘాతము కల్గుచున్నదని యైనను, పాపము! వారు తమ మహా వీరావేశమున వెనుకకుచూచి యోచించ లేక పోయిరి. ఎవడైన నిలిచి ప్రశ్నించినచో ''పోపొమ్ము. ఆ వినయ నియమములు తుచ్ఛమగు స్వార్థమునకై ప్రాకులాడు హీనయానులకు చెందినవి. సమస్త విశ్వకల్యాణ సాధనకై ప్రాణముల నుమ్మివైచు బోధిసత్త్వుల కా పంజర బంధమెందులకు?'' అని బదులు చెప్పుచు వచ్చిరి. మఱియు వారు హీనయానుల సూత్రములకంటె నధిక మహత్త్వముగల సూత్రములను నిర్మించిరి. ఆ సూత్రములు వందలకొలది పుటలతోగూడి చప్పున కంఠస్థము జేసికొనుటకు దుస్సాధ్యమై పోవుటవలన వాటిని కుదించి కుదించి, భాగవతమునకు చతుశ్శ్లోకీ భాగవతము, గీతకు సప్తశ్లోకీ గీతవలె సంక్షిప్తరూపముల నేర్పఱచిరి. సులువుగ ధారణచేయుటకై యేర్పఱచిన ఆ సంక్షిప్త రూప సూత్రములను మఱింత క్లుప్తము జేసి మంత్రముల నల్లజొచ్చిరి. సనాతన పరంపరను మూలపిటకములను తమ రుచికి అనుకూలముగ తాఱుమాఱుజేసి మంత్రములను సృష్టించుట, బోధిసత్త్వుల కల్పించుట, వారి అలౌకిక దివ్యశక్తుల నూరక వర్ణించుట మూలమున దాదాపు గుప్తసామ్రాజ్యము మొదలుకొని హర్షవర్ధనుని కాలమునందును మంజుశ్రీ మూలకల్పము, గుహ్యసమాజము, చక్రసంవరము మున్నగు యెన్నెన్నొ తాంత్రికయానములు జన్మము లెత్తినవి. వీలగునంత సర్వ సులభముగ ముక్తిని బొందుటకు అర్హతయానమును ప్రతేక బుద్ధయానమును ప్రాచీన నికాయము లేర్పఱచియుండ, మహాయానము కొండకొమ్మలనెక్కి అశేష జనమున కంతటికిని ఒకే ఒక మార్గమును బుద్ధయానమును తెఱచిపెట్టెను. కాని అది దుర్లభమగుటచేత సులభము చేయుటకై పూజలు పురస్కారములు మంత్రములు – తంత్రములు – తండోపతండములు త్రవ్వి పెకలించిరి. సులభము మఱింత సులభమనెడి రంధిలో చిత్రవిచిత్ర ఆవిష్కారములను వెలికి దీసిరి. మంజు శ్రీ

మూలకల్పము తంత్రక్రియలకు దుకాణము పెట్టెను. గుహ్యసమాజము మఱింత ముందుకు బోయి భైరవీచక్రము నేర్పఱచి సారాయము సంభోగము మంత్రోచ్చారముల మూలమున తన మార్గమును సులభ సులభముచేసి కూర్చొనెను. దీనికి ఆదిమూలము మహాయాన సంప్రదాయమే. తొలుత దీని ప్రచార మత్యంత గుప్తముగ నుండెడిది. భైరవీచక్ర విధి విధానము లన్నియు సావధానముగ దాచి పెట్టుచు వచ్చిరి. ఎన్నెన్ని పరీక్షలకు నెగ్గి నిగ్గుదీఱినగాని యెవ్వనినైన తమగుంపులో కలియనిచ్చెడి వారుగారు. మంత్రయానము తంత్రయానము వజ్రయానమని చెప్పబడు యీ సంప్రదాయమిట్లు యేడవ శతాబ్దివఱకు గోప్యముగ సాగినది. దీని అనుయాయులు బైటికి మాత్రము మహాయానులమని నుడువువారు. మహాయానమునకు ప్రత్యేకముగ వినయ పిటకము లేకపోవుటచేత వారును భిక్షు దీక్షాగ్రహణ సందర్భమున సర్వాస్తివాదాది నికాయములనే ఆశ్రయింపవలసి వచ్చెడిది. నాలందాపట్టణము మహాయానమునకు మనికిపట్టై యుండెడి యెనిమిదవ శతాబ్దమునందు అందలి భిక్షువులు వినయ విషయమున సర్వాస్తివాదమునకు అనుకూలురు. వినయ విషయమున సర్వాస్తివాదులతోడను బోధిసత్త్వ చర్యాప్రసంగమున మహాయానము వలనను, భైరవీ చక్రసందర్భమున వజ్రయానము ద్వారాను ఆనాటి భిక్షువులు దీక్షను పొందుచు వచ్చిరి

ఎనిమిదవ శతాబ్దము వచ్చుసరికి భారతదేశమునందలి బౌద్ధసంప్రదాయములన్నియు వజ్రయానగర్భితమగు మహాయానమునకు చెందినవై యుండెను. బుద్ధుని సహజ సరళబోధలలో విశ్వాస మెగిరిపోయి వారికి కపోలకల్పితములగు అతి లౌకిక కథలయందు నమ్మకము కుదురుకొన్నది. బైటికి భిక్షువేషములు వేసికొని యున్నను లోపల వారు అమాంతము గుహ్యసామాజికులై యుండిరి. దిగ్గజవిద్వాంసులు ప్రతిభాశాలురగు కవులు సైతము సగము పిచ్చివారై శివమెత్తినట్లు యెనుబది నాలుగు సిద్ధుల వెంటబడి సంధ్యాభాష యందు నిర్గుణగాన మొనర్చుచుండిరి. ఏడవ శతాబ్ది యందు ఉత్కలరాజగు యింద్రభూతియు, ఆతని గురువగు అనంగవజ్రసిద్ధుడును, మఱియు కొందఱితర సిద్ధపండితులును స్త్రీలనే ముక్తిదాతలనియు, పురుషులనే ముక్తికి ఉపాయములనియు, మద్యమునె అమృతమనియు ప్రతిపాదించుట యందె వారి తెలివి తేటలును సిద్ధపాండిత్య మును మిడిమిడి తేలినవి. ఎనిమిదవ శతాబ్దము నుండి పదిరెండవ శతాబ్దమువఱకును బౌద్ధధర్మము వాస్తవమునకు వజ్రయానమై లేదా భైరవీచక్రధర్మమైయుండునది. తొలుతనే మహాయానము మంత్రముల తోడను,పూజలతోడను నిర్వాణప్రాప్తిని సరళము జేసెను. తర్వాత నొక్కుమ్మడి

వజ్రయానము దానిని సహజ సహజము చేసివేసెను. అందుచే వజ్రయానమును సహజయానమని పిలువజొచ్చిరి.

వజ్రయానమును అనుసరించిన విద్వాంసులును కవులును సిద్ధులును విలక్షణ ప్రకారముల నుండెడివారు. చెప్పులు కుట్టువాడొకడు, కంబళ్ళను నేయువాడొకడు, డమరువును ధరించుకొనువాడొకడు, రోటిని దాల్చువాడొకడునై ఆ యా పేర్లతో జనప్రసిద్ధి బడయుచు వచ్చిరి. మద్యపానమత్తులు, నర కపాలధారులు, శ్మశానవాసులు లేదా మహారణ్య సంచారులునై వారు జనుల నెంతెంతకు ధిక్కరించుచువచ్చిరో జనులంతంతకు వారి వెంటబడుచు వచ్చిరి. బోధిసత్త్వులనువలె యితరదేవతలవలె ఈ సిద్ధులను అద్భుత దివ్యశక్తి సంపన్నులనుగ ప్రజానీకము తలంచెడిది. ఈ సిద్ధులు విచ్చలవిడి స్త్రీలను సారాయమును నుపభోగించు వారు. రాజులుకూడ వీరికి తమ కన్యల నర్పించుచుండుట యుండినది. వారు త్రాటకము హిప్నాటిజమువంటి కొన్ని ప్రక్రియలను గుర్తెఱిగి యుండిరి. వాటి ప్రభావముచేత అమాయక ప్రజలకు ఆ యా చమత్కారములను జూపువారు. అపుడపుడు హస్తలాఘవముచేతను, శ్లేషయుక్తములగు అస్పష్టవచనములతోను జనులను ముగ్ధులనుగ జేయువారు. ఈ విధమున అయిదు శతాబ్దములలో నొకవిధమున భారతప్రజయంతయు వారివలలో పడి కామవ్యసనులు, మద్యపానలోలురు మూఢవిశ్వాసకులుగను సిద్ధమైరి. రాజులు కూడ రాజ్యరక్షణమునకై యుంచుకొను సేనలకు బదులు యెంతెంతో వెచ్చించుచు ఒకానొక సిద్ధాచార్యుని, నూర్లకొలది వాని యనుయాయులను ఒక పెద్దపటాలమును గూర్చి పెట్టుకొనువారు. దేవాలయములందు బలిపూజలు నిరాతంకముగ జరిగి పోయెడివి. దాన దక్షిణలకు కొఱత లేకపోవుటచే అన్యధర్మానుయాయులు కూడ చాలమట్టుకు వీరి ననుకరింపసాగిరి.

భారతీయప్రజ ఒకవైపు దురాచారము మూఢవిశ్వాసములందు కుత్తుక బంటి మునిగియుండ, బ్రాహ్మణులు జాతిభేదమను విషబీజమును నాటి మఱియొక వైపు గృహకలహములకు నిలయమగునట్లు జాతిని ముక్కలు చెక్కలు జేసిరి. శ్రద్ధావంతులగు రాజులును, ధనికపుంగవులును కానుకల నర్పించి యర్చిచి మఠములను, మందిరములను అపార సంపన్నిలయములుగ జేసియుండు ఆతరుణమున పశ్చిమమునుండి తురకలు దాడివెడలిరి. వారు మందిరములందలి ధనరాశులను దోచుకొనుట మాత్రమెగాక అనంతదివ్యశక్తులను ఆలవాలమని కొండాడుచు వచ్చిన దేవతాప్రతిమలను తునాతునకలు జేసిపోయిరి. తాంత్రికులు తమ మాంత్రిక ప్రయో

గములను నెఱపుచునె వచ్చిరి. కాని దాని వలన తురుష్కులకు ఘటిల్లిన నష్టమేమియు లేదు. పదుమూడవ శతాబ్దారంభముననే ఉత్తరభారతము నంతయు తురకలా క్రమించుకొనిరి. పాలవంశీయరాజు తన రాజ్యరక్షణమునకై యేర్పఱచిన ఉదంతపురీ తాంత్రిక విహారమును మహమ్మదు బిన్‌బక్తియారనువాడు యిన్నూరు ఆశ్వికదళము లతో మాత్రమె కబళించివైచెను. దివ్యశక్తిధారియని యెన్నబడిన నాలంద యందలి తారామూర్తి పొడిపొడి చేయబడెను. నాలందా విక్రమశిలలయందలి తాంత్రిక భిక్షువులు వందలకొలంది కత్తులకు బలియైరి. ఈ యుద్ధమునందు అపారజన ధనములకు హాని వాటిల్లినది. అనంత గ్రంథరాశి ఆహుతియైనది. సాటిలేని కళా మూర్తులు రూపుమాపబడినవి. ఏదెట్లయినను ఒక్కమేలు జరిగినది. కదలింపరాని మోహనిద్రలో నుండి లోకప్రజ కన్నుదెఱ చినది.

'శంకరాచార్యులవారి ప్రతాపముచే బౌద్ధులు భారతమునుండి పాఱిపోయి' రనునది చిరకాలమునుండి వచ్చుప్రవాదము. ''శంకరుడు బౌద్ధులను శాస్త్రార్థములచే జయించుటమాత్రము కాదు. తన ఆజ్ఞావర్తులగు సుధన్వాదిరాజుల మూలమున వేలకొలది బౌద్ధులను సముద్రమున ముంపించె'' నని – ''ఉరికంబముల కెక్కించె'' నని చెప్పుకొనుటకూడ గలదు. ఇవి గాలిమాటలు మాత్రమె కావు. వీనికి ఆధారము మాధవాచార్యుని శంకరదిగ్విజయమునకూడ గలదు. అందుచే యీ ప్రసంగములు సంస్కృత పండితుల విశ్వాసమునకు మఱింత గురియైనవి. వీటిని వారు ఐతిహాసిక సత్యములుగ భావించిరి. అన్యధర్మమునందలి అసహిష్ణుత యను కళంకమును శంకరునకు ఆపాదించునవిగాన ఈ ప్రసంగములను విశ్వసింపదగదని మఱికొందఱు పెడచెవిని బెట్టిరి. అయినను విషయము నిజమే యైనచో దేనినైనను నిరాకరింపకుండుటయె మేలు.

శంకరుని కాలనిర్ణయమందే యెన్నో చిక్కులు గలవు. కొందఱాతనిని విక్రమ [illegible] కాలీను డందురు. ''Age of Shankar'' యొక్క కర్తయు, కొందఱు [illegible] పునాటి పండితులును దానినె సమర్థింతురు. కాని చరిత్రకారు లద్దాని నంగీకరింపరు. వారి మతమును విచారింతము. శంకరుని శారీరక భాష్యమునకు వాచస్పతి మిశ్రుడు ''భామతీ'' టీక వ్రాసినాడు. ఆతని గ్రంథములను బట్టియే వాచస్పతిమిశ్రుని కాలము క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దమనుట తేట తెల్లము. దీనిచే శంకరుని సమయమెటు త్రిప్పినను తొమ్మిదవ శతాబ్దమునకు ముందే యనుట మాత్రము నిర్వివాదము. అయినను శంకరుడు కుమారిలభట్టుకు పూర్వుడు గాడు.

కుమారిలుడు బౌద్ధనైయాయికుడగు ధర్మకీర్తికి సమకాలీనుడు. అతడు యేడవ శతాబ్దమువాడు. తద్ద్వారా శంకరుడు యేడవ శతాబ్దమునకు ముందువాడు కూడ కాడని తేలినది. శంకరకుమారి లురు సమకాలికులనుటకు ''దిగ్విజయమె'' మనకు సాక్షి. కాని వారివారి గ్రంథములను బట్టి చూచిన యిందుకు దగిన యథార్థమగు ఆధారము దొరకుటలేదు. ''హుయాన్ సాంగ్ '' కు ముందు చెప్పుకొన దగిన ప్రబల బౌద్ధవిరోధియగు పండితుడున్నట్టు కానరాదు. ఉండియున్నచో 'హుయాన్ సాంగ్ '' అవశ్యమతనిగూర్చి వర్ణించియె యుండును. శంకరుడు దాక్షిణాత్యుడు కాబట్టి ఆతని కార్యరంగము దక్షిణభారతమౌటబట్టి బహుశా ఆ ఉపద్రవము దక్షిణమునందలి బౌద్ధులకు మూడియుండినదేమో? అట్లైనను నిష్కర్షగ చెప్పను వీలులేదు. కంచి కావేరీ పట్టణములందు నివసించుచు బౌద్ధపాలీ గ్రంథములను రచించిన ఆచార్యుడు ధర్మపాలుడు మున్నగువారు ఆఱవ శతాబ్దములోని వారు. వారి గ్రంథము లీనాడును సింహలాదిదేశములందు సురక్షితములై యున్నవి. శంకరుని జన్మభూమి యగు కేరళము సింహళమునకు సన్నిహితము. మహావంశ మను గ్రంథము సింహళదేశముయొక్క ప్రసిద్ధ ధార్మిక యితిహాసము. అంతటి విషయమె యున్నచో మహావంశము తడవక విడిచిన దనుట అంత సబబైన మాటగాదు. శంకరుని శాస్త్రార్థ ప్రసక్తియందు బౌద్ధచారిత్రకులు మౌనమును ధరించి యుండుట ప్రస్తుతః ఆ ఘటనలే లేవేమో యనుటకు ఆధారము. రామానుజాది చరిత్రములందు భిన్నమతావలంబులను గూర్చి యిట్టి ప్రవర్తనమె యుండుటబట్టి సందేహము మరింత బలపడుచున్నది.

నిజమునకు శంకరాచార్యుడు దక్షిణమున నొక ప్రతిభాశాలి పండితుడను మాట యథార్థము. వారు శారీరక భాష్యమను గ్రంథమును రచించిరి. ఆ భాష్యమొక సరిక్రొత్త పోకడలో రచింపబడి వివిధ దార్శనిక సిద్ధాంతములపై విశిష్టచర్చ జరిపియున్నదనుట నిక్కమెయ్యైనను ఆనాటి దిక్ నాగ ఉద్యోతకర కుమారిల ధర్మకీర్తి ప్రభృతుల యుగమం దదియొక అపురూపముగాదు. ఔత్తరాహులకు దాక్షిణాత్యులతో కొంత రవరవలు గూడ నుండెడివి. దానికి ఋజువు యేడవ శతాబ్దమువాడగు మహాకవి బాణభట్టుడు రచించిన కాదంబరిలోని యొకానొక అంశము. దానియందు బోయ లతోగూడి అడవిలో కాపురము జేయు ద్రవిడ బ్రాహ్మణుని గూర్చి వర్ణింపబడినది. దార్శనికులకు పట్టుగొమ్మైన మధురయందు నివసించువాడును; అద్వితీయ దార్శనికుడును, సర్వశాస్త్రనిష్ణాతుడును నగు వాచస్పతి మిశ్రుడు శంకరునకు కూడ స్ఫురింపని తత్త్వములను వెలికిలాగి శారీరక భాష్యముపై

'భామతీ' టీకను వ్రాయకుండినంతవఱకు పండితబిరుదమున కెంతయు దగిన ఆనాటి ఉత్తరభారత పండితులు శంకరుని ఆచార్యునిగ సమ్మతింపనోపరైరి. నిజము మాట్లాడిన వాచస్పతి మిశ్రుని భుజములపై నెక్కి శంకరు డీనాడింతటి గొప్పవాడ య్యెను. ఉత్తరభారత పండిత మండలియందు వాచస్పతి మిశ్రుడు శంకరుని పక్షమున వకాలతు జేసెను. నాలందలోని ఆచార్య శాంతిరక్షితుడు వాచస్పతికి ఒక శతాబ్దము ముందువాడు. అతడు వ్రాసిన మహాదార్శనిక గ్రంథమగు 'తత్త్వసంగ్రహము' సంస్కృతభాషయందు బరోడాలో ప్రకటితమై లభించుచున్నది. శాంతిరక్షితుడా గ్రంథమున తనకు పూర్వ వర్తులగు యేబదిమంది దార్శనికులను, వారి గ్రంథము లను, వారి సిద్ధాంతములను గూర్చి చర్చించియున్నాడు. వాచస్పతికిముందే శంకరుని పాండిత్య గౌరవము లోకమున సుప్రసిద్ధమై యున్నచో శాంతి రక్షితుడు ఆ ప్రసక్తి నెత్తకుండుటకు కారణమేమియు లేదు.

. శంకరుడు బౌద్ధులను గాలించి గాలించి భారతమునుండి తఱుమగొట్టెనని ఒక వైపు వినవచ్చుచుండ ఆతని తర్వాత గౌడ (బీహర్ - బెంగాల్) దేశమునందు పాలవంశీయ బౌద్ధనరపతుల ప్రచండ ప్రతాపవిస్తారమును వేరొకవైపునుండి వినుచు న్నాము. అదే సమయమున గణ్యమాన్యములగు బౌద్ధవిశ్వవిద్యాలయములు ఉదంతపురీ, విక్రమశిలలయందు నెలకొల్పబడుటను చరిత్ర వ్రేలు జూపి చెప్పుచు న్నది. అంతేగాక భారతీయ బౌద్ధులు టిబెట్టు ప్రాంతములందు కొట్టి కోలాహలముగ ధర్మవిజయ దుందుభిని ఉద్భటముగ మ్రోగించుట ఆనాడు జరిగిన సంఘటనలు. కపోలగాథల ననుసరించి భారతమున బౌద్ధు డెవ్వడును మచ్చుకుగూడ లభింప బోలని సమయమున, అనగా పదునొకండవ శతాబ్దమున టిబెట్టునుండి యెందఱెం దఱో బౌద్ధులీదేశమునకు వచ్చిరి. ఎల్లెడల బౌద్ధగృహస్థుల తోడను బౌద్ధభిక్షువుల తోడను కలిసికొనిరి. మరియు పాలరాజుల కాలమందలి బుద్ధుని యుక్కయు బోధిసత్త్వులయొక్కయు తాంత్రిక దేవీదేవతలయొక్కయు వేలకొలది ప్రతిమలు ఉత్తరభారతములో పల్లె పల్లెలయందును భిన్న భిన్న రూపములతో నేటికిని మనకు కానవచ్చుచున్నవి. మగధమునందు మరిమించు గయాజిల్లాయందు ఆ కాలమునాటి మూర్తి ప్రతిమలు లభింపని పల్లె యేయొక్కటైనను ఉండునో లేదో! (గయా జిల్లా యందు జహానాబాద్ సబ్ డివిజనుకు చెందిన కొన్ని గ్రామములలో ఆ విగ్రహములు కొల్లలుకొల్లలుగ నున్నవి. కేస్పా - ఘేంజన్ మున్నగు గ్రామములందు 'బుద్ధ - తారా - అవలోకితేశ్వరా'ది ప్రతిమలు ఆనాటి లిపిలో 'యేధర్మాహేతు ప్రభవాః' అనెడి శ్లోకాక్షరములు చెక్కబడినవై దొరకుచున్నవి) ఇవన్నియు కలిపి శంకరు

డానాడు బౌద్ధులను సర్వసమూలముగ నూడ్చి వేసినాడను మాటకు పెదవి విఱుచు చున్నను, ఇదేమాట ఉత్తరభారతమున మనకు లభించు తామ్రలేఖల, శిలాశాసనముల మూలమున మఱింత ఋజువగుచున్నది. ముసల్మానుల దండయాత్రవఱకు విహార బంగాళ నరపతులచేత బౌద్ధధర్మమును, బౌద్ధశిల్పమును బహుముఖ భద్రతలతో కాపాడబడుచు వచ్చినది. ఆ రాజులు తమ రాజ్యముయొక్క అంతిమకాలము వఱకు తామ్రశాసనములందు బుద్ధ భగవంతుని ప్రథమ ధర్మోపదేశస్థానమగు, మృగదావ (సారనాథ) మును సూచించుచు రెండు జింకల మధ్యలో చక్రముగల చిహ్నమును పొందుబఱుచుచు వచ్చిరి. గౌడదేశమునకు పశ్చిమమున యముననుండి గండకివఱకు కన్యాకుబ్జరాజ్యమున ప్రభువులును ప్రజాజనములును బౌద్ధధర్మమందు ప్రగాఢమగు అదరబుద్ధిగలవారై యుండిరి. ఈ విషయము జయచంద్రుని తాతయగు గోవింద చంద్రుడు జేతవన విహారమున కొసగిన గ్రామపంచక దానపత్రము వలనను, అతని రాణియగు కుమారదేవి నిర్మించిన సారనాథ మందలి మహాబౌద్ధమందిరము వలనను విదిత మగుచున్నది. గోవిందచంద్రుని మనుమడగు జయచంద్రుని పట్టపురాణి బౌద్ధధర్మమునందు విశేషమగు మక్కువ గలది. ఆమెకొఱకై రచించిన ప్రజ్ఞాపారమితా గ్రంథము నేటికిని నేపాల ప్రభుత్వ గ్రంథాలయమున విద్యమానమై యున్నది.

కాలింజరముయొక్క రాజులసమయమున నిర్మింపబడి మహోబా మున్నగు స్థలము లందు లభ్యములగు సింహనాద - అవలోకితేశ్వర ప్రభృతి సుందర బౌద్ధ ప్రతిమలు, తురకలదాడి వచ్చునంతవఱకును బుందేలఖండమున ప్రచురసంఖ్యతో బౌద్ధులున్నారనుటను నేటికిని ఋజువు చేయుచున్నవి. దక్షిణభారతమున దేవగిరి (దౌలతాబాదు - నిజాం) ప్రాంతములలోని ఎల్లోరా భవ్యగుహా ప్రాసాదములందలి యెన్నో బౌద్ధగుహలును, ప్రతిమలును మలిక కాపూరమునకంటె యించుక పూర్వము నిర్మించినవి. ఈ విషయము నాసికయొక్క పాండవలేనీ గుహలకు కూడ నంటికి సంబంధించును. దీనివలన బౌద్ధధర్మము శంకరునిద్వారా ఉచ్చాటితమైన దనుట కల్పనా మాత్రము, స్వయముగ శంకరుని జన్మభూమియగు కేరళమునందు బౌద్ధుల ప్రసిద్ధ తంత్రగ్రంథము మంజు శ్రీ మూలకల్పము లభించినది. దానిని త్రివేంద్రమునుండి స్వర్గీయ మహామహోపాధ్యాయ గణపతిశాస్త్రిగారు ప్రకటించి నారు. ఈ గ్రంథము దొరుకుటవలన సమస్త భారతము నుండియు బౌద్ధులను వెళ్ళగొట్టుమాట యటుండ కేవలము కేరళము నుండికూడ ఈ ఘటన బహు కాలము వెనుకనె సంభవించినదనుట రూఢియగుచున్నది. ఇతిహాసములోనికి జొఱబడిన పై మిథ్యాధారణను ఖండించుటకు యిట్టి తార్కాణములు యెన్నియేని యివ్వవచ్చును.

కాని మఱొక్క ప్రశ్న మన యెదుట నున్నది. తురకలు బౌద్ధమతము యొక్కయు, బ్రాహ్మణమతముయొక్కయు మందిరములను సమానముగనె విధ్వంసము జేసిరి. వారి వారి పురోహితులను తెగటార్చిరి. అట్టులైన బ్రాహ్మణ సంఘము నిలిచియుండుటకును, బౌద్ధసంఘము నశించుటకును కారణమేమి?

బ్రాహ్మణధర్మమునందు గృహస్థులుకూడ ధర్మమునకు జీవకర్తలై, పట్టుగొమ్మలై సంచాలకులై యుండెడివారు. కాని బౌద్ధధర్మమునందు భిక్షువులపైననె ధర్మప్రచారము యొక్కయు, ధార్మికగ్రంథముల యొక్కయు రక్షణబాధ్యత యుండియుండినది. భిక్షువులు తమ వస్త్రముల మఠముల మూలమున చప్పున గుర్తించుటకు వీలగువారు. అందుచే తురకల రాజశాసనము యొక్క తొలియూపులందే బౌద్ధులు కాలూనుకొనలేక పోయిరి. బ్రాహ్మణులు కొందఱు దురాచారులుగ నుండిరి. గాని అందరును గాదు. బౌద్ధులో జట్టు మొత్తమందఱును వజ్రయానులు. భిక్షువుల గొప్పతనము వారి విద్యాశీల సదాచారములపై గాక మంత్రతంత్రములపై దివ్య శక్తులపై ఆధారపడియుండుటబట్టి తురకల కత్తుల యెదుట నవి విచ్చుమొగ్గలగుసరికి వారి ప్రతిష్ఠకూడ మొదలంట కూలి పోయెను. ప్రజలు కండ్లు దెఱచిరి. చివరకు ఫలశ్రుతి యేమనిన భిక్షువులు భగ్నమైన తమ మఠములను మందిరములను పునరుద్ధరించుంకొనుటకు ప్రజలవలన సహకారమును ద్రవ్యమును పొందజాలక పోయిరి. తురకల దుండగములకు గుఱియై ప్రజలు 'అలో లక్ష్మణా' యని అల్లాడునపుడు, పై సాయనిన అపురూపమై తోచునపుడు ఈ త్రాగుబోతులు దురాచారులు నగు భిక్షువులకు సంచులకొలది ద్రవ్య మెవ్వడీవ్వగలడు? అందుచే తమ భగ్నమందిరములను నిర్మించుకొను తాహతు లేక తమకును నిడ లేక బౌద్ధ భిక్షువులు పలాయనము చిత్తగించిరి. బ్రాహ్మణులందట్టి ప్రసంగము లేదు. విద్యా సదాచారములచే చాలవఱకు గౌరవార్హులై యుండిరి. అందుచే వారు తిరిగి తమ మందిరములను పునర్నిర్మించుటకు సమర్థులైరి. ప్రజలనుండి సహకారమును ద్రవ్యమును వారికి లభించెను.

బనారసు సమీపమున బౌద్ధుల కత్యంత పవిత్ర తీర్థస్థానము ఋషిపతన మృగదావము (సారనాథము). అచ్చట పరిశోధనలవలన కన్యాకుబ్జేశ్వరుడగు గోవిందచంద్రుని రాణియగు కుమారదేవి నిర్మించిన విహారమచ్చటి యన్నిటికంటె చిట్టచివరిది. తురుష్కులు దానిని పడగొట్టిన మీదట వెండియు కట్టుటకు ప్రయత్నములు జరుగలేదు. ఈ పరిస్థితికి విరుద్ధముగ కాశీలోని విశ్వనాథమందిరము మీద మీద నాలుగుమార్లు కట్ట బడినది. అన్నిటికంటె ప్రాచీనమగు మందిరము విశ్వేశ్వర

గంజి వద్ద నేడు మసీదున్నచోట నుండినది. శివరాత్రి కాలములందు ప్రస్తుతమును ప్రజలు ఉదకమర్పించుటకు దానిలోని కరుగుచుందురు. అది శిథిలమైనంత ఈనాడు అది విశ్వేశ్వరుడని చెప్పబడుచోట నిర్మించిరి. దానిని కూలద్రోసిన మీదట జ్ఞానవాపియం దేర్పఱచిరి. భగ్నావశిష్టభాగము నేడును ఔరంగజేబు మసీదునకు ఒకమూల నంటుకొనియున్నది. ఆ మందిరమును ఔరంగజేబు నాశము చేయించెను. పిమ్మట ప్రస్తుతమున్న దేవాలయము తయారైనది. నాలందా ఉదంతపురి జేతవనము మొదలగు బౌద్ధుల పవిత్రస్థలములందు పదిరెండవ శతాబ్దానంతరము క్రొత్త కట్టడ ములు మనకు కాన్పింపవు. లామా తారానాథుని యితిహాసమువలన మనకు తెలిసి పోయిన దేమనిన విహారములు ధ్వస్తమైన పిమ్మట భిక్షువులు టిబెట్టు, నేపాళము మున్నగు ఆ యా దేశములకు పారిపోయిరి. మసల్మానుల వలె బౌద్ధులు హిందువుల కంటె ప్రత్యేక జాతి కాదు. ఒకే యింటియందు బ్రాహ్మణుడును బౌద్ధుడును ఉభయ మతములవారును కలిసి కాపురము చేయువారు. అందువలన తమకు ధర్మాచార్యులు కఱవగుటచే బౌద్ధులు కొందఱు రక్తబంధువులుగనున్న బ్రాహ్మణధర్మల యందును, సాలె దూదేకుల మొదలగు చిన్నచిన్న జాతులు (బౌద్ధులు) భయమున కును ఆశకును లోబడి మసల్మానుల యందును కలసి పోవుటచే ఒకటి రెండు శతాబ్దములలో బౌద్ధధర్మము భారతమునందు అంతర్ధానమై పోయెను.

– రాహుల సాంకృత్యాయన.

ఆయుస్సు 1-43 | వి. పూ. 506 - 463

# శ్రీ బుద్ధ చర్య

## ప్రథమ ఖండము

### జననము - బాల్యము (వి. పూ. 505)

★ మహాపురుషుడు తాను జన్మించుటకు తగిన సమయమును నిశ్చయించెను. పదంపడి ''యే ద్వీపమునందు జనన మొందదగు'' నని స్థలవిచారము చేయుచు, ''బుద్ధపురుషులు'' జంబూద్వీపమునందె జన్మించుచున్నారు. కావున జంబూద్వీపమే అందుకు దగిన స్థలమని నిర్ణయించెను. అవుగాక ''జంబూద్వీపము పదివేల యోజనముల విస్తారము గలది. అందేచోట బుద్ధుడవతరింపవలెనని యిట్లు ప్రదేశమును గూర్చి యోచించుటయందు అతని దృష్టిని మధ్యదేశ మాకర్షించినది. ఆ మధ్య దేశమునకు తూర్పుదిక్కునందు కజంగలమను పురము గలదు. (నేడది బీహారునందు సంథాల్ జిల్లాలోని కంకజోలమను పేర ప్రసిద్ధము) దానికి పైన మహావిశాలమగు సాలవనము గలదు. అచ్చటికి అది పూర్వదిశయందలి పొలిమేర. మధ్యమందు సలిలవతి యను నది గలదు. (అది ప్రస్తుతము హజారీబాగు, మేదినీపుర జిల్లాలందలి సిల ఈ నది) సేతుకణ్ణిక యను గ్రామము (హజారీబాగు జిల్లా)

---

★ జాతకనిదాన కథ.

దక్షిణదిక్కు నందలియెల్ల, పడమటి దిక్కునందు థూనమను పేరుగల (కర్నూలు జిల్లా థానేసరము) బ్రాహ్మణాగ్రహారము కలది. అది అచ్చటి సీమాంతదేశము. ఉత్తరమునందలి ఉశీరధ్వజ మను (హిమాలయసంబంధ) పర్వత మావైపున సరిహద్దు. ఇట్లు మూడునూర్ల యోజనముల పొడవును, రెండువందల యేబది యోజనముల వెడల్పును, తొమ్మిది నూర్ల యోజనముల చుట్టుకొలతయు కలిగి మధ్యదేశము విరాజిల్లుచున్నది. బుద్ధులు, ప్రత్యేక బుద్ధులు, అగ్రశ్రావకులును (ప్రధాన శిష్యులు) యెనుబండ్రు మహాశ్రావకులును, చక్రవర్తులును, మహాప్రతాపులగు సత్క్షత్రియులును సద్బ్రాహ్మణులును సద్వైశ్యులును ఈ ప్రదేశమునందే జన్మించుచున్నారు. ఈ దేశమందలి కపిలవస్తు నగరము (తిలౌరాకోటకు రెండుమైళ్ళ ఉత్తరమున) నేను పుట్టుటకు యోగ్యమై యున్నదని నిశ్చయించెను. తదనంతరము తన కనువగు కులమును గూర్చి యోచించుచు ''బుద్ధుడు వైశ్యకులమందు గాని శూద్రకులమందు గాని ఉత్పన్నముగాడు. పూజ్యమగు బ్రాహ్మణ క్షత్రియ కులముల రెంటనే జన్మించును. ఈ నాడు క్షత్రియకులము మఱింత లోకమాన్యమై యున్నది. దానియందే నేను జనన మొందెదను.'' అని యిట్లు తలంచుచు తల్లి విషయమై విచారింప దొడగెను. 'బుద్ధపురుషుల తల్లి చంచలమైనదిగను, మద్యమాంస సేవిగను నుండరాదు. లక్షలకొలది కల్పముల నుండియు జన్మములనుండియు దానాదికములగు పదిపారమితానియమముల ననుష్ఠించుచు వచ్చునదిగను, పుట్టుకనుండియు పంచశీలములను పరిపాలించునదిగను నుండదగి యున్నది. అట్టి పుణ్యసాధ్వి కేవల మా శుద్ధోదనుని ధర్మపత్ని మహామాయాదేవియె యనుట నిక్కము. ఆమెయే నాకు తల్లికాగలదు. ఇప్పటినుండి ఆమె పది నెలలు యేడు దినములు మాత్రము జీవింపగలదు.' అని మహాపురుషుడు తలంచెను.

ఆ తరుణమున కపిలవస్తు నగరమునందు ఆషాఢోత్సవము నిశ్చయింపబడినది. పౌర్ణిమకు యేడు దినముల ముందునుండియు మహామాయాదేవి మద్యపానాదికములగు నిషిద్ధవస్తువులను సేవించుట మాని బంధురమగు గంధమాల్యములచే సుశోభితయై సప్తమ దినమరుదెంచుచుండ తెలతెలవార లేచి నిర్మల జలముల స్నానమాడి నాలుగు లక్షల ద్రవ్యమును దానముజేసి సర్వాలంకృతయై యింపెసగు నోగిరమును మెసవి ఉపోసథమను వ్రతమును నిష్ఠమెయి నంగీకరించి పాలుపారు పడకటింటియందు జొచ్చి శయ్యపై బరుండి నిద్రించెను. ఆ సమయమున నట్టి నిద్రావస్థయందు ఆ సతీతిలక మొక కలగనెను.

బోధిసత్త్వుడు ఒప్పిదమగు తెల్లని యేనుగురూపు దాల్చి పొడగాటి తొండముతో శ్వేతకమల మొండుగైకొని మధురముగ శబ్దము చేయుచు పరుండియున్న తన మంచమునకు మూడుమార్లు ప్రదక్షిణము చేసి కుక్షిని కుడివైపు జీల్చుకొని లోన ప్రవేశించెను. ఇట్లు మాయాదేవికి స్వప్నదర్శనము గలిగినది. ఆ విధమున బోధిసత్త్వుడు ఉత్తరాషాఢా నక్షత్రమునందు గర్భమున ప్రవేశించెను.

తెల్లవారి మేల్కొని రాజపత్ని తనకు కలిగిన కలను రాజునకు తెలిపినది. నరపాలుడును ప్రధానులగు అఱువది నలువురు బ్రాహ్మణులను పిలిపించెను. గోమయముచే నలికించి పేలాలు మొదలగు ధాన్యములచే మంగళాచార మొనర్పబడిన భూమియందు వారికి శుభాసనముల నమర్చి అందు గూర్చుండ నియోగించి తేనె నెయ్యి చక్కెరలచే వండిన పాయసమును వెండి బంగారు పాత్రలయందు వడ్డించి భుజింపజేసెను. మఱియు నూతన వస్త్రముల నిచ్చియు కపిలధేనువుల నొసంగియు వారిని సంతృప్తుల జేసెను. అటుపై వారితో తన భార్యకు కలిగిన స్వప్న ఫలమును గూర్చి పరామర్శ జేసెను. ఆ విప్రులును ''మహారాజా! విచార మావంతయు బని లేదు. నీ పత్నియగు మహా మాయాదేవి గర్భమును ధరించినది. నీకు పురుష శిశువు అవశ్యముదయించును. అతడు యింటి యందె స్థిరుడై నిలిచినచో చక్రవర్తియగుట నిజము. గృహమును త్యజించి సాధువైనచో విశ్వవిఖ్యాత మహాజ్ఞాని బుద్ధుడు కాగలడు'' అని వచించిరి.

తైలపూర్ణమగు పాత్రమువలె పదినెలల నిండువేకటితో మహామాయాదేవి పుట్టింటికి పోవ కుతూహలించి ఒకనాడు పతియగు శుద్ధోదనుని చూచి '' నాథా! నా జన్మస్థలమగు దేవదహ నగరమునకు పోవ నిచ్ఛ పొడమినది. తమ యాజ్ఞ యని పలికెను. రాజును వల్లెయని యొడంబడి కపిలవస్తు పురమునుండి దేవదహనగరము వఱకును మార్గమంతయు చక్కంబఱుపబంచి అందందు అరటిచెట్లును పూర్ణకలశములును మంగళధ్వజములును నిలువ బెట్టించి ప్రియురాలిని బంగారు పల్లకియందు కూర్చుండ జేసి వేయిమంది ప్రధాన కర్మచారులును దాసదాసీ జనము లసంఖ్యముగను తోడ బలసి పోవ నియోగించెను.

ఆ నగరములకు రెంటికిని సంబంధించి తన్మధ్యమున లుంబినీ నామక సాల వన మొకటి గలదు. ఆ సమయమునందలి వృక్షములన్నియు వరుసగ విరియబూసి యుండినవి. పువ్వులయందును కొమ్మలయందును యైదురంగుల తుమ్మెదలును విచిత్ర ప్రకారములగు పక్షి సంఘములును కలనాదముతో గానము చేయుచుండి

నవి. లుంబినీ వనమంతయును చిత్రవిచిత్రమగు వృక్షలతలతో రసికుడగు భూపాలుని పురమును బోలియుండినది. అద్దానిని చూచినంత రాజమహిషికి ఆ వనమునందు విహరింప కౌతుక ముదయించినది. ఆమె కోర్కెవడువున నుద్యోగిజనము లామెను గొంపోయి వనమున ప్రవేసింప జేసిరి. లోన ప్రవేశించి అవధూటి యొకానొక టేకు చెట్టుక్రింద నిలిచి దాని కొమ్మను పట్టుకొనుటకై ప్రయత్నించెను. వెంటనే ఆ సాలశాఖయు చక్కగ జీరిన బెత్తము వలె మెల్లనవంగి ఆమె చేతి దాపునకు వచ్చెను. చేతినిచాపి ఆ కొమ్మను పట్టుకొనినంతనే మాయాదేవికి ప్రసవవేదన దోచినది. చెంగట నుండు జనులు ఆ పడతి చుట్టును తెరను గట్టి యెడమై పోయిరి. ఆసాల శాఖను పట్టుకొని నిలువంబడి యుండగనే గర్భము కదలినది.

బోధిసత్త్వుడు తల్లి కడుపునుండి బయల్వెడలునప్పుడు సామాన్య ప్రాణుల వలె దుర్గంధ మాలిన్యముతో అంటుకొన లేదు. వ్యాసపీఠమునుండి దిగు ధర్మోప దేష్టవలె సోపానములనుండి క్రిందకు వచ్చు మనుష్యుని వలె మెరమెరలాడు రత్నము వలె శోభించుచు బోధిసత్త్వుడు మాతృగర్భమునుండి ఆవంతయు మాలిన్యముతో గూడుకొనక బైటికి చనుదెంచెను.

ఆ శిశువును మహాబ్రహ్మలు సువర్ణ జాలమునందు పట్టుకొని నిలిచిరి. వారి నుండి మహారాజిక దేవతలు నలువురు తాము తీసికొని మెత్తని జింక చర్మముపై నుంచిరి. నురికొందఱు పట్టు గుడ్డయందు జుట్టిరి. అనంతరము వారిచేతులనుండి విడివడి బోధి సత్త్వుడు భూమిపై తూర్పుదిక్కు మొగమై నిలువబడెను. వేలకొలది చక్రవాలములైనను ఒక్క అంజలోనివిగ నతనికి తోచినవి. సురలుకూడ అచ్చటి నరులతో గూడి ఆతని గంధ మాల్యములతో పూజించి '' మహా పురుషా! నీతో సమాను డెవ్వడును యిచ్చట లేడు. ఇక నధికుని మాట యేల? యని పలువిధముల కీర్తించిరి. బోధిసత్త్వుడు దశదిశలను విలోకించి తనకుసాటి తానుగ నే యెఱింగి గంభీరముగ నుత్తరవైపునకు నేడడుగులు వైచెను. అయ్యవసరమున మహాబ్రహ్మలు తెలిగొడుగు పట్టిరి. దైవజ్ఞ బ్రాహ్మణులు వింజామరములు వైచిరి. ఏడవ అడుగుపై నిలిచి ''నేను ప్రపంచమునందు సర్వశ్రేష్ఠుడ'' నని పురుష పుంగవులుచ్చరింప యోగ్య మగు పల్కుపలికి సింహనాదము జేసెను.

లుంబినీ వనమందు బోధిసత్త్వు డుదయించిన సమకాలమందే రాజకుమారి యగు రాహుల మాతయు, సారథియగు ఛందకుడును, మహామంత్రి కాలఉదా యియు, ఉత్తమజాతికి చెందిన గజరాజమును, అశ్వశ్రేష్ఠమగు కంథకమును,

బుద్ధగయ యందలి మహాబోధి అశ్వత్థ వృక్షమును సువర్ణ పూర్ణములగు నాలుగు కలశములును ఉద్భవించినవి. ఉభయ నగరవాసులును శిశువును గైకొని కపిల వస్తుపురమునకు మఱలి పోయిరి.

అంతట శుద్ధోదనమహారాజునకు కులమాన్యుడును అష్టసమాధి సంపన్ను డును నగు కాలుదేవలు డనబడు అసితఋషి బోధిసత్త్వుడుదయించినాడను వార్త దేవతల మూలమున విని కపిలవస్తువునకు బఱతెంచి శుద్ధోదనునిచే సత్కృతుడై ఉచితాసనమున గూర్చుండి "మహారాజా! నీ కుమారుని తెప్పింపుము. చూడగోరు చున్నా" ననెను. నర పాలుడును నై సేసిన కొడుకును దోతెంచి తపస్వి చంద్రుని పాదముల దాకింప దగ్గఱికి కొంపోయెను. కాని బోధిసత్త్వుని చరణ మప్రయత్నమున తాపసుని తలకు తగిలినది. నిజమునకు బోధిసత్త్వునిచే వందనములు గొన నర్హు డెవ్వడు గలడు? అజ్ఞానముచే బోధిసత్త్వుని శిరమును తాపసుని పాదములపై నుంచియె యుండినచో మునీంద్రుని శిరస్సు యేడు బ్రద్దలై యుండెడిది. కావుననే అసిత దేవలుడు కర్జమెఱించి లేచి "యెఱిగి యెఱిగి కొఱవితో తలగోకినొనదగదని" చేతులు జోడించి ఆ దివ్యపురుషునకు నమస్కరించెను. రాజును విస్మయమున మునిగి కొడుకునకు ప్రణమిల్లి నిలిచెను. తపస్వియు బోధిసత్త్వుని లక్షణ సంపదను చూచి బుద్ధుడగునో లేదో యని పరామర్శించి చూచి బుద్ధుడు కాగలడని నిశ్చయిం చెను. అలౌకిక పురుషుని దర్శించినందులకు లోలోన నుప్పొంగెను. మఱియు నంతరంగమున నిట్లు విచారించెను. "బుద్ధత్వమును పొందిన పిదప యీ మహాత్ముని నేను చూడగల్గుదునో లేదో" అని విత్కరించి ఆత్మదృష్టి పరికించి "బాపురే! నిక్కము చూడజాలను. అట్టి సౌభాగ్యమునకు నోచని నా బ్రతుకు ధిక్కార యోగ్య" మని దలంచి గొల్లున వాపోదొడంగెను. పరిసరవర్తులగు జనులదిగని అచ్చెరువుతో "స్వామీ! మా ఆర్యపుత్రునకు అశుభమేదైన వాటిల్ల నున్నదా?" అని అడిగిరి.

"వీని కెట్టి సంకటమును గల్గదు. వాస్తవముగ బుద్ధుడు కాగలడు."

"అయినచో తామెందుకు వగచుచున్నారు?"

"బుద్ధుడైన పిదప నీ మహాపురుషుని కాంచనోపని నా మందభాగ్యమును గూర్చి చింతించుచున్నాను."

అని పలికి ఆ ముని తన బంధు సంబంధుల యందెవ్వడైనను బుద్ధత్వ ప్రాప్తికి పిదప నిమ్మహాత్ముని చూడగల్గువాడు గలడా? యని యోచించి తన మేనల్లుడగు నాడకుని నట్టివానిగ గ్రహించి చెల్లెలి యింటికి బోయి యామెతో నిట్లనియె.

''నీ కుమారుడు నాడకు డెచ్చట?''

''అయ్యా! ఇంటిలో నున్నాడు.''

''వానిని పిలువుము.''

సమీపించిన మేనల్లుని జూచి 'నాయనా! మహారాజగు శుద్ధోదనునకు పుత్రుడుద యించినాడు. ఆ శిశువు బుద్ధజాతికి చెందన మొలక. ముప్పదియైదేండ్లకుపైనతడు పూర్ణజ్ఞాని - బుద్ధుడు కాగలడు. నేడే నీవు పరివ్రాజకుడవు గమ్ము. అతనితో మీదట కలిసికొనగలవు.'' అని వచించెను.

నాడకుడును స్వగతమున ''యెనుబదియేడుకోట్ల మహాధనవంతుడనగు నన్ను వంచించుటకై మా మామగారీమాటను చెప్పి యుండరు. వారు నా యెడ హితమును కోరువారె'' యని నిశ్చయించి తక్షణమే తలను గడ్డమును గొఱిగించుకొని కావి బట్టలను దాల్చి బోధిసత్త్వుడున్న వైపునకు దోసిలొగ్గి నిలిచి ఆ లోకోత్తర పురుషుని యాన 'నేను సంన్యసించుచున్నా' నని పల్కుచు అంగపంచకముతో వందనముజేసి మట్టిపాత్రను జోలె యందునిచి జోలెను భుజమునకు తగిల్చికొని హిమాచలమున ప్రవేశించి శ్రమణ (భిక్షు) ధర్మమును పాలింపదొడగెను. కాలము గడచి సిద్ధార్థుడు బుద్ధుడైన పిదప నాతని చెంగట జేరి విశ్రుతమగు ''నాడకజ్ఞానము'' ను విని అర్హత పదవిని ప్రాపించెను.

పసిబిడ్డనికి అయిదవరోజున తలకు జలక మాడించి నామకరణము చేయుటకై రాజభవనమును చతుర్విధగంధములతో పూయించి పేలాలతో గూడ చతుర్విధ పుష్పములను వెదజల్లి పాయసమును వండించి మూడు వేదములందును నిష్ణాతులైన నూటయెనిమిదిమంది బ్రాహ్మణుల నాహ్వానించి రాజభవనమందు మృష్టాన్నమారగింప జేసి మిక్కిలి గారవించి 'కుమారుని భవిష్యత్ ఫలమెట్టిది' ని మహారాజు జ్యోతిషమడిగించెను. లక్షణజ్ఞులగు బ్రాహ్మణు లాసభయందు రామ, ధ్వజ, మంత్రి, లక్ష్మణ, కౌండిన్య, భోజ, సుయామ, సుదత్తులను వారెనిమిదిమంది గలరు. తొలుత గర్భధారణ సమయమందు స్వప్నశకునమును వీరే చెప్పియుండిరి. ఆ యెనిమిది మంది యందు యేడువురు రెండు వ్రేళ్ళనెత్తి చూపించి ఉభయ సందిగ్ధముగ భావి ఫలము నిట్లు జెప్పిరి. ''ఇట్టి లక్షణవంతుడు గృహస్థుడుగ నున్నచో మహారాజు చక్రవర్తిగ నుండగలడు. సన్న్యాసమును గ్రహించినచో బుద్ధుడు కాగలడు'' అంతట వారిలో చిన్నవాడగు కౌండిన్యుడను బ్రాహ్మణుడు శిశువుయొక్క లక్షణ విశేషము

లను గమనించి ఒక్క వ్రేలి నెత్తిచూపి, "మహారాజా! ఇతడు గృహమందుండు ననుట కెట్టి ఆధారమును లేదు. అక్షరాల యితడవశ్యము బుద్ధుడే కాగలడని విస్పష్టముగ తెగజెప్పెను.

మొదటి యేడ్గురు బ్రాహ్మణులును అయువు ముగియుటచే పరలోకమునకు జనిరి. కేవలమొక కౌండిన్యుడు జీవితుడై యుండెను. ఆతడును బోధిసత్త్వుని యందె చిత్తమును సంలగ్నము జేసి యిల్లు వదలి క్రమముగ "ఉరువేల" మను ప్రదేశమును జేరి ఆ చోటు యోగార్థులగు కులీన సాధకులకు యోగమునకు యోగ్యమైన తావగు టచే అందె నివసించెను. కొంత కాలమునకు మహా పురుషుడు సంన్యసించెనని తెలిసికొని వెనుక తనతోడివారై గతించిన యేడ్వురు బ్రాహ్మణులయొక్క కుమారుల వద్దకుజని "నాయనలారా! సిద్ధార్థ కుమారుడు ప్రవ్రజితుడైనాడు. నిక్కముగ నతడు బుద్ధుడు కాగలడు. మీ తండ్రులే నేడు బ్రదికి యుండినచో వారును గృహముల త్యజించి పరివ్రాజకులై ఆయన ననుసరించియుందురు. కాబట్టి మీకు సమ్మతమైనచో నా వెంట రండు. సంన్యసించి ఆతని వెన్నంటుదము." అని ప్రబోధించెను. కాని వారియందు ముప్వు రతని మాటకు నొడబడ లేదు. తక్కిన నల్వురతో గూడి తానగ్రసరుడై కౌండిన్య బ్రాహ్మణుడు సంన్యాసమును గైకొనెను. ఈ ఐదుగురే మున్ముందు పంచవర్గీయ స్థవిరులన ప్రసిద్ధులైరి.

పుత్రలాభముచే తన మనోరథము సిద్ధించుట బట్టి కుమారునకు సిద్ధార్థుడని శుద్ధోదనుడు పేరిడెను. ఆ మహా పురుషుని కనిన తల్లియొక్క శరీరము చైత్యగర్భము వలె పరులుపభోగించుటకు సుతరాం నిషిద్ధము కావున కాబోలు సిద్ధార్థుడు జన్మిం చిన యేడవ దినమే తల్లి మాయాదేవి దేహమెడబాసి తుషిత లోకమున కరిగినది. శిశుపోషణభారమును సవతితల్లియగు మహాప్రజాపతీ గౌతమీదేవియే వహించెను. బాలుడును సర్వోత్కృష్టమగు శోభాలక్ష్మితో గూడి వర్ధిల్ల దొడగెను.

ఒకానొక దినమున బీజావాపనోత్సవము (విత్తనము వేయుట) రాజగృహ మున సమ్మానిత మగుచున్నది. ప్రజలెల్లఱును దేవ విమానమువలె నగరమునంతను అలంకరించిరి. కర్మచారులును సేవకులును యావత్తు పరిచారక బృందమును నూతనాంబ రముల ధరించి గంధ మాల్యాదికముల చేత నలంకృతులై రాజనగరి యందు సమావేశమైరి. శాక్యరాజుల పూర్వాచార పద్ధతి ననుసరించి శుద్ధోదన మహారాజు పౌరులతో గూడి భూములవద్దకు బోయెను. ఆనాడు రాజుగారి పొలము లయందు యేడువందల తొంబది మడకలు దున్నుచున్నవి. రాజునకై నిర్ణీతమైన

హలము రత్నసువర్ణ సంజటితమై యున్నది. ఎద్దుల గిట్టలును కొమ్ములును బంగారుచే పొదుగబడినవి. రాజుగారు కుమారుని కూడ వెంటగొని పోయి యుండెను.

పొలముల చెంగటనే దట్టమై చిక్కని నీడగల నేరేడు చెట్టొకటి గలదు. దాని క్రింద బంగారు జరీగల్గిన మేలుకట్లు కట్టించి చుట్టును తెర నేర్పఱిచి కుమారుని అందుంచి రాజతిలకుడు దున్నుచోటికి బోయెను. అచ్చట అతడు పసిడి నాగేటి నొండు కేలబట్టి ముందునకు సాగగా ఆయన ననుసరించి మంత్రులందఱును మిగత యేడువందల తొంబది తొమ్మిదింటిని వెంట సాగించిరి. భూపాలుడును ఆ వైపునకు నీ వైపునకు నటు నిటు దిరుగుచుండుట వినోదముగ ప్రజలందఱును మూగి చూచుచుండిరి. సిద్ధార్థకుమారుని వద్దనున్న దాదులుకూడ అందలి వినోదమును చూచుటకై బైటికి వచ్చిరి. తన చుట్టును యెవ్వరును లేకపోవుట జూచి బోధిసత్త్వుడు తటాలున లేచి కూర్చొని శ్వాసప్రశ్వాసలను బంధించి ధ్యాన సమాధియందు మొదటి మాఱు నిబద్ధుడయ్యెను. దాదులుగూడ ఖాద్యభోజ్యములందు కొంతవిలంబము చేసిరి. ప్రొద్దుతిరుగుటచే చెట్లనీడలన్నియును తూర్పునకు పొడవుగ సాగినవి. కాని బోధిసత్త్వుడు - సిద్ధార్థుడు నివసించు వృక్షచ్ఛాయ మాత్రము గొడుగువలె గుండ్ర ముగనె నున్నది. ఆర్యపుత్రు డొంటరిగ నున్నాడనుటను స్మరణకు తెచ్చుకొని లోనికి ప్రవేశించి దాదులు శయ్యపై ధ్యాన ముద్రాస్థితిలో కూర్చొని యుండు కుమారుని గాంచిరి. ఆ చమత్కారమును గాంచి సంభ్రమాశ్చర్యములు పెనగొన నరపతికడ కరుదెంచి, కుమారుడున్నస్థితియు, నతడుండు వృక్షముయొక్క నీడ తక్కిన చెట్లనీడలకు విపరీతముగ, గోలాకారముగ నుండుటయు నివేదించిరి. రాజును వడివడి జనుదెంది చూచి అబ్బురపడి రెండవతూరి కొడుకునకు నమస్కరించెను.

## యౌవనము - సంన్యాసము - (వి. పూ. 474)

★ కాలక్రమమున సిద్ధార్థుడు పదునాఱేండ్ల యీడువాడయ్యెను. తండ్రియు కుమారునకు ఋతువులు మూడింటికిని అనుయోగ్యముగ మూడు ప్రమోద భవనములను నిర్మింపజేసెను. అవి వరుసగ అయిదును యేడును తొమ్మిదియు నంతస్తులు గలవి. అందు నలువది నాలుగువేల ఆటకత్తెలను నియమించెను. అప్స రసలతో గూడిన దేవపతిని బోలి సిద్ధార్థుడు అలంకృతలగు నటీజనముతో వేష్టితుడై వారి యాట పాటల నుపభోగించుచు రాహులమాత యశోధర తనకు పట్టపురాణిగ ఆ యా ఋతువుల కనుకూలమగు మందిరములందు విహరించుచుండెను.

---

★ జాతక అట్ఠ కథ

ఇట్లు మహోపభోగముల నోలలాడు సిద్ధార్థుని గూర్చి సాటిబంధు బాంధవులందొక అపోహ చిట్లినది. ''సిద్ధార్థుడు విషయలోలుడు. విద్యాబుద్ధు లతనికి నేర్పినది లేదు. యుద్ధకలను కలలో గూడ నెఱుగడు. క్షత్రియుడగు వాడిట్లుండ దగునే'' యని కింవదంతి ప్రబలుట విని తండ్రి సుతుని చెంతకు బోయి ''పుత్రా! మనవారందఱును నిన్ను విద్యాహీనునిగను శిల్పకళారహితునిగను కేవల భోగలంపటునిగను తలపోయుచున్నారు. ఇందు నీ అభిప్రాయ మే''మని యడిగెను.

''తండ్రీ! నేను విద్యల నేర్వబని లేదు. వలయుచో నేటికి యేడవ దినమున నా హస్త విద్యా కౌశలముయొక్క బహిరంగ ప్రదర్శనము జరుగునట్లు దండోరా వేయింపుము.

రాజును అట్లె చేయించెను. పౌరులు ప్రేక్షక స్థానమున క్రిక్కిఱిసి యున్నారు. అక్షణవేధ బాలవేధ నెఱింగిన విలుకాండ్రు పలువురు ప్రోవై యున్నారు. సిద్ధార్థ కుమారుడు తన్ను చుట్టు కొనియున్న ధనుర్విద్యాకోవిదు లెఱింగినంతంటె పదిరెండు శిల్పకళల నధికముగ జూపించి తనవారిని పెఱవారిని కూడ సంతసింప జేసెను.

ఒక దినమున బోధిసత్త్వుడు ఉద్యానవనమును జూచునిచ్ఛతో సారథిని రథము బూన్పుమని ఆనతిచ్చెను. ఆతడును చిత్తమని దివ్యసుందర రథమును చక్కగ నలంకరించి మంగళకరమగు తెల్లని గుఱ్ఱముల నాల్గింటి బూన్చి రాజసుతునకు యెఱుకపరచెను. అతండును దేవవిమాన తుల్యమగు రథముపై నెక్కి వన విహారమునకు దరలెను. సమయమును ప్రతీక్షించు దేవత లానాడిట్లు తలంచిరి. సిద్ధార్థ కుమారునకు బుద్ధత్వ ప్రాప్తికి తరుణము సమీపించు చున్నది. అందుకు పూర్వనిమిత్తములుగ కొన్ని శకున దృశ్యములను చూపించవలెనని యెన్ని అందుకు తగు సన్నివేశమును సృష్టించిరి. దేవపుత్రు డొకడు శత వృద్ధుడై తొఱ్ఱినోటితో నరసిన వెంట్రుకలతో ముడుతలు బాఱిన శరీరముతో చేతికట్టె నూతగగొని వడ వడ వడంకుచు నున్నట్లు యెదుట గానబడెను.సిద్ధార్థుడు వానిని జూచి ''సారథీ! ఇతడెవడు? ఇతని వెంట్రుకలు తక్కినవారివివలె లేవేమి?'' అని పృచ్ఛించెను. రథచోదకుడును ఉద్విగ్నుడై''ఛీ ఛీ జన్మమె రోత. పుట్టిన వారికెల్లను యీపాడు ముసలితనము తప్పుట లేదు గదా?'' అని బదులు చెప్పి రథమును మళ్లించుకొని పోయెను. సత్వరముగ మఱలి వచ్చుటగాంచి రాజగు శుద్ధోదనుడు అందు ఘటించిన ముసలివాని కథను తెలిసికొని పుట్టిమునిగెనని బెగడొంది ఆటపాటల నేర్పఱచి కుమారుడటపై

యింటినుండి వెలుపల బోకుండునట్లు అనుచరుల కాజ్ఞ యొసంగి నాల్గు వైపులను నర్ధయోజనదూరమంతవఱకు కాపలానునిచెను.

మఱొక్క దినమున బోధిసత్త్వుడు తొల్లింటి కైవడి ఉపవనవిహారమున కరుగుచు దేవకల్పితమగు రోగగ్రస్త పురుషుని చూచి సారథిని మునుపటియట్లు యడిగి శోకవ్యాకులిత చిత్తుడై తన భవనమును చేరెను. రాజది విని మఱింత సత్కరుడై మూడు గవ్యూతుల నేల పొడవున కావలియుంచెను.

వేఱొక దినమున రాజపుత్రుడు వెనుకటి కథవలెనే వాహ్యాళి వెడలుచు దేవతార చితముగు మృతకళేబరమును జూచి సారథివలన విషయమెఱింగి ఉద్విగ్న హృదయుడై నిజ నికేతనమున కరుదెంచెను. తండ్రియు మరింత వ్యాకులుడై యోజన విస్తారము గస్తీ నునిచెను.

వెండియు నొకదినమున నుద్యానమున కరుగుచు బోధిసత్త్వుడు దేవమాయా నిర్మితుడైన కావిదాలుపును సంన్యాసి నొకని గాంచి సారథితో ''సౌమ్యా! యితడెవరు?'' అని యడిగెను. సారథియు దేవమాయా మోహితుడుగాన ''రాజపుత్రా! ఇతడు సంన్యాస దీక్షితుడు, పరివ్రాజకు''డని తద్విషయమును పెంచి వర్ణించెను. దానిని విన్నంతన సిద్ధార్థకుమారునకు సంన్యసించుట యందు మనసు పొడమి తదభిరుచితో యెప్పటివలె వెనుదిరుగక ఉద్యానవనమును చేరుకొనెను. ఈ ప్రసంగమున దీర్ఘబాణకులు ( దీర్ఘనికాయ ప్రవర్తకులగు ఆచార్యులు) శకునముల నాలిగింటిని ఒకేదినమున కాంచెనని చెప్పుదురు.

శుద్ధోదనుని ముద్దులకొడుకు ఆనాడా ఆరామమున స్వేచ్ఛ మెయి విహారము జేయుచు లలిమించు కొలనునందు మునిగి లేచి దువ్వలువలు ధరించి ఖరకిరణుడు చరమగిరి చేరు నా తరుణమున విశాల సుందర శిలాపట్టముపై నెమ్మదిగ గూర్చొనెను. పరిచారకులు విధ విధ వర్ణములగు శాలువలును, బహురూపములగు విభూషణములు మాల్యములు గ్రంథములు ఉద్వర్తనములును గొని అతని నలంకరింప చుట్టును నిలువబడిరి. ఆసమయమున దేవపతి సింహాసనము అస్తవ్యస్తమైనది. దేవేంద్రుడును సింహాసన భ్రష్టత తనకు సిద్ధించుచున్నదా యని జలికి కొంతవడి యోచించి బోధిసత్త్వుని కై సేయు సమయముగ నెఱింగి విశ్వకర్మను బిలిపించి-

''సౌమ్యా! విశ్వకర్మా! సిద్ధార్థ కుమారుడు నేడు అర్ధరాత్రి సమయమునందు మహాభి నిష్క్రమణము ( గృహత్యాగము) చేయగలడు. ఈ నాటి అలంకార

మతనికి చివరిది. నీవాతోటకు వెళ్ళి ఆ మహాపురుషుని దివ్యాలంకృతునిగ జేయు'' మనెను.

విశ్వకర్మయు నామెయి దేవసహజశక్తివలన ఉత్తరక్షణముననె దిగివచ్చి సిద్ధార్థుని చేతినుండి తలకు ధరించు దుకూలమును తాను గైకొనెను. హస్తస్పర్శతోనే యితడు మానవుడు గాడనియు దేవపుత్రుడై యుండుననియు శాక్యరాజ కుమారుడు గ్రహించెను. అంతట దేవశిల్పి సిద్ధార్థుని అమానుషాలంకృతునిగ జేసి యథేచ్ఛం జనియెను.

ఇట్లాయా భూషణముల నలంకృతుడై బ్రాహ్మణోత్తముల ఆశీర్వాదముల సందడితో వేత్రహస్తుల సాహోనినాదములతో వందిమాగధుల జయజయ ధ్వాన ములతో భూనాథ కుమారుడు నిజరథమునెక్కి నగరాభిముఖుడయ్యెను.

అట్టియెడ యశోధర ( రాహులమాత – గోపా – మృగ్యా – ఉత్పలవర్ణ) కుమారుని గన్నది. శుద్ధోదను డాశుభవార్తను కుమారునకు తెలియబుత్తెంచెను. పుత్రుడు జనించెనను పలుకు వినినంతనె సిద్ధార్థుని నోటినుండి 'రాహువు పుట్టెను – బంధము కల్గినది' అను మాట అవశముగ జాఱినది. భటునివలన కుమారుడనిన మాటను తెలిసికొని మహీపాలుడు తన మనుమనికి రాహులకుమారుడని పేరు పెట్టెను.

సిద్ధార్థుడిట్లనుపమ రథము నధిరోహించి కీర్తి ప్రతాప శోభాసౌభాగ్యములు దిక్కుల పిక్కటిల్ల పట్టణమును ప్రవేశించెను. ఆ సమయమున తన యింటిపై కూర్చొనియుండిన క్షత్రియకన్య కృశాగౌతమి నాబరగునది నగరమును చుట్టుకొని పోవుచున్న రాజకుమారుని మోహనరూప లావణ్యములకు ముగ్ధముగ్ధయై కుతుక ముప్పొంగ నిట్లనియె.

> ఇతని గన్నతల్లి యింపొందు శాంతయై జనకుడట్లె పరమ శాంతుడగును,
> భర్తగాగ నితని బడసినకాంతయు పరమ శాంతయనుట కరము నిజము॥

బోధిసత్త్వు డామాట నాలించి తనలో యిట్లని విచారించెను. నన్ను గన్న జననీజనకుల హృదయములు, పత్నీ హృదయమును పరమ శాంతిని బడయుచు న్నవని యీ పడతి పలుకుచున్నది. హృదయమునకు పరమ శాంతము చేకూఱవలెన న్న మొదట నేవి శాంతించవలెను? రాగద్వేషాది మలరహితమై విరక్తమగు హృదయమె పరమశాంతికి ఆకరము. రాగమను అగ్ని శాంతించినచో ద్వేషమను అగ్నియు చల్లా

ఱును. క్రమముగ మోహరూపాగ్నియు అభిమానరూపాగ్నియు నుపశమించగలవు. అభిమానాదికములగు మలములన్నియు నుపశాంతిని పొందినపుడే మనుష్యునకు పరమశాంతి లభించగలదు. ఈ కన్యక అన్యోక్తిగ నాకు ఉపశ్రుతి రూపమున హిత మును గఱపుచున్నది. నిర్వాణమార్గ మున పయనింపనెంచు నాకు యీమె మఱింత ప్రోత్సాహము నొసగుచున్నది. నేడే గృహమును వదలి నేను ప్రవ్రజితుడను కావలెను. మంచిదని తన మెడలోని లక్షమూల్యమగు ముత్యాలహారమును గురుదక్షిణ రూప మున కృశాగౌతమికి నుపహారమంపెను. ఆ సుందరియు తనయందనురక్తుడై సిద్ధార్థ కుమారుడు వలపుకానుక నంపినాడని యెంచి సంతసించినది.

## (సిద్ధార్థుడు)

బోధిసత్త్వుడు నిజ గృహమున కరిగి సుశోభితమగు శయ్యపై బరుండెను. అట్టియెడ వివిధాలంకార శోభితలు నృత్యగీతములందు కుశలురు దేవకన్యా సమానులగు రమణీమణులు నానావాద్యములను గొని రాజపుత్రుని రంజింపజేయ ఆటలు పాటలు సాగించిరి. కాని రాగాది మలనిర్ముక్తుడై విరక్త చిత్తుడగు సిద్ధార్థుడా వినోదములను కన్నెత్తి యైన చూడక నెమ్మదిగ కొంతవడికి నిద్రించెను. మన పరిశ్రమమంతయు నితని కొఱకె గదా? ఇతడు నిద్రించిన పిదప మనకీ వృథాప్రయాస మేల యని యా సుందరీ బృందము తమ తమ వాద్యముల తోడనె యెక్కడి వారక్కడ నిద్రించిరి. కొంతవడికి రాజపుత్రుడు మేల్కొని తన పాన్పుపై దృఢాసనాసీనుడై కలయ పరికించెను. సుగంధతైల పూర్ణములై దీపములు కలకల నవ్వుచున్నవి. పాద్యముల నట్టెపట్టుకొని కొందఱును, నోటజొల్లుగాఱ పండ్లు కొఱుకు కొనుచు కొందఱును, మైమఱచి గుఱ్ఱుపెట్టువారై కొందఱును, ఘృణోత్పాదకముగ గుహ్యాంగములపై వస్త్రములు దొలగ మొద్దునిద్దురపోవు కొందఱునై యుండు లలనా సమూహమును తెల్లని వెలుగున నఱచేతియందుంబోలె విస్పష్టముగ గాంచి కామభోగములందు మఱింత విరక్తుడయ్యెను. దేవేంద్ర భవనమువలె నుండు ఆ యిల్లతని కండ్లకప్పుడు ముఱిగిన పీనుగులు నిండారనుండు మహా శ్మశానమువలె దోచినది. 'కటకటా' యని 'హా' యని వేదనాభరితమగు నిట్టూర్పులతో పరివ్రజనమునకై మిగుల నాతురు డయ్యెను. మహాభినిష్క్రమణము (గృహత్యాగము) న కిప్పుడె ముహూర్తమని, వెనుకముందు చూడక మంచమునుండి దిగి ద్వారము కడకు వచ్చి "యెవ్వడచ్చట" నని యడిగెను.

వాకిలి గడపపై తలనుంచి నిద్రించు ఛన్నుడు మేల్కని ''ఆర్యపుత్రా! నేను ఛందకుడ నిందున్నా'' ననెను.

సౌమ్యా! ఈనాటి నా మహాభినిష్క్రమణమునకై గుఱ్ఱము నాయత్తపఱుపుము పొమ్మని భూపాలతనయు డాదేశించెను.

చిత్తము సెలవని పలికి ఛందకుడును వలయు సామానులతో గుఱ్ఱపుసాల జొచ్చి దీప ప్రకాశమునందు పూజలు వెట్టి యల్లిన మేలు కట్టుక్రింద నిలబడియుండు అశ్వరాజమగు కంథకమును చూచి యదియె దగినదని దానినె సిద్ధపఱచెను. కంథకమును తనలో ''యీ నాటి నా పూన్చిన యలంకారము సరిక్రొత్తగ నున్నది. నిత్యము వలె లేదు. ఆర్యపుత్రుడు మహాభి నిష్క్రమణమునకు నిచ్ఛకుడు గాబోలు'' నని తలంచి ముదిత చిత్తమున కిలికిల సకిలించెను. ఆ మహాశబ్దము పురము నంతయు నిండుజాలునదయ్యు దేవ మాయా ప్రభావమున నేరికిని చెవిని బడదయ్యె.

ఛందకుని గుఱ్ఱముం దేరబంచి సిద్ధార్థుడు నవజాతశిశువగు సుతుని జూచు కోరిక దన సతి నిదురించు శయనగృహమును తలుపు దెఱచి లోనికి పోయెను. ఇల్లంతయును దీపప్రకాశముతో నిర్భరమై యున్నది. యశోధరాదేవి మణుగుల కొలది పూలచే పఱుపబడిన పాన్పునందు పుత్రునితలపై చేయినిడి నిద్రించుచుండినది. గడపవద్ద నుండియే బోధిసత్త్వుడాపరిస్థితిని తిలకించి నెమ్మనమున నిట్లు దల పోసెను. ''శిశువును తీసికొనవలెనన్న అవశ్యమాచేడియ చేతిని దొలగించవలెను. అట్టియెడ నామె మేల్కొనుట నిక్కము. అటపై నాపూన్కి యంతయు నీఱుగా గలదు. నాపయనమున కాటంకమగుటచే బుద్ధుడనై వచ్చి కుమారుని ఆనక కను గొందుగాక'' యని తలంచి హుటాహుటి మేడదిగివచ్చెను. ఈ సందర్భమున పాలీ జాతకముల వ్యాఖ్యానమగు జాతక అట్ఠకథ యొకటి మాత్రము రాహులకుమారుడప్పటికి యేడునాళ్ళ యీడువాడని చెప్పినది. దానికి ఆధారము మఱెచ్చటను కానము.

ఇట్లు క్రిందికి దిగివచ్చి బోధిసత్త్వుడు గుఱ్ఱమును డగ్గఱి ''నాయనా! కంథకమా! నీవు నన్నీ యొక్క రాత్రి తరింపజేయుము. ఈ నీ సహాయతచే దేవతాసమేత యావత్ప్రపంచమును నేను తరింప జేయుదు'' నని వీపునిమిరి యెగిరి కూర్చొనెను. ఆ తురగము మెడ మొదలుకొని తోకవఱకు పదునెనిమిది చేతుల

పొడవుగలది. మచ్చ లేని చంద్రునివలె సర్వాంగధవళమైనది. జవసత్త్వసంపన్నమైది. దానికి సకిలింతయు గిట్టల చప్పుడును పుట భేదనమును బెటిలించునదియైనను కార్యసాధనమున కంతరాయమని దేవతలు తమ మహిమచే మఱుగువడ జేసిరి. తమ చేతుల నడ్డమిడి గిట్టల నేలపై బడనీయరైరి. అది నడిరేయి. సిద్ధార్థుడు వీపు పైనను, ఛన్నుడు తోకను కఱచుకొనియు నుండ కంథకాశ్వము గవని వాకిలి చెంతకు జేరెను.

కుమారుడేవేళ యెప్పుడు పట్టణము వదలి పారిపోవునో యనెడి భీతితో తండ్రి శుద్ధోదనుడు నొక్కొక్క దానిని వేయిమంది మనుష్యులు పట్టినగాని తెఱువ వీలులేని గొప్పవాకిండ్లతో గూడిన మహాద్వారమును నిర్మించి యుంచెను. వేయికోటి యేనుగుల యొక్క లేదా పదివేలకోట్ల మనుజులయొక్క బలముతో యెత్తువచ్చు మహాసత్త్వసంపన్నుడు బోధిసత్త్వు డిట్లు దలంచెను. ''తలుపులు తెఱపిడి పడనిచో అట్లే యుండుగాక. కంథమును దిగకనె పిక్కలతో దీని నదిమిపట్టి తోకను గఱచికొని వ్రేలాడు ఛందకునితో సహా భూమికి పదునెన్మిది చేతుల యెత్తున మహాద్వారమును కుప్పించిదాటెదను.'' ఛందకుడును తనలో నిట్లు తలంచు చున్నాడు. ''ద్వారము తెఱువరానిచో నేను ఆర్య పుత్రుని మూపుపై నెత్తికొని కంథకమును కుడిచంక నదుముకొని గవనికోట నెగిరిపోదునుగాక.'' కంథకము కూడ స్వగతమున ''తలుపులు రానిచో నాస్వామిని వీపుపైననె పెట్టుకొని ఛందకుడు తోకను కఱచుకొని యుండగనె ప్రాకారమును ఒక్కదాటున దాటి పోయెద'' నని తలంచుచుండెను. సమయమె వచ్చినచో మువ్వురును తలంచి నంతకు చాలినవారె గాని దేవతా ప్రభావమున ద్వారము తెఱచుకొన్నది.

ఆ యదనున గౌతముని పరావర్తుని చేయుటకై మారుడు ఆకాశమున నిలిచి ''[1]మార్ష! పోవద్దు సుమీ. నేటికి యేడవ దినము నాడు నీకొఱకై [2]చక్రరత్న ముదయింప నున్నది. రెండువేల ద్వీపఖండములతో గూడిన మహాద్వీపములకు నాల్గింటికి యేలికవు కాగలవు. వెనుకకు మఱలు'' మని పలికెను.

''నీవెవడవు? ''

''నేను వశవర్తిని.'

1. దేవతలు తమ సమానులను మార్ష (మారిస్) యని బిలుతురు.
2. చక్రవర్తికి దిగ్విజయ సాధనమగు ఆయుధము.

''మారా! చక్రరత్న ప్రాదుర్భావము నే నెఱిగినదే. అసలు రాజ్యముతో నాకు బని లేదు. సాహస్రిక లోక [1] ధాతువులు మాఱుమ్రోగునట్లు నేను బుద్ధుడను గావలెను.'

''ఓహో! కాచుకొనుము. ఏనాడైనను నీచిత్తమున కామనా సంబంధమగు – ద్రోహ సంబంధమగు – హింసా సంబంధమగు వితర్కము పొడకరించినచో నిన్నా నాడు మూద లించి హెచ్చరింతును.'' అని పలికి మారుడు నీడవలె వెన్నంటుకొని సమయమును చిక్కించుకొనుటకై వేచియుండెను.

ఇట్లు సిద్ధార్థుడు చేజిక్కిన చక్రవర్తిత్వమును నుమ్మివైచి నిష్కాముడై నగరము నుండి బయల్వెడలెను. కాని ఆ యాషాఢ పూర్ణిమనాడు, ఉత్తరాషాఢ నక్షత్రము నందు వెండియు పురమును చూడ నభిలాష గల్గినది. కల్గినంతనె ''మహాపురుషా! వెనుకకు తరలుట నీకెన్నటికిని వీలుగాదు. అది నీ పనిగా'' దను సూచనయొ యన్నట్లు భూమండలము కుమ్మరిసారెవలె గిఱ్ఱున తిరిగినది. అంతట నతడు గుఱ్ఱమును త్రిప్పి పురివైపు మళ్ళిచూచి, ఆ చోటిని కంథకనివర్తన చైత్యమని నిర్దేశించి గంతవ్యమార్గమువైపు తిరిగి గుఱ్ఱమును ద్రిప్పి పయనము సాగించెను. ఆతనితోడ దివిటీలచేతబూని యెదుట అఱువది వేలును, వెనుక అఱువదివేలును, కుడియెడ మల అఱువది వేలును, మూకలు బలసి దేవతలున్నారు. నాగ గరుడాదులగు కొందఱు దేవతలు దివ్యములగు గంధమాల్యధూప ములగొని పూజించుచున్నారు. జడివానలవలె పారిజాత మందార పుష్ప వర్షములు ఆకసమును ముంచెత్తినవి. దివ్యగానములు రేగినవి. నాల్గుదిక్కులను అఱువది విధములగు అఱువైయెన్మిది లక్షల వాద్యములు పిక్కటిల్లి మ్రోగినవి. ఇట్లు శ్రీ సౌభాగ్యముతో మహాని ష్క్రమితు డైన బోధిసత్త్వుడొక్క రాత్రియందె మూడు [2] రాజ్యములు గడచి ముప్పది యోజనములకుపై 'అనోమా' యనబడు నదీతీరము చేరికొనెను. ఆ నదీతటమున నిలిచి గుఱ్ఱమును మడమతో సైగ జేసెను. అదియు నొక్క దాటున పదునారు చేతుల వెడల్పు గల నదిని యెగిరిదాటి ఆవలిగట్టున చేరి నిలిచినది. బోధిసత్త్వుడును గుఱ్ఱమునుదిగి యొడ్డునందలి తెల్లని మెత్తని యిసుకపై నిలిచి ఛందకునితో యిట్లనియె.

''సౌమ్యా! నా తొడవులను గొని నీవు కంథకముతో వెనుకకు పొమ్ము. నేను ప్రవ్రజితుడ నయ్యెదను.''

---

1. ఒక బ్రహ్మాండమును ఒక లోక ధాతువందురు
2. శాక్య, కోలియ, రామ గ్రామములు.

''దేవా! నేను గూడ ప్రవ్రజిం (సంన్యసిం)చెదను.''

''నీవు ప్రవ్రజ్య (సంన్యాసము) పొందవీలు లేదు. వెనుకకు పొమ్మని'' మూడుమార్లు పలికి సిద్ధార్థకుమారు డతనికి తన ఆభరణముల నొసగి కంథకమును అప్పగించెను. నా యీ వెంట్రుకలు సంన్యాసులకు న్యర్హమైనవిగాదని తలంచి వాటిని ఛేదించుటకు పెఱవాడెవ్వడును యోగ్యుడు కాడు గాన తనంతకు తానె త్రెంచు కొందు ననియు నెంచి కుడిచేత ఖడ్గమును గొని యెడమచేతిలో నుండు చూడామణి సహితమగు శిఖను త్రెంచివైచెను. రెండంగుళముల పొడవున మాత్రము తలయందు మిగిలిన వెంట్రుకలు ప్రదక్షిణ క్రమమున కుడవైపునుండి తిరిగి పెనగొని శిరమున నంటగఱచు కొన్నవి. యావజ్జీవము అవి యట్లనె యుండినవి. గడ్డమును మీసమును అట్లె యేర్పడి తిరిగి మఱెప్పుడును గొరిగించుకోవలసిన పనియె కల్గ లేదు. శిఖను ఛేదించి బోధిసత్త్వుడు దానిని మింటిపై నెగురవైచి ''నేను బుద్ధుడను కాగల్గుచో యీ శిఖ భూమిపై పడక ఆకసముననె నిలుచుగాక'' యనెను. చూడామణియుత మగు ఆ శిఖ ఒక యోజనము దూరమునబోయి గగనముననె నిలిచినది. దేవ రాజగు శక్రుడు దివ్యదృష్టి నా విషయ మెఱింగి యోగ్యమగు రత్నమయ పాత్ర యందు దానినుంచుకొనిపోయి త్రయస్త్రింశ (స్వర్గ) లోకమున చూడామణి చైత్యమును స్థాపించెను.

అంత భిక్షుడగు తనకు కాశీవస్త్రములు యోగ్యములుకాదని బోధిసత్త్వుడు తలంచుచుండెను. వెనుకటి కశ్యప బుద్ధజన్మమున మిత్రుడుగ నుండిన ఘటికార మహాబ్రహ్మ ''నామిత్రు డీనాడు మహాభినిష్క్రమణము చేసినాడు. అతని భిక్షు ధర్మమునకు వలయు పరికరముల గొనిపోదు'' నని భావించి, భిక్షాపాత్రయు, కట్టుబట్టలు మూడును, సూదియు, మంగలికత్తియు, త్రాడును, నీటిని వడియగట్టు గుడ్డయు నిట్లు యెనిమిది వస్తువులను తోడ గొనివచ్చి బోధిసత్త్వున కొసగెను. వాటిని దాల్చి సంన్యాసి వేషమున నిలిచి ఛందకునితో ''ఛందకా! తల్లిదండ్రుల కుశల మడిగినానని చెప్పుము. పో పొమ్మ'' నియెను. వాడును వలగొని నమస్కరించి బయలుదేరెను. ఛందకునితోడ నిలిచి నిలిచి పోవుచు కంథకము స్వామి దర్శనము తనకిక లేదనెడి పరితాపముతో చూపుకు చాటగునంతకు మెల్లమెల్లగ సాగిపోయి ఆపై శోకమును భరింపలేక గుండెలవియ దేహము వదలి దివ్యదేహముతో దేవలోకమున కంథకుడను దేవపుత్రనామమున నెలకొన్నది. స్వామి విరహమె గాక పై పెచ్చు కంథకము చచ్చుటతో దుఃఖము యిబ్బడిగాగ ఛందకుడు ఆక్రందించుచు పురమును జేరుకొనెను.

## తపస్సు - బుద్ధత్వప్రాప్తి (వి. పూ. 471)

సంన్యాస గ్రహణానంతరము బోధిసత్త్వుడచ్చోటి అనూపియ యనెడి మామిడితోట యందొక వారము దినములు గడిపి, తదుపరి యొకదినమున ముప్పది యోజనములు కాలినడక పయనించి రాజగృహము చేరికొనెను. పురము జొచ్చి బిచ్చమెత్త మొదలిడెను. భిక్షమునకై దిరుగు సిద్ధార్థుని అగాధరూపలావణ్య ముల నరసి పురమంతయు అసురపతి జొచ్చిన అమరావతివలె గగ్గోలు పడెనది. రాజకర్మచారులు కొందరు మహారాజగు బింబిసారుని కడకేగి "దేవా! నరుడో, నాగుడో, గరుడుడో, గంధర్వుడో అంతింతనరాని రూపరాశియగు పురుషుడొకడు పురమందు భిక్షమెత్తి తిరుగుచున్నాడని విన్నవించిరి. రాజును మేడపైకెక్కి నిలిచి అమ్మహాపురుషుని దర్శించి చకితుడై తన భటులతో నిట్లనియె. "మీరతని వెన్నంటి పొండు. అతడు నిజమునకు అమానుషుడైనచో నగరము దాటగనె అదృశ్యుడైపో వును. దేవతయైనచో మింటికెగసిపోవును. నాగుడైనచో భూమినిచీల్చుకొని క్రుంగి పోవును. ఇదంతయు లేక పుర బాహ్యమునకరిగి భిక్షించిన యన్నమును నతడు భక్షించినచో అవశ్యము మానవుడని గుర్తించిరండు. పొండు"ని యాజ్ఞాపించెను. ఆ మహాపురుషుడును తనకు వలసినంత ఆహారమును భిక్షచేసి గవనిదాటి పాండవ పర్వతమూలమున (రత్నగిరి - రత్న కూటమని నేడు ప్రసిద్ధము) భుజింప నారంభించెను. అట్టి కటికి తిండిని యేనాడును తిని కని యెఱుగని ఆ ఉపాధి - ఆ శరీరమానాడు ఆ ప్రతికూల భోజనమును సహించలేక క్షోభించిపోయినది. ఆ విక్షోభమును తనంతకుదానె నెమ్మదిగ సంభాళించుకొనుచు "అయ్యా! సిద్ధార్థా! బెగ్గటిల్లకుము. వెనుకటి దినములు జ్ఞప్తిచేసికొనుము. మూడేండ్ల క్రిందట పండిన పాతబియ్యపుటన్నము, రుచికరములగు సరసశాకపాకములతోడ కూడిన భోజన మును భోగించు శ్రీమంత గృహమున జన్మించియు అపుడపుడు అదాటున గాన బడిన సంన్యాసుల చూచి 'నేనుగూడ యేనాడిట్టి భిక్షుదీక్ష గ్రహింపగల్గుదు'నని యువ్విళ్ళూరితివి. ఆ యాకాంక్షతోనే యిల్లువెడలి వచ్చితివి. ఇపుడిట్లగుట యోగ్య మగునె" యని పలుతెఱగుల సమాధానము చెప్పికొని మనస్సును తేర్చి హాయిగ భుజంచెను. వేగులవారీ విషయమంతయు రాజున కెఱిగించిరి. నరపాలుడును సాదర బుద్ధితో బయల్వెడలి సిద్ధార్థుని సమీపించి పూజించి అతని దివ్య త్వమున కాకర్షితుడై తన యైశ్వర్యమునంతయు నతనికి సమర్పించెను. అతడును "మహారాజా! వస్తువుల

యందును, భోగములయందును నాకు కోరికలు లేవు. మహత్తమమగు అభిసంబోధిని – బుద్ధజ్ఞానమును బొందుటయే నా పరమ లక్ష్యము'' అని పలికి మిన్నకుండెను. బింబిసారుడును పలువిధముల ప్రార్థించియు సఫలుడుగాక చేతులు జోడించి ''మహాత్మా! బుద్ధత్వ ప్రాప్తి లభించినపిమ్మట చివరకు తాము మొట్టమొదట మా రాజ్యమునకు రావలెను. ఇదియే నా మనవి'' యని వేడుకొనియెను. (ఈ విషయము విస్తారముగ అట్టకథలయందలి ప్రవ్రజ్యాసూత్రమునను – సుత్తనిపాతమారవగ్గయందును చెప్పబడినది.)

బోధిసత్త్వుడును ఆ మాటకొడంబడి వైళమ అచ్చోటు కదలి క్రమమున ఆలారకాలాముడు, ఉద్దకరామపుత్రుడను వారల కడకు జని సమాధివిద్యను నేర్వదొడగెను. కాని యా సమాధిభావన తాను గోరు బోధిజ్ఞానమునకు మార్గము గాదని తలంచి దేవతాసహితముగ లోకములన్నింటికి తన బలవీర్యముల చూపించుటకును, పరమతత్త్వమును పొందుటకునునై ఉరువేలమను ప్రదేశముజేరి అది తనకొప్పియుండుటచే అందే తన మహదుద్యోగమునకు దొడంగెను.

కౌండిన్యుడు మొదలగు పరివ్రాజకులయిదుగురు పల్లెల పట్టణముల భిక్షాచరణ మొనర్చుచు నొకనాడు బోధిత్త్వుడున్న కడకు వచ్చి చేరిరి. ఇతడు బుద్ధుడిపుడె కాగలడు. ఈనాడె కాగలడు అనెడి యాశచే ఆటేండ్ల తని సేవాశుశ్రూషల గడుపుచు బోధిసత్త్వుని చెంగటనె వసించిరి. బోధిసత్త్వుడును ముడినువ్వులు దినియు, ముడిబియ్యము దినియు, కొంతవడి బొత్తుగ నాహారమునె వదలియు కఠోరతపంబున ప్రవృత్తుడౌటచే కాయము యెండి యెండి కట్టెయైనది. ప్రసన్నులగు దేవతలతనియండనిలిచి ఓజస్తేజముల నందించుచుండిరి. అయినను పసిడివన్నె శరీరము పాలిపోయినది. మహాపురుషలక్షణములు ముప్పది రెండును ఆ దుర్బల శరీరమందు అడగారిపోయినవి. ఒకానొకప్పుడు శ్వాసను జయించి ధ్యానమొనరించునతడు తిడీరని స్మృతి తప్పుటచే తాను గూర్చొనియున్న యరుగుపై అట్టె ఒఱిగి పడెను. పార్శ్వవర్తులగు దేవతలు ''శ్రమణగౌతముడు మరణించె'' నని గొల్లున వాపోయిరి. కొంతవడికి తెలివొంది ఇంతటి ఉగ్రతపస్సు నిజమునకు బుద్ధత్వ ప్రాప్తికి సాధనము గాదని యూహించి సిద్ధార్థుడు ఆహారార్థము గ్రామములందరిగి భిక్షను గొనదొడగెను. కోల్పోయిన దేహకాంతి తిరిగి కోలుకొన్నది. కౌండిన్యాదులగు మునుపటి పంచవర్గీయ బ్రాహ్మణులది జూచి ''ఆటేండ్లు సతమతమై బుద్ధత్వప్రాప్తియందు నిరాశవహించి గౌతముడు వెండియు ఆహార భోగలంపటుడైనాడు. విషయాసక్తుడై

తపో భ్రష్టుడైనాడు. స్నానమాడగోరువాడు మంచుముక్కలకు తలవంచినట్లు మన మీతని యాశించుట హాస్యాస్పదము పదం'' డని ఆ మహాపురుషుని వీడి తమ తమ పాత్రలను పరిధానములను గొని పదునెన్మిది యోజనముల దూరమందుండు ఋషి పతనము ( బనారస్ జిల్లా - సారనాథ) ను జేరికొనిరి.

అట్టియెడ ఉరువేలావన ప్రాంతమున సేనానియనబడు గ్రామమునందు సంపన్న గృహస్థుడగు సేనానియను వానియింట జన్మించిన సుజాత యను కన్యక అందొక మఱ్ఱి చెట్టుకు మ్రొక్కుబడి పెట్టుకొన్నది. ''ఓ వృక్ష దేవతా! నాకు కుల శీలముల యోగ్యుడగు వరుడు దొరకి మొదటి సంతానము పుత్రుడు కల్గినచో ప్రతియేటను నీకు లక్షధనము వెచ్చించి పూజలు జేయింతును.'' కొన్నాళ్ళకు ఆమె కోర్కె ఫలించినది. ఇక్కడ గౌతముడు బూనిన ఘోరతపస్సు ఆరేండ్లు గడచినది. ఆనాడు వైశాఖపూర్ణిమ. సుజాత యిష్టదైవమును పూజింప నెంచినది. మొదటి వేయియావులను మధుయష్టివనమున మేపించినది. వాటి పాలను పిండి అయిదు నూరు ఆవులకు త్రాపించినది. తిరిగి వాటిపాలను పిదికి రెండు వందల యేబది యావులకు త్రాపినది. ఇట్లు మరియు మరియు త్రాపుచు పదునాఱు ఆవులపాలు యెన్మిదింటికి త్రాపినది. పాలు చిక్కనివిగను, తీపిగను, బలకరముగను పరిణ మించునట్లు ఆమె క్షీరపరివర్తనము జేసినది. ఆనాడు వైశాఖపౌర్ణిమ దినము. వేకువనే లేచి యా యెన్మిదియావుల పాలను బిండి నూతనపాత్రయందు పోసి స్వయముగ తానే పాయసము వండ నారంభించినది.

సుజాత తనదాసియగు పూర్ణను బిలిచి ''అమ్మా! వడిగబోయి దేవుని యరుగును అలికి రమ్మ''నెను. ఆమెయు వల్లెయని ఆ వృక్షమూలమునకు బోయినది. ఆనాటి రాత్రికి బోధిసత్త్వుడును అయిదు మహాస్వప్నములను గాంచి నిక్కము నేడు బుద్ధుడ కాగలనని నిశ్చయించి తెల్లవారినంత శౌచాదికములనడిపి భిక్షాసమయము నెదురు చూచుచు తన శరీరకాంతులు చుట్టుముట్టియుండ వృక్షతలమున కూర్చొని యున్నాడు. పూర్ణయు ( దాసి) అచ్చోటువచ్చి చెట్టుక్రింద తూరుపు మొగమై కూర్చొనియున్న బోధిసత్త్వుని గాంచినది. కాంచి ''నేడు తన యజమానురాలు సమర్పించు పూజను చేచేతుల గ్రహింప వృక్షదేవతయే స్వయముగ మూర్తిభవించిన'' దని భావించి త్వరితగతి యింటికి బఱతెంచి సుజాత కా సంగతి తెల్పినది. ఆ వార్త విని పెల్లుబికిన సంతోషమున సుజాత గాఢముగ పూర్ణను కౌగ లించుకొని ''బిడ్డా! నేటినుండి నీవు నాకు కూతురవు. దాసివి గాదుసుమీ'' యని

పుత్రికకు అనురూపమగు వస్త్రభూషణముల నొసంగి ప్రేమించెను. అంతట పాయసమును బంగారుగిన్నె యందుంచుకొని పైనొక సువర్ణ పాత్రను మూసి గుడ్డతోకట్టి తాను కైసేసికొని పాయసకలశమును నెత్తిపై పెట్టుకొని బోధిసత్త్వుడు వసించు చెట్టుక్రిందకుపోయి చేరెను. అందాయనను వృక్షాధిదేవతగనే యూహించి వినయమున డగ్గఱి కలశమును దించి తెఱచి వేరొక బంగారుపాత్రతో నీరు దెచ్చి బోధిసత్త్వుని కడనుంచి నిలువబడెను. అంతటిలో తొల్లి ఘటికార మహాబ్రహ్మచే నొసగబడి యున్నాళ్ల బోధిసత్త్వునికడనుండి భిక్షకు ఉపకరించిన మట్టిపాత్ర యదృశ్యమై పోయినది. తనపాత్ర కానరాక పోవుడు బోధిసత్త్వుడు కుడిచేతిని జాచి నీటిని బుచ్చుకొనెను. ఆపై సుజాతయు పాయసకలశమతనికి అప్పగించెను. అంది కొని తన్వైపు తేరిజూచిన మహాపురుషుని యింగితమును గ్రహించి ''ఆర్యా! దేవర వారికిది సమర్పితము. యథేచ్ఛమెయి నారగించుడు. నాకువలె యిష్టార్థప్రాప్తి మీకుగూడ సఫలమగుగాక'' యని సప్రణామముగ పలికి పాతవిస్తరంబోలె ఆ లక్షమూల్యమగు పాత్రను వదలి చనినది.

బోధిసత్త్వుడంతట లేచి వృక్షమునకు ప్రదక్షిణించి పాత్రను నేరంజరా ( నిలాజన నది – గయా జిల్లా) నదీతీరమునకు గొని చని దాని నొడ్డుపైనుంచి నీటిలోనికి దిగి స్నానమాడి తూరుపు మొగమై కూర్చొనెను. అంతట నా పాయసమును నలుబదితొమ్మిది పిడుచలు ( కబళములు) చేసి భుజించెను. బుద్ధత్వప్రాప్తికిపైన, బోధిమండపమున (నేటి బుద్ధమందిర ప్రాంగణము) నివసించినకాలము మొత్తము నలుబది తొమ్మిది దినముల కంతటికిని ఆనాడు భుజించిన నలుబది తొమ్మిది పిడుచలె ఆహారమైనది. పాయసాహార గ్రహణానంతరము అతడు ఒక్కనెల పందొమ్మిది దినములు అన్నమును గొన లేదు. స్నానమాడ లేదు. చివరకు ముఖము కడుగ లేదు. ధ్యానసుఖముతోడను, మార్గసుఖము తోడను, ఫలసుఖముతోడను అమ్మహాపురుషుడేడువారములు గడపెను. ఈ విధమున క్షీరాన్నమును మెసవి పసిడి పళ్లెరమును నదీ ప్రవాహమున పాఱవైచి ప్రశాంతుడయ్యెను.

ఆ పగలంతయు బోధిసత్త్వుడు నదీతీరము నందుండు పూచిన సాలవనమున విహరించి సాయంతన సమయమునకు ( బోధిగయయందు నేడు ప్రసిద్ధమైయున్న) బోధి వృక్షము (రావిచెట్టు) వద్దకు బోయెను. ఆ తరుణముననే గడ్డి కోయువాడొకడు శ్రోత్రియ నామకుడు గడ్డి మోపుతో నెదురై యెనిమిది పిడికిళ్ల గడ్డినిచ్చెను. దానిని కరమున గ్రహించియె బోధి మండపమునెక్కి ప్రదక్షిణముగ చుట్టుదిరిగి

వచ్చి తూర్పుకొనయందు పడమటి మొగమై నిల్వబడెను. "ఇది బుద్ధులందఱకును ఆశ్రయస్థానము. ఇయ్యది దుఃఖ పంజరమును ఛిన్నభిన్నము చేయజాలు తావు గదే" యని చేతియందలి గడ్డిపోచలను కొనలయందు బట్టుకొని విదిలించినంత నవి యచ్చోట క్రింద రాలి నేర్పరియగు చిత్రకారుడు నిర్మించిన ఆసనమువలె చక్కగ నేర్పడినవి. బోధిసత్త్వుడును మహాబోధి వృక్షమునకు వీపు మళ్ళించి నిలిచి దృఢచిత్తమున–

ఇదె యీ ఆసనమందు యీ తనువు యింతింతింతలై రాలనీ
చదరంబై పడిపోవనీ యెముకలున్ చర్మంబు మాంసంబులున్
సుదురాపంబగు బోధిసంపదను నిచ్చోబొందకుండంగ నే
కదలన్నేర – కదల్పనేరను సుమీ కాల్సేతు లంగాంగముల్.

"నా యీ యెముకలును నరములును చర్మమును గుల్ల గుల్లయై పోయిన పోవుగాక! రక్తమాంసములు సర్వసమూలముగ శోషించి పోయిన పోవుగాక: సమ్యక్ సంబోధిని పరమజ్ఞానమును పొందకుండా నేనీ యాసనమునుండి కాలు మెదల్ప కుందును." అని శపథము జేసి తూర్పు మొగమై పిడుగులకైనను జడియని అపరాజితమగు ఆసనమున నుపవిష్టుడయ్యెను (జాతకనిదాన కథ)

ఆ సమయమున దేవపుత్రుడగు మారుడు "సిద్ధార్థుడు నా యధికారము నుండి దాటిపోవుచున్నాడు. ఇతని నిట్లు పోనివ్వరాద"ని తలంచి తన సేన నంతయును నుసిగొలిపికొని దండెత్తి వచ్చెను. బోధిమండపమునకు సమీపించక ముందే సేనయంతయు నొక్కొక్కడుగ సరిసుమారు అందఱు జాఱుకొనిరి. మహాపురుషుడొంటరిగ కూర్చొని యున్నాడు. మారుడును తన మిగిలిన యనుచరులతో "మిత్రులారా! శుద్ధోదన పుత్రుడగు సిద్ధార్థునకు సాటియగు పురుషుడు యెవ్వడును లేడు. మన మితనికి యెదురుగ నిలిచి పోరాడలేము. వెనుకవైపు నుండి ముట్టడింతము గాక" యని యోచించు కొనెను. మహాపురుషుడును మారసైన్యమును జూచి మందస్మితుడై " ఇంతమంది తలపడి నాయొకనిపై మహాసన్నాహము జేయుచున్నారు. ఈ చోట ఆప్తమిత్రులు బంధుబలగములు తల్లిదండ్రులు యెవ్వరును నాకు తోడగువారు లేరు. చిరకాలమునుండి సంపాదించిన నాదశపారమితలే నాకు నిజపరిజనము. వాటినె వాలును పలకయునుగ జేసికొని మారసేనను చెండాడెదను" అని తలంచి పారమితలను పదింటిని స్మరించుచుకూర్చొనెను.

మారుడును (కామదేవుడు) తన మాయా ప్రభావమున తుఫాను లేపియు, వానగురిపించియు, రాళ్ళువైచియు, కత్తులు చూపించియు, నిప్పులు చెరగియు, బురదను గ్రుమ్మరించియు, చీకటి గ్రమ్మించియు బోధిసత్త్వుని యావంతయు కదలింప లేకపోయెను. చివరకు సమీపించి వచ్చి సిద్ధార్థా! ఈ ఆసనమునందుండి లెమ్ము. ఇది నాది గాని నీదికాదు. లేలెమ్ము''నెను. మహాసత్త్వుడిట్లనుచున్నాడు. ''మారా! దశపారమితలను నీవు పొందియుండ లేదు. ఉపపారమితలను గాని పారమార్థిక పారమితలనుగాని పంచత్యాగములను గాని నీవు సంపాదించి యుండ లేదు. జాతికి గాని లోకమునకుగాని హితకరమగు పనుల నీవు జేసియుండలేదు. జ్ఞానమార్గము నీకు దూరము. అయ్యా! ఈ ఆసనము నీకెట్లు దగును. నాకే తగినది.''

''సిద్ధార్థా! దానాదికమగు త్యాగమును నీవొనర్చినా వనుటకు సాక్షి యెవ్వరు?''

''మారుడా! ఇదిగో యీ భూదేవి'' యని యీ మహాపురుషుడు కుడిచేతి నెత్తి ''ఓ పృథ్వీ! నా యొనర్చిన దానాదికమునకు నీవు సాక్షివి గాదా'' యని భూమిని తట్టి కొట్టెను. ఆ ధ్వనికి మార సైన్యము పటాపంచలైనది. ఇట్లు ప్రొద్దు గ్రుంకకముందె మారుని మూకను మటుమాయము జేసి రావిచిగుళ్ళు తనపై వ్రాలుచుండ కెంపులచే పూజింపబడువాని వలె నొప్పి [1] మొదటి జామునందు పూర్వజన్మ జ్ఞానమును నడి జామునందు దివ్యనేత్ర లాభమును, కడజామునందు ప్రతీత్య [2] సముత్పాద జ్ఞానమును పొందిన వాడయ్యెను అయెడ నతడీ క్రింది యుదానమును పాడుచున్నాడు.

> అవనిలోన ననేక జన్మములనెత్తి
> తిరుగుచుంటిని గృహకారు దెలియలేక
> యెఱిగితిని నేడు గృహకర్త నింకమీద
> యిల్లు గట్టగ పనిలేదు యెల్ల బంధ
> కూటములు గూలినవి, గృహ గోపురములు
> రాలినవి. సర్వసంస్కార రహితముగను
> కామనా శూన్యమై చిత్తకంజ మొప్పె
> ఓయి గృహకార గృహబంధ మొప్పదింక.

---

1. జాము॥ నాలుగు గంటలు.
2. ''పటిచ్చ సముప్పాదసుత్త'' యందు విస్తారముగ జూచునది.

## ౪

## బోధివృక్షముక్రింద - వారాణసీగమనము (వి. పూ. 471)

[1]ఆసమయుమున భగవాన్ బుద్ధుడు ఉరువేల(బుద్ధగయు)మునందు నేరంజరా నదీతీరమున బోధివృక్షముక్రింద అభిసంబోధిని మొదట ప్రాపించెను. ఆ చెట్టుక్రిందనే ఒకవారముదినముల పాడవున నొకేయాసనమున విముక్తియా నందము (మోక్షసుఖము) ననుభవించుచు కూర్చొనియుండెను. రాత్రియొక్క మొదటి జామునందు ప్రతీత్యసము త్పాదమును అనులోమముగను (మొదటినుండి చివరకు) ప్రతిలోమముగను (చివర నుండి మొదటికి) మననము చేసినాడు. ''అవిద్యచే సంస్కారము కలుగును. సంస్కారమున విజ్ఞానము కలుగును. విజ్ఞానము చేత నామరూపములును, నామరూప ములచే ఆయతనములాఱును, షడాయతన ములచే స్పర్శమును, స్పర్శముచేత వేదనయు, వేదనచే తృష్ణయు తృష్ణ చేతను పాదానమును, ఉపాదానముచేత భవమును భవముచేత జాతియు జాతి (జన్మము) చేత జరయు మరణమును, దుఃఖశోకాదికములగు చిత్తవికారములును ఉదయించు చున్నవి. దుఃఖములకు రాశియగు ప్రపంచమిట్లు పుట్టుచున్నది. అవిద్య దొలగినచో సంస్కారము లేదు. సంస్కారము వినాశమున విజ్ఞానము దొలగినది. విజ్ఞాన నాశ మున నామరూపములు బోయినవి. నామరూపనాశమున ఆయతనములాఱును లేవు. షడాయతననాశమున స్పర్శము లేదు. స్పర్శనాశమున వేదన నశించినది. వేదన నశించుటచే తృష్ణగతించినది. తృష్ణాక్షయమున ఉపాదాన నాశమైనది. ఉపాదాన నాశమున భవము పోయినది. భవనాశమున జాతియు, జాతి (జన్మ) నాశమున జరామరణ దుఃఖ శోకాదికములగు చిత్తవికారములును చిత్త ఖేదములును అడగినవి. ఇట్లు దుఃఖసంసారము సంపూర్ణముగ శాంతించుచున్నది.''

ఇప్పగిది మధ్యమ యామమునను అంతిమ యామమునను గూడ ప్రతీత్యస ముత్పాదమును అనులోమ ప్రతిలోమముగ మననము జేయుచు యేడు దినములు గడచిన పిదప ఆ బోధివృక్షము క్రిందినుండి లేచి అజపాలమను పేరుగల మఱ్ఱిచెట్టు జేరబోయి దానిక్రింద కూడ విముక్తి యానందము ననుభవించుచు వారము దినము లొకే యాసనమున గూర్చుండెను. ఆ వేళ స్వాభిమానియగు బ్రాహ్మణుడొకడు భగవానుడున్న కడకుబోయి కుశలక్షేమ మడిగి యొక యోర నిల్వంబడి భగవంతు నితో నిట్లనియె ''గౌతమా! ఎట్టివాడు బ్రాహ్మణుడు? బ్రాహ్మణుని నిర్మింపజేయు ధర్మ మెట్టిది?'' ఆ మాట విని భగవంతుడు క్రింది గీతమును బాడెను.

1. వినయపిటక, మహావగ్గ.

పాపదూరుడు, అభిమాన మాలిన్య
రహితుండు సంయతవ్రతుడు విప్రుండు :
వేదాంత పారగమ్మై బ్రహ్మచర్య
దీక్షమై బ్రహ్మవాదిత్వ ధర్మమున
సముడు వానికి ప్రపంచమున లేడొకడు :

వారము దినము లాసమాధియందు అజపాలవటవృక్షము క్రిందగడపి అందుండి లేచి ముచలింద వృక్షమువద్దకు బోయెను. ఆ మహీరుహతలమున యెప్పటివలె యేడుదినములు విముక్తి యానందము ననుభవించుచు ఏకాసన నిష్ఠుడై యుండినాడు. ఆ దినములలో అకాలమేఘము లావరించి ఈదగాలి వీచుట కారంభించినది. ఆ వనస్పతి నాశ్రయించుచుండు ముచలిందమను సర్పరాజు తనపుట్టనుండి బైటికి వచ్చి భగవానుని తన శరీరముతో యేడుచుట్లు చుట్టుకొని యతని శిరముపై తనపడగను గొడుగువలె సాచిపట్టి ఎండయును గాలియును, క్రిమియును కీటకమును, చలియు వేడిమియు నతని తాకజాలనట్లు రక్షించుచుండెను. సప్తాహము గడువ మింట మబ్బులు దొలగుడు నాగరాజు భగవంతుని శరీరమును విడిచి కామరూపమున నొకబాలకునివలె యెదుటకానబడినది. అదంతయు నెఱింగి బుద్ధభగవంతుడు ఆనందగీతము నిట్లుపాడెను.

శ్రుతధర్మ ద్రష్టయే సుఖియు తుష్టుండు
నిర్ద్వంద్వ సుఖమన నెగడు సంయమము
వైరాగ్యమది కామవర్జన సుఖము
సాధనా నిష్ఠయే సౌఖ్యతమంబు.

మఱొక్క వారము దినములు రాజాయతన మనబడు వృక్షమూలము నాశ్రయించి సమాధిబద్ధుడయ్యెను. ఆ కాలమున త్రపుషభల్లికులను యిద్దరు వ్యాపారులు తమ ఉత్కలదేశమునుండి ప్రయాణ పథమున నచ్చోటువచ్చి చేరిరి. వారి యిష్టకులదేవత వారికి కాన వచ్చి ''మార్షా! బుద్ధత్వమును పొందిన మహాపురుషుడొకడీ రాజాయతన వృక్షము క్రింద నున్నాడు. మీరచటి కరిగి లడ్డును మజ్జిగయు నిచ్చి యాతని సత్కరింపుడు. ఈ దానము మీకు చిరకాలము వఱకు సుఖమును హితమును కలిగించును.'' అని బోధించెను. వారును నట్లె యావస్తువులను గొని భగవంతుని జేరబోయి ప్రణమిల్లి యొత్తగిల్లి నిలిచి [1]''భంతే! భగవంతా! ఈ లడ్డును

1. భంతే = పాలీభాషలోని పూజ్యసంబోధనము.

మజ్జిగయును స్వీకరించి మాకు చిరకాల హిత సుఖముల ననుగ్రహించుడు'' అని వేడికొనిరి. భగవానుడును తనలో ''తథాగతుడు వట్టిచేతులతో స్వీకరించరాదు. పాత్రలేని యీ తరుణమున నేనా మధుపిండమును తక్రమును గ్రహించుట యెట్లు'' ని వితర్కించుచున్నంతన చతుర్దిశలనుండి మహారాజిక దేవతలు నలువురు రాతితో జేసిన భిక్షాపాత్రల నాల్గింటి నమ్మహనీయుని యెదుటనుంచి ''మహాభాగా! ఈ పాత్రలయందా యుపాయనములను బుచ్చుకొనుడు'' అని విన్నవించిరి. ముందట నున్న అభినవశిలామయ పాత్రల నందికొని వారొసగు లడ్డును మజ్జిగయు గ్రహించి బుద్ధుడు భుజించెను. అంతట తపస్సు మల్లి కులనబడు ఆయిర్వురు వ్యాపారులు భగవానునకు చేతులు జోడించి ''భంతే! మేమిద్ధరమును బుద్ధుని శరణుజొచ్చుచున్నాము. ధర్మమును శరణుజొచ్చుచున్నాము. ఈనాటినుండి దేవరవారు మమ్ము సాంజలి శరణాగత ఉపాసకులుగ స్వీకరించండి'' యని మనవి జేసిరి. రెండు మాటలతో బౌద్ధదీక్ష పొందిన ప్రథమ ఉపాసకులు ప్రపంచమున వీరిద్దరే.[1]

మఱియు వారము దినములు గడచినది. రాజాయతన వృక్షమును వీడి భగవంతుడు అజపాలవటవృక్షమును తిరిగి చేరికొని విహరింప దొడగెను. ఏకాంతమున ధ్యానస్థితుడై యొకనాడిట్లు దలంచెను. ''గంభీరము, దుర్దర్శనము, దుర్జ్ఞేయము, శాంతము, ఉత్తమము, తర్కాతీతము, చతురపండితవేద్యము నగు ధర్మమును పొందితిని. ఈ లోకము కామతృష్ణలయందే దగిలి కామములయందే సంతృప్తమైయున్నది. కామవ్యాకులితమైన లౌకికజనమునకు కార్యకారణరూపమగు నా యీ ప్రతీత్యసముత్పాదధర్మము గ్రహింప వీలుగానిది. సంస్కారశమనమును, తృష్ణాక్షయమును, విరాగమును, దుఃఖనిరోధమును, నిర్వాణమును, అట్టిట్టివారికి అందరానిది. ప్రయాసగొనియైనను యీ ధర్మమునుపదేశించుటకు నేను కడంగిన లోకజనులు దాని తెలియ లేక పోయినచో నా ప్రయాసయంతయు నరణ్యరోదనమే గదా! యేల వృథా చేష్ట'' యని ధర్మప్రచారోద్యోగము నందు అల్ప ఉత్సాహియు ఉదాసీనుడునయ్యెను. సహాపతి బ్రహ్మదేవుడా మహాత్ముని చిత్తవృత్తిని పంకించి ''ఓహో! లోకము పాడుగాగలదు. లోకము చెడిపోగలదు. తథాగతుని అర్హత సంబుద్ధుని చిత్తవృత్తి ధర్మప్రచారమునందు మొగ్గక పెడమొగము వేయుచున్నది.'' అని భావించి భగవానుని యెదుట తోపట్టెను. మహానుభావుడగు బుద్ధదేవుని ముందట చేతులు జోడించి, ఉత్తరీయమును నొకభుజముపై సర్దికొని కుడిమోకాలును భూమి

1. అప్పటికి సంఘమనునది లేదు కాబట్టి బుద్ధుని, ధర్మములను రెంటిని మాత్రమే వారు ఉచ్చరించి శరణు పొందగల్గిరి.

పైనాని ''భంతే! సుగతదేవా! ధర్మప్రచారమునకై ప్రవర్తింపుడు. తమ ధర్మోపదేశమున లోకము ధర్మశ్రవణ భాగ్యమును పొందగల్గుగాక. ధర్మములను విననిచో అల్పదోష యుతమగు ప్రాణికోటి నశించగలదు. మగధరాజ్యమందు అధర్మము ప్రబలినది. నిర్మలుడవగు నీ అమృతోపదేశము నది యిక వినుగాక. గిరిశిఖరమున నిలిచిన మానవుడు నాల్గుదిక్కుల నుండు మానవకోటిని చూడగల్గునట్లు ఓ సుమేధా! ఓ సర్వతశ్చక్షూ! ఓ శోకాతీతా! ధర్మ శిఖరము నధిరోహించి జన్మజరాపీడితమగు ఆర్తలోకమును పరికింపుము. చిత్తగింపు''మని వాక్రుచ్చెను.

బ్రహ్మదేవుని పలుకును విని భగవంతుడును ప్రాణులయందు జాలిబొడమ బుద్ధనేత్రమున లోకము నవలోకించెను. అల్పమలయుతులును, తీక్ష్ణబుద్ధులును, సుందర స్వభావులును నగు జీవుల నెందఱినో అతడు తన దివ్యనేత్రమున కనుగొనెను. పరలోకభీతియు పాపభీతియు కలవారెందఱో ఉన్నారు. నీటబుట్టిన కమలములు కొలనునందు కొన్ని లోనమునిగి బైటికి రాలేకుండునవియు, మఱికొన్ని నీటిమట్టమునకు రాగల్గినవియు, మఱియు కొన్ని నీటిపై నెంతో పైకివచ్చి నీటి నంటక నుండునవియై యుండునట్లు వివిధ భంగులనున్న జన సముదాయమును పరికించెను. ఇట్లు బుద్ధదృష్టి యందు అల్పమలయుతులును, తీక్ష్ణబుద్ధులను, సుస్వభావులును, పాపభీతిగలవారును నగు ప్రాణులనాలోకించెను. ''ఓ బ్రహ్మ! కష్టమునకు ప్రాల్మాలి ఉత్తమమగు ధర్మమును ఉపదేశించుట మానియుంటిని. ఇక నా ధర్మద్వారము తెఱువబడినది. చెవులుండిగూడ శ్రద్ధలేనివారుమాత్రమిందు ప్రవేశింప జాలరు.''

సహాపతిబ్రహ్మయు తన యభీష్ట మీడేఱినదని సంతసించి యథేచ్ఛ బోయెను.

అనంతరము బుద్ధభగవంతుడు తనమనంబున ''ఈ ధర్మమును తొలుత నెవ్వని కుపదేశింతును? దీనిని సులభముగ నెఱుంగజాలు వాడెవ్వడ''ని వితర్కించి విచారదృష్టి పరికించి ''చతురుడును మేధావియు నగు ఆలారకాలామపండితు డిందుకు దగినవాడ''ని తలంచెను. అతడు మరణించి వారముదినములైనదని గుప్తదేవత సూచించినది. సరియె. ఆపై ఉద్దకరామపుత్రుడైనను యిందుకు సంపూర్ణముగ నర్హుడుగదా యని యోచింప నతడు గతరాత్రియె దివంగతుడైనట్లు జ్ఞానదృష్టి దోచినది. ఇక నెవరున్నారు? సాధనాసమయమున నాకు సేవాపరిచర్యలు సల్పిన పంచవర్గీయ భిక్షువుల కీధర్మమును నేనెందుకు తొలుత యుపదేశింపరాదు? వారెందున్నారో'' యని దివ్యదృష్టిని విలోకించి కాశీనగరప్రాంతమున ఋషిపతన మృగదావము (ప్రస్తుతము సారనాథము) నందున్నట్లు జూచెను.

బుద్ధదేవుడిట్లు ఉరువేలమునందు యథేచ్ఛ మెయి విహరించి వారాణసి వైపునకు పయనమయ్యెను. బుద్ధగయకును గయకును మధ్యయందుపోవు సమయమున భగవంతుని బుద్ధుని దర్శించి ఉపక ఆజీవకుడను ★ సాధువు డగ్గఱి యిట్లనియె. ''ఆయుష్మంతుడా! నీ వెవ్వడవు? నీ యింద్రియములు ప్రశాంతములు. నీ దేహకాంతి ప్రదీప్తము. నీకు దీక్షనిచ్చిన గురుదేవు డెవ్వడు? నీ ధర్మసంప్రదాయ మెద్ది?'' యని ప్రశ్నించెను. భగవంతు డిట్లనియె. అయ్యా! నేనన్నిటికి నతీతుడను. అన్నింటి నెఱిగిన వాడను. అన్ని ధర్మముల నంటనివాడను. తృష్ణాక్షయమున సర్వత్యాగినై యున్నాను. వినుము.

గురుడు నాకు లేడు సరి మానవుడు లేడు
అర్హతుండ నేను అఖిలగురుడ
నిలిచియున్నవాడ నిర్వాణపదపీఠి
పొగడుచుంద్రు నన్ను బుద్ధుడనగ.

ధర్మచక్ర ప్రవర్తనమునకై కాశీపురమున కరుగుచున్నాను.

''ఆయుష్మంతా! నీ మాటలనుబట్టి చూచిన నీవు అనంతజినుల (జ్ఞానుల) కు దీటు వత్తువేమో?

సాధూ! ఆస్రవ (క్లేశ) హీనులగు నాబోటివారే జినులనదగుదురు. పాపధర్మములను జయించితిగాన, ఓ ఉపకా! నేను జినుడనే.'' ఆ పల్కులు విని ఉపక ఆజీవకుడు ఔగాకయని తలయూపి తనదారిని బోయెను.

## ప్రథమ ధర్మోపదేశము – యశుని సంన్యాసము (వి. పూ. 471)

భగవానుడు బుద్ధుడు క్రమముగ యాత్రనొనర్చుచు పంచవర్గీయ భిక్షుగణము వసించు వారాణసి ఋషిపతన మృగదావమునకు వచ్చి చేరుకొనెను. పంచవర్గీయ భిక్షువులును తమవైపునకే యరుదెంచు భగవంతుని జూచి తమంతకు తామిట్లు తలపోసిరి. ''ఆవుసో! (ఆయుష్మంతులారా) అల్లదిగో! సాధనాభ్రష్టుడు, బాహుల్య (సంగ్రహ) పరాయణుడు నగు శ్రవణగౌతముడు వచ్చుచున్నాడు. మనమతనికి

★ ఆనాటి నగ్నసాధువుల సంప్రదాయము. దానికి ప్రధాన ఆచార్యుడు మక్ఖలీ – గోసాలుడు. (మస్కరీగోశాలుడు).

అభివాదనముగాని ప్రత్యుత్థానముగాని యొనర్చరాదు. ఎదురేగి పాత్రచీవర (వస్త్ర)ముల నందికొనరాదు. కూర్చొనుటకొక ఆసనము మాత్రమిచ్చెదముగాక. ఇష్టమున్న కూర్చొననిమ్ము''

ఇట్లు నిశ్చయించుకొనిరి గాని భగవంతుడు సమీపించుకొలది వారి నిశ్చయము సళ్ళుబాఱసాగినది. ఒకడెదురేగి శాటీపాత్రల నందికొనెను. మఱియొకడు ఆసనమును బఱచెను. వేఱొకడు పాదోదకమును, యింకొకడు పాదపీఠమును సమర్పించెను. భగవానుడును ఆసనాసీనుడై పాదములను కడిగి కొనెను. వారును పదింబది భగవంతుని గూర్చి ''ఆయుష్మంతా!'' యని సంబోధింప దొడగిరి. అది విని ''భిక్షువు లారా! తథాగతుని పేరుగొనిగాని, ఆయుష్మంతుడ యని గాని పిలువకుడు. భిక్షువులారా! తథాగతుడు అర్హతుడు. సమ్యక్ సంబుద్ధుడు. ఇటు వినుడు. నే నార్జించిన అమృత ధనమును మీకును బంచెదను. చెప్పిన కైవడి చేయగల్గుచో, కులపుత్రు లెద్దానిగోరి యిల్లు వాకిండ్లు వదిలి సంన్యసించుచున్నారో అట్టి అనుత్తమ బ్రహ్మచర్య ఫలమును యీ జన్మమునందే సంపాదించి విహరించెదరు సుడీ!'' యని పలికెను.

ఆ మాట విని పంచవర్గీయ భిక్షువులు భగవంతునితో ''ఆయుష్మంతుడా! గౌతమా! నీవానాటి ఘోరతపస్సునందే ఉత్తరమనుష్యధర్మమును, ఆర్యజ్ఞాన పరాకాష్ఠను పొందజాలక పోయితివి. ఆ పై సాధనాభ్రష్టుడవై, బాహుల్యపరాయణు డవైన పిదప నద్దాని నెట్లు పొందగల్గితివి? యని యడిగిరి.

''భిక్షువులారా! తథాగతుడు బాహులికుడు (సంగ్రహాపేక్షి) కాడు. సాధనా భ్రష్టుడు గాడు. బాహుల్యపరాయణుడు గాడు. అతడు అర్హతుడు. సమ్యక సంబు ద్ధుడు. అతని యుపదేశము నాశ్రయించి అనుత్తమ బ్రహ్మచర్యఫలము నీ జన్మము నందే మీరు పొంది విహరింతురుగాక!''

ఇట్లు మూడుమాఱులు తన్నాక్షేపించినవారికి ముమ్మారును నట్లె సమా ధానము జెప్పి తిరిగి భగవంతు డిట్లనియె. ''భిక్షువులారా! ఇంతకుముందెన్నడైనను నేనిట్లు చెప్పియుంటినా?

''చెప్పియుండలేదు.''

''అటులయిన భిక్షువులారా! వినుండని వెనుకటిమాటలనే జెప్పి బుద్ధదేవుడు వారిని ధర్మశ్రవణకుతూహలురుగ నొనర్చెను. [1]

1. మహావగ్గ.

# ధర్మచక్ర ప్రవర్తన సూత్రము

[1]అది యొక దినము. భగవంతుడు వారాణసీ ఋషిపతన మృగదావమున విహరించుచున్నాడు. అట్టియెడ భగవానుడు పంచవర్గీయ భిక్షువులను పిలిచి ''భిక్షువులారా! సంన్యాసులగు వారీరెండు విధములగు అతి (వర్తనములను) అవలంబించరాదు. మొదటి పద్ధతి హీనములును అనార్యములును గ్రామ్యములును అనర్థ యుక్తములునునగు కామవాసనలయందు - కామసుఖములయందు మిగుల ఆసక్తుడగుట. రెండవది దుఃఖమయమును అనార్యసేవితమునునైన కాయక్లేశము లకు - ఆత్మపీడలకు పాల్పడుట. ఈ అతివర్తనముల రెంటిని వదలి తథాగతుడు మధ్యమ మార్గమును వెదకి గ్రహించినాడు. అదియే జ్ఞానమును శాంతిని అభిజ్ఞను సంబోధిని నిర్వాణమునుకూడ పొందించునది. అదియే మధ్యమ మార్గము - మధ్యమ ప్రతిపదము. సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పము, సమ్యక్ వచనము, సమ్యక్కర్మ, సమ్యక్ జీవనము, సమ్యక్ వ్యాయామము, (ప్రయత్నము) - సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి యనెడి [2] ఆర్యాష్టాంగిక మార్గమును నదియే. భిక్షువులారా! ఇద మధ్యమ మార్గము.

ఓ భిక్షువులారా! దుఃఖము ఆర్యసత్యము. జన్మ జరా వ్యాధి మరణములు దుఃఖములు. ప్రియవియోగము అప్రియసంయోగము దుఃఖము. కోర్కె ఫలించనిచో దుఃఖము. వెయ్యేల ఒకమాటలో [3] ఉపాదానస్కంధములయిదును దుఃఖములు. భిక్షువులారా! దుఃఖసముదయము (దుఃఖకారణము) ఆర్యసత్యము. అదియే తృష్ణనాబడును. కామతృష్ణ, జన్మతృష్ణ, విభవతృష్ణ మొదలైనది. మూడవ ఆర్యసత్యము దుఃఖనిరోధము. ఇదియే తష్ణావిరాగము, తృష్ణాత్యాగము. దుఃఖనిరోధ గామినీ ప్రతిపదము నాల్గవ ఆర్యసత్యము. ఇది దుఃఖ నిరోధమునకు చేర్చు మార్గము. ఆర్యాష్టాంగిక మార్గమును నిదియే.

'దుఃఖము ఆర్యసత్యమనియు, అది పరిజ్ఞేయమనియు, పరిజ్ఞాతమనియు అశ్రుతపూర్వమగు ధర్మములందు నాకు నూతనా లోకము కలిగినది. అట్లే దుఃఖ సముదయమార్యసత్యమనియు, అది ప్రహాతవ్య (వదల దగినది) మనియు, ప్రహీణ (వదలినది) మనియు' దుఃఖనిరోధ మార్యసత్యమనియు, అది సాక్షాత్కరింప జేసి

---

1. సంయుత్తనికాయ 55 - 2 - 1, వినయమహావగ్గ [1]
2. 'సతిపట్ఠానసుత్త' యందు విస్తారముగజూచునది.
3. రూప, వేదనా, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానములు.

కొన యోగ్యమనియు, సాక్షాత్కృతమనియు, ఇది దుఃఖనిరోధగామినీ ప్రతిపదమను ఆర్యసత్యమనియు, భావన చేయదగినదనియు, భావన చేయబడ్డదనియు, అశ్రుత పూర్వములగు ధర్మములందు నాకు నూతనాలోకము కలిగినది.

భిక్షువులారా! పైని జెప్పినట్లు మూడు మూడు విధముల నాలుగు ఆర్య సత్యములును పదిరెండు రూపములతో గూడిన యథార్థ విశుద్ధ జ్ఞానము నాకు లభించనంతవఱకును, అనుత్తరమగు సమ్యక్ సంబోధిని (పరమజ్ఞానమును) పొందితినని చెప్పలేకుంటిని. భిక్షువులారా! మూడు మూడువిధములైన నాలుగు ఆర్యసత్యముల యొక్క పదిరెండు రూపములను యథార్థముగ దర్శించిననాడు అనుత్తర సమ్యక్ సంబోధినెఱింగితిననియు, నావిముక్తి స్థిరమైనదనియు నాకిదియే అంతిమజన్మ మనియు, రాకపోకలకతీతుడనవియు ప్రతిజ్ఞ జేసి చెప్పజాలితిని.

[1]ఈమాటలువిని పంచవర్గీయ భిక్షువులు సంతుష్టులై భగవానుని అభినం దించిరి. ఈ విచార ప్రసంగ సమయమునందు ఆయుష్మాన్ కౌండిన్యునకు ''సము దయధర్మ(కారణస్వభావ)మంతయు నిరోధధర్మ (నాశస్వభావ)మే'' యనెడి నిర్మలధర్మ చక్షువుత్పన్నమైనది. అదిగని భగవంతుడు ''కౌండిన్యుడెఱుంగ గల్గెను - యెఱుంగగల్గెనని'' పుల్కుటచే కౌండిన్యునకు ఆజ్ఞాతకౌండిన్యుడను పేరు యేర్పడినది.

[2]అపుడు దృష్టధర్ముడగు బుద్ధగురుని అనుశాసనమందు విశారదుడగు ఆజ్ఞాత కౌండిన్యుడు ''ప్రభూ! భగవంతుని నుండి నాకు [3]ప్రవ్రజ్య కల్గుగాక. [4]ఉప సంపద లభించుగాక'' యని వేడికొనెను. ''భిక్షూ! రా రమ్ము. ధర్మము [5]స్వాఖ్యాత మైనది. ఆత్యంతిక దుఃఖ నివృత్తికై బ్రహ్మచర్యమును పాలింపుమ''ని బుద్ధుడతని నాదేశించెను. అదియే కౌండిన్యునకు ఉపసంపద (దీక్ష) అయినది.

భగవంతుడు సుగతుడు మఱియు తన్ననుసరించియుండు భిక్షువులకు ధర్మసంబంధమగు కథల నుపదేశించుచు అనుశాసించుచుండ ఆయుష్మంతులగు దప్పుడు భద్దియులను వారికి ''సముదయధర్మమంతయు నిరోధధర్మమె'' యనెడి విరజధర్మచక్షువు సముత్పన్నమైనది. అంతట దృష్టధర్ముడగు బుద్ధగురుని

---

1. సం. ని. 55 - 2 - 1 వినయ, మహావగ్గ [1]
2. మహావగ్గ [1]. 3. శ్రామణేర సంన్యాసము. 4. భిక్షు సంన్యాసము.
5. స్వాఖ్యాతము = సుందర ప్రకారమున వర్ణితము.

అనుశాసనమందు విశారదులై వారు ''ప్రభూ! భగవంతుని ద్వారా మాకు ప్రవ్రజ్య కల్గుగాక. ఉపసంపద లభించుగాక'' యనిరి. శాస్త్రయగు భగవంతుడు ''ఓ భిక్షువు లారా! రా రండు. ధర్మము స్వాఖ్యాతమైనది. ఆత్యంతిక దుఃఖనివృత్తికై బ్రహ్మచర్య మును పాలింపు'' డని ఆదేశించెను. అదియే వారిరువురకు ఉపసంపద (భిక్షుసంన్యా సము) అయినది.

[1]ఆసమయమున వారాణసీపురియందు [2]శ్రేష్ఠిపుత్రుడు సుకుమారుడునగు కులపుత్రుడు యశుడనువాడు గలడు. వానికి హేమంతము గ్రీష్మము వర్షమనెడి మూడు ఋతువులకును అనుకూలములగు మూడు మేడలు గలవు. వర్షకాలము నందు నాలుగు నెలలును అంగనాసందోహములు వాద్యవిశేషముల తన్నారాధింప ప్రాసాదమునుండి క్రిందికి దిగివచ్చువాడుకాడు. ఒకానొకరాత్రివేళ యశకుల పుత్రునకు నిద్రాభంగమైనది. ఆ నడిరాతిరియందు తైలదీపములు మాత్రము మేల్కొనియున్నవి. నిద్రావివశలై అస్తవ్యస్తముగ తాఱుమాఱుగ మైమఱచిపడియున్న తన లలనాపరిజనమును జూచి వెగటును నసహ్యమును బొడమ వైరాగ్యము పెల్లు బ్బుతిల్ల యశుడు అయ్యో! పీడితుడను: హా! సంతప్తుడను'' ని వాపోయెను.

శయ్యనుండి లేచి పాదరక్షలు ధరించి తనయిల్లు గడచి నగరద్వారము చేరబోయి, ఋషిపతన మృగదావమునకు తిన్నగ దారిదీసి పోయెను. బుద్ధదేవుడు సరిసరి తెల్లవారువేళ ఆరుబయట విహరించుచుండినాడు. 'అయ్యో! సంతప్తుడను, హా! పీడితుడ' నని ఆక్రందించుచు వచ్చుచున్న యశకులపుత్రుని దూరమునందుం డియె జూచి భగవంతుడు తిరుగుట చాలించి యొకచోటకూర్చొని 'యశుడా! యిటు రమ్ము, సంతప్తుడు గానివాడు పీడితుడుగాని వాడిచట నున్నాడు రమ్ము, నీకు ధర్మము నుపదేశింతును' అని వానిని చేరబిలిచెను. అతడును ప్రసన్నుడై చెప్పులను వీడి బుద్ధుని డగ్గఱియె. దాపున చేరి ప్రణమిల్లి యొకచోనొదిగి కూర్చొనిన యశకుల పుత్రునకు భగవానుడు ఆనుపూర్విక కథను చెప్పుచు దానకథయు, శీలకథయు, సర్గకథయు, కామవాసనలచే గలుగు దుష్పరిణామ దోషమును, నిష్కర్మతయొక్క మాహాత్మ్యమును వివరించెను. భవ్యచిత్తుడగు యశుని తగిన యధికారిగ గుర్తించి దుఃఖము – సముదయము – నిరోధము – మార్గమనెడి ఆర్యసత్య

1. మహావగ్గ [1]
2. పురమునందు ధనికవ్యాపారులచే జీతములేక గౌరవపదాధికారిగ యెన్నుకొనిన వానిని శ్రేష్ఠి యందురు.

ములను నాల్గింటిని ప్రకటించి చెప్పెను. శుద్ధవస్త్రమునకు రంగు అతికినట్లు యశ కులపుత్రునకు అప్పటికప్పుడే ''సముదయధర్మమంతయు నిరోధధర్మమనెడి విరజధర్మదష్టి యుదయించినది.

అచ్చట యశకులపుత్రునితల్లి మేడపైన కొడుకును గానక పతివద్దకుబోయి ఆవిషయమును జెప్పెను. గృహపతియు నాల్గువైపులను భటులను బంపి తాను స్వయముగ ఋషిపతనమృగదావముకడ కరిగెను. కొడుకు నడిచిన చెప్పులజాడ చొప్పుబట్టి ముందుకు నడువదొడగెను. భగవంతుడును గృహపతిశ్రేష్ఠి వచ్చుచుండు టచూచి తన యోగబలముచే యశుని కానరానివానిగ జేసి కూర్చొనియున్నాడు. శ్రేష్ఠియు భగవానుని చేరి, మహాత్మా! మాయశపుత్రుని మీరు చూచినారా!'' యని యడిగెను.

''గృహపతీ! కూర్చొనుము. ఇందేకూర్చొనియున్న నీయశుని నీవు జూడ గలవు.'' భగవంతుడాడిన యీ మాటవిని ప్రసన్న మనమున నభివాదనము చేసి నొకయోర గూర్చొనెను. శాస్తయు నతనికి ఆనుపూర్వికథను విస్తరించినంత కూర్చొన్న ఆసనముపైననే గృహపతి శ్రేష్ఠికి ధర్మచక్షువు సంభవించినది. ''భంతే! ఆశ్చర్యము: అబ్బురము: బోర్లపడిన దానిని చక్క నిలిపినట్లు, మూసినదానిని దెఱచినట్లు, దారిదప్పిన వానికి మార్గము జూపినట్లు, చీకటిని దీపము వెట్టి కన్నులు గల వారికి రూపము జూపినట్లు, దేవా! వివిధ పర్యాయముల ధర్మము నెఱుంగ జెప్పితివి. బుద్ధుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును శరణు జొచ్చుచున్నాను. సంఘమును శరణుజొచ్చుచున్నాను. నేటినుండి నన్ను సాంజలి శరణాగత ఉపాస కునిగ భగవంతుడనుగ్రహించుగాక'' అని శ్రేష్ఠి విన్న వించెను. బౌద్ధప్రపంచమున మూడుమాటల ( బుద్ధ – ధర్మ – సంఘ) నుచ్చరించిన ప్రథమ ఉపాసకుడితడే.

శాస్త తన తండ్రికి జేసిన ఉపదేశమును విని, కని, మననము జేసిన ప్రభావముచే యశకులపుత్రుని చిత్తము నిర్లిప్తమై నిర్మలమై నిరాస్రవ మయ్యెను. బుద్ధదేవుడును దానిని గ్రహించెను. ఇప్పుడు యశకులపుత్రుడు తొలుతటివలె గృహస్థోచితములగు హీనకామోప భోగముల ననుభవింప నర్హుడుగాడు. ఇక నా యోగప్రభావమును తొలగించి యితని వెల్లడిచేసెద'' నని భగవంతుడట్లె జేసెను. శ్రేష్ఠియు కుమారుని కనుగొని యిట్లనియె. ''బిడ్డా! యశుడా! నీ కొఱకై నీ తల్లి నితాంతము వ్యాకులపీడి తయై యున్నది. తల్లికి జీవనదాన మివ్వరాదా?'' ఆ మాట విని యశకులపుత్రుడు భగవానుని వైపు జూచెను. భగవంతుడు దానందుకొని గృహపతి శ్రేష్ఠితో ''అయ్యా!

నీకు కల్గిన జ్ఞానము అపూర్ణము. నీవు పొందిన ధర్మసాక్షాత్కారముగూడ అపూర్ణమే. కాని యశునకట్లు గాదు. అతడు కనియును వినియును మననముజేయుట చేతను ఆతని చిత్తము మలనిర్ముక్తమైనది. మఱి యిప్పుడతడు ముందటివలె హీనములగు కామభోగములను సామాన్యుడగు గృహస్థుని పగిది ననుభవింప నర్హుడగునా? చెప్పు'' మనియె.

''భంతే! అర్హుడుకాడు. వాడు ఆస్రవ (మల) నిర్ముక్తుడై లాభమును సులాభమును బొందెను దేవా! యశుని అనుచరభిక్షునిగ గొని భగవానులవారు నేడు నేనిడు భోజనమును స్వీకరించ వలెను.''

గృహపతి ప్రార్థనను విని భగవంతుడు మౌనముచే అంగీకారము సూచించెను. శ్రేష్ఠియు సెలవంది అటనుండి లేచి తథాగతునకు వలగొని పని వినియెను. కొంత వడికి యశుకుల పుత్రుడు గురునితో ''భంతే! భంగవంతుని కడనుండి నాకు ప్రవ్రజ్య లభించు గాక. ఉపసంపద లభించుగాక'' యనెను. శాస్త్రయు ''భిక్షూ! ధర్మము స్వాఖ్యాతమైనది. ఆత్యంతిక దుఃఖనివృత్తికై బ్రహ్మచర్యమును పాలింపుము. రా రమ్మ' నియెను. అదియె ఆయుష్మంతుడగు యశునకు ఉపసంపదయైనది. అప్పటికి లోకమందు అర్హతులు యేడువురు.

సుగతుడు పూర్వాహ్ణ సమయమున వస్త్రమును ధరించి భిక్షాపాత్రయు చీవరము (గుడ్డను)ను గొని యశుడు వెంబడిరాఁగా గృహపతియగు శ్రేష్ఠి యింటి కరిగెను. అచ్చట తనకై సిద్ధపఱచిన ఆసనముపై కూర్చొని యున్నంత ఆయుష్మంతు డగు యశుని తల్లియు, వెనుకటి భార్యయు భగవంతుని వద్దకు వచ్చిరి. ప్రణమిల్లి యొకచో గూర్చొనిన వారికి యొప్పటివలె ఆనుపూర్వికకథను భగవంతుడుపదేశిం చెను. అంతటనె వారు భవ్యచిత్తము గలవారును ప్రసన్నచిత్తలును నగుటచూచి భగవంతుడు బుద్ధులకు సముత్కర్షకమగు (పాకిలాగునట్టి) ఉపదేశమైన ''దుఃఖము – సముదయము – నిరోధము – మార్గము'' లను ప్రకటించి చెప్పెను. వారిరువుర కును తక్షణము విరజధర్మచక్షువుత్పన్నమైనది. దృష్టధర్ముడగు బుద్ధగురుని ధర్మ మునందు విశారదలై విస్మయచిత్తలై యథారీతి మూడువాక్యములు బలికి నాటినుండి తమ్ము సాంజలి శరణాగత ఉపాసికలనుగ భగవంతుడనుగ్రహించునట్లు వేడికొనిరి. లోకమునందు మూడు మాటలచే శరణు జొచ్చిన ప్రథమ ఉపాసికలు వీరే.

భగవంతుడును యశునితోకూడి ఉత్తమ ఖాద్యములను భుజించి సంతృప్తుడై తన్ను పరివేష్టించి కూర్చొనిన యశుని తలిదండ్రులకును పూర్వపత్నికిని ధార్మికకథలను రంజకముగ బోధించి యథేచ్ఛ మెయి బోయెను.

వారాణసి యందు శ్రేష్ఠికులజులు యశునకు పూర్వగృహస్థమిత్రులు నగు విమలుడు – సుబాహుడు – పూర్ణజితుడు – గవాంపతి యనువారు నలువురు తమ మిత్రుడగు యశుడు తలను గడ్డమును గొఱిగించుకొని కావిబట్టలు ధరించి యిల్లువదలి సంన్యసించినాడని వినిరి. ''అధర్మవినయము ( ధార్మికసంప్రదాయము) మహత్తమమైనదై యుండనోపు. వారి సంన్యాసము చిన్న చూపున జూడరానిది. అటుగానిచో యశకులపుత్రు నంతటి వాడెందుకు దాని ననుసరించ గలడు? చూతముగాక'' యని నలువురును వితర్కించుకొని యశుడున్న చోటికి వచ్చి నమస్కరించి యొకచో నిలిచిరి. వారిని తోడగొని యశుడును భగవంతుని సన్నిధానమున జేరి ''ప్రభూ! వీరు కాశియందలి శ్రేష్ఠి – అను శ్రేష్ఠివంశజులు. వీరి పేర్లివి'' యని విస్తారముగ పరిచయము జేయించి యొకచో గూర్చొనెను. బుద్ధదేవుడును వారికిని ముందటివారివలెనే ఆనుపూర్వికకథ జెప్పి ధర్మచక్షువును ప్రసాదించి వారికోర్కెమై ఉపసంపదయు ప్రవ్రజ్య (సంన్యాసము)యు లభింపజేసెను. వారితో గలిసి అప్పటికి లోకమందు అర్హతులు పదునొకండుమంది.

మరియు నంతట ఆయుష్మంతుడగు యశుని గ్రామనివాసులు కుమారకులు యేబదిమంది యీ విషయమంతయు విని అచ్చెరువుతో తాము నాకర్షితులై యశుని చేరబోయి బుద్ధుని చెంగట నాశ్రయము బొందిరి. బుద్ధదేవుడును యెప్పటివలె ఆనుపూర్వికకథను, ఆర్యసత్యవివరణమును ఆదేశించినంత వారికి ధర్మచక్షువు సంభవించినది. ధర్మమునందు విశారదులై ప్రవ్రజ్యను, ఉపసంపదను అభిలషించిన ఆ యేబది కుమారకులకును ధర్మము స్వాఖ్యాతమైనది. ఆత్యంతిక దుఃఖనివృత్తికై బ్రహ్మచర్యపాల నమునకై దొడంగుడనియు నిర్దేశించి ప్రవ్రజ్యయు ఉపసంపదయు భగవంతుడు లభింపజేసెను. దానిచే వారిచిత్తములు నిరాస్రవములు నిర్మలములు నైనవి. అప్పటికి ఇట్లు అర్హతులు అరువదియొక్కరై యేర్పడిరి.

## ౬

## చారికాసూత్రము ఉపసంపదాప్రకారము

### భద్రవర్గీయులయొక్కయు, కాశ్యపబంధువులయొక్కయు సంన్యాసము

[1]ఒకనాడు భగవంతుడు భిక్షువులను బిలిచి యిట్లనియె. ''ఓ భిక్షువు లారా! దివ్యములును మానవములునునైన వివిధ పాశబంధములనుండి నేను విము క్తుడను.

1. సంయుక్తనికాయ 4 – 1 – 4 – మహావగ్గ [1].

మీరును నట్లె కాగల్గుదురు గాక. బహుజన హితార్థముగ, బహుజన సుఖార్థ ముగ, లోక సంగ్రహబుద్ధితో దేవమనుష్యులకు ప్రయోజనకరముగ – హితకరముగ – సుఖకరముగ యెల్లెడల చారిక (సంచారము) నొనర్చండి. ఒకదారిని యిద్దఱు బోవద్దు. ఓ భిక్షువులారా! ఆదికల్యాణము, మధ్యకల్యాణము. అంత్యకల్యా ణము నగు ధర్మము నుపదేశించుచు బొండు. అర్థ (వ్యంజన) సహితమును, కేవలమును పరిపూర్ణమును పరిశుద్ధమును నగు బ్రహ్మచర్యమును ప్రకటించండి. లోకమునందు అల్పదోషయుతులగు ప్రాణులు ధర్మమును విననిచో చెడుదురు. విన్నచో ధర్మవేత్తలు కాగల్గుదురు. భిక్షువులారా! ఇదిగో నేను కూడ ఉరువేలా ప్రాంతమందలి సేనానీగ్రా మమునకు ధర్మదేశనమునకై పోబోవు చున్నాను.''

[1]ఆ సమయమున భిక్షువులు నానాదిశలనుండియు, నానా దిక్కుల నుండియు ప్రవ్రజ్య నభిలషించువారును, ఉపసంపదను గోరువారును నగు మను ష్యుల దీసికొని వచ్చుచుండిరి. భగవంతుడును వారిని పరివ్రాజకులుగ ఉపసంపన్ను లుగ జేయుచుండెను. ఈ ప్రయత్నము భిక్షువులకును ప్రజలకును వేసట గల్గించు చుండెను. ఒకానొక దినము ఏకాంతమున ధ్యానస్థితుడై బుద్ధదేవుడు తనలో యిట్లు వితర్కించెను. ''జనపదవాసులను నాకడకు కొనిరాకుండ భిక్షువులు తామె వారిని ప్రవ్రజితులనుగ ఉపసంపన్నులనుగ జేయునట్లు అనుజ్ఞ యెందుకు నే నివ్వరాదు?'' అని యోచించి యొక సంధ్యాసమయమున భిక్షు సంఘమును గూర్చి ధర్మకథా ప్రవచనము ముగిసిన పిదప వారితో నిట్లనియె. ఓ భిక్షువులారా! ఏకాంతమున నేనొక నిశ్చయము జేసితిని. మీకిదె నేననుజ్ఞ నిచ్చుచున్నాను. ఇకపై మీరే యెచ్చటి వారచ్చట అర్హులైనవారికి ప్రవ్రజ్య నొసంగ వచ్చును. ఉపసంపద నివ్వవచ్చును. ఉపసంపదనిచ్చు ప్రకారము వినుడు. ''మొదట తలయు గడ్డమును గొఱిగించి కావిగుడ్డల గట్టజేసి పైగుడ్డ నొక భుజముపై ధరింపజేసి, భిక్షువులకు పాదవంద నములు జేయించి, మోకాళ్ళపై కూర్చుండబెట్టి అంజలి బట్టించి యిట్లు పలికింప వలెను. 'బుద్ధుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును శరణుజొచ్చు చున్నాను. సంఘమును శరణు జొచ్చుచున్నాను.' ఇట్లు ముమ్మారు బలికించి ఈ శరణాగమన ములచేత వారికి ప్రవ్రజ్యయు ఉపసంపదయు నొసంగుడని మీకు అనుమతి యిచ్చు చున్నాను.''

[2]భగవంతుడు వారాణసియందు ఇష్టానుసారము విహరించి అర్వదిమంది భిక్షువులను ధర్మదేశనమునకై ఆ యా దిక్కులకు బంపించి తానును ఉరువేలా ప్రాంత

(1) మహాగ్గ[1].  (2) జాతక నిదానకథ.

మున చారికాగమనమునకై వెళ్ళెను. దారియందు తటస్థించిన [1]వనఖండము నొండు జూచి అందులోనికి బోయి ఒక చెట్టుక్రింద గూర్చొనెను. ఆ సమయమున భద్ర వర్గీయు లనబడు ముప్పదిమంది మిత్రులు తమ భార్యలతో గూడికొని యా వనమున వినోదముగ విహరించు చుండిరి. అందులో నొక్కడు భార్య లేమింజేసి వేశ్యను తోడగొని వచ్చియుండెను. అదియు వారందఱును మద్యపానమున మత్తిల్లి యుండు తరుణమును జిక్కించుకొని నగల నా భూషణముల నన్నిటి నపహరించి పారిపోయినది. తెలివిదెచ్చుకొని తెప్పిరిల్లి మిత్రుని సహాయమున అందఱును గలిసి ఆ వేశ్యను వనము నంతయు గాలించి వెదకుచు భగవంతుని చెంగటకు వచ్చిరి. చెంతజేరి ''భంతే! తామేమైన యిందొక చేడియను చూచినారా?'' యని యడిగిరి.

భగవంతుడును విషయమంతయును అడిగి తెలిసికొని ''కుమారులారా! మిమ్ము మీరు వెదకికొనుట మంచిదో, మఱొక్క కాంతను వెదకుట మంచిదో యోచించి చెప్పు'' డనెను.

''భంతే! తన్ను (ఆత్మను) తాను వెదకికొనుటయె మంచిది గదా.'' కుమారు లారా! అటులైన కూర్చొనుడు. మీకు ధర్మోపదేశమొనర్చెదనని, ప్రణమిల్లి యొకచో సమాధానమున గూర్చొన్న వారికి యెప్పటివలె ఆనుపూర్విక కథను జెప్పి భగ వంతుడు ధర్మమునందు విశారదులనుగ జేసెను. వారును కోరినంత 'ధర్మము స్వాఖ్యాతమైన దనుచు జెప్పి ప్రవ్రజ్యయు నుపసంపదయు లభింపజేసెను.

అచ్చటనుండి క్రమముగ భగవంతుడు ఉరువేలము జేరుకొనెను. ఆ సమ యమున ఉరువేలమునందు ఉరువేలకాశ్యపుడు, నదీ కాశ్యపుడు, గయాకాశ్యపు డను ముగ్గురు [2] జటిలబ్రాహ్మణులు నివసించుచుండిరి. ఏనూర్వురు జటిలులకు ఉరువేలకాశ్యపుడు నాయకుడు. మూడువందల జటిలులకు నదీకాశ్యపు డాచా ర్యుడు, ఇన్నూరు మందికి గయాకాశ్యపుడు అధినేత.

భగవంతుడు బుద్ధుడు ఉరువేలకాశ్యప జటిలునివద్దకు బోయి ''ఓ కాశ్యపా! నీకెట్టి యిబ్బందియు లేనిచో ఈ యొక్క రాత్రి నీ అగ్నిహోత్రశాలయందు నివసించి వెళ్ళెద'' ననెను

''మహాశ్రమణా! నాకెట్టి కష్టమును లేదు. అయినను ఆ శాలయందు ప్రచండమగు ఘోరసర్పమొకటి గలదు. దానిచే నీకు హాని గలుగగలదేమో'' అని జటిలుని మాట.

---

1. కప్పాసియ వనఖండము (జాతక నిదానకథ).
2. ఆనాటికాలమున బ్రహ్మచారి, జటాధారి, అగ్నిహోత్రియునై యుండు బ్రాహ్మణులం దలి యొకానొక సంప్రదాయము.

''కాశ్యపా! సర్పము నన్నేమియు చెనక లేదు. అనుమతియిమ్ము''

''శ్రమణా! శుభం భవతు.''

భగవానుడు అగ్నిశాలయందు ప్రవేశించి తృణాసనమును బఱచి, మేను జక్కనిలిపి స్థిరముగ గూర్చొనెను. భయంకరసర్పము పొగలుసెగలు గ్రక్కుచున్నది. దానిని గాంచిన బుద్ధదేవుడు తనలో నిట్లు తలంచసాగెను. ''దీని శరీరమున కెట్టిహానియు గల్గించకుండ నా తేజఃప్రభావమున దీనిని నిర్వీర్యమొనర్తునుగాక'' అని నిశ్చయించెను.

పన్నగము కోపాగ్నిచే మండిపోవుచున్నది. భగవంతుడు యోగాగ్నిచే వెలిగిపోవుచున్నాడు. అగ్నిశాల మిఱుమిట్లు గ్రుమ్మరించుచున్నది. ''అయ్యో! సుందర మూర్తియగు మహాశ్రమణుడొకడు అన్యాయముగ పామువాత బడిపోయెనే'' యని జటిల బ్రాహ్మణులు విలపించుచున్నారు. కాని రాత్రి ముగియుసరికి నిర్వీ ర్యమును నిస్తేజమును నగు పామును భగవంతుడు తన పాత్రయందు బట్టుకొని ఉరువేల కాశ్యపుని సమీపించి ''అయ్యా! ఇదిగో నీ సర్పము. నా తేజః ప్రభావమున దీని నిస్తేజము జేసితిని. చూడు'' మనెను. ఈ చమత్కారమును ( బుద్ధి ప్రతిహా ర్యము) జూచి నివ్వెఱపడి ''సహింపరాని విషసర్పమును నిస్తేజమొనర్చిన యిత డెవడో [1]మహా దివ్యశక్తిశాలి యగు మహాశ్రమణుడు కాబోలు'' నని భావించి సాదర ముగ ''మహాశ్రమణా! మీరిందే విహరింపుడు. భోజనమును ప్రతి నిత్యమును మీకు సమిర్పించుచుందు''నని విన్నవించెను. అందుకు యొడంబడి భగవంతుడందె విహరంచుచుండెను.

ఒకప్పుడు ఉరువేలకాశ్యపుని యింట నొక మహాయజ్ఞము జేయ నిశ్చయ మైనది. దానికి కావలసిన వస్తుసంభారములు అంగమగధ నివాసులు పలువురు తెచ్చియిచ్చెదరు. అప్పుడు ఉరువేల కాశ్యపునకొక ఆందోళన గల్గినది. ''నా యీ యజ్ఞకాలమున మహా శ్రమణుడిందే యున్నచో జనసముదాయమంతయు నతని తేజఃప్రభావములకు ముగ్ధులై పోగలరు. అంతట నతనికి సత్కార లాభములు పెఱుగగలవు. నాకు తఱుగగలవు. కావున రేపటినుండి యతడిచ్చట రాకున్నచో బాగుండెడిది.'' యని వితర్కించెను. ఉరువేలకాశ్యపుని యీ వితర్కమును గ్రహించినవాడౌటచే భగవంతు డచ్చటికి రాక మఱునాడు [2]ఉత్తరకురుభూమికి వెళ్ళి

---

1. మహావగ్గ [1]

2. మేరు పర్వతమునకు ఉత్తరదిశయందుండు ద్వీపము.

అచ్చట భిక్షాన్నమును గ్రహించి [1] అనవతప్త సరోవరమువద్ద భుజించి ఆ దినమంతయు నందే గడపెను. రాత్రియు గడచినంత ఉరువేలకాశ్యపుడు భగవంతుని కురంగటకు తానెటోయి ''మహాశ్రమణా! నిన్న రాలేదేమి! పలు మార్లు దలంచితిమి. నీ పాలిటి యాహారము సిద్ధపఱచియె యుంచితిమి'' అని వచించెను.

''కాశ్యపా! ఎందుకట్లు బల్కెదవు? నీ చిత్తమున నిట్టిట్టి వికల్పములు గల్గియుండలేదా? అందుకయ్యే నే నచ్చట రాలేద''ని తానెందెందు బోయినదియు చెప్పెను. అది విని ''యితడు యితరుల చిత్తవృత్తులను గూడ గ్రహింపజాలు నేర్పరి. ఈ మహాశ్రమణుడు మహానుభావుడు, దివ్యశక్తిధరుడు. అయినను నావలె అర్హతుడు మాత్రము కాజాలడ''ని ఉరువేల కాశ్యపుడు తలపోసెను. భగవంతుడు బుద్ధుడు యెప్పటివలె ఉరువేలకాశ్యపుని భోజనమును అంగీకరించి ఆ వనఖండమున కరిగి అందె విహరించుచుండెను.

మఱియొకప్పుడు భగవంతుడు తనకు దొఱకిన పాంసుకూలము (ప్రాత గుడ్డ) ను ఉతుకదలంచినంత దేవేంద్రుడు శక్రుడు తన చేతులతో పుష్కరిణి (కోనేరు) ని త్రవ్వి నిర్మించెను. మఱియు నాశక్రుడు అమ్మహాపురుషుని యింగిత మును గ్రహించి ఉతుకుటకొక పెద్ద బండయు, ఆఱవేయుటకొక కొమ్మయు నిర్మించి జూపెను. భగవంతుని భోజనమున కాహ్వానింపవచ్చి ఉరువేలకాశ్యపుడా చమత్కారములగాంచి ''ఈ మహాశ్రమణుడు మహానుభావుడు. దివ్యశక్తిధరుడు. అయినను నావంటి అర్హతుడు మాత్ర మెట్లు కాగలడు?'' అని తలచెను. బుద్ధుడును కాశ్యపుని భోజనమును గ్రహించి ఆ వనఖండమునందె విహరించుచుండెను.

అది మఱియొక సమయము. అకాలమేఘము పెల్లుగ కురిసి భూమినంతయు వెల్లువలు ముంచుకొన్నవి. తాను విహరించు భూమి కూడ జలమయమగుట జేసి బుద్ధదేవుడు దన ప్రభావముచే నీటినంతటిని ప్రక్కకు దొలగించి నేలపై యథారీతి విహరించుచున్నాడు. ''ఈ జలప్రవాహమున మహాశ్రమణుడేమై పోయెనో'' యని ఉరువేలకాశ్యపుడు తన జటిలపరిజనముతో నావయందు గూర్చొని అచ్చటికి వచ్చెను. నీటిని ప్రక్కకు దొలగించి ధూళియుక్తమగు నేలపై విహరించు నమ్మహానుభావుని గాంచి ''నిజమున కితడు దివ్యశక్తిధరుడు. కాని నా వంటి యర్హతుడు మాత్రము గాడ''ని యెప్పటివలె దలంచెను. భగవంతుడును వాని మూఢవిచారమును దొలగింపవలెనని యెంచి యిట్లనియె. ''కాశ్యపా! నీవు అర్హతుడవుకావు.

1. మానస సరోవరము.

ఆ దారిని త్రొక్కిన వాడవుకూడ కాదు. అర్హతుడుగ కాగల్గు ప్రకారముకూడ నీకు తెలియదుసుమా'' యనెను. లజ్జాభయములు పెనగొన ఉరువేలకాశ్యపజటిలుడు భగవంతుని పాదములపై శిరంబుంచి ''భంతే! ప్రవ్రజ్య నొసంగుడు, ఉపసంపదను దయచేయుడ''ని వేడికొనెను.

''కాశ్యపా! నీవు పంచశత జటిలురకు నాయకుడవు. వారితో సంప్రదించి రమ్మ''ని భగవానుడంప నతడును వారికడకుపోయి కథ యంతయు దెలిపి ''నేను మహాశ్రమణుని వద్ద బ్రహ్మచర్య గ్రహణమును పొందగోరుచున్నాను. మీరు మీ యిష్టా నుసారము బోవచ్చు'' ననెను

మీ దారినే మేమును అనుసరింతుమని పలికి యా జటిలబ్రాహ్మణులంద ఱును తమతమ అగ్నిహోత్ర పరికరములను, కేశజటాసామగ్రులను జలప్రవాహమున దొర్లించి భగవంతుని చెంతకు జేరి ప్రణామపూర్వకముగ ''ప్రభూ! ప్రవ్రజ్య నొసం గుడు ఉపసంపదను దయచేయుడ''ని వేడికొనిరి. భగవంతుడును ముందటి వారివలె వారిని కూడ ఉపసంపన్నుల జేసెను.

జలాధారయందు ప్రవహించిపోవు ఉరువేలకాశ్యపునియొక్కయు తత్పరిజ నము యొక్కయు వివిధసామగ్రులను జూచి నదీకాశ్యపుడును గయాకాశ్యపుడును చకితహృద యుల్లె ఉరువేలకాశ్యపుని వద్దకువచ్చి ఉన్న విషయమంతయు విస్తారముగ విని తామును తమ జటిలసంఘములతో సుగత దేవుని ఆశ్రయించి ఉపసంపద్దీక్షను బొందిరి.

భగవంతుడు బుద్ధు డిట్లు ఉరువేలమునందు యిష్టానుసారము విహరించి వేయిమంది జటిలభిక్షు సంఘముతో గయకు ప్రస్థానము జేసెను.

## ఆదిత్య పర్యాయసూత్రము – రాజగృహమందు బింబిసారునకు దీక్ష (వి. పూ. 470)

[1]భగవంతు డొకప్పుడు వేయిమంది భిక్షువులతో గూడి గయ యందలి గయాశీర్ష ( బ్రహ్మయోని పర్వత) ముపై విహరించుచుడెను. అందు ఆ భిక్షువులంద ఱిని అభిమంత్రించి యిట్లనియె. ''భిక్షువులారా! రాగద్వేష మోహాగ్నులచే, జన్మ

1. సంయుత్తనికాయ 43 – 3 – 6 మహావగ్గ [1]

జరామరణ ములచే, దుఃఖ దౌర్మనస్యములచే సమస్తము దహింపబడుచున్నది. చక్షురాదికములగు పంచేంద్రియములు దహింపబడుచున్నవి. రూపాదికములగు పంచవిషయములు దహింప బడుచున్నవి. చక్షురాదికములగు పంచేంద్రియముల యొక్క [1] విజ్ఞానములు దహింపబడు చున్నవి. చక్షువు మొదలగు పంచేంద్రియముల యొక్క సంస్పర్శములు దహింపబడు చున్నవి. ఆ సంస్పర్శములకు కారణములై వేదనలనబడు సుఖమును, దుఃఖమును, అసుఖమును, అదుఃఖమును, అవియన్నియు గూడ దహింపబడుచున్నవి. మనస్సు దహిం పబడుచున్నది. మనోధర్మములును, మనోవిజ్ఞానములును, మనస్సంస్పర్శములును, సంస్పర్శ జనిత వేదనలును రాగద్వేషాదికములగు అగ్నులచే దహింపబడుచున్నవి. వినుడు యిది నా మాట.

భిక్షువులారా! ధర్మమును వినునట్టి [2]ఆర్యశ్రావకుడు చక్షువు మొదలగు పంచేంద్రియములనుండి [3]నిర్వేదము పొందుచున్నాడు. రూపము మొదలగు పంచవిషయముల నుండియు, పంచేంద్రియ విజ్ఞానముల నుండియు, శీతోష్ణాదికములగువాటి సంస్పర్శలనుండియు, ఆ సంస్పర్శలచే ఉత్పన్నమగు సుఖము, దుఃఖము, అసుఖము, అదుఃఖము లనెడి వేదనలనుండియు నిర్వేదమును బొందుచున్నాడు.

అట్లే మనస్సునుండియు మనోధర్మము నుండియు, మనో విజ్ఞానము మనస్సంస్పర్శము తజ్జనితములగు వేదనలనుండి గూడ నిర్వేదము బొందుచున్నాడు.

నిర్వేదమును బొంది విరక్తుడై విముక్తుడగుచున్నాడు. విముక్తిని బొంది ''విముక్తుడననియు జన్మబంధములు దొలగినవనియు'' బ్రహ్మచర్యఫలము సిద్ధించినదనియు, కృతకృత్యుడ ననియు గూడ నతడెఱుంగుచున్నాడని బుద్ధగురుని వ్యాఖ్యానమును వినుచు వినుచు భిక్షువులు వేయిమందియును నిర్లిప్తచిత్తులై ఆస్రవ (క్లేశ) రహితులైరి.

[4]భగవంతుడు బుద్ధుడు యథేచ్ఛతో గయాశీర్షమున విహరించి తొలుత [5] తాను రాజగు బింబిసారున కిచ్చినమాటను దలంచికొని జటిలభిక్షుసహస్రముతో చారిక నొనర్చుచు రాజగృహమును జేరి తత్పరిసరమందు లట్ఠివన ఉద్యానమందలి సుప్రతిష్ఠిత చైతన్యమున విడిది జేసెను.

---

(1) ఇంద్రియవిషయ సంబంధమున గలుగు జ్ఞానము.

(2) స్రోతాపన్న – సకృదాగామి – అనాగామి – అర్హతులు.

(3) వైరాగ్యమునకు పూర్వావస్థ. (4) మహావగ్గ [1]. (5) జాతకనిదాన.

శాక్యపుత్రుడును ప్రవ్రజితుడును నగు శ్రమణ గౌతముడు తన నగరోపవన మున జేరియున్నాడను వార్త వనపాలకుని మూలమున మగధరాజగు శ్రేణిక బింబి సారుని చెవిని బడినది. ''బుద్ధుడు భగవంతుడు, అర్హతుడు, సమ్యక్ సంబు ద్ధుడు, విద్యాచరణయుక్తుడు సర్వోత్తముడు, సుగతుడు, ఆదర్శజ్యోతి, సర్వశాస్త్ర, సకలలోకసాక్షాత్కర్త, ఆదిమధ్యాంత కల్యాణకరమగు ధర్మవేత్త, పూర్ణ బ్రహ్మచర్య ప్రకాశకుడును'' నని వివిధ భంగుల నాతని కీర్తిని చెవులార విన్నవాడు గావున నమ్మహనీయుని సందర్శింప నరపాల చంద్రుడు కుతూహలించెను.

మగధ నివాసులగు బ్రాహ్మణులును గృహపతులును పదిరెండు నియుత (లక్ష) జనము తనతోడ్తోరాగ రాజేంద్రుడు భగవంతుని చేరువ జేరి నమస్కరించి గూర్చొనెను. తోడ వచ్చిన వారును బుద్ధ భగవంతునకు కొందఱు నమస్కరించియు, కొందఱు కుశల మడిగియు, కొందఱు ప్రవర (నామగోత్రములు) వినిపించియు, మఱియు కొందఱు ఊరకయు నందందు గూర్చొనిరి. గౌతమ మహాశ్రమణునితో గూడి ఉరువేల కాశ్యపు డుండుట చూచి గురువెవ్వడో శిష్యుడెవ్వడో యని వారిర్వు రివిషయమై మగధవాసులకు సందేహము గల్గినది. బుద్ధదేవు డది గ్రహించి ఉరువేల కాశ్యపునితో నిట్లనియె. ''కాశ్యపా! అగ్నిహోత్రములను నీవెందుకు వీడితివి?''

''దేవా! నిర్వికారమును అన్యదుర్లభమును నగు నిర్వాణ పథమును బొంది రాగాది మలయుతములును, కామేష్టిరూపములునునగు అగ్నికర్మలను వదలితి'' నని చెప్పి ఉరు వేల కాశ్యపుడు తన యాసనము నందుండి లేచి భగవంతునకు సాష్టాంగముగ ప్రణమిల్లి ''గురుదేవా! వీడే శిష్యుడు'' అనుచు ముమ్మాఱు బలికెను. అంతటితో మగధ నివాసుల శంకయు దొలగి ''ఉరువేల కాశ్యపుడే మహాశ్రమణుని వద్ద బ్రహ్మచర్య చరణ మొనర్చు చున్నాడ''ని నిశ్చయించిరి.

భగవంతుడు యథాపూర్వముగ వారికందఱికిని ఆనుపూర్వికథను జెప్పినంత మగధ నివాసులై, బ్రాహ్మణులును, గృహపతులునునై యుండు వారియందు పదునొకండు నియుత (లక్ష) జనమునకు కూర్చొన్న ఆసనముపైననే ''సముదయ ధర్మమంతయు నిరోధధర్మమ'' నెడి నిర్మల ధర్మచక్షువు సంభవించినది. తక్కిన నియుత సంఖ్యయు ఉపాసకత్వమును పొందిరి.

బుద్ధధర్మమునందు విశారదుడై **స్వతంత్రుడై**న బింబిసారుడు భగవంతునితో నిట్లనియె. ''భంతే! పూర్వము **కుమారావస్థ**యందు నాకైదు కోర్కెలుండినవి. రాజ్యాభి షిక్తుడ గావలెనని మొద**టి కోరిక. అది** నెర వేఱినది. నా రాజ్యములోనికి

సమ్యక్ సంబుద్ధుడగు అర్హతుడు రావలెనని రెండవ కోరిక. అదియు యీడేఱినది. అమ్మహాత్ముని సేవింపవలెనని మూడవకోరిక. అదియు సిద్ధించినది. అతడు నాకు ధర్మోపదేశము చేయుగాక యని చతుర్థ కామన, అదియుగూడ పూర్తియైనది. ఆ భగవంతుని ధర్మమును నేను తెలిసికొని ధారణచేయవలెననుట అయిదవ అభిలాష. అదియు ఫలించినది. దేవా! దారితప్పిన వానికి మార్గము జూపినట్లు వివిధ పర్యాయముల ధర్మము నెఱుగ జెప్పితిరి. భగవంతుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును భిక్షుసంఘమును గూడ. నేటినుండి నన్ను సాంజలి శరణాగత ఉపాసకునిగ స్వీకరించండి. రేపటి దినము భిక్షుసంఘముతో గూడి నా (భోజన) నిమంత్రణమును అంగీకరింతురుగాక'' యని వేడికొనెను.

మౌనరూపముననే భగవంతుడొసగిన యనుజ్ఞను గొని ప్రణామమొనర్చి మగధపతి తనయింటికి బోయెను. రాత్రి గడచినంతనే ఉత్తమములగు ఖాద్యభోజ్యముల నాయత్తప ఱచి భగవానుని కడకేగి సమయమైనదని సూచించెను. ఆ పూర్వాహ్ణ సమయమున భిక్షాపాత్ర చేతధరించి, తోడ జటిల భిక్షువులు వేయిమంది వచ్చుచుండ భగవంతుడు రాజగృహమున ప్రవేశించెను.

మగధపతి బింబిసారుడును తనయింటియందు పఱచిన ఆసనములపై భిక్షు సంఘ సహితముగ బుద్ధుని గూర్చుండ జేసి చేతులార వారి నుత్తమ భోజ్యములచే సంతృప్తుల జేసి వారందఱును భోజనకర్మయందు విశ్రాంతి పొందుట చూచి యొకచో గూర్చొని యిట్లు వితర్కించెను.

''విహరించుటకు భగవంతునకొక విహారముండుట తగును. అది యూరికి మిగుల దూరముగ నుండరాదు. మఱింత దగ్గఱయు నుండరాదు. అపేక్షగలవారికి రాకపోకల కనుకూలముగ నుండవలెను. పగటియందు జనసమ్మర్దము లేనిదియు, రాత్రులందు శబ్దమధికము లేకుండునదియునై మొత్తముమీద యేకాంతస్థానము యోగ్యముగ నుండును. అట్టి విషయముల కన్నింటికిని నాయుద్యానమగు వేణు వనము చక్కగ యొప్పియున్నది. దానినే వీరికి సమర్పింతునుగాక'' యని నిశ్చయించెను.

''ప్రభూ! నా ఉద్యానమగు వేణువనమును బుద్ధప్రముఖభిక్షుసంఘమునకు దానముగ సమర్పించుచున్నాను.''

భగవంతుడందుకు సమ్మతించి వివిధ ధర్మకథాప్రసంగములచే మఱియు, బింబిసారుని సంతృప్తుని జేసి భిక్షుసంఘముతో ''భిక్షువులారా! ఆరామము (ఆశ్ర

మము) లను గ్రహించుటకు అనుమతి యిచ్చుచున్నా'' నని పల్కి ఆసనమునుండి లేచిపోయెను.

౮

## సారిపుత్ర మౌద్గల్యాయనుల సంన్యాసము (వి. పూ. 470)

★ ఆ కాలమున రాజగృహమునందు సంజయుడను పేరుగల పరివ్రాజకు డొకడు రెండువందల యేబది మందిగల పరివ్రాజక సంఘమొక దానితో కూడి నివసించుచుండెను. ఆ సంజయ పరివ్రాజకుని వద్ద సారిపుత్రుడను, మౌద్గల్యాయను డును బ్రహ్మచర్య చరణ మొనర్చుచుండిరి. వారిరువురును తమలో తాము ''అమృ తజ్ఞానమును ముందు పొందిన వాడు ప్రక్కవానికి కూడ దానిని తెలియజేయవలె'' నని యొక తీర్మానము జేసికొనిరి.

అంతట ఆయుష్మాన్ అశ్వజితుడు పూర్వాహ్ణసమయమున చక్కగ నాచ్ఛా దితుడై పాత్రచీవరములనుగొని ప్రశాంత సంయమవిలోకనముల క్రిందికి జూచుచు భిక్షకొఱకు రాజగృహ పురములోనికి వచ్చెను. సారిపుత్రుడాతని భంగిమమును దిలకించి ''యితడెవడో అర్హతుడైన కావచ్చును. లేదా ఆ మార్గమును బట్టిన వాడైనను కావలెను. ఇతని గురువెవడో, ధర్మసంప్రదాయ మెద్దియో అడిగి తెలిసికొందును గాక'' యని తలంచెను.

అంతటిలో అశ్వజితుని భిక్షాచరణము ముగిసినది. అతడు వెనుకకు మఱలి నాడు. అందుకై వేచికొనియున్న సారిపుత్రుడును సమీపించి వచ్చి కుశలమడిగి ''ఆయుష్మంతా! నీ యింద్రియములు ప్రశాంతములు. నీ మూర్తి ఉజ్జ్వలము. అయ్యా! నీ వేగురుని వద్ద ప్రవ్రజించితివి? నీ వెవని ధర్మము ననుసరించితి'' వని యడిగెను. ''ఆయుష్మంతా! శాక్యపుత్రుడగు మహాశ్రమణుడు భగవంతుడు బుద్ధుడు నాకు గురుడు. అతని నాశ్రయించి ప్రవ్రజించితిని. అతని ధర్మమునే నే నంగీకరింతును.''

''అయ్యా! మీ ఆచార్యు డేసిద్ధాంతమును జెప్పెడివాడు?''

''ఆయుష్మంతా! నేనీ ధర్మమందు క్రొత్తగా జేరితిని. అందుచే ఆపరిచయము నాకు కొంచెము. అయినను సంక్షేపముగ జెప్పెదను. ''

---

★ వినయ – మహావగ్గ 1

''వ్యర్థమగు విస్తారముతో బనియేమి? ముఖ్యమగు అర్థమునే తెల్పుము.''

అంతట ఆయుష్మంతు డశ్వజితుడు సారిపుత్ర పరివ్రాజకునితో ధర్మపర్యాయ (ఉపదేశ) ము నిట్లు జెప్పుచున్నాడు.

''హేతువు (కారణము) కలిగి జన్మించు దుఃఖాదికములగు ధర్మముల యొక్క హేతువును (సముదయమును) వాటి నిరోధమును గూడ తథాగతుడు చెప్పుచున్నాడు. ఇదియే (సముదయము – నిరోధము) మహాశ్రమణుని వాదము. (సిద్ధాంతము – ప్రతిపత్తు).''

అశ్వజితుని ద్వారా యీ ధర్మపర్యాయమును విని సారిపుత్ర పరివ్రాజకునకు ''సముదయ ధర్మమంతయు నిరోధ ధర్మమే'' యనెడి విరజ ధర్మచక్షు వుత్పన్న మైనది.

మొగ్గలాయన (మౌద్గల్యాయన) పరివ్రాజకుడును తనకడకు వచ్చు సారిపుత్ర పరి వ్రాజకుని దూరమునుండియే గాంచి విస్మయముతో డగ్గఱి యిట్లనియె.

''ఆయుష్మంతా! నేడు నీ యింద్రియములు ప్రసన్నములై యున్నవి. నీ కాంతి ఉజ్జ్వలమై యున్నది. అమృతమును త్రాగితివా యేమి?

''అవును. అమృతపానము జేసితిని.''

''ఆయుష్మంతా! యెట్లు పడసితివి? అని మౌద్గల్యాయను డడిగినంత యత నికి అశ్వజితుభిక్షుని దర్శించినది మొదలు అతనితో నడిపిన సంవాదమంతయు సమగ్రముగ సారిపుత్రుడు వివరించి చెప్పెను. అది విని మౌద్గల్యాయన పరివ్రాజకున కును ధర్మచక్షువు సముత్పన్నమైనది.

అంతట వారిరువురును ''భగవంతుడు బుద్ధుడే మన కాచార్యుడు. అతని కడకే పోదము పద'' మని తమలోతాము కలియబలికికొని తమతోడివారైయుండు ఇన్నాట యేబదిమంది పరివ్రాజకసంఘమువద్దకు వెళ్ళి యిట్లనిరి. ''ఆయుష్మంతు లారా! మాకు ఆచార్యుడు బుద్ధభగవంతుడు. మేమతనియొద్దకు పోవుచున్నాము. ఇక మీయిచ్చ చొప్పున మీరు బోవచ్చును.''

అయ్యలారా! మేమందఱమును మీ ఆశ్రయమున, సాహచర్యమున యిందు న్నాము. మీరు పోవుచోటికి మేమును వచ్చెదము. మనమందఱమునుగూడి మహాశ్రమ ణునివద్ద బ్రహ్మచర్య చరణ మొనర్చెదముగాక'' యని వారందఱును తీర్మానించిరి.

అటపై సారిపుత్ర మౌద్గల్యాయను లిరువురును సంజయ పరివ్రాజకుని చెంత కరిగి తాము బుద్ధభగవంతుని జేరబోవువారమని జెప్పిరి.

ఆ మాట విని సంజయ పరివ్రాజకుడు విభ్రాంతుడై వారిని నివారించి ''ఆయుష్మంతులారా! వలదువలదు. మనము మువ్వురమును గలిసి యీ పరివ్రాజక సంఘమునకు మహంతులమై యుందము. అంతటి హక్కు మీకు నొసగుచున్నాను పోకుడ'' ని నిర్బంధించెను.

సంజయపరివ్రాజకుడు ముమ్మాఱు నివారించినను వారు తమ పూన్కి నుడుగక యిన్నూట యేబదిమంది పరివ్రాజకులతో గూడి భగవంతుడుండు వేణు వనమునకు బోయిరి. భగవంతుడును దూరము నుండియే వారిని జూచి తనయొద్ద నుండు భిక్షువులతో ''భిక్షువులారా! కోలితుడు (మౌద్గల్యాయనుడు) ఉపతిష్యుడు (సారిపుత్రుడు) నాబరగు అదిగో! వచ్చుమిత్రులిద్దఱిని జూడుడు. వారిటపై నా సంఘము నందు అగ్రశ్రావక యుగళులనియు, భద్రయుగళులనియు పేరువడసె దర'' ని చెప్పు చుండెను.

ఆలో నయ్యిరువురును చేరవచ్చి భగవంతుని చరణములపై శిరమువంచి నమస్కరించి, ''భంతే! ప్రవ్రజ్యను ఉపసంపదను అనుగ్రహించుడ'' ని వేడికొనిరి.

శాస్తయగు బుద్ధుడును పూర్వోక్తక్రమమున ఆయుష్మంతులగు, సారిపుత్ర మౌద్గల్యాయనులకు ఉపసంపద లభింపజేసెను.

## కాశ్యప సంన్యాసము (వి. పూ. 470)

[1]మగధ దేశమున మహాతిత్థ (తీర్థ) మను అగ్రహారమునందు వసించు కపిల బ్రాహ్మణునకు ప్రధాన భార్యగర్భమున [2] పిప్పలీమాణవకుడను పుత్రుడు కలిగెను.[3] మద్రదేశమున [4] సాగలమను పట్టణమునందు కౌశిక గోత్రుడగు నొక బ్రాహ్మణునకు ప్రముఖ భార్యయందు కల్గిన సంతానము భద్రాకాపిలాయని యను కూతురు.

1. థేరగాథా - అట్ఠకథ 30 1 సంయు - ని. అట్ఠ కథా 15 - 1- 11 1అంగు-ని - అట్ఠకథ 1 -1 - 4.
2. బ్రాహ్మణ విద్యార్థి
3. రావీ చనాబ నదుల మధ్యదేశము
4. స్యాలకోట (పంజాబ్)

క్రమముగ పెరిగి పెద్దవారై పిప్పలీమాణవకుడు యిర్వది యేండ్ల యీడువాడును, భద్రాకాపిలాయని పదునాఱేండ్ల యీడుగలదియును నైరి. తల్లిదండ్రులు పుత్రుని జూచి "కుమారా! నీకు వయస్సు వచ్చినది. కులవృద్ధికరమగు మార్గమును నెమకవలయును గదా!" యని పలుభంగుల నిర్బంధించుచు వచ్చిరి. మాణవకుడును "పితరులారా! నన్ను పీడింపకుడు. మీరు జీవించి యున్నంతకు మీ సేవ జేసి మదుపరి సంన్యసించెద" నని సమాధానమిచ్చెను. తఱచుగ తల్లిజేయు ఒత్తిడికి తాళలేక అతడొక సాకుజూపి తప్పించుకొననెంచెను. ఒక శిల్పిచే వేయికాసుల బంగారము వెట్టించి దివ్యసుందరమగు నొక కాంతా విగ్రహమును నిర్మింపజేసెను. ఎఱ్ఱబట్ట కట్టించి పలువన్నెల పూలను జుట్టి సర్వాలంకార భూషితముగ నా ప్రతిమను నిలిపి తల్లిని చేరబిలిచి "అమ్మా! అచ్చము దీనివలెనుండు ఆడుది దొరకినచో నేను గార్హస్థ్యమున బ్రవేశించెదను" అని వచించెను.

ఆమెయు మహావిదుషి "నా కుమారుడు సుకృతాత్ముడు. అతని పుణ్యమే, కోరినట్లు సువర్ణ వర్ణయగు కాంతను కల్పించి యివ్వక పోద" ని తలంచి యెన మండ్రు బ్రాహ్మణులను పిలిపించి కోర్కిదీర కాన్కలనొసగి వారితోడ్త బంగారు బొమ్మను రథముపై బెట్టించి యిట్లనియె. "అయ్యలారా! మీరు దేశమంతయు గలయదిరిగి, జాతి గోత్రములతో భోగభాగ్యములతో మాకు అనురూపమైయుండి ఈ స్వర్ణవిగ్రహమును బోలిన కన్య నొక్క దాని యేఱిపట్టుకొని వివాహము నిశ్చ యించి ఈ సువర్ణ ప్రతిమను వారికడనే నుంకువగ నుంచిరండు. పొండని" పంపించెను.

ఆ భూసురులును వల్లెయని బయలు దేరిపోవుచు "మద్రదేశము చక్కని కాంతలకు పేరువడసినది. అందేబోయి వెదకుదము" అని మద్రదేశమునకుజని సాగల నగరమును బ్రవేశించిరి. అచ్చటి యొకానొక స్నానఘట్టముపై వారుదెచ్చిన కాంచన విగ్రహము నునిచి యొకచో గూర్చొనిరి. అచ్చట దాది యొకతె భద్రాకాపిలా యనిని జలకమాడించి యలంకరించి రంగమహలునందు జేర్చి తాను స్నాన మాడు టకు స్నానఘట్టమునకు వచ్చినది. ఘట్టముపై నిలువబెట్టియున్న బంగారు బొమ్మను జూచి భద్రాకాపిలాయనిగ భ్రమించి సమీపించి "నిర్లజ్జవై యిందున్నా వెందుక" ని వీపుపై తట్టెను. తాకినంతటనే అది ప్రతిమగ నెఱింగి "ఓహో పొఱ బడితిని. నా స్వామికసె యీ ప్రతిమకును పోలిక యెక్కడిది? ఆమె గుడ్డలుమోయు దాసికైనను దీటు వచ్చునా?" యని అపహసించెను.

ఆ మాట లాలించిన వారొట బ్రాహ్మణులాదాదిని చుట్టుముట్టి ప్రశ్నించి "సువర్ణ ప్రతిమకంటె అనంతగుణముల సుందరియు, దీపమువలె ప్రకాశించున దిగను భద్రను గుఱించి యెఱింగి వారియింటికరిగిరి. గృహస్వామియగు కౌశికగోత్ర బ్రాహ్మణుడు ఆ భూసురుల నెదుర్కొని సత్కారపూర్వముగ వారి రాకనుగూర్చి యడిగెను. వారును విస్తారముగ తమ యాగమన వృత్తాంతము నెఱింగించి కన్యనడిగిరి. ఆ బ్రాహ్మణుడును అనుకూలసంబంధముగ గ్రహించి యంగీకరించెను. బ్రాహ్మణులును ఆ వార్తను తిరిగి కొనిపోయి కపిల బ్రాహ్మణదంపతుల కెఱిగించిరి.

పిప్పలీమాణవకుడు ఈ తనయుక్తి మొక్క పోవుటజూచి వేఱు మార్గముగానక స్వయముగ భద్రకొక కమ్మవ్రాసి పంపెను. "భద్రా! నీకు యోగ్యుడగు పతిని యేఱికొనుము. నేను కొద్దికాలములో సంన్యసించెదను. నన్ను నమ్మికొన్నచో పిదప దుఃఖింపవలసివచ్చును."

అక్కడ భద్రయుగూడ మొదటినుండి విరక్తశీల గాబట్టి పిప్పలీమాణవకునికి "ఆర్యపుత్రా! నీకు అర్హమగుసతిని గ్రహింపుము. నేను కొద్దికాలమునకు ప్రవ్రజించెదను. అటపై నీవు దుఃఖిపవలసివచ్చున" ని లేఖ వ్రాసిపంపినది.

పత్రవాహకులు దారిమధ్యమున కలిసికొని యిర్వురిజాబులను చదివి "పిల్లలు పెద్దపోకడలకు పోయినార" ని అపహసించి వాటిని జించివైచి వాటిస్థానమునందు పరస్పరము అనురాగమును సూచించునట్లు అనుకూలపత్రములను వ్రాసి వారికి జేర్చిరి.

తలవని తలంపుగ దైవవిధిచే యొడమూడిన సంబంధముతో భద్రయు, పిప్పలీమాణవకుడును భార్యాభర్తలయ్యు బ్రహ్మచర్యనియమమునకు భంగము వాటిల్లకుండ పవిత్రులై మెలగిరి. శయ్యామధ్యమున పూలదండ నునిచి కుడివైపు పతియు యెడమవైపు సతియు పరుండి యుండియు శరీర స్పర్శభీతిచే చక్కగ నిద్రించువారు గూడ కాదు. విలాసముల మాట యెందుకు? చిఱునవ్వైనను నవ్వుట లేదు. ఇట్టి అగాధ గంభీరమగు సంయమ వ్రతములో కుమారీ కుమారకులు ముదుసళ్ళు జీవించియున్నంతకు యింట కాలము గడపిరి. పాతర్ల కొలది ధనము, పండ్రెండామడల పొడవున భూములు, గొప్పవియగు పదునాలుగు గ్రామముల జాగీరు, పదునాలుగు యేనుగుల గుంపులు, అశ్వదళములును, రథ దళములును ఒక్కొక్కటి పదునాలుగు కల్గి వారి సంపద అంతింతనరానిది.

బ్రాహ్మణ కుమారుడొకనాడు గుఱ్ఱముపైనెక్కి భూముల దున్నించుటకై పోయెను. దున్నుటచే భూమినుండి బయటపడిన పురువులను కాకులు మొదలగు పక్షులు చుట్టుకొని తినుచుండుటను గట్టుపై నిలిచి పరికించెను. వెంటనే తనతోడి వారితో ''ఆ పక్షులేమి దినుచున్నవ'' ని యడిగెను. వారును క్రిమికీటక ప్రాణులను దినుచున్నవని జెప్పిరి. విహ్వలుడై యిట్లనెను. ''ఆ పాపమంతయు నెవ్వటికి?''

''మీకే'' అని జవాబు.

''పాపభూయిష్ఠమగు యింత యైశ్వర్యముతో నాకు బని యేమి? అంతయు భద్రకు అప్పగించి ప్రవ్రజించెదను.'' అని నిశ్చయించెను.

అక్కడ యింటియందు భద్రకుగూడ యిట్టి ఘటనయె గూడినది. నువ్వుల నెండబోయించి భద్ర, వాటి యెదుట గూర్చొన్నది. ఆ గింజలలోని పుర్వులు మల మల మాడిపోవుట జూచి దాసీజనముతో ''ఆ పాపమెవ్వరికి తగులున'' ని యడిగెను. వారును ''మీకే'' యని సమాధాన మొసగిరి. ఆమెయు విహ్వలయై భర్త యింటికి వచ్చినంతనే సర్వ మతని కర్పించి తాను సంన్యసింప తీర్మానించినది.

పతి పత్నులిర్వురును భుజించి మేడపై యేకాంతమున మంచముమీద గూర్చొని నారు. మాణవకుడు మొదట తనయభిప్రాయము నెఱిగించెను. భద్రయు తానునందుకే సంసిద్ధమైయున్నాన'' ని తీర్మానించెను. వెంటనే యిర్వురును కావిగుడ్డ లదాల్చి, భిక్షాపాత్రల ధరించి యొకరివెంట్రుకల నొకరు త్రుంచివైచికొని ''ప్రపంచ మునందు సర్వజ్ఞుడగు అర్హతు డెవ్వడుగలడో యతని నుద్దేశించియే, మా యీ ప్రవ్రజనమ'' ని ప్రతిజ్ఞ పలికి యెవ్వటికిని దెలియరాకుండ మేడదిగి బయలు దేరి పోయిరి.

కొంతదూరమరిగినంత ప్రాంతీయులగు పరిచితజనులు వారి వేషముల జూచి మిక్కిలి విలపించి వెనుకకు రాగోరిరిగాని ఆ మాటల బెడచెవిబెట్టి తమదారిని తాము బోయిరి.

మఱియు కొంతదారి నడిచిరి. స్థవిరు డిట్లు తలపోయసాగెను. ''అమూల్య సౌందర్యవతియగు భద్ర నా వెంటనుండుట జూచి లోకము పలువిధముల శంకిం చును. పాపభావన జేసి జనులు నరకగాములౌదురు గదా'' యని తలంచుచున్నంత దారి రెండుగ జీలి రెండుత్రోవలు వచ్చినవి. అంతట నతడు ''భద్రా! పరివ్రాజకుడ నగు నా వెంట స్త్రీవగు నీవుండుట తగదు. చెరియొక దారిబట్టి పోద'' మని చెప్పెను.

''ఆర్యా! చిత్తము'' ని ఆమెయు నొడంబడి ముమ్మాఱు చుట్టుదిరిగి, నాలుగు స్థానములందు అయిదు అంగములచే వందనమొనర్చి దోసిలి జోడించి ''లక్షలాది కల్పములనుండి విడువకవచ్చు స్నేహగ్రంథి విడిపోవుచున్నది. ప్రభూ! మీరు దక్షిణ జాతివారు. కుడివైపు దారిని బట్టండి. స్త్రీలు వామజాతివారు. నాదారిని బోయెద'' నని యెడమవైపు దారిబట్టి భద్రాకాపిలాయని వెళ్ళిపోయినది.

సమ్యక్ సంబుద్ధుడు వేణువన మహావిహారమున గంధకుటియందు కూర్చొని యుండి పిప్పలీమాణవకుడును, భద్రాకాపిలాయనియును అపారసంపదనువీడి ప్రవ్రజి తులై వచ్చుచున్నారనుట ధ్యానదృష్టిని విలోకించెను. వారిని తనకడ చేర్చు కొనదగినవారిగ నూహించి పాత్రచీవరములను గొని యందుండి లేచి మూడుపరు వుల నేల ముందుకు నడిచి రాజగృహమునకును నాలందకును మధ్యనుండు ''బహుపుత్రక'' మను మఱ్ఱిచెట్టు క్రింద ఆసనబద్ధుడై కూర్చుండెను. మహాకాశ్యపుడు (పిప్పలీమాణవకుడు) ను అతనిగాంచి ''ఇతడే మాకు గురుడు. ఇతని నుద్దేశించియే మేము ప్రవ్రజించితి'' మని అచ్చటినుండియే ముమ్మాఱు ప్రణతులర్పించి ''భగవంతా! మీరు గురువు లరు. నేను మీకు శ్రావకుడ (శిష్యుడ) ను'' అని చెప్పెను. అంత భగ వంతుడు బుద్ధు డతనికి త్రివిధోపదేశముల నొసంగి ఉపసంపదననుగ్రహించి మఱ్ఱి చెట్టు క్రిందనుండి లేచి ఆ మహాకాశ్యప స్థవిరుడు తనకనుచర శ్రవణుడుగ వెన్నంటి వచ్చుచుండ దారిపట్టెను. తథాగతుని శరీరము మహాపురుషలక్షణములు ముప్పది రెండింటితోడను, మహాకాశ్యపుని శరీరము యేడులక్షణములతోడను ఒప్పియుండి నవి. కొంతదూరమరిగి సుగతదేవుడు దారినుండి వైదొలగి యొకచెట్టు క్రింద జేరినంత స్థవిరుడును యింగితజ్ఞుడు గావున వైళమ తనపై నుండు పట్టుదుప్పటిని మడిచి క్రింద పఱిచెను. శాస్తయు దానిపై గూర్చొని చేతితో ఆ పట్టుగుడ్డను అల్లన తడివి చూచి, ''కాశ్యపా! ఈ నీ సంఘాటి చాల మెత్తగనున్నది.'' యనెను.

భగవంతునకు తన శాలువ నచ్చినదిగ భావించి.యత డిట్లనియె. ''భంతే! తాము దీనిని స్వీకరించి ధరించండి''.

''కాశ్యపా! నీవు దేనిని తాల్చెదవు?''

ప్రభూ! దయచేసినచో తమ పుట్టమును గైకొందును.'' కాశ్యపా! కట్టికట్టి చినిగి జీర్ణమైపోయిన నా బొంతను ధరింతువా? ఇదో, గైకొనుము. ఇది బుద్ధులను భవించిన వస్త్రము. అల్పులు దీని ధరింప నర్హులుగారు. ధర్మాచరణమునందు పండినవారు, జన్మ మంతయు [1] పాంసుకూలిక వ్రతనిష్ఠులైయున్న వారుమాత్ర మిందుకు యోగ్యులు''.

---

1. పేలికలను ప్రాతగుడ్డలను అతికి కుట్టిన బొంతలను ధరించువారు.

ఇట్లు స్థవిరుని చీవరమును బుద్ధుడును, బుద్ధుని చీవరమును స్థవిరుడును మార్చు కొనిరి. ''బుద్ధోపభుక్తమగు చీవరము లభించినది గదా, అహో భాగ్యమను కొనుచు స్థవిరు డుప్పొంగిపోయెను; కాని గర్వవివశుడు కాలేదు. బుద్ధులకడనుండి సంగ్రహింపదగిన [1]అవధూత గుణముల పదుమూడింటిని సేకరించి అతడు యేడుదినములు మాత్రము పృథగ్జనుడుగ (తత్త్వసాక్షాత్కారము పొందని వాడుగ) నుండగలిగెను. ఆ పై యెన్మిదవనాడు ప్రతిసంవిత్ సహితమగు అర్హత పదవిని ప్రాపించెను. కొంతకాలము గడచినంత భద్రాకాపిలాయనియు భగవచ్ఛరణముల నాశ్రయించి భిక్షుణియైనది.

## కశ్యపసూత్రము

[2] ఒకానొక సమయమున ఆయుష్మంతుడు మహాకాశ్యపుడు రాజగృహము నంతల వేణువన కలందక నివాసమున విహారమొనర్చుచుండెను. అదేసమయమున ఆయుష్మంతుడు ఆనందుడును గొప్పదియగు భిక్షుసంఘముతోడ దక్షిణగిరి యందు చారిక నొనర్చు చుండెను. ఆనందుని సంఘమునందు ప్రాయశః తరుణ వయస్కులగు ముప్పదిమంది శిష్యులు భిక్షుభావమును వీడి గృహస్థులై పోయిరి. ఒకానొక సమయమున ఆయుష్మంతుడగు ఆనందుడు మహాకాశ్యపుడుండు చోటికి దక్షిణగిరినుండి చనుదెంచెను. వచ్చి యొకచో కూర్చొనిన ఆనందునితో మహాకాశ్యపు డిట్లనియె. ''ఆవుస్ ఆనందా! భగవంతుడు కులములయందు మూడువిధములగు భోజనముల నేకారణములను నేర్పఱచియున్నాడు?''

''భంతే! కాశ్యపా! కారణములు మూడు గలవు. స్వేచ్ఛాచారుల నిగ్రహించు టకును, సునీతిపరులు సుఖముగ మెలగుటకును, ప్రతికూలించి అనిష్టము కల్గింప జాలు దుష్టులను తుష్టి జెందించుటకును ఇట్టీ మూడు కారణములచే భగవంతుడు కులములందు మూడు విధములగు భోజనముల విధించియున్నాడు.''

''ఆనందా! నీవు యీ క్రొత్తభిక్షువులతో కూడి యేల సంచరించుచున్నావు? వీరు యింద్రియద్వారముల మూయనేర్చిన వారు గారు. భోజనమునందు పరిమాణ మును గుర్తించినవారుకారు. జాగరణయందు సమర్థులుగారు. పైర్లనువలె కుల ములను నశింప జేయుచున్నావు. కుమారా! నీ యీ భిక్షుసంఘము కూలిపోవు చున్నది. క్రమము తెలియనివాడవైతివి.''

---

(1) ధుత - అంగ

(2) సంయుత్తనికాయ 1 - 27 - 5

''భంతే! కాశ్యపా! తల నరిసినకూడ కుమారా! యని అనిపించుకొనుట నాకు తప్పు లేదే?''

''ఆనందా! అవును. క్రమ మెఱుగని కుమారుడవు.''

వైదేహమునియు ఆర్యుడును నగు ఆనందుని మహాకాశ్యపుడు 'కుమారా' యని ఛీకొట్టుట థుల్లనం దాభిక్షుణి విని కుపితయై సమీపించి యిట్లనియె.

ఆర్యా! అన్యసంప్రదాయమున వర్తించు మహాకాశ్యపుడా! వైదేహమునియగు ఆనందుని 'కుమార' యని ఛీకొట్టుటకు ఎట్లు సాహసించితివి?'' అని యడిగెను.

ఆ మాటవిని మహాకాశ్యపుడు ఆనందునివైపుమళ్ళి ''ఆయుష్మంతుడా! థుల్లనందా భిక్షుణి యోచించక ఆత్రపడి పల్కుచున్నది. నేను సంన్యసించినది మొదలుకొని భగవంతుడు అర్హతుడు సమ్యక్ సంబుద్ధుని వదలి వేఱొకని గురువని యనలేదు. నేను గృహస్థుడనై యుండు వేళలందు పదింబది యిట్లు తలంచువాడను. 'పరిపూర్ణ పరిశుద్ధ బ్రహ్మచర్యమును యింటియందుండి పాలించుటనునది పొసగదు. తలను గొఱిగించుకొని కావిబట్టలుదాల్చి యిల్లువదలి ప్రవ్రజించెదను గాక''. ఆనందా! ఆ వెనుక [1] పటపిలోతికలచే సంఘాటి (దుప్పటి – బొంత) నొనర్చుకొని, లోకమునందు యే అర్హత భగవంతుడుగలడో – అతని నుద్దేశించియె నా యీ ప్రవ్రజనమని యాన బలికి పరివ్రాజక వేషమున యిల్లువదలి వచ్చితిని. దారియందు రాజగృహమునకును నాలందకును మధ్య, బహుపుత్రక చైతన్యము నందు కూర్చొని యున్న భగవంతుని బుద్ధుని జూచి సంభ్రాంత హృదయముతో డగ్గఱి ప్రణమిల్లి ''దేవా! నీవు శాస్తవు. నేను శ్రావకుడును'' అని విన్నవించితిని. ''ఆయుష్మంతుడా!'' యని పిలిచి సుగతు డిట్లనినాడు.

''కాశ్యపా! ఎవ్వడిట్టి యుక్తచిత్తుడగు శిష్యునితో, తెలియక తెలిసితిననియు, చూడక చూచితిననియు పలుకునో వానితల బ్రద్దలు కాగలదు. తెలిసినవుడే నేను తెలసితి నందును.చూచినవుడే చూచితినందును. అయ్యా! కాశ్యపుడా! పెద్దలయెడ పిన్నల యెడకూడ లజ్జాభయములు కల్గియుండుట నేర్చికొనుము. కుశలపవిత్రమగు ధర్మమును వినుటకును ఆదరించుటకును నీవు ఉత్సాహివి కమ్ము. శరీరసంబంధ మగు అనుకూల స్మృతి వీడకుండునట్లు గమనింపుము.''

భగవంతు డిట్లుపదేశించి ఆసనమునుండి లేచి బయలు దేరెను. నేనును మలచిత్త యుక్తుడనై వారము దినములు మాత్రము గడపి యెనిమిదవదినము

1. అంచు చినిగిన వస్త్రమును పిలోతిక (పేలిక) యందురు. అట్టి వాటిని కొన్నింటిని చేర్చి కూర్చినది పటపిలోతికాసంఘాటి (బొంత) యందురు.

విమలజ్ఞానమును బొందితిని. బయలుదేరి పోవుచున్న భగవంతు డొక్కెడదారిని దొలగి చెట్టుక్రిందికి పోయెను. నేనును నా పటపిలోతికాసంఘాటిని మడిచి, దానిపై కూర్చుండజేసితిని. బుద్ధుడా సంఘాటిని గ్రహించి, స్వయముగ తాను ధరించుచున్న దియు జనుముతో నేసినదియునగు పాంసుకూలమును నా కొసంగెను. అన్యదుర్లభ మగు దానిని గ్రహించి "ధన్యోఽస్మి" యనుకొంటిని.

## ౧౦

## మహాకాత్యాయనుని సంన్యాసము (వి. పూ. 470)

[1]మహాకాత్యాయనుడు ఉజ్జయిని నగరమందు పురోహిత గృహమున పుట్టిన వాడు. పెరిగి పెద్దవాడై వేదములను మూడింటిని చదివి పురోహిత పదవిని పొందెను. గోత్రనామమున కాత్యాయనుడని ప్రసిద్ధుడయ్యెను. రాజగు చండప్రద్యోతనుడు ఒకనాడు తన మంత్రులనందఱ ప్రోగుజేసి "అయ్యలారా! మీలో నెవడైన భగవంతుని బుద్ధుని యిచ్చోటికి తీసికొని రాగలరా?" యని ప్రశ్నించెను. వారును మహారాజా! ఆ పని ఆచార్యుడు కాత్యాయనునకు దప్ప తదితరులకు సాధ్యము కాద"నిరి. రాజును ఆయనను బిలువనంపి "పొమ్ము. దశబలుని గొనితెమ్మ" ని యాదేశించెను.

"దేవా! సంన్యసించుటకు అనుమతించినచో అట్లే జేసెదను."

"ఏమి జేసియైనను తథాగతుని గొనిరమ్ము."

భూసురుడును వల్లెయని యంగీకరించి పయనమై యిట్లు యోచించెను. "బుద్ధులకడకేగుటకు పెద్దగుంపులు అవసరము లేదు. నాతోడ యేడుమందిని మాత్రము గ్రహించి పోయెదను" అని తనతో కలిసి యెనిమిదిమందియును బుద్ధ నికడ కేగిరి. శాస్త్రయు తన యొద్దకువచ్చిన యెనమండ్రువురకును ధర్మోపదేశము చేసి ప్రతిసంవిత్ సహితముగ అర్హతులనుగ జేసెను. అంతటవారిని రండని చేరబిలిచి వారిపై చేయి జాచి నంతట విచిత్రముగ బోడితలలతో, పాత్రచీవరములతో నూటేండ్ల స్థవిరులవలె దోచిరి. అంతట కాత్యాయనస్థవిరుడు భగవంతుని ఉజ్జయినికి పయ నించుటకై ప్రార్థించెను. ఆ మాట విని తథాగతుడు " భిక్షూ! పోరానిచోటికి యే కారణముచేనైనను బుద్ధుడు పోడు. నీవే పొమ్ము. నీ మూలముననే రాజేంద్రుడు తృప్తి పొందుగాక" యనెను. "పెద్దలకు రెండుమాటలుండవు. అట్లెకానిమ్మ"ని స్థవిరుడును గురునకు వందన మొనర్చి తనతోడ్త వచ్చిన యేడ్వురు భిక్షువులను

1. అంగుత్తర – ని అ: క: 1 – 1 – 10.

వెంటబిలిచికొని వెనుకకు మఱలి పోవుచు మార్గమధ్యము నందుండు తేలప్పనాళి యను గ్రామములోనికి భిక్షకొఱకు వెళ్ళెను.

ఆ పురమునందు శ్రేష్ఠికులమున బుట్టిన కన్యలు యిరువురు గలరు. అందులో నొకతె దరిద్రకులమున బుట్టినది. తలిదండ్రులు గతించుడు. దాది యాశ్రయమున బెఱిగినది. అయినను బంగారువంటి రూపము. ఎక్కడ లేని పొడగాటి వెండ్రుకలు. వేఱొక కన్య సంపన్న గృహమున బుట్టినది. కేశహీన యగుటచే యెంతటి వెలనైన నిచ్చి ఆ కన్యకకుగల దీర్ఘ కేశములను తాను కొనవలెనని అపేక్షించి సందేశమంపినది. కాని ఆ శ్రేష్ఠికన్య యిచ్చుటకు అంగీకరించ లేదు.

ఆనాడు స్థవిరునకును తోడియేడ్వురు భిక్షువులకును బిచ్చము పుట్ట లేదు. రిక్తపాత్రములతో వట్టిచేతులతో తిరిగి వచ్చువారిని జూచి శెట్టి బిడ్డకు జాలిబొడమి నది. ''అయ్యో! నేను దరిద్రురాలనైతినే! నా వెండ్రుకల నమ్మి వచ్చిన ధనముతో వీరిని సంతృప్తుల జేసెద'' నని నిశ్చయించి దాదిని బంపి దారిని బోవు స్థవిరులను పిలువనంపి యింట కూర్చుండ బెట్టినది.

తఱిగి తన చేతికిచ్చిన వెండ్రుకలను దీసికొని దాది తిన్నగ ధనిక కన్యకవద్ద కరిగినది. దినదినము తానపేక్షించు నిక్షేపము తనంతకు తాను దగ్గఱ జేరినది. తఱివేచియున్న శ్రేష్ఠికూతురును తిరస్కారముద్రతో, పలుచని చూపుతో దాదిని జూచి ''అమ్మా! వీటి వెల యెనిమిది ★ కార్షాపణములు (రాగినాణెములు) మాత్రము. సమ్మతియున్న గొనిపొమ్ము యిచ్చెద'' ననెను. విధిలేమి దాదియు వెండ్రుకల నిచ్చి యెనిమిది కార్షాపణముల గైకొని యింటికి వచ్చినది. శ్రేష్ఠి కన్యకయు యెనిమిది కార్షాపణములతో నెనిమిదిమంది భిక్షువులకు సంతర్పణము జేసినది. అంతయు నెఱింగిన కాత్యాయనస్థవిరు డాకన్యకను చేరబిలిచెను. ఆమెయు సంభ్రమ వినయములతో డగ్గఱి సగౌరవముగ నమస్కరించెను. సత్పాత్రయందొసగిన దానము అప్పుడప్పుడే ఫలప్రదము గదా! ఆ చేడియ స్థవిరులకు నమస్కరించి లేచి నిలిచినంత, తలవెండ్రుకలు కూడ యెప్పటివలె, మొలిచి పెరిగి నిలిచినవి. శ్రేష్ఠికన్యకకు కేశప్రదాన మొసంగి స్థవిరులాకాశ మార్గమున పోయి నగరోద్యానమగు కాంచనవనమున దిగి చేరికొనిరి. తోటమాలియు రాజనగరుకు వెళ్ళి ''పురోహిత కాత్యాయనుడు ప్రవ్రజితుడై పురోపవనమునకు వచ్చి యున్నాడ''ని రాజున కెఱుక పఱచెను. భూపతియు సంతుష్టహృదయమున కాంచనవనమున కేగి అంగపంచకముతో స్థవిరుల కెఱగి యొకచో కూర్చొని-

★ ఆ కాలపు నాణెములు.

''మహాత్మా! బుద్ధభగవంతుడు యెక్కడ?'' అని యడిగెను.

''మహారాజా! వారు రాలేదు. నన్నంపినారు.''

''మహాపురుషులారా! ఈనాటి భిక్షను మీరు యెచ్చట పొందితిరి?'' అని నరపాలుడడిగిన స్థవిరుడును శ్రేష్ఠికన్యక యింట కల్గిన విషయమును, ఆమె చూపిన త్యాగమును వర్ణించి చెప్పెను. ఆ మాటలన్నియు వినిన తర్వాత రాజగుచండప్రద్యోతనుడు, వారుండుటకు స్థవిర నివాసమొకటి నిర్మింపజేసి వారి భోజనవ్యవస్థయు అందే యేర్పఱచెను. అంతట తన యింటికిపోయి ఆశ్రేష్ఠికన్యను పిలువనంపి పట్టపురాణిగ నొనర్చుకొనెను. ఆ కన్యక జేసిన పుణ్యము, అదే జన్మమున ఫలించినది. దంపతులిరువురును స్థవిరుల సత్కరించుట యందు మిగుల శ్రద్ధావహులై యుండిరి. ఆ పడతి గర్భమున నొక మగబిడ్డ జన్మించెను. మాతామహుని పేరిట నా శిశువునకు గోపాల కుమారుడని పేరిడిరి. అప్పటినుండియు గోపాలమాత యని ఆమె ప్రసిద్ధియైనది. స్థవిరపూజా దురంధరయై రాజును ప్రార్థించి, కాంచనవనమున స్థవిర విహార మొకటి నిర్మింప జేసినది.

కాత్యాయనాది స్థవిరులు కొంతకాలము ఉజ్జయిని యందు గడపి వెండియు భగవంతుని చేరువ జేరికొనిరి.

## ౧౧

## ఉపాధ్యాయ, శిష్య కర్తవ్యములు. ఉపసంపద (వి. పూ. 470)

మగధ దేశీయులు ప్రసిద్ధులును నగు కులపుత్రులు పలువురు భగవంతుని వద్ద బ్రహ్మచర్య చరణ మొనర్చుచుండిరి. దానింగాంచి ప్రజలెంతయు చిరాకు జెంది నిందించు చుండిరి. ''శ్రమణ గౌతముడు లోకనాశనమునకై కంకణము గట్టినాడు. స్త్రీలను విధవలను జేయుటకు పురుషుల నపుత్రకులుగ జేయుటకు, కులముల మూలోన్మూలనము జేయుటకు శ్రమణ గౌతముడు దిగివచ్చినాడు. ఒక్క వేయి జటిలులను సంన్యాసుల జేసినాడు. సంజయ శిష్యులను రెండువందల యేబది మందిని తనలో కలుపుకొన్నాడు. అంతటితో దాహమాఱక మాగధీయులగు కులపుత్రులను శ్రమణగౌతముడు తన రంగులో ముంచుచున్నాడు. [1] గిరివ్రజమున వచ్చి చేరినాడు. ఇంకెందఱెందఱిని కొనిపోనున్నాడో.''

1. రాజగృహ పురము.

పురమంతటను యిదే మాటలు పొక్కి పోవుచున్నవి. భిక్షువులు భగవంతునితో ప్రజలాడు మాటలు జెప్పిరి. భగవానుడు వారలజూచి "భిక్షువులారా! ఈగాలి చాల సేపుండదు. వారము దినములు గడువనిదే అంతయు శాంతించ గలదు. మిమ్ము తూలనాడు వారితో మీరిట్లు సమాధానమిండు.

"మహావీరుడు తథాగతుడు సత్యధర్మమార్గమున కొంపోవుచున్నాడు. ధర్మ మార్గమున నడిపించువారిని జూచి బుద్ధిమంతులసహ్యపడుటెందుకు?"

అన్నట్టు వారముదినములు గడవకముందే గాలి శాంతించినది. దుమారమ సలే లేదు.

[1] ఆ దినములలో భిక్షువులు ఉపాధ్యాయ రహితులైయుండుటచే ఉపదేశము, అనుశాసనమును లేక ఆచార విచారములందు ఆహారవిహారములందు క్రమము లేక యుండిరి. శ్రమణభిక్షువుల చర్యలపై ప్రజ లసహ్యించుకొనజొచ్చిరి. సంఘము నకు గలుగు పరాభవమును సహించలేక యోగ్యులగు కొందఱు భిక్షువు లీవార్తను భగవంతుని చెవిని బడవేసిరి. బుద్ధభగవంతుడు భిక్షువుల సమావేశపఱచి ఛీకొట్టి "భిక్షువులారా! శ్రమణులు కానివారు ప్రవర్తించునట్లు అసభ్యాచారములందు మీ రెందుకు తలపడితిరి? అహో! అనుచితము – అయోగ్యము – అకరణీయము. ఈ పద్ధతి అప్రసన్నుల ప్రసన్నుల జేయుటకుగాని, ప్రసన్నుల మఱింత ప్రసన్నుల జేయుటకుగాని వర్తింపదు. ప్రసన్నులను అప్రన్నుల జేయుటకును, అప్రసన్నులను మఱింత అప్రసన్నులుగ జేయుటకుమాత్రమే చాలినది" అని పలువిధముల విమ ర్శించి మఱియు నిట్లనియె.

"భిక్షువులారా! మీరొక ఉపాధ్యాయుని యేరుకొని వరింపుడు. అందుకు అనుమతి నిచ్చుచున్నాను. ఉపాధ్యాయుడు శిష్యుని పుత్రునివలె తలంచవలెను. శిష్యుడు ఉపాధ్యాయుని తండ్రివలె భావించవలెను. ఉత్తరీయ మొక భుజముపై వేసికొని నమస్కరించి మోకాళ్ళపై గూర్చొని అంజలిబట్టి "భంతే! నాకు ఉపాధ్యా యులుగ నుండుడ"ని ప్రార్థించవలెను. ఇది ఉపాధ్యాయ వరణక్రమము.

శిష్యుడు ఉపాధ్యాయునియెడ ఒప్పిన నడవడి కల్గియుండవలెను. తగినవేళకు మేలుకొని దంతకాష్ఠమును, జలమును యీవలెను. పడకను చుట్టి యెత్తిపెట్టవలెను. అల్పాహారమున్నచో పాత్రను కడిగి అర్పించవలెను. నీటినిచ్చి భోజనపాత్రను తీసికొని నీటితో మాత్రము కడిగి తీసిపెట్టవలెను. అతడుండు నెలవును చీపురుతో ఊడ్చ వలెను. ఎండైన పోదలచినచో వస్త్రాదికమును, కమండలమును అందివ్వవలెను.

1. మహావగ్గ 1 – 4 భాణ.

తోడరాగలిగినచో పాత్రచీవరముల ధరించి తాను అనుచర భిక్షుడుగ వెంటపోవలెను. శిష్యుడు ఉపాధ్యాయుని వెంట బోవునపుడు మిగుల దూరముగ గాని, మిగుల దగ్గఱయై గాని నడువరాదు. మాటలాడునపుడు మధ్య దూరి మాట్లాడరాదు. వెనుకకు దిరిగి మఱలి వచ్చునపుడు తాను ముందుగ నెవచ్చి ఆసనమును పఱచి పాదోదకమును, పాదపీఠమును, పాద కాష్ఠమును సమర్పించ వలెను. వలసిన దెల్ల యును ఊహించి అందియ్యవలెను. చెమట తగిలిన వస్త్రములను యెండలో కొద్దిగ యెండించవలెను. మిక్కిలి మండించరాదు. భోజన మపేక్షించినచో ఆ యా వస్తువుల సిద్ధపఱచుటయు, స్నానము చేయగోరినచో అందుకు వలయు పరికరముల నాయత్త పఱచుటయు శిష్యుని కర్తవ్యము.

ఉపాధ్యాయుని శరీరమును తోమవలెను. ఆయన విహరించు విహార మును శుభ్రపరచ వలెను. కసువు దోయునపుడు అందందుండెడి పాత్రలను బట్టలను మంచమును పఱుపును సావధానముగ దుడుకులేకుండా తీసి మఱియు నమర్చవ లెను. గచ్చు భూమిని, గారగోడలను తడిగుడ్డతో తుడువ వలెను.

తలుపులను కిటికీలను ఆ యా వేళల ననుసరించి తెఱచుటయందును, మూయుటయందును హెచ్చరిక కలిగియుండవలెను. తగని మాటలాడినచో నివారించవలెను.

భిక్షువులారా! శిష్యుడనిన ఉపాధ్యాయునకు ప్రాణమైయుండవలెను. వలసినప్పు డెల్లను ఉపదేశించుచుండవలెను. వస్త్రములను పాత్రలను అవసరమైన పుడు యిచ్చుచుండ వలెను. భిక్షువులకు యోగ్యములగు (పరిష్కార) వస్తువులను శిష్యునకు యిచ్చుటయు, యిప్పించుటయు నుండవలెను. శిష్యుడు రోగగ్రస్తుడైనచో తనకతడు చేయు పరిచర్యల నన్నిటిని స్వయముగ తానతనికి జేయవలెను.

ఆచార్యుడు లేనిచో, ఓ భిక్షువులారా! మీరు క్రమశూన్యులై, నియమ రహి తులై వర్తింతురు కాబట్టి, ఆచార్యుని వరించుటకు యిప్పటినుండి మీకు అనుమతి నిచ్చుచున్నాను'' అని భిక్షుసంఘమునకు బుద్ధదేవు డాదేశించెను.

[1]రాధుడను బ్రాహ్మణుడు భిక్షువుల జేరవచ్చి ప్రవ్రజ్య నర్థించెను. భిక్షువులు తిరస్కరించిరి. ప్రవ్రజనము లభింపలేదనెడి వ్యాకులముతో వాడు దిన దినమును క్షీణించి కృశించి యెముకల గూడై పోయెను. ఒకనాడా పరిస్థితిని భగవవంతుడెఱింగి భిక్షువులను బిలచి ''భిక్షువులారా! ఈతండొనర్చిన మేలు యెవ్వరికైనను గుర్తు

(1) మహావగ్గ 1

న్నదా!'' అని యడిగెను. వెంటనే ఆయుష్మంతుడు సారిపుత్రుడు ''భంతే! నేను వీడు చేసిన మేలును స్మరించుచు న్నాన''నెను.

''సారిపుత్రా! ఏమిటది?''

''దశబలా! రాజగృహమున భిక్షకై తిరుగునపుడు ఈ బ్రాహ్మణుడు నాకొక్క గరిటెడన్నము పెట్టించినాడు.''

''కుమారా! సాధు!! సాధు!! మంచివారు, చేసినమేలు మఱువలేరు. సారిపుత్రా! నీవే యితని ప్రవ్రజితునిగ జేయుము. ఉపసంపన్నునిగ జేయుము.''

''భగవన్! ప్రవ్రజితునిగ, ఉపసంపన్నునిగ జేయుట ఎట్లు?''

అంతట సమంతభద్రుడు బుద్ధుడు భిక్షువుల సంబోధించి యిట్లనియె. ''భిక్షువులారా! నేనింతకుముందు [1]మూడు విధములగు శరణ గమనములతో ఉపసంపదాదీక్ష నిచ్చునట్లు అనుమతి నిచ్చి యుంటిని. ఇప్పుడు ఆక్రమమును నిషేధించుచున్నాను. జ్ఞప్తి (సూచన) యనెడి నాల్గవ విధితో కూర్చి ఉపసంపద నిచ్చునట్లు యిప్పుడు అనుజ్ఞ నిచ్చుచున్నాను. ఇదుగో! ఆ పద్ధతిని వినుండు.

యోగ్యుడు సమర్థుడునగు భిక్షువు సంఘమున కిట్లు సూచన (జ్ఞప్తి) నివ్వవలెను.

1. భద్రపురుషులారా! సంఘమునకు ఒకమాట. అముక (ఫలానా) నామకుడు, అముక (ఫలానా) నామకుడగు ఆయుష్మంతునకు ఉపసంపద నివ్వగోరి యున్నాడు. సంఘమునకు నచ్చినచో అముక నామకుని, అముక నామకుని ఉపాధ్యాయత్వమున సంఘము, ఉపసంపన్నుని చేయునది – ఇది జ్ఞప్తి (సూచన).

2. భద్రపురుషులారా! సంఘమునకు ఒకమాట. ఫలనా పేరుగల వాడు, ఫలానా పేరుగల ఆయుష్మంతునకు ఉపసంపద నివ్వగోరియున్నాడు. సంఘము ఫలానావానిని, ఫలానావాని ఉపాధ్యాయత్వమున ఉపసంపన్నుని జేయుచున్నది. ఒప్పుకొన్నవారు ఊరక ఉండునది. సమ్మతించని వారు మాట్లాడునది. ఇది మొదటి సారి.

3. భద్రపురుషులారా! ..............................ఇది రెండవసారి.

4. భద్రపురుషులారా!..............................ఇది మూడవసారి.

సంఘము సమ్మతించినదిగ తలంచుచున్నాను.''

---

1. 35వ పేజి చూడుడు.

# ౧౨

## కపిలవస్తుగమనము - నందరాహులుల సంన్యాసము (వి. పూ. 470)

[1] వేణువనమున తథాగతుడు విహరించుచున్న సమయమున, అచ్చట శుద్ధో దన మహారాజునకు తన కుమారుడాఱేండ్లు అనన్యసాధ్యమగు ఘోర తపంబొనర్చి అభిసంబోధిని, బుద్ధత్వమును బొంది, ధర్మచక్ర ప్రవర్తన మాచరించి ప్రస్తుతము వేణువనమున విహరించుచున్నాడను వార్త కర్ణాకర్ణిగ చెవిని బడినది. వెంటనే మంత్రిని పిలువనంపి యతనితో అప్తుడా! నా మాటవడువున వేయిమంది మనుష్యులతోడ్తగొని రాజగృహమునకరిగి మీ తండ్రి శుద్ధోదన మహారాజు మిమ్ము చూడగోరుచున్నాడని చెప్పి నా పుత్రుని సిద్ధార్థుని పిల్చుకొని రమ్ము పొమ్ము'' నెను.

అమాత్యుడును చిత్తమని సెలవంది రాజు చెప్పినట్లు పరివారసహితుడై అర్వది యోజనముల మార్గముత్తరించి, రాజగృహముజేరి పరిషత్తుల [2]నాల్గింటి మధ్య యందు ధర్మోపదేశముచేయుచు దశబలుడు బుద్ధుడుండు విహారములోనికి ప్రవే శించెను. ధర్మాదేశనమును వినుటయందే తల్లీనుడై యొక మూల నిలువబడి తాను వచ్చిన పనిని, రాజాజ్ఞను మఱచి వేయిమంది అనుచరులతో గూడ నాక్షణమ అర్హత పదవిని పొంది భగవంతుని ప్రవ్రజ్య గోరెను. భగవంతుని హస్తస్పర్శసోకినంత అబ్బురముగ పాత్రచీవరములతో నతడు వృద్ధ స్థవిరుడయ్యెను. అర్హత్వ ప్రాప్తినొందిన [3]ఆర్యపురుషులు మధ్య(తటస్థ) వృత్తి నవలంబించుట న్యాయమని తలంచి రాజశాస నమును తథాగతునకు చెప్ప లేదు.

పోయిన మంత్రిపుంగవుడు తిరిగి రాకపోవుటకును, యే విషయమును తెలి యక పోవుటకును శుద్ధోదనరాజేంద్రుడు చింతించి ముందటివలెనే మఱొక్క మంత్రిని సపరివారముగ బంపెను.మొదటి వానివలెనే వీడును అందే కలిసిపోయి వెనుదిరిగి రాలేదు. రాజుగారును తనకడ నుండు తొమ్మండ్రు మంత్రులను వేయి వేయి పరిజనముతో పంపించియు నిష్ఫలుడయ్యెను. పోయినవా రెల్లను అర్హతపదవి బొంది అందే విహరింప జొచ్చిరి. తిరిగి వచ్చి జవాబైన చెప్పు దిక్కును మొక్కును లేకపోవుటకు విహ్వాలుడై నరేంద్రుడు ''ఇందఱుండియు నా యాజ్ఞను ప్రేమపూర్వ ముగ పాలించువాడొక్కడును లేక పోయెనే హా'' యని వేదన జెంది కాలఉదాయిని

---

1. జాతకనిదాన 4, మహావగ్గ, అ. క, మహాఖందక. రాహులవస్తు.
2. భిక్షు, భిక్షుణీ, ఉపాసక, ఉపాసికా.
3. స్రోతాపన్న - సకృదాగామి, అనాగామి, అర్హతులు.

స్మరించు కొనెను. బుద్ధునితోడ ఒకే దినమున జన్మించిన వాడును, బాల్యమిత్రుడును, విశ్వాసపాత్రుడును, సర్వార్థసాధకుడును, తనకు అంతరంగామాత్యుడు నగు కాలఉదాయిని పిలిపించి శుద్ధోదను డిట్లనియె. ''బిడ్డా! కాలఉదాయీ! కొడుకును చూడ కోర్కె గలిగినది. తొమ్మిదివేల మందిని బంపియు తిరిగి వచ్చిన వానిని ఒక్కనిగానను. దేహధర్మములు నిలుకడ లేనివి. బ్రతికియుండగనే కండ్లకు కుమారుని చూపించెదవా?'' అని దీనముగ బల్కెను.

''దేవా! అవశ్యము చూపింతును. ప్రవ్రజ్య కంగీకరించినచో;''

''నాయనా! ఏమి జేసియైనను సరియే. సుతుని నాకండ్లకు జూపింపుము. పొమ్ము.''

''చిత్తము''ని కాలఉదాయి రాజగృహమున కరిగి భగవంతుడుపదేశించు పరిషత్తుకు చివర నిలువబడి ధర్మోపదేశమును విని పరివారసహితముగ అర్హతఫలమును పొందెను. సుగతుని హస్తస్పర్శచే వృద్ధస్థవిరుడై నిలువబడెను. శాస్తయు బుద్ధత్వమును పొందిన తొలిఋతువును ఋషిపతనమున గడిపి వర్షావాసము ముగించి ★ ప్రావారణము (పారణ) చేసి, ఉరువేలము జేరి అందు మూడు మాసములు వసించి సోదరులగు ముగ్గురు జటిలులను తనలో గలిపికొని వేవురు భిక్షులతో రాజగృహమును జేరి రెండు మాసములు గడపెను. ఇంతలో వారాణసి వదలి అయిదు నెలలైనది. మొత్తము హేమంత ఋతువు గతించినది. కాలఉదాయి స్థవిరుడును వచ్చిన దాది యేడెన్మిది దినములు గడపెను. ''ఫాల్గుణ పౌర్ణమాసి వచ్చినది. హేమంతుని బంపి వసంతుడు వస్తూన్నాడు. పైరులకోసి రైతులు త్రోవల నిష్కంటకము జేసినారు. ప్రయాణములు సుగమములైనవి. దశబలుని ప్రయాణము చేయించుటకిది యోగ్యమైన సమయము.'' అని తలపోసి భగవంతుని సమీపించి యిట్లనియె. ''భదంత! మహావీరా! ఫలముల కోరికతో అగ్నిశిఖల బోలిన చిగురుటాకుల దాల్చి తపస్సు చేయుచు వృక్షములు రసభరితములైయున్నవి. దేవా! శీతోష్ణస్థితి సమమైయున్నది. అన్న కాటకములేదు. భూమి పచ్చని గడ్డితో కలకలలాడు చున్నది. ప్రయాణముల కిది మంచి తరుణము. మంచి అదను'' అని పలువిధముల ప్రోత్సహించు ఉదాయిని జూచి భగవంతుడిట్లనియె. ''ఉదాయీ! నీ సన్నాహము యెచ్చట బోవలెనని?''

★ ఆశ్వీన పూర్ణిమ

"ప్రభూ! తండ్రి శుద్ధోదనుడు దర్శింపగోరినాడు. స్వజాతిని దాపునకు చేర్చుకొనరాదా?"

"సరే! యాత్రకు సిద్ధముకండని భిక్షుసంఘమునకు తెలుపుము."

"మంచిది. పోయెద నిదె" యని స్థవిరుడంతయు నాయత్త పఱచెను.

అంగ మగధవాసులగు కులపుత్రులు పదివేలమందియు, కపిలవస్తు నివాసులై తనయొద్దకు వచ్చిన పదివేవురును వెరసి యిరువది వేలమంది అర్హత భిక్షువులు తనతోడ వచ్చుచుండ భగవంతుడు రాజగృహమును నిర్గమించి దినమునకొక యోజనము వడువున ప్రశాంతచారిక నవలంబించి రెండునెలలలో అరువది యామడల నుత్తరించి కపిలవస్తు సమీపమును చేరికొనెను.

అచ్చట శాక్యులును బుద్ధభగవంతుడు నివసించుటకు అనుయోగ్యమగు తావెయ్యది యని యోచించి "న్యగ్రోధారామ" మందుకు దగినదిగ తలంచి దాని నలంకరించి యుంచిరి. సుగతదేవుడు పురమును సమీపించుట యెఱింగి గంధపుష్ప మాల్యాదికములతో తొలుత బాలబాలికలును ఆ పై కుమారీకుమారకులును చివరకు తాము (కులవృద్ధులు) ను సుస్వాగతమొసంగి శ్రీమద్వైభవముతో న్యగ్రోధారామమున బ్రవేశింపజేసిరి. భగవంతుడు ఇర్వదివేవురు అర్హతభిక్షువులు తన్ను బలిసి కొలువ తనకై నిర్ణయించిన బుద్ధాసనమున ఆసనబద్ధుడై విరాజిల్లెను.

మఱుదినము భగవంతుడు కపిలవస్తు పురవీథుల యందు భిక్షువులతో కూడి భిక్షకై బయల్వెడలుచు, ★ ఇంద్రకీలకముపై నిలిచి యిట్లు యోచింపసాగెను. "తొల్లింటి బుద్ధులు స్వకులనగరములందు భిక్ష నెట్లు జేసిరి? మధ్య మధ్య యిండ్లను వదలి భిక్షించిరా? లేక వరుసగ అన్ని యిండ్లను భిక్షించుచు పోయిరా? లేదు. లేదు. ఒక్క బుద్ధుడైనను యిండ్లను వదలి వదలి భిక్షకుపోలేదు. నేనును వారి వంశములోనివాడనే కాన కులధర్మము నవశ్యము పాలించవలెను. రాబోవు నాశిష్యులుకూడ నన్ను అనుకరింతురు గాక" యని ఒక మూలనుండి మొదలిడి భిక్షాచారమునకు కడంగెను. "సిద్ధార్థకుమారుడు బిచ్చమెత్తుచున్నాడాహో" యని పురవాసు లాబాలగోపాలము మేడలపైనుండి అబ్బురముగ వీక్షింపసాగిరి.

రాహులమాత యశోధర యెంతయు కుంది "అయ్యో! అపూర్వమగు రాజ ఠీవితో బంగారుపల్లకియందు గూర్చుండి యీ నగరవీథులయందే ఊరేగిన యొక

★ జాతక అట్ఠకథా – ని.

దివ్య మూర్తి, యీనాడు తలను గొఱిగించుకొని కావిబట్టలు దాల్చి కపాలము చేతబట్టి యిదే నగరవీథులయందు బిచ్చమెత్తుకొనుటయా? హా! వైపరీత్య'' మని మేడనుండి కిటికీలు దెఱిచిచూచి ''నీ కుమారుడు బిచ్చమెత్తుచున్నాడ''ని రాజునకు చెప్పి పుత్తెంచెను. నరేంద్రుడు కళవళపడి పరుగు పరుగున వచ్చి భగవంతున కడ్డమై నిలిచి ''భంతే! ఇది యేమి? మమ్ము అవమానించుటయా నీకు యిష్టము? భిక్షమెత్తకపోయినచో మీ సంఘమునకు భోజనము లేదా?''

''మహారాజా! ఇది నా వంశాచారము.''

''భంతే! మనువు ప్రవర్తింపజేసిన క్షత్రియవంశము మనది. ఈ వంశావలి యందొక్క క్షత్రియుడైనను భిక్షమెత్తియుండలేదు.''

''మహారాజా! బాటసారులకు ధర్మశాలతోవలె నాకు యీ క్షత్రియ వంశ ముతో తాత్కాలిక కృత్రిమ సంబంధము. నిజమునకు బుద్ధపురుషులే నాకు పూర్వవంశీయులు. ఆ వంశాచారమును పాటించుట నాకు తగును.'' ఆ మాటలకు బదులు చెప్పక మహారాజు భగవంతుని చేతి భిక్షాపాత్రను లాగికొని సంఘసహితముగ నాతని మేడపై కెక్కించి సరస భోజనములతో సంతృప్తులజేసెను. భోజనానంతర మొక్క రాహులమాత తప్పతక్కిన రాణివాసమంతయు వచ్చి భగవంతునకు నమస్కరించిపోయిరి. ''రారమ్ము. ఆర్యపుత్రునకు వందనము లర్పించివత్త''మని పరిజన ములు పిలువ రాహులమాత యశోధర వారితో ''నాయందేమాత్రము సుగుణములు న్నను ఆర్యపుత్రు డిచ్చటికి రాకపోడు. వచ్చినపుడే వందనము లర్పించెద'' నని మిన్నకుండినది.

అచ్చట తథాగతుడు తనచేతిపాత్రను రాజునకందించి అగ్రశ్రావకయుగళము (సారిపుత్ర మౌద్గల్యాయనులు) తోడరాగా రాజకుమారి శయనాగారమున కరిగి యొక ఆసనమున కూర్చొనెను. ఆమెయు వడివడి జనుదెంచి అమాంతము పాద ముల గఱచు కొని యథేచ్ఛగ నమస్కరించెను. ఆ సాధ్వీమతల్లియొక్క సాధుగుణ ముల వర్ణించుచు మహారాజు భగవంతునితో '' పూజ్యుడా! నీవు కాషాయవస్త్రధారి వైతివని విన్న నాటినుండియు నీమెయు కావిబట్టలు తాల్చినది. వెండియు నీవలెనే దినమున కొకమాటు భుజించుచున్నది. ఎత్తైన శయ్యల వదలినది. భోగసామగ్రుల త్యజించినది. పుట్టింటి వారెంత బ్రతిమాలినను సేవాశుశ్రూషల నంగీకరింపదు. మహాసుగుణవతి'' యని వచించుచుండ భగవానుడు బుద్ధు డాయాధర్మోపదేశము లొనర్చి ఆసనమందుండి లేచిపోయెను.

★ ఆనాడు మూడవదినము. రాజకుమారుడగు నందునకు నేడు రాజ్యాభి షేకము నిర్ణయింపబడినది. భగవంతుడాయింటికి భిక్షకు వెళ్లి నంద కుమారుని

---

★ ఉదాన అట్ఠకథా 3 - 2, అ. ని. అ. క. 1 - 4 - 8, వినయ మహావగ్గ అ. క.

చేతికి భిక్షాపాత్ర నందించి ''శుభమస్తు'' అని బయలు దేరెను. పాత్రను చేతబట్టుకొని నందుడును వెంట వెంట బోవుచున్నాడు. తథాగతుడు పాత్రను తీసికొనలేదు. తీసికొమ్మని నందుడును చెప్పలేదు. ఇల్లుదాటి తీసికొనును. సోపాన ములు గడచి తీసికొనగలడు. ఈ రాజాంగణమును దాటినమీదట గ్రహించు'' నని నందుడు తలపోయుచున్నాడు.

''నందకుమారుని బుద్ధుడు గొంపోవుచున్నాడ'' ని ప్రజలు జనపద కల్యాణి (నందుని భార్య) కి తెలియజేసిరి. ఆమెయు కన్నీరు మున్నీరుగ కార్చుచు వికీర్ణకేశ ములతో మేడపై కెక్కి కిటికీవద్ద నిలచి ''ఆర్యపుత్రా! శీఘ్రమ రమ్మ''నెను. ఆ మాట కుమారుని హృదయమును కలచివైచినది. శాస్తయు విహారమును చేరుకొని తిరిగి జూచి ''నందా! సంన్యసించెదవా? యనెను. కుమారుడును ఆ – ఊ అనక వెంటనే ''సంన్యసించెద'' ననెను. ఇట్లు మూడవ దినము కపిలవస్తు పురమున భగవంతుడు నందుని ప్రవ్రజితుని జేసెను.

[1] ఏడవదినము రాహులమాత భగవానుని వద్దకు పంపగోరి కుమారుని రాహులుని శృంగారించి ''నాయనా! ఇరువదివేవురు శ్రమణుల మధ్య బంగారు వన్నెతో విరాజిల్లు మహా శ్రమణుని అటు జూడుము. ఆతడే మీ తండ్రి. మహా ధనవం తుడు. (ఆస్తి) దాయ భాగమడిగి రమ్ము. పొమ్మ'' ని పంపించెను. [2] తథాగతుడు శుద్ధోదనుని గృహమునకు పూర్వాహ్ణ సమయమున పాత్రచీవరముల గొని భోజ నార్థమై వచ్చి భుజించి పఱిచిన ఆసనముపై కూర్చొని యున్నాడు. రాహుల కుమారుడు వచ్చి నిలచెను. భగవంతుడు ఆసనమునుండి లేచి విహార ముఖముగ పయనించెను. రాహులుడును వెనువెంట బోవుచు ''శ్రమణా! నా స్వత్త్వము (ఆస్తిభా గము) నా కిమ్ము. నాస్వత్వము నాకిమ్ము'' అని యడుగు చుండెను. శాస్తయు ''కుమారా! యిచ్చెద రారమ్మ'' ని చెప్పుచు న్యగ్రోధారామమును చేరిన వెంటనే సారిపుత్రుని జూచి ''ఆయుష్మంతా! రాహులకుమారుని ప్రవ్రజితుని జేయుము'' అని ఆదేశించెను.

''భంతే! ఆ ప్రకారమెట్టిది?''

ఆ మాట విని భగవంతుడు ధార్మిక కథను వినిపించి భిక్షుసంఘమునంతయు నుద్దేశించి యిట్లనియె.

---

1. వియన అట్ఠకథయందు రెండవ దినమని చెప్పబడినది.
2. మహావగ్గ 19 భాణవారము.

''భిక్షువులారా! మూడు విధములగు శరణగమనములచే[1] శ్రామణేర సంన్యాసమునకు అనుజ్ఞ యిచ్చుచున్నాను. వినుడు. తొలుత తలను గడ్డమును గొఱిగించి కావిబట్టలు గట్టించి ఉత్తరీయమును ఒకభుజముపై ధరింపజేసి భిక్షుసంఘమునకు ప్రణమిల్ల జేసి, అంజలి బట్టించి యిట్లు పలికింపవలెను. 'బుద్ధుని' శరణు జొచ్చుచున్నాను. ధర్మమును శరణుజొచ్చుచున్నాను. సంఘమును శరణుజొచ్చుచున్నాను.' అని యీ మాటలను మరియు రెండవతూరియు, వెండియు మూడవ పర్యాయమును పల్కించవలెను.''

అంతట సారిపుత్రుడు రాహులుని ప్రవ్రజితుని జేసెను. ఆ వార్తవిని ఉద్విగ్నుడై శాక్యశుద్ధోదనుడు దశబలుని చేరవచ్చి యొకచో గూర్చొని యిట్లనియె.

''భగవంతా! ఒకవరము కోరుచున్నాను.''

''మహారాజా! తథాగతుడు వరములజోలికి పోడు.''

''స్వామీ! భంతే! ఉచితమైనదియు, నిర్దోషమును కాబట్టి

''మంచిది''

భగవన్! మీ ప్రవ్రజనమే తొలుత నన్ను దుఃఖతప్తుని జేసినది. పై పెచ్చు నందుని సంన్యాసము; అన్నింటికి మించి రాహులుని ప్రవ్రజ్య. దేవా! శరీరము పుత్రవ్యామోహమున ఉడికిపోవుచున్నది. రాజయోగ్యమగు అధికారమున మనవిజేయుచున్నాను. మంచిది. ప్రభూ! ఇకమీదట మీరు యెవ్వనికిగాని వాని తలిదండ్రుల యనుమతి లేనిదే సంన్యాసమివ్వరాదు.''

భగవంతుని అంగీకారము వడసి శాక్యరాజు నిజగృహమున కరిగెను. శాస్తయు భిక్షువులనందఱను సంబోధించి ''భిక్షువులారా! ఇకమీదట తల్లిదండ్రుల యనుజ్ఞ లేనిదే కుమారునకు ప్రవ్రజ్య నివ్వరాదు. ఇచ్చినచో 'దుష్కృతి' యనెడి దోషమునకు గుఱి కాగలడు'' అని సెలవిచ్చెను.

రాహుల కుమారునకు మహామౌద్గల్యాయనుడు కేశఖండనమొనర్చి కాషాయములు ధరింపజేసి శరణత్రయమును బలికించెను. మహాకాశ్యపుడు ఉపదేశక గురువయ్యెను.

---

1. భిక్షుత్వమునకు అధికారముగలవానిని శ్రామణేరుడందురు.

## ౧౩

## అనురుద్ధ ప్రభృతుల సంన్యాసము (వి. పూ. 470)

[1] రాహుల కుమారుని ప్రవ్రజితుని జేసి భగవంతుడు బుద్ధుడు కొంతకాలమైన పిదప కపిలవస్తువునుండి కదలి మల్ల దేశమునందు చారిక నొనర్చుచు అనోపియా గ్రామమందలి ఆమ్రవనమున జేరికొని విహరించుచుండెను.

[2] ఆ కాలమున కులీనులగు శాక్యకుమారులు పలువురు తథాగతుని సుగతుని ననుసరించి ప్రవ్రజితులగుచు వచ్చిరి. మహానాముడు అనురుద్ధుడను వారిరువురు శాక్య సోదరులు. అందు అనురుద్ధుడు సుకుమారుడు. మూడు ఋతువులకును అనుకూలములైయుండు మూడు మేడలయందు నిరంతరము నివసించుచు యెండ కన్నెఱుగని కోమలుడు. ఒకనాడు మహానామశాక్యుడిట్లు యోచింపదొడగెను. ''కులీన శాక్యకుమారులు పలువురు బుద్ధునికడ ప్రవ్రజితులైనారు. మా సోదరులలో నేనుగాని నాతమ్ముడు అనురుద్ధుడుగాని యేల సంన్యసించరాద''ని తలంచి అనుజుని యెడ కరిగి ''నాయనా! అనురుద్ధా! మన కులమునందెవ్వడును ప్రవ్రజ్య పొందలేదు. నీవైనను నేనైనను అందుకు సిద్ధపడవలె'' ననెను.

''సుకుమారుడనగు నేను యిల్లువదలి పోలేను. నీవే సంన్యసించుము.''

''అనురుద్ధా! మంచిది. గృహస్థ కార్యములను నీవు సంబాళించు కొనుము. పనిపాటలను చక్కబెట్టుకొనుము. భూముల దున్నించుట, విత్తనములు జల్లించుట, నీరు బెట్టించుట, కలుపు గాదము తీయించుట,పంట పండించుట, పైరు గోయించుట, వెయ్యేల ఆయా సమయములకు దగిన పనుల నెరవేర్చుకొనుచు భూమి బుట్రనుగొడ్డు గోదను యిల్లువాకిలిని సుధారించుకొనుము. పనిపాటలు ముగిసిన వనుట యేనాటికిని లేదు. బ్రతికియున్నంతకు నుండును.

''సోదరా! ఈ పనులకు ముగింపు లేదా? నిశ్చింతుడనై హాయిగా ఇష్ట సుఖముల యందు మెలగుటకు యెన్నటికిని వీలులేదా?''

''అనురుద్ధా! ముగింపులేని పనిపాటలను ముగించలేక మన తండ్రులును తాతలును తామే ముగిసిరి.''

---

1. అ. ని. అ: క: 1 - 1 - 5.
2. చుల్లవగ్గ 7

''అటులైన అన్నా! నీవే యింటనుండుము. నేనే సంన్యసించెదను.'' అని అనురుద్ధుడు బల్కి తల్లికడ కేగి ప్రవ్రజ్యకు అనుమతి వేడెను. ఆమెయు ''కొడుకా! జీవము పోయినకూడ నిన్ను బాయలేను. అట్టి నీకు సంన్యసించుటకు ఆజ్ఞను యెట్లివ్వగలను?'' అని నిరోధించెను. అనురుద్ధుడును తన పట్టు వదలలేదు. చివరకు ఆయమకేమియు దోచక ''నాయనా! ప్రస్తుతము మనల పాలించు శాక్య రాజు భద్రికుడు సంన్యసించినచో నీవును సంన్యసించుము. పొమ్మ''నెను.

తనకు మిత్రుడుగనె యుండు భద్రికరాజు వద్దకు అనురుద్ధుడరిగి యిట్లనియె–

''సౌమ్య! నా ప్రవ్రజనము నీ వశములో నున్నది.''

''మిత్రుడా! నా వశమే యైనచో తప్పక నెఱవేర్చెదను.''

''ఇట్లు మాటదీసికొని అనురుద్ధుడు విషయమంతయు దెలిపి ''సంన్యసింతము – పద'' యనెను. భద్రికుడును నీళ్ళు నమిలి తానందుకు అసమర్థుడననెను. ఆడినమాట నెగ్గించుకోబోలదా? యని అనురుద్ధుని ఒత్తిడి.

''అనురుద్ధా! యేడేండ్ల వ్యవధియిమ్ము. అంతమేరకు సంసిద్ధుడనగుదును.''

''అయ్యో! అంతకాలము తాళను వీలు లేదు.''

''పోనీ! ఆఱేండ్లు'' ''అబ్బో! అధికము. అంతదూరమా?''

''అయిదేండ్లు'' లేదు – లేదు''

''నాలుగేండ్లు'' ''ఊఁహూ!''

''మూడేండ్లు'' ..........

''రెండేండ్లు'' ..........

''ఒకయేడు'' ..........

''ఆఱునెలలు'' ..........

''మూడునెలలు'' ..........

''రెండునెలలు'' ..........

''ఒక్కనెల'' ..........

''అర్ధమాసము'' ..........

''భద్రిక మహారాజా! అర్ధమాసమనిన పదునైదు దినములు గదా? అంతటి విలంబము నోర్వలేను''

మిత్రమా! అనురుద్ధా! వారముదినములు గడువిమ్ము. అంతలో రాజ్యాదిక వ్యవహారములు తమ్ములకు సుతులకు నప్పగింతును.''

దినము లేడు గడిచినవి. శాక్యరాజగు భద్రికుడు, అనురుద్ధుడు, ఆనందుడు, భృగువు, కింబిలుడు, దేవదత్తుడును, యేడవవాడు ఉపాలియను మంగలియు కలిసి చతురంగసేనలతో కూడి పయనమైపోయిరి. తమరాజ్యముయొక్క హద్దుముగిసి నంతనే సేనలను వెనుకకు బంపి రాజపుత్రులార్వురును తమ మేనిపైనుండు ఆ భూషణముల నొలిచి ఉపాలికొసగి ''హాయిగ జీవింపుము పొమ్మ''ని వారు ముందుకు సాగిరి. ఉపాలి మంగలియు ఆమూటను చేతబట్టుకొని ''దీనితో నేను పురమును బ్రవేశించినచో రాజపుత్రుల చంపి నగల నపహరించినాడని చండస్వభావు లగు శాక్యులు నన్ను మట్టు వెట్టెదరు. ఈ బెడద నాకేల? రాజకుమారకులై వారే సంన్యసించినచో వారినెందుకు నేననుసరించిరాదు?'' అని భావించి నగలమూట నొకచెట్టుకొమ్మకు గట్టి ''కాంచినవాడు గ్రహించవచ్చును. వాడే యధికారి'' యని పలికి రాజసుతుల వెన్నంటిపోయెను.

తమతో కలిసికొనిన ఉపాలిని జూచి వానితో విషయమంతయు విని ''లెస్స జేసితివ'' ని అభినందించి అందఱును బుద్ధ భగవంతుని చెంగట చేరికొనిరి.

ముందు దీక్ష బొందినవానికి, వెనుక దీక్షబొందినవారు నమస్కరించవలెను. పూజించవలెను. గౌరవించవలెను. ఇది బౌద్ధ భిక్షునియమము. ఈ సూత్రమును పాటించి శాక్యకుమారకుల స్వాభిమానమును నశింపజేయు నిచ్ఛతో భగవంతుడు తొలుత మంగలియగు ఉపాలికి ప్రవ్రజ్యదీక్ష నిచ్చెను. ఆ పై రాజకుమారుల ప్రవ్రజి తుల జేసెను. భద్రికు డొక సంవత్సరములోననే విద్యల మూడింటిని దర్శింపగల్గెను. అనురుద్ధుడు దివ్య చక్షువును, ఆనందుడు స్రోతాపత్తి ఫలమును పొందిరి. దేవదత్తుడు పృథగ్జనుల క్షమగు బుద్ధిని – విభూతిని సంపాదించెను.

ఒకనాడు బుద్ధదేవుడు భద్రికుని పిలిపించుకొని ఓరమై కూర్చొనిన అతనిగాంచి యిట్లనియె.

''భద్రికా! భిక్షువులు నాతో జెప్పిరి. అరణ్యములందు నీవు విమనస్కుడవై వెనుకటి రాజ్యసుఖముల దలంచి గాబోలు 'హా! సుఖము. హా! సుఖమ' ని కేకలిడుచు తిరుగుచున్నావట. నీ ఉద్గానమునకు కారణమేమి?''

''భంతే! తొల్లి నేను రాజునై యున్నపుడు పురమునందలి అంతఃపురమున నివసించియు, నిరంతరము రక్షకజన పరివేష్టితుడనై యుండియు యెందెందు

దిరుగుచున్నను భయభీతుడనుగ, ఉద్విగ్నుడనుగ, సశంకుడనుగ నుండువాడను. ఈనాడు తోడసునది లేక అరణ్యముల దిరుగుచుండియు కూడ నిర్భయుడను, నిశ్శంకుడను, నిరాతంకుడనై విహరించుచున్నాను. దీని తలపోసి 'హా సుఖము హా! సుఖము'ని ఉద్గానమును పాడితిని.''

## ౧౪

## నలకపాన సూత్రము (వి. పూ. 470)

★ ఒకానొక సమయమున బుద్ధస్వామి కోసల దేశమందలి నలకపాన సమీప పలాశ (మోదుగ) వనమునందు విహరించుచుండెను. ఆరుబయట భిక్షుసంఘ ముతో కూడి, తనయొద్ద ప్రవ్రజితులైన అనురుద్ధుడు, నందియుడు, కింబిలుడు, భృగువు, కుండధానుడు, రేవతుడు, ఆనందుడును మొదలగు కులీనులగు కుల పుత్రుల స్మరించి వారి విషయమై అచట ప్రోవైన భిక్షు సంఘమును యిట్లడిగెను.

''భిక్షువులారా! నావద్ద ప్రవ్రజనమును బ ొందిన కులపుత్రులు బ్రహ్మచర్య చరణమునందు మనస్ఫూర్తిగ సంతృప్తులైయున్నారా?'' భగవంతు డిట్లు ముమ్మాఱ డిగియు భిక్షులకడనుండి మాఱుమాట గానక ముఖాముఖి కులపుత్రులనే యడి గెదనని తలంచి అనురుద్ధుని వైపు మళ్ళి యిట్లనియె.

''అనురుద్ధా! మీరు బ్రహ్మచర్యమునందు ప్రసన్నులరై యున్నారా?''

''ప్రభూ! అత్యంత ప్రసన్నులమైయున్నాము.''

''లెస్స! లెస్స! అనురుద్ధా! నీకు తగినమాటె పల్కితివి. కామభోగముల ననుభవింప నెంతయు యోగ్యమగు నడివయస్సునందు యిల్లు వెడలి శ్రద్ధాయుక్తుడవై సంన్యసించిన నీకీమాట యెంతైన నొప్పినది. రాజోపద్రవముచేగాని, చోరభీతుడవై ఋణమున జిక్కిగాని నీవు సంన్యాసివి గాలేదు. జన్మ జరామరణ దుఃఖ దౌర్మ నస్యములచే గాసివడి సుడివడి దుఃఖస్కంధమును మొదలంట పెటికివైవ నుత్సహించి ప్రవ్రజితుడవైతివి. నీతోడివారును నీయట్టివారే.

అనురుద్ధా! ప్రవ్రజితుడగు కులపుత్రుని కర్తవ్య మెట్టిదో వినుము. కామ భోగముల కతడు దూరుడు కావలెను, అకుశల ధర్మములకు అతీతుడు గావలెను. అభిధ్యా (లోభము), వ్యాపాదము (ద్వేషము)లు, ఉచ్ఛృంఖలతా, విచికిత్స (సందే

★ మజ్ఝిమ నికాయ 2 - 2 - 8

హము)లు చిత్తమున కంటియున్నంతకు వివేకసుఖమును పరమశాంతిని వాడు పొందలేడు.''

''అనురుద్ధా! భగవంతునిగూర్చి యేమని విచారించెదవు?''

''భంతే! జన్మ జరామరణదాయకములగు ఆస్రవక్లేశములు భగవంతునకు యెడమైనవి. అందుకయ్యే తథాగతుడు తెలిసియె ఒకటి సేవించుచున్నాడు. తెలిసియె యొకటి చేయుచున్నాడు. తెలిసియె యొకటి వదలుచున్నాడు. తెలిసియే ఒకటి త్రోసిపుచ్చుచున్నాడు.'' అని భగవంతుని విషయమై తలంతుము.

''సాధు! సాధు, అనురుద్ధా! చక్కగ జెప్పితివి. ఆస్రవక్లేశమలములు తథాగతుని వీడి తొలగిపోయినవి. నష్టమూలములైనవి. తలవిఱిగిన తాటిమ్రానివలె ముందు ముందు ఫలమివ్వ జాలినవిగావు.''

## ౧౫

## (రాహులోవాద సూత్రము వి. పూ. 470)

[1] తండ్రిని [2] మూడు విధములగు ఫలములయందు ప్రతిష్ఠింపించి భిక్షుసంఘ సహితముగ షడభిజ్ఞుడు వెండియు రాజగృహమునకు వచ్చి సీతవనమున విహరించు చుండెను.

## అంబలట్ఠికా (ఆమ్రయష్టికా) రాహులోవాద సూత్రము

[3] ఒకానొకనాడు భగవంతుడు రాజగృహపురమున వేణువనకలందక నివాపమున విహరించుచున్నాడు. ఆ సమయముననే ఆయుష్మంతుడు రాహులుడు [4]అంబలట్ఠిక (ఆమ్రయష్టిక) యందు విహారమొనర్చుచున్నాడు. సాయంసమయము ధ్యానమునుండి లేచి భగవంతుడు రాహులుడు వసించు అంబలట్ఠికా వనమున కరుగుదెంచెను. భగవానుని రాక దూరమునుండియే జూచి రాహులుడు ఆసనమును బఱిచి అందు గూర్చుండబెట్టి పాదములను గడిగెను. తర్వాత నమస్కరించి యొక మూల గూర్చొనెను.

---

(1). జాతకనిదాన, (2). స్రోతాపన్న, సకృదాగామి. అనాగామి (3). మ. ని. 2. 2.1.
(4). వేణువన నికటమున ఏకాంతప్రియులకు యేర్పఱచిన వాసస్థానము, రాహులుడు శ్రామణేర స్థితియందు యేడేండ్లందు విహరించెను.

బుద్ధదేవుడు పాత్రయందు కొంచెము నీరుంచి రాహులునకు జూపి యిట్ల నియె. ''రాహులా! పాత్రయందు మిగిలిన యీ కొంచెము నీటిని జూచితివా?''

''భంతే! చిత్తము''

''రాహులా! తెలిసి తెలిసి అబద్ధమాడు భిక్షువుయొక్క సాధుత్వముకూడ కొంచెమైనది. యెందుకు చాలనిది.''

భగవంతు డంతట ఆ కొద్ది నీటిని పాఱజల్లి ఆయుష్మంతుని రాహులునిజూచి, ''రాహులా! నేను నీటిని పాఱజల్లుట జూచితివా?''

''భంతే! చూచితిని.''

''ఆయుష్మంతా! యెఱిగి యెఱిగి అసత్యమాడుట యందు సిగ్గుజెందజాలని భిక్షువుయొక్క సాధుత్వముకూడ యీ నీటివలె త్యజింపబడినది.''

పిమ్మట భగవంతు డాపాత్రను బోరగిలవేసి యిట్లనియె-

''రాహులా! ఈ పాత్రను జూచితివా?''

''ఆహా! చూచితిని.''

''తెలిసి అసత్యమాడుటయందు సిగ్గువొందని భిక్షువు సాధుత్వముకూడ దీనివలె అధోముఖమైనదే.''

ఆ పై భగవంతుడా పాత్రను వెల్లకిలబెట్టి రాహులునితో నిట్లనియె-

''రాహులా! తెలిసి అనృతమాడుటయందు లజ్జపొందనేరని భిక్షువుయొక్క సాధుత్వము దీనివలె శూన్యమును, రిక్తమునునైనది.''

ఆయుష్మంతా! ఏనుగు యుద్ధభూమికి పోయి కాళ్ళ చేతను, దంతముల చేతను, కాయముచేతను పనిచేయునదయ్యు, తొండమును ప్రయోగింపక గట్టిగ పట్టియుంచినచో దానిజీవనము విశ్వసింపదగునది గాదు. అటుగాక ఆ యేనుగు తొండముతో కూడ పని చేయునదైనచో దాని జీవితము నిరుపద్రవము.

''అట్లే, రాహులా! తెలిసి తెలిసి అబద్ధమాడుట యందు జంకనివాడు, సంకోచించనివాడు చేయరాని పాపకార్యమనునదొకటి యుండదు. జీవన సంగ్రామమున వాడు గట్టెక్క లేడు. అందుచే నాయనా! మందెమేలములందైనను కల్లలాడనని దృఢ ప్రతిజ్ఞుడవు కమ్ము.'' మఱియు వినుము.

''రాహులా! అద్దమెందుకొఱకు?''

''దేవా! చూచుకొనుటకొఱకు?''

''అవును రాహులా! చూచిచూచి కాయముతో పనిగొనవలెను. చూచి చూచి వాక్కును ప్రయోగించవలెను. చూచి చూచి మనస్సును సాగించవలెను. కాయముతో పనిగొనునప్పుడు యిట్లు విచారించవలెను. నా జేయు యీ పని నాకుగాని యితరులకుగాని ఉభయత్రగాని వేదనను కల్గింపదుగదా? అకుశలకరమును, దుఃఖహేతువును, దుఃఖవిపాకమును కాదుగదా? యని వితర్కించి గమనించి యోగ్యమైనపనినే జేయవలెను. ఇట్లు కాయకర్మమును చేయుటకు మొదటను, చేయునపుడును, చేసిన పిమ్మటను విచారించి ప్రత్యవేక్షించి కుశలకరమును, సుఖహేతువును, సుఖవిపాకమునునగు కర్మ పరాయణుడు కావలెను. ఆచార్యునితోడను, ఆప్తమిత్రునితోడను, నివేదించి సంప్రదించి రాత్రింబవళ్ళు కుశల కర్మ ధర్మములను నేర్వవలెను. అట్టివానివైనచో లోకమునందు ప్రమోద భరితముగ విహరింపగలవు.''

అట్లే, రాహులుడా! వాక్కుతో పనిగొను వేళలను, మనస్సుతో పనిచేయించు పట్లను పైన దెల్పిన విధుల ననుసరించి సంచరించినచో లోకమునందు ప్రమోదభరితముగ విహరింపగలవు.

గతకాలమునందలి శ్రమణులును, బ్రాహ్మణులును కాయకర్మమును వచనకర్మమును మనఃకర్మమును ప్రత్యవేక్షణమొనర్చి పరిశోధించుచు నే వచ్చిరి. రాబోవు కాలమునందును వారట్లే చేయగలరు. వర్తమానమందును అటులే జేయుచున్నారు.

కాబట్టి ఆయుష్మంతుడా! రాహులుడా! నేనును కాయకర్మమును వచనకర్మమును మనఃకర్మమును ప్రత్యవేక్షణజేసి యెప్పటికప్పుడు పరిశోధించెదనని ధృఢ ప్రతిజ్ఞుడవు గమ్ము.''

## ౧౬
## జేతవన స్వీకారము (వి. పూ. 469)

[1] సమంతభద్రుడు బుద్ధుడు రాజగృహమునందు సీతవనమున విహరించుచున్నాడు. శ్రావస్తి నివాసియగు అనాథపిండక గృహపతి ఆ సమయమున ఏదో

1. సం. ని. 11 - 1 - 8

పనికొఱకై తన బావగారగు రాజగృహక శ్రేష్ఠి యింటికి రాజగృహ నగరమునకు వచ్చినాడు. "లోకమునందు బుద్ధుడవతిరించినాడు. ఆతనిని దర్శించవలె" ననెడి కుతూహలము అనాథపిండకునకు చిరకాలమునుండి గలదు.

[1]అనాథపిండకుడు తనయింటికి వచ్చుసరికి రాజగృహకశ్రేష్ఠి ఏదో మహాకార్యమునందు వ్యస్తుడైయున్నాడు. పరిజనులను సేవకులను ఆయా పనుల యందు నియోగించుచు కోలాహలమందు మునిగి యుండినాడు. ఆ పరిస్థితి నవలోకించి అనాథపిండక గృహపతి తనలో తాను యిట్లు వితర్కించెను. "ఇతఃపూర్వము నేనిచ్చటికి వచ్చినప్పుడెల్లను యీతడు నా ఆదరసత్కారములందే తన్మయుడై యుండువాడు. నేడెంతయు విక్షిప్తుడై యున్నాడు. కతమేమియో దెలియరాదు. మహాయజ్ఞము తలపెట్టినాడో! మహారాజు నాహ్వానించినాడో! అడిగి తెలిసికొందును గాక" యని సమీపించి పోయి యిట్లనియె. "బావా! నేడు మహత్కార్య ఆయోజనమున లంపటుడవై యున్నావు. వివాహమా? ఆవాహమా? లేక మఱేమియో జెప్పు" మని యడిగెను.

రాజగృహక శ్రేష్ఠియు ఆ మాటవిని 'గృహపతీ! నీవు జెప్పిన దేదియు లేదు. రేపు నా యింటి భోజనమునకు సంఘ సహితముగ బుద్ధుని నిమంత్రించినాను. అందుకు వలయు వ్యవస్థయందు యిపుడు మునిగియున్నా'' ననెను.

"ఆహా! బుద్ధుడా! బుద్ధుడేనా?"

"అవును. బుద్ధుడు. సమ్యక్ సంబుద్ధుడు."

"అయ్యా! శ్రేష్ఠీ! బుద్ధనామము లోకమున దుర్లభము. ఆ మహానుభావుని యిపుడే బోయి దర్శించుదునా?"

"గృహపతీ! దర్శనమున కరుగుట కిది వేళగాదు."

"అట్లైన యుక్తసమయమున రేపువెళ్ళి సందర్శించెదను."

బుద్ధదర్శన కుతూహలపరవశుడైన అనాథపిండకునకు రాత్రియంతయు నిద్ర లేదు. ఇంకను చీకటి మిగిలియుండగనే లేచి నగరమతిక్రమించి భగవంతుడు విహరించు సీత వనమార్గముబట్టి నడిచెను. అది తెలతెల వారు సమయము. ఆ ప్రత్యూష సమయమున భగవంతుడు ఆరుబయట నటునిటు దిరుగుచున్నాడు. తన్నవైపుకే

1. చుల్లవగ్గ 6: విభాణ.

వచ్చుచున్న అనాథపిండక గృహపతిని దూరమునందుండియే గాంచి చంక్రమణము జాలించి పఱిచిన ఆసనముపై కూర్చొనెను. సమీపించిన గృహపతిని, శాస్త ''ఓ సుదత్తా! రమ్మ'' నిపిలిచెను. ''పరిచిత జనునివలె భగవంతుడు నన్ను పేరువెట్టి పిలుచు చున్నాడే'' యని సంతోషించి సుగతుని పాదముల కెఱగి యిట్లనియె.

''భగవానులు సుఖముగ నిద్రించితిరా?''

''నిర్వాణప్రాప్తుడగు బ్రాహ్మణు డెప్పుడును సుఖముగనే నిద్రించును. వాస నలు శాంతించి , కోరికలు నశించి చిత్తమునకు ఉపశమమును జేకూర్చిన బ్రాహ్మ ణుడెప్పుడును సుఖముగ నే నిద్రించును.''

భగవంతు డిట్లు సమాధానమిచ్చి అనాథపిండకునకు ★ అనుపూర్వికకథను వర్ణించెను. నిర్మలమగు వస్త్రమునకు రంగు అతికినట్లు తత్ క్షణము అనాథపిండక గృహపతికి ''సముదయ (ఉత్పత్తి) ధర్మమెల్లను నిరోధ(వినాశ) ధర్మమే'' యనెడి విరజ ధర్మ చక్షు వుత్పన్నమైనది. దృష్టధర్ముడగు బుద్ధదేవుని శాసనమందు స్వతం త్రుడై అనాథ పిండకగృహపతి భగవంతునితో నిట్లనియె.

''భంతే! ఆశ్చర్యము; అబ్బురము. బోర్ల పడిన దానిని చక్కనిలిపినట్లు మూసిన దానిని దెఱచినట్లు, దారిదప్పినవానికి మార్గము జూపినట్లు భగవంతా! వివిధపర్యాయముల ధర్మమును వెల్లడించితివి. బుద్ధుని ధర్మమును సంఘమును శరణుజొచ్చుచున్నాను. నేటినుండి నన్ను సాంజలిశరణాగత ఉపాసకునిగ భగవంతు డనుగ్రహించుగాక. దేవరవారు భిక్షుసంఘసహితముగ నే నిచ్చు భోజనమును ఱేపటిదినము స్వీకరింపవలయును.''

భగవంతు డామాటను మౌనముననే అంగీకరించెను. అంతట అనాథపిండ కుడు శాస్త్తకు ప్రణమిల్లి ముదలగొని తన బసకు వెళ్ళెను. అనాథపిండకుడు సంఘ సహితముగ బుద్ధుని భోజనమునకు నిమంత్రించుట రాజగృహకశ్రేష్ఠి తెలిసికొని జేరబోయి యిట్లనియె. ''గృహపతీ! నీవు నా యింటికి అతిథివై వచ్చితివి. సంఘ సహితముగ బుద్ధుని నిమంత్రించితివి. ఱేపటి విందుకగు ఖర్చును నే నిచ్చెదను. నీ యిష్టానుసారము నెఱవేర్చికొనుము.''

''అయ్యా! అటుగాదు. అందుకు వలయు ద్రవ్యము నావద్దనే యున్నది.''

---

★ 31వ పేజీ చూడుడు.

అతిథిగ వచ్చిన అనాథపిండకుడు బుద్ధసంఘమును నిమంత్రించుట విని నైగముడు (ఊరిపెద్ద) ను, నరపాలుడును (మగధరాజు) సహాయపడనెంచిరిగాని అనాథపిండకు డందుకు సమ్మతించడయ్యె.

రాత్రి గడచినది. తెల్లవారినది. బావయగు రాజగృహక శ్రేష్ఠి యింటనే ఉత్తమ ఖాద్య భోజ్యములను వండించి అంతయు నాయత్తపఱచి "వేళయైనది, విచ్చేయుడు" ని భగవంతునకు ఆహ్వానమంపెను. అమ్మహాపురుషుడును భిక్షువులును పాత్రచీవ రములను గొని చనుదెంచి పఱువబడిన ఆయా ఆసనములందు గూర్చొనిరి. అనాథ పిండక గృహపతియు తన చేతులార వారికి వడ్డించి సంతుష్టుల జేసి యొకవైపు నిలువబడి అంజలిజోడించి సుగతునితో "భగవానులవారు శ్రావస్తియందు వర్షావాస మొనర్పవలెనని ప్రార్థన" యని మనవి చేసుకొని ఒప్పించుకొనెను.

రాజగృహమునందు పనుల ముగించుకొని అనాథపిండక గృహపతి తన నగర మగు శ్రావస్తికి బయలు దేరుచు బుద్ధుడామార్గమున వచ్చువాడని తలంచి దారి పొడగునను ఆరామములను విహారముల ననేకము నిర్మింపజేసెను.

శ్రావస్తిని చేరుకొన్న పిదప అనాథపిండకుడు బుద్ధునకు నివాసయోగ్యమగు భూమిని నెమకనారంభించెను. ఊరికి మిగుల దూరమై యుండరాదు. మఱీంత దగ్గఱయున్నై యుండరాదు. రాకపోకల కనుకూలమై యుండవలెను. పగటియందు జన కోలాహలము లేనిదియు, రాత్రులందు నీరవమై యుండునదియునై మొత్తము మీద యేకాంత ప్రదేశము యోగ్యముగ నుండును. అదియెద్ది?" యని విచారించి జేతుడను రాజపుత్రుని ఉద్యానవనమన్నిటికి యొప్పినదిగ నిశ్చయించి అతనికడకు పోయి యిట్లనియె-

"ఆర్యపుత్రా! ఆరామ మొక్కటి నిర్మింప దలంచితిని. మీ ఉద్యానమును మాకిండు."

"గృహపతీ! దానినిండ వరహాలు పఱిపించినగాని అది యివ్వదగినదేనా?"

"అయ్యా! అట్లయిన ఉద్యానవనము నాదే."

"గృహపతీ! ఎట్లు?"

"వరహాలే పఱిపించెదను. ఆర్యపుత్రా! నీవే వెలను నిర్ణయించితివిగదా!"

సభికులందఱుగూడ గృహపతి మాటలనె సమర్థించిరి. అంతట అనాథపిండక గృహపతియు బంగారునాణెములను బండ్లపైయెత్తించుకొని పోయి ఉద్యానవనమం

తయు నేలకానరాకుండా స్వర్ణముద్రలచే కప్పించెను. చివరకు నేల కొంతమాత్రము మిగిలినది. దానిని గూడ పూర్తిజేయనెంచి పరిచరులనంపి మఱికొన్ని నాణెముల నింటినుండి తెప్పింపనుంకించుచున్న తరుణమున లోకవిస్మయ జనకమగునమ్మహా కార్యమును జూచి తలపంకించి రాజకుమారుడు జేతుడు అనాథపిండకునితో యిట్లనియె.

''గృహపతీ! నీ ఔదార్యము వర్ణనాతీతము. ఇక చాలును. ఈ మిగిలిన నేలను బుద్ధసంఘమునకు ఉచితముగ నేనిచ్చుచున్నాను. ఈ భాగ్యము నాకు కలిగించు'' మనెను.

గృహపతియు మాన్యుడగు రాజకుమారుని మాటను పాటింపదగినదిగ దలంచెను. భిక్షుసంఘమునకు విశ్రాంతి నిలయమగు విహారమును ఆ జేతవనము నందు సర్వశోభా సమృద్ధముగ, సకల పరిష్కార సహితముగ నిర్మింపజేసెను. ఉప స్థానశాలలు, అగ్నిశాలలు, చంక్రమణశాలలు, గదులు, మండపములు, పుష్కరి ణులు గలిగి జేతవనవిహా రము తాను తానై యొప్పినది. తనకు మిగిలిన తావునందు జేతరాజకుమారు డొక గదిని నిర్మింపజేసెను. దానిపేరు గంధకుటీ విహారము. భగవంతుడు స్వయముగ దానియందు నివసించును.

భగవంతుడు బుద్ధుడు రాజగృహమునందు కొంతకాలము విహరించి పిమ్మట క్రమముగ చారిక నొనర్చుచు వైశాలిని జేరి కొనెను. అచ్చట ★ మహావనము యొక్క కూటాగారశాలయందు విహారమొనర్చుచుండెను. ఆనాటి ప్రజలు నవకర్మము (క్రొత్తభిక్షువులకు నివాస నిర్మాణము) నందు ఆసక్తి పూర్వముగ తత్పరులై యుం డిరి. అట్టి నవకర్మ పర్యవేక్షణయందు పాల్గొన్న భిక్షువులకు వారే చీవరములు (వస్త్రములు) పిండపాత (భిక్షాన్న)ము, శయనాసనము (యిల్లు) గ్లాన ప్రత్య యము (రోగిపథ్యము). ఔషధములును యిచ్చి సత్కరించు చుండిరి. అట్లుండ పేదయగు సాలెవాడొకడు తానును నవకర్మ నిర్మాణమునందాసక్తుడై స్వయముగ మట్టిని కలిపి యిటుకను తయారుజేసి గోడలను పెట్టుట కుద్యమించెను. ఆ పని యందు వాడు క్రొత్త యగుటచే మాటిమాటికి గోడలు పడిపోవజొచ్చెను. వాడును చీకాకై ''ఈ శ్రమణభిక్షువులు తమ్ము సత్కరించువారిని కఱచుకొనియుండెదరు. దరిద్రుడనైన నా సుద్ది వారికెందుకు బట్టినది?'' యని అంగలార్చుచుండెను. ఆ విషయమెఱింగి భిక్షువుల నందఱ బిలిచి భగవంతు డిట్లనియె.

---

★ ముజప్ఫర్ జిల్లాయందలి బసాఢమునకు దాదాపు కోసెడు దూర మందుండు కోలువా గ్రామము, అచ్చోట యిప్పటికిని అశోకస్తంభము నిలిచియున్నది.

''ఓ భిక్షువులారా! నవకర్మ విధానమునందు మీకు అనుజ్ఞ నిచ్చుచున్నాను. నవకర్మముల నొనర్చువారికి తోడ్పడుట, ఆలస్యముగాకుండ జూచుకొనుట. శిథిలమైన వాటిని పునరుద్ధరింపజేయుట, ఈ పనులయందు మీకు అనుమతి నిచ్చుచున్నాను. తొలుత సమర్థుడగు భిక్షుడు సంఘమున కిట్లు నివేదించ (జ్ఞప్తి) వలెను.

''భద్రపురుషులారా! ఫలానా గృహపతి నిర్మింపనెంచిన విహార నవకర్మ నిరీక్షకుడుగ ఫలానా భిక్షువు నియుక్తుడగుచున్నాడు. సమ్మతింపనివారు మాట్లాడ వచ్చు'' నని మూడుమార్లు సూచన నిచ్చి సంఘము ఊరకున్నచో అదియె సమ్మతిగ గ్రహింపవలెను.

అంతట వైశాలినుండి కదలి భిక్షుసంఘసహితముగ భగవంతుడు శ్రావస్తికి చనుదెంచుచున్నాడు. షడ్ వర్గీయ భిక్షువుల శిష్యులు తక్కిన సంఘమునకంటె ముందుముందరుదెంచి తాము విడియు విహారములందలి శయ్యాదికములగు వస్తు పరిష్కారములను యేరుకొని ''యివి మా ఉపాధ్యాయులకు – యివి మా ఆచార్యులకు – యివి మాక'' ని ఆక్రమించుకొనుచుండిరి. ఒకనాటి బసయందు సారిపుత్రునకు పరుండుటకు ఆస్తరణమెద్దియు లభింపక రాత్రియంతయు నొక చెట్టుక్రింద గడపెను. తెల్లవారినంత చెట్టుక్రింద సారిపుత్రుని జూచి భగవంతుడు యావద్విషయము విని వెగటుచెంది భిక్షుసంఘము నామంత్రించి యిట్లనియె–

''భిక్షువులారా! సంఘమునకంటె ముందె బఱతెంచి అయోగ్యవర్తనులై వస్తువుల నేరుకొంటిరా? ఛీ – ఛీ – ఈ పద్ధతి అప్రసన్నుల ప్రసన్నుల జేయుటకు గాని, ప్రసన్నుల మఱింత ప్రసన్నుల జేయుటకుగాని యుపకరించదు. ప్రసన్నుల నప్రసన్నులుగను, అప్రసన్నుల మఱింత అప్రసన్నులుగను మాత్రమే చేయజాలును.

''భిక్షువులారా! ఆసన భోజన పానీయముల (అగ్రపిండము) నర్పించుటకు ప్రథమార్హుడెవడు?

''భగవంతా! క్షత్రియకులమునబుట్టి ప్రవ్రజించినవాడు''

''భంతే! బ్రాహ్మణకులమునుండి ప్రవ్రజించిన యతడు''

''ప్రభూ! కులపతి (వైశ్య) కులమునుండి సంన్యసించినతడు''

''దేవా! సౌత్రాంతికుడు (సూత్రపాఠకుడు)''

''తథాగతా! ధర్మవ్యాఖ్యాత యగువాడు''

''షడభిజ్ఞా! ప్రథమ ధ్యానసంపన్నుడు''

''దశబలా! ద్వితీయ ధ్యానసంపన్నుడు''
''సుగతా! తృతీయ ధ్యానసంపన్నుడు''
''శాస్తా! చతుర్థ ధ్యానసంపన్నుడు''
''సర్వజ్ఞా! స్రోతాపన్నుడు''
''మహాపురుషా! సకృదాగామి''
''మహావీరా! అనాగామి''
''జినదేవా! అర్హతుడు''
''సమంతభద్రా! త్రైవిద్యుడు''
''భగవన్! భగవంతుడు బుద్ధుడు.''

అని తలకొక భంగి చెప్పిన భిక్షువుల మాటల నాలకించి భగవంతుడిట్లు చెప్పదొడగెను.

పూర్వకాలమున హిమనగప్రాంతమున నొకమఱ్ఱిచెట్టు ఉండెడిది. దాని నాశ్రయించి యేనుగు, కోతి, తీతువపిట్ట యను మూడు ప్రాణులు నివసించియుండినవి. ఒకచోట నుండియు ఒద్దికలేక పొందు పొసగక యెడమొగము పెడమొగమై యుండెడివి. ఒకనాడామూడును తమలో పెద్ద యెవరో తేల్చుకొనవలెనని తలచినవి. మొదట యేనుగును ప్రశ్నించినవి. ''సౌమ్యా! మిగుల ప్రాచీన విషయమును నీ వెఱిగినదాని నొక్కటి చెప్పుము.'' కుంజర మిట్లనియె. ''నా పసితనమున యీ మఱ్ఱిచెట్టును దాటిపోవు చుంటిని. అప్పుడు దీని కొనలు నాపొట్టను తాకుచుండెడివి.'' కోతి యిట్లనెను. ''ఈ మఱ్ఱిచెట్టు మొలకగ నుండునపుడు దీని చిగుళ్ళను తినిన జ్ఞప్తి నాకున్నది.'' తీతువ యిట్లనినది. ''వెనుక నీ చోటనుండిన ప్రాత మఱ్ఱిచెట్టుపండ్లను తిని నేను రెట్టవేయుటచే అందులోని ఒకానొక విత్తనమునుండియే ప్రస్తుతమున్న యీ చెట్టు మొలిచినది.

ఆ మాటలువిని తక్కిన రెండును తీతువను పెద్దజేసుకొన్నవి. అప్పటి నుండియు నవి కలసిమెలసి ఆదరసత్కారములతో, ఆమోదప్రమోదములతో మెలగుచు వచ్చినవి. తిత్తిరియు గజమునకును వానరమునకును [1] పంచశీలములను గ్రహింపజేసి తానును అట్లే మెలగినది. పరస్పర సహకారమున బ్రతుకు సుఖ మయముగ గడపి సుగతిని ప్రాపించినవి. భిక్షువులారా! తైత్తిరీయ బ్రహ్మచర్య గాథ యిది.

1. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, మదరాహిత్యము.

వృద్ధుల సత్కరించుట ధర్మము నెఱుగుటకు గుర్తు. వృద్ధోపసేవి యిందును అందును మేలు బొందును. మీరో స్వాఖ్యాతమగు ధర్మవినయమున ప్రవ్రజించితిరి. ఒకరినొకరు మెచ్చక కలగలుపు లేక పశుజాతికంటెను కనాకష్టమైయుండుట నితాంతమనుచితము. అసభ్యము. భిక్షువులారా! వయోవృద్ధుల నాదరించుడు. పూజించుడు. ఆసనభోజన పానీయముల తొలుత వారికర్పింపుడు. సంఘమునకిది దాటరాని నియమము. దాటినవాడు [1] ''దుష్కృత'' మను దోషమునకు గుఱికా గలడు. మఱియు భిక్షువులారా! అవందనీయులజెప్పెద వినుడు.

'తొలుత ఉపసంపద పొందినవానికి తర్వాత పొందినవాడు అవందనీయుడు. (నమస్కరింపదగనివాడు) అట్లే ఉపసంపద పొందనివారు, అధర్మవాదులగు వృద్ధులు స్త్రీలు, నపుంసకులును అవందనీయులు. అయిదు విధములగు శిక్షలచే దండితులైన వారును అవందనీయులు, యిక వందనీయులగూర్చి వినుడు. తనకంటె ముందు ఉప సంపన్నులైనవారును, ధర్మవాదులగు వృద్ధులును వందనీయులు, తథాగతుడు సమ్యక్ సంబుద్ధుడు, దేవమనుష్య శ్రమణ బ్రాహ్మణ సహిత లోక లోకముల కన్నింటి కిని వందనార్హుడు.'

ఇట్లనేక భంగుల బోధించి క్రమముగ చారిక నొనర్చుచు భగవంతుడు శ్రావస్తిని, జేతవనమును జేరుట విని అనాథపిండకుడు సుస్వాగతముగ నెదురేగి ప్రణామము లర్పించి మఱుదినము భోజనమునకు సంఘసహితముగ నిమంత్రించెను. మఱునాడు అన్నిటినాయత్తపఱచి భోజన సమయమగుడు సంఘసహితముగ బుద్ధదేవుని పిలిచికొనివచ్చి వివిధాహారముల సంతుష్టులజేసి తఱిజూచి యిట్లనియె.

''భగవంతా! జేతవన విషయమున తమ సలహాయేమి?''

''గృహపతీ! ఆగతులును అనాగతులును నగు చతుర్దిశ భిక్షుసంఘమునకు దానము చేయుము''

''తథాఽస్తు''

[2] సిద్ధార్థుడు బుద్ధుడైన పిదప యిరువది యేండ్లు అనియతముగ నాయాచోట్ల వర్షావాస మొనర్చెను. మొదటి సంవత్సరమున ఋషి పతనమున ధర్మచక్ర ప్రవర్తన మాచరించి అందే వసించిరి. రెండవ మూడవ నాల్గవ వర్షములందు రాజగృహపుర

1. భిక్షునియమానుసారముగ చిన్న పాపము.

2. అ, వి, అ. క. 2 - 4 - 5

మున వేణువన విహారమున నివసించెను. అయిదవయేట వైశాలిలో మహావన కూటాగారశాల యందును, ఆఱవయేట మంకులపర్వతముననను, సప్తమవర్షమున త్రయస్త్రింశ భవనముననను, యెన్మదవ వత్సరమున భర్గదేశమునందు సంసుమారగిరి యొక్క భేసకలావనముననను వర్షావాసము చేసెను. తొమ్మిదవయేట కౌశాంబి యందును, పదవయేట పారిలేయక వనఖండమునందును, ఏకాదశవర్షమున నాలా బ్రాహ్మణగ్రామము నందును, పంౘ్రెండవ వర్షమున వేరంజాపురి యందును, పదుమూడవయేట చాలియ పర్వతము నందును, పదునాల్గవయేట శ్రావస్తి జేత వనము నందును, పదునైదవయేట కపిలవస్తు నగరమందును, పదునాఱవ యేట ఆలవియందును, పదునేడవ సంవత్సరమున రాజగృహమునందును, పదునెన్మిది, పందొమ్మిదవ వర్షములందు చాలియపర్వతము పైనను, వింశాబ్దమున రాజగృహము నందును నివసించెను. ఇట్లు యిరువదియేండ్లు అనిబద్ధముగ నందందు వర్షావాస మును గడపిన భగవంతుడు ఆ పై తనకు నియతనివాస స్థానములు ( ధృవపరిభోగ ములు) గ, శ్రావస్తియందలి జేతవనమును, పూర్వారామమును యెన్నికొని అందే నివసించుచు వచ్చెను.

## ౧౭

## మహాప్రజాపతీ సంన్యాసము ( వి. పూ. 468 - 467)

[1]గౌతమగోత్రము. పేరు మహాప్రజాపతి. రెంటిని గలిపి మహాప్రజాపతీ గౌతమియని ప్రసిద్ధము. అభిసంబోధినిబొంది భగవంతుడు కపిలవస్తుపురమునకు వచ్చుచున్నాడని విని ఆయనకు శాలువలు అర్పించి పూజింపవలెనని ఆమె కుతూహలించినది.

## దక్షిణావిభంగసూత్రము

[2]అదియొక సమయము. భగవంతుడు కపిలవస్తుపురమున న్యగ్రోధారామ మునందు విహరించుచున్నాడు. అట్టి యెడ మహాప్రజాపతీ గౌతమి జంటశాలువల గైకొని బుద్ధునిచేరవచ్చి నమస్కరించి 'భంతే! ఈ వస్త్రములు నేను చేతులార వడికి నేసినట్టివి. తమకు అప్పగించుచున్నాను. దయతో స్వీకరింతురుగాక'' యని మనవి జేసెను. ''అమ్మా! గౌతమీ! సంఘమునకు సమర్పింపుము. దానిచే నేనును

1. మ. ని. అ. క. 3 -4 - 12.
2. మ. వి. 8 - 4 - 12.

సంతుష్టుడనగు దును'' అని బుద్ధదేవుడాడినమాట ఆ మెకు బొత్తుగ రుచింపలేదు. ఈ పరిస్థితిని గమనించి ఆయుష్మంతుడు ఆనందుడు శాస్తతో నిట్లనియె.

''ప్రభూ! మహాప్రజాపతీ దేవి యర్పించుకాన్కను మీరవశ్యము గ్రహింపవ లెను. తల్లి పురిటియందె కాలగతి జెందినతర్వాత దేవరవారిని ఈమె పెంచి పోషించి పాలించినది. మీకు స్వయముగ పినతల్లి. బుద్ధుని, ధర్మమును, సంఘమును శరణు జొచ్చినది. ప్రాణాతిపాతము (హింస), అదత్తాదానము (దొంగతనము), మృషావా దము (అసత్యమాడుట) మొదలగు అనార్యవృత్తులనుండి విరతురాలైనది. ఆర్యశీల ముల నాశ్రయించినది. బుద్ధునియందును సంఘమునందును శ్రద్ధమెండు. దుఃఖ మును, దుఃఖసముదయమును, దుఃఖనిరోధమును, దుఃఖనిరోధగామనీ ప్రతిపద మును యెఱింగి నిశ్చింతురాలైనది. దేవా! మహోపకారిణియైన యీమె కోర్కెను త్రోసిపుచ్చరాదు.''

''ఆనందా! అవును. పుద్గలుడు (ప్రాణి) పుద్గలుని (ప్రాణి) మూలమున బుద్ధునకును ధర్మమునకును సంఘమునకును శరణాగతుడగుచున్నాడు. నమస్కరించుట, దోసిలిపట్టుట, అన్నవస్త్రములనిచ్చుట, పథ్యోపచారముల నొస గుట, ఇదియె పుద్గలునకు మఱియొక పుద్గలుడు (ప్రాణి) చేయు ప్రత్యుపకారమని నేనన‌ను. ప్రాణి మఱియొక ప్రాణి సహాయముచే ప్రాణాతిపాతము అదత్తాదానము కామమిథ్యాచారము మృషావాదము సురామేరయ మద్యప్రమాద స్థానములనుండి విరతుడై దుఃఖముల దొలగి నిశ్చింతుడగుచున్నాడు.''

ఆనందా! వ్యక్తిగతదానము (ప్రాతిపుద్గలికదక్షిణ) లను పదునాల్గింటిని వినుము. సమ్యక్ సంబుద్ధునకు చేయుదానము మొదటిది. ప్రత్యేక సంబుద్ధునకు రెండవది. అర్హతునకు చేయుదానము మూడవది. నాలుగు అర్హ ఫలాపేక్షికి, అయిదు అనాగామికి, ఆఱు అనాగామి ఫలాపేక్షికి, ఏడు సకృదాగామికి, ఎనిమిది సకృదా గామి ఫలాపేక్షికి, తొమ్మిది స్రోతాపన్నునకు, పది స్రోతాపత్తి ఫలాపేక్షికిని చేయు దానము. వీతరాగులకు చేయునది పదునొకొండవది. శీలవంతుడగు పృథగ్జనునకు (సామాన్యమానవునకు) చేయుదానము పదిరెండవది. దుశ్శీలుడగు పృథగ్జనునకు చేయుదానము పదమూడవది. పశుపక్ష్యాదితిర్యక్ జాతులకొనర్చు దానము పదునాల్గవది. ఆనందా! ఇందు వెనుక వాటి(ఉత్తరోత్తరము) కంటె ముందు ముందు గలవి (పూర్వపూర్వములు) అనంతఫలముల నిచ్చునవి.

ఆయుష్మంతా! సంఘమునకు సంబంధించిన దక్షిణ (దానము) లను యేడింటిని జెప్పెదను. సంఘముల [1] రెండింటితో గూడిన బుద్ధునకు చేయునది సంఘగతమగు ప్రథమ దక్షిణ. బుద్ధుడు నిర్వాణము చెందినపిదప సంఘముల రెంటికిని చేయుదానము ద్వితీయ దక్షిణ. భిక్షుసంఘమునకు మాత్రము చేయుదానము మూడవది. భిక్షుణీ సంఘమునకు మాత్రము చేయుదానము నాల్గవది. సంఘమునందలి భిక్షుణీ భిక్షువుల కొందఱిని మాత్రముద్దేశించి చేయుదానము అయిదవది. ప్రత్యేకించి భిక్షువుల కొందఱిని మాత్రముద్దేశించి చేయునది ఆఱవ దక్షిణ. ప్రత్యేకించి భిక్షుణీగణమును కొంతమాత్ర ముద్దేశించి చేయునది సప్తమ దక్షిణ.

"ఆనందా! రాగల కాలమునందు భిక్షువులు కాషాయమాత్రధారులు కరపటాచారు లును కాగలరు. ప్రజలు సంఘముమీది పేర వారికి దానములిచ్చెదరు. అయినను సంఘవిషయములౌటబట్టి ఆదానములు అపరిమిత ఫలముల నిచ్చునవి యేయని నాయూహ. ఏస్థితియందునుగూడ సంఘవిషయకమగు దానముకంటె వ్యక్తిగత (ప్రాతిపుద్గలిక) దానము అధిక ఫలవంతమగుట నేనొప్పను.

ఆనందా! మఱియు వినుము. ఇచ్చువాడు కల్యాణధర్మియు, శీలవంతుడు నైనచో, తీసికొనువాడు పాపధర్మియు దుశ్శీలుడునైనచో ఆ దానమునకు దాత మూలమున పరిశుద్ధి లభించును. దాత దుశ్శీలుడును పాపధర్మియునై, ప్రతిగృహీత కల్యాణధర్మియు సుశీలుడునైన అట్టి దానమునకు గృహీతనుండి విశుద్ధిలభించును. ఇర్వురును పాపధర్ములు దుశ్శీలురునైన అట్టి దానమునకు యే ముఖమునుండియు శుద్ధి లేదు. ఇరువురును కల్యాణ ధర్ములు సుశీలురునైన ఆ దానము యిరువైపుల నుండియు సంశుద్ధిని పొందగలదు.

## – ప్రజాపతీ ప్రవ్రజ్య సూత్రము –

[2] ఒక సమయమున కపిలవస్తువునందలి న్యగ్రోధారామమున భగవంతుడు విహారము జేయుచున్నాడు. అచ్చోటికి మహాప్రజాపతీ గౌతమివచ్చి యిట్లు విన్నవించెను. "భగవంతా! తాము ప్రవర్తింపజేసిన ధర్మవినయమునందు స్త్రీలు ప్రవ్రజితలు గారాదా?"

"అమ్మా! లేదు. అది పొసగదు."

---

1. భిక్షుసంఘము – భిక్షుణీసంఘము.
2. అ. ని 8 – 2 – 1, చుల్లవగ్గ 11

మూడుమాఱు లడిగినది. భగవంతుడు ముమ్మాఱును నిషేధించెను. దుఃఖ సంతప్తయై కన్నీరు గార్చుకొనుచు బుద్ధునకు నమస్కరించి అధోవదనయై వచ్చిన దారిని బోయినది.

అంతట కొన్నాళ్ళకు కపిలవస్తునుండి క్రమముగ చారికనొనర్చుకొనుచు భగవంతుడు వైశాలీ నగరము జేరెను. అచ్చట మహావన కూటాగారశాలయందు విహరించు చుండెను. మహాప్రజాపతీ దేవియు శాక్యస్త్రీల నేనూర్వుర వెంటబెట్టుకొని వెండ్రుకల గొఱిగించుకొని కాషాయవస్త్రములదాల్చి కాలినడకతో కంటక ప్రయాణ ముల సాగించుచు సుగతదేవుడుండు వైశాలిని ప్రవేశించి మహావన కూటాగార శాలను జొచ్చినది. ధూళిదూసరిత శరీరములతో, బొబ్బలెత్తి పగిలినకాళ్ళతో మూర్తీభ వించిన దుఃఖదేవతలో యన్నట్లు విహార ముఖద్వారమున నిలువబడియున్న శాక్య స్త్రీల జూచి ఆయుష్మంతుడు ఆనందుడు తహతహపడి మహాప్రజాపతి నిట్లడిగెను. ''అమ్మా! ఇదియేమి?''

''పూజ్యుడా! ఆనందా! బుద్ధధర్మమునందు ప్రవ్రజితులగుటకు భగవంతుడు స్త్రీలకనుజ్ఞ యివ్వలేదే.''

''గౌతమీ! ఇందే ఉండుడు. భగవంతుని అనునయ వినయముల ప్రార్థించి జెప్పెదను.''

అని హుటాహుటి శాస్తను చేరబోయి యిట్లనియె. ''భంతే! సుకుమారులగు శాక్యస్త్రీలగూడి మహాప్రజాపతీ దేవి పగిలిన కాళ్ళతో నొగిలిన శరీరములతో అదె వచ్చి ద్వారమున వేచియున్నది. ప్రభూ! వారిని గూడ బుద్ధధర్మమునందలి ప్రవ్రజ్య దీక్షకు అర్హలుగ జేయవలెను.''

''ఆనందా! సుగతధర్మమున స్త్రీలు సంన్యసింప వీలులేదు.'' మూడు మాఱులడిగినను సమ్మతించక నిషేధించిన భగవంతునితో ఆనందుడు ప్రకారాంతర మున మాటలుమార్చి యిట్లనుచున్నాడు.

''దేవా! తథాగతుడు నిర్దేశించిన ధర్మమునందు ప్రవ్రజించినచో స్త్రీలకైనను, స్రోతాపత్తి, సకృదాగామి, అనాగామి, అర్హత్త్వ ఫలములు చేకూఱ వీలుగలదా?

''ఆనందా! అవశ్యము చేకూఱగలవు.''

''ప్రభూ! అట్టులైన ఆ మహాఫలమునకు దూరమైయుండవలెనని వీరేమి దోషము చేసిరి. ఆ పుణ్యమునకు వీరనేల వంచితుల జేయవలెను. ప్రాణముల కొక్క

త్తుగ పెంచిపోషించిన మహాప్రజాపతీదేవి మహోపకారమునైన తలంపబోలదా? తల్లిని కనికరించుడు. స్త్రీలకుకూడ ప్రవ్రజ్యాసంపద ననుగ్రహించుడు.''

''ఆయుష్మంతా! వారు నేనిదే చెప్పబోవు ఎనిమిది శాసనములకు కట్టుబడి యాజ్జీవము వర్తించినచో ఉపసంపన్నుల జేయనవును.

1. భిక్షుణి తాను నూఱేండ్ల క్రిందటనే ఉపసంపద పొందియున్న కూడ ఆనాడు ఉపసంపన్నుడైన భిక్షువును పూజ్యబుద్ధి నాదరించవలెను.
2. ధర్మశ్రవణార్థము మాత్రము భిక్షుణి బిక్షు సమీపమునకు వచ్చుచుండవలెను.
3. భిక్షుణి ప్రతిపక్షమునందును భిక్షుసంఘముతో కూడి పర్యేషణవ్రతమును చేయవలెను.
4. వర్షావాసము ముగిసినపిమ్మట భిక్షుణి తానువినిన కనిన యెఱిగిన ఉభయ సంఘములందు పారణ చేయవలెను.
5. భిక్షుణి ఉభయసంఘములందును పక్షాభిమానము కలిగియుండవలెను.
6. ఎట్టి సమయమునందు కూడ భిక్షుణి భిక్షువును నిందింపరాదు.
7. భిక్షుణులు భిక్షువులకు ఉపదేశించుటకు హక్కులేదు.
8. భిక్షువులు భిక్షుణులకు ఉపదేశింపవచ్చును.

''ఆనందా! ఈ గురుధర్మముల నెనిమిదింటిని అంగీకరించినచో స్త్రీలకు ఉపసంపద లభింపగలదు.''

ఆ మాటలువిని ఆనందుడు మహాప్రజాపతి గౌతమిని చేరబోయి సవిస్తరముగ జెప్పెను. ఆమెయు శిరసావహించుచున్నామని సమాధానమిచ్చినది. ఆ విషయమును కూడ ఆయుష్మంతుడు ఆనందుడు భగవంతున కెఱుక పఱిచెను.

''ఆనందా! స్త్రీలకు ప్రవ్రజ్యనొసగుట లేకున్నచో తథాగత ప్రచోదితమగు ధర్మవినయమునందు బ్రహ్మచర్యము చిరస్థాయిగ వెలయగలిగెడిది. సద్ధర్మము వేయేండ్లు చిరంజీవిగ వర్ధిల్లదగియుండెడిది. నేడో, స్త్రీలు ప్రవ్రజితలైనారు. బ్రహ్మచర్యము చిరస్థాయిగ నుండుననెడి ఆశ లేదు. సద్ధర్మము అర్ధాయువుతో అయిదునూఱేండ్లు మాత్రమే నిలువగలదు. పురుషులు కొద్దియై స్త్రీలధికముగనున్న దుర్గము దొంగలచే సులభముగ భంజింపబడును. అట్లే స్త్రీలు అధికముగ సంన్యసించిన ధర్మవినయమందు బ్రహ్మచర్యము స్థిరముగ నిలువలేదు. అందుకయ్యే, పాఱిపోవు నీటిని కట్టగట్టి నిరోధించి నట్లు, దాటరానటువంటి గురుధర్మముల నెనిమిదింటిని భిక్షుణీ సంఘమునకు యావజ్జీవము విధించితిని.''

## ప్రజాపతీ సూత్రము

[1] ఒకానొకనాడు వైశాలిలోని కూటాగారశాలయందు భగవంతుడు విహరించుచుండ మహాప్రజాపతీగౌతమి బోయి అభివాదన మొనర్చి యిట్లన్నది. ''దేవా! భగవానులవారు సంక్షేపముగ ధర్మమును ఉపదేశించినచో దానిని విని యేకాకినై ప్రమాదరహితముగ ఆత్మసంయమముతో విహరించెదను.''

''గౌతమీ! వినుము. విరాగమునకు గాక, సరాగమునకు చెందినదియు, వియోగమునకుగాక సంయోగమునకు చెందినదియు, సంయమమునకుగాక సంగ్రహమునకు జెందినదియు, సంతోషమునకుగాక సంతాపమునకు జెందినదియు, సుభరతకొఱకుగాక దుర్భరతకు చెందినదియునగు నేధర్మమైనను, అది ధర్మము గాదు, వినయముగాదు. బుద్ధునకు సమ్మతమును గాదు.

అమ్మా! సరాగమునకుగాక విరాగమునకును, సంయోగమునకుగాక వియోగమునకును, ,సంగ్రహమునకుగాక సంయమమునకును సంతాపమునకు గాక సంతోషమునకును, దుర్భరతకొఱకు గాక సుభరతకొఱకును దారిదీయునదే దియో అదియె ధర్మము. అదియె వినయము (ఆచారము). అదియే బుద్ధానుశాసనముకూడ.''

## ౧౮

## యమక ప్రాతిహార్యము (వి. పూ. 465)

[2] తథాగతుడు ఆఅవయేట మంకులపర్వతముపై వసించెను. [3] ఆ సమయమున రాజగృహక శ్రేష్ఠికి గొప్ప విలువగల ఒక గంధపుకొయ్య దొరకినది. అంతట అతడిట్లు యోజించెను. 'దీనిని తొలిపించి పాత్ర జేయింతును. రాలిన పొడి నాయింటికిని, పాత్ర దానమునకును ఉపయోగించును.' అని పాత్రను జేయించి యొక వెదురు కొనయందు గట్టించి వెదురుకు వెదురు అంటించి కట్టి దానిని యేడు తాటిచెట్ల యెత్తున ఆకాశమందు నిలబెట్టించి యిట్లు నియమము జేసెను. ''బుద్ధి మంతు (దివ్యశక్తిధరు) డగు శ్రమణ బ్రాహ్మణుడెవ్వడైనను దీనిని తీసికొనవచ్చును.''

పూర్ణకాశ్యపుడును, మస్కరీగోశాలుడును, ప్రకృధకాత్యాయనుడును, సంజయ వేలటి పుత్రుడును, నిర్గ్రంధ జ్ఞాతృపుత్రుడును, క్రమముగ నొక్కొక్కరు

(1) అం - ని - 8 - 2 - 1 - 3. (2) అ. ని, అ. క. 2 - 4 - 5.
(3). చుల్లవగ్గ 5, ధ.ప. అ, క. 4 - 2.

రాజగృహకశ్రేష్ఠి వద్దకు జనుదెంచి ''గృహపతీ! మేము అర్హతులము. బుద్ధిమంతులము సిద్ధులము. పాత్రను మాకిండ'' ని యడిగియు నతడు ''మీరే దించుకొని తీసుకొను డ'' నుటచే గగన వీధులకెక్కి కూర్చున్న దానిని గ్రహింపజాలక రిత్తగ బోయిరి.

పూర్వాహ్ణసమయమున రాజగృహమునకు భిక్షాచారమునకు వచ్చి ఆయుష్మంతుడు మౌద్గల్యాయనుడును, పిండోల భారద్వాజుడును ఆ వార్తను వినిరి. అందు మౌద్గల్యాయనుడు తోడి సబ్రహ్మచారితో నిట్లనియె. ''ఆయుష్మంతా! పిండోల భారద్వాజా! నీవు అర్హతుడవును, బుద్ధిమంతుడవును గదా? ఆ పాత్ర నీకే పొమ్ము. తీసికొనుము.''

వల్లెయని యతడు ఆకసమున కెగిరి పాత్రను తీసుకొని రాజగృహపురమును ముమ్మాఱు పైననే దిరిగి రాజగృహక శ్రేష్ఠి ప్రార్థనను మన్నించి యతని మేడపైకి దిగి యందే వివిధ భోజనములచే సత్కృతుడై పాత్రను చేత గ్రహించి నివాసభూమికి బయలు దేరెను.

ఊరంతయు కోలాహల మెగిరినది. ఆ సందడి భగవంతుని చెవిని బడినది. ''ఆనందా! ఏమిటా కలకలము.''

''ప్రభూ! పిండోల భారద్వాజుని బుద్ధిమత్త (ప్రభావమున) కు వెఱగంది రాజగృహ మల్లోలకల్లోలమైన'' దని పాత్రను గూర్చిన కథ యంతయు జెప్పెను. తథాగతుడు చీదరించుకొని భిక్షుసంఘమునంతను కలిపి భారద్వాజునితో యిట్ల నియె.''నీవు చందన పాత్రమును గ్రహించుట నిజమేనా?''

''భంతే! నిజము.''

''భరద్వాజా! ఈ పని శ్రమణులకు అనుచితము; అకరణీయము. తుచ్ఛమగు కట్టెబొచ్చెకొఱకు గృహస్థులముందట దొమ్మరిపని జేసితివా? నీ ఉత్తర [1] మనుష్యధర్మ మును, [2] బుద్ధిప్రాతిహార్యమును చూపించితివా?

భిక్షువులారా! గృహస్థులయెదుట దివ్యశక్తి ప్రదర్శనమును నిషేధించుచున్నాను. ప్రదర్శించినవాడు ''దుష్కృత'' మను ఆపత్తికి (దోషమునకు) గుఱికా గలడు. ఏదీ! ఆ చందన పాత్రమును తుత్తుమురుజేసి భిక్షువులందఱు గంధము పూసికొనుడు. ఇదిగో వినుడు.

1. మానవాతీతశక్తి 2. చమత్కార దివ్యప్రదర్శనము.

కొయ్యతో జేసిన పాత్రల నిక మీరు ధరింపరాదు. బంగారు, వెండి, కంచు, గాజు, రాగిపాత్రలనైనను మీరు దాల్చరాదు. మట్టితోగాని ఇనుముతోగాని చేసిన యీ రెండువిధములగు పాత్రలను మాత్రముపయోగించుకొనుటకు అనుజ్ఞ నిచ్చుచున్నాను.

[1]శ్రమణగౌతముడు పాత్రను పగులగొట్టించి ప్రాతిహార్యమును (సిద్ధిదర్శనము) నిరోధించి తన శ్రావకు (శిష్యు) లను శాసనబద్ధులచేసినాడని తైర్థికులెటింగి యిట్లు తలపోసిరి. శ్రమణగౌతముని శిష్యులు ప్రాణములకంటె పదిలముగ నియమమును గాపాడెదరు. వారిగురువు వారికంటె మఱింత పెచ్చు. ఇక మనకత్తికి యెదురు లేదు. పదండ'' ని పురమంతటను తిరుగుచు ''శ్రమణగౌతముని శిష్యులకు మేమెన్నడును తీసిపోము. తుచ్ఛమగు కట్టెబొచ్చెకు దివ్యసిద్ధిని వెచ్చింపనొల్లమైతిమి. మహాశ్రమణుడు నియమమను పేరుబెట్టి యుక్తి పన్నినాడు. తలపడినచో నాతనితో పోటాపోటి ప్రాతిహార్యమునకు ఆయితమైయున్నాము.'' అని వీధుల వీధుల చాటజొచ్చిరి.

రాజగు బింబిసారుడామాటలను విని భగవంతునివద్దకు పోయి యిట్లనెను. ''భంతే! ప్రాతిహార్యమును నిషేధించి నియమము జేసితిరా?''

''మహారాజా! అవును.''

''తైర్థికులు మిమ్మెదిరించి ప్రాతిహార్యమొనర్ప ఉఱ్ఱూగుచున్నారు.''

''వారు తలపడినచో నేనును చేయుదును.''

''నియమమును చేసినవారు మీరేగదా.''

''ఆనియమము యితరులకే గాని నాకుగాదు.''

''అదిసరియేనా?''

''మహారాజా! ఒకమాట నడిగెదను చెప్పుము. నీకు ఉద్యానవనమున్నది గదా?''

''ఉన్నది.''

''దానిలో నెవడైన ప్రవేశించి ఫలములు దిన్నచో యేమి జేసెదవు?''

''దేవా? దండింతుము.''

''రాజా! నీవు దినినచో''

''నా వస్తువు నేను తినగల్గుదును. ఏ దండనయు లేదు.''

---

1. ధమ్మపద అ. క. 4 – 2.

''మహారాజా! మున్నూరు యోజనముల విస్తృతమగు అంగమగధ రాజ్యమున మాత్రము నీ యాజ్ఞ విహరించును. లక్షకోటి చక్రవాలము లందంతటను నాయాజ్ఞకు ఎదురు లేదు. నియమ నిబంధనలు నన్ను బంధింపలేవు. అవి యితరులకే. తప్పక ప్రాతిహార్యము జేసెదను.''

''పూజ్యుడా! ఎప్పుడు చేసెదరు?''

''నాలుగు నెలలమీదట ఆషాఢ పున్నమనాడు.''

''భంతే! ఎచ్చోట?''

''మహారాజా! శ్రావస్తిలో''

ముందటి బుద్ధులందఱుకును అదియే ప్రాతిహార్యస్థానమనియు, జనులందఱును జేరదగు తావనియు భగవంతుడు స్థలనిర్దేశము దూరమున జేసెను.

తైర్థికులిది యంతయువిని కలగుండు వడిరి. ''అయినకానిమ్ము. మనమా శ్రమణ గౌతముని కనిపెట్టి వెంట వెంటనే యుండవలెను. ఇదేమియని లోకులు అడిగినచో గౌతముడు పారిపోకుండ కాచియున్నామని చెప్పుదము.'' అని కలియ బలుకు కొనిరి.

భగవంతుడు రాజగృహమునుండి శ్రావస్తికి పోవుచున్నాడు. తైర్థికులును ఒకవిడిదికి వెనుక వెనుకగ వెంటబడి వచ్చుచున్నారు. దారిపొడుగున జనులది యేమని యడిగిన తాము ముందు అనుకొన్నట్లు చెప్పుచువచ్చిరి. ప్రజలుగూడ ప్రాతిహార్య దర్శనమునకు గుంపులు గుంపులు బయలుదేరిరి. క్రమముగ నందరును శ్రావస్తి జేరిరి. తైర్థికులు ప్రాతిహార్య మొనర్ప తమకు యోగ్యముగ నొకమండపమును శిష్యుల నుసిగొల్పి లక్షధనము వెచ్చించి నిర్మింపజేసిరి. కోసలరాజు ప్రసేనజిత్తు సుగత దేవుని యొద్దకు బోయి ''ప్రభూ! తైర్థికులు మండపమును నిర్మించినారు. తమకు నేను తయారు జేయింతును.'' అని విన్నవించెను. భగవంతు డిట్లనియె.

''రాజా! వలదు. నిర్మించువారు గలరు.''

''భంతే! యెవరు నిర్మింతురు?''

''మహారాజా! దేవరాజగు శక్రుడు''

''మహాత్మా! ప్రాతిహార్య మెచ్చట జేసెదరు?''

''మహారాజా! గండుని మామిడి చెట్టుక్రింద''

తైర్థికు లామాట దెలిసికొని తమ పరిజనసహాయమున ఒక ఆమడదూరము చుట్టు ముట్టు యెక్కడకూడా మామిడిమొలక సైతము లేకుండ పెఱికించి సర్వ నాశము జేసిరి.

రాజోద్యాన పాలకుడు గండుడనువాడు ఉద్యానమందు పొదల చాటున నుండి చక్కగ మాగిన మామిడిపండు నొకదానిని కనిపెట్టి రాజునకు సమర్పింప బోవుచు మధ్యేమార్గమున మహాపురుషుని బుద్ధుని జూచి యిట్లు వితర్కించెను. “దీనిని దిని మెచ్చి రాజు బహుశా యిచ్చిన పదిడబ్బు లివ్వగలడు. అదే నన్ను బ్రతి కించ లేదు. ఈ మహాత్మునకు అర్పించితినా చిరసుఖమును శాశ్వతహితమును పొందగలను” అని నిశ్చయించి దానిని భగవంతునకు నివేదించెను. బుద్ధుడు పాత్ర యందు దానిని గ్రహించి రసమునుపిండి త్రాగి విత్తనము గండునిచేతికిచ్చి అచ్చటనే భూమియందు బూడ్చుమనెను. వాడట్లు జేసినంత భగవంతుడాచోట చేతులుగడి గెను. నీరుపడినంతనే భూమిని పెకలించుకొని యేబదిగజముల యెత్తున మహాశాఖ లతో మామిడి చెట్టు సాక్షాత్కరించినది. ఎట్టి ఉపద్రవము కల్గకుండ రాజేంద్రుడా చెట్టుకు కాపలా బెట్టెను. ఆ చెట్టు “గండామ్రవృక్ష” మనుపేర ప్రసిద్ధమయ్యెను.

తైర్థికుల పరాభవమునకు మేర లేదు. మామిడిచెట్టు కొట్టించి ప్రజలతో చీవాట్లు దినిరి. దేవరాజగు శక్రుని ప్రేరణచే గాలియు వానయు ముట్టడించి వారి మండపమును ఛిన్నభిన్నము చేసినవి. ఎక్కడి వారక్కడ పరారియైరి. ఇట్లు తైర్థికుల మొగమునునది లేదు.

ఆకాశమున దేవరాజగు శక్రుడు నిర్మించిన రత్నమయ విహారవేదికపై భగ వంతుడు నిల్వబడియున్నాడు. చదరము యిరువది నాలుగు యోజనములు చుట్టు నుండు మహాపరిషత్తు మధ్యయందు భగవంతుడు బుద్ధుడు యమకప్రాతిహార్యము జేసెను. దానిని పాలీత్రిపిటకములు యిట్లు చెప్పుచున్నవి.

ఈ ప్రాతిహార్యమును తథాగతుడు చంక్రమణము చేయుచు నొనర్చెను. [1] తేజః కృత్స్న మను సమాధి ప్రభావమున అంగాంగముల నన్నిటను అగ్నిజ్వాలలు యెగురు చున్నవి. ఆపఃకృత్స్నమను ధ్యాన కారణమున జలధారలు కారిపోవుచున్నవి. నీలపీతలోహిత శుక్ల మాంజిష్ఠ ప్రభాస్వరములను రంగులాఱింటితో వెల్గి పోవుచు భగవంతుడు నిలుచుండును; కూర్చుండును; పరుండును; విహరించును.

---

1. తేజః ఖండమున దృష్టినిలిపి క్రమముగ సమస్త భూమండలమును తేజో మయముగ చూడగల్గెడి యోగసమాధి.

''గతకాలమున బుద్ధులు ప్రాతిహార్యమొనర్చి [1]త్రయస్త్రింశ స్వర్గలోక మునసే వర్షావాసము జేయుచు తల్లికి అభిధర్మ పిటకమును ఉపదేశించుచు వచ్చిరి'' ని భగవంతుడు ధ్యానదృష్టియందు కనుగొనెను. వర్షావాస సమయమున నమమ్మహ నీయు డాసీనుడగుటకు యోగ్యముగ దేవేంద్రుడు శక్రుడు పాండుకంబలశిల (చలువరాతియరుగు) నేర్పఱచెను. శాస్త్రయు దానిపై తన సంఘాటిని బఱచి నడుమ గూర్చొనెను.

భూలోక ప్రజలది కానలేక సంబుద్ధుడెందో పోయెనని విలపించుచు అనిరుద్ధస్థవి రుని జేరి యడిగిరి. అత డిట్లనియె. ''ఇంద్రలోకమున పాండుకంబలశిలపై వర్షావాసము గడపుచు తల్లికి అభిధర్మపిటకము నుపదేశించుచున్నాడు.''

''పూజ్యుడా! తిరిగి యెప్పుడు రాగలడు?''

''మూడు నెలలవఱకు అభిధర్మము నుపదేశించి మహాప్రవారణమునాటికి (ఆశ్విన పూర్ణిమ) రాగలడు.''

భగవంతుని దర్శించనిదే తిరిగి పోరాదని జనులందఱును (శ్రావస్తి) అందే శిబిరములు వేసికొని నిలిచిరి. ఆపరిషత్తుకంతటికిని ధర్మోపదేష్ట మహామౌద్గల్యాయ నుడు. అన్నదాత చుల్ల అనాథపిండకుడు.

అచ్చట సమ్యక్ సంబుద్ధుడు ఉజ్జ్వలమగు తన కాంతిచే దేవతల శోభను మాయించుచు కూర్చొనియుండి [2] తుషిత దేవవిమానమునుండి వచ్చిన తల్లికి మాయాదేవికి అభిధర్మపిటకము నారంభించి కుశలధర్మములను, అకుశలధర్మము లను, అవ్యాకృత ధర్మములను ఉపదేశించుచున్నాడు. భిక్షాచారమునకు వేళయగుడు తనకు మాఱుగ యోగమాయా నిర్మితుడగు బుద్ధుని అందుంచి ధర్మోపదేశము చేయనియమించి హిమవంతమున కరిగి నాగలతాకాష్ఠమున పండ్లుదోమి అనవ తప్తదహము (మానససరోవరము) న ముఖము కడిగి ఉత్తరకురుభూముల యందు భిక్షచేసి మహాశాలమాలకము (దేవలోకమున నొకభవనము) న కూర్చొని భుజించు వాడు. భోజనము జేసి తన్ను సేవించుటకై అచ్చటికి వచ్చియున్న సారిపుత్రు నకు తల్లికి దానంతవఱకు జెప్పిన ధర్మమును బోధించి పంపించువాడు. అటనుండి తన స్థానమునకు బోయి నిర్మిత బుద్ధుడు నిలిపిన చోటినుండి అందికొని ధర్మోప దేశము చేయువాడు. ఇట్లు మూడు నెలలు నిరంతరము తల్లికి అభిధర్మపిటకమును

1. భూమండల మధ్యమున సుమేరు పర్వతము గలదు. దానిపై శిఖరమున ఇంద్రుని త్రయస్త్రింశ లోకము గలదు.
2. ఇంద్రలోకమునకంటె పై నుండు లోకము.

ఉపదేశించెను. భగవంతుని వద్ద ధర్మోపదేశము పొందివచ్చి దినదినమును సారిపుత్రుడు తన భిక్షుసంఘమునకు యేనూఱుమందికిని దానిని బోధించుచుండెను. అట్లు శాస్త్ర దేవలోకమునందున్నపుడే యిచ్చట ఆ అయిదువందలమంది భిక్షువులు [1] సప్తప్రాకరణికులనిపించుకొనిరి.

భగవంతుడు అభిధర్మపిటకము నుపదేశించి ముగించుసరికి కోటానుకోట్ల ప్రాణులు ధర్మదీక్షను పొందినవి. మహామాయాదేవియు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితయైనది.

శ్రావస్తి యందలి పరిషత్తు భగవంతుడు దిగివచ్చు టెప్పుడో తెలిసికొనిరమ్మని మహామౌద్గల్యాయనుని బంపినది. ఆయనయు శాస్త్రయొద్దకుజని నమస్కరించి పృచ్ఛించెను. సుగతు డిట్లనియె.

''మౌద్గల్యాయనా! నేటికి యేడవ దివము [2] సంకాశ్యనగరద్వారమున దిగుదును. చూడగోరువారు ఉపోసధిక వ్రతపరాయణులై వచ్చునది.'' ఆ మాటను తిరిగివచ్చి మౌద్గల్యాయనుడు సభయందు చెప్పెను. శ్రావస్తినుండి సంకాశ్యనగరము ముప్పదియోజనములు.

వర్షావాసము ముగిసినది. ఆనాడు ఆశ్వినపూర్ణిమ. భగవంతుడు మనుష్య లోకమునకు పయనమైనాడు. కుడివైపు సువర్ణసోపానములనుండి దేవతలును, యెడమ వైపు రజతసోపానములనుండి మహాబ్రహ్మలును తోడనడువ తాను స్వయముగ మధ్యనుండు మణిసోపానములనుండి, సురకుమారకులు ఛత్రచామ రాదికములుబట్టి యూడిగములు సేయుచుండ అపూర్వశోభాసౌభాగ్యశ్రీతో మనుష్య లోకమునకు దిగి వచ్చెను. దేవమానవ ప్రపంచములొరొరయని తలలూపినవి. సారిపుత్రుడు తన భిక్షుసంఘముతో సంకాశ్యనగర ముఖద్వారమున నిలువబడియున్న సర్వప్రియుడగు బుద్ధదేవుని సమీపించి నమస్కరించెను. ఆ తత్ క్షణమ సారిపుత్రస్థవిరుని శిష్యులు యేనూఱుమంది భిక్షువులును అర్హతపదమును ప్రాపించిరి.

యమక ప్రాతిహార్య మొనర్చి, దేవలోకమున వర్షావాసము జేసి సంకాశ్యనగర ద్వారమున దిగుట తొలుతనుండియు బుద్ధులందఱికిని త్రోసిపుచ్చరాని పద్ధతి. భగవంతుడు బుద్ధుడుసంకాశ్యమునందు కుడికాలుమోపినచోటు ''అచలచైత్యము'' ను పేర వాసిగన్నది.

---

1. అభిధర్మపిటకమునకు ఏడుప్రకరణములు. వాటిని పఠించినవారు కావున సప్తప్రాకరిణికులైరి.
2. సంకిసావసతపురం – మోటాస్టేషన్ (E. I. R.)

## ౧౯

## జటిలసూత్రము; కొన్ని భిక్షునియమములు (వి. పు. 464)

[1] ఒకప్పుడు భగవంతుడు శ్రావస్తియందు జేతవనవిహారమున విహరించు చున్నాడు. కోసలరాజగు ప్రసేనజిత్తు అచ్చటికరుదెంచి కుశల ప్రశ్నమడిగి యొకచో కూర్చొని యిట్లనియె.

''గౌతమా! అనుత్తర సమ్యక్ సంబోధిని (సర్వోత్తమ పరమ జ్ఞానము) తెలిసికొని యున్నానని మీరు నిష్కర్షగ చెప్పగలరా?''

''మహారాజా! అనుత్తరసమ్యక్ సంబోధిని తెలిసికొనియున్నవాడనిన నన్నేయనవలెను.''

''గౌతమా! పూర్ణకాశ్యపుడు, మస్కరీగోశాలుడు, నిర్గ్రంథజ్ఞాతృపుత్రుడు, సంజయ వేలట్ఠిపుత్రుడు, ప్రకృధకాత్యాయనుడు, అజితకేశకంబలుడు నను శ్రమణబ్రాహ్మణులను గణాధిపతులను ఆచార్యులను తీర్థంకరులను నిన్నడిగినట్ల యడిగితిని. వారు అనుత్తర సమ్యక్ సంబోధి నెఱిగితిమని ధైర్యమున జెప్పలేక పోయిరి. మరి నీవో వయస్సున చిన్నవాడవు. క్రొత్తగ సంన్యసించితివి. సాహసించి పలుకుచున్నావే?''

''మహారాజా! నాలిగింటిని చిన్నవని తలంచరాదు. చిన్నవని అవమానించ రాదు. వినుము. క్షత్రియుని, పామును, అగ్నిని, భిక్షువును (సంన్యాసిని) యీ నాలిగింటిని చిన్నవని త్రోసిపుచ్చరాదు. మఱియు వినుము.

''కులీనుడు కీర్తిమంతుడు ప్రతాపియు నగు క్షత్రియుని వయస్సున చిన్న వాడని తిరస్కరించినచో ముందు ముందు ముప్పురాక తప్పదు. పామును చిన్నదని విడిచిపెట్టినచో అదియే కాలాంతరమున ప్రాణోపద్రవము చేయగలదు. అగ్నిని కొంచె మని ఉపేక్షించినచో బలము చేకూర్చుకొని అదియే ప్రళయము చేయగలదు. అగ్ని కాల్చిన చెట్టు చేమలు తిరిగి అంకురించునేమోగాని భిక్షుతేజమున దగ్ధమైన వానికి పుట్టుగతులుండ బోవు. కావున వివేకియగువాడు సదాచారులగు భిక్షువులను యేనాడును పరాభవింప రాదు.''

ప్రసేనజిత్తుడామాటలనువిని ''భంతే! ఆశ్చర్యము. అబ్బురము. నన్ను సాంజలి శరణాగత ఉపాసకునిగ స్వీకరింపు'' మని వేడుకొనెను.

---

1. సం ని. 3 - 1 - 1.

[1] పూర్ణకాశ్యపుడు మొదలగు ఆఱుగురు ఆచార్యులవద్ద చింతామణి మున్నగు కొన్ని విద్యలను నేర్చికొని వారిభక్తులైన కొందఱు జనులు అందందు దిరుగుచు మేము బుద్ధులమని జెప్పికొనుచు ఒకానొకనాడు శ్రావస్తికి వచ్చి చేరిరి. అంతటవారు రాజువద్దకు బోయి, మహారాజా! పూర్ణకాశ్యపుడు మొదలగు ఆచార్యులు ఆఱుగురును బుద్ధులు సర్వజ్ఞులుకూడ'' యని వాదించిరి. రాజు వారలను పిలిచి ''మీ గురువులను పిలిచికొని రండు పొండనెను. వారును పోయి రాజుగారి అహ్వానమును తెలియజేసిరి. భయ సంభ్రమములతో వచ్చుటకు యిష్టము లేకపోయి నను భక్తులకోరిక త్రోసిపుచ్చ లేకయు మర్యాద చెడుననియు యెట్టకేలకు రాజ సభకు చనుదెంచిరి. మహారాజు ఉన్నతాసనముల నమర్చియుంచెను. భయవిహ్వాలు లౌటబట్టి వారందుగూర్చొనలేక క్రిందనే గూర్చొనిరి. వారి దౌర్బల్యమును నరేం ద్రుడు గ్రహించెను. పిడుగుసోకినవానిని కొఱవితో పొర్లించినట్లు వారిని జూచి ''మీరు బుద్ధులవుదురా? కాదా?'' యని ప్రశ్నించెను. బుద్ధులమని కల్లలాడినచో యేమిదండన విధించునోయని వారు ''కామ'' నిరి. అంతట వారిని రాజు బయటకు పంపించెను. వారును బయటవచ్చి తమ తమ భక్తులతో నిట్లనిరి. ''పాపము! బుద్ధులవిషయము రాజుగారి కేమిదెలియును. లేనిపోని చిక్కులేలయని బుద్ధులము గాదని చెప్పితిమి. మా బుద్ధత్వము నీటితో గడిగినను పోవునది గాద'' ని ప్రగల్భములు పలికిరి.

[2] బుద్ధభగవంతుడు ఒకప్పుడు రాజగృహమున విహరించుచున్నాడు. ఆ సమయమున షడ్వర్గీయ భిక్షువులు స్నానము చేయుచు చెట్లకు శరీరములను రుద్దుచుండిరి. వీపులను తోముచుండిరి. కాళ్ళను రాచుచుండిరి. ప్రజలిది జూచి ''శాక్యపుత్రీయులగు శ్రమణులు అసభ్యముగ మెలగుదురని నిందించుచుండిరి. భగవంతు డదివిని భిక్షువులను బిలిచి యిట్లనియె.

''భిక్షువులారా! శరీరముతో చెట్లను రుద్దుటయు తోముటయు తగదు. అట్లు జేసినవారికి 'దుష్కృత' దోషము సంభవించును.

''భిక్షువులారా! భిక్షువైనవాడు చెవికిగాని, చేతికిగాని, మెడకుగాని, నడుము నకుగాని, భుజములకుగాని వ్రేళ్ళకుగాని ఆభరణములను ధరింపరాదు. రెండు నెలలు పెరిగినవి లేదా రెండంగుళముల పొడవైనవి అంతకుమించి పొడగాటి వెంట్రు కలనుంచు కొనరాదు. తప్పినచో 'దుష్కృత' మను ఆపత్తి. అద్దమునందుగాని

1. సం - ని - అ - క. 3 - 1 -1.
2. వినయపిటక. చులవగ్గ 5

జలపాత్రమునందుగాని ముఖమును జూచుకొనరాదు. రోగపీడితునకు మాత్రము చూచుకొనుటకు అనుజ్ఞ నిచ్చుచున్నాను. నృత్యగీతములకు, వింతలు వినోదములకు భిక్షువు పోరాదు. రాగములను తీసి తీసి ధర్మసూత్రములను పాడరాదు. వైదిక స్వరమువంటి స్వరము (స్వరభణ్యము) నకు అనుజ్ఞ నిచ్చుచున్నాను.''

అంతట కొన్నాళ్ళకు భగవంతుడు చారికనొనర్చుచు వైశాలి కరుదెంచెను. అచ్చట మహావన కూటాగారశాలయందు విహరించుచు భిక్షువులను జూచి యిట్లనియె.

''భిక్షువులారా! దోమతెరలను వాడుటకు అనుజ్ఞ యిచ్చుచున్నాను.''

ఆ సమయమున వైశాలియందు ఉత్తమభోజనముల భుజింపబట్టి భిక్షువులకు రోగములు మెండయ్యెను. ఏదోపనిమీద జీవకకుమారభృత్యుడు అచ్చటికి వచ్చి చూచి భగవంతునకు నమస్కరించి విహారశాలయు స్నానాగారమును భిక్షువుల కొసగవలెనని ప్రార్థించెను. అంతట భగవంతుడు భిక్షువులను జూచి యిట్లనియె.

''భిక్షువులారా! విహారశాలకును, స్నానాగారమునకును అనుమతించుచున్నాను.'' [1]అటుతర్వాత వైశాలినుండి కదలి భగవంతుడు [2]భర్గదేశమునకుబోయి అందలి సుంసుమారగిరియొక్క భేసకలావన మృగదావమున విహరించుచుండెను.



1. చుల్లవగ్గ
2. బనారస్, మిర్జాపుర, ఇలాహాబాద్ జిల్లాలయందలి గంగకు దక్షిణమున నుండు భాగము.

# శ్రీ బుద్ధ చర్య

## తీయ ఖండము

### భిక్షుసంఘమునందు కలహము – పాకలేయక గమనము

### ( వి. పూ. 463 - 462 )

[1] భగవంతుడు బుద్ధుడు కౌశాంబియందు ఘోషితారామమున విహరించుచుండెను.

ఆ సమయమున భిక్షుసంఘములో అభిప్రాయభేదము లేర్పడినవి. దానికి కారణమిట్లు జరిగినది. భిక్షు నియమము ననుసరించి బహిర్భూమికి తీసికొని పోయిన జలపాత్రను బోర్లించవలసిన పద్ధతి కలదు. ఒకానొక భిక్షువు అట్లు చేయక పాత్రను వెలకిల బెట్టినాడు. ఆ చిన్నవిషయమును పురస్కరించుకొని భిక్షువులలో విరోధములు పెరిగినవి. సౌత్రాంతిక దళము, వినయాంతిక దళమని రెండు పార్టీలేర్పడినవి. మీరు మిథ్యావాదులు, మీరు మిథ్యావాదులని కోలాహలముగ తగవులు పెంచుకొనిరి.

[2] ఇట్లు [3] కౌశాంబియందలి భిక్షువులు కల్లోలములకు ఆలవాలమగుట భగవంతుడె ఱింగి సహించలేక ఆ చోటనుండుటకు మనస్సొప్పక తన శయనాసనములను పాత్రచీవరములను గ్రహించి నిలువబడి కొన్ని గాథల నిట్లు పలికెను.

---

(1) మహావగ్గ 10. (2) మ. ని. 3 - 3 - 8. (3) కోసమ్ - అలహాబాదు

''మూఢులైకూడ పండితవేషములను ధరించి తమ యవివేకమును తెలిసికొనలేక నాకును సంఘమునకును తలవంపులు దెచ్చువారై అనీతిమార్గమున అడ్డములేక నోటికివచ్చినట్లు ప్రేలుచుండువారి హృదయములందు వైరాగ్ని యెన్నడును శాంతించదు. వైరముతో వైరము చల్లారుననుట కల్లమాట. వైరమునకు విరుగుడు ప్రేమయే. దీనినెఱింగిన పండితులు కలహ కల్లోలములనుండి ఉపశాంతులైయుందురు.

లోకమునందు నీచులు నిశాచరులు దొంగలు దుండగీండ్రు సైతము కలిసి మెలిసి జట్లుగ మెలగగల్గుదురు. విద్యాబుద్ధులు తెలివి తేటలుగల సాధునామధారుల వద్ద ఆయొద్దిక లేకపోయిన నెట్లు? తగిన సాంగత్యము లభింపకపోయినచో మహారాజువలె మత్తమాతంగమువలె యేకాకియై విహరించుట మేలుగదా!''

అని కొన్ని గాథలను పాడి భగవంతుడు బుద్ధుడు ఆచోటు వదలి బాలకలోణ కారమగు గ్రామమునకు బోయెను. అచ్చట ఆయుష్మంతుడగు భృగువునకు ధార్మికోపదే శము లొనర్చి ప్రాచీన వంశదావమునకు చేరుకొనెను. ఆ సమయమున నచ్చట నివసించియున్న అనురుద్ధుడు నందియుడు కింబిలులనువారు బుద్ధదేవుని నెదుర్కొని ఉచితసత్కారములను నెఱపిరి. భగవంతుడును వారికి వివిధ ధార్మిక ప్రసంగములను బోధించెను.

## పారిలేయక సూత్రము

★ ఒక సమయమున భగవంతుడు బుద్ధుడు కౌశాంబియందు ఘోషితారామమున విహరించుచు భిక్షువులు భిక్షుణిలు ఉపాసకులు ఉపాసికలు రాజులు మహారాజులు తైర్థికులు తైర్థిక శ్రావకులు తన్ను చుట్టిముట్టియుండ జనసంకులమగు నాచోట నుండనొల్లక దూరముగ నేకాంతమునకుబోవ నిశ్చయించెను.

ఒకనాడు పూర్వాహ్ణసమయమున పాత్రచీవరములను గొని కౌశాంబియందు భిక్షకుబోయి తెచ్చుకొని భుజించి తన ఆసనమును చుట్టుకొని భిక్షుసంఘమునకు చెప్పకుండా, యేరికిని తెలియకుండా ఒక్కడును పారిలేయకమునకు బోయెను. అచ్చట రక్షితవన ఖండముయొక్క భద్రశాలవృక్షముక్రింద విహారము చేయుచుండెను.

ఆ అరణ్యములోని మహాగజ మొకటి సంకులమైయున్న తన యేనుగుల గుంపులో మెలగుటకు చాలవేదనబడి వాటినన్నిటిని వదలి యేకాంతమునకు పఱ

★ ఉదాన 4 - 5 - 1 మహావగ్గ 10 - 1.

తెంచినది. అదియును పారిలేయకమున రక్షితవనఖండమందు భద్రశాలవృక్షము క్రింద భగవంతు డుండుచోటికి వచ్చినది. తాను ఆకులలములు గడ్డిగాదము దినుచు అపుడపుడు భగవంతునకు తొండముతో నీరుదెచ్చి యిచ్చునది. భగవంతుడు సుఖముగ అనుకూలముగ ఏకాంతమున విహరించుచుండెను. భద్రగజమున్ను తాను కోరినట్లు ఏకాంతమున సుఖముగ అనుకూలముగ విహారము జేయుచుండెను. ఒకనాడు ఈ క్రింది ఉదానము (ఆనందగీతము)ను భగవంతుడు పాడుచున్నాడు.

గీ. వనమునందు యేకాంతంబు వాంఛజేసి
తిరుగుచున్నారు బుద్ధుడు మరియు కరియు
ఔర! బుద్ధునిచిత్తంబు, హస్తినాగ
చిత్తము సమానమై యొప్పె, చిత్రముగను.

౨

## పారిలేయకమునుండి శ్రావస్తి. సంఘ సామగ్రి (వి. పూ. 461)

[1] భగవంతుడు యథాపూర్వముగ పారిలేయకమునందు విహరించుచుండెను. ఆయనతో దర్శన సల్లాపములజేయ మనస్సు పొడమి భిక్షువులు కొందఱు ఆనందుని గూర్చుకొని అచ్చోటికివచ్చిరి. వచ్చి నమస్కరించి యొకచో గూర్చొనినంత అమ్మహనీయుడు వారిని వివిధ ధర్మకథా సల్లాపముల నాహ్లాదితుల జేసెను. వారిలో నొకభిక్షువునకు చిత్తముననొక వితర్కము కలిగినది. ''దేనినిచూచి నంతట, తెలిసికొనినంతట ఆస్రవదోషములు తొలగిపోగలవు?'' అని విచారించుచుండెను. అతని చిత్తములోని వితర్కమును తన చిత్తమున బొడగాంచి భిక్షువులను సంబోధించి భగవంతు డిట్లనియె. ''భిక్షువులారా! ధర్మమునంతయును తెలిపితిని. నాల్గు స్మృతి ప్రస్థానములను, నాలుగు సమ్యక్ ప్రధానములను, నాలుగు ఋద్ధిపాదములను, అయిదు యింద్రియములను, షడ్బలములను, సప్తబోధ్యంగములను, ఆర్యాష్టాంగిక మార్గమును ఉపదేశించితిని. ఇంత జెప్పినను యింకను ''దేనిని చూచిన – తెలిసికొనిన ఆస్రవములు తొలగిపోగలవ''ని యీ భిక్షువు యోచించుచున్నాడు. ఆర్యధర్మములందు పండితుడు కానివాడు – నిష్ణుడు కానివాడునగు [2] పృథగ్జనుడు రూపమునే ఆత్మయని యెఱుంగుచున్నాడు. వాని యెఱుక కృత్రిమమగు

1. సం. ని. 21 – 8 – 9.
2. స్రోతాపన్నుడు, సకృదాగామి, అనాగామి, అర్హతుడు, ఈ నాల్గుఫలములకు చెందిన వాడు అర్యుడు. చెందనివాడు పృథగ్జనుడు.

సంస్కారము. ఆ సంస్కారమెట్లు కలుగుచున్నది? అవిద్యాసంయోగముచే వేదనా యుతుడగు పృథగ్జనునకు తృష్ణకలుగుచున్నది. దానిచే సంస్కారము జనించు చున్నది. ఆ సంస్కారము అనిత్యమును ప్రతీత్యసముత్పన్నమునై ( కారణమునుండి పుట్టినదియునై) యున్నది. తృష్ణయు నట్టిదే. వేదనయు నట్టిదే. సంయోగమును (స్పర్శము) అట్టిదే. అవిద్యయు నట్టిదే. ఇట్లెఱింగినవాడు రూపమును ఆత్మయని తలంచడు. కాని రూపవంతుని ఆత్మగ భావించును. ఆభావనయు (సమనుపశ్యన) సంస్కార (కృత్రిమ) మైనదే. ఆ సంస్కారమునకు హేతువేద్ది? ఎట్లు కలుగుచు న్నది? అవిద్యాస్పర్శముచే కలిగిన వేదనతో కూడుకొన్నవానికి తృష్ణ ఉదయించు చున్నది. దానినుండి సంస్కారము కలిగినది. సంస్కారము తృష్ణవేదన స్పర్శ అవిద్య యనునవన్నియు అనిత్యములు; ప్రతీత్యసముత్పన్నములు. ఇట్లు ముందు చెప్పిన ట్లెఱింగి చూచినకూడ ఆస్రవములు క్షయమగుచున్నవి. అట్టివాడు రూప మునుగాని రూపవంతునిగాని ఆత్మగ చూడడు. అయినను రూపమునందు ఆత్మను చూచును. ఆ తెలివియు సంస్కారమే. ఇట్లు క్రమముగ వేదనను ఆత్మయనియు వేదనావంతుని ఆత్మయనియు ఆత్మయందు వేదనలను వేదనలయం దాత్మను, సంస్కారములను ఆత్మయనియు సంస్కారవంతుని ఆత్మయనియు ఆత్మయందు సంస్కారములను సంస్కారములం దాత్మను విజ్ఞానము ఆత్మయనియు విజ్ఞానవంతుని ఆత్మయనియు ఆత్మయందు విజ్ఞానమును విజ్ఞానమందాత్మను యెఱింగి ఆ యెఱుగుట కృత్రిమమని గ్రహించును.

మఱియు ఆత్మవిషయమున శాశ్వతవాదియగును. ఉచ్ఛేదవాదియగును. సంశయవాదియగును. ఇవన్నియు సంస్కారములే. ఆ సంస్కారములకు కారణము తృష్ణ. దానికి కారణము వేదన. అందుకు కారణము స్పర్శ. అటుపై అవిద్య మూలము. ఇదంతయు తెలిసి కనుగొనినంత ఆస్రవములు క్షయించును.

★పారిలేయకమునందు యిష్టానుసారము విహరించి భగవంతుడు పాదచర్య యొనర్చుకొనుచు శ్రావస్తినిచేరబోయి అనాథపిండకుని జేతవనమున విహరించుచుం డెను. ఇది యిట్లుండ అచ్చట కౌశాంబియందు ఉపాసకులు (గృహస్థభక్తులు) గుమిగూడి యిట్లు తలంచిరి. ''ఈ కౌశాంబిలోని భిక్షువులు తుంటరులు. వీరి పోరు పడలేక భగవంతుడు పారిపోయినాడు. మనము వీరిని మర్యాద జేయరాదు. చివరకు భిక్షకూడ పెట్టరాదు. అవమానితులై గృహస్థులైన నయ్యెదరు. లేదా తెలివి

★ మహావగ్గ 10

దెచ్చుకొని భగవంతుని కడకు అరిగి క్షమాపణనైన వేడుకొందురు.'' ఇట్లు తలంచి తీర్మానించినంత కౌశాంబీ భిక్షువులు కలవరపడి తమ పాత్రచీవరములను దీసికొని ఆసనముల ముడిచిమట్టుకొని శ్రావస్తికి బయలు దేరిరి. వారు వచ్చుచుండుట విని సారిపుత్రుడు భగవంతునివద్దకు వెళ్ళి ''దేవా! జగడాలమారులగు కౌశాంబీ భిక్షువులు వచ్చుచున్నారు. మేము వారితో కలిసి మెలగుట యె''ట్లనెను.

''సారిపుత్రా! ధర్మమును గుర్తెటిగి ధర్మవాదులతో గలసి మెలగుము.''

''భంతే! ధర్మమును అధర్మమును నేను గుర్తించుటెట్లు?''

''సారిపుత్రా! వినుము. ఈ పదునెనిమిది విషయములను బట్టి అధర్మవాదిని గుర్తించుము. 1. అధర్మమును ధర్మ (సూత్ర) మని చెప్పువాడు, 2. ధర్మమును అధర్మమనువాడు, 3. అవినయమును వినయముగ, 4. వినయమును అవినయముగ జెప్పువాడు, 5. తథాగతుడు చెప్పని విషయమును చెప్పినట్లు, 6. చెప్పినదానిని చెప్పనట్లు పలుకువాడును, 7. తథాగతుడు నిర్దేశించిన అనాచారమును ఆచారముగ, 8. ఆచారమును అనాచారముగ, 9. అప్రజ్ఞప్త (అవిహిత) మును ప్రజ్ఞప్తముగ, 10. ప్రజ్ఞప్తమును అప్రజ్ఞప్తముగ, 11. అనాపత్తిని ఆపత్తి (దోషము)గ, 12. ఆపత్తిని అనాపత్తిగ, 13. చిన్నదోషమును పెద్దగ, 14. పెద్దదోషమును చిన్నగ, 15. సావశేష (అపూర్ణ) ఆపత్తిని అనవశేష ఆపత్తిగ, 16. అనవశేష (పూర్ణ) ఆపత్తిని సావ శేషమైనదిగ, 17. దుఃస్థౌల్యమను ఆపత్తిని అదుఃస్థౌల్యముగ, 18. అదుఃస్థౌల్య మును దుఃస్థౌల్యముగ చెప్పునట్టివాడు, అధర్మవాదిగ గ్రహింపుము. ఇటుగాక ఉన్నది ఉన్నట్టు చెప్పు యథార్థవాదిని ధర్మవాదిగ గ్రహించునది.'' అని సారిపుత్రుని ముంది డుకొని భిక్షుసంఘమునకు ఉపదేశించెను.

అంతట మహాప్రజాపతిగౌతమి వచ్చి ''ఆ కలహశీలురగు భిక్షువులతో మేమెట్లు మెలగవలె'' నని యడిగెను.

''గౌతమీ! నీవు యిరువైపుల మాటలను వినుచు ధర్మవాదులగు భిక్షువుల యెడ ప్రసన్నతయు, విశ్వాసమును కల్గియుండుము. అవసరమైనపట్ల ధర్మవాదులగు భిక్షువులతోడనే భిక్షుణీసంఘము వ్యవహరింపవలెను.''

అనాథ పిండక గృహపతి వచ్చియడిగిన శాస్త యిట్లనియె. ''గృహపతీ! నీవు యిరువురకు దానములిమ్ము. ఇరువైపులను ధర్మము వినుము. ధర్మవాదులగు భిక్షుల మాటలయందు – సిద్ధాంతమునందు ఆదరమును విశ్వాసమును కలిగియుం డుము.''

మృగారమాత విశాఖ వచ్చియడిగిన ఆమెకును అనాథపిండక గృహపతికి చెప్పినట్లు చెప్పెను.

కౌశాంబీ భిక్షువులు క్రమమున శ్రావస్తి జేరికొనిరి. ఆ సమాచారము విని బుద్ధదేవుడు సారిపుత్రుని పిలిచి ''ఆయుష్మంతా! వారికి ప్రత్యేకమైన ఆసనముల నిమ్ము. అట్టివి లేనిచో నిర్మించికాని, తెచ్చి కాని యిమ్ము. అంతియేగాని ముందటి వారైన వృద్ధతర భిక్షువులను తొలగించి వారి ఆసనములను వీరికి యివ్వపనిలేదు. అట్లుచేసినచో ఆపత్తి. భోజనము అందరితోడను సమానముగ పంచిపెట్టుము.'' అని చెప్పి పుత్తెంచెను.

కౌశాంబిభిక్షువులు ''తాము ఉత్‌క్షిప్తుల (తప్పుచేసినవార)మనియు భిక్షు సంఘమునకు వెలియైతి'' మనియు విచారించి పశ్చాత్తాపముతో భగవంతుని చేర బోయి తప్పునొప్పుకొని క్షమాపణ జెప్పుకొని భిక్షుసంఘమునందు కలుపునట్లు వేడుకొనిరి. భగవంతుడు సమ్మతించి ఆ ఉత్‌క్షిప్త (వెలివేయబడినవారు) భిక్షువులను ఉత్‌క్షేపక (వెలివేసినవారు) భిక్షువులకడకు బంపెను. ఉత్‌క్షేపకులలో అర్హుడగు భిక్షువొకడు భగవంతుని యొద్దకువచ్చి ''భంతే! వీరు సంఘసామగ్రి (సమ్మేళనము)ని జేసి ఈ వ్యవహారమును తీర్మానింపగోరుచున్నారు. ఎట్లు చేయవలెను?'' అని యడిగెను.

''భిక్షువులారా! ఈ భిక్షువు ఆపన్నుడు, ఉత్‌క్షిప్తుడు అపసారితుడుకూడా. ఇతనికీ తప్పును తొలగించవలసియుండి సంఘసామగ్రి చేయబడినది. ఇందు సమర్థుడగు భిక్షుడొకడు సంఘమునకు యిట్లు సూచన నివ్వవలెను.

''భద్రపురుషులారా! వినుడు. సంఘమునందు కలహకల్లోలములు కలిగించి వీడు దోషయుక్తుడై వెలిబెట్టబడినాడు. తిరిగి వినిని దోషముక్తుని చేయుటకై సంఘము కూర్చబడినది.'' అని జ్ఞప్తి. (సూచన)

''భద్రపురుషులారా! సమ్మతించినవారు మిన్నకుండుడు. సమ్మతిలేనివారు మాట్లాడవచ్చును.'' ఇట్లు మూడు మార్లు పలికి ''సంఘము మౌనముగనున్నదిగాన సమ్మతించినదిగ తలంచుచున్నాను'' అని తీర్మానించ వలయును. అని బుద్ధదేవుడు సంఘ సామగ్రి విధానమునుపదేశించెను.

# అసిబంధకుని ప్రశ్నలు (వి. పూ. 461)

[1] పదునొకొండవ వర్షావాసము భగవంతుడు నాలాబ్రాహ్మణ గ్రామమున గడిపెను.

## అసిబంధక పుత్ర సూత్రము

[2] ఒకప్పుడు బుద్ధదేవుడు కోసల దేశమునుండి గొప్ప భిక్షుసంఘముతో గూడి నాలందకు పోయెను. అచ్చట ప్రావారిక శ్రేష్ఠియొక్క మామిడివనమునందు విహరించుచుండెను. ఆసమయమున నాలందాప్రదేశము కఱవుకాటకములతోను రోగ పీడలతోను దుర్భిక్షధామమై యుండినది. అదే సమయమున బ్రహ్మాండమగు నిగంఠ (జైనసాధు) సమూహముతో నిగంఠ [3] నాటపుత్తుడు (నిర్గ్రంథ జ్ఞాతృపుత్రుడు – మహావీరుడు) కూడ ఆ నాలందా పట్టణముననే నివాసము చేయుచుండెను. ఒకానొక నాడు అసిబంధక పుత్రుడను జైనశిష్యుడు గురువగు నిగంఠనాటపుత్తుని వద్దకు వెళ్ళి నమస్కరించి యొక చోట కూర్చొనెను. అతని జూచి నాటపుత్తు డిట్లనియె.

''గ్రామణీ! శ్రమణగౌతముడు వచ్చియున్నాడు. అతనితో వాదము పెట్టుకొనుము. నీకు మంచికీర్తి లభింపగలదు. ప్రజలు నిన్ను ప్రశంసించెదరు.

''భంతే! సుప్రసిద్ధుడగు ఆతనితో యేమని వాదము జేయుదును?''

''గ్రామణీ! వినుము. గౌతమునివద్దకు పొమ్ము. ఇట్లనుము. పూజ్యపురుషా! తాము యెందఱినో ఉద్ధరించితిరి. ఎన్నికులములనో ప్రేమతో పోషించితిరి. లోకకల్యాణమూర్తులని కొనియాడుము. దానిని విని ఆతండు 'నిజమే. తథాగతు డట్టివాడే' యని పలుక గలడు. ఆపై నీవిట్లనుము. ''అయ్యా! ఇట్టి కఱవుకాటకములతో కటకట బడుచున్న ఈ ప్రదేశమునకు యింతటి భిక్షుసంఘముతో యెందుకు వచ్చితిరి? ఇదిలోకులను పీడించుటకుగాదా?'' అని ఆక్షేపింపుము. ఆ మాటవిని మ్రింగను క్రక్కను వీలు లేక శ్రమణగౌతముడు సతమతము కాగలడు.''

---

(1) అం ని. అ. క. 2 – 1 – 5. (2) సం. ని. 40 – 1 – 9.

(3) నాటపుత్త = జ్ఞాతృపుత్ర జ్ఞాతృశబ్దమునుండి నేడు ప్రచలితమైయున్న జథరియా శబ్దము కల్గినది. మహావీరుడు – జథరియా – అను వీరిరువురకును కాశ్యప గోత్రమే. జ్ఞాతృకులము లిచ్ఛవీకులమున నొకశాఖ – ప్రస్తుతము వైశాలికి చుట్టుముట్టునున్నది.

చిత్తము. పోయివత్తునని సెలవందికొని అసిబంధక పుత్రగ్రామణి భగవంతునివద్దకు వెళ్ళి నమస్కరించి యొకచోట గూర్చొని యిట్లనియె.

''పూజ్యుడా! కులోద్ధారకుడవు. లోకకల్యాణమూర్తివి''

''గ్రామణీ! తథాగతుడు అట్టివాడే.''

''అయ్యా! అటులైన ఈతిబాధలతో పీడితమైయున్న యీ ప్రదేశమునకు యింతటి భిక్షుసంఘముతో వచ్చుట లోకులను నష్టభ్రష్టము చేయుటకుగాదా?''

''గ్రామణీ! తొంబదియొక్క కల్పములనుండి చూచుచు వచ్చుచున్నాను. పట్టెడు భిక్షనుపెట్టి పాడైపోయిన వాడెవ్వడును నాకు కానరాలేదు. అంతేకాదు. వెనుకటి దినములలో – గతజన్మములందు దానములు చేయబట్టి సత్యము పలుకబట్టి శ్రామణ్య ధర్మము ననుష్ఠింపబట్టియే నేడు వీరు సంపన్నులు శ్రీమంతులు వస్తువాహన సౌభాగ్యయుతులునైనారు. 1. రాజువలన, 2. దొంగలవలన, 3. నీటివలన, 4. అగ్నివలన, 5. బూడ్చి పెట్టుటవలన, 6. పైరుపంటలను చక్కగ పాటింపకపోవుటవలన, 7. కులనాపకుడగు పుత్రునివలన, 8. సహజముగ సర్వమనిత్యమగుటవలన– యిట్లు యెనిమిది కారణములచే ఐశ్వర్యము నష్టభ్రష్టమగుచున్నది. అంతేకాని నీవు చెప్పినట్లు తథాగతుడు లోకమును నశింపజేయ రాలేదు. ఈ అభిప్రాయమును నీవు వదలక పోయినచో పరలోకమున శాశ్వతనరకమే నీకు ప్రాప్తించును.''

భగవంతుని మాటవిని అసిబంధకపుత్రుడు తన్ను గృహస్థశిష్యునిగ స్వీకరింపుమని ప్రార్థించెను.

## పిండసూత్రము

★ ఒకనాడు సుగతదేవుడు మగధదేశమునందు పంచశాలాబ్రాహ్మణ గ్రామమున విహరించుచుండెను. ఆనా డాగ్రామమున యేదోపండుగ. బుద్ధుడు మధ్యాహ్నము కాకముందె పాత్ర చీవరములను గొని గ్రామములోనికి భిక్షకు పోయెను. అచ్చటి బ్రాహ్మణగృహస్థులు మారుని ప్రేరణతో ''శ్రమణగౌతమునకు భిక్షము పెట్టరాద''ని నిశ్చయించిరి. భగవంతుడును రిక్తపాత్రముతో ఊరకనే వెనుకకు వచ్చుచుండెను. పాపియగు మారుడు భగవంతునితో నిట్లనియె.

''శ్రమణా! భిక్షాన్నము దొరకలేదా?''

---

★ సం. ని. 4 – 2 – 8.

''పాపీ! యిట్లు చేసినది నీవేగదా?''

''అయ్యా! ఈ సారిపొమ్ము. దొరకునట్లు చేసెదను.''

''ఓయీ!

ఖలుడు మారుడు తథాగతుని వెన్నంటి
రిత్త; పాపంబు నార్జించుచున్నాడు.
మాకేమి? ఆనందమను భోజనంబు,
మేటి వేల్పులరీతి మెసవుచుండెదము.''

ఆ మాట విని ''తథాగతుడు నన్ను గుర్తించె''నని మారుడు పలాయనమ య్యెను.

## ౪

## మాగందియ సంవాదము (వి. పూ. 460)

కురుదేశమునందు కల్మాషదమ్యమను నొక నిగమము (పెద్ద గ్రామము) గలదు. అందు నివసించు మాగందియుడను బ్రాహ్మణునకు అర్హత ప్రాప్తియున్నదని భావిఫలము నెఱింగి భగవంతుడా గ్రామమునకు పోయి సమీపమున నొక వనము నందు సువర్ణకాంతులను వెదజల్లుచు కూర్చొనియుండెను. మాగందియ బ్రాహ్మ ణుడు ముఖము కడుగుకొనుటకై వనములోనికి ప్రవేశించి ఆ మహాపురుషుని గాంచి విస్మయముతో నిట్లు తలంచెను.

''బంగారువన్నెలతో నితడు ప్రజ్వరిల్లుచున్నాడు. నాకూతురును సువర్ణవ ర్ణయై యున్నది. క్షత్రియ కూమారు లెందఱో వచ్చి వేడినను వారికివ్వ లేదు. స్వర్ణ భాస్వరుడగు యీ శ్రమణునకు పుత్రిక నొసంగి సంతృప్తి వహించెదను.'' అని నిశ్చయించి యింటికిబోయి భార్యతో నిట్లనియె. '' భవతీ! పుత్రికకు సమానమైన వర్ణముగల పురుషుని జూచివచ్చితిని. బిడ్డను అలంకరింపుము. అర్పించివత్తము.''

బ్రాహ్మణియు సుతను సుగంధజలముల స్నానమాడించి పుష్పాలంకారము లచే సొగసు జేసినది. బ్రాహ్మణదంపతులు కూతురను వెంటగొని భగవంతుడు కూర్చొనియుండిన వనఖండములోనికి వచ్చిరి. భిక్షాచార సమయమగుటచే తథాగ తుడు గ్రామములోనికి పోయియున్నాడు. అందుచే వారతని వనమునందు గానక అందందు వెదకుచు ఆయన కూర్చొనియుండిన తృణాసనము వద్దకు పోయిరి. బ్రాహ్మణి ఇట్లనియె.

''నాథా! యీ తృణాసన మతనిదేనా?''

''సతీ! అవును.''

''అయినచో, విప్రవరా! మనపని నెరవేఱదు.''

''ఎందుకు?''

''కామజయమును పొందిన పురుషుని ఆసనమిది. అందుచేతమే యిటు నటు చెదరియుండలేదు.''

''శుభమునకువచ్చి అశుభమును పల్కకుము.''

''పూజ్యుడా! అంతేకాదు. ఈ పాదచిహ్నములను చూడుము. ఈ ప్రాణి కామములందు తగుల్కొనడు.''

అని యిట్లు వారు మాట్లాడుకొనుచుండగనే భగవంతు డచ్చటికరుదెంచెను.

''నాథా! మీరు జూచినది యితనినేనా?''

''అవును.''

''మనరాక నిష్ఫలము. ఇట్టివారు కామభోగముల నెన్నటికిని అంటరు.''

బుద్ధదేవుడు తృణాసనమున కూర్చొనియున్నాడు. బ్రాహ్మణుడు కన్యకను యెడమచేత పట్టుకొని కుడిచేత కమండలువును గ్రహించి సమీపించి యిట్లనియె.

''ఓ శ్రమణా! నీకీకన్య నర్పింతును. సువర్ణాంగియగు నిది నీకెంతయు దగినది. భార్యగ గ్రహింపుము. చేయిపట్టుము. జలధారాసహితముగ అప్పగించె దను.''

ఈ మాట చెప్పి యిచ్చుటకు సంసిద్ధుడైయున్న బ్రాహ్మణుని జూచి బుద్ధుడు ఇతరులకు చెప్పినట్లు అన్యోక్తిగ యిట్లనెను.

''మారుని కన్యలగు తృష్ణ, అరతి, రాగములను జూచికూడ నాకు కామాసక్తి కలుగ లేదు. మలమూత్ర భాండమును దీనిని కాలితోనైనను తాకను.''

మాగందియు డిట్లనియె ''శ్రమణా! శుభలక్షణవతియగు నారీరత్నమును తిరస్కరించుచున్నావు. చెప్పుము. నీ ధర్మమేది? నీదర్శనమేది? నీవెట్టి శీల వ్రతకర్మల ననుష్ఠించుచున్నావు? పునర్జన్మము నీకు సమ్మతమా?''

''మాగందియా! ఆధ్యాత్మిక శాంతిని బొందిన నేను వాదవివాదములను విడచితిని. నేను యేదర్శనమును బలపఱచను.

''శ్రమణా! ఏదర్శనమును, యే సిద్ధాంతమును అంగీకరింపక నీవు అధ్యాత్మ శాంతి నెట్లు పొందితివి?''

''మాగందియా! నేను బొందిన ఆధ్యాత్మిక శాంతి దర్శనముచే శ్రుతిచే శీలవ్రతములచే పొందదగినది కాదు. వాటిని విడిచినకూడ లభ్యమగునది కాదు.''

''శ్రమణా! నీ పలుకులు విలక్షణములుగ నున్నవి. అయినను ఉన్మత్త ప్రలాప ములు కాదు గదా?''

''మాగందియా! మనుష్యులకు ధర్మమునందు రుచిలేదు. అందుచేవారు వాస్తవశాంతికి దూరులైనారు. సంసారభోగములందు లేదా దార్శనిక వివాదము లందు తగుల్కొనిన వారికి ధర్మము యొక్క యథార్థరూపము గోచరించుట కష్టము. సమవిశేష హీనభావములందు తగుల్కొనినవాడు వాద వివాదములకు దూరుడు కాలేడు. ఎవనికా వ్యత్యాసములు లేవో – యెవడు సమ్యక్ జ్ఞానమును పొందినాడో బ్రాహ్మణా! వాడెవ్వనితో వాదము చేయును? తృష్ణారహితుడు, వీతరాగుడునగు పురుషుడు యీ ప్రపంచమున సర్వోత్తముడు. నీటియందును బురదయందును పుట్టిన కమలపుష్పము ఆ రెంటికి అతీతమై యంటనట్లు అట్టి మహాపురుషుడు లోకమునందు నిర్లిప్తుడై విహరించును.''

అని యిట్లు బోధించి బుద్ధభగవంతుడు ఆసనమునుండి లేచి యథేచ్ఛగ బోయెను.



## మహాస్మృతి ప్రస్థాన సూత్రము (వి. పూ. 460)

★ అదియొక సమయము, భగవంతుడు కురుదేశమున కల్మాషదమ్యమను గ్రామమున విహరించుచుండెను. ఒకనాడు భిక్షుసంఘము నుద్దేశించి–

''ఓ భిక్షువులారా!'' అని సంబోధించెను.

''భదంతా!'' అని వారు మాఱుపలికిరి.

''భిక్షువులారా! వినుడు. నాలుగు విధములని చెప్పబడుస్మృతి ప్రస్థానము ప్రాణులకు శోకకష్టములను బోద్రోచుటకు, దుఃఖదౌర్మనస్యములను నిర్మూలించు

★ దీ. ని. 2 – 22

కురుదేశ వాసులగు భిక్షు భిక్షుణీ ఉపాసక ఉపాసికలు, ఆ వాతావరణము యొక్క అను కూల్యముతో స్వస్థశరీరులు స్వస్థచిత్తులునై యుందురు. ప్రజ్ఞాబలము కూడ వారికి గంభీరముగ నుండును. దానివలన భగవంతుడు గంభీరార్థయుక్తమగు మహాస్మృతి ప్రస్థానసూత్రము నుపదేశించుచున్నాడు. ఈ దేశమునందలి నాలుగు (భిక్షు ,బిక్షుణీ ఉపాసక ఉపాసికలు) పరి షత్తులును సహజముగనే స్మృతి ప్రస్థానమును భావించుచు విహరించుచుందురు. పని పాటలుజేయు దాసదాసీజనములును, నీటిరేవులవద్ద రాట్నములు వడకుచోట ఆడువారునుగూడ ఈ స్మృతి ప్రస్థాన సంబంధమగు కథలను విచారములనే జరుపుచుందురు.

టకు న్యాయసత్యమును ప్రాపించుట కొఱకు నిర్వాణపదమును సాక్షాత్కరింప జేయుట కొఱకు యేకాయన (యేకమాత్ర) మార్గమై యున్నది. ఈ ధర్మమునందు భిక్షువు [1] కాయమునందు కాయానుపశ్యకుడయి, ఉద్యోగశీలములతో కూడిన అనుభవజ్ఞానస్మృతి కలిగినవాడై ప్రపంచమునందును శరీరమునందును లోభ దుఃఖములను దాటి విహరించగలడు. సుఖాదివేదనలయందు [2] వేదనానుపశ్యకు డయి, చిత్తమునందు చిత్తానుపశ్యకుడయి. ధర్మములందు ధర్మానుపశ్యడకుయి ఉద్యోగశీలములతో కూడిన అనుభవజ్ఞానస్మృతి కల్గినవాడై ప్రపంచమునందును శరీరమునందును లోభదుఃఖములను దాటి విహరింపగలడు.

భిక్షువులారా! [3]కాయమునందు కాయానుపశ్యకుడగు భిక్షుడెవ్వడో వినుడు. అరణ్యమునందు వృక్షమూలమున శూన్యాగారములో దృఢాసనమున గూర్చుండి శరీరమును చక్కగ నిలిపి స్మృతిని స్థిరముగ యెదుట బెట్టుకొనును. ఎఱుకతో గూడియె ఊపిరిని వదలును. యెఱుకతో గూడియె ఊపిరిని తీసికొనును. శ్వాసను పొడవుగ విడిచినప్పుడు పొడవుగ విడిచితిననియు, ద్వీర్ఘముగ తీసికొనినపుడు ద్వీర్ఘముగ తీసికొంటిననియు, కొద్దిగ విడిచినపుడు కొద్దిగ విడిచితిననియు, కొంచె ముగ బీల్చినపుడు కొంచెముగ బీల్చితిననియు, స్మరించుచున్నాడు. శరీర (కాయ) భాగమంతయును ప్రజ్ఞతో ననుభవించుచు శ్వాసను కొనుచున్నాడు. శ్వాసను విడుచుచున్నాడు. కాయిక సంస్కారములను శాంతింపజేయుచు శ్వాసను విడుచు చున్నాడు. కాయిక సంస్కారములను శాంతింపజేయుచు శ్వాసను తీసికొను చున్నాడు. ఇట్లు కాయముయొక్క లోభాగమునందు కాయానుపశ్యకుడై విహ రించును. కాయముయొక్క వెలిభాగమునందు కాయానుపశ్యకుడై విహరించును. కాయముయొక్క లోవెలి భాగముల రెంటను కాయానుపశ్యకుడై విహరిం చును. కాయమునందు సముదయధర్మము (ఉత్పత్తి ధర్మమును) జూచి విహరించుచు న్నాడు. కాయమునందు వ్యయ ధర్మమును దర్శించి విహరించుచున్నాడు. కాయ మునందు ఉత్పత్తి వ్యయ ధర్మముల రెంటిని చూచి విహరించు చున్నాడు. 'కాయము న్నది' యను స్మృతి జ్ఞానస్మృతులయొక్క ప్రమాణముకొఱకు నిలచి యున్నది.

---

1. శరీరముయొక్క వాస్తవస్థితిని కేశనఖమలమూత్రాది రూపమునందు చూచువాడు కాయమునందు కాయానుపశ్యకు డనబడును.
2. సుఖము దుఃఖము అసుఖము అదుఃఖమునను అవస్థారూపములైన చిత్తము యొక్క వేదనల మూడింటిని చూచువాడు వేదనలయందు వేదనానుపశ్యకుడు.
3. ప్రాణాయామ (అనాపాన) రూపము.

మఱియు తృష్ణ మొదలగువాటియందు అంటుకొనక విహరించు చున్నాడు. లోకము నందు దేనిని కూడ నేను, నాది యని గ్రహింపడు. ఇట్లు కాయమునందు కాయబుద్ధి నుంచుకొని భిక్షువు విహరింపగలడు.

[1]మఱియు భిక్షువులారా! నడుచుచు నడుచుచున్నానని, కూర్చొనుచు కూర్చొనుచున్నానని పరుండుచు పరుండుచున్నానని కాయమే యే యవస్థలయం దున్న ఆ యా వాటిని గమనించుచున్నాడు. కాయముయొక్క లోభాగమునందును, వెలిభాగమునందును, లోవెలి భాగములందును కాయానుపశ్యకుడై విహరించుచు న్నాడు. కాయమునందు సముదయ (ఉత్పత్తి) ధర్మమును, వ్యయ (నాశన) ధర్మ మును సముదయ వ్యయ ధర్మములను చూచి విహరించుచున్నాడు.

[2]బిక్షువు గమనాగమనములను ఆలోకన విలోకనములను ఆకుంచన ప్రసార ణములను గుర్తెఱిగి అనుభవించుచు చేయుచున్నాడు. పాత్రచీవరములను ధరించు నప్పుడు తెలిసికొని చేయుచున్నాడు. ఆసనాచ్ఛాదనములందు పానభోజనము లందు ఆలోకన విలోకనములందు మలమూత్రవిసర్జనములందు గమనించి గుర్తించి వ్యవహ రించుచున్నాడు. కాయముయొక్క లోపలిభాగమునందు కాయానుపశ్యకుడై విహ రించుచున్నాడు.

[3]కాలివ్రేలు మొదలుకొని తలవెంట్రుకల వఱకు కాయమును నానామల సంపూర్ణముగ దర్శించుచున్నాడు. ధాన్యములతో నింపివెట్టిన బస్తాలను కన్నులుగల వాడు విప్పిచూచి యివి బియ్యము, యివి నువ్వులు, యివి పెసలు, యివిమినుము లని సరాసరి గమనించినట్లు ఈ కాయమును మలమూత్రములతో చీమునెత్తురులతో యెముకలు వెంద్రుకలతో చర్మమాంసములతో క్రొవ్వు మెదడులతో కఫపిత్తములతో చీమిడి పిసరులతో నిండియున్న దానిగ గుర్తించుచున్నాడు. ఇట్లు భిక్షువు కాయము యొక్క లోభాగమునందు కాయానుపశ్యకుడై విహరించుచున్నాడు.

[4]ఈ కాయమును పృథివీధాతువు జలధాతువు అగ్నిధాతువు వాయుధాతువు లచే కూర్పబడినదిగ - రచింపబడినదిగ దీని ఉనికిని ఉన్నదున్నట్లు విభజించి యెఱింగి కాయముయొక్క లోభాగమునందు కాయానుపశ్యకుడై విహరించుచు న్నాడు.

---

(1) ఈర్యాపథము. (2) సంప్రజన్యము. (3) ప్రతికూల మనసికారము.
(4) ధాతుమనసికారము.

శ్మశానమునకు యీడ్వబడి కాకులచే పొడవబడుచు గ్రద్దలచే చీల్చబడుచు కుక్కలచే తినబడుచు క్రిమికీటకములచే తొలువబడుచునున్న పీనుగును చూచి ఆ దురవస్థ తన దేహమునకుకూడ ఒకానొకనాడు తప్పనిసరి వచ్చునదిగ తలపోయుచు కాయమునందు కాయానుపశ్యకుడై విహరించుచున్నాడు.

భిక్షువులారా! వేదనలయందు వేదనానుపశ్యకుడయి భిక్షువెట్లు విహరించు చున్నాడో వినుండు. సుఖవేదన ననుభవించుచు 'సుఖవేదన ననుభవించుచున్నా' ననియు దుఃఖవేదన ననుభవించుచు 'దుఃఖవేదన ననుభవించుచున్నా' ననియు, అదుఃఖ అసుఖవేదన ననుభవించుచు 'అదుఃఖ అసుఖ వేదన ననుభవించుచున్నా' ననియు తెలిసికొనుచున్నాడు. సామిష (భోగపదార్థసహిత) సుఖవేదన ననుభవించుచు, నిరామిష సుఖవేదన ననుభవించుచు, సామిష దుఃఖ వేదన ననుభవించుచు, నిరామిష దుఃఖవేదన ననుభవించుచు, సామిష అదుఃఖ అసుఖ వేదన ననుభవించుచు, నిరామిష అదుఃఖ అసుఖ వేదన ననుభవించుచు అప్పటికప్పుడు వాటి వాటి ననుభవించుచున్నట్లు తెలిసికొను చున్నాడు.

భిక్షువు చిత్తమునందు చిత్తానుపశ్యకుడై విహరించుచున్నాడు. సరాగచిత్తమును 'ఇది సరాగచిత్తమ' ని విరాగచిత్తమును 'ఇది విరాగచిత్తమ' ని సద్వేషచిత్తమును 'ఇది సద్వేషచిత్తమ' ని, వీత ద్వేషచిత్తమును 'ఇది వీత ద్వేషచిత్తమ' ని తెలిసికొనుచున్నాడు. అట్లే సమోహచిత్తమును, వీతమోహచిత్తమును, సంక్షిప్తచిత్తమును, విక్షిప్త చిత్తమును, మహద్గత చిత్తమును, అమహద్గత చిత్తమును, సోత్తర చిత్తమును, అనుత్తరచిత్తమును, సమాహితచిత్తమును, అసమాహితచిత్తమును, విముక్తచిత్తమును, అవిముక్తచిత్తమును అప్పుటికప్పుడు ఆయావాటిని ఉన్నదున్నట్లు తెలిసికొని విహరించు చున్నాడు.

భిక్షువు ధర్మములందు ధర్మానుపశ్యకుడై విహరించుచున్నాడు. కామచ్ఛందము (కాముకత), వ్యాపాదము (ద్రోహము), స్త్యాన మృద్ధము (సోమరితనము), ఔద్ధత్యకౌకృత్యము (ఉద్వేగ – భేదములు), విచికిత్స (సంశయము), యనెడి నీవరణ ధర్మము లయిదింటియందును ధర్మానుపశ్యకుడై యున్నాడు. లోన కలిగిన కామచ్ఛంద మును 'నాలో కామచ్ఛందము కలిగియున్న' దని తెలిసికొనుచున్నాడు. లేనియపుడు లేదని తెలిసికొనుచున్నాడు. దాని ఉత్పత్తి వినాశములను తెలిసికొనుచున్నాడు. నశించినది తిరిగి పొడమకుండుటను కూడ తెలిసికొనుచున్నాడు.

లోపలి ధర్మములందు ధర్మానుపశ్యకుడై విహరించుచున్నాడు. బైటిధర్మము లందు ధర్మానుపశ్యకుడై విహరించుచున్నాడు. ధర్మములందు సముదయధర్మమును వ్యయధర్మమును, సముదయ వ్యయధర్మమును యెఱుగుచున్నాడు. 'ధర్మమున్నది' యను స్మృతి వానికి స్మృతిజ్ఞానముల ప్రమాణము కొఱకు మాత్రము సరాసరి నిలిచి యున్నది. తృష్ణాదులందు అంటుకొనక లోకమునందు దేనినికూడ 'నేను - నాది' యని గ్రహింపడు. ఇట్లు భిక్షువు ధర్మములందు ధర్మానుపశ్యకుడై విహరిం చుచున్నాడు.

రూప, వేదనా, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానములనెడు అయిదు ఉపాదాన స్కంధ ధర్మములందు ధర్మానుపశ్యియై విహరించుచున్నాడు. ఇది రూపమని, ఇది దాని ఉత్పత్తియని, ఇది దాని వినాశమని తెలిసికొనుచున్నాడు. ఇది సంజ్ఞయని, ఇది దాని ఉత్పత్తి యని, ఇది దాని వినాశమని యెఱుంగుచున్నాడు. సంస్కారమును, విజ్ఞానమునుకూడ అట్లే తెలియుచున్నాడు. ఇట్లు అంతరంగధర్మములందును, బహి రంగధర్మములందును, అంతర్బాహ్యధర్మములందును ధర్మానుపశ్యియై మెలగుచు న్నాడు. ధర్మములందు (వస్తువులందు) ఉత్పత్తిధర్మమును, వినాశధర్మమును, ఉత్పత్తివినాశధర్మమును, అనుభవమునకు దెచ్చికొని విహరించుచున్నాడు.

చక్షుః శ్రోత్ర ఘ్రాణ జిహ్వా చర్మ మనస్సులనెడి ఆరు అంతర్బాహ్య ఆయతన ధర్మములందు ధర్మమును అనుభవించుచు విహరించుచున్నాడు. చక్షువును, రూప మును, ఆ రెండింటిచే కలుగు ★ సంయోజనమును, ఆ సంయోజనము యొక్క ఉత్పత్తిని, నాశమును, నశించినది తిరిగి ఉదయింపకుండుటను తెలిసికొనుచు న్నాడు. అట్లే శ్రో[illegible]మును గూర్చియు, ఘ్రాణమును గూర్చియు, జిహ్వను గూర్చియు, చర్మమునుగూర్చియు తెలిసికొనుచున్నాడు. పై విధముననే మనస్సును, మనోధర్మమును (విషయము) ఆ రెండింటిచేత గలుగు సంయోజన (బంధ) మును, ఆ సంయోజనము యొక్క ఉత్పత్తిని, నాశమును, తిరిగి ఉదయిం చకుండుటను తెలిసికొని విహరించు చున్నాడు.

★ సంయోజనము అనగా బంధనము. అవి పది. 1. ప్రతిఘ = ప్రతిహింస, 2. మానము = అభిమానము, 3. దృష్టి = ధారణము; మతము, 4. విచికిత్స = సంశయము, 5. శీలవ్రతపరామర్శ, 6. భవరాగము, 7. కామచ్ఛందము, 8. ఈర్ష్య, 9. మాత్సర్యము, 10. అవిద్య.

భిక్షువులారా! ఏడు బోధ్యంగ ★ ధర్మము (పదార్థము) లందును ధర్మ (స్వభావ) ము నెఱింగి విహరించుచున్నాడు. లోపల నున్న స్మృతిసంబోధి అంగ మును "నాలోపల స్మృతిసంబోధి అంగమున్న" దని గ్రహించుచున్నాడు. లేని యప్పుడు లేదనియు, ఉదయించినపుడు ఉదయించినదనియు, మెండుకొనినపుడు మెండుకొనియున్నదనియు తెలిసికొనుచున్నాడు. ఇట్లే తక్కిన సంబోధి అంగము లనుగూడ అనుభవించుచున్నాడు. శరీరముయొక్క లోపలి వెలుపలి బోధ్యంగధర్మ ములందు ధర్మానుపశ్యియై విహరించుచు న్నాడు.

నాలుగు ఆర్యసత్యధర్మములందును ధర్మము ననుభవించి విహరించుచు న్నాడు. ఇది దుఃఖమనియు, ఇది దుఃఖకారణ (సముదయ) మనియు, నిది దుఃఖ మునకు నిరోధ (నాశ) మనియు, నిది దుఃఖనిరోధమువైపు కొనిపోవు మార్గము (దుఃఖనిరోధగామినీ ప్రతిపదము) అనియు యథాభూతముగ ఉన్నదున్నట్లు తెలిసి కొనుచున్నాడు.

దుఃఖము ఆర్యసత్యమననేమి? జన్మము దుఃఖము, జరయు దుఃఖము. వ్యాధి దుఃఖము. మరణము దుఃఖము, శోక దౌర్మనస్యములు దుఃఖము, వెయ్యేల, అయిదు ఉపాదాన స్కంధములు దుఃఖములు, జన్మమనిననేమి? ఆ యా సత్త్వ ములు (చిత్తధారలు) ఆయా ప్రాణి సముదాయములందు వెల్లడియగుట – రూపాది పంచస్కంధములయొక్క ప్రాదుర్భావము – చక్షురాది ఆయతనముల యొక్క లాభము, ఇదియే జన్మము.

జర యననేమి? ఆయా సత్త్వములు ఆయా ప్రాణి సముదాయములందు జీర్ణించుట – పండ్లుపోవుట – వెంట్రుకలు తెల్లనగుట – చర్మము ముడుతలుపడుట – ఇంద్రియములు పక్వములగుట – దీనినే జర (ముసలితనము) యని చెప్పుదురు.

మరణ మననేమి? ఆయా సత్త్వములు ఆయాప్రాణిసముదాయమునుండి జారిపోవుట – అంతర్ధానమగుట – రూపాదిస్కంధములు విడిపోవుట – ఇదే మరణము.

భిక్షువులారా! శోకమననేమి? ఆయా వ్యసనములయందు, ఆయా దుఃఖ ధర్మము లందు తగుల్కొనిన పురుషునకు లోపలకలుగు పరితాపము – సంతాపము, అదియే శోకము.

---

★ సంబోధి అంగములు, 1. స్మృతి, 2. ధర్మవిచయము, 3. వీర్యము, 4. ప్రీతి, 5. ప్రశ్రబ్ధి (శాంతి), 6. సమాధి, 7. ఉపేక్ష.

పరిదేవ మననేమి? ఆయా వ్యసనములందు – ఆయా దుఃఖధర్మమునందు తగుల్కొనిన పురుషుడు ఏడ్చుట మొత్తుకొనుట. ఇదియే పరిదేవనము.

దుఃఖ మననేమి? కాయసంబంధమైనది. అప్రియ సంయోగము. ప్రతికూల వేదనముచే కల్గునది. అదియే దుఃఖము.

దౌర్మనస్యమననేమి? మానసిక దుఃఖము. మానసిక ప్రతికూలత.

ఉపాయాసమననేమి? అటమట పడుట. ఆయాసపడుట.

భిక్షువులారా! కోరిక మొక్కవోయినను దుఃఖమే. జన్మమే స్వభావముగగల ప్రాణికోట్లు ''అయ్యో! మేము జన్మింపకున్న బాగుండెడిది. పుట్టుక కల్గరా''దని తలంతురుకాని అది నిష్ఫలము.

ముసలితనము, రోగములు, చావు, శోకపరిదేవ దుఃఖదౌర్మనస్య ఉపాయాసములే స్వభావముగాగల ప్రాణులు అవియివి తమకు రాకున్న మంచిదని తలంచును గాని ఆ కోరికవలన ప్రయోజనము శూన్యము. తద్వారా తిరిగి దుఃఖమే ఫలము.

రూపఉపాదానస్కంధము, వేదనాఉపాదానస్కంధము, సంజ్ఞాఉపాదాన స్కంధము, సంస్కార ఉపాదానస్కంధము. విజ్ఞాన ఉపాదానస్కంధము. ఇట్లు సంక్షేపముగ అయిదు ఉపాదానస్కంధములు దుఃఖములు. భిక్షువులారా! దుఃఖము ఆర్యసత్యము.

దుఃఖసముదయము ఆర్యసత్యమనిననేమి? రాకపోకలను కల్గించునది తృష్ణ. అదియే కామతృష్ణ, భవతృష్ణ, విభవతృష్ణ యననొప్పారునది. అది సుఖేచ్ఛతో గూడినదై ఆయావస్తువుల నభినందించుచు లోకమునందలి ప్రియరూప వస్తువులను జేరి అందే పాదుకొనుచున్నది. చక్షువు ప్రియరూపము. తృష్ణ అందుచేరినది. పాదుకొనినది. శ్రోత్రము ప్రియరూపము, తృష్ణ అందు చేరినది. పాదుకొనినది. ఘ్రాణ జిహ్వా చర్మ మనస్సులు ప్రియారూపములు. తృష్ణ అందుచేరినది. పాదుకొన్నది. రూప శబ్ద గంధరసస్పర్శధర్మములు ప్రియరూపములు. చక్షుర్విజ్ఞానము (చక్షువునకు రూపమునకు సంబంధ మేర్పడినపుడు కలుగు జ్ఞానము) శ్రోత్ర విజ్ఞానము, ఘ్రాణవిజ్ఞానము, జిహ్వా విజ్ఞానము, చర్మవిజ్ఞానము, మనోవిజ్ఞానమును ప్రియరూపములు. చక్షుసంస్పర్శము, శ్రోత్ర సంస్పర్శము, ఘ్రాణ సంస్పర్శము జిహ్వా సంస్పర్శము, చర్మ(కాయ) సంస్పర్శము, మనస్సంస్పర్శమును ప్రియరూ పములు.

చక్షుసంస్పర్శమున కలుగు వేదన, శ్రోత్ర సంస్పర్శమున కలుగువేదన, ఘ్రాణ సంస్పర్శమున కలుగువేదన, జిహ్వా సంస్పర్శమున కలుగువేదన, కాయ (చర్మ) సంస్పర్శమున కలుగువేదన, మన స్సంస్పర్శమున కలుగువేదనయు ప్రియరూపములు. రూపసంజ్ఞ (వేదనకు తర్వాత యిది ఫలానిదియని కలుగుజ్ఞానము) శబ్ద సంజ్ఞ, గంధసంజ్ఞ, రససంజ్ఞ, స్పర్శసంజ్ఞ, ధర్మసంజ్ఞయు ప్రియరూపములు. రూప సంచేతనము, (రూపజ్ఞానానంతరము దానినే చింతించుట) శబ్దసంచేతనము, గంధసంచేతనము, రససంచేతనము, స్పర్శసంచేతనము, ధర్మసంచేతనము, ప్రియ రూపములు. రూపతృష్ణ(చింతించిన తర్వాత గల్గుదానియందలి లోభము) శబ్దతృష్ణ, గంధతృష్ణ, రసతృష్ణ, స్పర్శతృష్ణ, ధర్మతృష్ణయు ప్రియరూపములు. రూపవితర్కము, శబ్దవితర్కము, గంధవితర్కము, రసవితర్కము, స్పర్శవితర్కము, ధర్మ వితర్కమును ప్రియరూపములే. రూపవిచారమును, శబ్దవిచారమును, గంధవిచారమును, రస విచారమును, స్పర్శవిచారమును, ధర్మవిచారమును ప్రియరూపములే. తృష్ణవీటి యందు జేరినది. పాదుకొనినది. ఇదియే దుఃఖసముదయమను ఆర్యసత్యము.

భిక్షువులారా! దుఃఖనిరోధమనెడి ఆర్యసత్యమును వినుడు. తృష్ణయొక్క సంపూర్ణ వైరాగ్యము – సమగ్రనిరోధము – ముక్తి. ఇదియే రెండవ ఆర్యసత్యము. ఈ తృష్ణను యెచ్చట నిరోధింపవలెను? ఆయాతృష్ణను ఆయా ప్రియరూపమునందే నిరోధింపవలెను. లోకమునందు చక్షువు ప్రియరూపము. అచ్చట తృష్ణను నిరోధిం చిన తృష్ణ నిరుద్ధమగును. అట్లే ప్రియరూపముల నన్నిటను నిరోధించినచో తృష్ణ నిరుద్ధమగును. ఇది దుఃఖనిరోధ ఆర్యసత్యము.

దుఃఖనిరోధగామినీ ప్రతిపదము. – దుఃఖవినాశనమువైపునకు కొనిపోవు మార్గము అనిన నేమి? ఇదియే ఆర్య అష్టాంగిక మార్గము. సమ్యక్ (శోభన) దృష్టి, సమ్యక్ సంకల్పము, సమ్యక్‌వచనము, సమ్యక్ కర్మాంతము (పని), సమ్యక్ ఆజీ వము (వృత్తి), సమ్యక్ వ్యాయామము, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి యనెడి యెనిమిది అంగములు కలమార్గము.

భిక్షువులారా! సమ్యక్ దృష్టి(శోభనదృష్టి) యననేమి? దుఃఖవిషయమును, దుఃఖసముదయవిషయమును, దుఃఖనిరోధవిషయమును, దుఃఖనిరోధగామినీ ప్రతి పదవిషయమును గూర్చియు చక్కగ నెఱిగిన జ్ఞానము. ఇదియే సమ్యక్ దృష్టి.

నిష్కర్మతాసంకల్పము, అద్రోహసంకల్పము, అహింసాసంకల్పము, సమ్యక్ సంకల్ప (శోభనసంకల్పము) మని చెప్పబడును.

కల్లలను, చాడీలను, కఠినోక్తులను, వదరుబోతుతనమును వదలియుండునది సమ్యక్ వచనము. (శోభనవాక్కు)

ప్రాణిహింస లేనిది, అదత్తాదానమును (దొంగతనము) కామమిథ్యాచారమును కానిది సమ్యక్ కర్మాంతము. (శోభనకర్మ)

అపవిత్రమగు వృత్తులను వదలి పవిత్రమగు వృత్తులతో జీవనమును గడుపుట సమ్యక్ ఆజీవము. (శోభనవృత్తి)

అకుశలధర్మము (పాపము)లను నిరోధించుటయందు, నశింపజేయుటయందు, కుశలధర్మములు (పుణ్యములు) కలిగించుకొనుటయందు, పెంపొందించుకొనుట యందు తత్పరుడైయుండి నిత్యనిరంతరము చేయు పరిశ్రమను - ఉద్యోగమును సమ్యక్ వ్యాయామ (శోభన పరిశ్రమ) మందురు.

లోభమోహములను వదలి కాయమునందు కాయానుపశ్యియై వేదనలయందు వేదనానుపశ్యియై, చిత్తమునందు చిత్తానుపశ్యియై, ధర్మములందు ధర్మానుపశ్యియై అనుభవ జ్ఞానయుక్తుడై యుండుటను సమ్యక్స్మృతి యందురు.

భిక్షువులారా! సమ్యక్ సమాధి యననేమి? అకుశలధర్మములను వీడి సవితర్క సవిచార వివేకములతో గలిగిన ప్రీతిసుఖమును అనుభవించుచు ప్రథమధ్యానమున విహరించుచున్నాడు. వితర్కమును విచారమును శాంతించినంత, నిర్వితర్క నిర్విచార సమాధిని, చిత్తఏకాగ్రతను, అంతశ్శాంతిని బొంది ప్రీతిసుఖము ననుభవించుచు ద్వితీయ ధ్యానమున విహరించుచున్నాడు. ప్రీతినుండికూడ విరక్తుడై ఉపేక్షకుడై స్మృతివంతుడును అనుభవయుక్తుడునునై తృతీయధ్యానమున విహరించుచున్నాడు. సుఖదుఃఖములను దాటి చిత్తసంతాపమును బాసి చిత్తోల్లాసమును శమింపజేసి, అదుఃఖమును అసుఖమును ఉపేక్షా స్మృతి పరిశుద్ధమునునగు చతుర్థధ్యానమును పొంది విహరించుచున్నాడు. ఇదియే సమ్యక్ సమాధి.

ఈ ఆర్యాష్టాంగిక మార్గమే దుఃఖనిరోధగామినీ ప్రతిపదము. ఇది నాల్గవ ఆర్యసత్యము. ఇట్లు లోపలిధర్మములందు ధర్మానుపశ్యియై, అంటుకొననివాడై లోకమునందే వస్తువును 'నేను - నాది' యని గ్రహింపక ఆర్యసత్యధర్మములందు నాల్గింటను ధర్మానుపశ్యియై విహరించుచున్నాడు.

ఓ భిక్షువులారా! ఈ స్మృతి ప్రస్థానముల నాలిగింటిని యెవ్వడైనను యేడేండ్లు భావన చేసినచో, అర్హత్త్వ సాక్షాత్కారముగాని, లేదా దుఃఖకారణములగు

తృష్ణాది ఉపాధులు మిగిలియున్నచో అనాగామిభావమునుగాని పొందుచున్నాడు. ఏడేండ్లు యెందులకు? ఆఱేండ్లు – ఐదేండ్లు – నాలుగేండ్లు – మూడు, రెండు, ఒక్క సంవత్సరము – ఆఱునెలలు – మూడునెలలు – ఒకనెల – అర్ధనెల – వారము దినములైననూ–

ఓ భిక్షువులారా! ఈ స్మృతి ప్రస్థాన చతుష్టయము ప్రాణులకు శోకకష్టముల నిర్మూలించుటకు దుఃఖదౌర్మనస్యముల దొలగించుటకు, న్యాయసత్యమును ప్రాపించుట కొఱకు, నిర్వాణపదమును సాక్షాత్కరింప జేయుటకొఱకు ఏకాయన మార్గమై యున్నది.''

భగవంతుడిట్లు చెప్పి ముగించెను. భిక్షువులు సంతుష్టులైరి.

## ౬

## మహానిదాన సూత్రము (వి. పూ. 460)

★శ్రీబుద్ధభగవంతుడు కురుదేశమునందు కురువులకు నిగమమగు కల్మాషదమ్మమున విహరించుచుండెను. ఆ సమయమున ఆయుష్మంతుడు ఆనందుడు వచ్చి నమస్కరించి యొకచో గూర్చొని యిట్లనియె. ''స్వామీ! ఆశ్చర్యము. ప్రతీత్యసముత్పాదమతి గంభీరము. కాని నాకు విశద విశదమైపోయినది.''

''ఆనందా! ఆరీతి పలుకకుము. ప్రతీత్యసముత్పాదము గంభీరమైనది. గంభీరమై తోచునదికూడ. ఈ ధర్మమును యెఱుంగని జనులు సంసార దుర్గతినుండి గట్టెక్కజాలరు.

ఆనందా! జరామరణములు సకారణములేనా! యని అడిగిన ఔననవలయును. ఏకారణముతో జరామరణములు కలుగుచున్నవి? అని యడిగిన ''జాతి (జన్మము) యొక్క కారణముతో జరామరణములు కలుగుచున్నవనవలెను. జాతి (జన్మము) సకారణమా? అవును. ఏ కారణముచేత జాతి కలుగుచున్నది? భవము యొక్క కారణము చేత జాతి (జన్మము) కలుగుచున్నది. భవము సకారణమా? అవును. ఏ కారణముచేత భవము కలుగుచున్నది. ఉపాదానముయొక్క కారణము చేత భవము కలుగుచున్నది. ఉపాదానము సకారణమా? అవును. ఏ కారణముతో ఉపాదానము కలుగుచున్నది? తృష్ణయొక్క కారణముచేత ఉపాదానము కలుగుచు

★ దీ. ని. 2 - 15.

న్నది. తృష్ణకు కారణమేది? వేదన, వేదనకు కారణమేది? స్పర్శనము. స్పర్శమునకు కారణమేది? నామరూపములు. నామరూపములకు కారణమేది? విజ్ఞానము. విజ్ఞానమునకు కారణము యేది? నామరూపములయొక్క కారణముతో విజ్ఞానము కలుగుచున్నది.

ఇట్లు నామరూపకారణమున విజ్ఞానము, విజ్ఞానకారణమున నామరూపములు, నామరూపకారణమువలన స్పర్శము, స్పర్శకారణమువలన వేదన, వేదన కారణమువలన తృష్ణ, తృష్ణాకారణమువలన ఉపాదానము, ఉపాదాన కారణమువలన భవము, భవకారణమువలన జాతి (జన్మము), జాతికారణమువలన జరామరణములు, జరామరణముల కారణముతో దుఃఖమును శోకమును పరిదేవనమును దౌర్మనస్యమును ఉపాయాసమును సంభవించుచున్నవి. ఇట్లు సంపూర్ణ దుఃఖస్కంధము సంప్రాప్తమగుచున్నది.

ఆనందా! మఱియు వినుము. జాతియొక్క కారణమున జరామరణములు కల్గిన వంటిమి. దేవతలకు దేవత్త్వము జాతి. గంధర్వులకు గంధర్వత్త్వము, యక్షులకు యక్షత్త్వము, భూతములకు భూతత్త్వము, మనుష్యులకు మనుష్యత్త్వము, పశువులకు పశుత్త్వము, పక్షులకు పక్షిత్త్వము, జాతియనబడును.

అట్టి జాతియే, దాని ప్రాదుర్భావమే లేకపోయినచో జరామరణములు గోచరమగునా?

దేవా! గోచరింపవు.

అందువలననే జరామరణములకు కారణము – నిదానము – సముదయము – ప్రత్యయము 'జాతి' యని చెప్పబడినది. ఆ జాతి (జన్మము) భవముయొక్క కారణముతో కల్గెనని యంటిమిగదా! ఆనందా! వినుము. కామభవము, రూపభవము, అరూపభవము ననెడి భవమే (లోకము) లేకపోయినచో – నశించినచో జాతియనునది సంభవించునా?

దేవా! లేదు.

''ఆనందా! అందువల్లనే జాతికి కారణము భవమని చెప్పితిమి. భవముయొక్క కారణముచేత జాతికల్గినది. సరియే. భవమునకు కారణము ఉపాదానముగదా? కామఉపాదానము, దృష్టి ఉపాదానము శీలవ్రత (ఆత్మవాద) ఉపాదానము ఈ మున్నగు ఉపాదానములే నితాంతము అభావమైనచో, ఆనందా! భవము యేర్పడగలదా?''

''దేవా! లేదు.''

''అందుచేతనే భవమునకు కారణము ఉపాదానమని చెప్పితిమి. ఉపాదానమునకు కారణము తృష్ణయంటిమి. రూపతృష్ణ, శబ్దతృష్ణ, గంధతృష్ణ, రసతృష్ణ, స్పర్శతృష్ణ, ధర్మతృష్ణ అనెడి తృష్ణయే బొత్తుగ లేకపోయినచో ఉపాదానమనునది పొడగట్టునా?''

''దేవా! లేదు.''

ఆ హేతువుననే ఉపాదానమునకు కారణము తృష్ణయని అంటిమి. ఆ తృష్ణకు కారణము వేదనము. చక్షు సంస్పర్శమున కలిగిన వేదనము, శ్రోత్రసంస్పర్శమున గలిగిన వేదనము, ఘ్రాణసంస్పర్శమున గలిగిన వేదనము, జిహ్వాసంస్పర్శమున గలిగిన వేదనము, కాయసంస్పర్శమున కలిగిన వేదనము, మనస్సంస్పర్శమున కలిగిన వేదనము, అనెడి వేదనములే లేకపోయినచో తృష్ణ కలుగుటకు వీలుగలదా?

స్వామీ! లేదు.

అందుచేతనే తృష్ణకు వేదనయే కారణము. వేదనచే తృష్ణ, తృష్ణచే పర్యేషణము (వెదకుట), పర్యేషణచే లాభము, లాభముచే వినిశ్చయము, వినిశ్చయముచే ఛందరాగము (ప్రయత్నవాంఛ), ఛందరాగమున అధ్యవసానము, అధ్యవసానమున పరిగ్రహము, పరిగ్రహమున మాత్సర్యము (లోభత్వము), మాత్సర్యమున ఆరక్ష (కాపుదల), దానిచే భండన దండనములు కలహకల్లోలములు అకుశలధర్మములన్నియు ఆవిర్భవించు చున్నవి.

ఆనందా! వేదనకు కారణము స్పర్శము. స్పర్శమునకు కారణము నామరూపములు. ఆ నామరూపములకు కారణము విజ్ఞానము. విజ్ఞానమే మాతృ గర్భమున ప్రవేశించి జన్మమెత్తుచున్నది. ఆ విజ్ఞానము నామరూపములతో కలిసి జాతి జరామరణ దుఃఖసముదయమై తోపట్టుచున్నది. వ్యవహారమంతయు దీనిచేతనే నడుచుచున్నది.

ఆనందా! ఆత్మవాదులగు కొందఱు ఆత్మనుగూర్చి యిట్లు చెప్పుదురు. రూపవంతుడును అణువునుగా జెప్పుదురు. రూపవంతునిగ అనంతునిగ మఱికొందఱు జెప్పుదురు. రూపరహితునిగ అణువుగ కొందఱు చెప్పుదురు. రూపరహితము ననంతము నని మఱికొందఱాడెదరు. వీరిలో కొందఱు [1] వర్తమానమున ఆత్మను అంగీకరింతురు. కొందరు [2] భావి (భవిష్యత్) ఆత్మను అంగీకరింతురు. ఆత్మనుగూర్చి చెప్పువారు యీ పద్ధతులకు జెందియుందురు.

---

1. ఉచ్ఛేదవాది, ఆత్మకు వినాశము నంగీకరించి వర్తమానమున సత్తాను స్వీకరింపగలడు.
2. శ్వాశతవాది ఆత్మను నిత్యమని అంగీకరించి భవిష్యత్తునందు కూడా దాని ఉనికిని ఒప్పుకొనును.

ఆత్మవాది కాని, తథాగతుడు ఆపై వాదములను దేనిని గ్రహింపడు. అతడు అనాత్మ వాది. ఆత్మప్రజ్ఞప్తి జోలికి పోడు.

ఆనందా! ఆత్మావాదలలో నొక్కొకడు వేదననే ఆత్మయనును. వేఱొకడు వేదనల అభావమే ఆత్మయనును. మఱియొకడు ఆత్మ, వేదన ధర్మముగలది - వేదితమని పలుకును. అందులో వేదనయే ఆత్మయనువాని నిట్లడుగుదుము. అయ్యా! సుఖము, దుఃఖము, అదుఃఖము, అసుఖమని వేదనలు నాలుగు విధములు. అందు ఏ వేదనను ఆత్మయని తలంచితివి. ఒకటియున్నపుడు తక్కినవి లేవు. సుఖవేదనను ఆత్మయందునని పలికితివా, ఆ సుఖవేదన అనిత్యము, కృతకము, ప్రతీత్యసముత్పన్నము, వ్యయధర్మము - నిరోధ ధర్మమునైనది. కడమ రెండు వేదనలును నట్టివే. వేదనయే ఆత్మయనినచో ఉత్పత్తి వ్యయధర్మములు - సుఖదుఃఖములు దానికి అంటుకొనినవగును.

వేదానానుభవము లేనియపుడు (అప్రతిసంవేదమున) నేనున్నాననునది కలదా? లేదు. లేనియపుడు వేదనల యభావమే ఆత్మయెనెడి వానివాదము చెల్లదు. ఆత్మ వేదన ధర్మముకలది, వేదితమనువాని నిట్లడగుదము. వేదనలన్నియు సర్వ సమూలముగ నిరుద్ధ మైనపుడు 'నేనున్నా'ననుట ప్రత్యేకముగ నున్నదా? లేదు. అందుచే ఆ మాటయు పొసగదు.

ఇన్నింటినిబట్టి ఆనందా! భిక్షువు దేనినిగూడ ఆత్మ యనడు. లోకమునందు దేనినికూడ నేననడు. నాదియనడు. వాడు నిర్భయుడు. నిర్వాణము వానిసొమ్ము. జన్మసముద్రమును గట్టెక్కినాడు. వాని బ్రహ్మచర్యవాసము పండినది. కృతకృత్యుడు. కరణీయమొకటి లేదు. ప్రజ్ఞను ప్రజ్ఞావిషయములను, భాషను, భాషావ్యవహారమును, ప్రపంచమును, ప్రపంచములోగల వస్తువులను యెఱింగి భిక్షువు విముక్తుడగుచున్నాడు.

ఆనందా! జీవుని (విజ్ఞానము) యొక్క స్థితులు యేడు. ఆయతనములు రెండు. ఒకానొక సత్త్వము (జీవుడు) నానాకాయములు, నానాసంజ్ఞలు గలిగి మానవునివలె, ఒకానొక దేవగణమువలె, పిశాచమువలె' నొప్పును. ఇది ప్రథమ విజ్ఞానస్థితి. 2. ఒకానొక సత్త్వము ప్రథమధ్యానముతో బుట్టిన బ్రహ్మకాయక దేవతవలె నానాకాయములు కలిగియు ఒక్కసంజ్ఞ (పేరు) కలిగియుండును. ఇది

రెండవ విజ్ఞానస్థితి. 3. ఒకకాయము నానాసంజ్ఞలు కలిగి ఆభాస్వరదేవతవలె నుండుట మూడవ విజ్ఞానస్థితి. 4. ఏక కాయము ఏకసంజ్ఞతో శుభకీర్ణదేవతవలె నొప్పునది నాల్గవ విజ్ఞానస్థితి. 5. రూపసంజ్ఞను అతిక్రమించి ప్రతిహింసాసంజ్ఞను బాసి నానాత్త్వసంజ్ఞను మనమున చేర్చకుండుటచే అనంతాకాశ స్థానమును బొందును. అది అయిదవ విజ్ఞానస్థితి. 6. ఆకాశస్థానమును దాటి విజ్ఞానానంత ఆయతనమును పొందుట ఆఱవ విజ్ఞానస్థితి. 7. విజ్ఞానాయతనమును గడిచి ఏమియు లేని అకించన్య ఆయతనమును పొందుట యేడవ విజ్ఞానస్థితి. అసంజ్ఞి సత్త్వాయతనమని, నైవసంజ్ఞా నాసంజ్ఞాయతనమని ఆయతనములు రెండు.

ఆనందా! పైన జెప్పిన సత్త్వస్థితులు ఏడును. ఆయతనములు రెండును ఉత్పత్తి నాశములు కలవిగను, పరిణామ విపాకములు కలవిగను యెఱింగి పరిత్యజించి భిక్షువు ప్రజ్ఞావిముక్తుడగుచున్నాడు.

ఆనందా! విమోక్షములు యెనిమిది. 1. రూపవంతుడగు తాను కడమరూపములను జూచుట ప్రథమ విమోక్షము. 2. లోపల రూపరహిత సంజ్ఞకలవాడై బయట రూపములనుచూచుట, రెండవవిమోక్షము. 3. 'శుభమున్నది' అనుదీనినుండి విముక్తుడగుట మూడవ విమోక్షము. 4. రూప సంజ్ఞనుదాటి, ప్రతిహింసాసంజ్ఞ నశించినంత, నానాత్త్వసంజ్ఞను లెక్కిడక ఆకాశాయతనమును పొంది విహరించుట నాల్గవ విమోక్షము. 5. దానిందాటి విజ్ఞాన ఆయతనమున విహరించుట ఐదవ విమోక్షము. 6. విజ్ఞానాయతనమునుదాటి 'ఏమియులే'దను అకించన్యాయతనమున విహరించుట ఆఱవ విమోక్షము. 7. దానినికూడ దాటి నైవసంజ్ఞానాసంజ్ఞాయతనమును పొందుట ఏడవ విమోక్షము. 8. దానినికూడ వదలి సంజ్ఞావేదనా నిరోధమును పొందియుండుట యెనిమిదవ విమోక్షము. ఇవియే యెన్మిది విమోక్షములు.

భిక్షువు ఈ యెనిమిది విమోక్షముల అనులోమ ప్రతిలోమక్రమమున పొందుచు, సమాధియందు యథేచ్ఛగ విహరించుచు ఈ జన్మమునందే ఆస్రవరహితుడై సర్వోత్తమమగు ఉభతోభాగవిముక్తి (నామరూపములనుండి విముక్తి) ని పొందుచున్నాడు.''

ఆ మాటలను విని ఆనందుండుప్పొంగి భగవంతుని అభినందించెను.

## పతిపత్నీ గుణములు - వేరంజక బ్రాహ్మణ సూత్రము (వి. పూ. 460)

[1] ఒక సమయమున భగవంతుడు మధురానగరమునకును వేరంజాపురికిని నడుమ మార్గమున పోవుచున్నాడు. ఆ దారియం దింకను యెందరో గృహిణులును గృహపతులును పయనించుచుండిరి. భగవంతుడు మార్గమునుండి వైదొలగి ఒక చెట్టుక్రింద కూర్చొనెను. బాటసారులు కొందఱు తాముగూడ ఆమహాత్మునితోడ బోయి నమస్కరించి ఒకవైపుగ కూర్చొనిరి. వారిని జూచి బుద్ధదేవుడిట్లనియె.

''ఓ గృహపతులారా! ఓ గృహిణులారా! లోకమునందు నాలుగు విధములగు సహవాసములు యేర్పడుచున్నవి. 1 భూతముతో భూతముచేయు సహవాసము 2 భూతముతో దేవతజేయు సహవాసము 3 దేవునితో భూతముచేయు సహవాసము 4 దేవునితో దేవత చేయు సహవాసము.''

1 క్రూరుడు చోరుడు దురాచారి త్రాగుబోతు కల్లరి పిసినారి సాధు బ్రాహ్మణ నిందకుడు నగు భర్తతో వానియట్టి గుణము లెగల భార్యచేయు కాపురము భూతముతో భూతముచేయు సహవాసము. 2 పైన చెప్పినట్టి దుర్గుణములుగల భర్తతో అహింసారత, సదాచారిణి, సుశీల, పుణ్యధర్మనిలయ, శ్రమణబ్రాహ్మణ పూజాపరయునగు భార్యచేయు కాపురము భూతముతో దేవతచేయు సహవాసము. 3 అహింసారతుడు, సదాచారి, సుశీలుడు, పుణ్యధర్మి, శ్రమణబ్రాహ్మణ పూజాపరుడగు భర్తతో క్రూరురాలు చోరస్వభావ దురాచారియగు భార్య చేయు కాపురము దేవునితో భూతముచేయు సహవాసము. 4 సుస్వభావులు సుశీలురునైన భార్యాభర్తల కాపురము దేవునితో దేవత చేయు సహవాసము. ఓ గృహపతులారా! ఓ గృహిణులారా! ఇద లోకములోని మాట.

## వేరంజక సూత్రము

[2] ఒకనాడు భగవంతుడు వేరంజాపురియందు పిచుమంద (వేప) వృక్షము క్రింద విహారము చేయుచుండెను. వేరంజకుడను బ్రాహ్మణు డచ్చోటికి వచ్చి కుశలప్రశ్న మడిగి యొక్కెడ గూర్చొని బుద్ధదేవునితో నిట్లనియె. ''గౌతమా!

---

1. అం. ని. 4 - 2 - 1 - 3.
2. అం. ని. 8 - 1 - 2 - 1, పారాజికా 1

వయోవృద్ధులగు బ్రాహ్మణులు వచ్చిననుకూడ శ్రమణగౌతముడు ఆదరింపడు; అభివాదనము చేయడు; ఆసనమును అర్పించ 'డని వినియున్నాను. నిజమేనా?'' అని యడిగెను.

''బ్రాహ్మణా! దేవమారబ్రహ్మసహిత విశ్వబ్రహ్మాండములో శ్రమణ బ్రాహ్మణ దేవ మనుష్యులందు నాచే ఆదరాభిమానములు పొందదగు వానిని యెవ్వనిగూడ నేను చూచుట లేదు.''

''గౌతమా! నీవు రసరూపహీనుడవు.''

''బ్రాహ్మణా! రసరూపహీనుడనిన నన్నే చెప్పవలెను. రూపరసము (ఆసక్తి), శబ్దరసము గంధరసము రసరసము స్పర్శరసమును తథాగతునియందు మొదలంట నఱికివేయబడినవి. వాటికి తిరిగి పుట్టుక లేదు. అందుచే తథాగతుడు రసరూపహీనుడు. కాని నీవు తలంచినట్లుగాదు.''

''గౌతమా! భోగరహితుడువు నీవు.''

''బ్రాహ్మణా! నిజమే చెప్పితివి. నిర్భోగుడనిన నన్నే చెప్పవలెను. శబ్దాదిభోగములు తథాగతునియందు నిశ్శేషమై పోయినవి. అదువలన నతడు నిర్భోగుడు. కాని నీవు తలంచిన పగిదిగాదు.

''గౌతమా! నీవు అక్రియావాదివి.''

''బ్రాహ్మణా! ఆపేరు నాకే చెల్లినది. శారీరక దురాచారములగు ప్రాణిహింస, చౌర్యము, వ్యభిచారమును, వాచికదురాచారములగు అబద్ధములను కొండెములను పలుకుట, పరుసములాడుట, వదరుబోతుతనమును, మానసిక దురాచారములగు లోభమును ద్రోహమును మిథ్యాదృష్టియు, మున్నగు అకుశల ధర్మములను నేను అక్రియ (చేయరానిది) లందును. అందున నే నక్రియావాదిని. కాని నీవు తలంచి నట్లు కాదు.

''గౌతమా! నీవు ఉచ్ఛేద వాదివి''

''బ్రాహ్మణా! నిక్కమే. రాగద్వేషమోహములను ఉచ్ఛేదము జేసితిగాన నేను ఉచ్ఛేదవాదిని.''

''గౌతమా! నీవు అసహ్యాపరుడవు.''

''బ్రాహ్మణా! కాయిక వాచిక మానసిక దురాచారములను అసహ్యముగ జూతునుగాన నేను అసహ్యపరుడనే.''

''గౌతమా! నీవు వైనయికుడవు (త్రోసివేయువాడు).''

''బ్రాహ్మణా! రాగద్వేష మోహములను వినయనము చేయుట (తొలగించుట)కు నేను ధర్మోపదేశమును చేయుచుందును గాన వైనయికుడనే.''

''గౌతమా! తపస్వివి నీవు.''

''బ్రాహ్మణా! అకుశలధర్మములను మఱియు అంకురింపకుండ తపింపజేసినాను కాబట్టి నేను తపస్విని.''

''గౌతమా! నీవు అపగర్భుడవు.''

''బ్రాహ్మణా! ఇకపై మున్ముందు నాకు గర్భవాసదుఃఖము లేదు కాబట్టి అపగర్భుడనే. కాని నీవు భావించినట్లుగాదు.''

''బ్రాహ్మణా! కోడి, గ్రుడ్లను పెట్టి పొదుగును. ఆ పదిపంద్రెండు గ్రుడ్లయందు ఒక గ్రుడ్డును పెగల్చుకొని ముందుగనే బయటికివచ్చు కోడిపిల్లను తక్కినవాటికంటె పెద్దదందురా? చిన్నదందురా?''

''గౌతమా! వాటియందదియే పెద్దది.''

''బ్రాహ్మణా! అట్లే అవిద్యారూపమగు గ్రుడ్లయందు చిక్కి నానావెతలకు లోనైయుండు ప్రజాజనమునందు మున్ముందుగ నేనొక్కడనే గ్రుడ్డును పెగల్చి అనుత్తర (సర్వశ్రేష్ఠ) సమ్యక్ సంబోధితో బైటికి వచ్చితిని. కాబట్టి నేను జ్యేష్ఠుడను, శ్రేష్ఠుడను. అణగిపోని ఉత్సాహము, ఆఱిపోని స్మృతి, అచలప్రశాంతమగు శరీరము, ఏకాగ్ర సమాధానమగు చిత్తముతో నొప్పాఱితిని. సవిచారము సవితర్కమునైన వివేకముచే కల్గిన ప్రీతి సుఖమును ప్రథమధ్యానమున ననుభవించుచుంటిని. వితర్కవిచారశూన్యమగు సమాధివలన కలిగిన ప్రీతిసుఖమును ద్వితీయధ్యానమున ననుభవించుచు విహరించు చుంటిని. పదంపడి ఆ ప్రీతిసుఖమును ఉపేక్షించి ఆర్యజనులు ఉపేక్షకుడు, స్మృతిమంతుడు, సుఖవిహారియని కొండాడుచుండ తృతీయధ్యానమును పొంది విహరించుచుంటిని. సుఖదుఃఖములు, సౌమనస్య దౌర్మనస్యములును అందంద ముందే తొలగియుండుటచే అదుఃఖమును అసుఖమును ఉపేక్షాయుతమును, శుద్ధస్మృతిరూప మును నగు చతుర్థధ్యానమును బొంది విహరింప దొడగి

తిని. అంతట పూర్వజన్మ స్మృతిజ్ఞానము కొఱకు చిత్తమును మ్రొగ్గించితిని. ఆ రాత్రి మొదటిజామునందు ప్రమాద రహితుడనై ఆత్మసంయమినై విహరించుచు ప్రథమ విద్యను ప్రాపించితిని. అవిద్య తొలగినది. విద్య వికసించినది. చీకటి పోయినది. వెలుగు వచ్చినది. ఇట్లు ఒకసారి గ్రుడ్డును పెగిలించితిని. మఱియు చిత్తమును మ్రొగ్గించి ఆ రాత్రి రెండవజామునందు అమానుష దివ్య చక్షువునుబొంది, సర్వప్రాణులను – వారనుభవించు జన్మమరణములను – దానికి కారణమగు కర్మప్రవాహమును సందర్శించితిని. అది ద్వితీయవిద్య – ఈ విధమున రెండవసారి అవిద్యాండమును భంగించితిని.

వెండియు ఆస్రవక్షయము కొఱకు చిత్తమును వంచి ''ఇది ఆస్రవము – ఇది ఆస్రవ సముదయము – ఇది ఆస్రవనిరోధము – ఇది ఆస్రవనిరోధగామినీ ప్రతిపద మని యెఱింగితిని. అంతట చిత్తమునుండి కామాస్రవములు, భవాస్రవములు, అవిద్యాస్రవములు, రాలి పోయినవి. జన్మబంధము ముగిసినది. బ్రహ్మచర్యఫలము పండినది. కొఱతలు లేవు. ఇట్టి జ్ఞానము ఆ రాత్రియందు చివర మూడవ జామున నుదయించినది. అవిద్యారూపమగు గ్రుడ్డును మూడవసారి పెటిలించితిని.''

భగవంతుని ఈ మాటలు విని వేరంజకుడు గౌతమా! ఆశ్చర్యము, జ్యేష్ఠుడవు. శ్రేష్ఠుడవయ్యా! నన్ను సాంజలి శరణాగత ఉపాసకునిగ స్వీకరింపుమనెను.

## ౮

## వేరంజా వర్షావాసము (వి. పూ. 460)

★ ''దేవా! ఈతూరి భగవానులవారు భిక్షుసంఘసహితముగ వేరంజయందు వర్షావాసమును అంగీకరించవలెను.'' భగవంతుడు మౌనముతో సమ్మతించినాడు. అనుజ్ఞను దీసికొని వేరంజక బ్రాహ్మణుడు ఆసనమునుండి లేచి ప్రదక్షిణముగ వెళ్ళిపోయినాడు.

వేరంజయందు, కఱవు, మహామారి పీడలతో దుర్భిక్షము యేర్పడినది. భిక్షు సంఘముతో గూడి సుగతుడు వార్షావాసము చేయుచున్నాడు. పట్టుమని పట్టెడు భిక్షము పెట్టువారు లేరు. ఉత్తరదేశమునుండి గుఱ్ఱముల వ్యాపారస్థులు అయిదు వందల గుఱ్ఱములతో వేరంజకువచ్చి అందే వర్షావాసము ముగయువఱకు నుండదలంచినారు. దినదినమును భిక్షకువచ్చు ప్రతియొక భిక్షువునకును సోలెడు సోలెడు

★ పారాజిక 1

బియ్యము వారే పెట్టుచు వచ్చిరి. భిక్షువులును వాటిని ఆరామమునకు దెచ్చుకొని దంచుకొని తినువారు. ఆయుష్మంతుడు ఆనందుడు తడిపిన బియ్యమును పిండి గొట్టి భగవంతునకు పెట్టినంత, ఆయనయు దాని భుజించుచుండెను.

తథాగతుడు తెలిసియె అడుగును. కాలమును గుర్తించియె అడుగును. అర్థ యుక్తమునె అడుగును. దేనిని అడిగినను ధర్మమును ఉపదేశించుటకు లేదా భిక్షువులకు నియమములను విధించుటకునై యడుగుచుండును.

భిక్షువులు, తెచ్చిన బియ్యమును జోటబోసి దంచుచున్నారు. ఆ దంపుడు శబ్దమును విని భగవంతుడు ఆనందుని బిలిచి, ''ఆనందా! ఆ శబ్దమేమిటి'' యని యడిగె. ఆనందుడును ఉన్నవిషయము తెలియజేసెను.

''లెస్స! లెస్స! ఆనందా! సత్పురుషులగు మీరు లోకమును గెలిచితిరి. రాబోవువారు మిమ్ము అనుసరింతురుగాక'' అని ప్రసన్నుడై భగవంతుడు పలికెను.

ఒకనాడు ఏకాంతమున ధ్యానస్థితుడైయున్న సారిపుత్రునకు చిత్తమునం దొక వితర్కము కలిగినది. ''గతకాలమునందలి బుద్ధులలో యెవ్వరెవ్వరి బ్రహ్మచర్య సంప్రదాయము స్థిరమైయుండినది? ఎవ్వరెవ్వరిది చిరస్థాయి కాకపోయినది? భగవంతుని అడుగుదు'' నని వచ్చి నమస్కరించి యిట్లనెను.

''దేవా! నాకొక వితర్కము కల్గినది. గతించిన బుద్ధులలో యెవ్వరెవ్వరి బ్రహ్మచర్యము చిరమైయుండినది. ఎవరిది కాలేదు?''

''సారిపుత్రా! [1]విపశ్యి. శిఖి. విశ్వభువులను వారి బ్రహ్మచర్యమును చిరస్థాయిగ నుండలేదు. క్రకుఛంద, కోనాగమన, కశ్యపులయొక్క బ్రహ్మచర్యము చిరస్థాయియై యుండినది.''

''భగవంతా! కారణమేమి?''

''సారిపుత్రా! విపశ్యి, శిఖి, విశ్వభువులనువారు తమ శిష్యులకు ధర్మోపదేశములను విస్తారముగ జెప్పుటకు ప్రాలుమాలిరి. వారియొక్క [2] సూత్రములు, గేయములు, వ్యాఖ్యానములు, గాథలు, ఉదానములు, ఇతివృత్తకములు, జాతకములు,

---

1. భద్రకల్పమునకు యేడుగురు బుద్ధులు. వీరు ఆఱువురు. యేడవవాడు గౌతమ బుద్ధుడు.
2. బుద్ధుని ఉపదేశములు ఇట్లు తొమ్మిది విధములు.

అద్భుతధర్మములు, వేదల్ల (సుభాషిత)ములును క్లుప్తములై యుండినవి. వారు శిక్షా పదములను - భిక్షు నియమములను విధించి యుండలేదు. [1] ప్రాతిమోక్ష ఉద్దేశ్యమును చేసియుండలేదు. అందుచేత ఆ బుద్ధులును, వారి అనుబుద్ధులును, బుద్ధ శ్రావకులును కాలముజెంది కనుమాటైనంత నానా నామముల, నానాగోత్రముల, నానా జాతుల, నానాకులములనుండి ప్రవ్రజితులైన వారిశ్రావకులు బ్రహ్మచర్యమును అంతర్ధానము చేసిరి. సారిపుత్రా! దారమునకు కూర్చక విడివిడిగ నుంచిన పూలు, గాలికి చెల్లాచెదరై పోవుట లేదా? అట్లే వారు గతించిన పిమ్మట పరంపరలోని శిష్యులు దానిని పాటింపకపోయిరి. మఱియు వినుము. క్రకుఛంద కోనాగమన కశ్యపులట్లుగాక వారిశ్రావకులకు ధర్మములను విస్తారముగ జెప్పుచువచ్చిరి. వారి సూత్రాదికములు విస్తారముగ నుండినవి. శిక్షాపదమును, ప్రాతిమోక్ష ఉద్దేశ్యమును నిర్మించియుండిరి. అందువలన వారితర్వాత యెందఱెందఱు శిష్యులు వచ్చినను ఆ బ్రహ్మచర్యము చిరకాలమువఱకు స్థిరమైయుండినది.''

చేతులు జోడించి సారిపుత్రు డిట్లనియె. ''భగవంతా! ఇదియె సమయము. బ్రహ్మచర్యము చిరస్థాయియై యుండుటకొఱకు తాము శ్రావకులకు శిక్షాపదమును, ప్రాతిమోక్ష ఉద్దేశ్యమును విధించుడు.''

''సారిపుత్రా! ఆగుము. ఆగుము. సమయము - కాలము తథాగతునకు తెలియును. ఎంతవఱకు సంఘమునందు ఆస్రవధర్మములు, చిత్తమల ధర్మములు సంభవింపవో అంతవఱకు శ్రావకులకు శిక్షాపదమును విధించుట యుండదు. ఆస్రవ ధర్మములు, చిత్తమల ధర్మములు సంఘమునందు తలజూపినచో వాటిని బోకార్చుటకు శిక్షాపదమును విధించుటయు, ప్రాతిమోక్ష ఉద్దేశ్యమును చేయుటయు వలయును. ప్రస్తుతము మనకు అవసరము లేదు. ఈ సంఘములో కడగొట్టువాడు కూడ సంబోధి పరాయణుడై స్రోతాపత్తి ఫలమును పొందియున్నాడు.''

అని సారిపుత్రున కుపదేశించి ఆనందుని పిలిచి యిట్లనియె. ''ఆనందా! మనలను వర్షావాసమునకు ఆహ్వానించిన వారితో కలసి మాట్లాడనిదే వెనుకకు పోరాదు. వార్షావాసము ముగియనున్నదిగదా. వేరంజక బ్రాహ్మణునివద్దకు పోదము పద.'' ఇట్లు చెప్పి పాత్రచీవరములను గొని ఆనందుని వెంటబెట్టుకొని భగవంతుడు వేరంజబ్రాహ్మణుని యింటికి పోయెను. బ్రాహ్మణుడును ససంభ్రమముతో లేచి ఆసనమును బఱచి నమస్కరించినంత కూర్చొని భగవంతు డిట్లనియె. ''అయ్యా!

1. పాప నిషేధక నియమము.

వర్షావాసమునకు నీవు మమ్మాహ్వానించితివి. చెప్పినకైవడి మేమును వచ్చి వర్షావాసమును ముగించి పోవుచున్నాము. జనపద చారిక (దేశాటనము)కై వెళ్ళవలసియున్నది. పోయివత్తు'' మనుడు బ్రాహ్మణు డిట్లనియె.

''గౌతమా! నిజమే ఆహ్వానించితిని. సత్కరించవలసిన ధర్మముండికూడ సత్కరించలేక పోతిని. అశక్తతతో గాదు. యిష్టము లేకనుగాదు. గృహస్థులముగదా? గ్రుక్క త్రిప్పుకొనుటకు ఊపిరి ఫిరాయించుకొనుటకు తీఱికయున్నదా? మహాత్మా! ఱేపటిదినము భిక్షుసంఘ సహితముగ నా భోజనమును గ్రహింపవలెను.''

మౌనముతో అంగీకరించి ఆసనమునుండి లేచి భగవంతుడు తన ఆరామమునకు బోయెను. రాత్రి గడచి వేకువయగుడు వేరంజ బ్రాహ్మణుడు తన యింటియందు ఉత్తమ ఖాద్యభోజ్యములను తయారు జేయించి సమయమైనదని భగవానునికి సూచన బంపించెను. భగవంతుడు భిభక్షుసంఘ సహితముగ పాత్రచీవరములనుగొని బ్రాహ్మణుని యింటికి జనుదెంచి పఱచిన ఆసనముపై గూర్చొనెను. విప్రుడును సరసబోజనములను చేతులార వడ్డించి తనివితీఱ భుజించిన పిదప భగవంతుని [1] మూడువస్త్రములచే కప్పి పూజించెను. భిక్షువులకు జంటశాలువలిచ్చి సత్కరించెను. దశబలుడును వేరంజ బ్రాహ్మణునకు ఆయాధర్మముల నుపదేశించి యథ్ఛే బోయెను.

ఇట్లు వేరంజయందు వర్షావాసమును పూర్తిజేసికొని [2] సోరేయ్యము, [3] సంకాశ్యము, [4] కాన్యకుబ్జములగుండా భగవంతుడు [5] ప్రయాగకు పోయెను. అచ్చట గంగానదిని దాటి కాశికి అరిగెను. వారాణసినుండి చారిక నొనర్చుకొనుచు వైశాలి నగరము చేరి అచ్చట కూటాగారశాలయందు విహరించుచుండెను.

వర్షావాసము ముగించి [7] ప్రవారణము చేసినపిదప లోకసంగ్రహముకొఱకై పాదచర్య యొనర్చుకొనుచు మహామండల మధ్య మండల అంతిమమండలములనెడి మూడు మండలము లందును యేయొక్క మండలమునందైనను చారిక నొనర్చుట మొదటినుండి కూడ బుద్ధుల పద్ధతి. మహామండలము తొమ్మిదినూర్ల యోజనము

(1) అంతరావాసకము (ధోవతి), ఉత్తరాసంగము (ఉత్తరీయము), సంఘాటి (దుప్పటి)

(2) ఏటాజిల్లా సోరో (3) ఫరుఖాబాదుజిల్లా సంకిసావసంతపురము.

(4) కన్నౌజ్ (5) అలహాబాదు (6) వినయట్ఠకథా - పారాజికా

(7) ఆశ్విన పూర్ణిమనాటి ఉపవాస వ్రతమునకు ప్రవారణమందురు.

లును, మధ్యమండలము ఆఱునూర్ల యోజనములును అంతిమమండలము మున్నూఱు యోజనములును కలది. మహామండలమున చారిక నొనర్పవలసియు న్నచో మహాప్రవారణము (ఆశ్వినపూర్ణిమ) నాడు ప్రవారణము ముగించుకొని పాడ్యమినాడు భిక్షుసంఘముతో గూడ బయులు దేరి గ్రామ గ్రామములందు నిగమ నిగమములందు దిరుగుచు భిక్షాన్నమును గొనుచు ధర్మోపదేశము నొనర్చుచు తొమ్మిదినెలలు చారిక నొనర్చెదరు. భిక్షువులకు సమాధి ప్రజ్ఞ అపరిపక్వమై యున్నచో ప్రవారణను కార్తికపూర్ణిమకు ముగించి మార్గశీర్షముయొక్క మొదటి దినమున భిక్షుసంఘముతో కదలి యెనిమిది నెలలు మధ్యమండలమున పాదచర్య నొనర్తురు. వర్షావాసమున భిక్షువులకు భావనాపరిపక్వ మింకను సిద్ధింపక పోయినచో మార్గశీర్షమంతయు నందేయుండి పుష్యముయొక్క మొదటిదినము భిక్షుసంఘ ముతో బయల్వెడలి యేడునెలలు అంతిమమండలమున పర్యటనము జేయుదురు.

## కాశీయందును – వైశాలియందును (వి. పూ. 459)

★ ఒక సమయమున భగవంతుడు వారాణసియందలి ఋషిపతన మృగదా వమున విహరించుచున్నాడు. అచ్చట నొకనాడు పాత్రచీవరములను గొని పురిలోనికి ప్రవేశించి గోయోగ్లక్షమున భిక్షను గొనుచుండెను. అందు ఒక శూన్య హృద యుడు, బహిర్ముఖ చిత్తుడు ప్రాకృతుడును నగు భిక్షవును జూచి వానితో నిట్లనియె. ''భిక్షూ! నిన్ను నీవు మైల జేసికోవద్దు. ఎంగిలి జేసికొనవద్దు. నీపైన ఈగలు ముసురును సుమా! అయ్యో! ఇది యోగ్యముకాదు.

భగవంతుని ఉపదేశమును విని వాడు వైరాగ్యమును పొందెను. బుద్ధుడును భిక్షాటనమును ముగించుకొని భోజనముచేసి భిక్షువులనందఱిని కూర్చి యిట్లనియె.

''ఓ భిక్షువులారా! ఈనాడు పూర్వాహ్ణసమయమున భిక్షకు పోయి యుంటిని. అక్కడ ఒక భిక్షువును జూచి యిట్లంటిని. ''భిక్షూ! నిన్ను నీవు మైలజేసి కోవద్దు. ఎంగిలి జేసికోవద్దు. నీపైన ఈగలు ముసురును సుమా! అయ్యో! ఇది యోగ్యముకాదు.''

ఆమాటలను విని భగవంతునితో సంఘములోని భిక్షువొక డిట్లనియె. ''స్వామీ! ఎంగిలియననేమి? మైలయననేమి? ఈగలు అనిన యేమి?''

★అ.ని. 3 – 3 – 6.

''భిక్షువులారా! లోభము యెంగిలి. ద్రోహము మైల. చెడ్డ తలంపులు యీగలు.''

## వైశాలిలో

★ వైశాలికి యొక్కింతదూరమున కలందకమనెడి గ్రామముండెడిది. అందు సుదిన్నకలందకపుత్రుడను శెట్టిబిడ్డ గలడు. అతడొకనాడు కొందఱు చెలికాండ్రతో గూడి ఏదియో పనిమీద వైశాలికి అరుదెంచెను. ఆసమయమున భగవంతుడు బుద్ధుడు గొప్ప సభయందు ధర్మమును ఉపదేశించుచున్నాడు. సుదిన్నుడును అందొక మూల గూర్చొని ఆ ప్రబోధమును ఆసాంతము వినెను. వినిన ప్రభావముతో అతని చిత్తమున వితర్కమి ట్లుదయించినది. ''ఈ మహానుభావుని ధర్మబోధ సర్వ పరిపూర్ణ మైనది. ఈ పరిశుద్ధ బ్రహ్మచర్యధర్మమును యింటిలోనుండి కాపురము చేయు గృహస్థుడు పాలించుటకు సాధ్యముకాదు. నేను సంన్యాసమును తీసి కొందును'' అని తలంచుచుండెను. ఉపదేశము ముగిసినది. సభికులు యెక్కడి వారక్కడ పోయినారు. ఆ పైన సుదిన్నకులపుత్రుడు భగవంతుని సమీపించి దండ ప్రణామంబు లర్పించి ప్రార్థించెను.

''ప్రభూ! తమ ఉపదేశమును విని ప్రవ్రజితుడను కాగోరినాను. నాకు ప్రవ్రజ్య నిప్పింపుడు.''

''సుదిన్నా! నితలిదండ్రులయొక్క అనుమతిని పొంది యున్నావా''

''దేవా! లేదు.''

''సుదిన్నా! తల్లిదండ్రులవద్ద ఆజ్ఞను బొందని కుమారులకు తథాగతుడు సంన ్ ము నివ్వబోడు.''

''భంతే! అట్లే జేసెదను. అనుజ్ఞ గొనివత్తును.''

అంతట సుదిన్నుడు వైశాలినుండి తన గ్రామమగు కలందకమునకు అరుగు దెంచి తల్లిదండ్రుల చేరబోయి యిట్లనియె.

''పితరులారా! బుద్ధభగవంతుని ధర్మోపదేశమును విని సంన్యసింపవలెనని తమక మొదవినది. ఆ ధర్మము గృహములందుండి నెఱవేర్పవీలుగానిది. ప్రవ్రజించు టకు నాకు మీ రనుజ్ఞ యివ్వవలెను.''

★ వినయపారాజిక 1

''కుమారా! ఇది యేమిమాట? మా ప్రాణములే నీవుగదా? అయ్యో! కడ గండ్ల నునవి కలలోగూడ నెఱుగని సుకుమారుడవు. నీవు సంన్యసించి మా బొందిలో ప్రాణములుండగనే యిల్లువదలి పోయెదవటరా?''

ఎంతెంత జెప్పినను తలిదండ్రులు వినలేదు. కుమారుడును వారి అనుజ్ఞను పొంద లేనైతినే యని ఒకటే బెంగతో నేలను గఱచుకొని 'విజయమో వీరస్వర్గమో' కానిమ్మని అన్నపానములు వదలెను. ఒక దినము గడచినది. రెండునాళ్ళు పోయినవి. మూడవ రోజును అట్లే గడచినది. వారము తిరిగ వచ్చినది. సంన్యసింప ననుజ్ఞ నిచ్చుటకు వారు ఒడంబడ లేదు. అన్నము దినుటకు యితడు ఒప్పుకొనలేదు.

సుదిన్నునకు మిత్రు డొకడు గలడు. ఈ వ్యవహారమంతయు నతడు చూచి సుదిన్నుని మెత్తబఱుపలేక ముదుసళ్ళ దగ్గఱపోయి యిట్లనియె.

''పెద్దలారా! ఇక మీ పట్టుపైన మీరు గట్టిగ నిలచినచో నిక్కముగ కుమారుని కోల్పోగలరు. సంన్యసించినగూడ అపుడపుడు చూచుటకు వీలుండగలదు. చచ్చిన మఱేమి జూచెదరు? నా మాటవిని అతనికి ప్రవ్రజించుటకు అనుజ్ఞనిండు.'' అని ప్రార్థించెను.

విధి లేదు కాబట్టి వారును సమ్మతించిరి.

తల్లిదండ్రుల యనుమతిని సంపాదించి కొన్నాళ్ళకు దేహమున బలమును చేకూర్చుకొని[1] భగవంతుని వద్దకు బోయి ''దేవా! ప్రవ్రజించుటకు నా తలిదండ్రులు అనుమతించినారు. దయయుంచి ప్రవ్రజ్యనొసగుడ'' ని మనవి జేసెను.

ఈ విధమున సుదిన్న కలందపుత్రుడు ప్రవ్రజ్య (శ్రామణేరభావము) ను ఉపసంపద (భిక్షుభావము) ను పొందగలిగెను. ఉపసంపన్నుడైన కొన్నిదినములకు వజ్జి దేశమునందలి ఒకానొక గ్రామమున విహరించుచు, అరణ్యావాసము, పిండ పాతము (భిక్ష), పాంశుకూల ధారణము (పేలికలను కూర్చి కట్టుకొనుట), సప దానచరణము (పాదచర్య – చారిక) ననెడి అవధూతగుణముల నాశ్రయించెను.

---

1. భగవంతుడు పదమూడవయేట చాలియ పర్వతముపై వర్షావాసమును గడిపెను. (అ – ని – అ – క 2 – 4 – 5)

## ౧౦

## సింహసూత్రము (వి. పూ. 458)

[1] వైశాలీనగరమున మహావనముయొక్క కూటాగారశాలయందు భగవంతుడు బుద్ధుడు విహారము చేయుచుండెను. అచ్చలయందు చావిడులయందు సంస్థాగారములందు సభాగృహములందు సామాన్యపౌరులేగాక గణక్షత్రియులగు లిచ్ఛవీనాయకులు బుద్ధుని, అతని సంఘమును, అతని ధర్మమును వేనోళ్ళ గొనియాడుచుండిరి.. జైనశిష్యుడగు సింహసేనాపతి ఆ ప్రశంసలను విని ''నిజమునకు గౌతముడు అర్హతుడు, సమ్యక్ సంబుద్ధుడై యుండనోపును. కానిచో యింతింతటివారు రిత్తగ వర్ణింపబోరు. ఆ భగవంతుని స్వయముగ నేనే వెళ్ళి దర్శించివచ్చెదను'' అని తనలో తాను చింతించెను.

అట్లు చింతించి నిశ్చయించి తనగురువగు నిగంఠనాట పుత్తుని (నిర్గ్రంథజ్ఞాతృపుత్రుని) వద్దకు వెళ్ళి సింహు డిట్లనియె.

''పూజ్యుడా! నేను శ్రమణగౌతముని దర్శనము చేసికొని వచ్చెదను.''

''సింహా! నీవు క్రియావాదివి. అతడు అక్రియావాది. అతని దర్శనముతో యేమిపని?''

గురువుమాట త్రోయలేక సింహసేనాపతి ప్రయత్నముడిగి మిన్నకుండెను. ఈ సంఘటన మూడుమార్లు గడచినది. అంతట నొకనాడు సింహుడు ఆచార్యునితో చెప్పుట పనియేమని దలంచి తిన్నగ బుద్ధుడు విహరించు ఆరామమునకు దారి తీసెను. అది మిట్టమధ్యాహ్నము. అయిదు నూరులు రథికబలముతోడ వచ్చుచుండ సింహసేనాపతి తథాగతుని దర్శనమునకై వైశాలినుండి బయల్వెడలెను. పోవదగునంతకు రథములను పోనిచ్చి అచ్చోటినుండి కాలినడకతో ఆరామములోనికి ప్రవేశించెను.

భగవంతుని దర్శించెను. అభివాదనము జేసి యొకచో గూర్చొని భగవంతునితో నిట్లనియె.

''స్వామీ! శ్రమణగౌతముడు అక్రియావాది యనియు, శిష్యులకు ఆ ధర్మమునే ఉపదేశించుననియు నేను ఆయా యెడల వినియున్నాను. ఆ మాట అసత్యము గాదుకదా! మిమ్ము తూలనాడుటకై నేను చెప్పుట లేదు. మీరే సెలవిండు.''

---

1. అం. ని. 8 - 1 - 2 - 2.

''సింహా! తగిన కారణములను తెలిసికొని చెప్పినచో 'శ్రమణగౌతముడు [1] అక్రియావాది' యను మాట తగియే ఉన్నది.''

''సింహా! చెప్పెద వినుము, కాయిక దురాచారములను, వచనదురాచారములను, మానసిక దురాచారములను మఱియు ననేక పాపములను అకుశల ధర్మములను నేను అక్రియలు (చేయరానివి) అన్ని చెప్పుదును. అందుచే నేను అక్రియా వాదిని.

సింహా! శ్రమణ గౌతముడు క్రియావాదికూడా. క్రియకొఱకు ధర్మమును ఉపదేశించుచున్నాడు. శిష్యులను ఆవైపునకే గొని పోవుచున్నాడు. కాయిక సదాచారములను, (అహింస - అస్తేయము - అవ్యభిచారము), వాక్ సదాచారములను (సత్యము - చాడీలు లేకుండుట, తియ్యనిపలుకులు, మితభాషణము), మానసిక సదాచారములను (అలోభము, అద్రోహము, సమ్యక్ దృష్టి), మఱియు వివిధ కుశల ధర్మములను క్రియలని జెప్పుదును. అందుచె నేను క్రియావాదిని.

సింహా! నేను [2] ఉచ్ఛేదవాదిని, జుగుప్సువును, వైనయికుడును, అపగర్భుడను. ఇంతియేగాదు. నేను ఆశ్వసంతుడను. పరమమగు ఆశ్వాసము (ఓదార్పు) ను పొందితిని గావునను, దానికొరకై ధర్మము నుపదేశింతును గావునను, ఆ మార్గమునకే శిష్యులను కొంపోవుదును కావునను నేను ఆశ్వసంతుడను.''

ఆ మాటలను విని అబ్బురముతో సింహాసేనాపతి యిట్లనియె.

''ప్రభూ! ఆశ్చర్యము. అబ్బురము. నన్ను సాంజలి శరణాగత ఉపాసకునిగ స్వీకరింపుడు.''

''సింహా! నీవు ప్రతిష్ఠగల పురుషుడవు. కొంత యోచించి నిశ్చయించు కొనుము.''

''దేవా! మీ మాట చేత మఱింత ప్రసన్నుడనైతిని. నన్ను శిష్యునిగ స్వీకరింపుడని నే నితర తైర్థికులతో యింతమాత్రము చెప్పి నట్లయిన అంతతోనే 'సింహసేనాపతి మాకు శిష్యుడైనాడని వారు వైశాలి నగరమును తూర్పు పడమరలు ఏకము జేసియుందురు. మీరో ' యోచించి నిశ్చయించుకొమ్ము' ని నన్ను తాళజెప్పుచున్నారు. మీ నీతి ఉదారమైనది. భగవంతుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును శరణుజొచ్చు చున్నాను. సంఘమును శరణు జొచ్చుచున్నాను.''

---

1. అక్రియావాదిని గూర్చినవ్యాఖ్య వేరంజకసూత్రమున జూచునది. పేజి 117
2. విటివివరము వెరంజక సూత్రమున చూడవలెను. 117 వ పేజి చూడుడు.

''సింహా! చిరకాలమునుండి నీవు జైనసాధువులకు ధర్మసత్రమువలె ఆశ్రయమై ఉంటివి. ముందుముందు కూడ యెప్పటివలెనే వారిని ఆదరించుచు అన్నపానముల నర్పించుచుండుము.''

''భగవంతా! మీ సల్లాపములకు హృదయము నిండిపోయినది. మీ సౌజన్యము లోకాతీతము, అమానుషము. దేవా! మూడవసారి శరణుజొచ్చుచున్నాను.''

అంతట భగవంతుడు సింహునకు దానకథ, శీలకథ, స్వర్గకథ, కామభోగ దోషములు, నిష్కర్మతామాహాత్మ్యము, మొదలగు అనుపూర్వకథను జెప్పి, అతడు మృదుచిత్తుడు ప్రసన్నచిత్తుడు నౌటజూచి బుద్ధులను ఉద్ధరింపజాలిన దుఃఖము సముదయము, నిరోధము, మార్గమనెడి ఆర్యసత్యచతుష్టయమును ఉపదేశించెను. నిర్మలమగు వస్త్రమునకు రంగుపట్టినట్లు సింహసేనాపతికి అప్పటికప్పుడే విరజధర్మ చక్షు వుత్పన్నమైనది. వినీతుడై భగవంతునితో యిట్లనియె.

''ప్రభూ! భిక్షుసంఘ సహితముగ రేపు నా భోజనమును స్వీకరింపవలెను.'' బుద్ధుడు మౌనముతో అంగీకరించెను. సింహుడును నమస్కరించి పనివినియెను.

మఱురోజు సింహసేనాపతి తనయింట వివిధాహారములను సంసిద్ధపఱచెను. భగవంతుడును పాత్రచీవరములను గొని భిక్షుసంఘము తోడ్త వచ్చి పఱచిన ఆసనములపై గూర్చొనెను. ఆ సమయమున జైనసాధువులు పలువురు వైశాలియందు వీథులు వీథులు దిరుగుచు ''నేడు సింహసేనాపతి పెద్దపశువును హింసించి శ్రమణ గౌతమునకు విందు జేసినాడు. తెలిసి తెలిసి దానిని గౌతముడు భుజించుచున్నాడు'' ని కేకలు వెట్టుచు గగ్గోలు జేసిరి.

ఆ కల్లోలమును వారి దుష్ప్రచారమును ఎవడో ఒక మనుష్యుడు వచ్చి సింహునకు తెలియజేసెను. అతండు ఆ మాటనువిని ''ఓహో! పోనిమ్ము. తెలిసి తెలిసి మా ప్రాణములకొఱకై గూడ మఱొక్క ప్రాణిని హింసింపబోము. శ్రమణగౌతముని పైగల అసూయతో జేయు వ్యాపారమిది. సిగ్గులేక పెక్కుభంగుల భగవంతుని కాఱులు ప్రేలెదరు.'' అని ఉగ్గడించి ఆ వైపు ఉదాసీనుడయ్యెను.

భగవంతుడు భిక్షుసంఘముతో కలిసి వివిధాహారములను సింహసేనాపతి చేచేతుల వడ్డించుచుండ సంతృప్తిగ భుజించి ధర్మకథాసల్లాపములచేత నతని నాహ్లాద పఱచి ఇచ్చమెయి లేచిపోయెను.

## ౧౧
# మేండకదీక్ష - విశాఖాదేవి (వి. పూ. 458)

[1] భగవంతుడు సుగతుడు వైశాలియందు యిచ్ఛానుసారము విహరించి పదిరెండువందల యేబదిమంది మహాభిక్షుసంఘముతో క్రమముగ చారిక నొన ర్చుచు [2] భద్దియా (భద్రికా) నగరము చేరుకొనెను. అచ్చట జాతికావనమున విహరించు చుండుటను మేండకుడను గృహపతి యొకడు విని యిట్లు దలంచెను. ''అర్హతుడు సమ్యక్ సంబుద్ధుడు విద్యాచరణ సంయుక్తుడు సుగతుడు లోకవేత్త అనుత్తరుడు, పురుషదమ్యసారథి, దేవమనుష్యశాస్త్ర భగవంతుడు బుద్ధుడు. అతడు స్వయముగ పరమతత్త్వమును సాక్షాత్కరించుకొని దేవమార బ్రహ్మసహిత విశ్వ బ్రహ్మాండమునందలి శ్రమణ బ్రాహ్మణదేవమనుష్యులందఱికిని ఆదిమధ్యాంత కల్యాణమగు ధర్మమును ఉపదేశించుచున్నాడు. ఆతని పుణ్యదర్శనము చేసికొందును గాక.''

ఇట్లు దలంచి మేండక గృహపతి తగిన కొందఱు పరిజనము వెంటరాగా భద్రయానమునెక్కి భద్రికనుండి గదలెను. తైర్థికులు పలువురు యెదుట తటస్థించి ''గృహపతీ! నీవు క్రియావాదివి. గౌతముడు అక్రియావాది. ఆతని దర్శనము నీ కెందుక'' ని నిరోధించిరి గాని వారి మాటల నతడు సరకుగొనలేదు.

దవ్వులనె రథమునుండి దిగినాడు. పాదచారియై పోయి భగవంతునకు ప్రణ మిల్లి యొక్క చక్కటి గూర్చొన్నాడు. బుద్ధుడును అతనికి [3] అనుపూర్వికథను జెప్పినంత ''సముదయధర్మమంతయు నిరోధధర్మమే'' యనెడి విరజధర్మచక్షువు మేండక గృహపతికి అప్పటికప్పుడే సంభవించినది.

''భంతే! ఆశ్చర్యము. అబ్బురము. నన్ను సాంజలి శరణాగత ఉపాసకునిగ స్వీకరించండి. బుద్ధుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును భిక్షుసంఘమునుకూడా. భగవానులవారు భిక్షుసంఘ సహితముగ రేపు నా భోజనమును అంగీకరింపవలెను.''

భగవంతుడు మౌన రూపమున నిచ్చిన అంగీకారమును గ్రహించి మేండకగృహ పతి ఆసనమునుండి లేచిపోయెను. ఆ రాత్రి గడచినంత వివిధ శాకపాకములను సంసిద్ధ పఱిచి సమయమైనదని భగవంతునకు సూచన బంపించెను. తథాగతుడు పూర్వాహ్ణసమయమున పాత్రచీవరములను ధరించి భిక్షుసంఘసహితముగ మేండక

---

(1) మహావగ్గ 6 (2) ముంగేర్ (బీహార్) (3) 31 వ పేజి చూడుడు.

గృహపతియింటికి జనుదెంచి పఱచిన ఆసనముపై కూర్చొనెను. గృహపతి భార్యయు పుత్రుడును కోడలును దాసజనమును వచ్చి భగవంతునకు నమస్కరించి కూర్చొనిరి. వారికి శాస్త్ర ఆనుపూర్వి కథను యెఱింగించినంత ధర్మచక్షువు కలిగి వారందఱును బుద్ధునకును ధర్మమునకును సంఘమునకును శరణుజొచ్చి ఉపాసకులు ఉపాసికలు నైరి.

మేండకుడు వండిన పదార్థములను బుద్ధునకును భిక్షుసంఘమునకును తానే స్వయముగ వడ్డించి సంతృప్తుల జేసి చేతులను కడిగి కొనిన పిదప భగవంతునితో యిట్లు విన్నవించెను.

''భగవంతా! ఈ భద్రికానగరమందు తాము విహరించుచున్నంతవఱకు భిక్షుసంఘసహితముగ నా భోజనమునే స్వీకరించుచుండవలెను.''

అమ్మెయి నంగీకరించి భగవంతుడు యథేచ్ఛ బోయెను.

## విశాఖ జన్మము (వి. పూ. 465)

[1]అంగదేశమునందుండు [2] భద్రికానగరమున నివాసము చేయు మేండక గృహపతియొక్క పెద్దకుమారుడగు ధనంజయ శ్రేష్ఠికి, అతని పెద్దభార్యయయిన సుమనాదేవియందు విశాఖ జన్మించినది. ఆమె యేడేండ్ల యీడుగలదియై యున్న పుడు శైలబ్రాహ్మణప్రభృతులకు బోధచేయుటకై భగవంతుడు మహాభిక్షుసంఘముతో ఆ నగరమునకు వచ్చెను. మేండకశ్రేష్ఠియు, అతని ప్రధానభార్య చంద్రపద్మయు, వారికుమారుడు ధనంజయుడును, అతని పత్ని సుమనాదేవియు, వారిభృత్యుడు పూర్ణుడును, యీ అయిదుగురును ఆ నగరమున మహాపుణ్యులన ప్రసిద్ధులైయుం డిరి. వీరిలో శ్రేష్ఠుడగుటచే మేండకగృహపతి ''శ్రేష్ఠి'' పదమును పొందియుండెను. అంతేగాదు, బింబిసారుని రాజ్యమందు మహాభోగపురుషులని అయిదువురు యెన్నిక గనియుండిరి. వారు, జోతియుడు జటిలుడు మేండకుడు పూర్ణకుడు కాక బలియుడనువారు. మేండకుడు వారిలోకూడ నొకడు.

భగవంతుడు బుద్ధుడు తన నగరమునకు విచ్చేయుచున్నాడని విని మేండక శ్రేష్ఠి తన మనుమరాలగు విశాఖకన్యను, మఱియైదు వందల కన్యలతోడ రథము నెక్కించి స్వాగతమిచ్చుటకు యెదురుగ పంపించెను. తానును వెంటవెంట బోయెను.

---

1. ధమ్మపదము అ. క. 4 – 8.
2. గంగకు దక్షిణమునందు భగల్‌పురము ముంగేరజిల్లాల ప్రాంతప్రదేశము (బీహర్)

పోవదగి యున్నంతకు రథములపై బోయి ఆపై వాటినిదిగి కాలినడకతో అమ్మహా పురుషుని సమీపించి వందనము లర్పించి తోడికన్యలతోడ విశాఖకన్యయు మేండక గృహపతియు నొకచో గూర్చొనిరి. భగవంతుడు ధర్మచర్యనుపదేశించుచున్నాడు. ఆ ఉపదేశమును విని మేండకుడును, విశాఖయు తోడికన్యలుకూడ స్రోతాపత్తి ఫలమును పొందిరి. మఱునాటి భోజనమునకు సంఘసహితముగ బుద్ధుని తనయింటికి ఆహ్వానించి మేండక గృహపతి వారిని సంతృప్తులను జేసి ఆ నగరమున వారు నివసించిన యెనిమిదినెలలును అట్లే మహోదారముగ నన్నదానమొనర్చెను. అట్లు భద్రికానగరమున స్వేచ్ఛమెయి విహరించి భగవంతుడు అటనుండి కదలి చనియెను.

ఆ కాలమున మగధరాజు బింబిసారుడు, కోసలపతి ప్రసేనజిత్తును పరస్పరము బావయు బావమరదియు నైయుండిరి. ''బింబిసారుని రాజ్యములో మహాభోగ పురుషులు అయిదుగురు గలరు. నా రాజ్యమున నొక్కడును లేడు. అచ్చోటినుండి ఒక్కనిని యిచ్చటికి పిలిపించుకొందునుగాక'' యని కోసలేశ్వరుడు చింతించి బింబిసారుని వద్దకు పోయెను. అతనిచే ఆదరసత్కారములబొంది ''మీ రాజ్యములోని మహాభోగపురుష లయిదుగురిలో నొక్కని నా రాజ్యమునకు తీసికొనిపోవ వచ్చితిని. పంపవలయు'' ననెను.

''పంపను వీలులేదే.''

''పంపినంతకు నేను పోను.''

బింబిసారుడు మంత్రులతో మంతనము జేసి మేండక శ్రేష్ఠికుమారుని ధనంజయుని పంపుదమని తలపోసి, ఆతనిని పిలువనంపి యిట్లడిగిరి–

''అయ్యా! కోసలరాజు ప్రసేనజిత్తు ధనికుడగు నొక శ్రేష్ఠిని ఈ పురమునుండి తీసికొనిపోవ వచ్చినాడు. నీవు పోయెదవా?''

''దేవా! ఆజ్ఞ.''

''అటులయిన సిద్ధముగమ్ము పొమ్ము.''

ధనంజయశ్రేష్ఠి ప్రసేనజిత్తుని వెంట వెళ్లుచు కోసలరాజ్యముయొక్క హద్దులోనికి ప్రవేశించి నాటి సాయంకాలమున విడిదికొఱకు డేరావేయించెను. అంతట రాజును జూచి–

''రాజా! ఈ రాజ్య మెవరిది?''

''గృహపతీ! నాదే.''

''శ్రావస్తి యిక్కడికి యెంతదూరము''

''దాదాపు యేడామడలు''

''రాజా! నేనిక్కడనే నిలిచెదను. నగరములో సందడి అధికముగ నుండును. నాకు పరిజనులు మెండు. చిత్తగించినచో యిక్కడనే నివసించెదను.''

ఆ మాటకు రాజు సమ్మతించెను. సాయంకాలనికేతనమై యొప్పుటబట్టి, ఆ చోటు ఒక మహాపురమై సాకేతమన ప్రసిద్ధమయ్యెను.

  

[1] అక్కడ భగవంతుడు బుద్ధుడు మేండకగృహపతికి చెప్పకనే భద్రికా నగరము నుండి బయలుదేరి పండ్రెండువందల యేబదిమంది మహాభిక్షుసంఘముతో చారిక నొనర్చుచు [2] అంగుత్తరాపమును బోయి చేరిరి. మేండక గృహపతి భగవంతుడు భిక్షుసంఘముతో అంగుత్తరాపమున విహరించుచున్నాడని విని తన పరిజనులను సేవకులను బిలిచి భోజనవస్తుసంభారములను సమృద్ధిగ బండ్లకెత్తించి పాడియావుల ననేకము వెంటబెట్టుకొని భగవంతుడు విహరించు ప్రదేశమునకు ప్రయాణమయ్యెను. దారినడుమ నొక యరణ్యమున భిక్షుసంఘసహితముగ భగవంతుడు బుద్ధుడు కానవచ్చెను. మేండకగృహపతి సమీపించి నమస్కరించి గురుదేవుని యనుమతిబొంది ఉత్తమ ఖాద్యభోజ్యముల నాయత్తపఱచెను. పఱచిన ఆసనములపై భిక్షుసంఘసహితముగ తథాగతుని గూర్చుండబెట్టి వివిధములగు వంటకములను వడ్డించి ఒక్కొక్క భిక్షువు యెదుట నొక్కొక్క ఆవును నిలిపి అప్పుడే పిదికిన వేడిపాల (ధారోష్ణముల) తో భోజనము చేయవలెనని కోరెను. భిక్షువులు తొలుత ధారోష్ణములను నిరాకరించిరి. కాని భగవంతు డనుజ్ఞ నిచ్చినంతటనే గ్రహించి భుజించిరి.

భోజనానంతరము బుద్ధభగవంతుడు భిక్షువుల నుద్దేశించి యిట్లు కొన్ని నియమముల నాదేశించెను.

''భిక్షువులారా! పాలు, పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి యనెడి గోరసముల నైదింటిని వాడుకొనుటకు అనుమతి నిచ్చుచున్నాను. దుర్గమములగు అరణ్యములందు నడచునపుడు వాని వాని యభిరుచిని బట్టి దారిబత్తెమునుంచుకొనవచ్చును. కాని భిక్షువగు వాడు బంగారమును వెండిని సంగ్రహించి పెట్టుకొనరాదు.''

1. మహావగ్గ 6
2. ముంగేరము భాగల్పురము జిల్లాలయందు గంగకు ఉత్తరప్రదేశము.

ఇట్లు ఆదేశించి భగవంతుడు క్రమముగ సంచారముచేసికొనుచు ఆపణ గ్రామము నకు బోయెను.

## ౧౨

## పోతలియ సూత్రము (వి. పూ. 458)

★ అంగుత్తరాపదేశమునకు చెందిన ఆపణమను గ్రామమున భగవంతుడు బుద్ధుడు విహరించుచుండెను. అది పూర్వాహ్ణ సమయము. పాత్రచీవరములను గొని బుద్ధస్వామి ఆపణములోనికి పోయి భిక్షను గొనివచ్చి భుజించి ఆ పగటియం దొక వనఖండమున విహరించుటకు బోయి ఒకానొక చెట్టుక్రింద కూర్చొనెను. పోతలియుడను గృహపతి (వైశ్యుడు) ఆయా దుస్తులను ధరించి చెప్పులు దొడిగి గొడుగు పట్టుకొని ఉబుసుపోకకై ఆ వనములోనికే వచ్చి వృక్షమూలమున కూర్చొని యుండు భగవంతుని చేరబోయి కుశలప్రశ్నమడిగి యొకవైపు నిలువబడి యుండెను. భగవంతు డిట్లనియె.

''గృహపతీ! నిలబడెదవేల? ఇష్టమున్న అట కూర్చొనుము.''

బుద్ధుడు 'గృహపతీ' యని తన్ను పిలుచుట అతనికి కంటకమైనది. గృహస్థ వైశ్యు డనని బుద్ధుడు హేళనగ పెలుచుచున్నాడని అతని హృదయము ఆరాటపడినది. బదులు పలుకలేదు. భగవంతుడట్లే ముమ్మాఱు జెప్పెను.

---

★ మ. ని. 2 - 1 - 4.

(అట్ఠకథలో) అంగదేశముననుండు మహీనదీజలము ఉత్తరమున కలది కావున అంగుత్తరాపమని పేరు. (అంగ + ఉత్తర + ఆపము). ఆ మహీనది యనునదేది? = జంబూద్వీపము పదివేలయోజనముల విస్తీర్ణముగలది. అందు నాలుగువేల యోజనముల ప్రదేశము సముద్రము. మూడువేల యోజనములందు మనుష్యులు వసింతురు. తక్కిన మూడువేల యోజనములందు హిమాలయము వ్యాపించినది. అది యెనుబదినాల్గువేల శిఖరములతో ఏనూరు నదులతో శోభితమైయున్నది. ఆ పర్వతమునందు అనవతప్తము. కణ్ణముండము, రథకారము, ఛద్దంతము, కుణాలము, మందాకిని, సింహ ప్రపాతకము ననెడి యేడు మహాసరోవరములు గలవు. గంగయు, యమునయు, అచిరవతి, సరయు, మహీ (గండకి) నదులయిదును హిమవంతునినుండి బయలుదేరును. అయిదవదియగు మహీనదియే యిచ్చట అభిప్రేతము.

అట్టి అంగుత్తరాపమున ఆపణమను గ్రామము కలదు. ఆ గ్రామమున యిరువదివేలు దుకాణము లుండుటచే దానిపేరు ఆపణమని ప్రసిద్ధమైనది. ఆ గ్రామసమీపమున నదీతీరమునందలి ఒక వనములో భగవంతుడు విహరించుచున్నాడు.

''గౌతమా! 'గృహపతి – గృహపతి' యని నన్ను సంబోధించుట నీ బోటి వానికి ఉచితముగాదు.''

''గృహపతీ! నీ రూపరేఖలు నీ ఆకార ప్రకారములు నీవు గృపతివని చెప్పక చెప్పుచున్నవి. అప్పట్లో నేనేమని పిలువగలను?''

''గౌతమా! అవుగాక. సేద్యము వదలితిని. వ్యాపారమును మానితిని. పనిపాట లకు స్వస్తిచెప్పితిని. ధనధాన్యములు వస్తువాహనములు కొడుకులకు అప్పగించితిని. తినుటకుతప్ప నాకు యింటితో పని లేదు. ఇట్లు వ్యవహార త్యాగినైన నన్ను మీరు గృహపతి యని పిలుచుట భావ్యమా?''

''గృహపతీ! వ్యవహారత్యాగమనిన నీవు చెప్పినట్టిదికాదు. పెద్దలట్లు జెప్పరు. వారు జెప్పునది మఱియొక విధము.''

''భంతే! అది యెట్టిది?''

''గృహపతీ! వినుము.''

ఆర్య వినయమునందు వ్యవహారనాశనము కొఱకు యెనిమిది ధర్మములు చెప్పబడినవి. 1. అహింస (అప్రాణాతి పాతము) కొఱకు హింసను (ప్రాణాతిపాత మును) వదలుట. 2. అస్తేయము (దిన్నాదానము) కొఱకు, స్తేయవృత్తిని (అదిన్నా దానమును) వీడుట. 3. సత్యము కొఱకు మృషావాదమును విడుచుట. 4. అపిశున వచనము కొఱకు పిశునవచనములను. 5. నిర్లోభముకొఱకు లోభమును6. అనింద కొఱకు నిందను.7. అక్రోధ – ఉపాయాసము కొఱకు క్రోధోపాయాసమును, 8. అమానిత్వము కొఱకు అతిమానితను పరత్యజించవలెను. ఈ యెనిమిది ధర్మములు ఆర్యవినయమమునందు వ్యవహార నాశనమునకై చెప్పబడినవి.

''భంతే! విస్తారముగ చెప్పగోరుచున్నాను.''

''గృహపతీ! వినుము. అహింస (అప్రాణాతిపాతము) కొఱకు హింసను (ప్రాణాతి పాతము) వీడవలెను. బంధవిముక్తిని గోరు నేను హింసను ఆశ్రయించినచో బంధము మఱింత బిగిసికొనును. నా చిత్తమే నన్ను ధిక్కరించును. పెద్దలు ఛీకొట్టె దరు. శరీరమును విడిచిన పిదప నరకము ప్రాప్తించును. మఱియు హింస (ప్రాణాతి పాతము) చేత విఘాత పరిదానము, ఆస్రవదోషమును సంభవించును. ఇన్నింటిని బట్టి అప్రాణాతిపాతము (అహింస) కొఱకు ప్రాణాతిపాతము (హింస)ను అవ శ్యము వదలవలసియె యున్నది.'' అని శ్రావకుడు చింతించును.

'దిన్నాదానము కొఱకు అదిన్నాదానము (చోరవృత్తి)ను వీడవలెను. బంధ విముక్తిని గోరు నేను అదిన్నాదానమును ఆశ్రయించినచో బంధము మఱింత బిగిసి కొనును. నా చిత్తమే నన్ను ధిక్కరించును. పెద్దలు ఛీకొట్టెదరు. శరీరమును విడచిన పిదప నరకము ప్రాప్తించును. మఱియు అదిన్నాదానముచేత విఘాత పరిదానము, ఆస్రవదోషమును కలుగును. ఇన్నింటినిబట్టి దిన్నాదానము కొఱకు, అదిన్నాదాన మును అవశ్యము వదలవలసియే ఉన్నది.' అని ఆర్యశ్రావకుడు చింతించును.''

బుద్ధభగవంతు డిట్లుతక్కిన ఆఱింటిని గూర్చికూడ విస్తారముగ* జెప్పి మఱియు నిట్లనియె.''గృహపతీ! వ్యవహార నాశముకొఱకు యెనిమిది ధర్మములను జెప్పితిని. అయినను బొత్తుగ వ్యవహారనాశము వీటితోనే సిద్ధించదు.''

''ప్రభూ! అది యెట్టిదో చెప్పుడు?''

''గృహపతీ! ఆకలితో అలమటించు కుక్క యెముకను కొఱికినచో దాని ఆకలిదీఱునా?

''భంతే! మాంసరహితమైన యెముకను కొఱికి వేదనపడుట తప్ప దానికి సుఖము లేదు.''

''అట్లే, గృహపతీ! దుఃఖబహుళము వేదనాబహుళమునగు భోగజాలమున కడగండ్లే మెండని గ్రహించి ఆర్యశ్రావకుడు అనేకతాయుక్తమగు అనేకమునందు మెలగెడి అపేక్షను వదలి ఏకాంతయుక్తమగు ఏకాంతమునందు మెలగెడి (బోధి అంగము) ఉపేక్షను భావనచేయును. దానిచే వానికి లౌకిక విషయగ్రహణము నితాం తము ఉపశమించుచున్నది. గృహపతీ! గ్రద్ద యొకటి మాంసపుముక్కను గైకొని ఆకాశమున కెగిరినప్పుడు పక్షులనేకము దానిని చుట్టుకొని ముట్టడించిన యెడల ఆమాంసఖండమును వదలకపోయినచో చావుగాని, అంతటివేదనగాని తప్పునా? తప్పదు. అట్లే మాంసఖండములబోలిన కామములయందు అగచాట్లే యధికము. దోషములే మెండని గ్రహించి ఆర్యశ్రావకుడు అనేకతాయుక్తమగు అనేకమునందు మెలగెడి అపేక్షనువదలి, ఏకాంతయుక్తమగు యేకాంతమునందు మెలగెడి ఉపేక్షను (సంబోధి – అంగము) భావన చేయును. దానిచే వానికి లౌకిక విషయగ్రహణము నితాంత ముపశమించుచన్నది.

ఓ గృహపతీ! ఆర్యశ్రావకు డిట్లు ★ స్మృతిపారిశుద్ధిని కల్గింపజాలు అనుప మమగు ఉపేక్షను ఆశ్రయించి అనేక ప్రకారములగు పూర్వజన్మములను స్మరించుచు

★ వెరంజసూత్ర. 119పేజి చూడుడు.

న్నాడు. మఱియుఅమానుష విశుద్ధమగు దివ్యచక్షువును బొంది కర్మప్రవాహమున జన్మమరణ కల్లోలములందు కకావికలగుచున్న ప్రాణికోటిని దర్శించుచున్నాడు. ఇట్టి ఆర్యశ్రావకునకు ఆస్రవములు ఊడినవి. చిత్తవిముక్తి లభించినది. వ్యవహారనాశము సంపూర్ణముగ సిద్ధించినది. గృహపతీ! నీవు వ్యవహార త్యాగివంటివా? వానివలె వ్యవహారనాశమైనదా?''

''భగవంతా! నక్క యేడ? నాకలోకమేడ? నాకును దానికి బహుదూరము. ఇంతవఱకు నేను పవిత్రుల నపవిత్రులని, అపవిత్రుల పవిత్రులని దలంచితిని. అనర్హుల నాదరించి అర్హుల ననాదరించితిని. దేవా! వస్తుస్థితి దెలిసికొంటిని. నా అస్తవ్యస్తము సమసినది. తమ దయవలన సాధుప్రేమయు సాధుప్రసాదమును సాధుగౌరవమును సంప్రాప్తించినవి. ఆశ్చర్యమాశ్చర్యము. అంజలి బద్ధఉపాకునిగ భగవంతుడు నన్నునుగ్రహింపవలయును.''

## ౧౩

## శైలసూత్రము (వి. పూ. 458)

[1] ఆసమయమున భగవంతుడు వెయ్యియిన్నూట యేబదిమంది మహాభిక్షు సంఘముతో అంగుత్తరాపదేశమున ఆపణనాయక నిగమమున నివసించుచున్నాడు. శాక్యపుత్రుడు ప్రవ్రజితుడు శ్రమణగౌతముడు పురమునకు విచ్చేసి యున్నాడను వార్త విని కేణియజటిలుడను బ్రాహ్మణుడు అతని దర్శింప [2] నిచ్చగించి, భగవంతుడున్నెడకు పోయి సమ్మోదనమునర్చి యుకచో గూర్చొనెను. దశబలు డతనికి ధర్మోపదేశముచేసి సందర్శన సమాదపన సముత్తేజన సంప్రశంసనము లొనర్చెను. అంతట కేణియజటిలుడు తథాగతునితో నిట్లనియె.

''దేవా! భిక్షుసంఘసహితముగ రేపు నా భోజనమును స్వీకరింపవలెను.''

''కేణియా! భిక్షుసంఘము చాల గొప్పది. పోనిమ్ము. నీవు బ్రాహ్మణులలో చాల శ్రద్ధావంతుడవు. సంతోషము.''

''గౌతమా! భిక్షుసంఘము గొప్పదియె కానిమ్ము. తప్పక తాము రేపు నా భోజనమును స్వీకరింపవలెను.''

1. మ. ని. 2 – 5 – 2, సుత్తనిపాత 3 – 7
2. 40 వ పేజి చూడుడు.

ముమ్మాఱు నిషేధించినను కేణియుడు పట్టు వదలకపోవుటచే చివరకు మౌనము వహించి భగవంతు డంగీకారమును సూచించెను. కేణియజటిలుడును తన ఆశ్రమమునకు బోయి తన మిత్రబాంధవులను ప్రోగుజేసికొని యిట్లనియె.

''ఆప్తులారా! నేను రేపటి భోజనమునకు నా యింటికి భిక్షుసంఘసహితముగ శ్రమణగౌతముని నిమంత్రించి వచ్చితిని. మీరు వళ్ళువంచి శరీరముతో సేవ జేయవలెను.''

ఆ మాటను విని వారలును మంచిదని సమ్మతించి, కట్టెలు గొట్టువారునై, నీరు దెచ్చువారునై , పాత్రలు దోమువారునై, వంటలు వండువారునై, ఆసనములు బఱచువారునై వారు వారు ఆయా పనులయందు తల్లీనులైరి.

ఈ విషయ మిట్లుండ ఆ ఆపణ గ్రామమునందు శైలుడను బ్రాహ్మణుడు నివసించు చుండెను. అతడు అంగములతో కూడిన వేదములను మూడింటిని చదివినవాడు. ఇతిహాస పారంగతుడు. సాముద్రిక శాస్త్రవేత్త. అతనివద్ద మూడు వందలమంది విద్యార్థులు వేదము పఠించుచున్నారు. అతనికిని కేణియజటిలునకును ప్రగాఢస్నేహము. ఆ శైలుడు ఆపూట సరదాగా కేణియజటిలుని ఆశ్రమమునకు వచ్చెను. శిష్యులతో ఆప్తులతోగూడి కేణియుడు మహాకోలాహల సంరంభములో నున్నాడు. అదంతయుజూచి ఆశ్చర్యముతో కూడి శైల బ్రాహ్మణుడు కేణియ జటిలుని చేరబోయి ''అయ్యా! నీ ఆశ్రమమున నేమికార్యము జరుగును? వివాహమా? ఆవాహమా? యజ్ఞమా? యాగమా?'' అని యడిగెను. కేణియుడును ఆ మాటలు విని ''శైలా! నీవు చెప్పిన దేదియుగాదు. ఇదియొక అపూర్వ యజ్ఞము. అర్హతుడు సమ్యక్ సంబుద్ధుడు విద్యాచరణ సంపన్నుడు. సుగతుడు లోకవిదుడు, అనుత్తరుడు, పురుషదమ్యసారథి దేవ మనుష్యశాస్త్రభగవంతుడు బుద్ధుడు మన పుణ్యవశమున ఆపణమునకు వచ్చినాడు. ఆయనను భిక్షుసంఘసహితముగ రేపటి దినము నా యీ ఆశ్రమమునకు భోజనమునకై నిమంత్రించినాను. అందుకు వలయు సన్నాహమిది'' అని ప్రత్యుత్తర మిచ్చెను.

''కేణియా! బుద్ధుడని చెప్పుచున్నావా?''

''శైలా! అవును. బుద్ధుడే''

''ఆహా! బుద్ధుడేనా?''

''అవునయ్యా! బుద్ధుడేను.''

శైలబ్రాహ్మణుని ఆశ్చర్యమునకు మేర లేదు. తనలో తానిట్లు తలపోయుచున్నాడు. "లోకమున బుద్ధుడను మాట నితాంతము దుర్లభము. శాస్త్రములందు మహాపురుష లక్షణములు ముప్పది రెండు జెప్పుదురు. అట్టి లక్షణములతో గూడిన వానికి రెండే పరి పాకములు. గృహవాసియైనచో సర్వవసుంధరకు సార్వభౌముడగుట; గృహత్యాగియైనచో సమ్యక్ సంబుద్ధుడగుట – కేణియా! ఇప్పుడు గౌతమ బుద్ధు డెక్కడ విహరించు చున్నాడు?"

"శైలా! అదిగో! ఆ నీలవన పంక్తివద్ద."

శైలుడు తన మున్నూటుమంది శిష్యులతో భగవంతుని దర్శింపబోవుచు నిట్లనియె. 'శిష్యులారా! శబ్దము చేయకుడు. బుద్ధుడు నిశ్శబ్ద ప్రియుడు. అదీగాక నేను ఆయనతో ప్రసంగించునపుడు మీరు మధ్యలో మాట్లాడకుడు."

అని బోధించుచు భగవానుని చేరబోయి సమ్మోదనము (కుశలప్రశ్నము) నొనర్చి యొకచో గూర్చొని ముప్పదిరెండు మహాపురుషలక్షణము లితనియందున్నవా యని తత్పరతతో వెదుక నారంభించెను. ముప్పదింటిని కనుగొనెను. కడమ రెండును కలవో లేవో యని సందేహము. ఒకటి – గుహ్యేంద్రియము కోశాచ్ఛాదితమై యుండుట. రెండు – నాలుక మిగుల నిడుపై యుండుట. శైలుడు యీ రెండు లక్షణములనుకూడ గమనింప కోరినాడు. ఆతని యింగిత మెఱింగి భగవంతుడు తన యోగబలముతో కోశావృతమగు వస్తిగుహ్యమును శైలుడు కాంచునట్లు జేసెను. అటు పిమ్మట నాలుకను దెఱచి చాచి రెండు చెవులకును తాకించెను. శైలుని సందేహము సమసినది. "శ్రమణగౌతముడు పరిపూర్ణముగ మహాపురుషుడు. అయినను బుద్ధుడవునో గాదో; లోకమునందు సమ్యక్ సంబుద్ధు డవతరించగలడని మహల్లక (వృద్ధ) బ్రాహ్మణులు తొల్లి చెప్పుచుండువారు. నేనిప్పు డతని ప్రశంసా వాక్యములతో ప్రస్తుతించెదను. దానిని విని తథాగతుడు తన్ను దాను వెల్లడి జేసికొ గలడు." అని తలంచి స్తుతి పాఠముల నిట్లు పాడెను.

"కమనీయంబగు దేహమద్భుత పరిజ్ఞానంబు బంగారుతో
సమమైయొప్పెడి కాంతి సత్కులమునం జన్మంబు సౌభాగ్య చి
హ్నములన్ ముప్పది రెంట శోభిలుట, కన్నామా? మఱేచోట నో
శ్రమణా! గౌతమ! నీకుసాటి మఱిలేరయ్యా, ప్రపంచంబునన్"

"గౌతమా! నాలుగు చెఱగుల నేలనంతయు నేలుటకు దగియు ఈ భిక్షువృత్తి నేలాగ పేక్షించితివి."

''శైలా! నేను రాజును. మహారాజును. ధర్మరాజును. నిత్యమై మార్పొందని ధర్మచక్రము నధిష్ఠించి పాలించుచున్నాను. అనుపమమగు నా ధర్మచక్రమునకు సేనా నాయకుడు సారిపుత్రుడు. అతడు దీనిని అనుసంచాలనము జేయును.

ఎఱుగదగినదాని నెఱిగితి, విడువంగ
వలయువాని విడువగలిగియుంటి
సందియంబదేల సంబుద్ధుడను నేను,
అవని నిట్టి జన్మ లరుదు విప్ర!

''దేవా! శిష్యసహితముగ శరణుజొచ్చుచున్నాను. ప్రవ్రజ్యనొసంగి బ్రహ్మచర్య చరణమునకు అనుజ్ఞనివ్వుడు.''

ఇట్లు శైలబ్రాహ్మణుడు శిష్యసంఘసహితముగ భగవంతుని ప్రార్థించి[1] సాందృష్టికమును, [2] అకాలికమును, [3] స్వాఖ్యాతమునగు ప్రవ్రజ్యను అమ్మహనీయుని వలన ప్రాపించి ఉపసంపన్నుడయ్యెను.

అక్కడ కేణియజటిలుడు మఱునాడు పెందలకడనె ఉత్తమ భోజనములను సంసిద్ధము జేసి భగవంతుని నాహ్వానించి భిక్షుసంఘసహితముగ సంతర్పితుని జేసెను. కేణియజటిలు నుద్దేశించి భగవంతు డిట్లనియె. ''యజ్ఞములందు అగ్నిహోత్రమును, ఛందస్సులందు గాయత్రియు, మనుష్యులందు రాజును, నదులయందు సముద్రమును, నక్షత్రములందు చంద్రుడును, వెలిగించువారల సూర్యుడును, కోరదగిన వాటియందు పుణ్యమును, పూజ్యస్థానములందు సంఘమును శ్రేష్ఠములు.'' ఇట్లు చెప్పి భగవంతుడు యథేచ్ఛంబోయెను.

శైలబ్రాహ్మణుడును పరిషత్తుసహితముగ అనుపమ బ్రహ్మచర్య ఫలమును బొంది కృతకృత్యుడై అర్హతపదమును ప్రాపించెను.

## ౧౪

## కేణియజటిలుడు – రోజమల్లఉపాసకుడు – ఆపణమునుండి శ్రావస్తి (వి. పూ. 458)

[4]అంతట ''శ్రమణగౌతముని కొఱకు నేనేమి కొనిపోదున''ని కేణియజటిలుడు కొంతవడి యోచించి యిట్లు దలంచెను. పూర్వము మంత్రకర్తలగు ఋషులు,

---

(1) ప్రత్యక్షఫలప్రదము (2) తాత్కాలికఫలప్రదము (3) సుందరముగ వర్ణింపబడినది.
(4) మహావగ్గ 6

అష్టకుడు వామకుడు వామదేవుడు విశ్వామిత్రుడు జమదగ్ని అంగిరసుడు, భరద్వాజుడు వసిష్ఠుడు కశ్యపుడు భృగువుననువారు రాత్రులందును వికాలము (మధ్యాహ్నోత్తర కాలము) లందును భుజించెడివారుకారు. అయినను కొన్ని పానీయములను వారు గ్రహించెడివారు. శ్రమణగౌతముడును వారివలెనే రాత్రులయందును వికాలములందును భుజించడు. కావున కొన్ని పానీయములను గొనిపోదునని తయారు జేసికొని కావిడులకెత్తించుకొని భగవంతుని వద్దకు వెళ్ళి సమ్మోదనమొనర్చి పానీయమును పానము జేయగోరెను. భగవంతుడు భిక్షువుల కిమ్మనెను. కాని భిక్షుసంఘము ఆ పానీయములను త్రాగుటకు శంకించిరి. భగవంతు డిట్లనియె.

''భిక్షువులారా! యెనిమిది విధములగు పానీయములను పానము చేయుటకు మీకు నేను అనుజ్ఞ నొసగుచున్నాను. ఆమ్రపానము (మామిడిపండు రసము), జంబూ (నేరేడు) పానము, చోచపానము, మోచ (అరటి) పానము, మధుపానము, అంజూరపానము, సాలూక(ఒకానొక దుంప) పానము, ఫాలసాపానము ఈ పానములకు అనుమతించుచున్నాను. పత్రరసములందు మోదుగ ఆకును విడిచితక్కిన అన్నింటికి, పుష్పరసములందు యిప్పపూవును వదలి కడమ పుష్పరసములకును, చెఱకురసమునకును అనుజ్ఞ నిచ్చుచున్నాను.''

ఆపణగ్రామమును వదలి పండ్రెండువందల యేబదిమంది భిక్షుసంఘముతో భగవంతుడు [1] కుశీనారమునకు వచ్చుచున్నాడు. కుశీనారవాసులగు [2] మల్లురు ఆ వార్త విని అందఱును సమావేశమై ''భగవంతుని యెదుర్కొనుటకు పోవలెను. రాని వానికి అయిదు వందలు అపరాధ'' మని కట్టడి జేసిరి. క్రమముగ చారికనొనర్చుకొనుచు భగవంతుడు కుశీనారమును సమీపించినాడు. మల్లురును భగవంతునకు ప్రత్యుద్గమనము జేసి స్వాగతమిచ్చిరి. వారిలో నొకడగు రోజమల్లుడనువాడు ఆనందునకు స్నేహితుడు. ...డును ముందు భగవంతునికి యెదురేగి నమస్కరించి తర్వాత ఆయుష్మంతుడగు ఆనందునివద్దకు వచ్చి అభివాదనము జేసి నిల్వబడెను. ఆ రోజమల్లుని ఆలోకించి ఆనందుడిట్లనియె.

''ఆయుష్మంతా! రోజా! మంచిపని జేసితివి. భగవంతుని సత్కరించి నీ సౌజన్యమును వెల్లడి జేసితివి.''

''పూజ్యుడవగు ఆనందా! అట్లు చేయకపోయినచో మాకులపెద్దలు మమ్ము బ్రతుకనిత్తురా? వారి దండభయమున జేసితిని.''

---

(1) కసయా (గోరఖపూర్‌జిల్లా) (2) నేటి సైథనారజాతి.

ఆ మాటను విన్నంతన ఆనందుని హృదయము కళుక్కుమనెను. వెంటనే భగవంతుని కడకువెళ్ళి నమస్కరించి యిట్లనియె. ''దేవా! రోజమల్లుడు అన్నివిధముల ప్రతిష్ఠగలవ్యక్తి. అట్టివాడు మన ధర్మమునందు శ్రద్ధవహించుట మంచిది, తాము చిత్తగించునది'' అనిచెప్పి పోయెను. బుద్ధదేవుడును రోజమల్లుని యెడ మిత్రతాయుక్త చిత్తముగలవాడై ఆ చిత్తముతోడనే అతని స్పర్శించి ఆసనమునుండి లేచి విహారము లోనికి వెళ్ళెను. అక్కడ రోజమల్లుడును భగవంతుని చిత్తస్పర్శచే విహ్వలుడై ఆవును బాసిన దూడవలె భగవంతుని గానక వెదుకుచు, బుద్ధు డెక్కడ? సంబుద్ధు డెక్కడని కనబడిన భిక్షువునెల్ల నడుగుచు పరిభ్రమించుచుండెను. కొంతవడికి 'తలుపులు వేసికొని విహారములోపల నున్నా' డనుట తెలిసికొని వాకిండ్ల చేరబోయి మెత్తగ శబ్దము జేసెను. తథాగతుడు తలుపు దెరిచెను. రోజమల్లుడును లోనికి ప్రవేశించి నమస్కరించి యొకచోట గూర్చొనినంత భగవంతుడు యెప్పటియట్ల వానికి ★ ఆనుపూర్విక కథను చెప్పెను. తక్షణమున రోజమల్లునకు ''ఉత్పత్తిగలదంతయు నశించునదియె'' యను విమల ధర్మ చక్షువు సంభవించినది. అంతట వాడిట్లనియె.

''ప్రభూ! భిక్షుసంఘమునకు శాశ్వతముగ అన్నవస్త్రములు, ఆసన ఔషధములు నేనే యిచ్చెదను. ఇతరులనుండి గ్రహింపవలసిన పని లేదు.''

''రోజా! 'నే నిచ్చునవియె గ్రహించునది. ఇతరు లిచ్చునవి గ్రహింపవలద' ను యీ మాట అర్థపక్వజ్ఞానివైన నీకే తగినది. పూర్ణజ్ఞానుల కిది పోలదు.''

భగవంతుడు కొన్నాళ్ళు కుశీనారమున విహరించి యటనుండి ఆత్మగ్రామమునకు చారిక నొనర్చుచు బయలు దేరెను. ఆ గ్రామమున నొక వృద్ధ భిక్షువు గలడు. తొలుత మంగలి వృత్తితో జీవించుచుండి ముసలితనమున సంన్యసించినాడు. వాడు తన గ్రామమునకు భగవంతుడరుదెంచుచున్నాడని విని తన కుమారుల నిరువుర జేరబిలిచి యిట్లనియె. ''బిడ్డలారా! మన పని ముట్లను దీసికొని యింటింటను, చుట్టుముట్టు గ్రామములను దిరిగి క్షౌరము జేసి పప్పు ఉప్పు పిండి బియ్యము మున్నగు సంభారమును ప్రోగుజేయుడు. భిక్షుసంఘసహితముగ భగవంతునకు పులగము జేసి నివేదింపవలెను.''

నేర్పరులగు కుమారు లిర్వురును ఉత్సాహపూర్వకముగ తిరిగి మంగలిపని జేసి వలయు సామాగ్రిని సంపాదించిరి. వృద్ధ భిక్షువును, భగవంతుడు ఆత్మగ్రామమునకు వచ్చి భూసాగారమున విహరించుచున్నాడని విని పులగము నాయత్తపఱచి తీస్కొనిపోయి నివేదించి యిట్లనియె.

---

★ 31 వ పేజి చూడండి.

''దేవా! నా భోజనమును స్వీకరింపుడు.''

''భిక్షూ! దీని నెట్లు సంపాదించితివి.''

వృద్ధభిక్షువు విషయమంతయు జెప్పెను. దానివిని భగవంతుడు కసరుకొని ''వృద్ధుడా! శ్రమణ భిక్షువులకు తగనిపని జేసితివి. వస్తువులను అయోగ్య వర్తనమున సంపాదించుటకు ఆసించితివ''ని పలికి భిక్షుసంఘముతో నిట్లనియె.

''భిక్షువులారా! నిషిద్ధములకు అనుమతి యీరాదు. ఇచ్చినచో దుష్కృత మను ఆపత్తి. ఈ భిక్షువు వెనుకటి మంగలివృత్తిని ఆశ్రయించినాడు. ఇట్లు జేసినవారికి 'దుష్కృత' మను ఆపత్తి.''

ఇట్లు భిక్షువులకు శిక్షాపదమును విధించి భగవంతు డాత్మగ్రామమునుండి పాదచర్యనొనర్చుచు శ్రావస్తీనగరము జేరి అందు అనాథపిండకుని జేతవనవిహారమున విహరించుచుండెను. ఆ తరుణమున శ్రావస్తియందు ఫలములును పండ్లును మిక్కుట ముగ నుండెడివి. ఆ విషయమును విని భగవంతుడు-

''భిక్షువులారా! ఖాద్యఫలముల (తినదగినపండ్ల) కన్నింటికి అనుమతి నిచ్చుచున్నాను.'' అని ఆదేశించెను.

ఆ సమయమున అచ్చటివారు సంఘబీజములను వ్యక్తిగత క్షేత్రములందును, వ్యక్తిగతమగు విత్తనములను సంఘసంబంధమగు పొలములందును విత్తుచుండె డివారు. ఆ విషయమునుగూర్చి భగవంతుడిట్లనియె.

''సంఘబీజములను వ్యక్తిగతక్షేత్రములందు వేసినచో భూస్వామికి ★ పదింట నొకభాగమిచ్చి అనుభవించవలెను. అట్లే వ్యక్తిగత బీజములను సంఘ క్షేత్రములందు విత్తినచో భూస్వామికి పదింట నొక భాగ మివ్వవలెను.''

మఱియు నో భిక్షువులారా! ఇది విహితముగాదు' అని చెప్పి నేను ఒక్కొ క్కచో నిషేధింపకపోయినను వాస్తవమునకది నిషిద్ధమునకు అనుకూలమై విహిత మునకు విరోధమైనపుడు దానిని మీరు స్వీకరింపరాదు. అట్లే 'ఇది విహిత' మని నేను చెప్పకపోయినను అది నిషిద్ధమునకు విరోధమై విహితమునకు అనుకూల మైనచో స్వీకరింప వచ్చును.

---

★ పదింట నొకభాగము భూస్వామి కిచ్చుట ప్రాచీనప్రథ అని అట్టకథ చెప్పుచున్నది.

## ౧౫

# క్షుల్లహస్తిపదోపమసూత్రము (వి. పూ.458)

[1] పదునాల్గవ వర్షావాసము భగవంతుడు జేతవనమునందు గడపెను.

[2] భగవంతుడు బుద్ధుడు శ్రావస్తిలో అనాథపిండకుని జేతవనారామమునందు విహరించుచున్నాడు. అట్టిసమయమున జానుశ్రోణియను బ్రాహ్మణుడు తెల్లని గుఱ్ఱములు బూన్చిన రథముపై నెక్కి మిట్టమధ్యాహ్నము వేళ శ్రావస్తిని నిర్గమించి బయటకుపోవుచు తనకు యెదురుగ వచ్చుచున్న పిలోతిక పరివ్రాజకుని జూచి యిట్లనియె.

''అయ్యా! ఈ మధ్యాహ్నసమయమున తామెక్కడనుండి వచ్చుచున్నారు.''

''విప్రా! నేను శ్రమణగౌతముని వద్దనుండి వచ్చుచున్నాను.''

''ఆర్యా! వాత్స్యాయనా! శ్రమణగౌతముని ప్రజ్ఞాపాండిత్యములను గూర్చి నీ కేమైన తెలియునా?''

''శ్రమణగౌతముని ప్రజ్ఞాపాండిత్యముల నెఱుంగుటకు నేనెంత వాడను?''

''ఓహో! గొప్పగా పొగడుచున్నావే?''

''ఎంతపొగడినను తక్కువయే. అతడు దేవమానవులలో శ్రేష్ఠుడు.''

''వాత్స్యాయనా! నీవు యేమెఱింగి చెప్పెదవు?''

''భూసురా! వినుము. ఏనుగులను పట్టువాడు అరణ్యములోనికిబోయి అందందు దిరుగుచు పెద్దపెద్దవియగు హస్తిపాదచిహ్నములను ఒకచోచూచి అచ్చట తిరిగిన యేనుగు చాలగొప్పదని ఊహించుచున్నాడు. అట్లే నేనును శ్రమణగౌతముని విషయమున నాలుగు పదములను జూచితిని. తద్ద్వారా అతడు భగవంతుడు సమ్యక్ సంబుద్ధుడని, అతని ధర్మము స్వాఖ్యాతమైనదని అతని శిష్యసంఘము సుప్రతిపన్న మని నిశ్చయించుకొంటిని. ఆ నాలుగు యేమిటో చెప్పెదను వినుము.

ఇవి నా అనుభవములోని మాటలు. ఒక్కొక్కపుడు వాదవివాదములందు ఆరితేఱిన దిట్ట, సునిసితమై డేగచూపువంటి ప్రజ్ఞ కలవాడు క్షత్రియ పండితు డొకానొకడు శ్రమణగౌతమునితో వాదము జేయుదునని పాతాళ ప్రశ్నలను యేర్చి పెట్టుకొని భగవంతుని వద్దకు వచ్చును. అచ్చటికివచ్చి బుద్ధదేవుని ధర్మోపదేశములను

---

(1) అ. ని. అ. క. 2 - 4 - 4. (2) మ. ని. 1 - 3 - 7

విని సందర్శితుడై సమాదపితుడై సముత్తేజితుడై సంప్రశంసితుడై ప్రశ్నలనే మఱచి పోవును. ఇక వాదించుట యెక్కడిది? చివరకు శిష్యుడై పోవును. ఈ మొదటి పద మును జూచి అతడు భగవంతుడు సమ్యక్ సంబుద్ధుడని, అతని ధర్మము స్వాఖ్యాత మని, అతని శిష్యసంఘము సుప్రతిపన్నమని నిశ్చయించుకొంటిని.

అట్లే మఱియు ఒక్కొక్కపుడు బ్రాహ్మణపండితు డొకానొకడువచ్చి చివరకు శిష్యుడై పోవుచున్నాడు. ఇది రెండవపదము. దీనిని బట్టియు నేను నిశ్చయించు కొంటిని. మఱియు నొక్కొక్కప్పుడు వైశ్యపండితు డొకానొకడు వచ్చి చివరకు శిష్యుడై పోవుచున్నాడు. ఇదిమూడవ పదము. దీనినిబట్టియు నేను నిశ్చయించు కొంటిని. ఇంకను ఒకానొక సమయమున ప్రవ్రజితుడగు శ్రమణ పండితు డొక్కొ క్కడువచ్చి ప్రశ్నలనే మఱచి భగవంతునివలన ప్రవ్రజ్యను పొంది ఉపసంపన్నుడై యిట్లు వాపోవును. ''అయ్యో! ఇన్నాళ్ళు మేము శ్రమణులము కాకకూడా శ్రమణులమని ప్రగల్భములు పల్కితిమి. బ్రాహ్మణులము కాకకూడా బ్రాహ్మణులమని రజ్జులు ప్రేలితిమి. అర్హత పదమును పొందకనే అర్హతులము మేమని బడాయీలు కొట్టితిమి. బుద్ధభగవంతుని దయతోనిపుడు శ్రమణులమైతిమి. బ్రాహ్మణులమైతిమి. అర్హతుల మునైతిమి.'' వారి యీ మాటలను విని శ్రమణగౌతముని నాల్గవపదమును దర్శించి నేను నిశ్చయించుకొంటిని.

ఇట్లు గ్గడించుచున్న పిలోతిక పరివ్రాజకుని వచనములు విని జానుశ్రోణి బ్రాహ్మణుడు రథమునుండి దిగి భగవంతుడున్న వైపునకు చేతులెత్తి మ్రొక్కి ''నమోతస్య భగవతో అర్హతో సమ్యక్ సంబుద్ధస్య'' (అర్హతుడును సమ్యక్ సంబుద్ధుడు నగు ఆ భగవంతునకు నమస్కారము) అని ముమ్మాఱు పలికి అతని దర్శించెదనని రథమెక్కి పోయెను.

పోవదగి యున్నంతకు రథమెక్కిబోయి ఆపై కాలినడకన భగవంతుని దాపు కరిగి సమ్మోదన మొనర్చి యొక్కెడ గూర్చొనెను. కూర్చొని తనకును పిలోతిక పరివ్రాజకునకును నడచిన ప్రసంగమును సుగతున కెఱింగించెను. ఆ మాటలను విని బుద్ధదేవు డిట్లనెను.

''బ్రాహ్మణా! హస్తి పదమును గూర్చిన ఉపమానము అంతటితో పూర్తికా లేదు. విస్తరించి చెప్పెదను. వినుము. తెలివిగల నాగవణికుడు (యేనుగులను బట్టి అమ్మువాడు) అరణ్యములోనికి ప్రవేశించి గొప్పగొప్ప అడుగుజాడలను జూచినంతనె యిది గొప్ప యేనుగని తలంపడు. ఎందుకన అడవులలో వామకి యనెడి ఆడయేను

గుల జాతి యొకటి గలదు. వాటి యడుగులు పెద్దపెద్దవి. ఆ నాగవణికుడు మఱింత ముందుకుబోయి మఱొకచోట ముందటికంటె పెద్దవియగు అడుగు జాడలను చూడగలడు. కాని నేర్పరియగువాడు ఆ పాద చిహ్నములనుబట్టి ఆ యేనుగు గొప్పదని విశ్వసింపడు. కారణమేమియన కాంతారములయందు 'కాలారిక' మను ఒకానొక ఆడయేనుగుల జాతి యుండును. ఆ పదచిహ్నము దానిదై యుండ నోపు నని తలంచును. ఇంకను మఱియొకచోట ముందటికంటె విశాలమును విస్తృత మునునగు చరణచిహ్నముల గాంచును. అంతటితో నది యొక మహానాగము యొక్క అడుగైయుండునని చతురుడగు వాడు నమ్మడు. ఏలననిన విపినములందు 'కరేణుక' లనెడి ఒకానొక జాతి ఆడయేనుగు లుండుటగలదు. ఆ నాగవణికుడు మఱియు వెదకి ఒకానొకచోట ఒడ్డు పొడువు బలము తూకమును గల్గి మంచి దంతములతో నొప్పారి చెట్టు కొమ్మలను దినుచు నడుచుచునో నిలువబడియో లేదా పరుండియో నుండు మహాగజమును చూచి ఇదియె నాకు కావలసినదని అపేక్షించును.

బ్రాహ్మణా! వినుము. తథాగతుడు అర్హతుడు సమ్యక్ సంబుద్ధుడు విద్యాచ రణ సంపన్నుడు సుగతుడు లోకవిదుడు అనుత్తరుడు పురుషదమ్యసారథి దేవమను ష్యశాస్త బుద్ధభగవంతుడు లోకములో ఉత్పన్నమైనాడు. అతడు దేవమార బ్రహ్మ సహిత లోకమునకు, శ్రమణబ్రాహ్మణ దేవమనుష్య సహితమగు ప్రజకు తాను స్వయ ముగ నెఱింగి తెలుపుచున్నాడు. ఆదికల్యాణము మధ్య కల్యాణము అంత్యక ల్యాణ మునగు ధర్మమును అతడు ఉపదేశించును. అతని బ్రహ్మచర్య చరణము అర్థసహిత మును వ్యంజనసహితమును కేవలమును పరిపూర్ణమును పరిశుద్ధమును నైనది. ఆ ధర్మమును గృహపతియైనను గృహపతిపుత్రుడైనను లేదా మఱియు నిమ్నకుల మున పుట్టినవాడైనను వినగల్గుచున్నాడు. విని శ్రద్ధాలాభమును పొందగల్గు చున్నాడు. పొంది యిట్లు యోచించుచున్నాడు. ''గృహవాసము ముఱికి కూపము. ప్రవ్రజనము విశాలమైదానము. పరిశుద్ధమగు బ్రహ్మచర్యచరణము గృహవాసికి అందని పండు. కావున నేను తలయు గడ్డమును గొఱిగించుకొని కావిబట్టలను దాల్చి సంన్యాసి నెందుకుగారాదు?'' ఇట్లు దలంచి వాడు భోగభాగ్యములను బంధు బలగమును పరిత్యజించి ప్రవ్రజితుడగుచున్నాడు. మరియు భిక్షుదీక్షనుగొని ప్రాణాతిపాతమును వదలి దండత్యాగియు శస్త్రత్యాగియు లజ్జావంతుడును దయాళువును సర్వభూత హితరతుడునై విహరించుచున్నాడు. అదిన్నాదానము (చోరవృత్తి) ను వీడి అస్తేయావ లంబి దత్తప్రతికాంక్ష పవిత్రాత్ముడునై విహరించు చున్నాడు. బ్రహ్మచర్యమును ధరించి గ్రామ్యధర్మమగు మైథునమును వర్జించి పామరజన సంగతినొల్లక విహరించుచు

న్నాడు. మృషావాదమును వీడి సత్యవాదియు సత్యసంధుడును విశ్వాసపాత్రుడునై విహరించుచున్నాడు. చాడీలు చెప్పుటమాని తగవులను తంటాలను సుతరాం పరిత్యజించి కలుపుగోలుతనమును సమన్వయభావమును కలిగి విహరించుచున్నాడు. కఠోర వచనములుమాని కర్ణసుఖములును ప్రేమణీయములును హృదయంగమములును సభ్యసంయుతులును బహుజన ప్రియములునగు వాక్కులతో విహరించుచున్నాడు. వదరుబోతు తనమును వర్జించి కాలవాదియు భూతవాదియు అర్థవాదియు ధర్మవాదియు వినయవాదియునై తాత్పర్య సహితమును పర్యంత సహితమును అర్థసహితమును నగు ప్రసంగముతో విహరించుచున్నాడు.

మఱియు బీజసముదాయము భూతసముదాయముల వినాశమునుండి విరతుడగుచున్నాడు. ఏకాహారియై అపరాహ్ణ భోజనమును మానుచున్నాడు. మాలాగంధ ములను మండన విభూషణములను వదలుచున్నాడు. ఉచ్ఛశయనములను, బంగారు వెండిని గ్రహించుటను పచ్చిధాన్యమును దినుటను మానుచున్నాడు. స్త్రీకుమారికలకు దాసీదాసులకు యిండ్లువాకిండ్లకు గుఱ్ఱాలేనుగులకు ఆవులు ఎద్దులకు గొడ్డుగోదలకు దూరుడగుచున్నాడు. దూతపనిచేయుట క్రయవిక్రయములాడుట లంచముగొనుట వంచనచేయుట ఇవన్నియు వానికి గిట్టని కార్యములు.

కడుపునకన్నము కాయమునకు బట్ట – అంతమాత్రమున సంతృప్తివహించి అందందు విహరించుచున్నాడు. పక్షి తనఱెక్కలనువలె వాడును తనసామానును తానె గొంపోవుచుండును. ఇట్లు ఆర్యశీలుడు విహరించుచున్నాడు.

కంటితో రూపమును జూచునుగాని నిమిత్తమును అనువ్యంజనమును ఆశ్రయింపడు. కంటిని కాపాడుకొన లేనివానిని రాగద్వేషములు సతాయించును. అందుచే వాడు చక్షురింద్రియమును రక్షించుచున్నాడు. అట్లే తక్కిన యింద్రియములను నిగ్రహించి ఆర్యశీలుడు నిర్మలసుఖమును పొందుచున్నాడు.

గమనాగమనములందు ఆలోకనవిలోకనములందు ఆకుంచన ప్రసారణములందు ఆహారనిద్రలయందు పాత్రచీవరధారణమందు మలమూత్రత్యాగమందు వెయ్యేల కనుచు వినుచు తినుచు దిరుగుచు సర్వకాల సర్వావస్థలయందును సంప్రజన్యయుక్తుడై యెఱుకతో గూడినవాడై శీలస్కంధము ఇంద్రియ సంవరము స్మృతిసంప్రజన్యమును తన్నాశ్రయింప అడవియందో చెట్టుచాటుననో కొండగుహలలోనో గడ్డివాములక్రిందనో శ్మశానవాటికనో కాలక్షేపము జేయుచు లోభమును జయించి ద్రోహమునకు స్వస్తిజెప్పి చిత్తాలస్యముతోడి పొత్తుడిగి ఔద్ధత్యమును

సాగనంపి విచికిత్సకు దండమువెట్టి కుశలధర్మములు సర్వోసర్వము తనవైయుండ అది యిది యనక ఆర్యశీలుడు విహరించుచున్నాడు.

ఇట్లు పైన పేర్కొనిన నీవరణముల నైదింటిని చిత్తమునుండి దొలగించి ఉపక్లేశ ములను దుర్బలము జేయుటకై వితర్కవివేకముతో విచారవివేకముతో గూడినదియు ప్రీతిసుఖము గలదియునగు ప్రథమధ్యానమును బొంది విహరించుచున్నాడు. ఇది మొదటిపదము. ఇదియు తథాగతసేవితమును తథాగత రంజితమునైనదియే. కాని యీ గుర్తును జూచియే ఇతడు సమ్యక్ సంబుద్ధుడని యితని ధర్మము స్వాఖ్యాతమని యితని సంఘము సుప్రతిపన్నమని ఆర్యశ్రావకుడు తలంచడు.

వితర్కవిచారములు ఉపశమింప చిత్తమునకు ప్రసన్నతయు యేకాగ్రతయు లభింప భిక్షువు ద్వితీయధ్యానమును పొందుచున్నాడు. అదిగూడ తథాగతుని పదమే. దానిని బట్టి గూడ ఆర్యశ్రావకుడు విశ్వసింపడు.

పిమ్మట ప్రీతి విరాగములందు ఉపేక్ష జనింప స్మృతి సంప్రజన్యములతో గూడి కాయసుఖమును పొంది భిక్షువు తృతీయధ్యానము నధిగమించుచున్నాడు. అదియుగూడ నొకపాదమే. అంతమాత్రమున ఆర్యశ్రావకుడు నమ్మడు.

సుఖదుఃఖములు సౌమనస్య దౌర్మనస్యములు గతించినంత భిక్షువు చతుర్థ ధ్యానమును పొందుచున్నాడు. అది నాల్గవపదము. ఆర్యశ్రావకు డంతటితో ఆగడు.

భిక్షువు మృదువును మలరహితమును, స్థిరమును పరిశుద్ధమును నగు చిత్త మును వంచి పూర్వజన్మస్మృతిజ్ఞానమును సంపాదించుచున్నాడు. గతించిన కోటాను కోట్ల జన్మలను సృష్టులను ప్రళయములను దర్శించుచున్నాడు. బ్రాహ్మణా! ఇది కూడ తథాగతుని పదమనియె జెప్పబడును.

మఱియు చిత్తము నాకర్షించి అమానుష దివ్యచక్షువును బొంది, జననమరణ ప్రవాహమునందు దొర్లి సుఖదుఃఖ కల్లోలముల సుడివడుచున్న ఆర్తజీవకోటిని దర్శించుచున్నాడు. కర్మజీవులయొక్క పడుబాట్లను గమనించుచున్నాడు. ''ఈ జీవులు కాయముతో వాక్కుతో మనస్సుతో పరిపరి దురాచారము లాచరించి పెద్దలను నిందించి మిథ్యాదృష్టి వహించి దుర్గతులను బొందుచు దురవస్థలనందు చున్నారు. మఱి ఈ జీవులు కాయముతో వాక్కుతో మనస్సుతో పెక్కులు సదాచా రము లాచరించి పెద్దలను బూజించి సత్యదృష్టిని వహించి సద్గతులను పొందుచు సంతసించుచున్నారు.'' ఇట్లు దివ్యచక్షుఃజ్ఞానముతో భిక్షువు ప్రాణికోట్లను వీక్షించు చున్నాడు. బ్రాహ్మణా! ఇదికూడ తథాగతుని పదమని చెప్పబడును.

ఇట్లు చిత్తము సమాహితమగుడు ''ఇది దుఃఖము - ఇదిదుఃఖసముదయము - ఇది దుఃఖనిరోధము - ఇది దుఃఖనిరోధ గామినీ ప్రతిపదము'' అని యథార్థ జ్ఞానమును పొందుచున్నాడు. వానికి కామాస్రవములు లేవు. భవాస్రవములు తొలగినవి. అవిద్యాస్రవ ములు నశించినవి. జన్మబంధములు బాసినవి. బ్రహ్మచర్య ఫలము సిద్ధించినది. అతడు కృతకృత్యుడు. వానికి చేయదగినది మిగిలిలేదు. విముక్తుడైనాడు. బ్రాహ్మణా! ఇదికూడ తథాగత పదమే. అతడు భగవంతుడు సమ్యక్ సంబుద్ధుడని, అతని ధర్మము స్వాఖ్యాతమని, అతని శిష్యసంఘము సుప్రతిపన్నమని ఆర్యశ్రావకుడు విశ్వసించుచున్నాడు. హస్తిపదమును గూర్చిన ఉపమానము విస్తార ముగ జెప్పితిని.

భగవంతుని యా మాటలు విని జానుశ్రోణి బ్రాహ్మణు డిట్లనియె. ''భంతే! ఆశ్చర్యము. అబ్బురము. బుద్ధుని - ధర్మమును - భిక్షుసంఘమును శరణుజొచ్చుచు న్నాను. నన్ను అంజలి బద్ధశరణాగత ఉపాసకునిగ అనుగ్రహింపుడు.''

## ౧౬

## మహాహస్తిపదోపమ సూత్రము (వి. పూ. 458)

★ భగవంతుడు బుద్ధుడు శ్రావస్తియందు అనాథపిండకుని జేతవనారా మమునందు విహరించుచున్నాడు. ఆ సమయమున నొకనాడు సారిపుత్రుడు భిక్షు వుల నామంత్రించి సంబోధించి యిట్లనియె.

''ఆయుష్మంతులగు భిక్షువులారా! అడవిలోని మృగకోటియొక్క పాదముల న్నియు హస్తిపాదములోనికి అడగుచున్నవి. గొప్పతనమందు యేనుగు అడుగును ముందు జెప్పవలెను. అట్లే లోకమునందలి కుశల ధర్మములన్నియు ఆర్యసత్య చతుష్టయమున నొదుగుచున్నవి. ఏమిటా ఆర్యసత్యములు? దుఃఖము ఆర్యసత్యము. దుఃఖసముదయము ఆర్యసత్యము. దుఃఖనిరోధము ఆర్యసత్యము. దుఃఖనిరోధగా మినీ ప్రతిపదము ఆర్యసత్యము.

దుఃఖము ఆర్యసత్యమననేమి? జన్మము దుఃఖము జరయు దుఃఖము. చావు దుఃఖము. ఏడ్చుట మొత్తుకొనుట, చింతించుట సంతాపించుటయు దుఃఖము. కోర్కె ఫలింపకున్న దుఃఖము. ఒక్కమాటలో ఉపాదానస్కంధము లయిదును దుఃఖము.

---

★ మ. ని. 1 - 3 - 3.

ఆయుష్మంతులారా! పంచఉపాదానస్కంధములనగానేమి? రూపము, వేదన, సంజ్ఞ, సంస్కారము, విజ్ఞాన మనునవైదును ఉపాదానస్కంధములు. రూపఉపాదన స్కంధ మనగానేమి? నాలుగు మహాభూతములతో ఏర్పడురూప ములు. నాలుగు మహాభూతము లేవేవి? పృథివీ ధాతువు, జలధాతువు, అగ్నిధాతువు వాయుధాతువు ననునవి. పృథివీధాతువన నెట్టిది? పృథివీధాతువు ఆధ్యాత్మికమును భౌతికమునని రెండువిధములు. శరీరమునందు కఠినభాగములైయుండు ఎముకలు రోమములు గోళ్ళు పండ్లు ప్రేవులు పురీషము ఇదంతయు ఆధ్యాత్మిక పృథివీధా తువు. రెండవ విధము బైటగానవచ్చు భౌతిక పృథివీధాతువు. ఇట్టి పృథివీధాతువును జూచి ''ఇది నాదిగాదు. నేనును గాదు. నా యాత్మయుగాదు'' అనిచక్కగ నెఱుంగ వలయును. ఇట్లెఱింగినవాడు పృథవీధాతువునుండి నిర్వేదము (ఉదాసీనము)ను పొందుచున్నాడు.

బైటి భౌతిక పృథివీధాతువుకూడ ఒకప్పుడు నశించుట గలదు. ఇంతటి మహా వస్తువునకే నాశనము సిద్ధమైనపుడు ఈ క్షుద్రశరీరము మాట యేమిటి? తృష్ణావివశుడై నేను – నాదియనుట కేవలము మూర్ఖ ప్రలాపము.

ఇతరులచే నిందింపబడినపుడు భిక్షు విట్లు దలంచుచున్నాడు. ఈ దుఃఖరూప మగు వేదన నాకు శ్రోత్ర సంస్పర్శమున కలిగినది. స్పర్శములు అనిత్యములు. వేదనలును అనిత్యములే. సంజ్ఞలు అనిత్యములు. సంస్కారములు అనిత్యములు. విజ్ఞానము లనిత్యములు. అని భావించి చిత్తమును ధాతురూప విషయములనుండి యెడము చేయుచున్నాడు. చేతితో గొట్టినను రాళ్ళతో వేసినను కట్టెతో మోదినను కత్తితో నఱికినను అట్లే దలంచి అసంగుడగుచున్నాడు. ఆయుష్మంతులారా! ఒకప్పుడు భగవంతుడు బుద్ధుడు జెప్పినమాటను స్మరింపజేతును. వినుడు:– ''భిక్షువులారా! అంగాంగములను అంపములతో గోసినను యెవని వీర్యము చెడదో, విస్మరణశక్తి పడదో, కాయము కంపింపదో, చిత్తము త్తల మొందదో వాడే నా అను శాసనము పాలించువాడు. అటుగాక మనస్సును కళవళపెట్టినవాడు నా శాసనము నకు ప్రతికూలుడు.''

ఆయుష్మంతులారా! బుద్ధునకును ధర్మమునకును సంఘమునకును అనుకూలుడై యుండియు యేభిక్షువునకు కుశలసంయుక్తమగు ఉపేక్ష (బోధి – అంగము) సంభవింపదో వాడు సంతాపించుచుండును. అట్టి ఉపేక్షపొందినవాడు సంతసించుచుండును. వాడే ఘనుడు.

జలధాతువుకూడ అంతరము బాహ్యమని రెండు విధములు. శరీరములో పిత్తము శ్లేష్మము చీము నెత్తురు చెమట మెదడు జొల్లు కన్నీరు చీమిడి గుమిలి మూత్రము మొదలగు జలభాగమంతయు లోపలిది. ఈ జలధాతువును 'నేను – నాది – నా యాత్మ' యని తలంపక భిక్షువు దానినుండి చిత్తమును విరక్తము జేయుచున్నాడు.

బాహ్యజలధాతువు ప్రపంచమునంతటిని ముంచి వేయజాలునదయ్యు ఒకానొకప్పుడు సమూలముగ నశించును. ఇక యీ చిన్నదేహము మాట యేమి? తృష్ణావివశుడై 'నేను – నాది' యనుట మూఢప్రలాపము. ఈ జలధాతురూప సంబంధ మున కల్గెడి వేదనలను, సంజ్ఞలను సంస్కారములను విజ్ఞానములను అనిత్య ములని యెఱింగి విషయములనుండి చిత్తమును వేఱు జేయుచున్నాడు. వాడే ఘనుడు.

అగ్ని ధాతువుకూడ లోపల – వెలుపల నని రెండు తెగలు. ఆ రెంటి అనిత్య తను పైవాటివలెనె గ్రహించి విహరించు భిక్షువు వాడే ఘనుడు.

వాయుధాతువుకూడ అంతర్బాహ్యములతో రెండుభంగులు, ఆ రెండింటి అనిత్యతను పైవలె పరిభావించి విషయములనుండి చిత్తమును వేఱుజేసి ఉపేక్షతో కూడిన భిక్షువు, వాడే ఘనుడు.

ఆయుష్మంతులారా! మట్టితోను కట్టెలతోను కప్పబడి ఆకసము యిల్లనిపించు కొన్నది. ఎముకలు చర్మముతో చుట్టబడి అదియె రూపమనిపించుకొన్నది. శరీరము నందలి చక్షువు (శ్రోత్రము – ఘ్రాణము – జిహ్వ – చర్మము – మనస్సు) అవికృతమై యున్నంతకు బాహ్యరూపము లెదుటకురావు. విషయజ్ఞానము కలుగదు. అందుకు సంబంధించిన విజ్ఞానభాగ ముదయింపదు. ఎప్పుడైతే శరీరమునందలి చక్షువు (శ్రోత్రము – ఘ్రాణము – జిహ్వ – చర్మము – మనస్సు) వికృతమగుచున్నదో అప్పుడే బాహ్యరూపములు గోచరించును. విషయజ్ఞాన ముదయించును. అందుకు సంబంధించిన విజ్ఞాన భాగమును ప్రాదుర్భవించును.

చక్షువిజ్ఞానముతో కూడిన రూపమునకు రూపఉపాదానస్కంధమని పేరు. చక్షువిజ్ఞానముతో కూడిన వేదనకు వేదనా ఉపాదానస్కంధమనిపేరు. చక్షువిజ్ఞాన ముతో కూడిన సంజ్ఞకు సంజ్ఞా ఉపాదానస్కంధమనిపేరు. చక్షువిజ్ఞానముతోకూడిన సంస్కారమునకు సంస్కార ఉపాదానస్కంధమనిపేరు. చక్షువిజ్ఞానముతో గూడిన

విజ్ఞానమునకు విజ్ఞాన ఉపాదానస్కంధమని పేరు. భిక్షువు యిట్లు వీటినెఱుంగుచున్నాడు. ఇట్లు యీ ఉపాదానస్కంధ పంచకమును సంగ్రహించుచున్నాడు. దీనినే భగవంతుడు బుద్ధుడు యిట్లు చెప్పియున్నాడు. ''యెవడు ప్రతీత్యసముత్పాదము నెరుగునో వాడు ధర్మము నెఱుగుచున్నాడు. ఎవడు ధర్మము నెఱుగుచున్నాడో వాడు ప్రతీత్యసముత్పాదమును తెలిసికొనుచున్నాడు. ఈ ఉపాదానస్కంధము లయిదును ప్రతీత్యసముత్పన్నములు. వీటియందు కలిగెడి ఆసక్తియె దుఃఖసముదయము. ఆ ఆసక్తిని వదలుటయె దుఃఖనిరోధము. ఇంతవట్టు యెరిగినవాడు ఘనుడు.''

ఆయుష్మంతుడు సారిపుత్రు డిట్లు చెప్పినంత భిక్షువులందఱును అతని నభినందించిరి.

## ౧౭

## ఆశ్వలాయనసూత్రము (వి. పూ. 458)

★ భగవంతుడు బుద్ధుడు శ్రావస్తియందు అనాథపిండకుని ఆరామమగు జేతవనమునందు విహారము జేయుచుండెను. ఆ సమయమున నానాదేశవాసులగు అయిదు నూర్వురు బ్రాహ్మణులేదో పని మీద శ్రావస్తికి వచ్చియుండిరి. వారందఱును గుమిగూడి యిట్లు తలపోసిరి. ''శ్రమణ గౌతముడు చాతుర్వర్ణ్యశుద్ధిని ఉపదేశించుచున్నాడు. ఈ విషయమునందాతనితో వాదము చేయగలవాడెవ్వ'' డని యోచించిరి. శ్రావస్తియందు ఆశ్వలాయనుడను తరుణమాణవకుడు బ్రాహ్మణుడొకడు గలడు. ఆతడు వేదములందు వేదాంగములందు ఇతిహాసములందు కళలయందు గంభీర పండితుడు. అందు కతడు తగినవాడు. వానింబంపుదమని తలంచుకొని వారందఱును ఆశ్వలాయనుని చేరబోయి యిట్లనిరి.

''ఆశ్వలాయనా! శ్రమణగౌతముడు కేవలము బ్రాహ్మణులకే గాక కడమ నాల్గువర్ణములకును ధ్యానాదికములచే పాపశుద్ధిని బోధించుచున్నాడు. ఈ విషయమున నీవతనితో వివాదము చేయవలెను.''

''అయ్యలారా! శ్రమణగౌతముడు ధర్మవాది. అట్టివానితో వాదించుట దుష్కరము. అది నాకు సాధ్యముగాదు.'' అని ఆశ్వలాయనుడు చెప్పెను గాని వారు సమ్మతించలేదు. మరియు మరియు నిర్బంధించిరి. చివరకు వారి నిర్బాకము

★ మ. ని. 2 - 5 - 3.

బడలేక ఆశ్వలాయను డిట్లనియె. ''శ్రమణగౌతముని గెలుచుట దుర్ఘటము. అయి నను మీ మాటను త్రోసిపుచ్చ లేక పోవుచున్నాను.''

బ్రాహ్మణ గణముతోకూడి ఆశ్వలాయనుడు భగవంతుడున్నెడకువచ్చి సమ్మోదన మొనర్చి యొక్కెడ గూర్చొని యిట్లనెను.

''గౌతమా! 'బ్రాహ్మణు డెక్కువజాతివాడు. తక్కినవారు తక్కువవారు. బ్రాహ్మణుడు పరిశుద్ధుడు. తక్కినవారు గాదు. బ్రాహ్మణుడు బ్రహ్మకు ఔరస పుత్రుడు. ముఖమున కలిగినవాడు. బ్రహ్మకు వారసుడు' అని యీ బ్రాహ్మణులు చెప్పుదురు. మీ అభిప్రాయమేమి?''

ఆశ్వలాయనా! బ్రాహ్మణ స్త్రీలుకూడ ఋతుమతులై గర్భవతులై ప్రసవించుచున్నారు. అట్టియెడ అందటివలె యోనినుండి బుట్టి బ్రాహ్మణుడు శ్రేష్ఠుడని యేమేమో పల్కుట యెట్లుదగును?''

''గౌతమా! కాని వీరందఱును అట్లు చెప్పుచున్నారు.

''ఆశ్వలాయనా! [1] యవన [2] కాంభోజ దేశములలోను యితర సీమాంత దేశములలోను ఆర్యులనియు దాసులనియు రెండువర్ణములు గలవని నీ వెఱుగుదువా? వారిలో ఆర్యులు దాసులగను, దాసులు ఆర్యులుగను కాగల్గుదురా?

''అవును. కాగల్గుదురు.''

''అటులైన యీ బ్రాహ్మణు లిట్లు చెప్పుటకు వీరికేయాధారము గలదు. ఆశ్వలాయనా! ప్రాణిహింస, చోరత్వము దురాచారము కల్లలాడుట కటుభాషణము లోభము ద్వేషము మిథ్యాదృష్టియు కల్గి వర్తించువారు యితర జాతులైనచో చచ్చి నరకమునకు బోవుటయు, బ్రాహ్మణుడె అట్టివాడైనచో నరకమునకు పోకుండటయు గలదా?''

''గౌతమా! అట్లు లేదు. ఎవ్వరైనను పోవలసినదే.''

''ఆశ్వలాయనా! అట్టి దురాచారములనుండి విరతుడైనవాడు సత్యవాదియగువాడు క్షత్రియుడు వైశ్యుడు శూద్రుడునైనచో స్వర్గమునకు బోవ వీలు లేదా?''

''సదాచారుడగువా డెవ్వడైనను పోగలడు.''

(1) తుర్కిస్తానము. (2) ఈరాన్

''ఆశ్వలాయనా! పవిత్రజలముగల నదిలోనికి వెళ్ళి బ్రాహ్మణుడొక్కడు మాత్రము మైలను కడుగుకొన నర్హుడనియు తక్కినజాతుల వారనర్హులనియు చెప్ప పొసగునా?''

''గౌతమా! నదీజలముల ముటికి కడుగుకొనుటకు నాల్గువర్ణముల వారికిని హక్కు ఉన్నది.''

''ఆశ్వలాయనా! బ్రాహ్మణ గృహమున మండు అగ్ని, కాంతితో ప్రకాశించుటయు, చండాలగృహమున మండెడి అగ్ని, కాంతిలేకుండుటయు నైందెనగలదా?''

''అగ్ని యెందున్నను ప్రకాశవంతమే.''

''ఆశ్వలాయనా! మరి యెందుకీ బ్రాహ్మణు లిట్లు బలుకుట. వినుము. క్షత్రియ కుమారుడు బ్రాహ్మణకన్యతో సహవాసము చేసినచో వారికి పుత్రుడు కలిగిన తల్లిని అనుసరించియో తండ్రిని అనుసరించియో బ్రాహ్మణుడనిగాని క్షత్రియుడనిగాని చెప్పవలసియున్నదా?''

''గౌతమా! చెప్పవలయును.''

''ఆశ్వలాయనా! బ్రాహ్మణకుమారుడు క్షత్రియకన్యవలన పుత్రుని గన్నచో తలిదండ్రులనుబట్టి వానిని బ్రాహ్మణుడనియో క్షత్రియుడనియో చెప్పవలెనా?''

''గౌతమా! చెప్పవలయును.''

''ఆశ్వలాయనా! గుఱ్ఱమునకును గాడదకును సంయోగము కల్గినచో కల్గెడి బిడ్డను 'గుఱ్ఱ' మని గాని గాడిద' ని గాని చెప్పవచ్చునా?''

''గౌతమా! చెప్పరాదు. దానియందు భేదమున్నది. దానిని కంచరగాడిద యందురు. పైన చెప్పినచోట్ల యిట్టి భేదము లేదు.

''ఆశ్వలాయనా! ఇచ్చట యిద్దరు స్నేహితులు గలరు. ఒకడు ఉపనీతుడై గురుకులమునందు అధ్యయనము చేయువాడు. మరియొకడు ఉపనీతుడు కాలేదు. విద్యాహీనుడుగూడ. వీరిద్దరిలో యెవ్వనికి ప్రథమ భోజన మివ్వదగును.''

''గౌతమా! ఉపనీతుడును విద్యావంతుడు నగువాని కివ్వవలెను. అనుపనీతునకు విద్యాహీనున కిచ్చుటలో మహాఫలము లేదు.''

''ఆశ్వలాయనా! అట్లే యిద్దరు మిత్రులున్నా రనుకొనుము. ఒకడు ఉపనీతుడు; విద్యావంతుడును; కాని దురాచారుడు, పాపకర్ముడు. మరియొకడు అనుపనీతుడు విద్యాహీనుడు. అయినను శీలవంతుడు కల్యాణధర్ముడు, వీరిరువు రిలో యెవ్వనికి పుణ్యకార్య ములందు ప్రథమ భోజన మివ్వవలెను.''

''గౌతమా! శీలవంతునకే యివ్వవలెను. దుశ్శీలున కొసగుటచే సత్ఫలము లభింపదు.''

''ఆశ్వలాయనా! తొలుత జాతికి గొప్పతన మిచ్చితివి. తర్వాత విద్యకు పెద్దరిక మిచ్చితివి. ఇప్పుడు శీలములకు శ్రేష్ఠత్వమంగీకరించుచున్నావు. అయ్యా! నేను జెప్పునది అంతేగాదు!''

తెల్లబోయి ఆశ్వలాయనుడు మిన్నక కూర్చొని యున్నాడు. భగవంతుడు మరియు నిట్లనియె.

''ఆశ్వలాయనా! పూర్వకాలమునందు అరణ్యములో యేడుగురు బ్రాహ్మణ ఋషులు పర్ణశాలలు వేసికొని నివసించుచుండిరి. ఒకనాడువారి హృదయములందు మేము బ్రాహ్మణులము. శ్రేష్ఠుల''మనెడి దురహంకారము పొటకరించినది. దాని నెఱింగి అసిత దేవలుడను ఋషి తలను గొఱిగించుకొని యెఱ్ఱబట్టలను గట్టుకొని పాదుకలను బెత్తమును ధరించి వారి పర్ణశాలల ముంగిట యిటు నటు పచారు చేయుచు 'ఈ బ్రాహ్మణఋషు లెటుబోయిరి. ఎచ్చటబోయిర' ని అఱచుచుండెను. ఆ బ్రాహ్మణు లేడ్వురును ఆ కేకలకు కినిసి 'శాపమిత్తు' మని 'శూద్రా! భస్మము కమ్ము' ని పలికిరి. పదింబది వారు శాపమిచ్చుకొలది అతడు మఱింత దిట్టముగ నున్నా[illegible] బ్రాహ్మణులు నివ్వెఱగంది ''ఔరా! మనతపములు వ్యర్థమైనవాయేమి? ముందటవలె శాపములు ఫలించుట లేదెందు'' కని చింతించుచున్నంతలో దేవలుడు వారితోనిట్లనియె.

''బ్రాహ్మణ ఋషులారా! చింతింపకుడు. మీ తపస్సులు వ్యర్థముగా లేదు శాంతించండి. నాపైగల కోపమును వదలి పెట్టండి.''

''అయ్యా! వదలితిమి. తామెవ్వరో జెప్పుడు?''

''విప్రర్షులారా! అసితదేవలుడను పేరును వినియున్నారా? అతడే నేను.''

ఆశ్వలాయనా! అంతట ఆ యేడ్వురు బ్రాహ్మణులచేతను పూజితుడై అసిత దేవలుడు వారితో నిట్లనియె. ''విప్రులారా! మీ హృదయములందు 'మేము బ్రాహ్మణులము గొప్పవార'మని తలంచితిరి గదా?''

''అయ్యా! అవును.''

''మీతల్లి బ్రాహ్మణుని పొందినదో అబ్రాహ్మణుని పొందినదో మీకు తెలియునా?''

'తెలియదు'

''మీ వంశమునందు పూర్వమునుండియు సాంకర్యము కల్గలేదని దృఢముగ జెప్పుదురా?''

'చెప్పలేము.

'గర్భమెట్లు గలుగునో యెఱుగుదురా?''

'ఎఱుగము.'

'ఋతుమతియైన స్త్రీతో పురుషుడు సంగమించినప్పుడు ఆచోట జన్మింపవలసిన జీవుడొకడు (గంధర్వుడు) ఆ గర్భమున ప్రవేశించుచున్నాడు. ఇట్లు కాంతా శోణితము, పురుషవీర్యము, జీవప్రవేశమునను మూడింటికలయికతో గర్భమేర్పడుచున్నది. ఆ జీవుడు (గంధర్వుడు) యేజాతివాడో తెలిసికొంటిరా?'

'లేదు.'

'అట్లగుచో మీ రెవరని తలంచితిరి?'

''ఆశ్వలాయనా! అసితదేవలుడడిగిన మాటకు ఆ బ్రాహ్మణులేడ్వురును మాఱు మాటాడ లేక పోయిరి. అంతటి వారియెదుట మీ ప్రజ్ఞ యెంతటిది? పోనీ; నీవేమి జెప్పెదవు?''

భగవంతుని మాటలు విని ఆశ్వలాయన మాణవకుడు సంభ్రమాశ్చర్యములు పెనగొన ''గౌతమా! ఆశ్చర్యము అబ్బురము. నన్ను సాంజలి శరణాగత ఉపాసకునిగ స్వీకరించండి'' అని ప్రార్థించెను.

# ౧౮
# మహారాహులోవాదసూత్రము - అక్షణసూత్రము
# (వి. పూ. 458)

★బుద్ధభగవంతుడు శ్రావస్తియందు అనాథపిండకుని జేతవనమునందు విహారము చేయుచున్నాడు. ఒకానొకనాడు పూర్వాహ్ణసమయమున పాత్రచీవరములను ధరించి పురములోనికి భిక్షాచరణమునకై బయల్వెడలెను. ఆయుష్మంతుడు రాహులుడును పాత్రచీవరములను గొని భగవంతుని వెంట వెంట నడచుచుండెను. ఆతని చూచి సంబోధించి సుగతు డిట్లనియె.

''రాహులా! ఈ రూపములన్నియు - భూత భవిష్యత్ వర్తమానములకు చెందినవైనను, శరీరమునకు లోనివైనను వెలివైనను, చిన్నవైనను గొప్పవైనను, మంచి వైనను చెడ్డవైనను, దవ్వులవైనను దగ్గఱివైనను అన్ని యాపములను 'ఇవి నావిగావు - ఇవి నేను గాను - ఇవి నా యాత్మగా'దని యెఱింగి భిక్షువు సత్యదర్శనుడు కావలెను.''

''భగవంతా! రూపములనేనా?''

''రాహులా! వేదనలను, సంజ్ఞలను, సంస్కారములను, విజ్ఞానములను కూడా.''

ఆ మాటలను విని రాహులుడు భిక్షకుపోవుట విరమించి వెనుకకువచ్చి శరీరమును నిట్టనిలిపి స్మృతిని యెదుట బెట్టుకొని నిమ్మళముగ నొక చెట్టుక్రింద గూర్చొనెను. కొంతవడికి భగవంతుడు వృక్షతలమున నాసీనుడైయున్న రాహులునిగాంచి పిలిచి యిట్లనియె.

''రాహులా! ప్రాణాయామ భావనను భావనజేయుము. అది మహాఫలదాయకము. మాహాత్మ్యయుతమును యున్నది.''

సాయంకాలమైనది. ధ్యానమునుండి లేచి ఆయుష్మంతుడు రాహులుడు భగవంతుడున్నెడకు బోయి దండప్రణతు లాచరించి యొకచో గూర్చొని యిట్లనెను.

''భంతే! ప్రాణాయామస్మృతి నెట్లు భావించిన, యెట్లు సాగించినచో నది మహాఫలదాయకము. మహాత్మ్యయుతమును గాగలదో?''

---

★ మ. ని. 2 - 1 - 2.

''రాహులా! అన్నిశరీరములయందును లోవైపున కఠినభాగములైయుండు వెంట్రుకలును గోళ్ళును పండ్లును యెముకలును చర్మమును మాంసమును హృదయమును ప్లీహాయకృత్తులును ప్రేవులును మలమును, ఇవియన్నియు అధ్యాత్మపృథివీ ధాతువని చెప్పబడును. ఇదిగాక బైటగానవచ్చునది బాహ్యపృథివీధాతువు. దీనిని 'ఇదినాది' యని గాని – 'ఇదినేన'ని గాని – 'ఇది నాయాత్మ'యని గాని తలంపక నిజమునెఱిగిన భిక్షువు పృథివీధాతువునుండి లెస్సగ ఉదాసీనుడై చిత్తమును విరక్తము జేయుచున్నాడు.

రాహులా! ఇట్లే ★ జలధాతువును అగ్నిధాతువును వాయుధాతువును గూర్చి కూడ 'ఇది నాదిగాదు – నేనుగాదు – నా యాత్మయు గాద'ని యెఱింగి నిజమును దర్శించి భిక్షువు ఆ ధాతువుల నుండి ఉదాసీనుడై చిత్తమును విరక్తము జేయుచున్నాడు.

రాహులా! ఆకాశ ధాతువుగూడ ఆధ్యాత్మికమని బాహ్యమని యిరు తెఱగులు. ప్రతియొక్క శరీరమునందుండు కర్ణఛిద్రములు నాసికాచ్ఛిద్రములు లోని అవకాశమంతయు ఆధ్యాత్మిక ఆకాశధాతువు. బైట కానవచ్చునదంతయు బాహ్యాకాశధా తువు. దీనినంతను 'ఇది నాదిగాదు – నేను గాదు – నా యాత్మయు గాద'ని యెఱింగి నిజమును దర్శించి భిక్షువు ఆకాశధాతువునుండి ఉదాసీనుడై చిత్తమును విరక్తము జేయుచున్నాడు.

పృథివీసమానమగు భావనను ధ్యానము జేయుము. అట్టి భావన బలపడినపుడు యెట్టి సంస్పర్శములును చిత్తమును ముట్టడింప లేవు. పృథివి, పవిత్రమును, అపవిత్రమును మలమును మూత్రమును మంచిని చెడ్డనన్నింటిని భరించుచున్నది. కోపించదు. తపించదు. కలత లేదు. అలత లేదు. రాహులా! నీవును పృథివీసమానమగు భావనను భావించుచు చిత్తమును పదిలపఱచుకొనుము.

ఇట్లే తలంచి జలసమాన భావనను భావించుచు, అగ్నిసమానభావనను భావించుచు, వాయుసమాన భావనను భావించుచు చిత్తమును పదిలపఱచుకొనుము.

ఆకాశము దేనిపైనను అధారపడదు. నీవు అట్టి ఆకాశముతో సమానమగు భావనను భావించుచువచ్చి మీదబడు విషయస్పర్శలకు గుఱికాకుండ చిత్తమును పదిలపఱచుకొనుము.

---

★ 151 వ పేజి చూడుడు.

రాహులా! మైత్రీ భావనను భావింపుము. దానిచే ద్వేషము నశింపగలదు. కరుణా భావనను భావింపుము. దానిచే హింస తొలగగలదు. ముదితాభావనను భావింపుము. దానిచే నిస్పృహవీడగలదు. ఉపేక్షాభావనను భావింపుము. దానిచే ప్రతిహింసావృత్తి యడగగలదు.

విషయదోషమును భావన చేయుము. దానిచే రాగము వదలగలదు.

విషయ – అనిత్యతను భావన జేయుము. దానిచే అహంకారము చల్లాఱ గలదు.

రాహులా! ప్రాణాయామ భావనను భావన జేయుము. అది మహాఫలప్రదము. భిక్షువు అరణ్యమున చెట్టుక్రిందనో శూన్యగృహముననో ఆసనబద్ధుడై స్మృతిని యెదుటబెట్టుకొని కూర్చొని స్మరించుచు శ్వాసను తీసికొనుచున్నాడు. స్మరించుచు శ్వాసను వదలుచున్నాడు. శ్వాసను నిడివిగ విడుచుచు 'నిడివిగ విడుచుచున్నా' నని యెఱుగుచున్నాడు. నిడివిగ తీసికొనుచు 'నిడివిగ దీసికొనుచున్నా' నని తెలిసికొను చున్నాడు. పనులన్నిటిని ననుభవించుచు ఊపిరిని వీడుట నేర్చుకొనుచున్నాడు. అట్లే ఊపిరిని తీసుకొనుటగూడ నేర్చుకొనుచున్నాడు. కాయానుభవములను ఉప శమింపజే యుచు ఊర్పును గ్రహించుచున్నాడు; త్యజించుచున్నాడు. ప్రీతిసుఖము ననుభవించుచు చిత్తమును ప్రమోదింపజేయుచు, విరాగదృష్టితోడను నిరోధదృష్టి తోడను గూడియు అన్నింటిని యెఱింగి యెఱింగి భావనజేయుచు శ్వాసప్రశ్వాసల నొనర్చుచున్నాడు. రాహులా! ఇట్లు భావనజేయబడి పెంపొందింపబడిన ప్రాణాయా మస్మృతి మహాఫలదాయకము – మాహాత్మ్యయుతమునై యున్నది. దాని పాటవము బొందినవాడు చివరి శ్వాస ప్రశ్వాసలనుగూడ యెఱిగియె నిరోధించుచున్నాడు.''

ఈ పల్కుల విని రాహులుడు సంతుష్టుడై భగవంతుని అభినందించెను.

## అక్షణసూత్రము

[1] అనాథపిండకుని జేతవనారామమున విహరించుచు భగవంతుడొకనాడు భిక్షువులను బిలిచి యిట్లనియె.

''భిక్షువులారా! 'లోకము క్షణకృత్యము, క్షణకృత్యమ' ని పామరుడగు పృథగ్జనుడు పల్కునుగాని క్షణమననేమో అక్షణమననేమో యెఱుగడు.

(1) అం. ని. 8 – 1 – 3 – 8.

లోకమునందు తథాగతుడు అర్హతుడు సమ్యక్ సంబుద్ధుడు విద్యాచరణ సంపన్నుడు సుగతుడు లోకవిదుడు అనుత్తర పురుషదమ్యసారథి దేవమనుష్య శాస్త్ర బుద్ధ భగవంతు డుత్పన్నుడై నిర్వాణమునకు గొనిపోవజాలు సంబోధిజ్ఞానము నుపదే శించుచుండియు బ్రహ్మచర్యావాసమునకు ఈ క్రిందివి యేడును అక్షణములు. (అసమయములు - అనుకూలము లేని పరిస్థితులు).

1. పుద్గలుడు (పురుషుడు) నరకమునందు బుట్టుట, 2.పశుజాతియందు గలుగుట, 3. ప్రేతయోని నుదయించుట, 4. దీర్ఘాయువగు దేవ సముదాయమున జన్మించుట, 5. దూరవిదేశములందు ఆర్యులు లేని చోట పుట్టుట, 6. మధ్యమ జనపదమున (ఆర్యావర్తము) బుట్టియు మిథ్యాదృష్టిగలవాడును, దుష్కృతియు నగుట, 7. వజ్రమూర్ఖుడును అనర్థజ్ఞుడును నగుట - భిక్షువులారా! బ్రహ్మచర్యావాస మున కివి అక్షణములు.

మరియు వినుడు. పుద్గలుడు మధ్యమదేశమందు జన్మించి ప్రజ్ఞావంతుడును పండితుడును సుభాషితములను దుర్భాషితములను యెఱుంగగల్గువాడును సమర్థు డును నగుట. భిక్షువులారా! బ్రహ్మచర్యావాసమున కిది క్షణమని చెప్పబడును. (క్షణము = సమయము అనుకూలము).''

## ౧౬

## ప్రోష్ఠపాద సూత్రము (వి. పూ. 458)

[1] భగవంతుడు బుద్ధుడు అనాథపిండకుని జేతవనారామమున యథాపూర్వక ముగ విహరించుచు ఒకనాటి పూర్వాహ్ణ సమయమున పాత్రచీవరములను గొని భిక్షాచరణమునకై శ్రావస్తిలోనికి బోవుచు యింకను భిక్షకు వేళగాకుండుటచే యిట్లని దలంచెను. ''భిక్షను గొనుటకింకను కొంత సమయము దాటవలెను. ఇంతలోగా నేను [2] తిందుకాచారమువెళ్ళి అచ్చోటి సమయప్రవాదకము (వివిధమతములకు వాదస్థానము)ను, ఏకసాలకమును (పెద్ద శాలగలది) నగు [3] మల్లికారామము నందుండు ప్రోష్ఠపాద పరివ్రాజకుని చూచి వత్తును గాక,'' అని తలంచి తిందుకాచా రము వెళ్ళెను.

అక్కడ ప్రోష్ఠపాదుడు మహాపరివ్రాజక సంఘమును గుమిజేసికొని రాజ కథలు,చోరకథలు, మాహాత్మ్యకథలు, అన్నపానశయనాసనములకథలు గ్రామకథలు

---

(1) దీ.ని. 1 - 9 (2) వర్తమానమందు చీరేనాథము (బహరైచ్‌జిల్లా)
(3) మల్లిక = కోసలేశ్వరమహిషి.

పురకథలు స్త్రీ పురుషుల కథలు నానా లోకాభిరామాయణము ప్రసంగించుచుండి భగవంతుడు వచ్చుచుండుట దవుదవ్వులనెగాంచి అందరిని సద్దణచి తానును మౌనముగ నుండెను. లోనికి ప్రవేశించిన భగవంతునకు ప్రోష్ఠపాద పరివ్రాజకుడు స్వాగతమిచ్చి ఆసనమును సమర్పించి తానొకచో గూర్చొనినంత భగవంతు డిట్లనియె.

''ప్రోష్ఠపాదా! ఏమో ప్రసంగించుచుంటిరి కాబోలు మధ్యనె ఆపితిరా?''

''దేవా! ఆ ప్రసంగముల కేమిలెండు. పోనిండు. వెనుకటి దినాలలోని ఒకమాట. కుతూహల శాలయందు నానా సంప్రదాయముల శ్రమణ బ్రాహ్మణులు సమావేశమై అభి సంజ్ఞానిరోధ సమాధిని గూర్చి చర్చించిరి. అందొక డిట్లనియె –'హేతువులేనిదే, ప్రత్యయము లేనిదే పురుషునియొక్క సంజ్ఞ(చేతన) ఉత్పన్నమగు చున్నది; నిరుద్ధమును నగుచున్నది. అప్పు డతడు సంజ్ఞారహితుడు అసంజ్ఞి యగుచు న్నాడు.'

మఱియొక డిట్లనియె –'అదియట్లుగాదు. సంజ్ఞ పురుషుని ఆత్మ. అది వచ్చును. పోవును. వచ్చినపుడు సంజ్ఞావంతుడగుచున్నాడు. పోయినపుడు సంజ్ఞారహితుడు అసంజ్ఞి యగుచున్నాడు. అభిసంజ్ఞానిరోధము నిట్లు జెప్పుదురు'. వేఱొక డిట్లనియె – 'అదియు పొసగదు. మహాబుద్ధిమంతుడగు శ్రమణబ్రాహ్మణు డొకానొకడు పురుషుని సంజ్ఞను కూర్చును; యెడబాపును. అదియె అభిసంజ్ఞానిరోధము' ఇంకొకడు యిట్లనియె – 'కాదు. కాదు. మహాబుద్ధిమంతమగు దేవతయుం డును. అదియె ఈ పురుషుని సంజ్ఞను చేర్చుటయు విడదీయుటయు జేయును. విడదీసినపు డతడు అసంజ్ఞి యగును. అదియె అభిసంజ్ఞా నిరోధము' అని యిట్లు పలువురు పలువిధముల ప్రసంగించిరి.. తాము సర్వజ్ఞ మూర్తులరు – చతుర మేధావు లరు సెలవివ్వండి.''

''ప్రోష్ఠపాదా! హేతువు లేనిదే ప్రత్యయము లేనిదే పురుషుని సంజ్ఞలు గలుగు ననియు తొలగుననియు పలికిన శ్రమణబ్రాహ్మణుడు తొలుతనె జాఱినాడు. హేతువుతో గూడియె ప్రత్యయముతో గూడియె పురుషుని సంజ్ఞలు కలుగుటయు నిరుద్ధమగుటయు గలదు. శిక్ష (నియమము) వలన కొన్ని సంజ్ఞ లుదయించు టయు, నిరుద్ధమగుటయును గలదు. శిక్షయనిన నేమనెదవా? వినుము.

ప్రోష్ఠపాదా! తథాగతుడు లోకమునం దుదయించినాడు. అతడు సమ్యక్ సంబుద్ధుడు. విద్యాచరణ సంపన్నుడు. సుగతుడు. లోకవిదుడు. బుద్ధభగవంతుడు. అతడు లోకమున కంతటికి కల్యాణమయమగు ధర్మము నుపదేశించుచున్నాడు.

★ ఆ ధర్మమును బొంది భిక్షువు శీలసంపన్నుడై నీవరణ పంచకమును దొలగి తన్ను దాను జూచుటచే ప్రమోదమును పొందుచున్నాడు. ప్రముదితునకు ప్రీతి కల్గుచున్నది. ప్రీతిసహిత చిత్తునకు కాయము ప్రశ్రబ్ధమగుచున్నది. ప్రశ్రబ్ధకాయునకు సుఖానుభూతి దొరకుచున్నది. సుఖితచిత్తునకు సమాహిత (ఏకాగ్ర) మేర్పడుచు న్నది. వాడు కామములనుండి అకుశలధర్మములనుండి వేఱై, సవితర్క వివేకమువలన గలిగిన ప్రీతి సుఖముతోకూడ ప్రథమధ్యానమును పొందుచున్నాడు. ఇంతకు ముందుండెడి కామసంజ్ఞ యిపుడు నిరుద్ధమగుచున్నది. క్రొత్తగ సూక్ష్మసత్యసంజ్ఞ ఉదయించుచున్నది. వాడపుడు 'సూక్ష్మసత్యసంజ్ఞి' యగుచున్నాడు. ఈ శిక్షతో కొన్ని కొన్ని సంజ్ఞలు దయించుటయు కొన్ని కొన్ని సంజ్ఞలు నిరుద్ధమగుటయు గలదు. ఇదియే శిక్ష.

ప్రోష్ఠపాదా! వితర్కవిచారములుపశాంతింప అంతః ప్రసన్నత సిద్ధింప, వితర్కవిచార రహిత సమాధివలన గలిగిన ప్రీతిసుఖయుతమగు ద్వితీయధ్యానమును భిక్షువు ప్రాపించుచున్నాడు. అంతట వానికి యింతకుముందుండిన సూక్ష్మసత్యసంజ్ఞ నిరుద్ధమైపోవును. సూక్ష్మసత్యసంజ్ఞావంతుడే యైపోవును. ఈ శిక్షయందుకూడ కొన్ని కొన్ని సంజ్ఞలుదయించుటయు, కొన్ని కొన్ని నిరుద్ధమగుటయు గలదు. ఇదియే శిక్షాపద్ధతి.

మరియు ప్రోష్ఠపాదా! భిక్షువు ఆపైన ప్రీతి విరాగములనుండి ఉపేక్షకుడై తృతీయధ్యానమును బొంది ముందటి సంజ్ఞలన్నియు నిరుద్ధమగుచుండ ఉపేక్షాసుఖ ముతో గూడిన సూక్ష్మసత్యసంజ్ఞను బొందుచున్నాడు. ఈ శిక్షనుండియు కొన్ని కొన్ని సంజ్ఞలుదయించుటయు, అడగిపోవుటయును గలదు. ఇదె శిక్షాపద్ధతి.

ప్రోష్ఠపాదా! భిక్ష వటుపిమ్మట చతుర్థధ్యానమును బొంది ముందటి సంజ్ఞలను బాసి అదుఃఖ అసుఖ సూక్ష్మసత్యసంజ్ఞ గలవాడగుచున్నాడు. దీనియందును కొన్ని సంజ్ఞలు గల్గుటయు కొన్ని తొలగుటయును గలదు.

ఇట్లు భిక్షువు క్రమముగా ఆకాశ ఆనంత్య ఆయతన సంజ్ఞను, విజ్ఞాన ఆనంత్య ఆయతన సంజ్ఞను, అకించన్యాయతన సంజ్ఞను బొందుచూ ముందటి ముందటి సంజ్ఞలను వదలుచున్నాడు. ఈ ప్రతియొక్క శిక్షాపద్ధతియందును కొన్ని సంజ్ఞలు గల్గుటయు కొన్ని తొలగుటయు గలదు.

---

★ 146 – 147 పేజీలు చూడుడు.

ప్రోష్ఠపాదా! అంతట భిక్షువు స్వకసంజ్ఞియై (తనయందెసంజ్ఞలను గ్రహించు వాడై) క్రమముగ (సంజ్ఞాగ్రము) శ్రేష్ఠమగు సంజ్ఞను బడసి చింతనములను వదలి నిరోధమును స్పర్శించుచున్నాడు. అప్పుడు అభిసంజ్ఞానిరోధయుతమగు సంప్రజ్ఞాత సమాధి యుదయించుచున్నది. ఈ విషయమునుగూర్చి యీ వర కిట్లు వినియు న్నావా?''

''భగవంతా! మీరిప్పుడు చెప్పగ వినుచున్నాను. దేవా! మీరు ఒకే సంజ్ఞాగ్ర మును జెప్పుచున్నారా? వేఱు వేఱగు సంజ్ఞాగ్రములను జెప్పుచున్నారా?''

''ప్రోష్ఠపాదా! ఒక్కటిగను భిన్నభిన్నములుగను కూడ నేను సంజ్ఞాగ్రము (శ్రేష్ఠమగు సంజ్ఞ)లను జెప్పుచున్నాను. ఎట్టెట్టి నిరోధమును పొందుచున్నాడో అట్టి యట్టి సంజ్ఞాగ్రములను జెప్పుచున్నాను.''

''భంతే! సంజ్ఞ ముందుగను, జ్ఞానము వెనుకగను కల్గుచున్నదా! లేక జ్ఞానము ముందుగను సంజ్ఞ వెనుకయు గల్గుచున్నదా?''

''ప్రోష్ఠపాదా! సంజ్ఞయే మొదట్ల కలుగుచున్నది. వెనుక జ్ఞానము కలుగుచు న్నది. ప్రతివాడును 'ఈ కారణముచేత నాకీ జ్ఞానము కల్గినది' ని తలంచుచున్నాడు. కాబట్టి సంజ్ఞయే మొదట కలిగి తర్వాత జ్ఞానము కల్గినది.''

''సుగతా! పురుషునకు సంజ్ఞయే ఆత్మయా? లేక వేర్వేరా?''

''ప్రోష్ఠపాదా! నీవు ఆత్మను దేనినిగ తలంచుచున్నావు?''

''గౌతమా! స్థూలరూపము గలదిగను, నాల్గు మహాభూతములతో గూడిన దిగను కవలింకార ఆహారముగను (కబళములుచేసి భుజించునట్టిది) నే నాత్మను దలంచుచున్నాను.''

''ప్రోష్ఠపాదా! అట్లయిన సంజ్ఞయు ఆత్మయు వేర్వేఱెయగుచున్నవి.''

''భంతే! ఆత్మను మనోమయమును, అంగప్రత్యంగ సహితమును, యింద్రి యయుతమునుగ దలంతును.''

ప్రోష్ఠపాదా! అటులయినను సంజ్ఞలును ఆత్మయు వేరువేరె యగును. అంగ ప్రత్యంగ యుతమును యింద్రియ సహితమును మనోమయమును ఆత్మయగుచో నీ పురుషునకు కొన్ని సంజ్ఞలు కల్గుటయు, కొన్ని తొలగుటయునై యున్నది.''

''శాస్తా! ఆత్మను రూపరహితముగను సంజ్ఞామయముగను భావింతును.''

''ప్రోష్ఠపాదా! అల్లాగైనను సంజ్ఞలును ఆత్మయు భిన్నభిన్నములే''

''ప్రభూ! సంజ్ఞయు ఆత్మయు ఒకటేయనిగాని, వేర్వేరని గాని నేనెఱుంగ గల్గుదునా?''

''ప్రోష్ఠపాదా! భిన్న దృష్టి – భిన్నరుచి గలవారలకు, భిన్నాచార్యానుగతుల కట్లు యెఱుంగుట కరము దుష్కరము.''

''గౌతమా! అటులవుగాక. లోకము నిత్యమనుట నిజమా? అనిత్యతా విచారము వ్యర్థమా?''

''ప్రోష్ఠపాదా! ఆ విషయమును నేను అవ్యాకృతము (విచారించుటకు యోగ్యము కానిది) అనినాను.

''గౌతమా! లోకము అశాశ్వతమనుట నిజమా?''

''ప్రోష్ఠపాదా! ఆ చర్చ అవ్యాకృతము.''

''గౌతమా! లోకము అంతవంతమా?''

''ప్రోష్ఠపాదా! ఆ విషయము అవ్యాకృతమనినాను.''

''గౌతమా! లోకము అనంతవంతమా?''

''ప్రోష్ఠపాదా! అదియు నవ్యాకృతమే.''

''గౌతమా! జీవుడు, శరీరము నొకటియా?''

''ప్రోష్ఠపాదా! అవ్యాకృతమే''

''గౌతమా! జీవుడు శరీరము వేఱువేఱా?''

''ప్రోష్ఠపాదా! అవ్యాకృతమే.''

''గౌతమా! తథాగతుడు మరణించి మరియు జన్మించునా?''

''ప్రోష్ఠపాదా! ఆ విషయ మవ్యాకృతమనినాను.''

''భంతే! తథాగతుడు తిరిగి జన్మించడా?''

''ప్రోష్ఠపాదా! అదియు నవ్యాకృతమే.''

''భంతే! అవ్యాకృతమని భగవంతు డెందకు పల్కినాడు?''

''ప్రోష్ఠపాదా! అర్థయుక్తముగాక, ధర్మయుక్తమునుగాక, బ్రహ్మచర్యమున కును నిర్వేదమునకును విరాగమునకును నిరోధమునకును ఉపశమమునకును అభిజ్ఞకును సంబోధికిని నిర్వాణమునకును కొఱగాని యీ ప్రసంగములను అవ్యా కృతములని తీర్మానించినాను.''

''ప్రభూ! వ్యాకృతము (చెప్పదగినవి) లని వేటిని జెప్పినారు?''

''ప్రోష్ఠపాదా! ఇది దుఃఖమనియు, ఇది దుఃఖసముదయమనియు, ఇది దుఃఖనిరోధ మనియు, ఇది దుఃఖనిరోధగామినీ ప్రతిపదమనియు నేను వ్యాకృతము లొనర్చినాను.''

''పభూ! వాటిని వ్యాకృతములని భగవంతు డెందుకన్నాడు?''

''ప్రోష్ఠపాదా! అర్థమునకును ధర్మమునకును బ్రహ్మచర్యమునకును, నిర్వేదమునకును విరాగమునకును నిరోధమునకును ఉపశమమునకును అభిజ్ఞకును సంబోధికిని నిర్వాణమునకు ఉపయోగమగుట వలన వ్యాకృతములన్నాను.''

''దేవా! చిత్తము.''

ఆసనమునుండి లేచి భగవంతుడు భిక్షాచరణమునకు బోయెను. అంతట ప్రోష్ఠ పాద పరివ్రాజకుని చుట్టుముట్టుకొని తక్కిన పరివ్రాజకులు చీవాట్లు పెట్ట దొడగిరి.''ప్రోష్ఠపాదా! గౌతముడు చెప్పినదాని కెల్లను తల నూపుచుంటివి. అతడో ఒక విషయమునైన నిక్కచ్చిగ తీర్మానించి చెప్పియుండలేదు. అవ్యాకృతములని తప్పుకొన్నాడు. నీకిది తగునా?''

''అయ్యలారా! మీరు జెప్పునది నిజమే. శ్రమణగౌతముడు దేనిని నిష్కర్షించ లేదు. అయినను అతడు ధర్మవేత్త. ధర్మ నియామకుడు. అంతవాడు చెప్పినదానిని కాదన లేక తలనూపితి'' నని ప్రోష్ఠపాదుడు పలికెను.

రెండుమూడు దినములు గడచినంత ప్రోష్ఠపాదుడును, చిత్రహస్తి సారిపుత్రుడును భగవంతు డుండుచోటికి బోయి అభివాదనము జేసి యొకచో గూర్చొనిరి. ప్రోష్ఠపాదుడును ఆనాడు పరివ్రాజకులు తన్నుతూలనాడిన సమాచారము బుద్ధునకు నివేదించెను. బుద్ధుడు యిట్లనియె.

''ప్రోష్ఠపాదా! ఆ పరివ్రాజకు లందఱు గ్రుడ్డివారు. వారిలో నీ వొక్కడవే కన్నులు గలవాడవు. అయ్యా! ఏకాంశిక ధర్మములనెన్నియో నేను జెప్పితిని. అనైకాంశిక ధర్మములను గూడ చెప్పితిని. 'లోకము శాశ్వతము; అశాశ్వతము; తథాగతుడు మరణించిన పిదప తిరిగి పుట్టును. పుట్టుట లేదు' ఈలాంటి విషయములన్నియు నేను అనైకాంశిక ధర్మములుగ ఉపదేశించితిని. ఇవి అర్థధర్మములకుగాని నిర్వేద నిర్వాణములకుగాని దేనికిని కొఱగానివి. ప్రోష్ఠపాదా! దుఃఖము, దుఃఖసముద

యము, దుఃఖనిరోధము, దుఃఖనిరోధగామినీ ప్రతిపదమనెడి ఏకాంశిక ధర్మముల నుపదేశించితిని. ఇవి ధర్మార్థములకును నిర్వేద నిర్వాణములకును ఉపయోగించు నవి.

ప్రోష్ఠపాదా! ఒక్కొక్క శ్రమణబ్రాహ్మణుడు 'మరణానంతరము ఆత్మసుఖ లోకములకు బోయి మహాసుఖవంతమై యుండు' నని చెప్పును. 'నీవా సుఖలోక ముల నేనాడైన చూచివచ్చితివా?' యని వాని నడిగిన వాడు 'లేద' నును 'పోనిమ్ము. మహాసుఖవంతమై యుండు ఆత్మను చూచినావా?' యని అడిగిన 'లేదు' అనును. 'ఆ సుఖలోకములకీ మార్గము తప్పక చేర్చు' నని నిక్కముగ నీకు తెలియునా యని ప్రశ్నించిన దానికిని వాడు 'తెలియదు' అనును. ఇట్టి శ్రమణబ్రాహ్మణుల మాటలు ప్రమాణ శూన్యములుగాక మరేమి యగును?''

''భంతే! అవశ్యము ప్రమాణరహితములే.''

ప్రోష్ఠపాదా! ఒకానొక పురుషుడు 'నేనీ దేశమునందలి జనపదకల్యాణి (అత్యంత సుందరస్త్రీ) ని వలచియున్నా' నని జెప్పును. వానింజూచి 'ఓయీ! ఆమె యేజాతిది? ఏరూపు గలది? ఎచ్చట నివసించును?' అనియడిగినచో వాడు 'అదేమి యును నాకు తెలియదు. ఆమె మాత్రము కావలె' నని పలుకును. 'మూఢుడా! ఊరుపేరు తెలియక జాడపోకడ నెఱుంగక, ఆమె నాకు కావలె' ననుటలో అర్థమేమి? ప్రోష్ఠపాదా! నీవేమి జెప్పెదవు?

''దేవా! ఆ మాట అర్థహీనమైది.''

''మరియు ప్రోష్ఠపాదా! ఒకానొక పురుషుడు నాల్గుదారులు కలియు కూడలి యందు సోపానములు (తాపలు) కట్టుచున్నాడు. వానిని జూచి ప్రజలు ''అయ్యా! ఈ సోపానములు యే మేడలు యెక్కుటకు కట్టుచున్నావు? ఆ మేడ యే దిక్కునందు న్నది?'' అని యడిగిన వాడు 'నాకు తెలియద' న్నచో 'ఓయీ! నీవా ప్రాసాదమును తెలియనిదే చూడనిదే దానిపై నెక్కుటకు తాపలు గట్టుచున్నాన' నుట యేపాటి తెలివి గలమాట? అని ప్రజ లడుగకుందురా? ప్రోష్ఠపాదా! నీవే మనెదవు?''

''దేవా! నిరర్థకమైన ఆ మాటకు ప్రామాణికత లేదు.''

''ప్రోష్ఠపాదా! ఆ శ్రమణ బ్రాహ్మణుడు 'మరణించిన పిదప ఆత్మ సుఖలోక ములకు పోయి సుఖము ననుభవించు' ననుటకూడ అట్లే యున్నది.''

''దేవా! నిజము.''

''ప్రోష్ఠపాదా! స్థూలఆత్మ ప్రతిలాభమని, మనోమయాత్మ ప్రతిలాభమని, అరూప ఆత్మ ప్రతిలాభమని ఆత్మప్రతిలాభము (శరీరగ్రహణము)లు మూడు విధములు. రూపవంతమును నాలుగు మహాభూతములతో కూడినదియు, ఆహారమును కొనునదియు నగునది స్థూలాత్మ ప్రతిలాభము. రూపవంతమును అంగప్రత్యంగయుతమును ఇంద్రియ సహితమును నగునది మనోమయాత్మ ప్రతి లాభము. రూపహీనమును, సంజ్ఞావంతమును నగునది అరూపాత్మప్రతి లాభము. (శరీర పరిగ్రహము) నేనా మూడు విధములగు శరీర గ్రహణములనుండి విముక్తుడగుటకు ధర్మోపదేశము చేయుచున్నాను. ఈ మార్గమున నడచువానికి అకుశల ధర్మములు నశించును. కుశలధర్మములు సంభవించును. ప్రమోదమును ప్రీతిని ప్రశ్రబ్ధిని స్మృతిని సంప్రజన్యమును సుఖమును బొంది విహరించ గలడు.''

భగవంతుడు బుద్ధుడు యిట్లు చెప్పుచుండుటను విని చిత్రహస్తి సారిపుత్రుడిట్లనియె – ''భంతే! స్థూలశరీరపరిగ్రహమున్నపుడు, మనోమయ శరీర పరిగ్రహముగాని, అరూపశరీరపరిగ్రహముగాని సార్ధకమగుట లేదు. ఆ సమయమునకు స్థూలశరీర పరిగ్రహమొక్కటియే సత్యమగుచున్నది. అట్లే తక్కిన రెండింటి విషయము కూడ. ఏదో ఒకటి యుండినపుడు తక్కిన రెండును మిథ్యలగును.''

''చిత్రా! అవును. పాలనుండి పెరుగు గలుగుచున్నది. పెరుగునుండి నెయ్యి కలుగుచున్నది. కాని పాలున్నపుడు తక్కిన రెండును లేవు. పెరుగున్నపుడు పెరుగే సత్యము. కడమరెండును మిథ్యలు. నెయ్యి ఉన్నపుడు దానిని నెయ్యియని యందురు గాని పాలనిగాని పెరుగనికాని చెప్పుట లేదు. అట్లే స్థూలశరీర పరిగ్రహము న్నపుడు మనోమయ శరీర పరిగ్రహముగాని అరూపశరీర పరిగ్రహముగాని చెప్పబడదు. మనోమయశరీర పరిగ్రహమున్నపుడు మిగత రెండును చెప్పబడవు. అరూపశరీర పరిగ్రహమున్నపుడును స్థూలశరీర పరిగ్రహముగాని మనోమయశరీర పరిగ్రహముగాని చెప్పబడవు. చిత్రా! ఈ లౌకికసంజ్ఞల నంటక తథాగతుడు వ్యవహరించుచున్నాడు.''

ఇట్లు చెప్పినంత ప్రోష్ఠపాద పరివ్రాజకుడు భగవంతుని జూచి ''భంతే! ఆశ్చర్యము – అబ్బురము – నేటినుండి నన్ను అంజలిబద్ధ శరణాగత ఉపాసకునిగ స్వీకరించండి'' అని ప్రార్థించెను.

చిత్రహస్తి సారిపుత్రుడును భగవంతునితో ''దేవా! ఆశ్చర్యము - అబ్బురము. నేను భగవంతుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును భిక్షుసంఘమునుగూడ. భగవానులవద్ద నాకు ప్రవ్రజ్య లభించుగాక. ఉపసంపద ప్రాప్తించుగాక'' అని వేడుకొనెను.

బుద్ధభగవంతుని వద్ద చిత్రహస్తి సారిపుత్రుడు ప్రవ్రజ్యను ఉపసంపదను బొంది ఏకాకియై ప్రమాదరహితుడై ఆత్మసంయమియై విహరించుచు, దేనికొఱకు కుల పుత్రులు గృహములవదలి ప్రవ్రజితులయ్యెదరో అట్టి అనుపమ బ్రహ్మచర్య ఫలము యొక్క సాక్షాత్కారమును బొంది విహరింపదొడగెను. జన్మబంధములు క్షీణించి, బ్రహ్మచర్య ఫలము సిద్ధించి కృతకృత్యుడై కరణీయమేమియు లేక ఆయుష్మంతుడు చిత్రహస్తి సారి పుత్రుడు అర్హతులయందొక్కడయ్యెను.



# శ్రీ బుద్ధ చర్య

## తీయ ఖండము

### త్రైవిద్య సూత్రము (వి. పూ. 457)

[1] ఒక సమయమున భగవంతుడు బుద్ధుడు [2] కోసలదేశమునందు సంచరించుచు అయిదునూర్ల భిక్షువులతో మనసాకటమను బ్రాహ్మణాగ్రహారమును వచ్చి చేరెను. ఆ గ్రామమున కుత్తరముననుండు అచిరవతీ నదీతీరమున నొక ఆమ్రవనములో విడిసి విహారము చేయుచుండెను.

ఆ కాలమునందు సుప్రసిద్ధులును మహాధనవంతులును నగు [3] చంకి, తారుక్షుడు, పౌష్కరసాతి, జానుశ్రోణి, తోదేయ్యుడు మున్నగు బ్రాహ్మణులు పలువురు ఆ గ్రామమునందే నివసించుచుండిరి.

ఇట్లుండ నొకానొకనాడు పౌష్కరసాతి శిష్యుడగు వాసిష్ఠుడును, తారుక్షుని శిష్యుడగు భారద్వాజుడును వాహ్యాళికై దారినడచుచు యేదో విషయమును తీసికొని వివదించుచుండిరి. అందు వాసిష్ఠమాణవుకు డిట్లనియె.

---

1. దీ. ని. 1 - 13.
2. యుక్తప్రాంతములోని ఫైజాబాదు, గోండా, బహరైచ్, సుల్తాన్‌పూర్, బారాబంకీ, బస్తీజిల్లాలును, గోరఖ్‌పూర్ జిల్లాలో కొంతభాగమును.
3. చంకి ఓపసాదనివాసి, తారుక్షుడు ఇచ్ఛానంగలవాసి, పౌష్కరసాతి ఉక్కుట్ఠవాసి జానుశ్రోణి శ్రావస్తీవాసి, తోదేయ్యుడు తుదీగ్రామనివాసి.

'భారద్వాజా! బ్రహ్మసాలోక్యమునకు సత్వరముగను, నిరాటంకముగను జేరుటకు పౌష్కరసాతి బ్రాహ్మణుడు జెప్పుమార్గమే శ్రేష్ఠమైనది.'' అది విని భారద్వాజు డిట్లనియె.

''వాసిష్ఠా! తారుక్షబ్రాహ్మణుడు జెప్పునదియే అందుకు యోగ్యము.''

ఒకరిమాటొకరికి నచ్చ లేదు. చివరకు భారద్వాజునకు వాసిష్ఠు డిట్లనియె.

''భారద్వాజా! శాక్యపుత్రుడు శ్రమణగౌతముడు ఈ గ్రామమునకు ఉత్తరదిశ యందుండు అచిరవతీ (రాపతీ) నదీతీరమున మామిడివనములో విహరించుచు న్నాడు. అతడు సుప్రసిద్ధుడు. ఆతని కడ కరిగి ఈ విషయమును తీర్మానించు కొందము.''

సరియే పోదమని యిర్వురు మాణవకులును భగవంతుడున్నెడకు బోయి కుశల ప్రశ్నములొనర్చి ఒక్కెడ గూర్చొనిరి. అందు వాసిష్ఠమాణవకు డిట్లనియె.

''గౌతమా! మాకొక వివాదము వచ్చినది. బ్రహ్మసాలోక్యము నతిశీఘ్రముగ జేర్చుటకు పౌష్కరసాతి చెప్పెడి మార్గమే శ్రేష్ఠమని నే నన్నాను. తారుక్షుడు చెప్పుమా ర్గమే ఉత్తమమని ఈ భారద్వాజు డనుచున్నాడు. ఇదియె వివాదము.''

''వాసిష్ఠా! నీవిట్లు చెప్పెదవు. భారద్వాజు డట్లు చెప్పును. ఇక దీనిలో నిగ్రహము - వివాదము యెందులకు?''

''గౌతమా! ఆ మార్గము బ్రహ్మసాలోక్యమును చేర్చగల్గుననుటలో వివాదము లేదు. అదియొక టేమి? మార్గామార్గములను గుఱించి ఐతరేయబ్రాహ్మణుడు, తైత్తిరీయ బ్రాహ్మణుడు, ఛందోగ బ్రాహ్మణుడు, ఛందావాబ్రాహ్మణుడు, బ్రహ్మచర్య బ్రాహ్మణుడు మున్నగువారు పలుదెరువుల చెప్పినారు. త్రోవలనేకములయ్యును ఒకే గ్రామమునకు జేర్చినట్లు వీరు జెప్పుమార్గములును అన్నియుకూడ బ్రహ్మసలోక తనె సిద్ధింపజేయును.''

''వాసిష్ఠా! వారు జెప్పు మార్గములు బ్రహ్మసలోకతను జేర్పగలవా?''

''గౌతమా! చేర్పగలవనియె జెప్పుచున్నాను.''

''వాసిష్ఠా! ఆత్రైవిద్య (మూడువేదముల నెఱిగిన) బ్రాహ్మణులందొకరైనను బ్రహ్మమనిన యేమో, అతని లోక మెట్టిదో కండ్లార చూచినారా!''

''గౌతమా! లేదు.''

''వాసిష్ఠా! పోనిమ్ము. వారి గురువులలో - ఆచార్యులలో నెవడైన చూచి నాడా?''

''గౌతమా! లేదు.''

''వాసిష్ఠా! వారి గురుపరంపరలో యేడవమూలపురుషుడైనా చూచినాడా?''

''గౌతమా! లేదు.''

''వాసిష్ఠా! సరే పోనిమ్ము. నీవు చెప్పిన త్రైవిద్య బ్రాహ్మణుల పెద్దలు, పెద్దలకు పెద్దలు, గురువులు, వారిగురువులలో నొక్కడైనను 'బ్రహ్మమిట్టిది - ఈ విషయ మందున్నది - ఇక్కడున్నది - మేమెఱుగుదుము - మేము చూచితిమి' అని చెప్ప గల్గిరా?''

''గౌతమా! లేదు.''

''వాసిష్ఠా! వీరేగాదు, వీరి ఆచార్యులు ప్రాచార్యులు పరంపరాచార్యులు గూడ బ్రహ్మమును చూడనివారేయైయుండ, వీరు ఇపుడు 'మేము జూడని - మేమెఱుగని బ్రహ్మసాలోక్యమునకు చక్కని సులభమగు మార్గమును ఉపదేశించుచున్నామ' ని చెప్పుచుండుట హాస్యాస్పదము అప్రమాణము కాదా?''

''గౌతమా! నిజమే''

''వాసిష్ఠా! ఇదియంతయు అంధపరంపరా న్యాయము. గ్రుడ్డివారొకని నొకడు అంటుకొని బారుదీసి నిలిచిన కూడా వస్తువును చూచుటకు ఒక్కడును సమర్థుడుగాడు. ముందున్న వాడును గాన లేడు. నడుమనుండువాడును గానలేడు. చివరనుండువాడును గానలేడు. అట్లే ఈ త్రైవిద్య బ్రాహ్మణుల మాటకూడా నిరర్థ కమును, నిస్సారమును నైనది. అయ్యా! వాసిష్ఠా! మీ త్రైవిద్య బ్రాహ్మణులు సూర్యచంద్రులు యెందుండి పుట్టుచున్నారో యెందు గ్రుంకుచున్నారో చూచుచు న్నారా? ఆ సూర్యచంద్రులను గూర్చి ఉపాసనాప్రార్థనలను జేయుదురా? చేయు వారిని చూచుచున్నారా?''

''గౌతమా! చంద్రసూర్యుల ఉదయాస్తమానముల జూచుచున్నారు. వారిని ఉపాసించుచున్నారు. ఉపాసించువారిని గూడ జూచుచున్నారు.''

''వాసిష్ఠా! ఆ చంద్రసూర్యుల సాలోక్యమును పొందుటకు భక్తులైనవారికి చక్కని మార్గమును వారు బోధించుట లేదా?''

''గౌతమా! లేదు.''

''వాసిష్ఠా! ఇది యేమి? తాము కండ్లారా చూడగల్గిన, ఉపాసింపగల్గిన చంద్రసూర్యుల లోకములకు పంపే మార్గమును చెప్పుటకే అసమర్థులైన వీరు, తాముగాని తమ పూర్వులుగాని కండ్లతోనైన జూడని బ్రహ్మసాలోక్యమునకు చక్కని మార్గమును ఉపదేశించుచున్నామనుట, యేమంత విశ్వసింపదగియున్నది?''

''గౌతమా! నిజమే.''

''వాసిష్ఠా! ★ ఒకానొక పురుషుడు 'నేనీ దేశమునందలి జనపదకళ్యాణి (మహా సుందర స్త్రీ)ని వలచియున్నా'నని చెప్పును. వానిని జూచి 'ఓయీ! ఆమె యేజాతిది? ఏరూపు గలది? ఎచ్చట నివసించు' నని యడిగినచో వాడు 'అదేమియు నాకు తెలియదు. ఆమె మాత్రము కావలె' నసును. వాసిష్ఠా! ఆ మాటకేమైన విలువ యున్నదా?''

''గౌతమా! అది అర్థము లేనిమాట.''

''వాసిష్ఠా! త్రైవిద్యబ్రాహ్మణుల మాటలుకూడ నట్టివే. మఱియు వినుము. అద్దరి యిద్దరి నీటితో నిండియున్న యీ అచిరవతీనదిని దాటగోరి ఒక పురుషుడు ఈ వైపు తీరమున నిలువబడి 'ఓ ఆవైపుననుండు తీరమా! ఇటురమ్ము. ఇచ్చటికి రమ్ము' అని యెంతగా కేకలు వేసినను ఆవలి యొడ్డు యీవలికి రాగలదా?''

''గౌతమా! రాలేదు.''

''వాసిష్ఠా! ఇట్లే త్రైవిద్య బ్రాహ్మణులుకూడ బ్రాహ్మణయోగ్యములగు ధర్మములను వీడి అబ్రాహ్మణధర్మములను ఆశ్రయించినవారై 'మే మింద్రుని ఆహ్వానించుచున్నాము. ఈశానుని ఆహ్వానించుచున్నాము. బ్రహ్మను ఆహ్వానము చేయుచున్నాము. ప్రజాపతిని ఆహ్వానము జేయుచున్నాము. దేహము వదలిన తర్వాత మేము వారిలోకములందు నివాసమును (సాలోక్యమును) పొందగల' మని యేమేమో ప్రల్లదము లాడుచుందురు. అది అసంభవము. అయ్యా! ఈ అచిరవతీ నదిని దాటగోరువాడు యీ ఒడ్డుననే బంధింపబడినచో వాడు ఆవలితీరము నెట్లు చేరగలడు?''

---

★ 166వ పేజీ చూడుడు.

''గౌతమా! చేరలేడు.''

'అ॥ వాసిష్ఠా! కామగుణము లయిదును బంధములని ఆర్యవినయమున చెప్ప బడును. 1. కంటితో చూడబడు ప్రియరూపము. 2. చెవితో వినబడు ప్రియ శబ్దము. 3. ముక్కుతో గ్రహింపబడు ప్రియగంధము. 4. నాలుకతో తీసికొను ప్రియరసము. 5. చర్మముతో గైకొను ప్రియస్పర్శము – ఈ అయిదు కామగుణము లును రాగోత్పాదకము లౌటచే బంధనములని చెప్పబడినవి. ఆ త్రైవిద్య బ్రాహ్మణులీ అయిదింట బంధింపబడి వివశులై విస్మృతులై వెలువడు మార్గము గానక వెతనొందు చున్నారు. ఇట్టి వీరు బ్రహ్మసలోకతను కాయమువిడిచిన పిదప పొందెదమనియు పొందించెదమనియు పలుకు పలుకులు సత్యమెట్లు కాగలవు.? వాసిష్ఠా! ఈ అచిరవతీ నదిని దాటి ఆ గట్టును చేరగోరువాడు ఈ గట్టునందే మొగమును మూసుకొని పరుండినచో వాడు ఆ తీరము నెట్లు జేరగలడు?''

''గౌతమా! చేరలేడు.''

''అట్లే, వాసిష్ఠా! నీ వరణము లయిదింటిని ఆర్యవినయమందు ఆవరణము లని బంధనములని చెప్పుదురు. 1. కామచ్ఛందము 2. వ్యాపాదము, 3. స్త్యానమృద్ధము, 4. ఔద్ధత్యకౌకృత్యము, 5. విచికిత్స యనునవి. ఈ అయిదింటిచే కప్ప బడియున్న త్రైవిద్య బ్రాహ్మణులు చచ్చిన పిదప బ్రహ్మలోకమును చెందుదుమనుట సుతరాం అసంభవము. వాసిష్ఠా! కులవృద్ధులగు పెద్దలు బ్రహ్మమును సపరిగ్రహమని చెప్పుదురా? అపరిగ్రహమని చెప్పుదురా?''

''గౌతమా ॥అపరిగ్రహమనియే''

''వాసిష్ఠా! ద్వేషముతో కూడినదనియా, ద్వేషముతో వీడినదనియా?''

''గౌతమా! ద్వేషముతో వీడినదనియె చెప్పుదురు.''

''వాసిష్ఠా! బ్రహ్మము వ్యాపాద (ద్రోహ) సహితమా? వ్యాపాదరహితమా?''

''గౌతమా! వ్యాపాదరహితమే''

''వాసిష్ఠా! క్లిష్ట చిత్తమా? అక్లిష్టచిత్తమా?''

''గౌతమా! అక్లిష్ట చిత్తమే''

'' వాసిష్ఠా! బ్రహ్మము జితేంద్రియమా? అజితేంద్రియమా?''

''గౌతమా! జితేంద్రియమే''

''వాసిష్ఠా! త్రైవిద్య బ్రాహ్మణులు సపరిగ్రహులు. బ్రహ్మము అపరిగ్రహము. సపరిగ్రహులగు త్రైవిద్య బ్రాహ్మణులు పరిగ్రహ (స్త్రీ) రహితమగు బ్రహ్మముతో సమానమగుటగాని కలియుటగాని సలోకతను బొందుటగాని సంభవించునా?''

''గౌతమా! సంభవింపదు.''

''వాసిష్ఠా! సద్వేషచిత్తులు సవ్యాపాదచిత్తులు సంక్లిష్టచిత్తులు అజితేంద్రియులు నగు త్రైవిద్య బ్రాహ్మణులకు ద్వేషహీనము వ్యాపాదహీనము క్లేశహీనము జితేంద్రియము నగు బ్రహ్మముతో సాలోకత, సిద్ధించుట యేటిమాట? పెడదారుల ద్రొక్కి నిక్కముగ విషాదములకు గుఱియైనారు. గొడ్డేట నీదుచున్నారు. త్రివిద్య లనెడి కీకారణ్యమునందు ఊరక పరిభ్రమించుచు వ్యసనములపాలైనారు.''

ఇట్లు భగవంతుడు బుద్ధుడు ఉపదేశించినంత వాసిష్ఠమాణవకు డిట్లనియె. 'గౌతమా! తాము బ్రహ్మసాలోక్యమార్గము నెఱిగియున్నారని నేనిదివఱకు విని యుంటిని. నిజమేనా?''

''వాసిష్ఠా! మనసాకట మిచ్చటికి దూరమా? సమీపమా?''

''గౌతమా! దూరము లేదు. సమీపమే.''

''వాసిష్ఠా! ఈమనసాకటమునందే పుట్టిపెరిగిన ఒక పురుషుడు యిందున్నా డనుకొందము. వానిని జూచి మనసాకటమునకు దారి యేదని అడిగినచో వాడు చెప్పుటకు ఆలోచనగాని ఆలస్యముగాని చేయునా?''

''గౌతమా! మిక్కిలిగ గుర్తెఱిగిన ఈ విషయమందు జవాబు చెప్పుటకు వాడు ఆలోచన చేయడు. ఆలస్యమును జేయడు.''

''వాసిష్ఠా! అట్లే తథాగతునకును బ్రహ్మలోకము చిరపరిచితము. బ్రహ్మము నెఱుగుదును. బ్రహ్మలోకము నెఱుగుదును. దానిని పొందించు మార్గము నెఱుగుదును.''

''గౌతమా! బ్రాహ్మణసంతాన ముద్ధరింపబడునట్లు దానిని మా కుపదేశింపుము.''

''వాసిష్ఠా! వినుము. లోకమునందు తథాగతు★ డుత్పన్నుడైనాడని విని సర్వకల్యాణమగు అతని బ్రహ్మచర్యచరణము నభిలషించి భిక్షుదీక్షను గొని కడుపునకు అన్నము, కాయమునకు బట్ట యింతమాత్రమున సంతృప్తివహించి శీల

★ 146, 147, 161, 162 పేజీలు చూడుడు.

సంపన్నుడైన శ్రమణ భిక్షువు [1] నీవరణముల నైదింటినుండి విముక్తుడై ప్రీతిమంతుడై విహరించుచున్నాడు. అతని చిత్తము మిత్రభావయుక్తము. వాడు ప్రశ్రబ్ధ (శాంత) శరీరుడు. బలముగలవాడు అవలీలగ శంఖమును పూరించి దాని శబ్దముతో నాల్గుమూలలను నిండించినట్లు ప్రసన్నచిత్తుడగు భిక్షువు తన మైత్రీభావనతో దిక్కులకు దిక్కు కల్గించుచున్నాడు. అదియె బ్రహ్మసాలోక్యమునకు మార్గము.

వాసిష్ఠా! మరియు నతడు నిరవధికములైన కరుణాముదితా ఉపేక్షలను చిత్తమునకు హత్తించుకొని లోకములందు సర్వ పరిపూర్ణుడై విహరించుచున్నాడు. ఇదియె బ్రహ్మసలోకతకు మార్గము. వాసిష్ఠా! వాడు అపరిగ్రహుడు; అద్వేష్ట; అవ్యాపాదచిత్తుడు; అక్లేశస్వభావుడు; జితేంద్రియుడు. వాడు బ్రహ్మమునకు వేఱుగ లేడు. అనాయసముగ బ్రహ్మసాలోక్యమును బొందుచున్నాడు.''

అని యిట్లు భగవంతుడు బుద్ధు డుపదేశింప విని సహర్షముతో వాసిష్ఠమాణవకుడును, భారద్వాజమాణవకుడును చేతులు జోడించి ''గౌతమా! ఆశ్చర్యము; అబ్బురము, మమ్ము అంజలిబద్ధ శరణాగత ఉపాసకులుగ అనుగ్రహించవలసినది'' ని వేడికొనిరి.

## అంబష్ఠసూత్రము (వి. పూ. 457)

[2] భగవంతుడు బుద్ధదేవుడు యేనూరు భిక్షువులతో కూడి [3] చారికనొనర్చుచు కోసలదేశమునందలి ఇచ్ఛానంగలమను బ్రాహ్మణాగ్రహారము జేరి అందలి ఒక వనఖండమున విహారము జేయుచుండెను.

---

1. 146, 147 పేజీలు చూడుడు.

2. దీ. ని. 1 - 1.

3. అ. క. భగవంతుని చారిక (పాదచర్య) రెండువిధములు. త్వరితచారికయని, మందచారిక యని. దూరముగ నుండువానికి బోధింపవలసి వడివడిగబోవుట త్వరితచారిక. మహాకాశ్యపస్థవిరుని యెదుర్కొనినపుడు ముహూర్తమునకు మూడుపరువుల నేల (3/4 యోజనము) భగవంతుడునడిచినాడు. అట్లే ఆలవకుని కొఱకు ముప్పదియోజనములును, అంగులిమాలునికొఱకు ముప్పదియోజనములును, పుక్కుసాతికొఱకు నలభైయైదు యోజనములును, మహాకప్పునునికొఱకు నూటయిర్వై యోజనములును, ధనియునికొఱకు నూటయేడు యోజనములును, తిష్యశ్రామణేరునికొఱకు నూరుయిర్వదియోజనములును మూడుగవ్యూతులును నడిచినాడు. దీనిని త్వరితచారిక యందురు. మామూలుగ దినమునకు యోజనము, అర్ధయోజనముచొప్పున గ్రామ గ్రామములందు భిక్షాచరణమొనర్చుకొనుచు లోకానుగ్రహముకొఱకె చరించుట మందచారిక యందురు.

కోసలరాజుచేత [1] ఉక్కట్ఠయనెడి గ్రామమును బహుమానముగ బొంది రాజ భోగ్యముల ననుభవించుచున్న పౌష్కరసాతియను బ్రాహ్మణుడు ఇచ్ఛానంగల వన భూమియందు సుగతుడు గౌతముడు విహరించుచున్నాడని విని అతని దర్శింప కుతూహలించెను. ఒకనాడు పౌష్కరసాతి తన శిష్యుని మహాపండితుని అంబష్ఠనామ కుని చేరబిలిచి ''నాయనా! నీవు అన్నింటను నాయంతటివాడవు. యోగ్యుడవు. నేర్పరివి. అదిగో! శాక్యకులోత్పన్నుడగు గౌతముడు ప్రవ్రజితుడై ఆ వనఖండమందు విహరించుచున్నాడట. అర్హతులగు అట్టిబోంట్లదర్శనము లత్యంతదుర్లభములు. లోకమునందతనికీర్తి పిక్కటిల్లి యున్నది. ఆ కీర్తికి తగినంతటివాడు అవునో కాదో, నీవు పోయి పరికించి రమ్ము.''

''పూజ్యుడా! ఆ విషయమును నే నెట్లు గ్రహింపగల్గుదును?''

''నాయనా! అంబుష్ఠా! ముప్పదిరెండులక్షణములనొప్పినవాడు మహాపురుషు డని వేదములు వాకొన్నవి. అట్టి లక్షణసంపన్నుడు యింటియందుండిన సర్వ సర్వంసహాకు సార్వభౌముడు కాగలడు. విరక్తుడై యిల్లువదలి సంన్యసించినచో అర్హతుడు సమ్యక్ సంబుద్ధుడు నిక్కము కాగలడు. ఇంతకువినా మూడవదారి లేదు. ఆ యానవాళ్ళతని యందు గ్రహించి సంప్రదించిరమ్ము. పొమ్ము.''

వల్లెయని గురువును వీడ్కొని అంబష్ఠమాణవకుడు రథమునెక్కి పలువురు బ్రాహ్మణమాణవకులు తనవెంట వచ్చుచుండ, ఇచ్ఛానంగల వనఖండము దిశకు మొగమై పయనించెను. వనము సమీపించినంత రథంబుడిగ్గి కాలినడకనె లోనికిజొచ్చి అందందు దిరుగుచున్న భిక్షువులతో నిట్లనియె.

''పూజ్యులారా! భగవంతు డెచ్చట విహరించుచున్నాడు? వారిని దర్శింప వలెను.''

''అంబష్ఠా! అదిగో, తలుపులు మూసియున్న ఆ విహారము చెంతకు నిశ్శ బ్దముగ బోయి సూచనకొఱకై, తలుపుదట్టి, తాళమును కదలింపుము. భగవంతుడు ద్వారము తెఱవగలడు.''

భిక్షువుల ప్రత్యుత్తరమాలించి వారు చెప్పినట్లు జేసెను. బుద్ధుడును తలుపు దెఱచినంత అంబష్ఠుడు లోనికి ప్రవేశించి సమ్మోదన మొనర్చి యొకచో గూర్చొనెను.

1. పౌష్కరసాతి బాల్యమందే మూడువేదములందును పారంగతుడై పండితుడై కోసలరాజుచే మెప్పువడసి ఉక్కట్ఠయనెడి నగరమును పారితోషికముగ పొందెను.

భగవంతు డటునిటు తిరుగుచున్నాడు. అంబష్ఠుడు కూర్చొనియే ప్రశ్నించుచున్నాడు. ఒక్కింతవడకి భగవంతు డిట్లనియె.

"అంబష్ఠా! పెద్దవారితో ప్రసంగించుట యిట్లేనా? నిల్చబడియో, తిరుగు చునో ఉన్నవారితో నీవలె కూర్చొని సంభాషించుట తగినదేనా?"

"గౌతమా! తగదు. తిరుగుచున్న వానితో తిరుగుచును, నిలువబడియున్న వానితో నిల్చబడియు, కూర్చొనియున్న వానితో కూర్చొనియు సంభాషించుట తగినది. అయినను ముండకులు, శ్రమణులు, హీనజాతులును బ్రహ్మకు పాదము లందు కల్గిన సంతానము. వారిపట్ల యిట్లు వర్తించుట తగినదే."

"అంబష్ఠా! ఏదో అర్థమును – ప్రయోజనమును మనస్సునందు పెట్టుకొని యిచ్చటికి వచ్చితివి. కాని, 'నేను అర్థిని' అని గమనింపవైతివి. గురుకులవాస పద్ధతి నీకు తెలియదు. గురుకులమున వసించితినని వ్యర్థముగ విఱ్ఱవీగుచున్నావు."

భగవంతునిమాట బాణమై తాకుటచే భరింపలేక బ్రాహ్మణు డిట్లనియె. 'గౌతమా! శాక్యజాతి మిగుల క్షుద్రమైనది. శాక్యవంశీయులకు సభ్యతయే తెలి యదు. ఊరక కాఱులు ప్రేలుచుండుటయే వారిపని. బ్రాహ్మణులను ఆదరింపరు, పూజింపరు, గౌరవింపరు. నీచులగువారికే అది యొప్పినది." అని ఆవేశభరితుడై అంబష్ఠుడేమేమో ఆక్షేపించుచున్నాడు. ప్రశాంతిచిత్తమున కొంతదూరము విని బుద్ధు డిట్లనియె.

"అంబష్ఠా! శాక్యులు నిన్నెక్కడ కఱచినారు?"

"గౌతమా! నేనొకానొక సమయమున మా ఆచార్యుడగు పౌష్కరసాతి పంప బూని యేదో పనికొఱకై కపిలవస్తునగరమునకు బోయితిని. అక్కడ శాక్యకుమార కులు తమ సభాగృహము (ప్రజాతంత్రభవనము) నందు పెద్ద పెద్ద కుర్చీలపై కూర్చొని యొకరినొకరు గేలిచేసికొనుచు కేరడములాడుచు, లోనికి ప్రవేశించిన నన్ను జూచి ఒక్కడైనను కూర్చొనుమని మాటమాత్రానికైనను చెప్పలేదు. గౌతమా! శాక్యజాతి క్షుద్రజాతి."

"అంబష్ఠా! పిట్ట తన గూటిలో యిష్టానుసారము ఆలాపించును. దానికి ఒకని అడ్డమేమి? శాక్యులకు కపిలవస్తు సొంతతావు. దానిజూచి నీవు తామస పడ నేల?"

''గౌతమా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనెడి నాల్గువర్ణములయందును మొదటివాడైన బ్రాహ్మణునకు తక్కిన మూడు జాతులవారును సేవకులై మెలగ వలెను. నిజమట్లుండ శాక్యు లుద్ధతులై ఆనా డట్లు ప్రవర్తించుట వారి అసభ్యతకు పరిచాయకము.''

అంబష్ఠు డిట్లు మీదమీద శాక్యుల నాక్షేపించుట, నిందించుట గాంచిగాంచి సుగత బుద్ధుడు వానికి శృంగభంగము కల్పింపనెంచి మెల్లగ నిట్లనియె.

''అంబష్ఠా! నీ వేగోత్రమువాడవు?''

''గౌతమా! నాది కృష్ణాయన గోత్రము.''

''ఓహో! అంబష్ఠా! నీ గోత్ర నామమునుబట్టి చూచిన నీవు శాక్యులకు దాసీ పుత్రు డవు. వారు నీకు ప్రభువులు. ఎట్లందువేని వినుము. శాక్యులకు వంశకర్తయై మూలపురుషుడై ఇక్ష్వాకుడను రాజొకడు పూర్వముండెను. అతడు చిన్నభార్య యందులి మక్కువతో ఆమెకొడుకునకే రాజ్యమప్పగించదలంచి పెద్దకొడుకులై యుండిన ఉల్కాముఖుడు కరండుడు హస్తినికుడు సినీసూరుడనెడి నల్వురుని రాజ్యమునుండి వెడలనడిపించెను. వారును వలసబోయి హిమాలయ ప్రాంతమున నొక సరోవరము నాను కొనియుండు నొక శాకవనమున (టేకువనము) నివసింప దొడగిరి. అనుకూలమగు సంబంధ బాంధవ్యము లభింపమిచేతను, జాతి చెడునను భయముచేతను వారు తోబుట్టువులనే చేబట్టి పొందుచువచ్చిరి. కాలము గడచినంత ఒకనాడు యిక్ష్వాకుడు తన మంత్రులతో 'కుమారులి ప్పుడెందున్నార' ని యడిగెను. మంత్రులును 'నరేంద్రా! హిమాచలప్రాంతమునందు మహాశాకవనమున నున్నార' ని వారి కథను సవిస్తారముగ జెప్పిన నాలకించి నరపతి నివ్వెఱవోయి ''ఔరా! కుమారులు శాక్యులు (సమర్థులు), శాక్యులు, శాక్యులు గదే'' యనెను. అప్పటి నుండి వారు శాక్యులని పేరువడసిరి. ఇట్లు శాక్యులకు యిక్ష్వాకువు మూలపురు షుడు. ఆ యిక్ష్వాకునకు దిశ యనెడి దాసి యుండినది. ఆమె కొక బిడ్డడు కల్గి నాడు. ఆ శిశువు పుట్టినతోడనే తల్లిని జూచి ''అమ్మా నన్ను కడుగుము. ఈ ముఱికిని కడిగివేయుమ'' ని మాటలాడెను. పురిటి శిశువు మాటలాడుట కరము విస్మయక రమై 'కృష్ణపుట్టినది – కృష్ణపుట్టిన' దని పల్కిరి. ఆ కాలమునందు కృష్ణ అను మాటకు దయ్యము – పిశాచము అని అర్థము. వాడే పెరిగి పెద్దవాడై కృష్ణాయనుడని పేరువడ సెను. వాని సంతతివారే మీరు. కాబట్టి, అంబష్ఠా! నీవు శాక్యులకు దాసీ పుత్రుడవు. నిజముగాదేమో చెప్పుము?''

అంబష్ఠుడు మిన్నకున్నాడు. భగవంతుడు ముమ్మాఱడిగిన కూడ మాఱుపల్క లేదు. కినిసి బుద్ధు డిట్లనియె. ''అంబష్ఠా! ఊరకున్న నెట్లు పొసగును? తథాగతుని ప్రశ్నకు మూడుమాఱులకును ఉత్తరమివ్వక పోయినచో తల యేడు వ్రక్కలు కాగలదు. అదె యటు చూడుము.''

భయంకరుడగు యక్షు డొకడు యినుపగుదియ నొకటి చేత బట్టి అంబష్ఠుని తలకు సూటిగ నాకసమున నిలువబడియున్నాడు. అదిగాంచి అంబష్ఠుడు భయకంపితుడై భగవంతునితో ''గౌతమా! మీరన్నమాట నిజమే. నేనును అట్లే వినియున్నా'' ననెను. అంతట అచ్చోట ఆసీనులైయున్న బ్రాహ్మణకుమారకులు ఎలుగెత్తి ''అంబష్ఠ మాణవకుడు దాసీపుత్రుడు గౌతముని అపహసింపబోయి స్వయముగ తానే పరిహాసములకు పాలయ్యెను'' అని బిగ్గరగ గేలిసేయ దొడగిరి. దీనాననుడై యుండు అంబష్ఠునియందు జాలివొడమి బుద్ధదేవుడు పరిపరి విధముల పరిహసించుచున్న బ్రాహ్మణ కుమారకులతో నిట్లనియె.

''మాణవకులారా! దాసీపుత్రుడని మీరు అంబష్ఠుని తూలనాడకుడు. వీరి మూల పురుషుడు కృష్ణాయనుడు చిన్నవాడుగాడు. అతడు మహాఋషి. ఆయన దక్షిణదేశమున కరిగి బ్రహ్మమంత్రముల పఠించి మహాపండితుడై తిరిగి యిక్ష్వాకుని చెంతకువచ్చి అతని కన్యను తనకు యిమ్మని కోరెను. 'దాసీపుత్రుడు వీడు, నా కన్యను కోరుటయా' యని కుపితుడై ఇక్ష్వాకుడు బాణమును యెక్కుపెట్టెను. కాని అమ్మహాత్మునిపై వేయనుగాని, వెనుకకు తీయనుగాని సామర్థ్యుడుగాక తత్తఱ పడుచున్న భూపాలునిగాంచి అమాత్యులు కృష్ణాయనుని డగ్గఱి యిట్లు విన్నవించిరి.

''భదంతా! మారాజునకు మంగళమొదవుగాక.''

''మంత్రులారా! రాజునకు మంగళమే. కాని ఆ బాణమును క్రిందికి విడిచినచో భూమి బ్రద్దలగును. పైకి వదిలినచో యేడేండ్లు వాన గురియదు.''

''భదంతా! రాజునకును రాజ్యమునకును మంగళము చేకూఱవలెను.''

''మంత్రులారా! అటులైన ఈ బాణమును రాజు తన జ్యేష్ఠపుత్రునిపై వదలునది. వానికిని చేటు లేదు. బట్టతలగలవాడుగ మాత్రము కాగలడు.''

కృష్ణాయనుని మాట చొప్పున వర్తించి రాజు సుఖమును బొందెను. పిదప నతని మహానుభావునిగ గుర్తించి కూతురి నొసగెను. మాణవకులారా! దాసీపుత్రుడని అంబష్ఠకుని నిందింపకుడు. అతడు మహాఋషి సంతతివాడు.

అని యిట్లు మాణవకుల నదలించి దశబలుడు అంబష్ఠునితో నిట్లనియె. "అంబష్ఠా! 'జాతినిబట్టి జూచిన క్షత్రియు డుత్తముడు. విద్యాచరణ సంపన్నుడగువాడు దేవమానవులందు ఉన్నతుడ' ని సనత్కుమారుని మాటగలదు. నిజమంతే."

"గౌతమా! విద్యయనిన ఆచరణయనిన నెట్టిది?"

"అంబష్ఠా! అనుపమమగు విద్యాచరణసంపదకు జాతివాదమక్కఱరాదు. గోత్రవాదము కొఱగాదు. అభిమానవాద మసలే పనికిరాదు. ఆ చిక్కులు ఊడిన వానికే విద్యాచరణసంపద లభింపగలదు. అంబష్ఠా! లోకమునందు[1] తథాగతుడుత్పన్నుడైనాడని విని బ్రహ్మచర్య చరణమును నిర్వహించుచు భిక్షువు ప్రథమధ్యానమును, ద్వితీయధ్యానమును, తృతీయధ్యానమును, చతుర్థధ్యానమును, పూర్వజన్మజ్ఞానములను, జీవకోటియొక్క జననమరణములను దర్శించుచున్నాడు.[2] వానికి జన్మబంధము లుడిగినవి. బ్రహ్మచర్య చరణము పండినది. కృతకృత్యుడు వాడు. కరణీయ మొక్కటి లేదు. వాడే విద్యాసంపన్నుడు. వాడే ఆచరణసంపన్నుడు.

ఈ విద్యాచరణ సంపదను అభిలషించువానికి అపాయముఖములు (విఘ్నములు) నాలుగు. తన నిష్ఠ నుజ్జగించి అన్యనిష్ఠకు దాసుడై ఫలముల భక్షింప మరగి వానప్రస్థుడగుట. ఇది మొదటి అపాయముఖము. ఆ చోట గూడ నిలువక కందమూలముల నాశించుట; ఇంకను జాఱి గ్రామప్రాంతముల జేరి అగ్నిపరిచర్య నారంభించుట; మఱియు గ్రామము నందె ప్రవేశించి 'శ్రమణ బ్రాహ్మణుల కాతిథ్యమిచ్చి సత్కరింతు' నని మహా వ్యాసంగ పరుడగుట. ఇట్లు ఈ నాల్గును విఘ్నములు.

---

1. 146, 147 పేజీలు చూడుడు.

2. అ. క. తాపసులు యెనిమిది విధములు. 1. పుత్రభార్యాసహితుడు 2. ఉంఛాచారి 3. అనగ్నిపక్వకుడు 4. అస్వయంపాకీ 5. అశ్మనుష్టికుడు 6. దంతవల్కలికుడు 7. ప్రవృత్తపలభోజి 8. పాండువలాశికుడు. ఇందు కేణియజటులునివలె కుటుంబము గలవాడు. పుత్రభార్యాసహితుడు. గ్రామమునందు భిక్షించి దొరికిన ధాన్యమును తెచ్చుకొనువాడు అనిగ్నిపక్వకుడు. వండిన అన్నమును తెచ్చుకొనువాడు అస్వయం పాకి. రాతితోగాని, చేతితోగాని వృక్షముల తాటను ఒలిచికొని తినువాడు అశ్మముష్టికుడు. పండ్లతో ఒలిచికొని తినువాడు దంతవల్కలికుడు. రాలిన ఆకులను తినువాడు పాండు పలాసికుడు. ఉంఛవృత్తిచేయువాడు ఉంఛాచారి. పండ్లను తినువాడు ప్రవృత్తిఫలభోజి. వీరిలో కూర్చున్న చోటునుండి లేవక చేతికి అందిన దానిని తినువాడు ఉత్కృష్టుడు. కూర్చొన్న చెట్టును వదలనివాడు మధ్యముడు. ఆ యా చోట్ల బోవువాడు సామాన్యుడు.

అంబష్ఠా! ఈ అనుపమవిద్యాచరణ సంపదను నీవును నీ ఆచార్యుడును తెలిసికొని ఉపదేశించుచున్నారా?''

''గౌతమా! లేదు. దానికిని మాకును యెంతో దూరము.''

''అంబష్ఠా! అపాయముఖములయందైనా నున్నారా?''

''గౌతమా! అదియును లేదు.''

''అంబష్ఠా! శ్రమణులు – ముండకులు మొదలగువారు బ్రహ్మకు పాద ములందు కల్గిన సంతానము. వారికిని త్రైవిద్య బ్రాహ్మణులకును సాటియెక్కడ?'' అని యంటివి గదా? ఆ మాట మీ గురువు నేర్పిన పాఠమా? కోసలరాజు ప్రసేన జిత్తుడు దయాధర్మమని పెట్టిన మృష్టాన్నమును దిని విద్యయు లేక ఆచరణయు లేక వ్యర్థముగ విఱ్ఱవీగుచున్నారే. మీ ఆచార్యుడగు పౌష్కరసాతి బ్రాహ్మణునకు కోసల రాజేంద్రుడు ముఖమైన చూపింపడు. ★ తెరచాటునందుండియే మాటలా డును. మీ పొంకము లట్లున్నవి; బింకము లిట్లున్నవి. అంబష్ఠా! భూపాలుడు పల్కిన మాటలను విని వాటినె భృత్యుడు పునరుచ్చరించినచో అంతటితోడనె వాడు రాజు కాగలడా?''

''గౌతమా! కాలేడు.''

''అట్లే అంబష్ఠా! మంత్రకర్తలును మంత్రప్రవక్తలును నగు అష్టవామక వామదేవ విశ్వామిత్ర జమదగ్ని అంగిరస భరద్వాజ వసిష్ఠ కశ్యప భృగువులు మున్నగు పూర్వ ఋషు లుచ్చరించిన వేదమంత్రములను చదివినంత, చదివించినంత, పలికినంత,

---

★ అ. క. పౌష్కరసాతి సమ్ముఖావర్జనీ మాయను (HYPNOTISM) తెలిసిన వాడు. కోసల రాజు అమూల్యమగు భూషణముల నలంకరించుకొని యున్నపుడు బ్రాహ్మణు డతని వద్దకు పోయి ఆ మాయా ప్రభావమున ఏఅభరణమును అడిగినను కాదనక రాజు దానిని తీసి యిచ్చును. మఱునాడు నా ఆభరణము లెక్కడ? యని మంత్రుల నడుగును. వారును పౌష్కరసాతికి యిచ్చితివని చెప్పుదురు. ఎందుకిచ్చితినని రాజు వితర్కించును. ఆవర్జనీ మాయా మూలమున గ్రహించినాడని యెఱింగి నాటిసుత ముఖాముఖి చూచుట మానుకొనెను.

మరికొంద రిట్లు చెప్పుదురు. రాజునకును పౌష్కరసాతికిని గల ప్రగాఢ స్నేహమును జూచి ఓర్చలేక బ్రాహ్మణుని దేహమున కుష్ఠు ఉన్నదని చెప్పుటచే రాజు అతనిని చూచుట మాను కొనెను. కాని రాజనీతి కుశలుడగు ఆ బ్రాహ్మణునితో వలయు సలహాను తెరచాటు నుండెయే రాజేంద్రుడు గ్రహించువాడు.

పఠించినంత మీరును ఋషులు కాగల్గుట కల్ల. అదియునుగాక, అంబష్ఠమాణవకా! మంత్రకర్తలగు పూర్వఋషులు యీనాడు మీవలెనే మణికుండలభూషితులు, మహనీయ వస్త్రాలంకృతులు, మంజులకేశ పాశధరులునై యుండిరా?''

''గౌతమా! లేదు.''

''అంబష్ఠా! పాతబియ్యపుటన్నము పక్వములగు శాకపాకములు, తెల్లనిపప్పు చల్లని పానీయములతో మీ వలెనే మంత్రకర్తలగు పూర్వ ఋషులు పొంపిరి బోవుచుండిరా?''

''గౌతమా! లేదు.''

''అంబష్ఠా! నూనూగుయౌవనమున నొప్పెసలారు రమణీమణులతో మీవలె వారును రమించుచుండెడివారా?''

''గౌతమా! లేదు.''

''అంబష్ఠా! కత్తిరించిన వెండ్రుకలుగల గుఱ్ఱములను బూన్చిన రథములనెక్కి మీవలె వారును విహరించుచుండిరా?''

''గౌతమా! లేదు.''

''అయ్యా! అంబష్ఠా! నీవును నీ ఆచార్యుడును ఋషులును గారు. ఋషిత్వ మార్గమున అడుగుపెట్టిన వారుగూడ కాదు. మరియు నేమైన ప్రశ్నింపవలసి యున్న ప్రశ్నింపుము.'' అని పలికి భగవంతుడు గౌతముడు విహారమునందుండి బయటకువచ్చి చంక్రమణ వేదికపై బోయి నిలువబడెను. అంబష్ఠుడును అతని వెంట వెంటబోయి మహాపురుష లక్షణములను పరిశీలించుచు తాను స్వయముగ ముప్ప దింటిని గాంచగల్గెను. ★ తక్కిన రెంటినికూడ భగవంతుని దివ్యశక్తి ప్రభావమున దర్శించి సంతుష్టుడై సెలవందికొని మరలి తన రథంబెక్కి నిజస్థానమును చేరుకొనెను.

అక్కడ పౌష్కరసాతి బ్రాహ్మణుడు గొప్ప బ్రాహ్మణగణముతో కూడి అంబష్ఠ కుని రాక నెదురు జూచుచు తన ఉద్యానవనమున నుండెను. వాడును రథంబును దవ్వులన దిగివచ్చి ఆచార్యునకు నమస్కరించి కూర్చొనినంత పౌష్కరసాతి యిట్లడిగెను.

---

★ 139 వ పేజీ చూడుడు.

''అంబష్ఠా! భగవంతుని గౌతముని జూచివచ్చితివా?''

''దేవా! అవును.''

''నాయనా! అతడుకీర్తికి దగిన మూర్తియేనా?''

''అయ్యా! సందేహము లేదు. మహాపురుషలక్షణములన్నియు వెలితి లేకుండా నతనిలో నున్నవి.''

''అంబష్ఠా! ఏమేమి ప్రసంగించితిరి?''

అని ఆచార్యు డడిగినంత విషయమంతయు సవిస్తరముగ అంబష్ఠమాణవ కుడు యెఱింగించెను. అది విని ఆచార్యుడు పౌష్కరసాతి, శిష్యునితో కనలి యిట్ల నియె.

''మూఢుడా! మహానుభావుని చిత్తము త్తలపెట్టి క్రొత్తనరకమునే గొంటివి. నీ పాండిత్యమును బహుశ్రుతత్వము కాల్పనా? ఇటనుండి తొలగుమ'' ని గద్దించి పలికి మఱునాడు గౌదమబుద్ధుని దర్శనమునకు పోవలెనని సమయమును నిశ్చయిం చెను.

మఱునాడు వఱువాతన లేచి వలయు భక్ష్యభోజ్యముల నన్నిటి సజ్జము చేసికొని తాను నివసించు ఉకట్ఠాపురినుండి బయల్వెడలి ఇచ్ఛానంగల వనప్రదేశమున కనతిదూరమున వాహనములను దిగి లోన బ్రవేశించి భగవంతుని సందర్శించి సమ్మోదన మొనర్చి పౌష్కరసాతి యిట్లనియె.

''గౌతమా! నా శిష్యుడు అంబష్ఠుడు మిమ్ము దూఱనాడినాడు. వాని తప్పిద ములను క్షమించి ఆశీర్వదింతురని ప్రార్థించుచున్నాను.''

''అంబష్ఠ మాణవకా! సుఖీభవ! సుఖీభవ!!''

అట్లు భగవంతుని ప్రేమాలాపములను గైకొని పౌష్కరసాతి బ్రాహ్మణు డతని యంగాంగముల మహాపురుషలక్షణములను సంపూర్ణముగ గ్రహించి తాను దెచ్చిన భోజనమును ఆనాడు స్వీకరించునట్లు తథాగతుని అభ్యర్థించెను.

భగవంతుడును మౌనమున అంగీకరించెను. అంత పౌష్కరసాతి చేతులార తానె వడ్డించి భిక్షుసంఘముతో గూడ బుద్ధిని సంతృప్తుని జేసెను. షడభిజ్ఞుడును యథాపూర్వ ముగ[1] ఆనుపూర్వికథను బ్రాహ్మణునకు బోధించినంత వానికి 'ఉత్పత్తి

ధర్మము కలదంతయు – వినాశధర్మము కలదియె' యనెడి విరజధర్మచక్షువు సంభూతమైనది. అటు పిమ్మట పౌష్కరసాతిబ్రాహ్మణుడు శాస్తతో నిట్లనియె.

''భంతే! గౌతమా! పరివారసహితముగ నేను బుద్ధుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును శరణుజొచ్చుచున్నాను. సంఘమును శరణుజొచ్చుచున్నాను. నేటినుండి అంజలిబద్ధ శరణాగత ఉపాసకునిగనన్ననుగ్రహించవలసినది. ఈ ఉక్కట్ఠాపురము నందలి ఉపాసకులలో నన్ను గూడ నొక్కనిగ నెన్నునది. మాకును మా సంతతికిని శ్రేయస్సు లభించును. దేవా! అనుగ్రహింపుము.''

''బ్రాహ్మణా! శుభమగుగాక.''

## చంకిసూత్రము (వి. పూ. 457)

[1]ఒక సమయమున భగవంతుడు బుద్ధుడు మహాభిక్షుసంఘముతో కోసల దేశమునందు చారిక నొనర్చుచు ఓపసాదమను బ్రాహ్మణాగ్రహారమునకు వచ్చి చేరెను. ఆగ్రామమునకు ఉత్తరమున శాలవృక్షములతో నొప్పియుండు దేవవనము నందు విడిసి విహారము జేయుచుండెను.

ఆ గ్రామమునందు చంకి యనెడి బ్రాహ్మణుడు గలడు. అతడు కోసలరాజు చేత సన్మానితుడై ఆ ఓపసాదగ్రామమును ఉపాయనముగ సంపాదించి రాజభోగము లననుభవించుచుండెను. శాక్యపుత్రుడు శ్రమణగౌతముడు ఊరిబైట విడిచియున్నా డను వార్తను విని, యిదివఱకె అమ్మహనీయుని [2] మహాకీర్తిని బహువిధముల నాకర్ణించియున్న వారగుటబట్టి ఆ గ్రామవాసులగు బ్రాహ్మణులు పల్వురు గుమికూడి దర్శింప నభిలషించి ఊరికి ఉత్తరమువైపునకు బయల్వెడలి నడచుచుండిరి.

పగటినిద్రకై ప్రాసాదమునెక్కి అందుండి వీధిని బోవు జనసముదాయమును వీక్షించి చంకిబ్రాహ్మణుడు తన మహామాత్యుని పిలిచి 'యేమిటా సంరంభమ'ని యడిగెను. వాడును శ్రమణగౌతముడు ఊరివెలుపల దేవవనమున నుండుటయు, నతని సందర్శించుకౌతుకముతో గ్రామవాసులగు బ్రాహ్మణులు పోవుచుండుటయు నివేదించిన నంతయు విని ఆ విప్రు డిట్లనియె.

---

(1) మ. ని 2 – 5 – 5. (2) 40, 41 పేజీలు చూడుడు.

''క్షత్త్రా! పోపొమ్ము. నేనుకూడ వచ్చెదనని చెప్పి ఆ గుంపును కొంతసేపు నిలుపుము'' అనిన యజమానుని అజ్ఞను గైకొని వాడును అట్లే జేసెను. చంకిబ్రాహ్మణుడును శ్రమణగౌతముని దర్శనము నపేక్షించి పోవనుద్యుక్తుడై యున్నాడనెడి సమాచార మును, నానా దేశములనుండి వచ్చి ప్రస్తుతము ఓపసాద గ్రామముననె నివసించుచున్న యేనూర్వురు బ్రహ్మణులు విన్నవారై ఆతనికడ కరిగి యిట్లనిరి. ''చంకీ! నీవు శ్రమణగౌతముని దర్శింపపోవ దలంచియుంటివా?''

''అవును. ఇదియే వెడలుచున్నాను.''

''అయ్యా! చంకిబ్రాహ్మణా! ఆగుమాగుము. నీయంతటివాడు స్వయముగ శ్రమణగౌతముని కడకేగగోరుట యుచితముగాదు. అతడె నీకడకు వచ్చుట యోగ్యము. నీవు విశుద్ధకులమున బుట్టితివి. నీ కీర్తి విశ్వవిశ్రుతము సజ్జనుడవు - సంపన్నుడవు - సర్వసమర్థుడవు. వేదవేదాంగ పారంగతుడవు. భవ్యశీలుడవు - బ్రహ్మవర్చస్వివి. నీమనో వాక్కాయములు త్రికరణములు మూడును కల్యాణమయ ములు. బుద్ధిమంతుడవు. వృద్ధోపసేవివి. మూడు వందలమంది శిష్యులకు వేదమును పఠింపజేయు ఆచార్యు డవు. కోసల రాజపూజితుడవు. ఖుద్దున ఓపసాద గ్రామము నకు ప్రభువవు. అయ్యా! నీవే శ్రమణ గౌతముని వద్దకరుగుట నితాంతమయోగ్యము. అతడె నీ కడకు రాదగియున్నది.''

''బ్రాహ్మణులారా! ముచ్చటైన మీ మాటలకెంతయో మెచ్చితిని. కృతజ్ఞుడను. అయినను నొకమాట. ఎన్నివిధముల పర్యాలోచించినను శ్రమణగౌతముని యెడకు నేనేగుటయలెస్స. అతడె నావద్దకు రాదగుననుట దూరమాలోచించని మాట. తెప్పల దేలు మహాభోగభాగ్యములను నిరాకరించి అతడు సంన్యాసియైనాడు. తారుణ్యము తొణికిసలాడు నిండారిన యౌవనమందే సతీసుతులను యిల్లు వాకిండ్లను వదలి తలను గొఱిగించుకొని వనములకు మరలినాను. అతని శీలమలోకసామాన్యము. అతని సౌజన్య మనన్యసాధారణము. స్వతః క్షత్రియుడు. సార్వభౌముని కొడుకు. సర్వమును వదలి సంన్యాసియైనాడు. దేవమానవులకతడు పూజ్యుడు. మగధ నాథుడగు బింబిసారునిచే సన్మానితుడు. బ్రాహ్మణులారా! పుణ్యవశమున మనగ్రా మము పొంతకే వచ్చినాడు. నిజమున కిప్పు డతడు మనకు అతిథికూడా. 'అతిథి దేవుడ' నుమాట మీరెఱుగనిదిగాదు. అతనిని సత్కరించుట మన ధర్మమును మనము బాలించుట. ఇట్లెంతదూరమాలోచించినను నేనే బోవుట ఒప్పైనపని. పదండు బోదము. మీరును రండు.''

చంకిబ్రాహ్మణు డిట్లు సమాధానముజెప్పి మహాబ్రాహ్మణసంఘము తనతోడ వచ్చు చుండ భగవంతుడున్నెడకుబోయి అతనితో సమ్మోదనమొనర్చి ఒకవైపున గూర్చొనెను. తథాగతుడును పండితులగు వృద్ధబ్రాహ్మణులతో యేదో సంభాషించుచు కూర్చొని యున్నాడు. ఆ పరిషత్తులోనే ఒకడై కూర్చొనియుండు కాపథికుడ నుమాణవకుడు మాటి మాటికి భగవంతుడు మాట్లాడునెడ తానును మధ్యమధ్య అడ్డము మాట్లాడుచు యిట్లు ప్రశ్నించెను.

''గౌతమా! మంత్రవేత్తలగు బ్రాహ్మణులు వేదములందె శ్రద్ధగలిగి 'యిదియె సత్యము. కడమయంతయుకల్ల' యనుచున్నారు.''

''భారద్వాజా! కాపథికా! 'ఇదియే సత్యము. తక్కినదంతయు దబ్బఱ' యని చెప్పు యీ బ్రాహ్మణులలో ఒక్కడైనను 'దీనిని నే నెఱిగితిని – జూచితిని' అని దృఢముగ చెప్పగల్గుచున్నాడా?''

''గౌతామా! లేదు.''

''భారద్వాజా! వారి ఆచార్యులుగాని, ప్రాచార్యులుగాని మూలపురుషులగు అష్టక వామకాది మంత్రకర్తలుగాని ఒక్కడైనా చెప్పగల్గినాడా?''

''గౌతమా! లేదు.''

''భారద్వాజా! ఇదియంతయు అంధపరంపరాన్యాయము. అట్టియెడ వారి శ్రద్ధ నిర్మూలమైనదిగదా? అప్రమాణముగదా?''

''గౌతమా! అటుగాదు. ఆ బ్రాహ్మణులు శ్రద్ధనే ఉపాసించుట లేదు. అనుశ్రవము (వినుట) ను గూడ ఆశ్రయింతురు.''

''భారద్వాజా! ఇంతకుముందు శ్రద్ధయని యంటివి. ఇప్పుడు అనుశ్రవమనుచున్నావు. 1. శ్రద్ధా 2. రుచి 3. అనుశ్రవము 4. ఆకారపరివిత్కరము 5. దృష్టి నిధ్యాసా క్షవము లనెడి అయిదు ధర్మములీజన్మమునందే రెండువిధములగు పరిపాకములనిచ్చుచున్నవి. చక్కగ ననుష్ఠించినను నిష్ఫలమగుటయు గలదు. చక్కగ ననుష్ఠింపకపోయినను ఫలించుటయుకూడ గలదు. కావున సత్యానురక్షకుడగు విజ్ఞపురుషుడు 'యిదియే సత్యము – మిగతది మిథ్య' యని యెన్నడును అనరాదు. పురుషునకు శ్రద్ధగలుగుచున్నది. వాడు యిదియె నా శ్రద్ధయనునుగాని అన్యమంతయు అబద్ధమ నడు. అట్లే ఇది నారుచి ఇది నా అనుశ్రవము, ఇది నా ఆకార పరివిత్కరము, నా దృష్టి నిధ్యానాక్షమిది' యని యనునేగాని కడమవన్నియు కల్ల యనడు. ఇట్లు సత్యమును రక్షించుచున్నాడు.

భిక్షువగువానిని చూచినంతనె గృహస్థులగువారు వానిని పరీక్షింపవలెను. 'లోభ ద్వేష మోహములతో విముక్తుడైనాడా? వాడుపదేశించు ధర్మమును స్వయముగ వాడు అనుభవించినాడా? ఆ ధర్మము లోకులకు చిరకాలసుఖము నొడగూర్చ గలదా? అని యిట్లు పరీక్షించి ఆతనియందు శ్రద్ధావంతులగుచున్నారు. పరిచర్య చేయుచున్నారు. చెవియొగ్గి ధర్మములను వినుచున్నారు. విన్నవాటిని అర్థపరీక్ష జేయుచున్నారు. అర్థపరీక్ష జేసి ధ్యానించుచున్నారు. వారికి రుచి గల్గుచున్నది. ఉత్సాహము కల్గుచున్నది. ఉత్థానము కల్గుచున్నది. పరమసత్యసాక్షాత్కార మేర్పడుచున్నది. భారద్వాజా! మఱియు వినుము.

సత్యప్రాప్తికి సాధనము ప్రయత్నము. దానికి ఉత్థానము. అందుకు ఉత్సాహము. అట్లే ధర్మనిధ్యానాక్షము, అర్థపరీక్ష, ధర్మధ్యానము, ధర్మశ్రవణము, పర్యుపాసనమును శ్రద్ధయు క్రమముగ నొకదాని కొకటి సాధనములు.''

భగవంతుని మాటలను విని పరిషత్తంతయును చేతులు మోడ్చి దేవా! శ్రమణ ద్వేషులమైన మాకు శ్రమణభక్తిని కల్గించితిరి. శరణాగత ఉపాసకులుగ మమ్మను గ్రహింపుడ''ని వేడుకొనిరి.

## ౪

## క్షుల్ల దుఃఖస్కంద సూత్రము (వి. పూ. 457)

★ సర్వజ్ఞుడు సుగతుడు ఒకానొక సమయమున శాక్యదేశమునందు కపిలవస్తునగరముయొక్క న్యగ్రోధారామమునందు విహారము జేయుచున్నాడు. అట్టియెడ మహానాముడను శాక్యుడు భగవంతుని చేరవచ్చి యిట్లనియె.

''భంతే! పెక్కుదినాలనుండి తాము సెలవిచ్చు ధర్మమును వినుచు లోభ ద్వేష మోహములు చిత్తమునకు ఉపక్లేశములని తెలిసికొంటిని. కానీ లోభవృత్తి నా చిత్తమునకు హత్తుకొనియె యున్నది. దాని జంజాటము నాకు తొలగలేదే.''

''ఆయుష్మంతుడా! మహానామా! లోభము నీయందు సమూలముగ లోపించియె యుండినచో యింటిలో కాపురము జేయనిచ్చగించవు. కామోపభోగములందు ఆసక్తుడవును కాబోవు. నీవిపుడు గృహస్థుడవు. కామభోగ లంపటుడవు. లోభము నిన్ను వీడ లేదనుటకు యింతకుమించిన ఋజువేల? భోగములు యేవేళను

★ మ. ని. 1 - 2 - 4.

అశాంతినె కల్గించును. ఆయాససాధ్యములైన భోగసామగ్రులకు ఆర్యశ్రావకుడు అఱ్ఱుజాచడు. అకుశల ధర్మములగు కామసుఖములకు అతిరిక్తమైయున్న పరమ శాంతి పరమ ప్రీతి అందనిదై యున్నంత వఱకు పురుషుడు కామభోగములందె మున్గుచు తేలుచుండును.

మహానామా! నేనును బోధిసత్త్వుడనైయుండి బుద్ధుడనగుటకు ముందు కామునివలన పలువెతలనొందితిని. పరిపాకమున కీడును గల్గించునవి కామములని యెఱింగి వాటికి వేఱైన పరమశాంతిని పొందనుంకించియు పొందలేకపోయితిని. కాని, నిరాశజెంది కాలువెనుకకు వేయలేదు. కామవృత్తులకును అకుశల ధర్మము లకును యించుకేని తలవంచలేదు. చివరకు శాంతమగు నిర్వాణమును సాధించితిని.

మహానామా! ఇష్టము, కాంతము, రుచి, ప్రియము, రంజనము ననెడి అయిదును కామగుణములు. మానవుడు వీటితోగూడి కామభోగములకై ఉవ్విళ్ళూరుచున్నాడు. ఇంద్రియగ్రాహ్యములగు విషయములందన్నిటను ఈ కామగుణములు ప్రవర్తించుచున్నవి. కామరసము ఊరుటకు మొదటి తావులు యివియే. కామము లెప్పాటను కష్టదాయకములే. కులపుత్రుడు జీవికకొఱకు, ఆకలినిబూడ్చుట కొఱకు కామదేవుని తృప్తికొఱకు కృషి చేయుచున్నాడు; వ్యాపారమొనర్చుచున్నాడు. రాజసేవకు పాల్పడుచున్నాడు. ఎండనక గాలియనక, సుఖదుఃఖముల మానావమానముల పాటింపక, ఓహరిసాహరి అశ్రాంతపరిశ్రమ నొనర్చుచున్నాడు. కామముల వలన గలిగెడి దుష్పరిణామ మింతకంటె కావలెనా? ఘనఘోరపరిశ్రమ జేసికూర్చి పేర్చిన వస్తుభోగములకు ముప్పెక్కడ చేకూఱునోయని అడుగడుగున దిగులొందుచు మహాభూతములు వానిపాలిటి మహాభూతములే యైతోచ అగ్నికళుకుచు జలమునకు జళుకుచు దొంగలకు భయపడుచు దొరలకు భీతిజెందుచు యింకను అది లేదిది లేదని ఆరాటము జెందుచున్నాడు.

మహానామా! కామములకు లొంగి రాజులు రాజులు రణము నొనర్చుచున్నారు. తల్లికొడుకులు, అన్నదమ్ములు, బంధుమిత్రులు, భార్యాభర్తలు, వెయ్యేల విశ్వబ్రహ్మాండము సర్వోసర్వము కామపిశాచికి కసాయిదుకాణము. అస్త్రములు శస్త్రములు, కత్తులు కటార్లు, గదలు గుదియలు, బాణములు తూణములు, కామదేవుడు కల్పించిన సృష్టి. ఆయుష్మంతా! కామములవలన గలుగు దుర్విపాకము లెంతకెంతకొ జాలినవి.

కామములు తమ్ము ప్రేరేపింప దోపిడులు, దొంగతనములు జేసి, పరదారాగ మనము జేసి రాజుల చేతికి చిక్కుచున్నారు. వారు కొరడాలతో కొట్టింతురు. బెత్త ముల బాధింతురు. అపరాధములు విధింతురు. అంగాంగములను ఖండింప బంపు దురు. విలంగథాలికము, శంఖమూర్ధిక, రాహుముఖము, జ్యోతిమాలిక, హస్త ప్రజ్యోతికము, ఏరకవార్తికము, చీరకవాసికము, ఐణేయకము, బడిశమాంసిక, కార్షాపణకము, పరిఘపరివర్తకము, పలాలపీఠకము మున్నగు దండములను విధిం తురు. కాగిననూనెయందు బడవైపింతురు. కుక్కలతో గఱిపింతురు. శూలముల జెక్కించుతురు. ఇట్లు రాజదండనలచే మరణమునో మరణాంతవేదనలనో బొందుచు న్నారు.

మహానామా! నే నొకప్పుడు రాజగృహ పురమందలి గృధ్రకూట పర్వతముపై విహారము జేయుచుంటిని. ఆ సమయమున జైన సాధువు లనేకులుకాలశిలపై నిలువ బడి అదే వ్రతముగ అనుష్ఠించుచుండిరి. నేనును సాయంతనసమయమున ధ్యానము నుండి లేచి ఆ జైన సాధువులు నిలువబడియుండెడి ఋషిగిరి ప్రాంతమందలి కాలశిల వద్దకు పోయితిని. వారినిజూచి ''ఓ నిగంఠువు (జైను)లారా! కూర్చొనుట మాని అట్లే నిలువబడి యెందుకు కష్టపడుచున్నారు''ని అడిగితిని. వారును నన్ను జూచి ''ఓ గౌతమా! సర్వజ్ఞుడు సర్వధర్మవేత్తయగు జైనతీర్థంకరుని మహావీరుని ఆదేశము. ఇంతవఱకు జేసిన పాపకర్మలకిది ప్రాయశ్చిత్తము. గతకర్మలు నశించగలవు. భవిష్యత్తులో పాపకర్మలు వచ్చి చొఱకుండుట కిది కంచుకోట. కర్మలు క్షయించినంత ఆస్రవములు క్షీణించును. దుఃఖ ములు తొలగును. వేదనలు నశించును. చివరకు సర్వదుఃఖ నివృత్తి సంభవించగలదు.'' అని పలికిరి.

నే నిట్లంటిని ''ఓ జైనసాధువులారా! గతకాలమునందు మేముంటిమని మీరు తెలిసికొనియున్నారా?''

''గౌతమా! లేదు.''

''వెనుక ఈ ఈ పాపముల జేసితిమని మీరు గుర్తెఱిగి యున్నారా?''

''గౌతమా! లేదు.

''నిగంఠువులారా! దుఃఖమింత నశించినదనియు, నశింపవలసినదింతయు న్నదనియు, అకుశలధర్మము లీజన్మమున నూడగలవనియు, కుశలధర్మములు చేకూఱగలవనియు, మీరు నిరూఢిగ చెప్పగలరా?''

''గౌతమా! లేదు.''

''అయ్యా! ఇట్లయిన హంతకులు నీచులు క్రూరులు కూడ నిగంఠు జైన సాధువులు కాగల్గుదురు.''

''గౌతమా! సుఖముతో సుఖము ప్రాప్తించదు. దుఃఖముతోనే సుఖము ప్రాప్తించుచున్నది. సుఖముతో సుఖము ప్రాప్తించినచో మగధరాజు బింబిసారుడును సుఖమును బొందెడివాడు. గౌతమా! నీవును బింబిసారుడును సమానముగ సుఖవిహారులేనా?''

''ఆయుష్మంతులారా! గౌతముడును, బింబిసారుడును వీరియందు అధిక సుఖ విహారు లెవ్వరు? యోచించి చెప్పుడు? రాజగు బింబిసారుడు శరీరమును కదలించక వాక్కుతో మాటలాడక చివర కొక్కదినమైనను కేవలసుఖమును పొందగలడా?''

''ఆయుష్మంతా! గౌతమా! పొందలేడు.

''ఓ నిగంఠువులారా! నేను శరీరమును కదిలించక, నాలుక మెదలించక వారముదినముల పర్యంతము కేవలసుఖానుభవమును పొందగల్గుదును. అట్టియెడ మగధరాజు బింబిసారుడు అధిక సుఖవిహారియో, లేక నేనో మీరే చెప్పుడు.''

''ఆయుష్మంతా! మగధరాజగు శ్రేణిక బింబిసారునకంటె ఆయుష్మంతుడు గౌతముడె అధికసుఖవిహారి.'' అని జైనసాధువులు పలికిరి. ఇట్లు భగవంతుడు బుద్ధుడు చెప్పిన వాక్యములను విని మహానామశాక్యుడు సంతుష్టుడయ్యెను.

## కుటదంతసూత్రము (వి. పూ. 457)

[1] గౌతమబుద్ధుడు అయిదు నూర్వురు భిక్షుసంఘముతో కూడి మగధదేశమున చారికనొనర్చుచు ఖాణుమతమను బ్రాహ్మణగ్రామమును జేరి అందలి ఆమ్రయష్టి కావనమున విహారము చేయుచుండెను. ఆ గ్రామమున కుటదంతుడను బ్రాహ్మణుడొక డుండెను. అతడు మగధరాజగు బింబిసారుని సత్కారమునకు పాత్రుడై ఖాణుమత గ్రామమును జాగీరుగ బొంది రాజభోగముల నలరారుచుండి యొకప్పుడు మహాయజ్ఞము నొండు దలపెట్టి విశసనము (బలి) కొఱకు పశువులను వందలకొలది చేర్చిబెట్టెను.

(1) దీ. ని. 1 - 5.

సర్వవిదితకీర్తిసంపన్నుడు శాక్యపుత్రుడు శ్రమణగౌతముడు ఆమ్రయష్టికావన మునకు వచ్చి విడిసి విహరించుచున్నాడనువార్తను విని ఖాణుమత గ్రామవాసులగు బ్రాహ్మణులు అతని దర్శింపగోరి గుంపులు గుంపులుగ పయనమగుటను తన మేడపై నుండి కుటదంత బ్రాహ్మణుడు వీక్షించి ప్రధానకర్మచారుని బంపి నిలువబెట్టించి తానును వారితో బోవనుద్యమించెను.

యజ్ఞమును దర్శించుటకై వివిధప్రాంతములనుండి వచ్చి చేరి యున్న బ్రాహ్మ ణులనేకులు కుటదంతబ్రాహ్మణుడు స్వయముగ శ్రమణగౌతముని సందర్శింపబో వుచున్నాడని విని సహింపజాలనివారై ఆతని చేరువజేరి యిట్లనిరి. ''కుటదంతా! [1] నీవు శ్రమణ గౌతముని వద్దకు బోవద్దు. దీనిచే నీ పరువు ప్రతిష్ఠలకు కొఱత వాటి ల్లును. గణ్యమాన్యుడవు. రాజపూజితుడవగు నీ కడకె గౌతముడు రావలెను. అయ్యా! మా మాట వినుము.''

''బ్రాహ్మణులారా! మీ రెఱిగినంతకు హితమునె జెప్పితిరి. కాని వాస్తవమట్టిది గాదు. శ్రమణగౌతముని గూర్చి యెంతగ కొని యాడినను అది సుంతయె కాగలదు. ముప్పదిరెండు [2] మహాపురుషలక్షణములతో గూడినవాడు. దేవమార బ్రహ్మసహిత లోకములన్నింటికి పూజ్యుడు. అనుత్తరవిద్యాచరణసంపన్నుడు. మగధరాజగు బింబి సారునకు కోసలపతియగు ప్రసేనజితునకు శిరసా మాన్యుడు. పుణ్యవశమున మన గ్రామమునకె వచ్చినాడు. అతిథియగు నాతని ఆదరించుట మనకు విధియైన ధర్మము. అగణితగుణగ్రామణియగు అమ్మహనీయపురుషుని దూరదూరముల కేగియైనను దర్శించుట తగును. మీరును రండు. పోదము పదండ'' ని కుటదంతు డమ్మహా విప్రసంఘముతో పయనించి భగవంతుని చెంతకుబోయి సమ్మోదనమొనర్చి యొకచోట గూర్చొని అమ్మహనీయునితో నిట్లనియె.

''గౌతమా! నే నొక మహాయజ్ఞమును జేయనెంచితిని. పదునాఱు విధములగు పరిష్కారములతో గూడిన మూడురకముల యజ్ఞవిధానములను మీ రెఱుగుదురని నేనిదివఱకు వినియున్నాను. దయయుంచి సెలవిండు.''

''బ్రాహ్మణా! వినుము. తొల్లి యొకప్పుడు మహావిజితుడను రాజొకడు అతులభోగభాగ్యముల దులదూగుచు మహాయజ్ఞమొక్కటి జేతునని యూహించి

---

(1) 185 వ పేజీ చూడుడు. (2) 40, 41 పేజీలు చూడుడు.

పురోహితుని బిలువనంపి ఇహపరార్థసాధనకమగు యజ్ఞమునొక్క దానిని నాతో జేయింప రాదే యని చెప్పెను. దాని కతడలరి "రాజా! ఇప్పుడు నీ దేశము సంకట ములతో సతమత మౌచున్నది. కళవులతో, దొంగలతో, ఈతిబాధలతో ప్రజల కష్టములకు పారము లేదు. పన్నులదీసికొనుచు ప్రజల యోగక్షేమములను తలపెట్ట కుండుట ధర్మమునకు విరుద్ధము. దేశమునందు ఉత్పత్తిని ఉద్యోగమును పెంపుజే యుము. సంకటములంతంతన సమసిపోగలవు. పంటలను పండించువారికి భూమి యు విత్తనములును, పశురక్షణ జేయ గలవానికి ఆవులను యెద్దులను, వ్యాపారము జేయగోరువానికి కావలసిన పరపతిని, ఉద్యోగము చేతునను వానికి తగిన నౌకరిని యిచ్చి ప్రజల నాదరింపుము. దేశము ధనధాన్యసమృద్ధమైనచో కళవులు లేవు; కాటకములు లేవు; దొంగలులేరు; దోపిడులు లేవు. ఈ పనిని ముందు జేయుము. యజ్ఞములకేమి కొదువ?" అని పురోహితుడు పల్కిన రాజును నమ్మెయి నూల్కొని అట్లే చేసి రాజ్యమును సుసంపన్నముగ నొనర్చెను.

కొన్నాళ్ళు గడిచినంత రాజగు మహావిజితుడు పురోహితుని నాహ్వానించి ముందటివలెనే యజ్ఞమును జేయింపగోరెను. బ్రాహ్మణు డిట్లనియె. "రాజా! నీ రాజ్యమునందలి సామంతరాజులను, మంత్రిపుంగవులను, ప్రసిద్ధబ్రాహ్మణులను, ధనవంతులగు వైశ్యులను పిలువనంపి వారితో యజ్ఞము నొనర్చుటకు అనుమతి తీసికొనుము." అని పురోహితుడు సలహానిచ్చినంత రాజును అట్లె జేసెను. ఈ నాలుగు అనుమతి పక్షములును యజ్ఞమునకు నాల్గు పరిష్కారములు.

కుటదంత బ్రాహ్మణా! ఆ మహావిజితుడనురాజు యెనిమిది అంగములతో కూడినవాడు. అవి యేవనిన. 1. తల్లినిబట్టియు, తండ్రినిబట్టియుకూడ సత్కుల మున బుట్టినవాడు. 2. దర్శనీయుడు. 3. శీలవంతుడు. 4. ధనధాన్యసంపన్నుడు.5. చతురంగసేనాయుతుడు. 6. మహాదాత. 7. బహుశ్రుతుడు. 8. స్వయముగ పండితుడు. ఈ యెనిమిది అంగములును యజ్ఞమునకు యెన్మిది పరిష్కారములు.

పురోహితుడును నాలుగు విషయముల నొప్పియుండవలెను. 1. ఇరువైపుల నుండి సత్కులీనుడగుట, 2. శీలవంతుడగుట, 3. మంత్రవేత్తయగుట, 4. పండితు డును పరిగ్రహయోగ్యుడును నగుట. ఈ నాలుగుకూడ యజ్ఞమునకు నాలుగు పరిష్కారములు .ఇట్లు పదునాఱు పరిష్కారములు జెప్పబడినవి.

బ్రాహ్మణా! మరియు మహావిజిత నరపతికి పురోహిత బ్రాహ్మణుడు యజ్ఞమునందు అనువర్తింపదగిన పద్ధతులను మూటినిట్లు జెప్పెను. యజ్ఞకర్తయగువాడు యజ్ఞమును చేయబోవుచు 'అయ్యో! ఇంతటి ధనరాశి వ్యయము కాగలదే' యని చింతించరాదు. యజ్ఞము చేయుచు 'యింతటి ధనరాశి వ్యయమగుచున్నదే' యని పరితపించరాదు. యజ్ఞమును చేసి 'యింత ధనము వ్యయమైపోయెనే' యని వ్యాకులుడు గారాదు. ఈ మూడువిధములును యజ్ఞకర్తముందె గ్రహింపవలెను.

పురోహితుడు రాజాతో మఱియు నిట్లు చెప్పుచున్నాడు. ''రాజా! 1. ప్రాణాతిపాతము, 2. అదిన్నాదానము, 3. కామమిథ్యాచారము, 4. మృషావాదము, 5. పిశునవచనము, 6. పరుషవచనము, 7. సంప్రలాపము, 8. అభిద్య, 9. వ్యాపాదము, 10. మిథ్యాదృష్టి. యనెడి అకుశలధర్మములతో కూడిన దురాచారులును, వీటికి విరుద్ధములగు కుశలధర్మములతో కూడిన సదాచారులునుకూడ నీ యజ్ఞమునకు వచ్చెదరు. దురాచారులు వచ్చినంత నీ కేమియు లోటులేదు. వారి పాపము వారిదే. చింతింపకుము. నీ సన్మానము సదాచారులకె చెల్లును. విప్రతిసారివి (వ్యాకులుడవు) గాకుము.

అదియుగాక షోడశ పరిష్కారములు నీ యొద్ద ఉండినను కూడా కొందఱు లేవందురు. కొందఱున్నవందురు, కొందఱునిన్ను తెగడుదురు. కొందఱు పొగడుదురు. కలతజెందక చిత్తమును ఉత్తేజితము జేసికొనుము'' అని పురోహితుడాదేశించెను.

కుటదంత బ్రాహ్మణా! ఆ యజ్ఞమునందు పశుహింస లేదు. యూపాదులకై చెట్లు నరకలేదు. పాటకపుజనము భక్తిశ్రద్ధలతో పనులు జేసిరిగాని దండభయముతో బలవంతముతో చేసినవారుగాదు. ప్రజలు అయాచితముగనె యజ్ఞ సంభారములను సమర్పించిరిగాని నిర్బంధముగ వారినుండి గ్రహింప లేదు. యజ్ఞ మిట్లు సుసంపన్నముగ ముగిసినది.

ఆ యజ్ఞమున కరుదెంచిన సామంతులు మంత్రులు బ్రాహ్మణులు వైశ్యులు అమితమగు ధనధాన్యముల దెచ్చి రాజునకర్పింపబోయిరి గాని తనవద్దనె సమృద్ధమగు ద్రవ్యమున్నదని రాజు దానిని గ్రహింపనొల్లడయ్యె. వారును వెనుకకు గొంపోవ మనసొప్పమిచే యజ్ఞవాటమునకు నలువైపులను దానిని స్థాపించిరి. కుటదంతా!

యజ్ఞపరిష్కారములను పదునాఱింటిని, విధానముల మూటిని చక్కగ వింటివి గదా?''

గౌతమా! ఆనాడట్లు జరిగినదని చెప్పితివిగాని 'నేను చూచితిని - చేసితిని. ఇది యిట్ల 'ని నిశ్చయముగ నీ సొంతమాటల జెప్పవైతివే.

''బ్రాహ్మణా! నే నెఱుగుదును. ఆనాటి మహావిజితుని పురోహితుడను నేనే. ఆ యజ్ఞ విషయమును చెప్పినదియు నేనే.''

''గౌతమా! ఆయజ్ఞమునకంటె మహాఫలదాయకమై, చేయుటకు సులభమైన మహాయజ్ఞము వేఱొకటి లేదా?''

''విప్రా! లేకేమి? శీలవంతులగు శ్రమణభిక్షువులకు నిత్యదాన మొనర్చుట.''

''గౌతమా! అంతకంటె అల్పప్రయాసమును అధికఫలమును గల యజ్ఞము లేదా?''

''బ్రాహ్మణా! చతుర్దిశసంఘమునకు విహారమును గట్టించుట.''

''గౌతమా! మరియు నంతకంటే?''

''కుటదంతా! బుద్ధుని, ధర్మమును, సంఘమును శరణుజొచ్చి ప్రాణాతిపాతాది అకుశలధర్మములను వదలి ప్రథమధ్యానమును ద్వితీయధ్యానమును తృతీయధ్యానమును చతుర్థధ్యానమును పూర్వజన్మముల సాక్షాత్కారము, సంసృతి చక్ర సందర్శనమును అంతకంతకు ఉత్తమ ఫలదాయకములు.''

''గౌతమా! ఆశ్చర్యము. అబ్బురము. బుద్ధుని, ధర్మమును, సంఘమును శరణు జొచ్చుచున్నాను. నేటినుండి బద్ధాంజలి ఉపాసకునిగ నన్నను గ్రహింపుడు. నా యజ్ఞముకొఱకై చెకూర్చిన పశువులనన్నిటని విడచిపెట్టుచున్నాను. వాటని జీవితాంతము నేనే పోషింతును.''

అంతట కుటదంతుడు బగవంతు డుపదేశించిన ఆనుపూర్వికథ విని విమల ధర్మచక్షువును పొందినవాడై భిక్షుసంఘముతో కూడ గౌతముని మఱునాటి భోజనమున కాహ్వానించి వారి నత్యంతము సంతృప్తులజేసెను. భగవంతుడును బోజన

మును స్వీకరించి ధార్మిక కథాసల్లాపముల నతని కృతార్థుని జేసి యథేచ్ఛ మెయిం బోయెను.

## స్వర్ణదండాది సూత్రము (వి. పూ. 457)

[1] ఒకానొక సమయమున భగవంతుడు బుద్ధుడు మహాభిక్షుసంఘముతో కూడి [2] అంగదేశమున చారిక నొనర్చుచు [3] చంపానగరము జేరబోయి గగ్గరాపుష్కరిణీతీరమున విహారము చేయుచుండెను. ఆ నగరమునకు యజమానుడును రాజ్యపూజ్యుడును నగు స్వర్ణదండుడను బ్రాహ్మణుడు ఆ మహానుభావుని దర్శించు కుతూహలముతో ఆయన ఉన్నచోటికి వచ్చి సమ్మోదనమొనర్చి యొకచో గూర్చొనెను. భగవంతు డాతనివైపు జూచి యిట్లనియె.

''భూసురోత్తమా! ఎట్టిగుణములతో కూడినవాడు బ్రాహ్మణుడనబడును. 'నేను బ్రాహ్మణుడ' నని పలికి ఆ మాటను నెగ్గించుకొనగలుగువాడు యెట్టివాడు?''

''గౌతమా! 1. తల్లిదండ్రుల వైపునుండి కులీనుడగువాడు, 2. మంత్రవేత్త, 3. రూపసి, 4. శీలవంతుడు, 5. జ్ఞాని; ఈ అయిదు గుణములతో కూడినవాడు బ్రాహ్మణు డనిపించుకొనును.''

''బ్రాహ్మణా! ఈ అయిదింటిలో యేయొక్కటైనను లోపింపవచ్చునా?''

''గౌతమా! రూపసి (రూపవంతుడు) యను అంశము లోపించినను తప్పు లేదు. తక్కిన నాల్గింటితోడనె అతడు బ్రాహ్మణుడననొప్పును.''

''బ్రాహ్మణా! ఆ నాల్గింటిలో దేనినైన నొక్కదాని తగ్గింపవచ్చునా?''

''గౌతమా! మంత్రవేత్త కాకపోయినను మిగిలిన మూడుగుణములతోనే వాడు బ్రాహ్మణుడనజెల్లును.''

''బ్రాహ్మణా! అమ్మూడింటిలో నొక్కటి తక్కువగావచ్చునా?''

---

1. దీ. ని. 1 – 4.
2. బీహార్ ప్రాంతమందలి గంగకు దక్షిణమున భాగల్పురము ముంగేరజిల్లాలోని భూమి.
3. చంపానగరము (భాగల్పురము జిల్లా).

''గౌతమా! కులీనుడను అంశమును వీడినను, శీలవంతుడు పండితుడు (జ్ఞాని) అను రెంటిచేతనే అతడు బ్రాహ్మణు డనిపించుకోగలడు.''

అని యిట్లు సోణ (స్వర్ణ) దండ బ్రాహ్మణు డాడిన అప్పలుకులు తమకు సహింపరానివగుడు అందాసీనులైయున్న విప్రులిట్లనిరి.

''స్వర్ణదండా! రూపవంతుడు, మంత్రేత్త యను రెంటిని నిరాకరించి పైపెచ్చు కులమునుగూడ త్రోసిరాజనుట కుపక్రమించితివి. శ్రమణగౌతముని సిద్ధాంతము లోనికి తిన్నగ దిగజాఱిపోవుచున్నావే?'' అనిన విని స్వర్ణదండు డిట్లనియె.

''బ్రాహ్మణులారా! ఆత్రపడకుడు. సమాధాన మిత్తును. సంభాళించు కొండు. ఇదిగో! నా చెల్లెలికొడుకు అంగకమాణవకుడు యీ సభలోనే కూర్చొని యున్నాడు. శ్రమణగౌతముని మినహాయించిన మరి వాడె 1. ఉజ్జ్వలరూపము గలవాడు. 2. మంత్రవేత్త - వేదవేత్త - అధ్యాపకుడుగూడ. 3. వీని తలిదండ్రులు నా యెఱిగిన వారె కాబట్టి యితడు సత్కులీనుడు. ఇట్టి అంగకమాణవకుడు దుశ్శీలుడై దురాచారుడై దొంగతనమును, పరస్త్రీ గమనమును, మృషావాదమును, మద్యపానమును మరగినచో ఇతనిరూపమెం దుకు? వేదమెందుకు? కులమెం దుకు? దీనిని బట్టియె శీలమును జ్ఞానమును రెంటినే బ్రాహ్మణత్వమునకు చాలినవని చెప్పితిని.'' అని వచించి వారిని నిరుత్తరులజేసిన స్వర్ణదండునితో బుద్ధదేవు డిట్లనియె.

''బ్రాహ్మణా! ఆ రెంటిలోకూడ దేనినైన నొకదానిని వదలనగునా?''

''గౌతమా! అది పొసగదు. అవి రెండును అన్యోన్య సహాయకములు, పోషక ములు. శీలము జ్ఞానమునకు మెఱుగు. జ్ఞానము శీలమునకు మెఱుగు.

''స్వర్ణదంతా! నిజమే చెప్పితివి. జ్ఞానికె శీలము లభించును. శీలవంతునికె జ్ఞానమబ్బును. ఆ రెంటిసంబంధము వేఱు జేయరానిది. సరియే. జ్ఞానశీలములకు సిగ పువ్వుయేది? శీలమననేమి? జ్ఞానమననేమి?''

''గౌతమా! ఇంతకుపైన నాకు తెలియదు. తామె చెప్పండి.''

''బ్రాహ్మణుడా! వినుము. తథాగతుడు లోకమునందుత్పన్నుడైనాడని విని నిర్వేదమును బొంది భిక్షువు అకుశలధర్మములను వదలి శీలసంపన్నుడగుచున్నాడు. శీలమన నిదియే. అతడు మఱియు ★ ధ్యానముల నాల్గింటి నెఱిగి చిత్తమును

★ 147, 148 పేజీలు చూడుడు.

మ్రొగ్గించి జన్మబంధము లూడ కృతకృత్యత బొందుచున్నాడు. ఇదియే వాని జ్ఞానము ను ప్రజ్ఞయు.''

అని యిట్లు తథాగతు డుపదేశించిన ప్రసన్నుడై స్వర్ణదండుడు గౌతమా! ఆశ్చర్యము. అబ్బురము. నన్ను సాంజలి శరణాగత ఉపాసకునిగ గ్రహించి రేపటి దినము భిక్షుసంఘసహితముగ నా భోజనమును స్వీకరింపవలె'' నని ప్రార్థించెను.

మఱునాడు భోజనానంతరము స్వర్ణదండుడు భగవంతునితో యిట్లు విన్నవించు కొనెను. ''గౌతమా! నిండు సభయెదుట లేచి నేను మీకు నమస్కరించి నచో నా సాటికులమువారు నిరాదరించెదరు. సంఘము యీసడించినచో కీర్తి దొల గును. సంపద లుడుగును. కాబట్టి సభలో నున్నపుడు చేతులు జోడించినచో అది నా నమస్కారమని గ్రహించండి. తలగుడ్డ దీసినచో నా దండప్రణామముగ తలం చండి. వాహన మెక్కి పోవునపుడు చేతిబెత్తమును పైకెత్తినను, చేతులరెంటిని యెత్తినను గూడ నా వందనము లనియె భావించునది.''

సోణదండు డిట్లాడినంత భగవంతుడును అతనిని ధార్మికకథాలాపముల సముత్తేజితుని చేసి ఆసనమునుండి లేచిపోయెను.

## మహాలి సూత్రము

★ భగవంతుడు వైశాలియందు మహావనముయొక్క కూటాగారశాలలో విహారము జేయుచున్నాడు. ప్రధానపరిచారకుడై ఆయుష్మంతుడు నాగితుడు వాకిట నిలచియున్నాడు. కోసలవాసులును మగధవాసులు నగు బ్రాహ్మణు లనేకులు బుద్ధుని దర్శిపవలెనని వచ్చి వాకిటనున్న నాగితునితో ''ఆయుష్మంతా! శ్రమణగౌ తము డెందున్నాడ''ని యడిగిరి. వాడును ''భగవంతుడు ధ్యాననిష్ఠుడై యున్నాడు. దర్శనమున కిది అదను'' గాదనెను. దర్శనము లేక మరలుట లేదని వారుండిరి. అంతలో నొక పెద్ద లిచ్ఛవీ పరిషత్తుతో మహాలి ( ఓష్ఠార్ధ – లిచ్ఛవీ) యను వాడును వచ్చెను. ఆపై శ్రమణోద్దేశుడు సింహుడు వచ్చి భగవంతుని దర్శనార్థమై వేచి యున్న ఆ సమూహములను జూచి నాగితునితో సంప్రదించి లోనికి బోయి బుద్ధదేవున కా విషయమును నివేదించెను. తథాగతుడును విహారచ్ఛాయయందు ఆసనము బఱచుకొని కూర్చొనెను. బ్రాహ్మణసంఘములును లిచ్ఛవీ సంఘమును లోనికివచ్చి సుగతదేవునకు సమ్మోదన అభివాదముల నర్పించి నెమ్మదిగ నాసీనులైరి. అంతట మహాలి యిట్లనియె.

---

★ దీ. ని. 1- 6.

''దేవా! వెనుక దినాలలో నొకనాడు లిచ్ఛివీకుమారుడు సునక్షత్రుడు నాతో యిట్లనినాడు. మహాలీ! దివ్యశబ్దముల వినుట కొఱకై బుద్ధభగవంతుని వద్ద మూడేండ్లుండియును ప్రియకమనీయరంజనీయ దివ్యశబ్దములను వినజాలక పోయితిని. భంతే! అసునక్షత్రుడు విద్యమానుడై గూడ విన లేక పోయెనా?''

''మహాలీ! నిజమే. వినజాలకపోయెను.''

''ప్రభూ! హేతువేమి?''

''మహాలీ! దీవ్యరూపదర్శనార్థమై చేయబడు సమాధిద్వారా భిక్షువు దివ్యశబ్దములను వినజాలడు. దివ్యశబ్దశ్రవణార్థమై చేయబడు సమాధిద్వారా భిక్షువు దివ్యరూపదర్శనములను పొందలేడు. ఉభయాంశ సమాధిని అవలంబించినపుడు ఉభయ ఫలములను బొందగలడు.''

''భంతే! ఈ సమాధి భావనల సాక్షాత్కారము కొఱకేనా భిక్షువులు మీ వద్ద బ్రహ్మచర్యమును పాలించుచుండుట.''

''మహాలీ! ఇంతేకాదు. దీనికి మించిన ఉత్తమధర్మము మఱొక్కటి గలదు.''

''దేవా! అదియేమి?''

''మహాలీ! భిక్షువు త్రివిధ సంయోజనములు (బంధములు) క్షయించినంత జాఱుటకు వీలులేని పరమజ్ఞానమును బొంది స్రోతాపన్నుడనిపించుకొనును. దానికి పై ధర్మము సకృదాగామి యగుట. వాడు లోకమున నొక్కపరి జన్మమెత్తి నిర్వాణమును బొందును. అంతకంటె ఉత్తమధర్మము అనాగామిత్వము. అనాగామి తిరిగి రావలసినపని లేదు. వానికి సంయోజనము లైదును నశించినవి. మహాలీ! దీనికంటె పరమధర్మము అర్హత్త్వమును బొందుట. అర్హతునికి చిత్తమలములు లేవు. తత్త్వసాక్షాత్కారమైనది. ఇదియే మహాధర్మము. దీనిని బొందుటకయ్యే భిక్షువులు నా వద్ద బ్రహ్మచర్యమును పాలించు చుందురు.''

''భంతే! ఈ ధర్మమును బొందుటకు మార్గము గలదా?''

''మహాలీ! కలదు.[1] దానినె అష్టాంగిక మార్గమందురు. సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పము, సమ్యక్ వచనము, సమ్యక్ కర్మాంతము, సమ్యక్ ఆజీవము, సమ్యగ్ వ్యాయామము, సమ్యగ్స్మృతి, సమ్యగ్ సమాధి ఈయెనిమిది అంగములతో కూడిన ఆ మార్గమును ప్రతిపత్తు (ప్రతిపదము) అందురు.

(1) 110 వ పేజీ చూడుడు.

మహాలీ! నే నొకపరి కౌశాంబియందు ఘోషితారామమున విహరించుచుం టిని. అయ్యెడ మండిస్సుడు జాలియుడునను ప్రవ్రజితులిద్దరు నా వద్దకువచ్చి సమ్మోదన మొనర్చి, 'ఆయుష్మంతా! గౌతమా! శరీరము జీవుడును ఒకటియా! వేర్వేరా?' అని యడిగిరి, నేనును వారితో నిట్లంటిని. 'ఆయుష్మంతులారా! లోక మందు తథాగతు [1] డుత్పన్నమైనాడని విని నిర్వేదించి భిక్షువు శీలసంపన్నుడై ధ్యాన ముల నాల్గింటిని క్రమముగ బొంది అలౌకిక జ్ఞానమును పొందగల్గుచున్నాడు. అదియె ప్రయోజనముకాని, అక్కఱమాలిన ప్రశ్నలగు 'శరీరమును జీవుడును ఒకటియా? వేర్వేరా?' అను మాట నాడవలసిన పని లేదు. దానికి బదులు చెప్పవల సిన అక్కఱయుగూడ లేదు. చెప్పడుకూడా.

మహాలీ! ఆనాడు నడిచిన ప్రసంగమిది యని భగవంతుడు పల్కినంత లిచ్ఛవీ ఓష్ఠార్ధుడు ( మహాలీ) సమ్మోదమొంది పలువిధముల ప్రశంసించెను.

## త్రైవిద్య వత్సగోత్ర సూత్రము

[2] భగవంతుడు బుద్ధుడు వైశాలిలో మహావన కూటాగారశాలయందు విహ రించుచు నొకనాడు వైశాలిలోనికి భిక్షకై బయులు దేరి యింకను పూర్వాహ్ణసమ యము కాలేదు. కావున యింతలో ఏకపుండరీక పరివ్రాజకారామమున నివసించు చున్న వత్సగోత్ర పరివ్రాజకునిజూచి సంభాషించుదునని తలంచి అచ్చోటికి బోయెను.

వత్సగోత్రపరివ్రాజకుడును దవుదవ్వులనుండియె తథాగతుడు వచ్చుటను గమనించి యెదురేగి సన్మానించి పఱచిన ఆసనముపై కూర్చుండబెట్టి తానును ఒకచో గూర్చొని యిట్లనియె.

''స్వామీ! శ్రమణగౌతముడు సర్వజ్ఞుడు సర్వదర్శియనెడి మాటను పెక్కెడల నేను వినియున్నాను. ఆ మాట సత్యమునకు దూరముగాదుగదా!''

''వత్సా! ఆ పలుకు యథార్థమని నే నసను, అసత్యములాడి నన్ను అగౌరవిం చుచున్నారు.''

''దేవా! భగవంతుని గూర్చి మేము యథార్థ మెట్లు చెప్పవలెను?''

(1) 146 వ పేజీ చూడుడు. (2) మ. ని. 1 – 3 – 1.

''వత్సా! శ్రమణగౌతముడు మూడువిద్యల నెఱిగినవాడు; అని చెప్పినచో మీకు అసత్యదోషము లేదు. అవి యేవనిన చెప్పెద వినుము. [1]అనేక పూర్వజన్మలను స్మరింపగలుగుచున్నాను. ఆ జన్మములందలి నామరూపములను కూడ గుర్తెఱుగుచు న్నాను. ఇది యొకటి. మఱియు అమానుష దివ్యనేత్రముతో సంసారసముద్రమున జన్మమరణ కల్లోలములో గిజగిజలాడు జీవకోటిని దర్శించుచున్నాను. ఇది రెండవవిద్య. రాగద్వేషాది చిత్తమలముల నెడబాసి ప్రజ్ఞాపీఠము నధిష్ఠించి యీ జన్మమందే విముక్తి సుఖమున విహరించుచున్నాను. ఇది మూడవవిద్య. ఇవియె త్రైవిద్యలు.''

ఆ మాటలు విని వత్సగోత్రు డానందపరవశుడయ్యెను. భగవంతుడంత యథేచ్ఛ బోయెను.

## ౭

## శాక్యకోలియవివాదము - మహానామసూత్రము - కీటాగిరిసూత్రము (వి. పూ. 457 - 456)

భగవంతుడు పదునైదవ వర్షావాసము కపిలవస్తువునందు గడపెను. కపిలవస్తువునకును కోలియనగరమునకును నడుమనుండు రోహిణీనదికి ఆనకట్ట కట్టుకొని అటు శాక్యులును యిటు కోలియులునుకూడ పైరులకు నీరు పాఱించుకొనుచు వ్యవసాయమును సాగించుచుండిరి. అదొక్కసమయమున జ్యేష్ఠమాసమునందు నీరు చాలక పైర్లు యెండిపోసాగినవి. అంతట ఉభయనగర వాసులగు రైతులు కొందఱు ఒకచో ప్రోగై యిట్లు సంభాషించిరి. తొలుత కోలియనగరవాసు లిట్లనిరి. ''ఈ నీటిని చెరిసగము దీసికొన్నచో యెవ్వరికిని జాలవు. రెండువైపుల పైర్లును చెడగలవు. కావున మేమే తీసికొందుము. మాపంట నెరవేఱగలదు.'' ఆ మాట విని ప్రక్కవారిట్లనిరి. ''అదేమి? మీగాదెలనె నింపుకొన్నచో మా గతి యేమి? మేము మీ పడిపంచలు కాయవలెననియా మీయాశ? నీటిని మేమివ్వము.'' అని నిక్కచ్చిగ జెప్పిరి. ఆక్రోశవశమున యెవ్వడో మఱొక్కని గొట్టెను. ఆతగవు అంతట యింతట ప్రాకి రాజులవఱకు రాజుకొన్నది. అటు శాక్యరాజులును యిటు కోలియరాజులును అన్యోన్యము నిందించుకొనుచు యుద్ధమునకు సన్నద్ధులైరి.

---

(1) 148 వ పేజీ చూడుడు.

భగవంతు డీవార్త నాలించి స్వజాతివారు అన్యోన్యము సర్వనాశమునకు సంసిద్ధమగుట సహించలేక రోహిణీనది వద్దకు వచ్చి యుద్ధమునకై ప్రోగయియున్న ఉభయసేనలమధ్య ప్రవేశించెను. ఆ రాజులును అమ్మహాత్ముని జూచి ఆయుధముల క్రిందబెట్టి నమస్కరించి నిలిచిరి. బుద్ధు డిట్లనియె.

''మహారాజులారా! ఈ కలహమెందుకు వచ్చినది?''

''స్వామీ! మేమెఱుగము. సేనాపతుల నడగవలెను.''

''సేనానాథా?''

''దేవా! మంత్రుల నడుగవలెను.''

''మంత్రు లేమంటారు?''

''రైతులను విచారింపవలెను.''

రైతులు చెప్పుచున్నారు. ''ఇదినీటికై వచ్చిన తగాదా''యని .

''మహారాజులారా! నీటికి వెల యెంత?''

''స్వామీ! యేమియు లేదు. నిర్మూల్యము.''

''చెప్పుడు? క్షత్రియుని వెల యెంత?''

''భగవంతా! అంతింతన రానిది.''

''రాజులారా! నిర్మూల్యమగు నీటికొఱకు అమూల్యమగు క్షత్రియ ప్రాణాలను మట్టిలో కలుపుటకు పూనుకొంటిరా? మూర్ఖులారా! పలుక రెందుకు?''

తే॥ గీ॥ వైరిపై వైరబుద్ధిని వదిలితేని
సుఖము నీ అరచేతిలో సొమ్ము సుమ్ము
పగయుననదించుకయు లేక పగతుఱందు
తిరుగగల్గిన వాడెపో ధీరవరుడు.

అని బుద్ధిగఱపి భగవంతుడు యథాస్థానమున కరిగెను. వారును ప్రశాంతులైరి.

## మహానామ సూత్రము

★ సిద్ధార్థబుద్ధుడు శాక్యదేశమున కపిలవస్తుపురమునందు న్యగ్రోధారామములో విహరించుచున్నాడు. భిక్షువులు పలువురు చీవర (వస్త్ర) నిర్మాణమునందు పాల్గొనియున్నారు. ఇక మూడు నెలలకు పిమ్మట భగవంతుడు చారికకొఱకై

★ అం. ని. 11 - 2 - 2.

ప్రస్థానించును. అది విని అప్పుడప్పుడే జబ్బుపడి లేచియున్న మహానాముడను శాక్యుడు భగవంతునివద్దకు వచ్చి అభివాదనము చేసి ''దేవా! భిక్షువులయొక్క చీవర నిర్మాణము ముగిసినంతట తాము చారికకొఱకు వెళ్ళెదరు. మేము నానా ధ్యానములందు విహరించుచున్నాము. మాకు యోగ్యమగు విహార మెట్టిదో ఆన తిండు'' ని వేడుకొనెను.

''మహానామ! లెస్సగ అడిగితివి. ఇది నీకె యొప్పినది. వినుము. సాధకుడు శ్రద్ధాళువు గావలెను. శ్రద్ధాహీనుడు గారాదు. ఉద్యోగశీలుడు కావలెను. అనుద్యోగి కారాదు. స్మృతిమంతుడు కావలెను. విస్మృతిమంతుడు గారాదు. సమాహితుడు గావలెను. అసమాహితుడు కారాదు. ప్రజ్ఞాశాలి గావలెను. దుష్ప్రజ్ఞుడు గారాదు. ఈ అయిదు ధర్మములందును నిలిచి ఉత్తరధర్మముల నాఱింటిని భావన చేయవలెను.

మరియు నీ వొనర్చిన త్యాగమును గూర్చి భావించుము. అది యెంతయో నీకు లాభమును జేకూర్చినది. గృహస్థుడవైయుండి కూడ వివిధమలములతో కూడిన లోకమునందు నిర్మలచిత్తముతో దానముల నర్పించితివి. ప్రయతపాణివైతివి.

మహానామా! తథాగతుని గూర్చి భావింపుము. అర్హతుడు సమ్యక్ సంబుద్ధుడు విద్యాచరణసంపన్నుడు సుగతుడు లోకవిదుడు అనుత్తరుడు పురుషదమ్యసారథి దేవమనుష్యశాస్త భగవంతుడు బుద్ధుడని దలంపుము. ఇట్లు తథాగతునిగూర్చి ఆర్య శ్రావకుడు చింతించునపుడు వాని చిత్తము రాగ ద్వేష మోహములకు అంటు పడదు. మరియు వాడు అకుటిలచిత్తుడై అర్థవేదమును (పరమార్థజ్ఞానము) ధర్మవేదనముకు ప్రాపించి ధర్మయుక్తమగు ప్రమోదమును పొందుచున్నాడు. అతనికి ప్రీతిసుఖము కల్గుచున్నది. శరీరము స్థిరమగుచున్నది. చిత్తము సమాహితమగుచ్నుది. ఇట్టి బుద్ధాను స్మృతిని బొంది పనిపాటలయందు గూడ దానిని వదలక విహరించుచున్నాడు.

మహానామా! ధర్మమును అనుస్మరింపుము. భగవంతుని ధర్మము స్వాఖ్యాత మనియు, ప్రత్యక్షఫలప్రదమనియు, పండితులు స్వయముగ దర్శింపదగినదనియు ధర్మానుస్మరణము జేయుము.

మఱియు అనిందితములును ఆర్యవంద్యములును నగు శీలములను అనుస్మ రించుచుండుము.

మహానామా! నీవు దేవతలను అనుస్మరింపుము. 1. చాతుర్మహారాజిక దేవ తలు 2. త్రయస్త్రింశదేవతలు 3. యామదేవతలు 4. తుషితదేవతలు 5. నిర్మాణరతి

దేవతలు 6. పరినిర్మితవశవర్తిదేవతలు 7. బ్రహ్మకాయికదేవతలు 8. వారికిని పైనుండు దేవతలు 'వీరు యీ లోకమున మరణించి ఆలోకమునందు జన్మించినారు. వారి యొద్దగల యట్టి శ్రద్ధాశీల ప్రజ్ఞాత్యాగములు నాకడ కూడ గలవు. నేనును శ్రద్ధాశీల ప్రజ్ఞాత్యాగములను కల్గియున్నాను.' అని యిట్లు దేవతలయొక్కయు తనయొక్కయు శ్రద్ధాదికముల ననుస్మరించెడి ఆర్యశ్రావకునకు సమాహితచిత్త మేర్పడుచున్నది. విషమమగు లోకమందు సమత్వమును బొందుచున్నాడు. ద్రోహ యుక్తమగు ప్రజలలో మైత్రిని విస్తరించుచున్నాడు. ఇట్టి దేవతానుస్మృతిని పనిపాటలం దుండియు, వచ్చుచు పోవుచు తినుచు కనుచు కూడ భావన జేయుచున్నాడు.''

## కీటాగిరియందు

[1] శ్రావస్తియందు ఇష్టానుసారము విహరించి భగవంతుడు గౌతముడు సారిపుత్ర మౌద్గల్యాయన సహితముగ పంచశత మహాభిక్షుసంఘముతో చారిక నొనర్చుచు [2] 'కీటాగిరి' యను ప్రదేశమునకు బయలుదేరెను. అక్కడ కీటాగిరి యందుండు అశ్వజితుడు పునర్వసులను భిక్షువులు బుద్ధదేవుడు మహాభిక్షు సంఘముతోడను, సారిపుత్ర మౌద్గల్యాయనులతోడను వచ్చుచున్నాడని విని విహా రమునందుండు శయనాసనములను పాత్రలను పరికరములను తమంతకు తాము పంచుకొనిరి. తథాగతుడు కీటాగిరిని సమీపించి కొందఱు భిక్షువులను పిలిచి యిట్ల నియె.

''భిక్షువులారా! మీరు అశ్వజిత్తు పునర్వసు భిక్షువుల చెంతకుబోయి భగ వంతునకును భిక్షువులకును సారిపుత్ర మౌద్గల్యాయనులకును శయనాసనముల నాయత్తపఱుపుడని చెప్పవలసినది.''

బిక్షువులును బుద్ధదేవు డాడిన వచనములను అశ్వజిత్తు నర్వసువులకు జెప్పి నంత వారిట్లనిరి.

''ఆయుష్మంతులారా! భగవంతుడు, కోరినట్లు యెందైన విహరింపవచ్చును. సంఘమునకుగాని సారిపుత్ర మౌద్గల్యాయనులకుగాని శయనాసనముల నివ్వ వీలు లేదు. ఉన్నవి మాకే సరిపోయినవి.''

---

(1) వినయచుల్లవగ్గ

(2) వారాణసీ సాకేతముల మధ్య నేడు కేరాకతమని చెప్పబడు ప్రదేశము లేదా దాని ప్రాంతభూమి.

ఆ మాటలను భిక్షువులు భగవంతునకు నివేదించిరి. భగవానుడును ఈసడించుకొని యిట్లనియె. "భిక్షువులారా! సంఘమునకు చెందినవియును, పంపకమునకు చెల్లనివియునైన యీ అయిదు అంశములపై పుద్గలుని (వ్యక్తి) కి హక్కు లేదు. 1. ఆరామము, లేదా ఆరామవస్తువులు, 2. విహారమును విహారవస్తువులును, 3. మంచముపీట, గద్దె, దిండు, 4. ఇనుముతో చేసిన పాత్రలును వస్తువులును, 5. కొయ్యపనిముట్లు కొయ్యపాత్రలును మట్టియు గడ్డియును."

## [1] కీటాగిరి సూత్రము

భగవంతుడు కాశీదేశమున చారిక నొనర్చుచు నొకనాడు భిక్షువులతో నిట్లనియె. "భిక్షువులారా! రాత్రిభోజనమును విడువుడు. విడుచుటచే ఆరోగ్యమును ఉత్సాహమును బలమును సుఖమును కలిగి విహరించగలరు."

భగవానుని ఆదేశమును భిక్షువులు అంగీకరించిరి. అటు పిమ్మట అచ్చటి నుండి క్రమముగ చారిక నొనర్చుకొనుచు వచ్చి బుద్ధ భగవంతుడు [2] కీటాగిరిచేరి విహరించుచుండెను. అందుండు అశ్వజితుడు పునర్వసుడను ఆవాసికభిక్షువు లిరువురకును భిక్షుసంఘము వారు రాత్రి భోజనమును విరమించుడని చెప్పిరి. వారందుకు సమ్మతింపక యిట్లనిరి. "మేము ఉదయము మధ్యాహ్నము మూడు జాములకు ముప్పూటను భుజించుచు ఆరోగ్యముగ ఉత్సాహముగ నుండి విహరించుచున్నాము. ప్రత్యక్షఫలమును విడిచి పరోక్షఫలమును యెందుకాశ్రయింపవలెను? ఆ మాట మాకు నచ్చదు పొమ్మ"నిరి.

వారి వచనములను భిక్షువులు భగవంతున కుగ్గడించిరి. భగవానుడును అశ్వజిత్ పునర్వసులను పిలువనంపి వారితో నిట్లనియె. "ఆయుష్మంతులారా! మీరా భిక్షువులతో పల్కిన పల్కులు నిజమేనా?

"భంతే! నిజమేను."

"భిక్షువులారా! పురుషపుద్గలు డనుభవించు సుఖము, దుఃఖము, అసుఖము అదుఃఖమను వీటితోనే వానియొక్క అకుశల ధర్మము నష్టమౌననియు, కుశల ధర్మములు పెఱుగుననియు నేనేనాడైన చెప్పుట యెఱుగుదురా?"

---

1. మ, ని, 2 - 2 - 10.
2. ప్రస్తుతము బనారస్. ఆజగఢజిల్లాల ప్రాంతము.

''భగవంతా! లేదు.''

''భిక్షువులారా! ఇట్టి సుఖదుఃఖ వేదనల ననుభవించునపుడు అకుశలధర్మములు పెఱుగునని యొకనికిని, కుశలధర్మములు పెఱుగునని మఱియొకనికి వ్యత్యస్తముగ నే నుపదేశించుట మీరు కనియున్నారా?''

''దేవా! లేదు.''

''మంచిది. భిక్షువులారా! నేనూహించనిదె, గ్రహించనిదె, దర్శించనిదె యెవ్వనికైనను 'దీనిని వదలుమ' ని ఆదేశించితినా?''

''ప్రభూ! లేదు.''

''భిక్షువులారా! ప్రమాదరహితులై చేయుడనికాని అప్రమాదరహితులై చేయుడనికాని నేనందఱికిని చెప్పను. అర్హతులైనవారికి పూర్ణులైనవారికి మీరు ప్రమాదరహి తులై చేయుడని నే నాదేశించను. వారు మొదటనె ప్రమాదరహితులు. ప్రమాదము (పొరబాటు) లేనివారై చేయదగినది చేసినారు. పూర్ణత్వమును బొందని వారికి, నిర్వాణమును కోరువారికి మీరు ప్రమాదరహితులై చేయుడని చెప్పుచున్నాను. ఎందుకనిన వినుడు. వారు విహారవ్యవహారములందు ఉచితజ్ఞులై ఆప్తమిత్రుల సేవించుచు ఇంద్రియముల నిగ్రహించి కులపుత్రు లెద్దానికొఱకు ప్రవ్రజితులగుచున్నారో అట్టి బ్రహ్మచర్య ఫలమును యీ జన్మమునందే పొంది విహరింపవలసి యున్నది./ అందుచే నేనట్లు జెప్పుదును.

భిక్షువులారా! 1. ఉభయతోభాగ విముక్తుడని 2. ప్రజ్ఞావిముక్తుడని 3. కాయసాక్షియని 4. దృష్టిప్రాప్తుడని 5. శ్రద్ధావిముక్తుడని 6. ధర్మానుసారియని 7. శ్రద్ధానుసారియని లోకమునందు పుద్గలు (పురుషు) లేడుగురు. అందు రూపధాతువు నందు అరూపధాతువును బొంది ఆ రెంటినిగూడ కాయముతో స్పర్శించి ప్రజ్ఞతో జూచి విహరించు పుద్గలుడు (పురుషుడు) ఉభయతో భాగ విముక్తుడు. వానికి 'ప్రమాదరహితుడవై చేయుము' ని నేను చెప్పను. వాడు ముందుగనె ప్రమాద రహితుడు.

విమోక్షము గడిచి రూపమునందు అరూపమునుబొంది వాటిని కాయముతో దాకక ప్రజ్ఞతో కనుగొని చిత్తమలముల నష్టము జేసిన పుద్గలుడు ప్రజ్ఞా విముక్తుడు. వానికికూడ నేనట్లు జెప్పను. ముందే వానికి ప్రమాదము లేదు.

ప్రజ్ఞతో కనుగొని ఆయా ఆస్రవములు (చిత్తమలములు) కొన్ని నశించినంత వానిని కాయసాక్షి యందురు. ఆస్రవముల బాసి ప్రజ్ఞచే తథాగతధర్మముల నెఱిగి

నవాడు దృష్టిప్రాప్తుడు. తథాగతునియందు శ్రద్ధగలవాడు శ్రద్ధావిముక్తుడు. తథాగతుని ధర్మమును నిదిధ్యాసనముచేసి శ్రద్ధా వీర్యస్మృతి సమాధి ప్రజ్ఞాధర్మములను బొందినవాడు ధర్మానుసారి. వీటినన్నింటితోకూడి శ్రద్ధామాత్ర నిష్ఠడగువాడు శ్రద్ధానుసారి యనబడును. వీరందఱికిని నేను ప్రమాదము లేక చేయుడని చెప్పుట లేదు. స్వయముగ వారు ప్రమాదరహితులు.

భిక్షువులారా! నేను తొలుతనే ఆజ్ఞను వచింపను. క్రమముగ శిక్షణచేతను, క్రియచేతను, ప్రతిపదము చేతను ఆజ్ఞను ఆరాధించువారగుదురు. శ్రద్ధావంతుడగు సాధకుడు జ్ఞానిని సమీపించి సేవించి చెవిదార్చి చెప్పిన ధర్మములను వినును. దానిని ధారణజేయును. పరీక్షజేయును. తగినదని నిశ్చయించును. నిశ్చయానంతరము రుచి గల్గును. ఆపై ఉత్సాహమును ప్రయత్నమును సమాధియు, సమాహిత చిత్తమును సత్యవస్తు సాక్షాత్కారమును లభించును. మొదటి శ్రద్ధయె లేనిచో వానికేదియు లేదు. వాడు మోఘ (వ్యర్థ) పురుషుడు. వానికిని ధర్మమునకును కడుంగడు దూరము.

భిక్షువులారా! గురువువద్ద మెలగుచున్న శ్రావకుడు దృఢ ప్రతిజ్ఞుడు కావలెను. ఆపాదమస్తకము శరీరము, రక్తమాంసములు యెముకలు నరములు పొడిపొడియై రాలు గాక; యశోవామృత్యుర్వావిజయమో వీరస్వర్గమో మఱొక్క తెరువు లేదనుకొని యత్నవంతుడు గావలెను.''

భగవంతు డిట్లు చెప్పెను. భిక్షువులు సంతుష్టులై గురుని అభినందించిరి.

## ౮

## హస్తకసూత్రము, సందకసూత్రము, మహాసకులు దాయిసూత్రము, శృగాలవాదసూత్రము (వి. పూ. 456 -455)

[1] భగవంతుడు బుద్ధుడు క్రమముగ చారిక నొనర్చుచు [2] ఆలవీపురి చేరికొనెను. అందు అగ్రాలవచైత్యమున విహారము జేయుచుండెను. [3] పదునాఱవవర్షావాసమును బుద్ధుడు ఆలవియందు గడపెను.

---

(1) చుల్లవగ్గ 6.

(2) '' పంచాలచండి ఆలవకో అనిన దీర్ఘనికాయము 3 – 9ను బట్టి ఆలవి పాంచాలము నందుండినదగును. ప్రస్తుతము కాన్పూరుజిల్లాయందలి అర్వలము.

(3) అ. ని. అ. క. 2 – 4 – 5.

## హస్తక సూత్రము

[1] అట్లు అగ్రాలవచైత్యమున దశబలుడు విహరించుచుండుట విని హస్తకఆలవ కుడు తనవెంట యేనూర్వురు ఉపాసకులు వచ్చుచుండ భగవంతుని సమీపించి నమస్కరించి యొక్కచో గూర్చొనెను. గౌతము డిట్లనియె.

''హస్తకా! నీ సంఘము చాలదొడ్డది. ఇంతటి సంఘము నెట్లు కూర్చితివి. ఆ మాట విని హస్తకు డిట్లనియె.

''భంతే! సంఘసంయోజనమునకు నాలుగుపాయముల నాశ్రయించితిని. 1. కోరినది యిచ్చి 2. కార్యములనెరవేర్చి 3. సన్మానము జేసి 4. సమానమైత్రి నెఱపి – యిట్లు నాల్గు ప్రక్రియలతో సంఘమును కూడగట్టితిని. దేవా! సంపన్నకుల ములు మావి. దరిద్రున కెవ్వడూఁకొనును?''

''హస్తకా! సమర్థుడవు. ఆర్యజనుల ఆచారమును అనుసరించితివి. సంఘ సంగ్రాహకులు గతకాలమున నిట్టి పద్ధతులనె సమాశ్రయించిరి. వర్తమానమునగాని భవిష్యత్తునగాని పండితు లిట్లే మెలగుదురు.''

భగవంతుని ధార్మికోపదేశములను తనివిదీఱ గ్రోలి హస్తక ఆలవకుడు యథేచ్ఛఁ బోయెను. భిక్షువులతో భగవాను డిట్లనియె.

''భిక్షువులారా! హస్తకుడు యెనిమిది అద్భుతధర్మములతో కూడినవాడు. 1. శ్రద్ధాళువు 2. శీలవంతుడు 3. లజ్జాశీలుడు 4. ధర్మభీరువు 5. బహుశ్రుతుడు 6. త్యాగి 7. ప్రజ్ఞావంతుడు 8. మితాభిలాషి.''

[2] అని వాక్రుచ్చి భగవంతుడు బుద్ధుడు ఆలవినుండి రాజగృహ నగరమునకు బయలు దేరెను.

## సందకసూత్రము

[3] భగవంతుడు సమంతభద్రుడు కౌశాంబియందు విహరించుచున్నాడు. ఆ సమయమున సందకుడను పరివ్రాజకుడు యేనూర్వురు పరివ్రాజకులతో గూడి [4] ప్లక్షగుహయందు నివసించుచుండినాడు.

---

(1) అ. ని. 8 – 1 – 3 – 4. (2) చుల్లవగ్గ 6. (3) మజ్ఝి మనికాయ 2 – 3 – 6, (4) అలహాబాదుజిల్లా కోసంవద్ద పభోసా.

ఒకనాటి సాయంకాలము వేళ ధ్యానమునుండి లేచి ఆనందుడు కొందఱు భిక్షువులతో కలిసి [1] దేవకృతశ్వభ్రమును (సహజబిలము) చూచుటకై బయలు దేరిపోయిరి. ఆవేళకుసరిగ సందక పరివ్రాజకుడును తన పరిషత్తుతోడ [2] వ్యర్థ ప్రసంగములు జేయుచునుండి ఆయుష్మంతుడగు ఆనందునిరాకను దూరమందుం డియె గమనించి సభను హెచ్చరించి యిట్లనియె. '' అల్లదిగో! శ్రమణగౌతముని శిష్యుడు ఆనందుడు వచ్చుచున్నాడు. రొదచేయకుడు. మిన్నకుండుడు. ఇతడు శ్రమణగౌతముని ప్రధాన శిష్యులలో అన్యతముడు. వీరి సంప్రదాయము నిశ్శబ్దమును ప్రేమించునది.'' వింజమాకిడినట్లు సభయంతయు నిశ్శబ్దమైనది.

ఆనందుడు ప్రవేశించినంత సందకు డెదురేగి సాదరముగ స్వాగతమిచ్చి ఆసనమును బఱచి కూర్చుండబెట్టెను. తానొక క్రింది ఆసనముపై గూర్చొనెను.

''సందకా! ఏమో ప్రసంగించుచుంటిరే, మధ్యయందె నిలిపితిరేలా?''

''ఆనందా! ఆ ప్రసంగాలకు కొదవేమిలెండి? వాటిని పోనిండు. ఏదైన నొక ధార్మిక విషయమును ముచ్చటించండి.''

''అట్లైన, సందకా! వినుము. మా ఆచార్యుడు బుద్ధభగవంతుడు అబ్రహ్మచర్య వాసములు నాలుగనియు, అనాశ్వాసిక (శాంతి కల్గింప లేని) బ్రహ్మచర్య (సంన్యాస) వాసములు నాలుగనియు వక్కాణించెదరు. వీటినాశ్రయించిన వాడు అపేక్షించిన మేలును పొందలేడు. వాటి నొక్కక్కటిగ జెప్పెద వినుము.

సందకా! ఒకానొక ఆచార్యుడు యిట్లని జెప్పున్నాడు. 'దానము లేదు. యజ్ఞము లేదు. దాని ఫలములులేవు. ఇహము లేదు. పరము లేదు. మంచిచెడ్డల పరిపాకములును లేవు. దేవతలు లేరు. సత్యము లేదు. సత్యము నెఱిగిన శ్రమణ బ్రాహ్మణుడు లేడు. మనుష్యుడు నాల్గు మహాభూతములతో బుట్టును. వాడు చచ్చినంత పృథివీకాయము, జలకాయము, అగ్నికాయము, వాయుకాయములు వేటియందవి కలిసిపోవును. ఇంద్రియములు ఆకాశమున లీనమగును. పీన్గ మంచముపై పడియున్నది. కాల్చినంత మరి మిగిలి యేమియు లేదు. ఆస్తికవాదము ఉళ్ళుక్కి, పండితుడును మూర్ఖుడును సమముగనె చచ్చుచున్నారు' అని యిట్లుప దేశించు గురువును (సంప్రదాయప్రవర్తకుని) జూచి ప్రాజ్ఞుడగువా డిట్లు దలంచును.

(1) ఆ పభోసాయందే యేదో ఒక ప్రాకృతిక జలకుండము.

(2) 161 వ పేజీ చూడుడు.

'ఈ సంన్యాసి చెప్పునది నిజమైన, చేసినవాడును చేయనివాడును ఒకటియె యగుచు న్నారు. సంన్యాసియై అతడు పొందిన ఫలమును సంసారినైన నేనును పొందుచు న్నాను. బోడికొట్టించుకొని కావికట్టుకొని అతడు యే ఘనకార్యమును సాధించును వివిధ సాంసారిక భోగము లనుభవించు నాకేమి లోటు వాటిల్లినది. ఇట్టి నాస్తికవాది యగు గురువువద్ద బ్రహ్మచర్య వాసమెందుకు చేయవలె' నని యోచించును. అబ్రహ్మ చర్య వాసములలో నిదియొకటి. ఇట్టి సంన్యాసుల బ్రహ్మచర్యము (సాధుత్వము) నందు బుద్ధిమంతులు ఉదాసీనులగుదురు.

మరియొక రకమగు గురువులు గలరు. వారు చెప్పునదేమన – 'పురుషుడు చేయుచు చేయించుచు, నఱకుచు నఱకించుచు, దొంగతనము జేయుచు, పరస్త్రీ గమనము జేయుచు, అసత్యమాడుచు వెయ్యేల సమస్త ప్రపంచమును కాల్చి బూడిద జేసియు పాపమును లేదు పాపము వచ్చుటయు లేదు. అట్లే విశ్వములో నున్నదం తయు దానములిచ్చినను పుణ్యమును లేదు పుణ్యము వచ్చుటయును లేదు.' అని చెప్పెడి ఆచార్యుని మాటలవిని తెలివిగలవాడు యిట్లు యోచించును. 'అతని సంన్యాసత్వమున ఒఱిగినదేమి? నా సంసారిత్వమున ఏమి చెడినది? ఆయన మాట లను బట్టిన ఇద్దరిగతియు నొకటే.'' అని వాని బ్రహ్మచర్య (సాధుత్వ) మున ఉదాసీ నుడగును. అబ్రహ్మచర్య వాసములలో నిది రెండవది.

వేరొక డిట్లు చెప్పును. 'ప్రాణుల సుఖదుఃఖములకు కారణము లేదు. బంధమోక్షములకు హేతువులేదు. ప్రయత్నమునకు చోటు లేదు. ప్రాణులందఱును స్వతంత్రతదక్కి నియతికి – భాగ్యమునకు వశులైనారు' అని యిట్లు వచించువాని యొక్క బ్రహ్మచర్యమునందు కూడ బుద్ధిమంతు డుదాసీనుడై యుండును. అబ్రహ్మ చర్యవాసము లలో నిది మూడవది.

మరియొక్క ఆచార్యుడు యిట్లనును. 'పృథివీకాయము, జలకాయము, అగ్నికాయము, వాయుకాయము, సుఖము, దుఃఖము, జీవుడునను యీ యేడును అకృతకములు. అవధ్యములు అచలములు. అందుచే చంపువాడు చంపించువాడు వినువాడు చెప్పువాడు అను మొదలగు వ్యవహారమంతయు మూర్ఖజల్పనము. ఎవ్వనియొక్క తలనైనను ఛేదించినచో, ఆ శస్త్రధార యీ యేడింటిలో దేనినికూడా తాకనుగాని భంగము చేయనుగాని వీలే లేదు. ఆ యేడుకాయముల మధ్య అంతరాళ మున ఆ కత్తివ్రేటు పడుచు న్నది. నానా యోనులును నానా జన్మములును పండితు డును మూర్ఖుడును యెనప్డి కల్పముల పర్యంతము అనుభవించవలసియున్నది.

జన్మమరణములవలెనే ప్రతివాడును కాలక్రమమున నిర్వాణమునుగూడ బొంద గలడు. విసిరివేసిన దారపుచెండువలె ప్రతివాడును కర్మవివశుడై రాకపోకలు సాగించ వలసినదె. సుఖదుఃఖములు నియతముగ కొలత వేసి పంచబడియున్నవి. శీలవ్రత తపస్సులచే కర్మను త్రోసిపుచ్చనుగాని, పరిపక్వము చేయనుగాని వీలులేదు.' అని చెప్పుచుండును. పైవలెనే వీనియందు గూడ బుద్ధిమంతుడు ఉదాసీనుడగును. అబ్రహ్మచర్య వాసములలో నిది నాల్గవది.

సందకా! యిక అనాశ్వాసిక (ఓదార్పులేని) బ్రహ్మచర్యవాసములను నాల్గింటిని పేర్కొందును వినుము. ఒక్కొక్క ఆచార్యుడు తాను సర్వజ్ఞుడనని సర్వదర్శినని సర్వకాల సర్వావస్థలయందును జ్ఞానదృష్టితో కూడియుందునని చెప్పును గాని ఆ మాట వ్యర్థప్రలాపము. శూన్యగృహములకు భిక్షకువెళ్ళి వట్టిచేతుల వచ్చుచున్నాడు. స్త్రీ పురుషుల పేర్లను గ్రామముల పురముల పేర్లను యితరుల నడిగి తెలిసికొనుచున్నాడు. తేళ్ళు పాములు కుక్కలచే కఱవబడుచున్నాడు. సర్వజ్ఞుడైనవానికి యీ దురవస్థ యెందుకు? మరియు ఇది నా ప్రాప్తము - ప్రారబ్ధము - నియతి - భాగ్యమని చెప్పి తప్పుకొనుచున్నాడు. ఇట్టి వాని బ్రహ్మచర్యవాసము అనాశ్వాసిక మగుటచే బుద్ధిమంతుడు ఉపేక్షించుచున్నాడు.

మఱొక్కవిధమగు గురువు కలడు. అతడు ఆనుశ్రావికుడు. తాను వినిన శ్రుతిని నిజమని చెప్పువాడు. 'ఈ శ్రుతి యిట్లు చెప్పినది. ఈ స్మృతి యిట్లనినది. పరంపరాపద్ధతి యిట్లున్నది. పిటకసంప్రదాయ ప్రమాణ మీరీతినున్నది' అని చెప్పును. అది నిజమైన కావచ్చును. తప్పిన తప్పవచ్చును. కాన ఇది రెండవ అనాశ్వాసిక బ్రహ్మచర్యము.

ఇంకను నొక ఆచార్యుడు గలడు. వాడు తర్కవాది. తర్కించి తన ప్రతిభతో తేల్చుకొన్న దానినె ధర్మమని ఉపదేశించును. కాని ఆ నిర్ణయము సుతర్కితమును గావచ్చును. దుస్తర్కితమును కావచ్చును. నిజమునుకావచ్చును. అబద్ధమును కావచ్చును. ఇది మూడవ అనాశ్వాసిక బ్రహ్మచర్యము.

ఒకానొక గురువు అతిమూఢుడై తన సిద్ధాంతమును 'అదియుగాదు - యిదియుగాదు. రెండును గాదు. రెండును కాదనుటయు గాదు' అని చెప్పుచుండును. ఇట్టి వాని బ్రహ్మచర్యవాసముకూడ నిష్ఫలము. ఈ అనాశ్వాసిక బ్రహ్మచర్యము నాల్గవది. సందకా! భగవంతుడు బుద్ధు డిట్లు చెప్పుచుండును.''

''ఆనందా! ఆనందమాశ్చర్యము. బ్రహ్మచర్యవాస మొనర్చి కుశలధర్మమును పొందగోరువారికి భగవంతు డిట్లుపదేశించును?''

''సందకా! వినుము. ★ తథాగతుడు లోకమునం దుత్పన్నమగుచున్నాడని విని గృహపతిపుత్రుడు ధర్మము నెఱింగి సంశయరహితుడై నీవరణములకును, చిత్తమలములకును, అకుశలధర్మములకును దూరదూరమై నిలిచి ప్రథమధ్యాన మును ప్రాపించుచున్నాడు. శిష్యున కిట్టి దొడ్డలాభము నొడ గూర్పజాలు గురువు నొద్దనె విజ్ఞుడగువాడు యథాశక్తి బ్రహ్మచర్యవాసము జేయవలెను.

సందకా! శ్రావకు డట్లు ప్రథమధ్యానమును బొంది క్రమముగ ద్వితీయ ధ్యానమును, తృతీయ ధ్యానమును, చతుర్థ ధ్యానమును, పూర్వజన్మస్మృతి జ్ఞాన మును, జీవల కర్మ ప్రవాహమును దర్శించి కృతకృత్యుడై కరణీయ మేమియు లేక విముక్తుడు కాగలడు.''

''ఆనందా! అట్టి అర్హత్వపదవిని బొందిన భిక్షువు కామోపభోగముల నను భవింపగలడా?''

''సందకా! అట్టి భిక్షువు క్షీణాస్రవుడౌటబట్టి తెలిసి తెలిసి 1. ప్రాణుల హింసింపడు. 2. ముచ్చిలిపండు 3. మైథునసేవికాడు 4. అసత్యమాడడు 5. గృహస్థునివలె వస్తువులను చేకూర్చి ప్రోగుచేయువాడు కాడు. వాడు నిరంతరము

''ఆనందా! ఈ ధర్మవినయమునకు మార్గదర్శకు లెందఱు?''

''సందకా! లెక్కేమిటి? నూర్లకొలంది?''

''ఆనందా! మీ సౌజన్య మనన్యము. నిజధర్మమును పొగడుకొనుట లేదు. పరధర్మమును తెగడుట లేదు. యోగ్యస్థానమున యథార్థమును జెప్పుటయే పని. మీ ధర్మమునుగూర్చి మార్గదర్శకు లెందరో అంటివిగదా! ఆ జీవకసంప్రదాయకు నడిగినచో వాడు లోకమందు నందవాత్సుడు, కృశసాంకృత్యుడు, మష్కరీగోశా లుడు అనువారు ముచ్చురే మార్గదర్శకులని చెప్పును.'' అని పల్కి సందకపరివ్రాజ కుడు తన పరిషత్తు నుద్దేశించి ''మీరందఱును శ్రమణగౌతమునివద్ద బ్రహ్మచర్య వాసమొనర్చుట యెంతయో మేల''ని ప్రేరేపించెను.

---

★ 146 ,147 పేజీలు చూడుడు.

[1] అక్కడ భగవానులవారు ఆలవినుండి కదలి రాజగృహము చేరి వేణువన కలందక నివాసమున విహారము చేయుచుండెను. ఆసమయమున దేశములో కఱవు వ్యాపించినది.

[2] పదునేడవ వర్షావాసము బుద్ధదేవుడు రాజగృహపురమందే నడిపెను.

## మహాసకులుదాయిసూత్రము

[3] భగవంతుడు బుద్ధుడు రాజగృహమునందు వేణువనకలందకనివాసములో విహరించుచున్నాడు. అనుగారవరచరుడు. సకుల ఉదాయి ప్రభృతులు ప్రసిద్ధ ప్రసిద్ధ పరివ్రాజకులు మోరనివాప పరివ్రాజకారామమున నివసించుచున్నారు. సమయ మట్లున్నది.

అది యొక దినము. పాత్రచీవరములనుగొని భగవంతుడు పూర్వాహ్ణ సమయమున రాజగృహములోనికి భిక్షాచరణమునకై బయలుదేరినాడు. ఇంకను వేళ గాలేదు. ' సకులఉదాయి మున్నగువారుండు మోరనివాప పరివ్రాజకారామ మున కొకసారిపోయి చూచి వత్తునుగాక' యని యూహించి అచ్చటికిపోయెను. అక్కడ సకులఉదాయి పరివ్రాజకుడు మహాపరిషత్తులో వ్యర్థప్రసంగములు [4] బకవాదములు జేయుచు కూర్చొనియుండి భగవంతునిరాకను దవుదవ్వులనె జూచి సభను సంభాళించి నెమ్మదిగ గూర్చొనెను.

బుద్ధదేవుడు వచ్చెను. సకులఉదాయి సాదరముగ స్వాగతమిచ్చి సుఖాసనాసీ నుని జేసెను. భగవంతు డిట్లనియె. ''ఉదాయీ! ఏదో ముచ్చటించుకొనుచుంటిరిగా బోలు. నారాక భంగము కల్గించినది.''

''భంతే! ఏదో ప్రొద్దుబోని ముచ్చట్లు లెండు. తామేద్దైన సలవిచ్చి మమ్ము ధన్యుల జేయండి. వెనుకటిదినాలలో నొకనాడు కుతూహలశాలయందు శ్రమణ బ్రాహ్మణుల నేకులు సమావేశమై ఒక గోష్ఠినడిపిరి. అందొక చర్చ నడిచినది. అంగ మగధవాసుల భాగ్యమె భాగ్యము. సంఘపతులు గణాచార్యులు తీర్థంకరులు యెంద ఱెందఱో రాజగృహమునకు వచ్చి వర్షావాసమును నెరవేర్చుకొనుచుందురు. పూర్ణ కశ్యపుడు, మస్కరీగోశాలుడు, అజితకేశకంబలుడు, ప్రకృధకాత్యాయనుడు,

(1) చుల్లవగ్గ 6. (2) అ. ని. అ. క. 2 - 4 – 5. (3) మ. ని. 2 – 3 – 7.
(4)161 , పేజీ చూడుడు.

సంజయవేలట్టిపుత్రుడు, నిర్గ్రంథజ్ఞాతృపుత్రుడు, శ్రమణగౌతముడు - కాని వీరలలో శిష్యుల మన్ననలకు గౌరవములకు యెక్కువగ పాత్రులైన వారెవరో? యోచిం చండి.''

అందులో నొకడిట్లనియె. ''అయ్యాలారా! పూర్ణకశ్యపు కథ నే నెఱుగుదును. అతని మాటను శిష్యులు సరకుగొనరు. మన్నించరు. ఆదరించరుగూడా. ఒకప్పుడు పూర్ణకశ్యపుడు ధర్మోపదేశములు జేయుచుండ సభయందలి శిష్యమండలిలో కల్లోల ముదయించినది. ఆ రభసను యెంత ప్రయత్నించియు పూర్ణకశ్యపుడు అడంచలేక పోయెను. శిష్యులతనినే ధిక్కరించిన యెడరులెన్నియొ గలవు.''

మస్కరీగోశాలుడు, అజితకేశకంబలుడు, ప్రకృథకాత్యాయనుడు, సంజయ వేలట్టి పుత్రుడు, నిర్గ్రంథజ్ఞాతృపుత్రుడుకూడా పూర్ణకశ్యపునివలెనే శిష్యధిక్కార మునకు పాల్పడిన వారేనని సభలోనొక్కొక్కడు చెప్పగా తేటతెల్లమైనది. తర్వాత శ్రమణగౌతముని ప్రసక్తి వచ్చినది. ''అబ్బో! శిష్యుల కతడనిన ప్రాణము. వారికి వానినిమించి యిహమునులేదు పరమునులేదు. సర్వసంపూర్ణముగ - నూటికి నూరుపాళ్లు శిష్యసత్కారమును చూఱగొన్నవాడు శ్రమణగౌతముడే. అతడు ధర్మోపన్యాసములు జేయువేళలందు సభలలో కిక్కుఱుమనరాదు. ఎవడైన తుమ్మి నను దగ్గినను వెంటనే చుట్టునున్నవారు వేళ్ళు జూపియు, చేతిసైగలు జేసియు, కాళ్ళతో బొడిచియు వానిని పదిలము జేసెదరు. గౌతముని సభయన్న జగద్వి దితము, సంఘములోని భిక్షువెవడైన హీనబుద్ధియై వివదించుకొని సంఘమును భిక్షుదీక్షను వదలి తిరిగి గృహస్థుడైయున్నపుడును బుద్ధుని - ధర్మమును - సంఘ మును ప్రశంసించునెగాని యెగ్గులాడడు. ఆ మహాఫలమునకు తాను నోచనైతినని తన్నుదాను తూలనాడుకొనును. బుద్ధుని గృహస్థశిష్యులైనను శిక్షానియమముల నైదింటిని పాలించుచుందురు.'' అని పరిపరివిధముల ప్రశంసించిరి.

''ఉదాయీ! శిష్యులయొక్క ప్రగాఢగౌరవమునకు పాత్రునిగ నన్ను యేయిం పగల్గిన అంతటి మంచిగుణములు - ధర్మములు నాకడనేమున్నవో చెప్పుము?''

''స్వామీ! నేను మీయందట్టి ఉత్తమధర్మముల నైదింటి నెఱుగుదును. 1. తాము అల్పాహారులు, అల్పాహార ప్రశంసకులు, 2. సామాన్య వస్త్రములతో తృప్తివ హించువారు, అట్టివారిని జూచి మెచ్చుకొనువారు, 3. భిక్షాన్నమున తనివినొందు వారు, అట్లుండువారిని అభినందించువారు, 4. దొరకిన శయనము, లభించిన

ఆసనముతో నెమ్మదిగ నుండువారు, అలాంటి వారిని కొనియాడువారు 5. ఏకాంత వాసులు, ఏకాంతవాసులను శ్లాఘించువారు – ఈ యైదింటిని నే నెఱుగుదును.''

''ఉదాయీ! అంతేనా! అంతమాత్రమున కింత గొప్పగ చెప్పుకొననేల? నన్ను అల్పాహారి యంటివి. నా శిష్యులలో నాకంటె మించిన అల్పాహారులు గలరు. నేనొకొక్కప్పు డీపాత్ర నిండుగనైనను తిందును. వారో తూనిక ప్రకారము, మఱింత కొంచెము భుజించువారు గలరు. శిష్యాదరణ కిది కారణమనుట బొసగదు.

సామాన్యవస్త్రములతో సంతృప్తిపొందువాడనని యంటివి. నా శిష్యులలో పేలికలు కూర్చి కట్టుకొని, బొంతలు ధరించి, నారలల్లి చుట్టుకొని యుండువారు గలరు. నే నొకొకప్పుడు గృహస్థులిచ్చు మృదులదుకూలములను దాల్చుటయును గలదు. దీనిచేతనే శిష్యుల గౌరవమునకు పాత్రుడనైతిననుట ఒప్పనిమాట.

ఉదాయీ! యథోచిత భిక్షాన్నమున తనివిగందునంటివి. అందందు విందులలో మృష్టాన్నములు రుచ్యములగు శాకపాకములు నేను మెసవుట గలదు. కాని నాశ్రావకులలో మధుకరులు, సపదానచారులు, ఉంఛవృత్తిపరాయణులును ఉన్నారు. నిమంత్రించినను విందులకు పోనివారును గలరు. అట్టియెడ ఆ ధర్మమునె శిష్యాకర్షణకు అనుకూల మనుట యెట్లు?

ఉదాయీ! దొరకిన శయనాసనములతో హాయిగందునని యంటివి. అయ్యా! నా శిష్యులలో పలువురు నిరావరణమగు ఆకాశమ్ము క్రిందనె నిత్యనిరంతరము నివసించువారు గలరు. నే నొకొకప్పుడు రమణీయ విహారములందు విహరించుటయు కలదు. అట్టిచో అద్దాననె శిష్యసత్కారము లభించినదనుట పొల్లు.

ఏకాంతవాసప్రియత్వమున శిష్యప్రేమకు గుఱియైతి నంటివా? ఉదాయీ! ఊరుమొగ మెఱుగక కానలనె నుండువారెందఱో నా శిష్యులు గలరు. విశేషావసరము లందు సభలలో పాల్గొనుటకు తప్ప మఱి వారు సంఘములోనికి గూడ రారు. వారి గణుతిలో నా నిష్ఠయేపాటిది. నేనో అయ్యెయెడల భిక్షుణిభిక్షువులు, ఉపాసికా ఉపాసకులు, రాజమహారాజులతో కిటకిటలాడు బ్రహ్మాండమగు సభలలో విహరింతును. నీవు చెప్పినదీ అయిదు ధర్మములేగదా? వీటియాధారముతో శిష్యపూజ్యత గడించితి ననుటను నేనొప్పను.

శిష్యుల మన్ననకు హేతువులని నేనును మఱియైదు ధర్మములను జెప్పెదను వినుము. 1. నేను శీలసంపన్నుడను. కాబట్టి నన్ను విశ్వసించి ఆదరింతురు.

2. నేను జ్ఞానదర్శనమును బొందితిని. అందుచేత శ్రమణగౌతముడు చూచియె చెప్పును. అనుభవించియె చెప్పును. అతని ధర్మము సకారణము. అంతేకాని నిష్కారణము గాదని తలంచి శ్రావకులు నన్నాశ్రయింతురు. మఱియు 3. నేను ప్రజ్ఞాయుక్తుడను. నా నిశితప్రజ్ఞకు చొరరానిచోటు లేదు. అందరాని విషయము లేదు. అందువలన నేను శిష్యులను శాసింపను. వారె నా శాసనములోనికి వత్తురు. 4. నేను ఆర్యసత్యముల నెఱిగిన వాడను. దుఃఖమునుండి గట్టెక్కుటకు శ్రావకులు నా యొద్దకు జేరుదురు. వారికి నేను దుఃఖము – దుఃఖసముదయము – దుఃఖనిరోధము – దుఃఖనిరోధగామినీ ప్రతిపదమనెడి ఆర్యసత్య చతుష్టయము నెఱిగించి వారినందారూఢుల జేయుదును. 5. ★ నేను స్మృతి ప్రస్థానముల నాల్గింటిని భావించినవాడను. శిష్యులు నన్నాశ్రయించి కాయమునందు కాయానుపశ్యనను, వేదనయందు వేదనానుపశ్యనను, చిత్తమునందు చిత్తానుపశ్యనను, ధర్మమునందు ధర్మానుపశ్యనను బొంది అర్హతులై విహరించుచుందురు.

ఉదాయీ! వెండియు వినుము. నాశ్రావకులు సమ్యక్ ప్రధానముల నాల్గింటిని భావించుచు, పాపములుదయింపకుండునట్లును, ఉదయించినవి నశించునట్లును, పుణ్యము లుదయించునట్లును, ఉదయించినవి వృద్ధిబొందునట్లును ప్రయత్నము జేయుచుందరు. ఇంకను 1. ఛందస్సమాధి ప్రధాన సంస్కార యుక్తమగు ఋద్ధిపాదమును, 2. వీర్యసమాధి ప్రధాన సంస్కారయుక్తమగు ఋద్ధిపాదమును, 3. చిత్త సమాధి ప్రధాన సంస్కారయుక్తమగు ఋద్ధిపాదమును, 4. విమర్శ సమాధి ప్రధాన సంస్కారయుక్తమగు ఋద్ధిపాదమును అను యీ నాల్గు ఋద్ధిపాదములను భిక్షువులు భావన చేయుదురు. భిక్షువులగువారు మరియు పంచబలములని చెప్పబడు 1. శ్రద్ధాబలము 2. వీర్యబలము 3. స్మృతిబలము 4. సమాధిబలము 5. ప్రజ్ఞాబలమునను యేనింటిని భావన జేయుచున్నారు.

ఉపశమము శ్రద్ధ వీర్యము స్మృతి సమాధియనెడు యింద్రియముల నైదింటిని భావనజేయుచున్నారు.

వివేకవిరాగ నిరోధాశ్రితఫలములై సంబోధ్యంగములని చెప్పబడు 1. స్మృతి 2. ధర్మవిచయ 3. వీర్య 4. ప్రీతి 5. ప్రశ్రబ్ధి (శాంతి) 6. సమాధి 7. ఉపేక్షలనెడి యేడింటిని భావన చేయుచున్నారు.

---

★ 104 వ పేజీ చూడుడు.

ఆర్యాష్టాంగిక మార్గమని చెప్పబడు 1. సమ్యక్ దృష్టి 2. సమ్యక్‌సంకల్పము 3. సమ్యక్ వాక్కు 4. సమ్యక్ కర్మాంతము 5. సమ్యక్ ఆజీవము 6. సమ్యక్ వ్యాయామము 7. సమ్యక్ స్మృతి 8. సమ్యక్ సమాధి యనెడి యెనిమిదింటిని భావన జేయుచున్నారు.

ఉదాయీ! ఇట్లు నిర్వాణమార్గము నధిష్ఠించిన భిక్షువు మరియును యెనిమిది మోక్షములను భావన జేయును. 1. రూపము గలవాడై రూపములను దర్శించును. 2. శరీరములోన అరూపసంజ్ఞకుడై బైటిరూపములను దర్శించును. 3. శుభము నుండి అధిముక్తుడగును. 4. రూపసంజ్ఞను అతిక్రమించి ప్రతిహింసావృత్తియు నానాత్త్వవృత్తియు నడగినంత ఆకాశానంత్యాయతనమును బొందును.5. ఆపై విజ్ఞానానంత్యాయతనమును 6. అటపై ఆకించన్యాయతనమును 7. మరియు నైవ సంజ్ఞానాసంజ్ఞాయతనమును (ఏ సమాధియొక్క ఆభాసము చేతనమని అచేత నమని చెప్పరానిదో అట్టిది) 8. పిమ్మట ప్రజ్ఞావేదిత నిరోధమును నను విమోక్షముల నెన్మిది భావించి విహరించుచు అర్హతుడగుచున్నాడు.

మఱియు ఉదాయీ! అభిభూ ఆయతనముల నెనిమిదింటిని భావన చేయుచున్నాడు. 1. శరీరమునందలి రూపముల సంజ్ఞగలవాడై బైటి సువర్ణ దుర్వర్ణ క్షుద్ర రూపములను దర్శించి వాటిని అభిభూతము చేసి విహరించుచున్నాడు. 2. బైటి సువర్ణ దుర్వర్ణ అప్రమాణ రూపములను దర్శించి శరీరమునందలి రూపముల సంజ్ఞగలవాడై విహరించుచున్నాడు. 3. శరీరమునందలి అరూపసంజ్ఞగలవాడై బైటి సువర్ణదుర్వర్ణ క్షుద్ర రూపములను దర్శించుచున్నాడు. 4. శరీరమునందు అరూప సంజ్ఞగలవాడై బైటి సువర్ణ దుర్వర్ణ అప్రమాణరూపములను జూచుచు విహరించుచు న్నాడు. 5. లోపల అరూపసంజ్ఞ గలవాడై నీలవర్ణరూపములను జూచుచు వాటిని అభిభూతము జేసి విహరించుచున్నాడు. 6. లోన అరూప సంజ్ఞగలవాడై శుభ్రవర్ణరూ పములను దర్శించుచు వాటిని అభిభూతము చేసి విహరించుచున్నాడు. 7. లోన అరూపసంజ్ఞకలవాడై లోహితవర్ణరూపములను. 8. శుభ్రవర్ణరూపములను దర్శించుచు వాటిని అభిభూతము చేసి విహరించుచున్నాడు.

వెండియు ఉదాయీ! 1. పృథివీకృత్స్నము 2. అపఃకృత్స్నము 3. తేజఃకృ త్స్నము 4. వాయుకృత్స్నము 5. నీలకృత్స్నము 6. పీతకృత్స్నము 7. లోహితకృ త్స్నము 8. అవదాత కృత్స్నము 9. ఆకాశకృత్స్నము 10. విజ్ఞానకృత్స్నములనెడి కృత్స్నాయతనముల పదింటిని భావనజేయుచున్నాడు.

నిర్వాణమార్గాధిష్ఠితుడై నాల్గు ధ్యానములను భావనచేయుచున్నాడు. భిక్షువు కామములనుండి అకుశలధర్మములనుండి వేరై వితర్కవిచార సహితమగు వివేకముతో బుట్టిన ప్రీతిసుఖ రూపమగు ప్రథమధ్యానమును బొంది విహరించుచున్నాడు. ఆ ప్రీతిసుఖము వాని కాయమునంతను ఆప్లావితము జేయుచున్నది. భిక్షువు ద్వితీయ ధ్యానమును బొంది సమాధిజ ప్రీతిసుఖమున నాప్లావితుడగును. అంతట నిష్ప్రీతి కమగు తృతీయ ధ్యానమును, మరియు చతుర్థధ్యానమును బొంది విహరించుచు న్నాడు. దారముతో చుట్టబడిన వజ్రమణివలె కాయమునందు ప్రతిబద్ధమైన విజ్ఞానమును భావించుచున్నాడు. దర్భనుండి ఊచను వెలికి దీసినట్లు మనోమయ శరీరముద్వారా అనేక కాయములను సృష్టించుచున్నాడు. ఆవిర్భావ తిరోభావము లందు నేర్పరియై బ్రహ్మలోకపర్యంతము వశము జేసికొని వివిధసిద్ధులను బడసి విహరించుచున్నాడు. ఇతరుల చిత్తవృత్తులను అద్దమునందు ముఖమునువలె స్పష్ట ముగ గ్రహించుచున్నాడు. గతించిన పూర్వజన్మములను కల్పములను నెన్నేనియు దివ్యనేత్రముతో తెలిసి కొనగల్గుచున్నాడు. ప్రాణికోట్లు జేయు పాపపుణ్యము లను, వారు పొందు నరకస్వర్గములను జన్మమరణములను యింటిమధ్యనుండువాడు వచ్చిపోవువారిని జూచునట్లు చూచుచున్నాడు.

ఉదాయీ! అట్టి భిక్షువునకు ఆస్రవములు లేవు. వాడు జీవద్విముక్తుడు. ఈ జన్మమందె చిత్తవిముక్తియు ప్రజ్ఞావిముక్తియు వానికి సిద్ధించినవి. చరప్రపంచము నందు వాడు స్థిరుడు. అట్టి పదము నపేక్షించి శ్రావకులు (శిష్యులు) నన్ను సత్కరిం తురు. సన్మానింతురు.

సకుల ఉదాయి పరివ్రాజకు డంతయు విని భగవంతుని కొనియాడి ప్రశాం తుడ య్యెను.

## శృగాల (సిగాలో) వాదసూత్రము

ఒక సమయమున భగవంతుడు బుద్ధుడు రాజగృహమునందు వేణువనకలంద నివాసములో విహారము జేయుచుండి ఒకనాడు పూర్వాహ్ణమున పాత్రచీవరములను గొని భిక్షకొఱకై రాజగృహములోనికి పోవుచున్నాడు. శృగాలుడను పేరుగల గృహ పతి (వైశ్య) పుత్రు డొకడు ఆ సమయమున ఊరిబయటకువచ్చి తడిగుడ్డలతో, తడివెంద్రుకలతో పూర్వదక్షిణ పశ్చిమ ఉత్తర ఊర్ధ్వ అధో దిశలకు ఆ యావైపు మళ్ళి నమస్కారములు జేయుచుండెను. బుద్ధుడది చూచి అట్లె నిలబడి వానింబిలిచి యిట్ల నియె. ''గృహపతి పుత్రా! ఎందుకట్లు నమస్కరించుచున్నావు?''

''స్వామీ! మా తండ్రి మరణించునపుడు నన్ను చేరబిలిచి 'నాయనా! దిక్కులకు నమస్కారములు చేయుచుండుమ' ని చెప్పెను. తండ్రిమాటను మన్నించి ప్రతి నిత్యమిట్లే చేయుచున్నాను.''

''వైశ్యకుమారా! దిక్కులాఱింటికి మ్రొక్కుటయనునది ఆర్యధర్మమందు నీవొనర్చునట్లుగాదు.''

''పూజ్యుడా! దిశానమస్కృతులనుగూర్చి ఆర్యవినయ మెట్లు జెప్పుచున్నది?''

''గృహపతిపుత్రా! శృగాలా! వినుము. ఆర్యశ్రావకుడు కర్మక్లేశముల నాలిగింటి నడంచి, నాల్గుమార్గములబడి పాపము పొంతబోక, ఐశ్వర్యనాశనము నాపాదించు కారణముల నాఱింటిని మరగనివాడై యిట్లు పదునాలుగు చెడుగుల నుడిగి ఆఱుదిక్కుల నావరించి యిహపరంబులందు మేలొందుచున్నాడు.

శృగాలా! విడువదగిన కర్మక్లేశముల నాల్గింటిని వినుము.

*ప్రాణిహింసనొనర్చుట పరులసొత్తు । లవహరించు టబద్ధంబు లాడుటయును ।*
*అన్యకాంతల బొందంగ నాసపడుట । పండితులు సమ్మతింపని పనులునాల్గు ।*

మరియు నార్యశ్రావకుడు 1. స్వేచ్ఛాచారియైగాని 2. ద్వేషవశమునగాని 3. మోహవివశుడైగాని 4. భయమునకులొంగికాని పాపమాచరింపడు. ఈ నాలుగు త్రోవలలో వాడు పడడు.

*మోహరాగభయద్వేషములకు రోగి నతడు చెడు కృష్ణపక్షశీతాంశుకరణి*
*వాటినంటక ధర్మసంపన్నుడెలమి శుక్ల పక్షచంద్రునిరీతి శోభగాంచు.*

కుమారా! ఐశ్వర్యనాశనమునకు హేతువులగు కారణముల (అపాయముఖముల) నాఱింటిని వినుము. 1. త్రాగుబోతగుట 2. అకాలములందు తిరుగుట 3. వినోదములందు పాల్గొనుట 4. జూదమాడుట 5. చెడ్డవారి చెలిమి జేయుట 6. సోమరి యగుట ఈ ఆఱింటిని ఆర్యశ్రావకుడు మరగడు. వీటిని వివరించి చెప్పెదను వినుము.

త్రాగుబోతు ఆఱువిధముల జెడుచున్నాడు. 1. తత్కాలమున ధనహాని 2. జగడములు పెంచుకొనుట 3. రోగములకు గుఱియగుట 4. అపకీర్తిపాలగుట 5. సిగ్గుచెడుట 6. ప్రజ్ఞ పాడగుట.

గృహపతిపుత్రా! అకాలమున తిరుగువానికి ఆఱు చెడ్డలు వాటిల్లును. 1. క్రమము లేక తాను చెడును. 2. భార్యాపుత్రులు అదుపాజ్ఞ లేనివారగుదురు. 3. సంపద అబంధురమై పోవును. 4. అపోహలకు గుఱియగును. 5. విలువను కోల్పోవును. 6. అనేక దుఃఖకారక కార్యముల నొనర్చును.

వినోదవ్యసనికి చేటులాఱు:- 1. ఆటపాట లెందెందని వ్యాకులపడుట. 2. సమయమును వ్యర్థము చేయుట. 3. స్వాస్థ్యహానియగుట 4. చిత్తమున విషయ వికారము లుదయించుట. 5. దుష్టసంగమున భ్రష్టుడగుట. 6. సోమరిపోతై కర్తవ్య కర్మలను జాఱవిడుచుట.

జూదరికి చెడుగు లాఱు:- 1. జయసమయమున వైరము. 2. అపజయమున వ్యాకులము. 3. తత్కాలమున ధనహాని. 4. నమ్మకము చెడుట. 5. ఆప్తమిత్రులతో అనాదరింపబడుట. 6. వివాహాదులయందు వెలితివాడగుట.

దుష్టస్నేహము చేయువాడు తాను గూడ 1. ధూర్తుడు 2. శౌండుడు 3. పిపాసుడు 4. కృతఘ్నుడు 5. వంచకుడు 6. దుండగీడును నగుచున్నాడు.

సోమరిచెడుటకు హేతువు లాఱు 1. ఎండ యెక్కువయని 2. చలిమిక్కుట మని 3. ప్రొద్దున్నదని 4. ప్రొద్దుబోయినదని 5. ఆకలివేళయని 6. భుక్తాయాసమని చేయవలసిన పనులు జేయక సంపదలకు దూరుడగుచున్నాడు.

*కల్లుద్రాగెడివేళల గలియువాడు । ఇచ్చకాల్ బల్కువాడు స్నేహితులుగారు ।*
*పనులు ముగిసినం గూడ బాయకుండు । వాడెమిత్రుండు నిజముగవసుధ లోన.*
*నారిజూదంబు పానంబు నృత్యగీత । వ్యసనమును దుష్టమైత్రియు అసమ యగతి ।*
*పగలు నిద్రించుటయు లోభభంగిమంబు । నరుని మొదలంటజెఱిచెడి దురితములివి.*

గృహపతిపుత్రా! 1. పరధనాపహారి 2. మాటకారి 3. స్తుతివాది 4. అపాయ ప్రేరకుడు – ఈ నాల్గులక్షణములు గలవాడు మిత్రరూపమున నుండు శత్రువు. అందు పరధనాపహారికి నాలుగు లక్షణములు – 1. పెఱవారిసొత్తుల గోరుట 2. అల్పముతో అధికముగోరుట 3. ఉపద్రవకార్యములు జేయుట 4. స్వార్థముగోరి సేవించుట.

మాటకారివానికి నాలుగు లక్షణములు – 1. గడచిన దానిని వర్ణించువాడు 2. భవిష్యత్తును బొగడువాడు 3. వ్యర్థప్రసంగములు చేయువాడు 4. ప్రస్తుతకార్యము లందు భయమును చూపువాడు.

స్తుతివాదికి నాలుగు లక్షణములు – 1. ఎదుట పొగడుట 2. వెనుక నిందించుట 3. చెడ్డపనులకు అనుమతించుట 4. మంచిపనులకును అనుమతించుట.

అపాయ ప్రేరకునకు నాలుగులక్షణములు – 1. మద్యపానమున తొడగును 2. ద్రిమ్మరిదిరుగుట 3. వినోదదర్శనములందు తొడగుట 4. జూదము మొదలైనవాటి యందు తొడగుట.

గృహపతిపుత్రా! మిత్రుడెట్టివాడనిన – 1. ఉపకారియగు:ాడు 2. సుఖదుఃఖములను సమానముగ పంచుకొనువాడు 3. అర్థప్రాప్తిని బోధించువాడు 4. అనుకంపకుడు – వీరు తగినమిత్రులు. ఇందు ఉపకారిమిత్రుని లక్షణములు నాల్గు:– 1. ప్రమత్తుడైనచో రక్షించుట 2. ప్రమత్తుని సంపదను రక్షించుట 3. భీతుడైనచో రక్షించుట 4. పనిగల్గిన యెడల యిబ్బడిగ తోడ్పడుట. సమానసుఖ దుఃఖుని లక్షణములు నాలుగు:– 1. వలయునపుడు రహస్యమును జెప్పును. 2. వలసినపుడు రహస్యమును దాచును 3. విపత్తులందు చెయివీడడు 4. సమయమున ప్రాణమిచ్చుటకును సంసిద్ధుడు. అర్థాభ్యాయి లక్షణములు నాలుగు – 1. పాపము నుండి వారించును. 2. పుణ్యములందు జొనుపును. 3. తెలియనిదానిని తెలియ జెప్పును. 4. సుగతికి దారి జూపించును.

అనుకంపకునకు నాల్గు లక్షణములు – మిత్రునకు సంపద కల్గుననిన సంతోషింపడు 2. కల్గినను పెల్లుబ్బడు 3. నిందించువారిని నిరోధించును 4. ప్రశంసించుచున్న తానును ప్రశంసించును. గృహపతిపుత్రా! మరియు వినుము. తలిదండ్రులు తూర్పుదిక్కు, ఆచార్యులు దక్షిణదిక్కు, భార్యాపుత్రులు పడమరదిక్కు, మిత్రామాత్యులుత్తరముదిక్కు, దాససేవకులు క్రిందదిక్కు, శ్రమణబ్రాహ్మణులను పై దిక్కుగను గుర్తింపుము.

తూర్పుదిక్కగు తల్లిదండ్రులను అయిదువిధముల సేవింపవలెను. 1. తన్ను పోషించిరి కావున తాను పోషింపలెను. 2. తనకు వలయుపనులు చేసిరిగాన వారి పనులను చేయవలెను. 3. వంశము నిలిపిరికాన యికముందుకూడ వంశము నిలుప వలెను. 4. ఆస్తిని సమకూర్చిరిగాన తాను అట్లె చేయవలెను. 5. మృతిచెందిన పిదప శ్రాద్ధదానములు చేయవలెను. ఇట్లు అయిదువిధముల సన్మానితులగు పితరులు పుత్రుని అనుగ్రహించి 1. పాపమునుండి నివారింతురు. 2. పుణ్యమున జొనుపుదురు. 3. వృత్తిని నేర్పుదురు. 4. అనుకూలపత్నిని జేర్చెదరు. 5. సంపద నభివృద్ధి చేయుదురు. ఇట్లు అయిదు విధముల నుపకరింతురు.

ఆచార్యుడను దక్షిణదిశను శిష్యుడీ అయిదు పద్ధతుల నభ్యసింపవలెను, 1. ఉత్థానముతో 2. ఉపస్థానముతో 3. శుశ్రూషతో 4. పరిచర్యతో 5. చక్కగ విద్యలను నేర్చుకొనుటతో ఆచార్యుని సంప్రీతుని జేయవలెను. సంప్రీతుడగు ఆచార్యుడు 1. చక్కని వినయమును కూర్చును. 2. చక్కని ఆచారమును గూర్చును. 3. విద్యలయందు పరిపూర్ణుని జేయును. 4. మిత్రామాత్యులయందు వాసి చెందించును. 5. అన్నియెడల కాపాడును.

భార్యయనెడి పశ్చిమదిశను 1. సన్మానించుటచేతను 2. అవమానము చేయకుండుటచేతను 3. పరస్త్రీగమనాది అతిచారముల నొనర్పకుండుటచేతను 4. ఐశ్వర్యము నిచ్చుటచేతను 5. అలంకారముల నొసగుటచేతను సంప్రీతినొందింపవలెను. అట్లు సంప్రీతయై యజమానుని తానును అయిదువిధముల సేవించును. 1. పనిపాటలు చక్కగ జేయుచు 2. పరిజనముల వశమునందుంచుకొని 3. అతిచారిణిగాక 4. ఆర్జితమును రక్షించుచు 5. సోమరిగాక సమర్థతతో పనులు నడుపుచు సంతృప్తుని చేయును.

శృగాలకుమారా! మిత్రామాత్యులు ఉత్తరదిక్కు. వారిని 1. దానముచేతను 2. ప్రియవచనములచేతను 3. అర్థచర్యచేతను 4. సమానతా ప్రదర్శనముచేతను 5. విశ్వాసప్రదానముచేతను ఆదరించవలెను. వారును కులపుత్రుని 1. ప్రమాదము లందు రక్షింతురు 2. ప్రమత్తుని సంపదను కాపాడుదురు 3. భయవేళలందు తోడగుదురు 4. ఆపదలందు చేయివీడరు 5. సాటివారియందు గొప్పజేతురు. ఇట్లు అయిదువిధముల పోషింతురు.

గృహపతిపుత్రా! దాససేవకులు క్రిందిదిక్కు. స్వామియగు వాడు వారిని 1. యథాశక్తి ..లుచెప్పుచు 2. యథాకాలమున జీతములిచ్చుచు 3. రోగపీడితులైనపుడు శుశ్రూషలు జేయుచు 4. మంచి వస్తువులను బహుమతి యిచ్చుచు 5. ఆయావేళల సెలవులొసంగుచు ఆదరించుచుండవలెను. వారును 1. ప్రభువుకంటె ముందుగ మేల్కొను వారును 2. వెనుక నిద్రించువారును 3. ఇచ్చునది తీసుకొనువారును 4. పనిపాటల చక్కగ జేయువారును 5. కీర్తిప్రతిష్ఠలను పెంపొందించువారునునై యుందురు.

మరియు కులపుత్రుడు శ్రమణబ్రాహ్మణరూపమున నొప్పు ఊర్ధ్వదిశను ఆరాధించువాడు కావలెను. 1. మైత్రీభావముతో కూడిన కాయికకర్మలచే 2. వాచికకర్మలచే 3. మానసికకర్మలచే 4. వారు తన యింటియందు ప్రవేశించుటకు

అడ్డములేకుండా వివృతద్వారుడౌటచే 5. అన్నపానాది వస్తువుల నొసంగుటచే వారిని సంతసింపజేయవలెను. వారును కులపుత్రుని కనికరించి 1.పాపమార్గమునుండి మరలింతురు. 2. కల్యాణమార్గమున నడిపింతురు. 3. మేలుకల్గింతురు. 4. తెలియ నిదానిని తెలుపుదురు. 5. తెలిసికొనిన విద్యను మరింత పదిలము జేయుదురు. ఈ అయిదువిధముల రక్షింతురు.

భగవంతుడు బుద్ధు డిట్లాదేశించిన విని గృహపతిపుత్రుడు శృగాలుడు "భంతే! ఆశ్చర్యము! భగవంతా! అబ్బురము. బుద్ధుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును శరణు జొచ్చుచున్నాను. సంఘమును శరణుజొచ్చుచున్నాను. నేటినుండి నన్ను సాంజలి శరణాగత ఉపాసకునిగ అనుగ్రహించండి." అని వేడికొనెను.

## ౬

## క్షుల్లసకుల ఉదాయిసూత్రము (వి. పూ.455)

[1] గౌతమబుద్ధుడు రాజగృహనగరమున వేణువనకలందక నివాసములో విహరించుచు నొకనాడు తొల్లింటివలెనే సకుల ఉదాయి పరివ్రాజకుడు నివసించు పరివ్రాజకారామమునకు అరుదెంచెను.

ఉచిత సత్కారములను నడపి సకుల ఉదాయి పరివ్రాజకు డిట్లనియె. "భగవంతా! మీ నుడువులను వినుటకు సభయంతయు చెవులు విప్పుకొనియున్నది. ధర్మబోధనొనర్పుడు. నేనొకప్పు డొక ఆచార్యుని జూచితిని. అతడు యెల్ల వేళలను సర్వజ్ఞుడను, సర్వదర్శిని, తినుచు జనుచు వినుచు కనుచు నేను జ్ఞానసింహాసనా ధిష్ఠితుడనని విజృంభణముగ దంభములు పలుకువాడు. ఆతనితో 'ఆది'ని గూర్చి ప్రశ్నించితిని. అతం డిటునటు కికురించి ప్రసంగమునకు అతుకని పలుకులు పలికి కసరి కోపించి యేమేమో తంటాలుపడెను. ఆ సమయమున మీరు స్మృతికి వచ్చితిరి."

"ఉదాయీ! నీవు ప్రశ్నించిన దెవరిని."

"దేవా! నిర్గ్రంథజ్ఞాతృపుత్రుడను జైనాచార్యుని"

"ఉదాయీ! ఎవడు పూర్వజన్మములయొక్క జ్ఞానము కలవాడో, యెవడు [2] దివ్యచక్షుఃసంపన్నుడో వాడు ఆదిని - పూర్వాంతమును గూర్చి నన్ను ప్రశ్నిం

(1) మ. ని. 2 – 3 – 9. (2)146 ,147 పేజీలు చూడుడు.

చుగాక. నేనును వానిని ప్రశ్నింతును. అంత్యమును (అపరాంతమును) గూర్చి నన్ను ప్రశ్నించుగాక. నేనును వానిని ప్రశ్నించెదను. వాడు తగినట్టు ఉత్తరమిచ్చినచో నేనును యోగ్యముగ సమాధానించెదను. ఉదాయీ! ఎందు కీగడబిడలు. సర్వనిదానమగు ధర్మమును జెప్పెద వినుము.

'అటులైన నిటులగుచున్నది. అదిగల్గిన నిది గల్గుచున్నది. అదిలేనిచో నిది లేదు. అది నశించిన నిదియు నశించుచున్నది.' అయ్యా! ఉదాయీ! లోకము సుఖమయమా? సుఖమయమగు లోకమును దర్శించుటకు విస్తారమగు మార్గమున్నదా?''

''స్వామీ! మా మతమునందు గలదు.''

''ఉదాయీ! ఆ మార్గమేమిటి?''

''దేవా! పురుషుడు ప్రాణిహింసను, చౌర్యమును, కామమిథ్యాచారమును మృషావాదమును వీడి తపోనిష్ఠ నంగీకరించుట.''

''ఉదాయీ! ప్రాణిహింసాదులను వదలినప్పుడు ఆత్మ కేవల సుఖమయమ్మై యున్నదా? సుఖదుఃఖములతో కూడియున్నదా?[1]''

''భంతే! సుఖదుఃఖములతో కూడియున్నది.''

''ఉదాయీ! సుఖదుఃఖమిశ్రితమ్మైన మార్గమువలన కేవలసుఖమయమగు లోకమును పురుషు డెట్లు దర్శించగలడు? ఆ మాట తుచ్ఛము. ఉదాయీ! భిక్షువు ప్రథమధ్యానమును ద్వితీయధ్యానమును తృతీయధ్యానమును పొందుచున్నాడు. ఇదియే విస్తారమగు మార్గము. కాని యింతటితో వానికి సుఖమయమలోక సాక్షాత్కారము లేదు. ఆపై ప్రీతిసుఖమును విడిచి నాల్గవధ్యానమును బొంది సుఖమయమగు లోకముల ప్రాపించుచున్నాడు. మఱియు లోకమునందు తథాగతుడుత్పన్నుడైనాడని విని భిక్షువు పంచనీవరణములను వదలి చిత్తమలముల నూడ్చి ధ్యానచతుష్టయమును బొందినవాడై అనేక పూర్వజన్మముల స్మరించుచు సంసారవిచిత్ర పరిభ్రమణమును దర్శించుచు దుఃఖ నిరోధగామినీ మార్గమును యథార్థముగ నెఱుగుచున్నాడు.

అట్టివాడు కృతకృత్యుడు. అనుత్తరధర్మలాభమును పొందినవాడు. దీనికొఱకై భిక్షువులు నా వద్ద బ్రహ్మచర్య పాలనము జేయుచుందురు.''

---

(1) 146 ,216 పేజీలు చూడుడు.

అని భగవంతుడు చెప్పినంతట సకుల ఉదాయి బుద్ధదేవుని వద్ద ప్రవ్రజ్య నభిలషించెను. కాని పరిషత్తులోని పరివ్రాజకులు అతని నివారించి యిట్లనిరి. ''ఉదాయీ! నీవు శ్రమణగౌతమునివద్ద బ్రహ్మచర్య వాసము చేయుట సముద్రము బావియైనట్లు, నీవు ఆచార్యుడవై యుండి శిష్యత్వ మెట్లు జేసెదవు?'' అని నిరోధించిరి.

వారి నిర్బంధమునకు అతడు లొంగెను. ఇట్లు సకుల ఉదాయి బుద్ధదేవునివద్ద బ్రహ్మచర్యవాసము చేయుటకు భంగమేర్పడినది.

## ౧౦

## చాలియపర్వతమందు – దట్ఠివజ్జసూత్రము; ఖుల్లి అశ్వపుర సూత్రము; కజంగలాసూత్రము (వి. పూ. 454)

[1]భగవంతుడు పదునెనిమిదవ వర్షావాసము చాలియపర్వతమున గడపెను.

[2]బుద్ధదేవుడు చంపానగరములో గర్గరాపుష్కరిణీ తీరమున విహారము జేయుచున్నాడు. ఆ నగరమునందు నివసించు వజ్జియ మహితుడను గృహపతి భగవంతుని దర్శనార్థమై బయలుదేఱి పోవుచూ, ఆసమయము దర్శనమునకు వీలు లేని ధ్యాన సమయమని దలంచి అన్య తైర్థిక పరివ్రాజకుల ఆరామమునకు చూచుటకై సరదాగా వెళ్ళెను.

ఆరామవాసులగు పరివ్రాజకులు ప్రొద్దుపోని సుద్దులతో అంపు అంతు రొదాశము జేసికొనుచు వజ్జియమహిత గృహపతి యరుగుదెంచుట దూరమునుండియె గాంచి సద్దడగి యుండిరి. శ్రమణగౌతముని గృహస్థశిష్యులలో వజ్జియమహితుడు మంచి మాట మంతు గలవాడు. అతడు ఆరామములోనికి బ్రవేశించి త్రైర్థికపరివ్రాజకులతో కుశల ప్రశ్నము లాచరించి యొకచో నుపవిష్టుడయ్యెను. ఆ పరివ్రాజకులిట్లడిగిరి.

''గృహపతీ! తపోనిష్ఠలనిన గౌతమునకు గిట్టవట. తీవ్రతపములను అతడు ఉగ్రముగ విమర్శించునందురు. నిజమేనా?''

''పూజ్యులారా! భగవంతుడు తపస్సుల నన్నిటిని నిరాకరింపడు. అన్నిటిని నిందింపడు. తెగడదగుదానిని తెగడును. పొగడదగు దానిని పొగడును. అతడు ఔచిత్యవాది. విభజ్యవాది.''

(1) అ. ని. అ. క. 2 – 4 – 5. (2) అ. ని. 10 – 2 – 5 – 4.

ఆ మాటను విని వారిలో నొక పరివ్రాజకు డిట్లనియె. ''గృహపతీ! శ్రమణ గౌతముని నీవు తెగ పొగడుచున్నావు. అతడు వైనయికుడె (అన్నింటిని ఖండించు వాడె) గాని ప్రజ్ఞప్తికుడు (సిద్ధాంతము జేయువాడు) గాడందురు. నిజమేనా?

''పూజ్యులారా! నిజమును జెప్పుచున్నాను. భగవంతుడు యిది మంచియని సిద్ధాంతము జేయును. ఇది చెడ్డయని తీర్మానించును. ఆయన ఖండనవాది (వైనయి కుడు) గాడు. మండనవాది (సప్రజ్ఞప్తికుడు).''

మొత్తము పరివ్రాజకులు నిరుత్తరులైనారు. వజ్జియమహిత గృహపతి వారిని వీడ్కొని కదలి భగవంతుడున్నెడకు బోయి ఈ సమాచారమంతయు సాంగముగ వాక్రుచ్చెను. సుగతు డిట్లనియె.

''భళీ! భళి, గృహపతీ! లెస్స జేసితివి. వారికి తగినట్లు శృంగభంగ మొన ర్చితివి. తపోవ్రతనిష్ఠల నన్నిటి పాలించవలెననిగాని, ఊచమట్టుగ నన్నింటిని విడిచి పెట్టవలెననిగాని నేను చెప్పను. కుశలధర్మములను క్రుంగదీసెడి, అకుశలధర్మముల నభివృద్ధినొందించెడి తపస్సుల జోలికి పోకుడని చెప్పుదును. పాపములను రూపఱజేయుచు పుణ్యములను ప్రోదిసేయు తపములను వ్రతములనుగూర్చి నేను మరింత ప్రోద్బలింతును.''

తథాగతుని వచనములను దత్తచిత్తుడై విని వజ్జియమహితుడు సెలవుగైకొని యింటికి వోయెను. భగవంతుడు భిక్షువులను జూచి యిట్లనియె. ''భిక్షువులారా! ఈ గృహపతి ధర్మవినయమునందు పట్టుదలగలవాడు ప్రతిపక్షవాదములకు తగి నట్టు మాఱుమాటాడి వారి నోళ్ళు మూయించగలడు.''

## క్షుల్ల అశ్వపురసూత్రము

★ అంగదేశమున నశ్వపురియనునొక గ్రామమున విహరించుచుండి భగ వంతు డొకనాడు భిక్షువులతో నిట్లనియె.

''భిక్షువులారా!''

''భదంతా!''

★ మ. ని. 1 - 4 - 10.

''వినుడు. లోకము మీకు శ్రమణులని పేరువెట్టినది. మీరెవరని యడిగినచో మీరుకూడ 'మేము శ్రమణులమ'ని బదులిత్తురు. వచ్చిన పేరు వ్యర్థముగాకుండ కృతార్థము కాగలుగుటెట్లని యించుకైన యోచించినారా? ప్రజలు మీకు అన్నవస్త్రము లిచ్చెదరు. శయనాసనము లర్పించెదరు. మందుమాకుల నొసగెదరు. వారి దానములకు మంచిదారి కల్పించినపుడె మీ శ్రమణత్వము సార్థకమగుట.

ఓ భిక్షువులారా! శ్రమణునకు సత్యమార్గమెందుకు దూరమైనది? దుర్గతిలో దొర్లింపజాలెడి కసటులను కల్మషములను వాడు వీడ లేదు. కామలోభములు, ద్రోహమోహములు, కోపతాపములు, ఈర్ష్యాసూయలు, కుహనాకృత్రిమములు, వాని చిత్తమును దయ్యాలకొంప జేసినవి. నిప్పునుగట్టిన గుడ్డవలె వాని శ్రమణత్వము ముప్పుతో గూడినది.

కావిబట్టలు గట్టినంతనె శ్రమణుడు కాబోడు. దిసమొల తిరిగినంతనె శ్రమణత్వము దిగిరాదు. శ్రమణత్వమునకు జడలమీద మోజు లేదు. నీట నివసించుట బురదలో పొరలాడుట చెట్టును గుట్ట నాశ్రయించుట అస్తులు పస్తులుం డుట, సరాసరి శ్రమణభావమునకు లక్షణము లనుకొనుట సుతరాం పొరబాటు. కాషాయముల గట్టినంతనె, బోడికొట్టినంతనే సంన్యాసమబ్బినచో – శ్రమణత్వము సిద్ధించినచో – పాపక్లేశములు దొలగినచో నిర్వాణపట్టము చేకూఱినచో జన్మించిన వానికెల్ల నది సాధ్యమై యుండెడిది. కాని యది అంతటి తేలిక వస్తువు గాదు.

నిప్పును చెదలంట లేనట్లు యెవ్వని చిత్తమును పాపవృత్తులు స్పృశింపలేవో, బంగారమునకు చిలుము లేనట్లు యెవ్వని శీలమునందు మచ్చలేదో, యెవడు కుశల ధర్మములందు ప్రవీణుడో, యెవ్వనియందు మైత్రియు, కరుణయు, ముదితయు, నుపేక్షయు నను సువర్ణగుణములు నిండి తాండవించియున్నవో వాడే నిజమునకు శ్రమణు డనదగినవాడు. శ్రమణత్వము వానిని బొంది సుమంగళియైనది. నిర్వాణ సౌధమునకు వాడు నిచ్చెన వేసినవాడు.

తియ్యని తేటనీరుగల కోనేటిలోనికి యే వైపునుండి దిగినను వాడు వాడు వాని వాని దాహవ్యథను శాంతింప జేసికొని సంతృప్తుడైనట్లు బ్రాహ్మణుడైనను క్షత్రియుడైనను వైశ్యుడైనను మరి యే జాతివాడైనను యీ సర్వోత్తమమగు శ్రామణ్యధర్మమును సమాశ్రయించినచో ఆధ్యాత్మికశాంతిలాభములు చేకూఱుననుట అక్షరాల నిజమైన మాట.''

భగవంతుడు బుద్ధు డిట్లుపదేశించిన విని భిక్షులు పరమానందపరవశులైరి.

## కజంగలాసూత్రము

[1]భగవానుడు [2] కజంగలములోని వేణువనమునందు విహారము జేయుచు న్నాడు. ఒకానొక దినము ఆ నగరమందలి ఉపాసకులు కొందరు కజంగలమనెడి భిక్షుణివద్దకు బోయి నమస్కరించి యొకచో గూర్చొని ఆమెతో నిట్లనిరి.

''అమ్మా! భగవంతు డొకప్పు డిట్లనినాడు. ''ఒక ప్రశ్న ఒక ఉత్తరము. రెండు ప్రశ్నలు రెండుత్తరములు. మూడు...నాలుగు... అయిదు... ఆఱు... ఏడు... ఎనిమిది... తొమ్మిది... పది ప్రశ్నలు పది ఉత్తరములు'' ఈ సంక్షేపరూపమగు భాషణమునకు అర్థమేమి?''

''ఆయుష్మంతులారా! నేను బుద్ధభగవంతుడు చెప్పగ వినలేదు. నాకు తోచినది చెప్పెదను వినుడు. ఒక ప్రశ్న – ఒక ఉత్తరమని భగవంతు డెందుకన్నాడు? భిక్షువు ఒక వస్తువునందు చక్కగ నిర్వేదమును బొంది విరక్తిజెంది అంతదర్శియయి సామ్యస్థితిని ప్రాపించి ఈ జన్మమునందే దుఃఖముల నున్మూలించుచున్నాడు. ఆ ఒక్కవస్తువనిన యేది? ప్రాణులన్నియు ఆహారస్థితికములు (ఆహారముపై ఆధారపడి యుండునవి) అని తెలియుట. అట్లే రెండువస్తువులం దనగా నామరూపములందని గ్రహించవలెను. మూడు వస్తువులు సుఖము – దుఃఖము – అసుఖము అదుఃఖము. నాలుగువస్తువులు స్మృతిప్రస్థానములు. అయిదనిన యింద్రియములు. ఆఱనిన నిస్సారణీయ ధాతువులు. ఏడనిన సంబోధ్యంగములు. ఎన్మిదియనిన యెనిమిది సమ్యక్ ధర్మములు. తొమ్మిదియనిన సత్వావాసములు. పదియనిన కుశల కర్మ పథములు. వీటిని చక్కగ సంభావించి అంతదర్శియయి దుఃఖక్షయమును బొందుచు న్నాడు. గురుదేవుని సంక్షిప్తకథనమునకు నాకు తోచిన యర్థము వివరించితిని. మీరు వలయుచో భగవంతునికడకె బోయి అడిగి తెలిసికొనవచ్చును.''

''చిత్తము – పోయివత్తుము''ని సెలవంది ఆ ఉపాసకులు ఆమెకు నమస్క రించి బుద్ధు డుండుచోటికి పోయిరి. పోయి నమస్కరించి యొక్కెడ గూర్చొని తమకును కజంగలాభిక్షుణికిని నడిచిన సంవాదము నెఱిగించిరి. అది విని తథాగతు డాహ్లాదితుడై ''గృహపతులారా! లెస్స లెస్స. ఆ భిక్షుణి మహావిదుషి. ప్రజ్ఞావతి.

ఈ విషయమై మీరు నన్నడిగియున్నను నేనును ఆమె చెప్పినట్లే చెప్పియుండెడివాడను. యథార్థమునకు ఉన్నదంతయె. చక్కగ ధారణ జేసి కొనుడు'' ని చెప్పి సంతుష్టుల జేసెను.

## ౧౧

## ఇంద్రియభావనాసూత్రము, సంబహులసూత్రము, ఉదాయి సూత్రము, మేఘియసూత్రము (వి.పూ. 454 - 453)

★ భగవంతుడు తథాగతుడు కజంగలమునందు సువేణువనమున విహారము జేయుచున్నాడు. ఆ సయమున పారాసివియకుని శిష్యుడు ఉత్తరుడను మాణవకుడు బుద్ధదేవుని వద్దకువచ్చి సంమోదనమొనర్చి యొక యోర గూర్చొనెను. భగవంతు డతని జూచి యిట్లనియె.

''ఉత్తరా! మీ గురుడు శిష్యులకు యింద్రియభావనను సంబంధించి ఉపదేశించునా?''

''గౌతమా! ఉపదేశించును.''

''ఉత్తరా! ఏమని ఉపదేశించును?''

''గౌతమా! 'కంటితో రూపములను జూడరాదు. చెవితో శబ్దములను వినరాదు.' ఇట్లు పారాసివియ బ్రాహ్మణుడు శిష్యులకుపదేశించును.

''ఉత్తరా! గ్రుడ్డివాడు చూడలేడు. చెవిటివాడు విన లేడు. మీ ఆచార్యునిమాట ప్రమాణమైనచో ఇంద్రియభావన గ్రుడ్డివానికిని చెవిటివానికినిగూడ సిద్ధించును. వారుగూడ భావితేంద్రియులైనారు.''

ఆ మాటకు నిరుత్తరుడై ఉత్తరుడు గ్రుక్కిళ్లు మ్రింగుచు నూరకుండెను. భగవంతుడు ప్రక్కననుండు ఆయుష్మంతుడు ఆనందుని సంబోధించి యిట్లనియె. ''ఆనందా! ఆర్యవినయమందు యింద్రియభావన మఱొక్క విధమైయున్నది. సర్వోత్కృష్టమైన దానిని చెప్పెదను వినుము.

---

★ మ. ని. 3 - 5 - 10.

కంటితో రూపమును జూచిన భిక్షువునకు ప్రియమును, అప్రియమును, ప్రియాప్రియమును కల్గుచున్నవి. వాడు వాటిని గ్రహించి అవి కృత్రిమములనియు, ప్రతీత్యసముత్పన్నములనియు, వాటియందు ఉపేక్షనుంచుటయే శాంతికి దారియ నియు దలంచును. అంతట ఉపేక్ష స్థిరమగుడు ప్రియాప్రియాదులు లోపించుచు న్నవి. పొటకరించిన ప్రియము, అప్రియము, ప్రియాప్రియమును ఉపేక్ష నెలకొల్పిన పురుషునకు కనుఱెప్ప మూసిదెఱచినంతలో విలీనమగుచున్నవి. ఆర్యవినయమందు యిదియే చక్షుర్విజ్ఞేయ రూపవిషయకమగు అనుత్తర యింద్రియభావనయని చెప్ప బడుచున్నది. అట్లే చెవితో శబ్దములను వినునపుడును, ముక్కుతో గంధములను గొనునపుడును, నాలుకతో రుచులను గ్రహించునపుడును, చర్మము ( కాయము) తో స్పర్శమును బొందునపుడును, మనస్సుతో ధర్మముల నెఱుంగునపుడును ఉపేక్షను ప్రతిష్ఠించి ప్రియాప్రియముల దిగద్రింగి అనుత్తరమగు ఆయా యింద్రియభావనలను భిక్షువు పొందుచున్నాడు.

ఆనందా! కంటితో రూపమునుజూచి ప్రియమును అప్రియమును ప్రియా ప్రియమును బొంది భిక్షువు దుఃఖితుడగుచున్నాడు. విహ్వాలుడగుచున్నాడు. ఈస డించుకొనుచున్నాడు. చెవితో శబ్దమును విని, ముక్కుతో గంధమునుగొని, నాలు కతో రసములనాని కాయముతో స్పర్శమును బూని ప్రియమును అప్రియమును ప్రియాప్రియమును బొంది భిక్షువు దుఃఖితుడగుచున్నాడు. విహ్వాలుడగుచున్నాడు. ఈసడించుకొనుచున్నాడు. ఇది శైక్ష్య ప్రతిపదము ( యెఱుగదగిన మార్గము.)

ఆనందా! భిక్షుడు భావితేంద్రియుడై ఆర్యుడెట్లగుచున్నాడు? ప్రతికూల మును అప్రతికూలముగ భావించును. అప్రతికూలమును ప్రతికూలముగ భావించి విహరించును. మరియు ప్రతికూలమును అప్రతికూలమును వదలి స్మృతిసంప్రజన్య యుక్తుడై ఉపేక్షకుడై విహరించును. ఇట్లు భిక్షువు భావితేంద్రియుడై ముక్తుడగుచు న్నాడు. దయాళువగు సద్గురుడు శ్రద్ధాళువగు శిష్యునకు ఉపదేశించునట్లు ఆనందా! నేనును శైక్ష్యప్రతిపదమును, అనుత్తర యింద్రియభావనను మీకెఱిగించితిని. ఏకాంతమందుండి ధ్యానముచేయుము. చేయికాల్చుకొని చింతించిన లాభములేదు. నాయనా! ప్రమాదమునకు గుఱిగాకుము.''

బుద్ధదేవుని ప్రసంగము విని ఆనందు డానందమొందెను.

## సంబహులసూత్రము

[1] అది భగవంతుడు [2] సుంహదేశమున శిలావతియందు విహరించుచున్న తరుణము. కొంతదూరములో కొందరు భిక్షువులు ప్రమాదరహితులు, ఉద్యోగ శీలురు, సంయమనిష్ఠులునై విహరించుచున్నారు. తాపసులకు నిష్కారణవైరియగు మారుడు మాఱువేషముతో బ్రాహ్మణుడై యెదుటకన్పడి భిక్షువులను జూచి యిట్లనియె. ''సంన్యాసులారా! మీరు మంచి వయస్సులో నున్నారు. కామభోగ ముల తనివిదీఱ ననుభవింపుడు. ప్రస్తుత మెదురుగనుండు సుఖములను గెంటివైచి భవిష్యత్తున నేనాడో యేమో దొరకునని యెగజూతురెందుకు?''

''బ్రాహ్మణా! మేము వర్తమానమును వదలి భవిష్యత్తుకై ప్రాకులాడుట లేదు. భగవంతుడు బుద్ధుడా దేశించిన ధర్మము ప్రత్యక్షఫలప్రదము. కామములు దుఃఖ బహుళములు. ప్రయాససాధ్యములు. పరిణామమున దుర్గతి హేతువులు. పండితు లకు నిత్యానుభవసిద్ధము నిర్వాణము. ఇది మా బుద్ధదేవుని సందేశము.'' ఇట్లు భిక్షువులాడిన నుడులు విని మారుడు మొగము చూపకుండ పలాయనమయ్యెను.

## ఉదాయిసూత్రము

[3] గౌతముబుద్ధుడు సుంహదేశమునందలి సేతకర్ణికమను గ్రామమున విహరిం చునెడ ఆయుష్మంతుడు ఉదాయి చేరవచ్చి భగవంతునితో నిట్లనెను. ''భంతే! ఆశ్చ ర్యము, అబ్బురము. మొదటినుండియు నాకు దేవరవారియందు ప్రేమ గౌర వములు, లజ్జాభయములు మెండుగనుండినవి. గృహస్థుడనై యున్నంతవరకు ధర్మ మువలనను సంఘమువలనను నాకంతటి మేలు చేకూఱ లేదు. పదంపడి యిల్లువదలి ప్రవ్రజించితిని. భగవంతునిచే ధర్మోపదేశమును బొందితిని. రూపమును, రూపోత్పత్తిని, రూపనాశమును - వేదనను, వేదనోత్పత్తిని, వేదనానాశమును - సంజ్ఞను, సంజ్ఞోత్పత్తిని, సంజ్ఞావినాశమును - సంస్కారమును, సంస్కారోత్పత్తిని, సంస్కారవినాశమును - విజ్ఞానమును, విజ్ఞానోత్పత్తిని, విజ్ఞాననాశనమును, - తెలిసికొంటిని. ఏకాంతమున వసించి యీ ఉపాదానస్కంధ పంచకమును అనులోమ విలోమక్రమమున భావించితిని. ఇది దుఃఖము, ఇది దుఃఖ సముదయము, ఇది దుఃఖనిరోధము, ఇది దుఃఖనిరోధగామినీ ప్రతిపదమని యథార్థధర్మము నెఱిగితిని.

---

(1) సం. ని. 4 - 3 - 1. (2) హజారీబాగు సంథాళపరగణా జిల్లాలలోని కొంత బాగము.
(3) సం. ని. 45 - 3 - 10.

'జన్మబంధములూడినవి. బ్రహ్మచర్యము ఫలించినది. చేయదగినది చేసితిని. ఇంక కర్తవ్యమొక్కటియు లేదు' అని నాకు తోచినది.''

''ఉదాయీ! ధన్యుడవు. ధన్యుడవు.''

[1] భగవంతుడు పందొమ్మిదవ వర్షావాసముకూడ చాలియపర్వతముపైననే గడపెను.

## మేఘియసూత్రము

[2] భగవంతుడు బుద్ధుడు చాలికాపర్వతముపై విహారము జేయుచుండెను. ఆ సమయమున మేఘియుడనువాడు బుద్ధదేవునికి సపర్యలు చేయు పరిచారకుడై యుండెను. వాడొకనాడు జంతుగ్రామమునకు భిక్షకరిగి భిక్షను గొని భుజించి వినోదముగ కృమికూలమను నదీతటమునకు బోయెను. ఆ తీరమునందొక మామిడి వనము గన్పట్టినది. దాని చూచి 'ఓహో! ఈ చోటు యోగాభిలాషులగు కులపుత్రులు యోగము నభ్యసించుటకు ననువుగ నున్నది. భగవంతుని వలన ఆజ్ఞ బొంది యిందే వచ్చి నేను సాధనకు కడంగెద'' నని తలపోసెను.

అంతట ఆయుష్మంతుడు మేఘియుడు సుగతునికడ కరుదెంచి నమస్కరించి యిట్లనియె. ''భంతే! నేనీనాడు పూర్వాహ్ణసమయమున జంతుగ్రామములోనికి భిక్షకొఱకై జని భిక్షించి భుజించి అట్లె దిరుగుచు కృమికూలానదీతటమునందుండు ఆమ్రవనములోనికి పోయితిని. ఆ వనము యోగసాధకుల కత్యంత మనుకూలముగ దోచినది. నేను కూడ అచ్చోటికి బోయి యోగసాధనకు యత్నింపవలెనని తలంచితిని. తాము సెలవియ్యవలెను.''

''మేఘియా! నేనొంటరివాడనుగదా? మరియొక భిక్షువు నాకు తోడగునంత వఱకు నీవు నిలువుము. తర్వాత బోవచ్చును.''

''స్వామీ! తాము పంటపండించుకొన్న ప్రభువులు. తమకు దేనియందును యెత్తుగడయు లేదు; తీఱుగడయు లేదు. నాకు ముందు చేయవలసినదియు నున్నది. చేసినది తీర్చుకొనవలసియు నున్నది. మనస్సు ఆతురపడుచున్నది. దయయుంచి సెలవిండు.''

''ఆయుష్మంతా! నీ యిష్టానుసారము జేయుము.''

(1) అ. ని. అ: క. 2 - 4 - 5 (2) ఉదాన 4 - 1

F18

చెప్పినదే తడవుగ మేఘియుడు ఆసనమును ముడిచినాడు. భగవంతునకు ప్రదక్షిణముజేసి తాను మెచ్చిన ఆమ్రవనమునకు పోయి అందొక చెట్టునీడ కూర్చొ నెను. ఆ పగలంతయు అందె విహారము జేయుచు గడిపెను. చిత్తము వశముగ లేదు. కామవితర్కము, ద్వేషవితర్కము, హింసావితర్కములు ఆ కుశలధర్మములు మూడును చిత్తమందు చిందులు ద్రొక్కుచున్నవి. ఏమో అర్థము గాలేదు. భగవం తునివద్దకు పరుగిడినాడు.

అది సాయంకాలము వేళ ధ్యానమునుండి లేచి హుటాహుటి తథాగతుని చెంగటకు మేఘియుడు వచ్చి నమస్కరించి యిట్లనియె.

''దేవా! ఆశ్చర్యము. ఇల్లు వాకిండ్లను వదలి విరక్తుడనై ప్రవ్రజించి వచ్చితిని. నాకీ పాపవితర్కములు మరియు నెందుకు దాపురించవలెను?''

''మేఘియా! భిక్షువగువాడు అపరిపక్వచిత్తమును పరిపక్వమొనర్చుటకై అయిదు ధర్మముల నాశ్రయింపవలెను. 1. కళ్యాణమిత్రుడు కావలెను. మంచి చెలిమి జేసి ఉత్తమసహాయమును బొందవలెను. అపరిపక్వమగు చిత్తమును పరిపక్వమొనర్చుట కిది మొదటి ధర్మము. 2. శీలవంతుడు గావలెను. భిక్షునియమ ములు తనకు శ్రీరామరక్షగాగ, సదాచారసంపన్నుడై యుండును. 3. హితకథాశ్రవ ణుడు కావలెను. హృదయగ్రంధులను విప్పజాలెడి, చిత్తతాపములను చల్లార్పజాలెడి, నిర్వాణమునకు దారిజూపజాలెడి, అల్పేచ్ఛ – సంతుష్టి – ప్రవివేక – అసంసర్గ – వీర్యారంభ – శీల – సమాధి – ప్రజ్ఞా – విముక్తులను గూర్చిన ప్రసంగములను వినవలెను. ఇది మూడవ ధర్మము. 4. ఆరబ్ధవీర్యుడు గావలెను. అకుశలధర్మముల నూడ్చివేయుటకు కుశలధర్మములను చేకూర్చుటకు భిక్షువు ప్రయత్నింపవలెను. ఇది నాల్గవ ధర్మము. 5. భిక్షువు ప్రజ్ఞావంతుడుకావలెను. ఉదయాస్తమయముల నెఱుగజాలెడి దుఃఖక్షయమును బొందింపజాలెడి ప్రజ్ఞతో కూడుకొనవలెను. మేఘియా! ఇది అయిదవ ధర్మము.

ఇట్లు ఈ అయిదింటితో కూడి మరియు నీ నాల్గు ధర్మములను భావనచేయ వలెను. 1. రాగము నశించుటకై విషయములందలి అశుభమును భావించవలెను. 2. వ్యాపాదనాశమునకై మైత్రీభావనను భావించవలెను. 3. వితర్కక్షయముకొఱకై ప్రాణాయామము నాచరింపవలెను. 4. అహంకారము దొలగుటకై సర్వమును క్షణికమనెడి అనిత్యసంజ్ఞను భావింపవలెను. అనిత్యసంజ్ఞికి అనాత్మ సంజ్ఞ లభింప గలదు. అనాత్మసంజ్ఞికి అస్మిత నశించగలదు. వానికి యీ జన్మముననే నిర్వాణము నిశ్చయము.

మేఘియా! వినుము.

''మదిని గలవరపెట్టుచు మఱుగుపడెడి
క్షుద్ర సూక్ష్మ వితర్కాల కోసరిల్లి
భ్రాంతచిత్తుండు చెడిపోవు, ప్రాజ్ఞుడెలమి
సంయమముజేసి నిర్వాణ సౌఖ్యమొందు.''

## ౧౨

## జీవక చరిత్రము (వి. పూ. 452)

[1] ఇరువదియవ వర్షావాసమును భగవంతుడు రాజగృహమునందు గడపెను. [2] ఆ సమయమున వైశాలీనగరము విభవసమృద్ధమై యొప్పియుండెడిది. ఆ పురియందు 7777 మేడలును, 7777 కూటాగారములును, 7777 ఆరామములును, 7777 పుష్కరిణులును ఉండెడివి. అమిత రూపవతియు, నృత్యగీతవాద్యములందు ఆరితేఱినదియు నగు అంబపాలియనెడి వేశ్య ఆ పట్టణమందె నివసించుచుండెను. తన్ను కోరిన పురుషులవద్ద రాత్రి ఒక్కటికి యేబది [3] కార్షాపణములు గొనుచు వారికడ కేగునది. వైశాలిపురమునకు ఆమె మరింతవన్నె. ఒకానొకనాడు రాజగృహ పురమునుండి నైగముడు (ప్రభుత్వపదాధికారి) ఒకడు యేదోపనిమీద వైశాలికి జనుదెంచి అందలి ప్రాభవవిభవముల బరికించి అమ్రపాలి (అంబపాలి) వేశ్యనుగూడ జూచి మరలి తన నగరమునకు వెళ్ళి రాజగు బింబిసారునితో నిట్లనియె. ''మహా రాజా! వైశాలియొక్క సమృద్ధివర్ణనాతీతము. అమ్రపాలియనెడి గణిక ఆ పురికి నొసటిబొట్టు. మనముకూడ నొక సుందరిని యేర్చి ఈ పురమునకు అలంకారప్రాయముగ వేశ్యావృత్తియందు నియమించవలెను. తమ చిత్తము.''

''నైగమా! అందుకుదగిన కన్యను వెదకి, అట్లేచేయుము.''

రాజగృహపురమందు సాలవతీ కుమారి అభిరామ రూపలావణ్యరాశి. నైగముడామెను యేర్చికొని గణికగ నియమించెను. అదియు కొన్నాళ్ళకే నృత్యగీతవాద్యములందు నైపుణ్యము సంపాదించినది. రాత్రికి నూరు కార్షాపణములవంతున గైకొని కోరిన పురుషుల కడ కరుగునది. కొంతకాలమునకు గర్భము ధరించినది. గర్భవతి పురుషుల వలపున కెక్కదు. గర్భము కల్గినదని యేరికైన దెలిసినచో ఉన్న విలువ

(1) అ. ని. అ. క. 2 - 45. (2) మహావగ్గ 8.
(3) ఆనాటి రాగినాణెము, ప్రస్తుతమీనాటి పదిరెండణాల వెలకు సమానము.

బోవును. కనునంతకు కపటనాటకమాడెదను'' అని సాలవతి మదిలో దలంచి ద్వార పాలకుని బిలిచి యిట్లనెను.

''ద్వారపాలా! పురుష డెవ్వడువచ్చి నన్నడిగినను రోగపీడితయైయున్నదని చెప్పుము.'' వాడును అట్లె జెప్పెదనని బదులిచ్చెను.

కొన్నాళ్ళకు మగబిడ్డ జన్మించినాడు. వెంటనే సాలవతి, దాసిని పిలిచి ''ఏమే దాసీ! ఈ శిశువును బుట్టలో పెట్టుకొనిపోయి ఊరి బయట పెంటకసువు దిబ్బలపై పాఱవేసిరమ్ము.'' అని చెప్పెను. అదియు నట్లె జేసినది.

ఆ సమయమునకు అభయుడను రాజకుమారుడు మగధరాజసేవకొఱకు బోవుచు నక్కడికివచ్చి కాకులచే చుట్టబడిన పసికందును జూచి సేవకుల నంపి జీవించియుండుట నెఱింగి అంతఃపురమునకు బంపించెను. దాదులు వానిని పెంచుచు వచ్చిరి. జీవతి (జీవించియున్నాడు.) జీవతియని పలుకుటచే వానిపేరు జీవకుడని ప్రసిద్ధమయ్యెను. అభయకుమారుడు బెంచుటచే కుమారభృత్యు డని పించుకొనెను.

కాలము కొంత గడిచినది. అంతలింతల పెరిగి జీవకుడొకనాడు అభయ కుమారుని సమీపించి ''దేవా! నా తల్లి యెవరు? తండ్రియెవ్వ''రని అడిగెను. అభయుడును వానితో ''జీవకా! నీ తల్లి యెవ్వరో నే నెఱుగను. పోషించినాను. కావున నన్నే తండ్రి యనుకొనుము.'' అని వచించెను.

ఇట్లుండ నొకప్పుడు జీవకు డిట్లుదలంచెను.''రాజనగర పురుషులు ఠీవిగలవారు. విద్యయొ శిల్పమో కళయో లేక వీరిమధ్య జీవించుట యేహ్యము. ఏదైన నొక విద్యను నేర్చికొనివత్తునుగాక'' అని చింతించి యెవ్వనికి జెప్పకుండనే [1] తక్షశిలానగరమునకు దారిదీసెను. ఆనాడు తక్షశిలయందు దిగంతవిఖ్యాతుడగు వైద్యాచార్యు డొకడుండెను. అతని నాశ్రయించి జీవకకుమారభృత్యుడు వైద్యమును నేర్వ మొదలిడెను.[2]

ఏడేండ్లు గడచినది. ఎంతయో జదివినాడు. ఎంతో విద్యను జీర్ణించుకొన్నాడు. ఒకదినమున ఆచార్యుని చేరబోయి ''అయ్యా! నా చదువుకు ముగింపెపుడు?'' అని యడిగెను.

''కుమారా! మంచిది. ఇదిగో యీ గడ్డపారను తీసికొని ఊరి బయటకు బొమ్ము. ఆమడదూరములోగా నగరమునకు నలువైపుల నెక్కడనైనను వైద్యమునకు నక్కఱకురాని మూలికయొ, మొలకయొ, యేవస్తువైనను ఒకదానిని గొనిరమ్ము.''

---

(1) శాహజీకీ ఢేరీ, తక్‌పిలాస్టేషన్ - రావల్‌పిండి జిల్లా. (2) తక్కినవారు ధనము నిచ్చి విద్యనేర్చుకొనిరి. ఈతడు గురువు జెప్పిన పని పాటలు జేసి విద్యను నేర్చెను.

ఆయుర్వేదవిద్యార్థి ఆమడపొడవున నంతయు గాలించి వెదకినాడు. అట్టి దొక్కటియు దొరకలేదు. తిరిగి గురువువద్దకు వచ్చి ''ఆచార్యా! తక్షశిలకు దిక్కు దిక్కునను ఆమడపొడవున వెదకి వచ్చితిని. మందుకు పనికిరాని వస్తు వొక్కటియు నాకు లభింపలేదు.'' అని పలికెను.

''అబ్బాయీ! పరీక్షకు నెగ్గితివి. నీ జీవితపోషణమునకు యీ విద్య చాలును. ఇదిగో కొంచెము దారిబత్తెము గొంపొమ్ము. నీ యిష్టమున్న చోటి కరుగుము.''

ఆచార్యుని అనుజ్ఞ గొని జీవకుడు రాజగృహపురమును చేరుకొనెను. ఒక ప్పుడు మగధరాజగు బింబిసారుడు భగందర రోగపీడితుడై యుండ నతనికి చికిత్స జేసి రోగవిముక్తుని జేసెను. రాజేంద్రుడు ఆనందించి జీవకకౌమారభృత్యుని ఆస్థానవై ద్యునిగ నియమించి తనకును తన రాణివాసమునకును బుద్ధునకును బుద్ధభిక్షుసంఘ మునకును నియతచికిత్సకుడుగ నుండునట్లొర్చెను.

బుద్ధభగవంతుని శరీరారోగ్యము చక్కగ లేదు. కొద్ది సుస్తిగ నున్నారు. ఆనందుని బిలిచి విరేచనమునకు ఔషధమును అడిగి తెమ్మని జీవకునివద్దకు బంపెను. జీవకుడు మూడుచెంచాల (ఉత్పలహస్తము – చిన్నగరిటె) మందును కొనివచ్చి భగవంతుని చేతికిచ్చి యిట్లనెను.

''స్వామీ! ఈ మందులో భగవానులవారు మొదట నొక చెమ్చాపాటిమం దును మూచూడవలెను. దానితో పదిమార్లు విరేచనములు కాగలవు. రెండవ చెమ్ చాను మూర్కొనుటచే మరి పది పర్యాయములు కాగలవు. మూడవ చెమ్చామం దును వాసన చూచుటతోనూ పదిదఫాలు కాగలవు. ఇట్లు యీ ఔషధముద్వారా తేలికగ ముప్పదిమార్లు భేది కాగలదు.''

ఇట్లు ఔ[illegible]ము నొసగి జీవకవైద్యుడు భగవంతునకు స్వాస్థ్యత చేకూఱునంత వఱకు పథ్యాహారములను తానే సమర్పించుచుండెను.

ఒకనాడు జీవకకౌమారభృత్యుడు శిబిదేశీయమగు శాలువలను తీసికొని భగవంతుని చేరవచ్చి నమస్కరించి యిట్లనియె.

''దేవా! తామును భిక్షుసంఘమును యింతవఱకు పాంసుకూలముల (బొంతలనె) ధరించువారు. ఇదిగో! ఈ శాలువల జతను ప్రద్యోతన రాజేంద్రుడు నాకు బహుమతిగ పంపినాడు. తాము వీటిని స్వీకరించండి. గృహస్థులు ధరించునట్టి వస్త్రములను భిక్షుసంఘమున కిచ్చెదను. వాటిని వారు గైకొనునట్లు అనుజ్ఞ నివ్వ

వలె'' నని ప్రార్థించెను. ఆ సందర్భమున భగవంతుడు భిక్షుసంఘము నామంత్రించి యిట్లనెను.

''భిక్షువులారా! గృహపతిచీవరముల నుపయోగించుకొనుటకు అనుజ్ఞ నిచ్చు చున్నాను. మీలో పాంసుకూలికలుగ నుండగోరువా రుండవచ్చును. గృహస్థవస్త్రము ధరింపగోరువారు ధరింపవచ్చును. మరియు వివిధములగు నారబట్టలను నూలుబట్టలను పట్టుబట్టలను ఉన్ని బట్టలను ధరించుటకు మీకు అనుజ్ఞ నిచ్చుచున్నాను.'' అని ఆదేశించి బుద్ధభగవంతుడు తాను శైబ్యశాలువలను స్వీకరించెను.

## ౧౩

## చౌర్యపారాజిక త్రిచీవరవిధానము మైథునపారాజిక (వి. పూ. 451)

★ బుద్ధభగవంతుడు రాజగృహమునందు గృధ్రకూట పర్వతముపై విహరించు సమయము. దృష్టధర్ములగు భిక్షువులు పలువురు ఋషిగిరి ప్రాంతమునందు పర్ణశాలలు వైచికొని వర్షావాసమును నెరవేర్చుచుండెడివారు. ఆయుష్మంతుడు ధన్యకుంభకార పుత్రుడు కూడ నొక తృణకుటీరమును నిర్మించుకొని వారివలెనే వర్షావాసమును చేయుచుండెను. మూడునెలలు వర్షావాసము ముగియుడు భిక్షువులందఱును తమతమ పర్ణశాలలను వదలి పెట్టి గడ్డిని కట్టెలను అడిగిన వారికి పంచిబెట్టి జనపదచారికకై వెళ్ళిపోయిరి. కాని ధన్య కుంభకార పుత్రుడుమాత్ర మట్లు జేయలేదు. ఆ కుటీరమును వదలక అందే స్థిరముగ నివసింపదొడగెను. వాడు భిక్షకొఱకై గ్రామములోనికి వచ్చినపుడు పసులకాపరులును, ఆటవికజాతి జనులును ఆ పర్ణశాలకుండు గడ్డిని కట్టెలను దోచుకొనిపోవుచుండిరి. ఈ సంకటమును అనుభవింప లేక ధన్యకుంభకారపుత్రు డొకనాడు తనలో నిట్లు దలంచెను. ''ఈ దినదిన గండముతో యెన్నాళ్ళు వేగించుట? నా సంప్రదాయవృత్తియగు కుమ్మరి పనిని నే నెఱుగుదునుగదా! నా కుటీరమంతయును మొత్తము మట్టితోనే నిర్మించెదను. అటుపై యే బెడద ఉండదు'' అని యోచించి కుటీరమునంతను మట్టితోనె పెట్టించి అగ్గితో కాల్పించెను. మ్రోగించినచో గాజువలె ఘల్లుమని మ్రోగుచునది చూచువారి కెంతో అభిరామముగ దర్శనీయముగ నున్నది.

సుగతబుద్ధుడు భిక్షువులతో కూడి గృధ్రకూటపర్వతమునుండి క్రిందికి దిగివచ్చుచు అప్రయత్నముగనే చూపుల నాకర్షించుచున్న ఆ యెఱ్ఱటి కుటీరమును

---

★ పారాజిక 2.

జూచి ''భిక్షువులారా! అది యేమ'' ని యడిగెను. వారును విద్యమాన విషయమును విదితము జేసిరి.

''ఛీ! ఛీ! భిక్షువులారా! ఇది శ్రమణుల ఆచారమునకు విరుద్ధము. ఆ తుచ్ఛుడు సర్వమృత్తికామయమగు కుటీరమును పన్నినాడా? ఎంత దయ లేని వాడు? ఆ కుటీరమును యితరప్రాణులాశ్రయించుటకు వీలేలేదే? దానిలో నివసించుట పాపములో కాపురము జేయుట. పొండు, భిక్షువులారా! దాని తునాతునకలు జేసిరండు. ఇకమీదట నిట్టిదానిని నిర్మించువాడు దుష్కృతమును ఆపత్తికి బాధ్యుడు.''

భిక్షువులు కుటీరమును బ్రద్దలు చేయుచున్నారు. అది భగవంతుని యాజ్ఞయగుటచే ధన్యకుంభకారపుత్రుడు చేయునది లేక మిన్నకుండినాడు.

పర్ణశాల పరులపాలౌట జూచి, మృణ్మయకుటీరమును వేసితిని. అది తథాగతుని కోపమునకు గుఱియైనది. ఇకముందు దారియేది? రాజగృహనగర మందు ప్రభుత్వకాష్ఠసంగ్రహశాల( కట్టెలమండె) లో పని జేయు ప్రధాన కర్మచారుడు నే నెఱిగిన వాడు. వాని నడిగి కొన్ని కొయ్యల ప్రోగు జేసికొని తిరిగి కుటీరమును కట్టుకొందునుగాక'' యని ధన్యకుంభకారపుత్రుడు తలపోసి దారుగృహమునకు బోయి గణకునితో నిట్లనియె.

''ఆయుష్మంతా! నే నొక కొట్టము వేసికొనుటకు కొన్ని కట్టెలు కావలెను.''

''స్వామీ! ఇది రాజుగారి సొత్తు. నగరమునకు ఆకస్మికముగ గల్గు ఆపత్సమయములందు వీటిని వాడుకొనుటకు నిర్ణయించినారు. మీ కిచ్చుటకు మిగతగ లేవు. రాజుగారి ఆజ్ఞయైనచో అగత్యము కొనిపోవచ్చును.''

''నాయనా! రాజెన్నడో యిచ్చినాడు.''

''అయ్యా! అటులైన తీసికొని పొమ్ము.''

''శాక్యపుత్రీయులగు శ్రమణులు ధర్మవాదులు సత్యవాదులు. రాజునకు వీరియందు పరమాదరము. ఇవ్వనిదె యిచ్చినాడని చెప్పియుండడ' ని దారుగృహ గణకునకు నమ్మకము.

గణకుడు కొంపొమ్మన్నాడు. బండ్లకు వేయించుకొని ధనియకుంభకార పుత్రుడు వలసినన్ని తీసికొనిపోయి కాష్ఠమయ కుటీరమును నిర్మించెను.

ఒకానొకనాడు మగధరాజ్య మహామంత్రి వర్షకార బ్రాహ్మణుడు ఆయా పనులను పర్యవేక్షించుచు దారుగృహ ( కట్టెల డిపో) మున్న యెడకు వచ్చి ఆ గోదా మునందు కట్టెలు వెలితియైయుండుట జూచి 'నగరరక్షణకై నిల్వయుంచిన ఈ కాష్ఠరాశి యెందు బోయినద'ని గణకుని ప్రశ్నించెను. వాడిట్లనియె.

''దేవా! రాజుగారు ధన్యకుంభకారపుత్రునకు యిప్పించినారు.''

''అయ్యో! అదెట్లు యిప్పించెను. తెలిసికొందునుగాక.''

మహామంత్రిబోయి మగధరాజగు బింబిసారు నిట్లడిగెను.

''మహారాజా! నగరముయొక్క మరమ్మతుకొఱకై నియమించిన కొయ్యలను మీరు ధనియకుంభకారపుత్రున కిచ్చినారా?''

''మంత్రీ! యెవ్వరన్నారు?''

''దేవా! దారుగృహగణకుడు.''

''మంత్రీ! వానిని బంధించుకొని తెమ్మని ఆజ్ఞాపింపుము.''

రాజభటులు గణకుని ( గుమాస్తా) బంధించుకొని తెచ్చుచున్నారు. దారిలో ధనియకుంభకారపుత్రు డదాటుపడి దురవస్థజూచి గణకునితో నిట్లనెను.

''ఆయుష్మంతా! ఎందుకు బద్ధుడవైనావు?''

ప్రభూ! తమ భాగ్యము. ఆనాడు తాము కొనిపోయిన కట్టెలకు వచ్చిన పేచీ.''

''ఓహో! పద. నేనును వచ్చెదను.''

''స్వామీ! నాకు శిక్ష విధింపకముందె తాము పోవలెను.''

ఆయుష్మంతుడు ధనియకుంభకారపుత్రుడు రాజగు బింబిసారుని వద్దకు వెళ్ళి పఱిచిన యొక ఆసనముపై కూర్చొనెను. నరపాలుడును ఆయనకు నమస్కరించి ''స్వామీ! ప్రభుత్వసంబంధమగు కట్టెలను నేను మీకిచ్చి యున్నానా?''

''మహారాజా! అవును.''

''భంతే! మేము బహుకార్యలంపటులము. ఏనాడిచ్చితినో జ్ఞప్తి లేకున్నది. దయయుంచి గుర్తుచెప్పండి.''

''మహారాజా! పట్టాభిషేకసమయమందు మీరొక ప్రమాణము జేసితిరి. శ్రమణబ్రాహ్మణులు తృణకాష్ఠజలములను నిరభ్యంతరముగ సొంతహక్కువలె నుపయోగ పెట్టుకొనవచ్చు'నని. జ్ఞాపకము చేసికొనుడు.

"పూజ్యాడా! స్మృతికివచ్చినది. కాని ఆనాడు నేను అరణ్యములలో యెవ్వని అధికారమునకు లోబడనట్టి తృణకాష్ఠజలముల నుద్దేశించి చెప్పితిని. ఆ మాటను మీరు అయోగ్యముగ వినియోగించి అదిన్నా దానము ( యివ్వనివస్తువును గైకొనుట) నకు ఒడి గట్టితిరి. నా బోటివాని రాజ్యమున శ్రమణబ్రాహ్మణులను దండించుట నునది ఉండదు. పొమ్ము. నీ వేషము నిన్ను రక్షించినది. మఱొకప్పు డిట్లు చేయ కుడు."

ఈ వార్త ప్రజాలోకములో గబగబ ప్రాకినది. "శ్రమణులు సిగ్గువదలినారు. అబద్ధములనిన వీరికి నీరు ద్రాగినట్లు. పైపెచ్చు మేము ధర్మాత్ములమని సత్యవాదుల మని బాసలు చేయుదురు. పురమేలేనపు డంతపురః మెక్కడిది? శ్రమణత్వమె కల్లవైనపుడు బ్రాహ్మణత్వ మేలాంటిది? రాజులనే కన్నుమూయనేర్చిన వీరికి సామాన్యు లేపాటి? అని జనులు తూర్పాఱబోయుచున్నారు. ఈ మాటలను వినివిని చెవులు చీములుగట్ట సహించ లేక కొందరు త్తములగు భిక్షువులు భగవంతునివద్దకు వెళ్ళి విషయమును నివేదించిరి. బుద్ధదేవుడును భిక్షుసంఘ మంతటిని కలియగూర్చి ధనియకుంభకార పుత్రునితో నిట్లనియె.

"ధనియా! నేరమును ఒప్పుకున్నావా?"

"దేవా! చిత్తము."

"కూళా! శ్రమణుల కయోగ్యమగు యీ కుత్సితకార్యమున కేల పాల్పడి తివి? ఇట్టి పనులు అప్రసన్నులను ప్రసన్నులను జేయుటకు గాని ప్రసన్నులను మరింత ప్రసన్నులను జేయుటకుగాని కొఱగావు. మీదుమిక్కిలి దుర్జనులను యింకయు రేపెట్టుటకును, సజ్జనుల మనస్సులను విఱచుటకును మాత్రముపకరించును. భిక్షువులారా! రాజశాసనమందు దొంగతనమును గూర్చిన నిర్ణయమెట్టిది?"

"దేవా! మూడణాల విలువగల వస్తువునైనను యివ్వనిదె గ్రహించినచో వాడు మన రాజ్యములో దొంగయని లెక్కింపబడి రాజదండమున కర్హుడగును.

"భిక్షువులారా! రాజదండమునకు యోగ్యమైన దొంగతనము చేసిన భిక్షువు పారాజికుడగుచున్నాడు. పండుటాకు తిరిగి పచ్చనగుట యెట్లులేదో పారాజికుడు భిక్షుసంఘములో నివసించుట కర్హుడుగాడు. వాడు అదత్తాదాని. శ్రమణభావము వానినుండి జాఱినది."

## త్రిచీవర విధానము

రాజగృహమునందు యిష్టానుసారము విహరించి భగవంతుడు చారిక కొఱకు వైశాలికి పోవుచున్నాడు. దారినడచుచు తన వెంట వచ్చు భిక్షువులలో కొందఱు మోయలేనన్ని వస్త్రములను వీపునను మూపునను తలపైనను మొలపైనను వేసికొని యుండుట జూచెను. ''నీతినియమము లేక అడ్డు - ఆజ్ఞ లేక భిక్షువులు బట్టలను మూటగట్టుటయే నేర్చుకొన్నారు. వీరికి వస్త్రవిషయమున నొక పరిమితిని యేర్పఱ చెదనుగాక'' యని బుద్ధదేవు డాలోచించుకొనుచు క్రమముగ వైశాలీనగరము జేరెను. అందలి గౌతమచైత్యమున విహారము జేయుచుండెను.

అది మంచుకురియు కాలము. మాఘ ఫాల్గుణములకు మధ్యలోని యెనిమిది దినములు. అట్టి అంతరష్టకదినములలో నొకనాటిరాత్రి భగవంతుడు బటాబయలున బరుండెను. చీవర (వస్త్రు) మొక్కటియెయున్నది. ఒక జాము గడచినది. చలి దోచినది. మఱొక్కవస్త్రమును తీసికొని కప్పుకొనెను. చలిబాధ లేదు. మఱి రెండవ జాము దాటినది. (రాత్రి 2 గంటలు) వెండియు చలి దోచినది. వేఱొక చీవరమును గప్పికొనెను. పదంపడి ఆ జాము గడిచినంత తూర్పుమొగమెఱ్ఱనైనది. ఆ సమయమున తిరిగి శీతబాధ గన్పట్టుటచే నాల్గవ వస్త్రమును సుగతుడు కప్పుకొనెను. మఱినా డిట్లు దలంచెను. ''నాధర్మమునందు ప్రవ్రజితులైన సుకుమారులగు కులపుత్రులుకూడ మూడు వస్త్రములచే కాలము గడపవచ్చును. ఈనాడే భిక్షువులకు నియమము జేసెదను.'' అని యూహించి భిక్షువులను బిలిచి ''ఓ భిక్షువులారా! మీ వస్త్రవ్యవహారమును నియమించుచున్నాను. రెండుపొరల దుప్పటి, ఒంటిపొర ఉత్తరీయము, ఒంటిపొరధోవతి - యిట్లు మూడు చీవరముల నుపయోగించుటకు అనుజ్ఞ నిచ్చుచున్నాను.'' అని ఆదేశించెను.

## మైథున పారాజిక 1

★ ''ఈ వజ్జిదేశమునందు కఱవుక్రమ్ముకొన్నది. ఉంఛవృత్తివలన కూడ బ్రతుకుటకు తెరువు లేదు. వైశాలియందు నా బంధువులందఱు ధనకనకవస్తువాహన సంపన్నులు. దానధర్మములకు కొదవ లేదు. నేనచ్చటి కేగుట మంచిది'' అని తలంచి ఆయుష్మంతుడు సుదిన్నుడు శయనాసనములను పాత్రచీవరములను సంబాళించుకొని వైశాలికి జేరుకొనెను. సుదిన్నుని కులమువారు వైశాలియందలి మహావనము

★ పారాజిక 1

నందు ఆయుష్మంతుడు సుదిన్నుడు విహరించుచున్నాడనుట విని అతని భోజనము నకై అఱువది స్థాలిపాకములు గొనివచ్చి యిచ్చి పోయిరి. సుదిన్నుడు వాటిని భిక్షువులపాలు జేసి పూర్వాహ్ణసమయమున పాత్రచీవరములను గొని భిక్షాచరణము నకై కలందగ్రామమునకు బోయి అదాటున తండ్రి యింటికి బోయెను.

ఆ యింటి దాసి పాసి పోయిన ఆహారమును బైటపారవేయుటకై వచ్చినది. ఆయుష్మంతుడు సుదిన్నుడది జూచి "అమ్మా! ఆ పదార్థము మీకు వర్జింపదగినది యైనచో ఈ నా పాత్రలో వేయుము"నెను. ఆ పనికత్తెయు పులిసినతిండిని అతని పాత్రలో పడవైచుచు నాతని తేటిపాఱ జూచి సుదున్నునిగ గుర్తించినది. లోనికరిగి సుదిన్నుని తల్లితో నిట్లనియె. "అమ్మా! సుదిన్నుడు వచ్చినాడు. మీ రెఱుగుదురా!

"ఏమే! నిజము చెప్పుచున్నావా?"

అని గృహములో మాట్లాడుకొనుచున్నారు. అక్కడ సుదిన్ను డొక గోడ చాటున గూర్చుండి ఆచల్ది అన్నమును తినుచున్నాడు. ఏదో పనిమీద బైట వెళ్ళిన అతనితండ్రి అచ్చటికి వచ్చి కొడుకును చూచి "సుదిన్నా! ఈ పాడుకూటి నెందుకు తినెదవు? మనయింటికి పోగూడదా?" యని యడిగెను. "గృహపతీ! పోయియుం టిని. ఈ ఆహారము ఆ యింటిలోనిదే" అని సుదిన్నుడు ప్రత్యుత్తర మిచ్చెను.

"నాయనా! పోదము పద" యని చేయిపట్టుకొని తండ్రి కుమారుని యింటికి గొంపోయి "భోజనము చేయు" మనెను. "ఈనాటి భోజనము ముగిసి నది. ఇక భుజించుట లేద"ని సుదిన్నుడనెను. రేపటి భోజనమున కంగీకరంపుమని తల్లిదండ్రులు ప్రార్థించుటచే సరియె యని ఒప్పికొని యెప్పటివలె మహావనమున కరిగెను.

సుదిన్నుని తల్లి వఱువాతన లేచి యిల్లంతయు నలికి నడియింటియందు బంగారు కాసుల నొకరాశి బోయించినది. బంగారము నొకగుట్ట వేయించినది. అవి ఒక్కొక్కటి మనిషి యెత్తు పరిమాణమున్నవి. ఆ రాసులను చాపలతో కప్పించి వాటినడుమ ఆసనమును బఱపించి చుట్టును తెఱగట్టించి కోడలిని బిలిచి యిట్లనియె.

"అమ్మాయీ! సుదిన్నుని యిష్టమునకు సూటియైన అలంకారమును జేసికొనుము."

అచ్చట ఆయుష్మంతుడు సుదిన్నుడు పూర్వాహ్ణసమయమగుడు పాత్రచీవర ములను ధరించి తండ్రియింటికి జనుదెంచెను. తండ్రియు నతని పఱచియుంచిన ఆసనముపై గూర్చుండబెట్టి ధనరాశులను జూపించి యిట్లనియె.

''నాయనా! ఈ ద్రవ్యమంతయు మీ తల్లిది. ఇక తండ్రి స్వత్వము వేఱుగను న్నది. ఇంటికాపరి సుఖములను బొందవచ్చును. సుకృతములను ఆర్జింపవచ్చును. కుమారా! నీవును గృహస్థుడవు కారాదా?''

''తండ్రీ! నే నొల్లను. కోరికోరి బ్రహ్మచర్యపాలనమునకు కడంగినాను. ఇంకను మీరు నా మాటను వినగల్గుచో యీ ధనమునంతను గంగా ప్రవాహమున వదలుడు. అనర్థములన్నియు తొలగగలవు.''

తమ మాటలకు మెత్తబడని కుమారుని జూచి తల్లిదండ్రులు కోడలిని ప్రేరేపించిరి. ఆమెయు సుదిన్నుని పాదములపైబడి, ''ఆర్యపుత్రా! నీ యీ తపస్సుకు దొరకే ఆ అప్సరస లేలాంటివారు?''

''చెల్లెలా! నా తపస్సు అప్సరసల నపేక్షించికాదు.''

'చెల్లెలా!' అను పలుకు ములుకై తాకుటచే నామె సొమ్మసిల్లినది. సుదిన్నుడు తండ్రిని జూచి, ''గృహపతీ! సిలుగు లెందుకు బెట్టెదవు. కలిగినచో భోజనముపెట్టి పంపుము''నెను. మాత ఉత్తమ భోజ్యములను వడ్డింప సుదిన్నుడు తనివిదీఱ భుజించి చేతులు కడుగుకొని కూర్చొనెను. సమీపించి తల్లి యిట్లనియె.

''బిడ్డా! మనది సంపన్నమైన కులము. గృహస్థుడు పుణ్యములు జేసి సుగతిని బొందవచ్చును. పైపెచ్చు భోగములను అనుభవింపవచ్చును. నాయనా! ఒడంబడుము.''

''అమ్మా! ఆ మాట నాతో చెప్పకుము.''

''అబ్బాయీ! వంశము నిర్వంశమై పోవలసినదేనా? హక్కుదారుడు లేని ఆస్తిని రాజులు అపహరింతురు. బీజకుని (వీర్యమువలన కలిగిన పుత్రుడు) ప్రసాదింపుము. ఊఱట జెందుదుము.''

''అమ్మా! అట్లే కానిమ్ము.''

''నాయనా! నీవు యెచ్చట ఉందువు?''

''అమ్మా! మహావనములోనే గదా'' అని పలికి సుదిన్నుడు ఆసనమందుండి లేచిపోయెను.

కోడలు పుష్పవతి యైనంతనే ఆమెను వెంటనిడుకొని సుదిన్నుని తల్లి కుమారుడు విహరించు మహావనమునకు బోయెను. ముందాడిన మాటను స్మరించి ఆయుష్మంతుడు సుదిన్నుడు భార్యను రెట్టపట్టుకొని యేకాంతమునకు గొంపోయి సంభోగించెను. కాంత గర్భవతియైనది.

కాలము గడచినంత సుదిన్నుని పత్ని యొక కుమారుని ప్రసవించినది. బంధుమిత్రులు వానికి బీజకుడని పేరిడిరి.

సుదిన్నుని యీ వర్తమానము భిక్షువుల మూలమున భగవంతుని చెవికి బ్రాకినది. అమ్మహాత్ముడు భిక్షుసంఘమును సమావేశముజేసి వారితో నిట్లనియె.

''భిక్షువులారా! తుచ్ఛమగు మైథునకర్మమునకు ఒడిగట్టిన భిక్షువు పారాజిక మను దోషమునకు పాత్రుడగుచున్నాడు. వాడు చిరశాశ్వతముగ భిక్షుసంఘమునకు వెలియైనవాడు. మఱియు వినుడు.

1. సంఘసౌష్ఠవము కొఱకు 2. సంఘసానుకూలము కొఱకు 3. స్వేచ్ఛాచారుల నిగ్రహించుటకొఱకు 4. మంచివారు హాయిగ విహరించుటకొఱకు 5. ఈ జన్మమునందలి చిత్తదోషములు తొలగుటకొఱకు 6. జన్మాంతరమునందలి వాసనలు నశించుటకొఱకు 7. అప్రసన్నుల చిత్తములు ప్రసన్నములగుటకొఱకు 8. ప్రసన్నులచిత్తములు మరియు ప్రసన్నములగుటకొఱకు 9. ధర్మరాజ్యము లోకమున నెలకొనుటకొఱకు 10 సదాచారము నాల్గుమూలల వ్యాపించుటకొఱకు ఓ భిక్షువులారా! నే నీ నియమ శాసనములను జేయుచున్నాను.''

## ౧౪

## మనుష్యహత్యా, ఉత్తరమనుష్య ధర్మపారాజికలు (వి. పూ. 451)

★ బుద్ధభగవంతుడు వైశాలిలో మహావన కూటాగారశాలయందు విహరించెడి సమయము. సాంసారిక పదార్థములయొక్క, దేహేంద్రియ విషయ సమూహము యొక్క నైచ్యమును హైన్యమును అశుభమును, అమంగళమును గూర్చి పదింబది భగవానుడు భిక్షువుల కుపదేశించెడివాడు. కొన్నాళ్ళు గడచినది. ఒకనాడు భిక్షువులను సంబోధించి ''భిక్షువులారా! నే నొక పక్షముదినము లేకాంతధ్యానమందుండ సంకల్పించితిని. ఆహారమును దెచ్చియిచ్చువాడు తప్ప మఱెవ్వడును నా పొంతకు రారాదు.'' అని వాక్రుచ్చెను. వారును వల్లెయని అట్లే యనువర్తించిరి.

సర్వమశుభము, సర్వమమంగళమని సుగతుడు బోధించుచు వచ్చుటబట్టి దాని ప్రభావము భిక్షువులకు గట్టిచాయ బట్టినది. శుచివంతుడగు తరుణపురుషుడు

★ పారాజికా 3

మానవ శవమును లేదా చచ్చినకుక్కను చూచి యేవగించుకొనునట్లు భిక్షువులు తమ తమ శరీరములను అసహ్యించుకొనువారు చీదరించుకొనువారు. దేహమును హింసలు పెట్టెడివారు. ఒకరినొకరు చంపుకొనెడివారుగూడా.

ఆ పురమున మృగలండికుడను వాడొకడు గలడు. వాడు దుండగీడు. మఱియు దోపిడికాడు. తలలు ద్రుంచుటయనిన వానికి చిగుళ్ళుగిల్లినట్లు. భిక్షువులు వానికడకరిగి యిట్లనిరి. ''ఆయుష్మంతా! ఈ శరీరమునుండి మాకు విముక్తి గల్గింపుము. ఈ పాత్రచీవరములు నీకే లభింపగలవు.''

ఆ కొద్దిపాటి లాభమునకు లోభించి వాడును పదునైన తన కత్తితో దినమునకు ఒక్కని మొదలుకొని అఱువదిమందివఱకు భిక్షువులను దొరికినంతకు ఓపిక ఉన్నంతకు తెగటార్చుచు వచ్చెను.

పదునైదుదినములు గడచినంత బుద్ధదేవు డేకాంతమునందుండి లేచి అట్టె ఆనందుని తేఱిచూచి ''ఆనందా! భిక్షుసంఘము పలుచబడిన దేమి?'' యని అడిగెను. ఆనందుడును ఇతఃపూర్వము భగవంతుడుపదేశించిన అశుభభావనా బోధాప్రభావము యెంతెంతవఱకు బోయినదియు, మృగలండికశ్రమణకర్తకుడు దినమునకు సగటున అఱువైమంది భిక్షువులను చెండాడుటయు ఆద్యోపాంతము కథయంతయు సవిస్తరముగ జెప్పెను.

భిక్షుహృదయములం దుప్పతిల్లిన విపరీతపరిపాకమునకు తథాగతు డెంతయు నలందురి ''ఆనందా! వైశాలియందు విహరించెడి భిక్షువులనందఱిని ఉపస్థాన (సభా) శాలయందు యేకత్రసమావేశము జేయింపుమ''ని ఆజ్ఞాపించెను.

ఉపస్థానశాలయందు భిక్షుసంఘము ప్రోవైనది. భగవంతుడు పఱిచిన ఆసనముపై ఆసీనుడైయున్నాడు. సభయంతయు నిశ్శబ్దముగ నున్నది.

''భిక్షువులారా!''

''భదంతా!''

''వినుడు. భావనచేయబడిన, వృద్ధిబొందింపబడిన ప్రాణాయామ సమాధి గ్రీష్మఋతువునందలి దుమ్మును మహామేఘమువలె అకుశలధర్మములన్నింటిని

రూపుమాపుచున్నవి. సాధకుడగువాడు శ్వాసప్రశ్వాసలను గొనునపుడు వదలునపుడు సావధాననిరీక్షకుడై ఏకాంతమున గూర్చుండి ప్రజ్ఞ నెదుట బెట్టుకొని [1] విరాగానుపశ్యియై నిరోధానుపశ్యియై పరిత్యాగానుపశ్యియై ప్రతి నిస్సర్గానుపశ్యియై అభ్యసించుచున్నాడు. అట్లు భావన చేయబడిన ప్రాణాయామసమాధి అకుశలధర్మము లన్నింటిని తెగటార్చుచున్నవి.

''భిక్షువులారా! ఒకరి నొకరు జంపుకొని భిక్షువులంతయు నాశమైనారా?''

''దేవా! అవును.''

ఛీ ఛీ! ఎంతపని జేసితిరి. భిక్షువులారా! వినుడు. ఈ పాపమయమగు బ్రదుకు కంటె, ఈ తుచ్ఛ శరీర సహవాసముకంటె చచ్చుట మంచిదని యితరులను ప్రేరేపించువాడు, చంపువాడు, ఆయుధప్రయోగము జేయువాడు పారాజికుడని చెప్పబడును. భిక్షుసంఘమునందు కలసి వసించుటకు వానికి హక్కు లేదు.'' అని భగవంతుడు నియమము జేసెను.

## ఉత్తరమనుష్యధర్మము – 4వ పారాజిక

[2] భగవంతుడు దశబలుడు వైశాలియందు మహావనకూటాగారశాలలో విహారము చేయుచున్నాడు. దృష్టధర్ములగు భిక్షువులనేకులు వర్షావాసమునకై వగ్గుముదానదీతీరము నకు వెళ్ళిరి. ఆ సమయమున వజ్జిదేశమున దుర్భిక్షము వ్యాపించినది. అచ్చటి భిక్షువు లందఱును గలసి వర్షావాసమును సుఖమయముగ గడపు టేలాగని యోచన జేసిరి. గృహస్థుల నాశ్రయించి వారి భూమిపుత్రలను తనిఖీజేయుచు హాయిగ వారిచ్చు భోజనమున వర్షావాసకాలమును వెళ్ళబుచ్చవచ్చు నని కొందరు పలికిరి. ఛీ ఛీ! బ్రతికి బ్రతికి గృహస్థుల పడిపంచలు కాచుటయా? ఆతొత్తుకూడు తినవలసిన దౌర్భాగ్యమేలవచ్చినదని మఱికొంద ఱాడిరి. ఇవి యన్నియు కొఱమాలిన ప్రసంగములు. మన మొక తతంగము పన్నవలెను. ఒక భిక్షువు మఱియొక భిక్షువును గూర్చి అతడు ప్రథమ సమాధిని పొందినాడు. ఇతడు ద్వితీయ సమాధిని సంపాదించినాడు. ఆ ఫలానావాడు తృతీయ సమాధి నెక్కినాడు. ఈ ఫలానావాడు నాల్గవ సమాధి నధిష్ఠించినాడు. స్రోతాపన్నుడు వీడు. సకృదాగామి వాడు. ఆయన అనాగామి. ఈయన అర్హతుడు. ఆ భిక్షువు త్రైవిద్యుడు. ఈ భిక్షువు షడభిజ్ఞుడని

---

(1) మహాస్మృతి ప్రస్థానసూత్రము జూచునది. (2) పారాజికా 4.

గృహస్థుల యెదుట ఊరక కొండాడుచుండ వలెను. ఇట్లు అన్యోన్యము ఉత్తరమనుష్య ధర్మసంపన్నులుగ, దివ్యశక్తియుతులనుగా పొగడుచు వచ్చి ప్రజలను మనము వలలో వేసికొనవచ్చును. పదంపడి ఆడించినట్లు వారు ఆడగలరు.

సభలో ఆ చట్టము నెగ్గినది. ప్రజ లిట్లు తలపోయుచున్నారు. ''వహవ్వా! మన భాగ్యము పండినది. మహానుభావులగు భిక్షువులు మన పుణ్యముకొలది వర్షావాసమునకు మనచెంతకె వచ్చినారు. ఇంతకు ముం దిట్టి వారిచ్చటికి వచ్చియుండ లేదు.'' అని తలంచి ప్రజానీకము అపూర్వసత్కారముల నెఱపి భిక్షుమండలిని వివిధ భోజనములతో సంతర్పితుల జేయుచుండిరి. భిక్షువుల పాచిక లెస్సగ బాఱినది. పాపము ప్రజలట్టి భోజనమును తామెన్నడు దినలేదు. తలిదండ్రులకు పెట్టలేదు. భార్యాపుత్రుల కిడ లేదు. విందులపై విందులు అల్లెముదినిన అల్లుండ్రవలె భిక్షువులు వర్షావాసము ముగియుసరికి సరిక్రొత్తవన్నెలతో హృష్టపుష్టాంగములతో మినమిన మెఱసెడి మేనికాంతులతో కనులపండువుగ నున్నారు. వర్షావాసము మూడు నెలలు ముగిసినంతనె యెందెందుండిన భిక్షువులుగూడ భగవంతుని సన్నిధికి చేరవలసినది తప్పనిసరి ఆచారము. ఆ పద్ధతి ప్రకారము వగ్గుముదానదీతీరవాసులగు యీ భిక్షువులు తమతమ శయనాసనముల సర్దుకొని భగవానుని సన్నిధానమునకు వైశాలీ పట్టణమునకు అరుదెంచిరి. వైశాలిలోని మహావన కూటాగారశాల యంతయు భిక్షుసమూహములతో కిటకిటలాడుచున్నది. సంబుద్ధినాథుడు బుద్ధదేవుడు ఉన్నతాసనమున విరాజిల్లుచున్నాడు. ఆ మహానుభావుని చూపులు సభనంతటను తిరుగాడి వచ్చినవి. వర్షావాసము ముగించి నానాదిశలనుండి చనుదెంచిన భిక్షువులందఱును బక్కచిక్కిన తనువులతో, అస్థిపంజర మాత్రముగ నున్నారు. కాని వజ్జిదేశము నందుండి, వగ్గుముదాతీరమునందుండి వచ్చిన భిక్షువులు విలక్షణముగ నున్నారు. భిక్షుసంఘము నంతటిని ఉద్దేశించి భగవంతు డిట్లనియె. ''భిక్షువులారా! శరీర యాత్ర సానుకూలమై నడచినదా? కలతలు లేక పరస్పరమైత్రితో వర్షావాసమును గడపితిరి గదా? భిక్షకొఱకై ప్రయాసకులోనుగా లేదుగదా!'' అని యడిగిన దశ బలునకు వారును తగిన సమాధానమిచ్చిరి. వెంటనె సుగతుడు వగ్గుముదాతీరము నుండి వచ్చిన భిక్షువులవైపు మళ్ళి ''ఓ భిక్షువులారా! మీరు ఉత్తరమనుష్యధర్మమును ప్రకటించుయున్నారని నేను కర్ణాకర్ణిగ విన్నాను. నిజమేనో? అని ప్రశ్నించెను.

''దేవా! నిశ్చయమే.''

''ఛీ! వ్యర్థులారా! శ్రమణులు చేయరాని పని చేసితిరి. పొట్టకూటికై గృహస్థుల యెదుట పరస్పరము దివ్యశక్తి ప్రశంసను – ఉత్తరమనుష్యధర్మమునుగూర్చి ప్రేలుటకు నోరెట్లాడినది. ఆ తిండి తినుటకంటె కడుపుజీల్చుకొని చచ్చుటమేలు. దీనిచే మరణమెగాని నరకము లేదుగదా.'' అని పలికి భిక్షుసంఘము నంతటిని ఉద్దేశించి తథాగతుడిట్లనియె.

''ఓ భిక్షువులారా! లోకములో అయిదురకములు గజదొంగలున్నారు. 1. అన్నవస్త్రములకొఱకు శయనాసనముల కొఱకు ఆదరసత్కారముల కొఱకు ఊర ఊర పల్లెపల్లె గృహస్థుల యిండ్ల వెంబడి తిరుగు భిక్షువు మొదటివాడు. 2. భగవంతుడు తథాగతుడు చెప్పిన ధర్మవినయమును స్వతంత్రముగ తానే చెప్పితినని లోకులవంచించు వాడు రెండవదొంగ. 3. పవిత్రులగు భిక్షువులపై నూరూరక కళంకముల నాపాదించువాడు మూడవదొంగ. 4. సంఘమునకు జెందిన ఆరామవస్తువులను, విహారవస్తువులను దుర్వినియోగము జేయుచు పామరగృస్థులను సంతోషపెట్టువాడు నాల్గవదొంగ. 5. ఈ నల్గురిని మించి, గడిదేఱిన గజదొంగ మఱొక్కడు గలడు. లేని మహత్త్వమును కల్పించుకొని లేని ప్రభావమును ఆరోపించుకొని బూటకములాడుచు, లోకమునకు కన్నుమూసి, ప్రజల నోరుగొట్టి రాష్ట్రపిండమును తినువాడు సర్వోపరి మహాచోరుడు.

ఉన్నదొక్కటి తా జెప్పుకొన్న దొకటి
వాడె జూదరి చోరుండు వాడె సుమ్ము
కావిబట్టలు గట్టిన కారణమున
కుమతి నరకంబు దప్పించుకొనగలేడు

భిక్షువులారా! ఇదియె బుద్ధశాసనమును వినుడు. భిక్షువెవ్వడైనను తనలో లేని ఉత్తరమనుష్యధర్మమును, అలమార్యజ్ఞానదర్శనమును కలదని చెప్పి, మఱియు వేరొకసమయమున నిష్కర్షగ అడిగినచో పాపేచ్ఛువైగాని విశుద్ధాపేక్షియైగాని, అయ్యో! నేను తెలియకనె తెలిసితినంటిని. చూడకయె చూచితినంటిని. కల్లలాడితినని చెప్పుచున్నాడో అట్టివాడు పారాజికుడు. భిక్షుసంఘముతో పొత్తున నుండుటకు వాడు అనర్హుడు.'' అని భగవంతుడు ఆదేశించెను.

---

ఉత్తరమనుష్యధర్మము = 1. ధ్యానము 2. విమోక్షము 3. సమాధి 4. సమాపత్తి 5. జ్ఞానదర్శనము 6. మార్గభావన 7. ఫలసాక్షాత్కారము 8. క్లేశప్రహాణము 9. వినీవరణత 10. చిత్తమునకు ఏకాంతమునందభిరతి.

అలమార్యజ్ఞానము = త్రైవిద్య = మూడువిద్యలు.

దర్శనము = జ్ఞానమే దర్శనము, దర్శనమే జ్ఞానము.

విశుద్ధాపేక్షి = గృహస్థుడు కాగోరిగాని, ఉపాసకుడు కాగోరిగాని, ఆరామసేవకుడు కాగోరిగాని, శ్రామణేరుడు కాగోరిగాని యుండువాడు.

ధ్యానము = ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ ధ్యానములు.

విమోక్షము = శూన్యతావిమోక్షము, అనిమిత్తవిమోక్షము, అప్రణిహితవిమోక్షము.

సమాధి = శూన్యతా సమాధి, అనిమిత్తసమాధి, అప్రణిహితసమాధి.

సమాపత్తి = శూన్యతాసమాపత్తి, అనిమిత్తసమాపత్తి, అప్రణిహితసమాపత్తి.

మార్గభావన = నాలుగు స్మృతి ప్రస్థానసూత్రములు, నాలుగు సమ్యక్ ప్రధానములు, నాలుగు ఋద్ధిపాదములు, అయిదు యింద్రియములు, అయిదు బలములు, ఏడుబోధ్యంగములు, ఆర్యాష్టాంగికమార్గము.

ఫలసాక్షాత్కారము = స్రోతాపత్తి ఫలమును బొందుట, సకృదాగామిఫలమును బొందుట, అనాగామిఫలమును బొందుట, అర్హత్ఫలమును బొందుట.

క్లేశప్రహాణము = రాగ ద్వేష మోహముల వినాశము.

వినీవరణత = రాగ ద్వేష మోహములనుండి విముక్తి.



ఆయుస్సు 55 – 75 వి. పూ. 451 – 431

# శ్రీ బుద్ధచర్య

## చతుర్థ ఖండము

### విశాఖాచరితము విశాఖకు యెనిమిది వరములు
### (వి. పూ. 451)

భగవంతుడు బుద్ధుడు శ్రావస్తీ పురమున అనాథపిండకుని జేతవనారామములో విహారము చేయుచుండెను. ★ ఆ సమయమున నొకనాడు మృగారమాత

★ అ. ని. అ. క. 1, 7 – 2

శ్రావస్తీ నగరమున మృగారశ్రేష్ఠి సంపన్నవైశ్యుడు. అతనికి యెదిగిన కొడుకు పూర్ణవర్ధనుడు. వివాహయోగ్య వయఃప్రాప్తుడైనాడు. కుమారునకు అనుకూల సంబంధము నన్వేషించుటకై మృగారశ్రేష్ఠి కొందఱు పురుషుల నందందుపంపించెను. వారును ఆయా యెడల వెదకుచు

విశాఖ సుగత దేవుని వద్దకు వచ్చి ఆయన బోధించు ధార్మిక కథలచే సంతుష్టిని బొంది కొంతసేపటి కిట్లనియె.

"దేవా! భిక్షుసంఘ సహితముగ నెల్లి నా భోజనమును గ్రహించుమనది."

తథాగతుడు మౌనముతో నంగీకరించెను. ఆమెయు అభివాదన మొనర్చి తన యింటి కరిగినది. రాత్రి గడిచినది. మహామేఘము ఆవరించి వర్షము కురియుచున్నది. భగవంతుడు భిక్షువులతో "భిక్షువులారా! ఈ మేఘ మిప్పుడీ జేతవనమునందు

---

సాకేతపురమును జొచ్చిరి. వచ్చి నగరి వాకిట వారు నిలచియున్నారు. విశాఖ తన యీడు వారగు యేనూర్వురు కన్యలతో యేదో ఒక దేవవ్రతోత్సవమును పాటించి పురబాహ్యమునకు వచ్చినది. అంతలో వాన వెంటపడినది. తోడికన్య లందఱును తడియుదుమను జడుపుతో గబగబ పరుగిడి వచ్చి నగరిముఖశాలయందు జొచ్చిరి. కన్యాన్వేషణతత్పరులై వచ్చి అందె నిలిచియున్న పురుషులకు వారియం దొక్కరును నచ్చలేదు. వెనుక వెనుక తడియుదునని జడియక మందమంద గమనమున జనుదెంచు విశాఖాసుందరి నవలోకించి వారిట్లు దలంచిరి. "ఈ కన్యక సురూపవతి. కాని స్వభావ మెట్లున్నదో పల్కరించి చూతము గాక యని సమీపించి యిట్లనిరి.

"అమ్మా! ముసలిదాన వైనావా?"

"పెద్దలారా! ఎందు కట్లనుచున్నారు?"

"అమ్మాయీ! నీతోడి కుమారికలు తడియక ముందె వచ్చి లోపల ప్రవేశించిరి. నీవో వస్త్రము తడియునని కూడ తలంపక ముసలిదానివలె వచ్చెద వేల? ఏనుగో, గుఱ్ఱమో వెంటబడినప్పుడు కూడ యిట్లే నడచెదవా?"

"అయ్యలారా! మా గృహములలో వస్త్రములకు కఱవు లేదు. ఈడువచ్చిన ఆడది విక్రయపాత్ర వంటిది. ఏమాత్రము సొట్టబోయినను యెవ్వరు చేయిపట్టుదురు? కాలో చేయియో విఱిగినచో గతి యేమి? అందుకై మెల్లగ వచ్చితిని."

"తీర్చిన రూపము, తియ్యని పలుకు, తిన్నని శీలము – వహవ్వా; దీనికి సరిసాటి కాంత లెందున్నారు?" అని యా పెద్దమనుష్యులు లోలోన పొగడుకొని ఆమె తండ్రియగు ధనంజయ శ్రేష్ఠిగారి యింటికి బోయిరి.

"అయ్యలారా! తా మే వూరివారు?"

"శ్రేష్ఠీ! మేము శ్రావస్తీవాసులము. ప్రసిద్ధుడగు మృగారశ్రేష్ఠి పంపగ వచ్చితిమి. నీ యింట వయసు వచ్చిన కన్యక యున్నదట. ఆమెను కోడలుగ గ్రహింపవలెనని కోరి మమ్ము పంపినాడు."

"పూజ్యులారా! ఆయన విశుద్ధకులశీలముల మాతో సమానుడు. కావున నేను అంగీకరించితినని తెలుపుడు."

కురియుచున్నట్లే నాలుగు మహాద్వీపములందును కురియుచున్నది. ఇది చివరి చాతుర్ద్వీపిక మహామేఘము. మీరు వర్షస్నానము చేయుడు'' ని చెప్పెను.

''చిత్తము'' ని వారును వలువలను వీడ్చి రిత్తమేనులతో వానయందు స్నానము జేయుచుండిరి. అక్కడ విశాఖమృగారమాత దాసిని పిలిచి భోజనసమయమైనది. భగవంతుని భిక్షుసంఘమును ఆమంత్రించిరమ్మని పంపినది. అదియు ఆరామము లోనికి బోయి అందు భిక్షువుల నెవ్వరిని గానక, మరలివచ్చి విశాఖతో నిట్లనియె.

---

వారా వార్తను గొని చని శ్రావస్తియందు మృగారశ్రేష్ఠికెఱుగ జేసిరి. అతండును కుమారుని పెండ్లికి వలయు సన్నాహముల నన్నిటి నాయత్తపఱచి తనయందనురక్తుడై యున్న కోసలనరపతి చతురంగదళముతో తోడై నడవ బంధుబలగములు దందడించి రాగా సాకేతనగరమును ప్రవేశించిరి. ధనంజయశ్రేష్ఠియు వారి వారికి దగినట్లు ఆయాసత్కారములు జేయుచు నందఱిని ప్రసన్నుల జేసెను.

''ఇంతటి బాహుళ్యమును భరించుట కష్టము. విశాఖను పంపించుము. పోయెదము'' ని రాజగు ప్రసేనజిత్తుతో గూడి మృగారశ్రేష్ఠి వియ్యంకునకు జెప్పి పంపెను. ''వర్షఋతువు వచ్చినది. ఈ నాలుగునెలలు ప్రయాణము చేయుటకు వీలులేదు. మీకు వలయు సత్కారములను కొఱత లేకుండ నడపుదుము. ఆ భారము మాది. సమయమెఱిగి మేమే పంపించగలవారము.'' అని ధనంజయుని నుండి ప్రత్యుత్తరము వచ్చినది.

వానల కాలము, వంటలకు యెండుకట్టెలు లేవు. గోశాలలను పెఱికించినాడు. అశ్వశాలల నూడదీయించినాడు. గుడ్డల గోదాముల నుండి వస్త్రములను బంపి నూనెలో నాన్పించి వంటలు వండించినాడు. అట్లట్లె నాలుగు నెలలును గడచినవి. ధనంజయశ్రేష్ఠి రేపటిదినము విశాఖను పతిగృహమునకు పంపవలసియున్నదని భావించి ఆ ముద్దియకు బుద్ధులు జెప్పువాడై వద్ద గూర్చొని యిట్లనియె. ''అమ్మా! భర్తృగృహమునకు పోవుచున్నావు. అచ్చట వసించునపుడు ఈ పది విషయ ములను గమనించి అనువర్తించు చుండవలెను. 1. లోపలి అగ్నిని బైటికి పోనీరాదు. 2. బైటి నిప్పును లోనికి తేరాదు. 3. ఇచ్చు వారికి యివ్వవలెను. 4. ఇవ్వని వారికి ఈరాదు. 5. ఇచ్చువారికి యివ్వనివారికి కూడ ఇవ్వవలెను. 6. సుఖముగ కూర్చుండవలెను. 7. సుఖముగ భుజింపవలెను. 8. సుఖముగ పరుండవలెను. 9. అగ్నిపరిచర్య చేయవలెను. 10. లోపలి దేవతలకు నమస్కరించ వలెను. అమ్మా! ఈ పది ఉపదేశములను పాలింపుము'' ని తనయకు ధనంజయుడు చెప్పుచుండ యింటి లోపల పరుండి యుండిన మృగారశ్రేష్ఠి తానును వినెను.

చుట్టపక్కములు బంధుబలగములు రాజును రాజసేనయు శ్రావస్తికి తరలుచున్నారు. ధనంజయశ్రేష్ఠి ఆసమూహము నంతటిని సభజేర్పించి యెనిమిదికుటుంబముల వారిని పంచాయితి సంఘముగ నేర్పఱచి వారితో నిట్లనియె. ''అయ్యలారా! తాను మెట్టినచోట.... భర్తృగృహమందు నా కుమార్తె యేదైన తప్పిదమును జేసినచో మీరు విచారించి పరిష్కరించవలె'' నని నిర్ణయించి

''అమ్మా! ఆరామమందు భిక్షువులు యెవ్వరు లేరు. ఆజీవకులు ( దిగంబర జైనసాధులు) మాత్రము వర్షస్నానము చేయుచుండుట చూచితిని.''

ఆ మాటలు విని విశాఖ యిట్లు దలంచెను. ''భిక్షువులు బహుశా వస్త్రములు విడిచి దిసమొలతో స్నానమాడుచున్నారు కాబోలు. ఈ మూర్ఖురాలు వారిని ఆజీవ కులుగ దలంచినది. దాసీ! ఈ తడవ పోయిరమ్ము.''

---

నవకోటిమూల్యమగు మహాలతాభరణమును కన్య కలంకరించి ఏనూర్వురు దాసీజనము నిచ్చి మఱియు నాయాపారితోషికముల ననంతముగ నొసంగి అందఱికిని వీడ్కోలొసగెను.

శ్రావస్తీనగర ద్వారము సమీపించినది. ''మేనాలో యెక్కిపోయితినో నగరవాసులు నన్ను చూడలేరు. మహాలతాప్రసాధనము యొక్క గొప్పతనము వారికి యెఱుక పడదు. కావున పౌరులెల్లరు చూడగల్గునట్లు పురవీథులయందు రథము నెక్కి పోయవుటయ లెస్స'' యని తలంచి విశాఖాదేవి నాగరక జనులెల్లరు తలలూపుచుండ నతుల శోభాసమృద్ధితో రథారూఢయై పురిని ప్రవేశించెను. ఆ రాత్రి మృగారశ్రేష్ఠి యొక్క అశ్వశాలలో శుభలక్షణయుతమగు గుఱ్ఱమొకటి ప్రసవవేదనను పొందుచుండెను. ఆ వార్తను విని దాసీలచే దివిటీలు పట్టించుకొని విశాఖ అచ్చోటి కరిగి ఆ అశ్వమును వేడినీట స్నానము జేయించి నూనె పూయించి తిరిగి తన గృహమునకు వచ్చివేసెను.

విడువక వారము దినములు విందులు వినోదములందు కాలము బుచ్చి మృగారశ్రేష్ఠి యేడవదినము తన గురువులగు దిగంబర జైన సాధువులను యింటినిండ సభచేసి ''అమ్మా! అర్హతులకు నమస్కరించి పొమ్మ''ని విశాఖకు చెప్పి పుత్తెంచెను. అర్హతులనుమాట వినినంతనె తాను స్వయముగ స్రోతాపత్తి ఫలమును బొందిన ఆర్యశ్రావిక గావున కౌతుక మెదనిండ చరచర జనుదెంచి చూచి ఛీ! ఛీ! వీరికి సిగ్గులేదు సరిగదా మా మామగారికైనను ఎందుకు లేకపోయె'' నని పలుకుచు వెనుకకు పోయినది. శ్రమణులకు అఱికాలిమంట నడినెత్తి కెక్కినది.

''గృహపతీ! లోకములో నీకు ఆడది కఱవయ్యెనా? తెచ్చి తెచ్చి యీ చండిక నెక్కడ తెచ్చితివి? శ్రమణగౌతముని శిష్యురాలు నీ యింట నుండరాదు. వడిగ వెలికి నడిపింపుము.''

మహాకులమునందలి కన్య యిల్లు వెడల నడిపించుటనిన మాటలా యేమి? అని వితర్కించి ''ఓ ఆచార్యులారా! పసిబిడ్డ యే మెఱుగును? దాని అజ్ఞానమును పెద్దలు క్షమించండి'' అని మృగారుడు వారిని అనునయవినయముల తేర్చి పంపించి తా నొక ఉన్నతాసనమున గూర్చుండి బంగారు గిన్నెయందు మధురపాయసమును భుజింప నారంభించెను. ఆ సమయముననే స్థవిరు డొకడు భిక్షకై ఎచ్చి వాకిట నిలువబడెను. ''మామగా రున్నారు గదా'' అని విశాఖ వైదొలగె నిలచినది. ఆ భిక్షువును చూచియు చూడనట్లతడు పాయసమును తలవంచుకొని భుజించు చుండెను. కొంత వడితాళి ఆపై తానె ముందుకు వచ్చి విశాఖ భిక్షువునితో ''అయ్యా! స్థవిరా! ముందుకు సాగి పొమ్ము. మా మామగారు పాతతిండినె తినుచున్నారు''నెను.

వెండియు దాసి ఆరామములోనికి పోవుసరికి భిక్షువులు స్నానమాడి ఒడలు తుడుచుకొనుటకు లోగదులలోనికి పోయియుండిరి. దాసి వారిని కనుగొన లేక తిరిగివచ్చి విశాఖతో ''అమ్మా! ఆరామము శూన్యమైయున్నది. భిక్షువులు లేర''ని చెప్పినది. ప్రజ్ఞావతి యగు విశాఖ భిక్షువులు స్నానానంతరము తమ తమ గదులలోనికి

---

జైనసాధువు లాడినప్పటినుండియు భగభగయనుచున్న అతని హృదయమొక్కెత్తున భగ్గున మండినది. ''ఛీ! ఛీ! ఎవ్వడురా అక్కడ? ఇదిగో యీ పాత్రను గొనిపొమ్ము. మంగళగృహమున నమంగళము బలుకు దీనిని యింటినుండి గెంటివేయుడ''ని గృహపతి ఆక్రోశించుచున్నాడు. కాని దాసదాసీజన మంతయు విశాఖకు లోకువవారు. మామతో విశాఖ యిట్లనియె. ''మామయ్యా! చప్పట్లకు బెదరునవి కుందేళ్ళు కాబోలు, నన్ను మీరంగడినుండి కొనిరాలేదు. నా తండ్రి ఆనాడే యెనిమిదిమంది కులపెద్దలను పిలిచి ''నా కూతురేదైన తప్పు జేసినచో మీరు విచారించుడ''ని వారిని నిర్ణయించినాడు. వలసినచో వారిని బిలిపించి నేరములు విచారించుడు.''

పంచాయతీ సంఘమువారు వచ్చినారు. మృగారశ్రేష్ఠిని యిట్లడుగుచున్నారు. ''గృహపతీ! నీవు చెప్పునదేమి?''

''అయ్యా! ఈమెవచ్చి యెడుదినములు గానిదె మంగళగృహమందున్న నన్ను అశుచి భక్షకుడని పలికినది.''

''అమ్మా! అట్లెందుకంటివి?''

''పూజ్యులారా! నేననుట గాదు. వారే అశుచి భక్షకులు కాగోరుచున్నారు. భిక్షువు మధుకరమునకై వచ్చి వాకిట నిలిచియుండుట చూచికూడ ఊరక తలవ్రాల్చుకొని వీరు పాయసమును మెసవుచుండుటచే నేనా భిక్షువుతో ''అయ్యా! మా మామగారు క్రొత్తపుణ్యమును చేయగోరుటలేదు. పాతపుణ్యమునె తినుచున్నార''ని యంటిని.''

''గృహపతీ! ఇందు తప్పేమున్నది?''

''ఆర్యులారా! మరొక్కమాట. ఈప వచ్చునదనమే మమ్మువరిస సరకుగానక యథేష్టముగ నెచ్చటికో పోయినది.''

''అమ్మా! కారణ మేమి?''

''అయ్యలారా! యథేష్టముగ నేను పోలేదు. గుఱ్ఱ మొకటి ప్రసవవేదన ననుభవించుచున్నదని తెలిసి దానికి ఉపచారములు చేయుటకు బోయితిని.''

''గృహపతీ! ఈ బిడ్డ నీ యింటి దాసీజనులు చేయనొల్లని పనికూడ చేసినది. అది నీకు దోషమైనదా?''

పోయియుందురని భావించి పరిచారికను మరొక్కసారి పోయిరమ్మని చెప్పెను. అంతలో భగవంతుడు భోజనమునకు వేళయైనదని భిక్షువులను మందలించి పాత్రచీవరములను గ్రహించి సంఘసహితముగ దివ్యశక్తి ప్రభావమున జేతవనమునం దంతర్హితమై విశాఖ మృగారమాత యింటియెదుట ఆవిర్భవించెను. ఆమెయు ఉచితాసనముల వారిని గూర్చుండవెట్టి వివిధ భోజనముల వారిని సంతర్పితులను జేసి భోజనానంతర మొకచో గూర్చొని యిట్లనియె.

---

''పెద్దలారా! ఇవన్నియు నుండుగాక. ఈమె నిచ్చుటకి పంపుటకు ముం దీపె తండ్రి యీమెతో ''లోని అగ్నిని బైటికి పోనీరాద'' ని ఉపదేశించినాడు. ఇరుగుపొరుగు వారడిగినచో అగ్గి నివ్వకుండుట యెట్లు?''

''అమ్మా! ఏమనెదవు?''

''ఆర్యులారా! ఈ అగ్నిని ఉద్దేశించి మా తండ్రి చెప్పలేదు. అత్తయు వదినెయు మున్నగు ఇంటిలోని ఆడువారాడు మాటలను దాసదాసీ జనులకు తెలుపరాదు. తెలిపినచో కలతలు జనించును. ఈ విషయమును తలంచి మా నాయనగారిట్లన్నారు.''

''పెద్దలారా! అంతేకాదు. ఈమె తండ్రి బైటి నిప్పును లోనికి తేరాదని కూడ చెప్పినాడు అవసరము కల్గినప్పుడు తీసికొని రాక తప్పునా?''

''అమ్మా! నిజమేనా?''

''అయ్యలారా! కలహమునకు కారణములైన మాటలను దాసదాసీజనముల నుండి తెచ్చి యింటిలోనివారికి చెప్పరాదని వారి మాటలకు తాత్పర్యము.

మా తండ్రిగారు మరియు ఇచ్చువారికి యివ్వవలెనని చెప్పిరి. తీసికొనిపోయిన వస్తువును తిరిగి యిచ్చువారి నుద్దేశించి చెప్పినమాట అది. అట్లే యివ్వనివారికి యీరాదనిన బదులు గొనిపోయి మరల యివ్వనివారినిగూర్చి చెప్పినది. ఇచ్చువారికి యివ్వనివారికి యీవలెననుమాట బీదలను బంధుమిత్రులను ఉద్దేశించి చెప్పినవాక్యము. సుఖముగ కూర్చుండవలెనన్న అత్తమామలను జూచి మాటి మాటికి లేవవలసియుండుతావున కూర్చొనవద్దని సూచన. సుఖముగ భుజింపవలె ననిన అందఱిని భుజింపజేసి భుజింపవలెనని యర్థము. సుఖముగ పరుండవలె ననిన చేయవలసిన పనిపాటలు కొఱతలేకుండ ముగించి పరుండుట యొప్పుననుమాట. అగ్ని పరిచర్య చేయుమని చెప్పినమాటకు అభిప్రాయము భర్తను అత్తమామలను అగ్నివలెచూచి పూజింపవలె ననుట. మా తండ్రి చివరకు లోపలిదేవతలను గూర్చి నమస్కరించవలెనని చెప్పెను. తన యింటికి వచ్చు భిక్షుపరివ్రాజకులకు, అతిథి యభ్యాగతులకు తాను కల్గినంతకుపెట్టి శేషాన్నమును భుజింపుమని అందలి ఉద్దేశ్యము. మా నాన్నగారిట్లు జెప్పిరి.''

''భగవంతా! కొన్ని వరములను ప్రార్థింతును.''

''విశాఖా! తథాగతుడు వరములజోలికి పోడు.'

''దేవా! నిర్దోషములైనవి.''

''విశాఖా! చెప్పుము.''

''గృహపతీ! ఆమాటలకు విరుద్ధముగ నడువవలె ననియా నీ తలంపు. ఇక చెప్పుము. విశాఖలో నుండుదోష మేమి?''

''ఆర్యులారా! యేమియు లేదు.'' అని మృగారశ్రేష్ఠి చిన్నదనముదోప బలికినంతట విశాఖ యిట్లనియె.

''పెద్దలారా! నన్ను మా మామగారు యింటినుండి వెడలనడువుమన్నారు. కాని మధ్య వర్తులగు మీ యెదుట దోషాదోషవిచారణ నడవనిదే పోవుట అనుచితమని నిలచితిని. ఇక పోవుట యోగ్యము. పరిజనులారా! వాహనముల నాయత్తపఱచుడు.''

మృగారశ్రేష్ఠి దద్దరిల్లి ''అమ్మా! తెలిసి తెలియక పలికిన పలుకులకు ఎగ్గులెంచకుము. నన్ను క్షమించవలెను.''

''మామయ్యా! క్షమించు టేమున్నది? మంచిది. కాని నా కొక వర మీయవలెను.''

''అమ్మా! అవశ్య మడుగుము.''

''అయ్యా! బుద్ధధర్మమునందు ప్రబలానురక్తిగల కులమున బుట్టితిని. భిక్షుసంఘము యొక్క సేవాపరిచర్యలు నడవనినాడు నా మనస్సు తహతహలాడును. కావున నేను భిక్షుసంఘము లకు జేయు సత్కారములందు ఆటంకముండరాదు.''

''అమ్మా! యథేష్టముగ నిర్వర్తింపుము.''

మఱునాడే విశాఖ బుద్ధుని భిక్షుసంఘమును నిమంత్రించి గృహమునకు రప్పించినది. భగవంతుడు తన సంఘముతో మృగారశ్రేష్ఠియొక్క యింటికి జనుటజూచి కడవుమంట భరింపలేక నిగంఠజైనసాధులు గృహముచుట్టును కాచి కూర్చొనిరి. సంఘమును సత్కరించుటకును భోజనమర్పించుటకు విశాఖ మామగారిని ప్రోత్సహించెను గాని అతడు నిగంఠువులచెఱ బడలేక అందు పాల్గొనడయ్యెను. బుద్ధుని ధర్మోపదేశములను వినుటకైనను రమ్మని విశాఖ పిలిచినది. అతడును తెరచాటుననుండి వినుట కుపక్రమించెను. ఉపదేశము ముగియుసరికి మృగారశ్రేష్ఠి స్రోతాపత్తి ఫలమును ప్రాపించి తెరను తొలగించుకొని బుద్ధదేవుని యెదుటకువచ్చి దీర్ఘదండముగ ప్రణమిల్లి విశాఖ వైపునకు తిరిగి ''అమ్మా! నీవు నాకు నిజమునకు కోడలివి గాదు. మాతవు. మాతవు. మాతవు.'' అని ఎలుగెత్తి చెప్పెను. ఆనాటినుండి విశాఖ ''మృగారమాత'' యని పిలువబడినది.

''భంతే! నేను సంఘమునకు యావజ్జీవము వర్షస్నానము జేయుటకు వస్త్రము లివ్వగోరితిని. ఆగంతులకును, యాత్రకుపోవు గమికులకును, రోగుల కును, రోగుల పరిచర్య చేయువారికిని యావజ్జీవము భోజనమివ్వ దలంచితిని. రోగులకు ఔషధమును, సంఘమునకు పలుచనిగంజిని (జావను) యివ్వ నిశ్చయిం చితిని. ఋతుమతులైన వేళలందు ధరించుటకు భిక్షుణీసంఘమునకు వస్త్రముల నొసంగనూహించితిని.''

''విశాఖా! ఈ యెనిమిది వరము లడుగుటకు హేతువేమి?''

''భగవంతా! ఇతఃపూర్వమె నేను ఆరామమునకు బంపిన దాసివలన భిక్షువులు దిసమొలలతో వర్షస్నానమాడుచున్నారని తెలిసి కొంటిని. అది అసహ్యము, అస భ్యము; కావున వారికి యావజ్జీవము వర్షికశాటి నివ్వదలంచితిని. ఆగంతకులగు భిక్షువులు అపరిచితులు గాన భిక్షకై వెతనొందుదురు. గమికభిక్షువులు భోజనమును వెతుకుకొనుచు భగవంతుని వీడి చనుదురు. రోగులకు అనుకూలభోజనము లేకున్న రోగము పెఱుగును. రోగి పరిచారకులు ఆహారము లేకున్న, వారు రోగులను దిగ విడిచి పోయెదరు. కాబట్టి ఈ నాల్గువిధముల వారికి భోజనమివ్వ నిశ్చయించితిని. ఔషధము లేనిచో రోగులు వేదన బొందుదురు. కావున వారికి ఔషధదానమును తలంచితిని. ఒకప్పుడు భగవానుల వారొకచోట పలుచని (జావను) గంజిని కూర్చి ప్రశంసించితిరి. అందుచే దానిని యావజ్జీవము భిక్షువుల కర్పించెదను. దేవా! ఒకప్పుడు అచిరవతీనదియం దొక ఘట్టమున భిక్షుణీ స్త్రీలు దిగంబరులై స్నాన మాడుచుండిరి. వారితో కలిసి వేశ్యలు కొందఱు స్నానమాడుచు పలువిధముల గేలిసేయుచుండిరి. దేవా! యెట్లులైనను స్త్రీలు దిసమొలనుండుట కడుంగడు అసహ్యము. కావున వారికి ఉదకశాటీ దానమును సంకల్పించితిని.''

విశాఖ మాటలకు భగవంతు డెంతయు నలరెను.

## ఆనందుని చరిత్రము - చించాకాండము - రోగి శుశ్రూషక బుద్ధుడు - పూర్వారామనిర్మాణము (వి. పూ. 450)

★ ఆనందుడు బోధిసత్త్వునితో గూడి తుషిత (స్వర్గ) పురమున నుత్పన్నుడై అటనుండి జాటి అమృతౌదన శాక్యునింట జన్మించెను. ముద్దుముచ్చటలతో కులము వారినెల్లను ఆనందింపజేయుటచే ఆనందుడని పేరువడసెను. కాలము గడచినంత

★ అ. ని. అ. క. 1 - 4 - 1

సిద్ధార్థుడు గృహమును వీడి సంబోధిని పొందిన పిదప మొదటి పర్యాయము కపిలవస్తువునకు వచ్చి తిరిగి వెళ్ళిపోయెను. ఆ సమయమున భగవంతుని అనువర్తించి ప్రవ్రజితులైన భద్ధియుడు మొదలగు శాక్యకుమారకులలో (ఆనందుడు) తానొకడై, ఆయుష్మంతుడగు మైత్రాయిణీపుత్రునివలన ధర్మోపదేశమును విని కొంతవడికి స్రోతాపత్తిఫలమును ప్రాపించెను. బుద్ధత్వమును పొందిన పదంపడి మొదటి యిరువది యేండ్లయందు, నియత పరిచారకుడు యెవ్వడును భగవంతునకు లేడు. ఒకప్పుడు నాగసమాలుడు పాత్రచీవరములనుగొని వెంటనడచువాడు. మరొక ప్పుడు నాగితుడు వేరొకప్పుడు ఉపబాణుడు అట్లే సునక్షత్రుడు శ్రమణోద్దేశుడు చుందుడు, స్వాగతుడు, రాధుడు, మేఘియుడు ఒక్కొకడు కొన్నికొన్ని దినములు పరిచర్య జేయుచు వచ్చిరి. ఒక సమయమున నాగసమాలుడును భగవంతుడును కలసి దారి నడచుచున్నారు. కొంతదూరము చనుసరికి త్రోవ రెండుగ చీలినది. నాగసమాలుడు ప్రక్కకుజీలి ''దేవా! నేనీదారిని బోయెద'' ననెను. ''భిక్షూ! ఇట్లే రమ్మని'' భగవంతు డనెను. వాడును ''భగవంతా! మీ పాత్రచీవరములను గైకొనుడు. నేనీమార్గముననె బోదు'' నని పట్టుదలపట్టెను. బుద్ధుడు తన పాత్రచీవరములను తాను గైకొనెను. నాగసమాలుడు తానువలచిన దారివెంబడి పోవుచుండ కొందఱు దొంగలడ్డమై వస్త్రములను లాగికొని పాత్రమును పగులకొట్టి మేను చిదుగకొట్టిరి. వేఱు గతిగానక వెండియును వాడు నెత్తురుగాఱుచుండ భగవంతుని చెంతకు పరుగిడివచ్చి తనకుపట్టిన దుర్గతిని నివేదించెను. మరొకప్పుడు మేఘియుడను స్థవిరుడు తథాగతునకు అనుచరభిక్షువైయుండి ప్రాచీనవంశదానమునందలి జంతుగ్రామమునకు భిక్షకై పోయెను. అచ్చట నొక సుందరమగు మామిడివనమును జూచివచ్చి గురువుగారి పాత్రచీవరములను గురువునకప్పగించి నివారించినను వినక తానొక్కడును తపస్సు చేసికొందునని వనములోనికి ప్రవేశించెను. మలినవిచారములు మెండై చిత్తముత్తల మొందజొచ్చిన విధి లేక భగవంతునికడ కరుగుదెంచి కథయంతయు విన్నవించిన నమ్మహాత్ముడును ''తొలుతనె వలదనిన విననయితివి గదె'' యని మేఘియుని మందలించి శ్రావస్తిని చేరు కొనెను.

అచ్చట గంధకుటీపరివేణ (చౌకు) మున భిక్షుసంఘపరివేష్టితుడై భగవంతుడు బుద్ధుడు భిక్షువులనందఱి నామంత్రించి యిట్లనియె.

''భిక్షువులారా! నేనిప్పుడు యేబదియాఱేండ్ల వృద్ధుడను. నా అనుచర భిక్షువులలో నొక్కొకడు 'యిటుపోదమ' నిన 'అటుపోదు' నననును. మఱియు

నొక్కొకడు నాపాత్రచీవ రములను నేలపైపడవైచి పోవుటకుకూడ ఉద్యమించును. అందుచే నాకు నియతముగ నొక పరిచారక భిక్షువును నిర్ణయించుడు.''

ఆ మాటను విని విషణ్ణులైన భిక్షువులలో నుండి ఆయుష్మంతుడు సారిపుత్రుడు లేచి భగవంతునకు సాష్టాంగమెఱగి యిట్లనియె.

''భంతే! మీమీది మక్కువచే లక్షలాదికల్పములనుండి అపరిమితపారమితల నార్జించుచు వచ్చుచున్నాను. ఇదె వీడె సర్వసమర్థుడగు సేవకు డెదుటనున్నాడు. ఆజ్ఞ గొనుడు.''

''నాయనా! సారిపుత్రా! నీవు రమారమి నాయంతటివాడవు. నీవున్న చోట్ల నేనున్నట్లే. నీ ఉపదేశములు బుద్ధోపదేశములకు దీటైనవి. నిన్ను నా అనుచరునిగ వెంటవేసికొనుటకు అంగీకరింపను.''

భగవంతునిచే సారిపుత్రు డిట్లు నివారింపబడినంత నొక్కొక్కడుగ మహామౌద్గల్యాయన ప్రభృతు లెనుబదిమంది మహాశ్రావకులు ముందుకువచ్చిరి. మొత్తమంద ఱినిగూడ బుద్ధుడు నిరాకరించినాడు. ఆనందు డొకమూల నదియిదియనక యెఱుగనట్లున్నాడు. కొందఱు భిక్షువులతని కదలించి ''ఆనందా! భగవంతునివద్ద ఉపస్థాక (పరిచర) పదవికై భిక్షుసంఘమంతయు నుబ్బూతలూగుచుండ నీవు మ్నికున్నా వెందుక''ని ప్రశ్నించిరి. ''ఆయుష్మంతులారా! ప్రాకులాడుటతో లాభమేమి? భగవంతుడు నన్నెఱుగడా? నేనాయనకు నచ్చినచో వారె నన్ను ఆమంత్రింతురు.'' అని ఆనందుడు సమాధానించను. అంతయు గాంచుచున్న భగవంతుడు ''ఓ భిక్షువులారా! మీరానందుని ఒత్తిడి చేయకుడు. వాడె వచ్చి యాచించగలడ'' నెను. ఆ వచనమాలించి ఆనందస్థవిరుడు లేచి గురుదేవులకు మొగమై యిట్లనియె. ''భగవంతా! నా యీ యెనిమిది షరత్తుల (వరముల) ను మీరామోదింపవలెను. అందు నాలుగు ప్రతిక్షేపములు. నాలుగు అపేక్షలు. ప్రతిక్షేపములను వినుడు. దేవర వారికి లభించెడి 1. ఉత్తమ వస్త్రములను నాకియ్యరాదు. 2. ఉత్తమభోజనమును నాకిడరాదు. 3. తాము నివసించు కుటీరమున తావీయరాదు. 4. విందులకు వెంట కొనిపోరాదు. భంతే! సుఖమును మరగి, రుచుల నపేక్షించి యీ భిక్షువు భగవంతునకు అనుచరవేషము వేసినాడని లోకులనుండివచ్చు అపవాదములకు పాల్పడకుండ నా యీ నాల్గు నియమముల నంగీకరింపుడు. ఇక నాలుగు అపేక్షలను చెప్పెదను వినుడు.

1. నేను అంగీకరించిన తావునకు భోజనముచేయ బోవలెను. 2. దర్శనార్థమై వచ్చిన భక్తులకు భగవంతుని దర్శనము చేయించుటయందు నాకధికారముండవలెను. 3. కోరినప్పుడెల్లను నేను మీ సన్నిధానమునకు రాగలిగి యుండవలెను. 4. నా పరోక్షమున నడచిన ధర్మోపదేశములను తిరిగి నాకు వినిపింపవలెను. ఇదియె నా మనవి. వీడె మీనియత పరిచారకుడు.''

ఆనందుని వరములను సహర్షముగ భగవంతు డామోదించెను. అప్పటినుండి నియతపరిచారకుడుగూడ నతడే.

[1] సంబోధిని బొందినపిదప యిరువది వత్సరములు భగవంతు డాయాయెడల అనియతముగ నివసించుచు వర్షావాసము గడపుచుండెను. ఆ తర్వాత ఆయనకు ధ్రువపరి భోగములు – నియత నివాసస్థానములు రెండే యేర్పడినవి. ఒకటి జేత వనము. రెండు పూర్వారామము.

## చించాకాండ

[2] బుద్ధత్వప్రాప్తి యనంతరము గౌతమునికీర్తి దిగ్దిగంతయులందు ప్రజ్వరిల్లి పోయినది. సూర్యోదయమగుడు మిణుగురుపురువుల భాతి అతనిముందట తైర్థిక సంప్రదాయులకు నామరూపములు లేవయ్యెను. అసూయ వారికి తెగులై పట్టినది. ఒకనా డేకాంతమున ప్రోవై ''శ్రమణగౌతముని పరువుప్రతిష్ఠలను తుదముట్టించు విధానమెట్లు?'' అని యెంతెంతో మంతనములు జేసిరి. వారిలో నొక డిట్లనియె. ''ఈ శ్రావస్తియందు చించామాణవిక యను పరివ్రాజికయొక్కర్తుగలదు. అది అసమానరూపరాశి, అచ్చము అచ్చరయే. ఆమెమూలమున శ్రమణగౌతముని యశో గౌరవమునకు మసిబూతముగాక.'' ఆ తీర్మానమునకు అందఱు ఊకొనిరి.

చించామాణవిక యథారీతి తైర్థికారామమునకు వచ్చి వందనములు జేసి కెలన నిలువబడినది. తైర్థికులు మౌనముద్రతో బిగిసుకొనియున్నారు. ''పూజ్యులారా! తప్పేమి జేసితిని'' అని చించ ప్రార్థించినది. ''సోదరీ! నీ వెఱుగవా? శ్రమణ గౌతముని మూలమున మా మర్యాద మంటగలిసినది'' అని వారనిరి.

''అయ్యలారా! అందు నా జేయున దేమి?'' అని మాణవిక మనవి జేసినది.

''చెల్లెలా! చేయతలంపున్నచో శ్రమణగౌతముని కీర్తిప్రతిష్ఠల సమూల మున్మూలింపజాలినదానవు. అయినను మాపై నిక్కమగు మక్కువయున్నగదా?''

(1) అ. ని. అ. క. 2 – 4 – 6. (2) ధ. వ. అ. క. 13 – 19.

''అయ్యా! అదేటిమాట? మీరు నిశ్చింతగ నుండుడు. ఆ భారము నాది.''

చించ ఒక పథకము పన్నినది. ఆనాటినుండి ఆపె శ్రావస్తీవాసులగు ప్రజలు భగవంతునివలన ధర్మోపదేశములను విని జేతవనారామమునుండి వెనుదిరిగివచ్చు వేళలందు తాను వన్నె చీర ధరించి గంధమాల్యముల కరమున గ్రహించి వారికి యెదురగుచు జేతవనమువైపునకు పోవుచుండెడిది. 'ఈ అకాలమున నెక్కడ బోవుచున్నా'వని యెవడైన నడిగినచో 'నా సుద్దితో మీ కేమి పని' యని తుటాయించు నది. అటపోయి జేతవన సమీపమందుండు త్రైర్థికారామమున రాత్రియంతయు వసించి ప్రభాతసమయమున భగవంతుని ప్రాతర్దర్శనమునకై చనుదెంచు ఉపాసకుల కెదురుదగులుచు పురమును ప్రవేశించుచుండెడిది. ''రాత్రి యెచ్చట నుంటివి'' ని యడిగినచో ''నాతో జోక్యము మీ కేల'' యని కసరెడిది.

నెలలుకొన్ని గడచినవి. జనులలో అపోహలు చిట్లినవి. పొట్టకు బట్టలుగట్టి తిరుగుచు శ్రమణగౌతమునివలన గర్భమేర్పడినదని దుర్వార్తనందందు రగిలించినది. కాళ్ళుచేతులు వాయునట్లు ఆవుతో త్రొక్కించుకొని కడుపుపై నెత్తుగ కొయ్యలను బేర్చి గుడ్డతో కట్టి నిండు వేకటితో సుడివడుదానివలె సొక్కుచు సోలుచు అసురు సురగుచు ఒకానొకనాటి సాయంకాలము మహాపరిషత్తులో ధర్మాసనమునగూర్చొని ఉపదేశించుచున్న తథాగతుని యెదుటకు వచ్చి చించామాణవకి యిట్లనియె.

''మహాశ్రమణా! తియ్యనిమాటలతో లోకుల కందటికిని ధర్మములను బోధింతువు. నీవలన నేను గర్భవతినైతిని. నిండుచూలాలుగనుండు నాకు తగిన ఉపచారసామగ్రికై యోచింపవు. కోసల రాజున్నాడు. అనాథపిండకుడున్నాడు. విశాఖ యున్నది. ఈ చించామాణవికకు వలయు వస్తువుల నిమ్మన్నచో యెవ్వరు కాదందురు?''

అని కాఋలు ప్రేలుచు మలపిండముతో చంద్రమండలమును గొట్టనుంకిం చెడి పలువవలె చించామాణవకి నిండుసభలో భగవంతుని కళంకితుని జేయుటకై వ్యర్థప్రయాసపాలయ్యెను. ఉపదేశప్రసంగముల నట్లె నిలిపి హిమగిరిగంభీరుడు సుగతదేవుడా తరుణివైపు తేటి జూచి మేఘగర్జనమున నిట్లనియె. ''సోదరీ! నీ మాటలలోని కల్లయు నిజమును నీవును యెఋగుదువు. నేనును యెఋగుదును.''

''మహాశ్రమణా! మన మెఱిగినది అందఱు నెఋగుదురు.''

చించామాణవకి మిథ్యారోపమును తథాగతునిపై మోపుటయు, దేవేంద్ర పీఠము ఉడుకెక్కినది. దేవపతి సహింపలేక నేరమును తేల్చెదనని నలువురు దేవపుత్రులను వెంటగొనివచ్చెను. వారును మూషిక రూపములను దాల్చి ఆకాంత

కట్టెలను కడుపుపై చేర్చి కట్టిన త్రాడును పుటుక్కున త్రెంచిరి. కప్పుకొన్న గుడ్డను గాలి యెగురగొట్టినది. పడుచున్న దారుఖండములు పాదములపై బడుటచే యెముకలు కీళ్ళు నలినలియైనవి. విషపురువు – విషపురువు – ఛీ ఛీ యని ప్రజలు తుపుక్కు తుపుక్కున ఉమిసిరి. పరిచారకులు బెత్తములతో జేతవనారామమునకు బైటికి నెట్టిరి. భూమి ఫళఫళ యని పగిలి లోనికి గొంపోయినది.

## రోగి శుశ్రూషక బుద్ధుడు

[1] ఒకనాడు బుద్ధుడు ఆయుష్మంతుడగు ఆనందునితో గూడి భిక్షువుల విహారములన్నింటిని పరిశీలించుచు వచ్చి ఒకానొక భిక్షువున్న విహారములోనికి జొచ్చెను. ఆ భిక్షువు ఉదరవ్యాధిపీడితుడై మలమూత్రముల నందె వదలి దానిలోనే దొర్లాడు చుండెను. భగవంతుడు వానిని సమీపించి ''భిక్షూ! నీకు రోగమేమ'' ని యడిగెను. వాడును ''కడుపు జబ్బు'' ని జవాబిచ్చెను. వెండియు భగవంతు డిట్లనియె. ''భిక్షూ! నీ కెవ్వడైన పరిచర్య చేయువా డున్నాడా?'' ''దేవా! ఎవ్వనికిని కొఱగాని నన్ను యెవ్వరెందుకు పంకింతురు.'' అని భిక్షువు దీనముగ పల్కెను. అంతట బుద్ధదేవుడు ఆనందునితో నీటిని దెప్పించి తాను జలమును పోయుచు వానిని ఆనందునిచే కడిగించెను. తలవైపు భగవంతుడు పట్టెను. కాళ్ళను ఆనందుడు పట్టెను. ఎత్తి మంచముపై జేర్చిరి. ఆ సందర్భమునందు భగవంతుడు భిక్షువుల నందరిని ప్రోగుజేసి యిట్లనియె.

''ఓ భిక్షువులారా! వలసినప్పుడెల్ల సేవజేయుటకు మీకు తల్లి లేదు. తండ్రి లేడు. కష్టములలో నొకరికొక రాదుకొని తోడ్పడనిచో యెవ్వరు తోడయ్యెదరు? రోగిని సేవించుటనిన నిజమునకు నన్ను సేవించుటయే. గురువునైనను ఉపాధ్యాయునైనను శిష్యునైనను సబ్రహ్మచారినైనను వీరెవ్వరును లేకున్న సంఘమునైనను సేవింపవలెను. తప్పినచో దుష్కృతమను ఆపత్తి.''

## పూర్వారామ నిర్మాణము

[2] ఆ నా డొక పర్వదినము. ప్రజలలంకరించుకొని ధర్మశ్రవణము కొఱకై విహారమువైపునకు పోవుచుండిరి. విశాఖయు నిమంత్రిత స్థలమున భుజించి మహాలతాప్రసాధనమును కైసేసికొని తోడి పరిజనులతో తానును విహారమునకు బోయి ఆభరణముల నొలిచి దాసి చేతికిచ్చి యిట్లనియె.

(1) మహావగ్గ. (2) ధ. ప. అ. క. 4 – 44.

''అమ్మా! ఈ నగలను నీ కడ నుంచికొని నే నిచ్చోటినుండి లేచినపుడు నా కొసగునది. నే నపుడు ధరించెదను.''

ఇట్లు విశాఖ నగలమూటను దాసి కందించి భగవంతుడు జేయు ధర్మోపదేశ ములను వినుచు కూర్చొనెను. ప్రసంగము ముగిసినది. భగవంతునకు నమస్కరించి విశాఖ లేచి బయలు దేరెను. నగల మూట దాసిగూడ మఱచినది. ఆగంతుకభిక్షువు లను, గమికభిక్షువులను, రోగులగు భిక్షువులను నిరీక్షించుచూ విశాఖ తన దాసితో గూడి విహారములోనికి జొచ్చినది.

సభ లేచిపోయిన తర్వాత మఱచి పోయిన వస్తువులను తీసి పదిల బఱచుట ఆనందుని పని. ఆనాడు విశాఖ అందే దిగనాడిపోయిన మహాలతాప్రసాధనమును జూచి ఆనందుడు బుద్ధునితో నిట్లనియె. ''భంతే! విశాఖ తన భూషణముల నిందే విడిచి మఱచి పోయినది.''

''ఆనందా తీసి యొకవైపు పెట్టుము.''

ఆనందస్థవిరుడు దానిని ఎత్తికొని సోపానముల సమీపమున తగిల్చియుంచెను. అక్కడ విశాఖ కొంతదూర మరిగి తిరిగి చూచి ''చేటీ! ఆభరణముల నిమ్ము. ధరించెదన''నెను. ''అమ్మా! నేనును మఱచివచ్చితినే'' యని దాసి సంభ్రాంతయై ప్రత్యుత్తర మిచ్చినది. ''పోపొమ్ము. కైకొనిరమ్ము. ఒకవేళ ఆనందస్థవిరుడు దానిని తీసి యెత్తి పెట్టియున్న యెడల అది అతనికె చెందవలయును గావున నీవు తీసికొని రావద్దు'' అని చెప్పి దాసిని పంపించెను. ఆ పరిచారికయు వడివడిగ విహారములోనికి పోయినది. ఆనందు డది జూచి ''యెందుకు వచ్చితివ''ని యడుగ ''యజమాను రాలి ఆభరణములు యిందె మఱచిపోయితిని. వాటికై వచ్చినాన''ని ఆమె జెప్పెను. ఆ సోపానముల వద్దనున్నవి కైకొనుమని ఆనందుడు వాక్రుచ్చెను. ''అయ్యా! తాము తాకియున్నచో కొనిరావద్దని మాయమ్మగారి ఆజ్ఞ'' అని ఉగ్గడించి దాసి విశాఖ చంగటకు పోయి కథనంతటిని విశదపఱచెను. ఆమెయు దాసిని జూచి ''అమ్మా! ఆర్యస్థవిరుడు ఆనందుడు గ్రహించిన వస్తువు ఆయనకె సమర్పితము. కాని ఆ అమూ ల్యాభరణముల నుంచుకొని వారెమి చేయుదురు? వాటిని కాపాడుట వారికొక బెడద. దాని వెలకు దీటైన వేఱొక వస్తువును యిప్పింతునుగాక'' యని పలికి స్వర్ణకారులను రప్పించి ఆ మహాలతాభరణమునకు వెల కట్టించెను. వారును సొత్తు వెల తొమ్మిదిలక్షలనియు, చేసిన శిల్పమునకు కూలి ఒక పదివేల ద్రవ్యమనియు మదింపు జెప్పిరి. అంతటి మహామూల్యవస్తువును యెవ్వరును కొనజాలకపోవుటచే తన దాపుననె ఉంచుకొని తానె యా క్రైకమును గట్ల నిశ్చయించెను.

ద్రవ్యము నంతటిని బండ్లపై యెత్తించుకొని భగవంతుడుండు విహారమున కరిగి విశాఖ యిట్లనియె. ''భంతే! నా మహాలతాప్రసాధనము ఆనందుని సొమ్మైనది. దాని మూల్యమునకు దగిన ధనమును తీసికొనివచ్చితిని. ఇది భిక్షువులకు సమర్పితము. ఈ ద్రవ్యమును దేనికొఱకై వినియోగించవలెను?''

''విశాఖా! ఈ పురమునకు తూర్పుగనివద్ద సంఘము వసించుటకు ఆరామమొకటి నిర్మించుట తగును.''

''దేవా! ఆజ్ఞ.''

విశాఖ తొమ్మిదిలక్షలకు భూమిని గొన్నది. ఇది విహారనిర్మాణమునకున్ను పోషణ కొరకున్ను నని నిశ్చయించెను. మరి తొమ్మిది లక్షలతో విహారమును గట్టనూహించినది. [1] ఇట్లు సమకట్టి భగవంతున కెఱిగించినంత ఆ దేవుని ఆదేశముతో మహామౌద్గల్యాయనుడు తన యేనూర్వుర భిక్షుసంఘమును గూడి ఆ విహార నిర్మాణమునకు ప్రజాపత్యము వహించి సుసంపన్నముగ నెరవేర్చెను. భగవంతుడు భద్దియనగరమును గూర్చి చారికకై వెళ్ళెను. విశాఖ నిర్మించిన విహారము క్రింద యే నూరుగదులును, పైన యేనూరుగదులును గలిగి రెండంతస్తుల మహాప్రసాదమై యొప్పినది. అది పూర్వారామమని పిలువబడినది.

## 3

## దేవదహసూత్రము (వి. పూ. 450)

[2] అది యొక సమయము. భగవంతుడు బుద్ధుడు శాక్యదేశమునందు దేవదహగ్రామమున విహారము చేయుచున్నాడు. అచ్చోట భిక్షువులను ఆమంత్రించి యిట్లనియె. ఓ భిక్షువులారా!

భదంతా!

[3] ఒకానొక శ్రమణబ్రాహ్మణు డిట్లనుచున్నాడు. ''పురుషపుద్గలు డనుభవించు సుఖమును, దుఃఖమును, అసుఖమును, అదుఃఖమును మొదట చేసియున్న

---

(1) చుల్లవగ్గ 6

(2) మ. ని. 3 - 1 - 1, అ. క. దేవ = రాజులయొక్క, దహము = కోనేరు. అదియే దేవదహము. అచ్చట శాక్యరాజుల సంబంధమగు పుష్కరిణి యుండెడిది. దానికి 'పారా' (గస్తీ) ఉండునట్టిది. దానిని బట్టి ఆ గ్రామము కూడ దేవదహమనబడును. ఆ గ్రామ సమీపమున లుంబినీవనమందు భగవంతుడు వసించుచుండును.

(3) నిర్గ్రంథజ్ఞాతృపుత్రుని వాదము.

కారణముననే పొందుచున్నాడు. తపస్సువలన వెనుకటి కర్మములను నాశముజేయుట చేతను, క్రొత్తకర్మములను చేయకుండుటచేతను భవిష్యత్తునందు పరిణామరహితుడు గాగలడు. పరిణామరాహిత్యమున కర్మక్షయము, కర్మక్షయమున దుఃఖక్షయము, దుఃఖక్షయమున వేదనాక్షయము వేదనాక్షయమున నన్ని దుఃఖములును అడగగలవు. ఇట్లు శ్రమణబ్రాహ్మణుని తీర్మానము.

భిక్షువులారా! వానిని నే నడుగుదును. '' ఓనిగంఠసాధూ! మేము గతకాల మం దుంటిమనియు, లేకపోవుట లేదనియు మీ రెఱుగుదురా?'' అనిన నా ప్రశ్నకు వాడు 'ఆయుష్మంతా! యెఱుగుట లేద' ని చెప్పును. 'ఓ నిగంఠూ! మేము పూర్వము పాపములు జేసితిమనియు, చేయలేదనుట లేదనియు మీ రెఱుగుదురా?'' అని నా ప్రశ్న. 'ఓ ఆయుష్మంతా! లేద' ని వాని జవాబు.

'ఓ నిగంఠూ! మే మిట్టి పాపము చేసితిమని మీ రెఱుగుదురా?' 'ఆయు ష్మంతా! లేదు.'

'నిగంఠూ! మేము యింతదుఃఖమును నశింపజేసితిమనియు, ఇకనింత నశింపజేయవలెననియు, ఇంతవఱకు బోయినచో దుఃఖము సమస్తము నశించు ననియు మిరేమైన నెఱుగుదురా?'

'ఆయుష్మంతా! యెఱుగము.'

'నిగంఠూ! మేమీ జన్మమున అకుశలధర్మముల నడంచి కుశల ధర్మములను పొందగలమని నిష్కర్షగ మీరు చెప్పగలరా?''

'ఆయుష్మంతా! లేదు.'

''అట్లగుచో నిగంఠువులారా! మీరు ముందాడినమాట 'పురుషపుద్గలు డనుభ వించు సుఖమును దుఃఖమును అసుఖమదుఃఖమును మొదట చేసియున్న కారణము ననే పొందుచున్నాడు. తపస్సువలన వెనుకటి కర్మములను నశింపజేయుట వలనను, కొత్తకర్మములను జేయకుండుట చేతను, భవిష్యత్తునందు పరిణామరహితుడు కాగలడు. పరిణామరాహిత్యమున కర్మక్షయము, కర్మక్షయమున దుఃఖక్షయము, దుఃఖక్షయమున వేదనాక్షయము, వేదనాక్షయమున సర్వదుఃఖనాశమునని చేసిన మీ తీర్మానము యే మాత్రము పొసగదు.'' ఆయుష్మంతా! నిగంఠూ!

ఒకానొక పురుషుడు బాణవిద్ధుడైనాడు. వాని మేనిలోనికి బాణముయొక్క ములికి జొఱబడినది. శల్యచికిత్సకుడు వచ్చినాడు. వాడు ఆ బాణమును తీయు

నపుడును కదలించునపుడును మందు వేయునపుడును గూడ ఆ పురుషుడు వేదన బొందుచున్నాడు. కొన్నాళ్ళకు ఆ వ్రణము వాసియగుడు ఆ పురుషుడు వెనుక తాను బొందిన వేదనల తలంచుకొనుచున్నాడు. ప్రస్తుతము హాయిగనున్నాననిగూడ తలంచుచున్నాడు.

గతకాలము మీరుంటిరా యని యడిగిన తెలియదనుచున్నారు. పాపములను జేసియుంటిరాయనిన తెలియదనుచున్నారు. అట్లగుచో సర్వదుఃఖనివృత్తికి మీరు చెప్పు సిద్ధాంతమెందుకు కొఱగానిది

భిక్షువులారా! నే నిట్లు పలికినంత ఆ నిగంఠువు లిట్లనిరి. ఆయుష్మంతా! గౌతమా! మా ఆచార్యుడు నిగంఠనాథపుత్తుడు సర్వజ్ఞుడు – సర్వదర్శి. ఆయన మా కిట్లుపదేశించువాడు. 'ఓ నిగంఠువులారా! వెనుక చేసిన కర్మములను దుష్కర తపములచే కాల్చి వేయండి. మున్ముందు పాపముజోలికి పోకుండ మనోవాక్కాయ ములను రక్షించండి. అట్టియెడ మీకు ఆస్రవములు నశించును. అంతట కర్మక్షయ మున దుఃఖక్షయము, దుఃఖక్షయమున వేదనాక్షయము, దానిచే సర్వదుఃఖనాశ మును యేర్పడును.' అని బోధించిన మా ఆచార్యుని వచనము మా కెంతయో సంతుష్టినొడ గూర్చినవి అని ఆ నిగంఠవులు నాతో ననిరి.

భిక్షువులారా! అంతట నే నిట్లంటిని. నిగంఠువులారా! ఈ అయిదు ధర్మ ములు యీ జన్మమునందే రెండువిధములగు విపాకముల (ఫలముల) నిచ్చునవి యైయున్నవి. 1. శ్రద్ధ 2. రుచి 3. అనుశ్రవము 4. ఆకారపరివితర్కము 5. దృష్టిని ధ్యానక్షాంతి. ఇవి అయిదు ధర్మములు. ఇందులో మీ అతీతాంశవాదియగు ఆచార్య నందు మీకు యెట్టి శ్రద్ధగలదు? యెట్టి రుచిగలదు? యెట్టి అనుశ్రవముగలదు? యెట్టి ఆకారపరివితర్కము గలదు? యెట్టిదృష్టినిధ్యానక్షాంతి గలదు? చెప్పుడని అడిగితిని. వారు యేమియు చెప్పజాలక నిరుత్తరులైరి.

మరియు భిక్షువులారా! ఆ నిగంఠువులతో నే నిట్లంటిని. ఓ నిగంఠు సాధు లారా! మీ ఉపక్రమము (ప్రయత్నము) తీవ్రమైనపుడు ఆ ఉపక్రమసంబంధ మగు తీవ్రదుఃఖవేదనయుగూడ సంభవించును. ఆ ఉపక్రమము తీవ్రముకానపుడు ఆ ప్రయత్నసంబంధమగు తీవ్రదుఃఖవేదనయును అనుభవింపరు. దీనికి మీరేమనెదరు? వారిట్లనిరి ఆయుష్మంతా! మా ఉపక్రమము తీవ్రమైనపుడు తీవ్రదుఃఖవేదన ననుభవిం తుము. మా ఉపక్రమము (ప్రయత్నము) తీవ్రము కానపుడు తీవ్రదుఃఖవేదనను కూడ అనుభవించుట లేదు.

అని వారనినంతట నే నిట్లంటిని. ఓ నిగంఠువులారా! అట్లులైనచో మీరు యింతకుముందు పురుషపుద్గలునిగూర్చి యన్నమాట అసంగతము. మీరు స్వయముగ ఉపక్రమసంబంధమగు తీవ్రదుఃఖవేదన ననుభవించుచు అవిద్యచే అజ్ఞానముచే మోహముచే వ్యత్యస్తముగ విపరీతముగ తలంచుచున్నారు. అని నేనాడిన వాక్కులకు వారు ప్రతివచనము నీజాలకపోయిరి.

ఓ భిక్షువులారా! మరియు నేడు వారిని ట్లడుగుదును. ఓ నిగంఠువులారా! 'ఈ జన్మమునందే వేదనీయ (అనుభవింపదగిన) కర్మములను ఉపక్రమము (ప్రయత్నము)చే వేఱొక జన్మమునందు వేదనీయములుగ చేయవచ్చునా?''

''ఆయుష్మంతా! లేదు.''

''జన్మాంతర వేదనీయకర్మలను ఆ ఉపక్రమముచే ఈ జన్మమున వేదనీయములుగ జేయవచ్చునా?''

''ఆయుష్మంతా! లేదు.''

''సుఖవేదనియకర్మలను దుఃఖవేదనియములుగను, దుఃఖవేదనియములను సుఖవేదనీయములుగను, పరిపక్వవేదనీయకర్మలను అపరిపక్వ వేదనీయములుగను, బహువేదనీయకర్మలను అల్పవేదనీయములుగను, అల్పవేదనీయ కర్మలను బహువేదనీయములుగును, వేదనీయకర్మముల నవేదనీయములుగను, అవేదనీయ కర్మములను వేదనీయములుగను ఉపక్రమముచేత = ప్రధానముచేత = ప్రయత్న ముచేత చేయుటకు వీలున్నదా?''

''ఆయుష్మంతా! లేదు.''

''నిగంఠువులారా! అట్లగుచో మీ సిద్ధాంతము మాన్యముకాదు. మీ ప్రధానమును - మీ ఉపక్రమమును నిష్ఫలము.

భిక్షువులారా! నిగంఠజైనుల పై సిద్ధాంతము పదివిధముల నిందనీయము. ప్రాణి తొలుత చేసిన కర్మములయొక్క కారణముతో సుఖదుఃఖములను పొందుచున్నాడనిన ఈ జైన నిగంఠువులిప్పుడు వివిధములగు తీవ్రదుఃఖవేదనల ననుభవించుచున్నారు. గావున వీరు వెనుక దుష్కర్మలను చేసినవారె యగుదురు. ఈశ్వరనియతి హేతువుచే ప్రాణి సుఖ దుఃఖములను పొందుచున్నాడనిన దుష్టుడగు ఈశ్వరుని ఆజ్ఞచే యిట్టి దుఃఖవేదనలను భోగించుచున్నారు కాబోలు. భాగ్యవిధి కారణమున

ప్రాణి సుఖదుఃఖముల పాల్పడుచున్నదనిన ఆ భాగ్యవిధికూడ వీరి విషయమున పాపయుతమై యుండవచ్చును. అట్లే అభిజాతియొక్క కారణముచేనన్నను, ఈ జన్మమునందలి పురుషకారముచేనన్నను అవియు గూడ వీరి యెడ దుష్టములై యుండనోపును. మరియు ప్రాణి పూర్వకర్మ హేతువు చే సుఖదుఃఖముల ననుభవించుచున్నదనినచో యీ నిగంఠులు గర్హణీయులు. అట్లే ఈశ్వర నియతిచేనన్నను, భవితవ్యత (భాగ్యవిధి) చేనన్నను, అభిజాతి హేతువుననన్నను, ఈజన్మమునందలి ఉద్యమముతోనన్నను నిగంఠు జైనులు గర్హణీయులు. వారి సిద్ధాంత మిట్లు పదివిధముల నిందనీయము.

భిక్షువులారా! అయిదు విధములగు ఉపక్రమములు సఫలములు; ప్రధానములు సఫలములు. 1. భిక్షువు దుఃఖముతో పీడితము కాని శరీరమును దుఃఖపీడితము జేయడు. 2. ధార్మికసుఖములను పరిత్యజింపడు. 3. సుఖములం దధికముగ మునుగడు. 4. వాడు మరియు, దుఃఖకారణములయొక్క సంస్కారముల నభ్యసించుటచే విరాగము కలుగుచున్నదనియు, 5. దుఃఖనిదానముయొక్క ఉపేక్షను భావన చేయుటచే విరాగము కలుగుచున్నదనియు తెలిసికొనుచున్నాడు. తెలిసికొని వాటిని అభ్యసించుచున్నాడు. భావించుచున్నాడు. అట్టి వాని దుఃఖము జీర్ణమగుచున్నది.

"భిక్షువులారా! పురుషుడు తాను వలచిన తానపేక్షించిన కాంత పరపురుషనితో సల్లాపములాడుట చూచి శోకదుఃఖముల ననుభవించుట యెందులకు?

"భంతే! ఆ కాంతయందు వీడు అనురక్తుడైయున్నాడు కాబట్టి దుఃఖశోకములను పొందుచున్నాడు."

"భిక్షువులారా! ఆ పురుషుడు ఆ కాంతయందలి అనురాగమును మోహమును వీడినచో అప్పుడప్పుడతి యెవ్వరితో యెట్లెట్లు సల్లాపించినను వాడు దుఃఖశోకముల కగ్గముకాగలడా?"

"భగవంతా! ఆమెయెడ వీతరాగుడగుటబట్టి వానికి దుఃఖశోకములు సంభవింప నేరవు."

"భిక్షువులారా! పైని చెప్పిన అయిదువిధములగు ఉపక్రమముల నవలంబించిన భిక్షువు విరాగమును బొందినవాడై దుఃఖనాశమునకు సమర్థుడగుచున్నాడు."

''మరియు నో భిక్షువులారా! వినుండు. సుఖపూర్వకముగ విహరించువేళ లందు భిక్షువు తనకు అకుశలధర్మములు పెరుగుచున్నట్లును, కుశలధర్మములు క్షీణించుచున్నట్లు దోచినచో - కుశలధర్మములు పైకొనుటకు అకుశలధర్మము లడుగంటుటకై తాను స్వయముగ దుఃఖములను వరించి దుఃఖములందు తగుల్కొనుచున్నాడు. ఇష్టసిద్ధియైన పిదప మరిమరియు వాడు దుఃఖములందు తగుల్కొని యుండవలెనను పనిలేదు. బాణములను చేయువాడు బాణాగ్రమును సూటిజేయు టకై దానిని నిప్పుపై పెట్టి కాచును. సూటిగ జేసిన పిమ్మట తిరిగి దానిని నిప్పుపై పెట్ట పని లేదుగదా? అట్లే భిక్షువు కూడా. అట్టిదాని ఉపక్రమము సఫలము. ప్రధా నము సఫలము.

వెండియు నో భిక్షువులారా! ఈ లోకమున తథాగతులు అర్హతులు సమ్యక్ సంబుద్ధు లుదయించుచున్నారని యెఱింగి వారి ధర్మోపదేశముల నాకాంక్షించి యిల్లువదలి, వాకిలివదలి పరివ్రాజకుడై ఆర్యశ్రావకుడు నిర్దోషసుఖమును అనుభవించుచున్నాడు. వాడు శీలస్కంధముతో ఇంద్రియసంవరణముతో, స్మృతిసం ప్రజన్యముతో గూడి ఏకాంతమును మరగి చెట్టుమటుగుననో గుట్టచాటుననో గిరిగు హాకందర శ్మశానభూములనో యెట్టెట్టో కాలము గడపుచు భిక్షాటనమున లభించిన కదన్నమైనను, సదన్నమైనను తిని తనివిజెంది స్థిరాసనబద్ధుడై ప్రజ్ఞ నెదుట బెట్టుకొని లోభమును వదలి ద్రోహమును వీడి మోహము నూడదన్ని అవ్యాపన్నచిత్తమున సర్వభూత హితేరతు డగుచున్నాడు. వానికి పంచనీవరణములు లేవు. ప్రథమ ధ్యానము, ద్వితీయ ధ్యానము, తృతీయధ్యానము, చతుర్థధ్యానమును సిద్ధించినవి. సమాహితచిత్తుడై వివిధ పూర్వజన్మములను స్మరించుచున్నాడు. దివ్యనేత్రమును బొంది ప్రాణికోటియొక్క సంసృతి పరిభ్రమణమును పరికించుచున్నాడు. వాని ఉపక్రమము సఫలము. వాని ప్రధానము సఫలము. కర్మబంధములు దొలగినవి. వానికి జన్మము ఇక లేవు. కృతకృత్యుడు. కరణీయ మొక్కటియు లేదు.

భిక్షువులారా! తథాగతు డీవాదమును అంగీకరించువాడు. ఇది పదివిధముల ప్రశంసనీయము. 1. ప్రాణియొక్క సుఖదుఃఖములకు పూర్వకర్మయె కారణమైనచో తథాగతుడు తొలుత పుణ్యమె చేసినవాడు. కావుననే యీ సమయమున ఆస్రవరహి తుడై సుఖవేదనల ననుభవించుచున్నాడు. 2. ప్రాణియొక్క సుఖదుఃఖములకు ఈశ్వర నియతియె హేతువైనచో తథాగతుడు సౌజన్యమైన ఈశ్వర నియతి గలవాడు. 3. భవివతవ్యతయె (భాగ్యము) కారణమైనచో తథాగతుని భవితవ్యత ఉత్తమమైనది.

4. అభిజాతియె కారణమైనచో తథాగతుడు త్తమమగు అభిజాతిగలవాడు. 5. ఈ జన్మమునందలి ఉపక్రమమె కారణమైనచో తథాగతుని ఉపక్రమము సుందరమైనది. 6. సుఖదుఃఖములకు పూర్వకృతకర్మములె కారణమైనను కాకున్నను తథాగతుడు ప్రశంసనీయుడు. 7. ఈశ్వరనియతియె కారణమైనను కాకున్నను తథాగతుడు ప్రశంసనీయుడు. 8. భవితవ్యత కారణమైనను కాకున్నను తథాగతుడు ప్రశంసనీయుడు. 9. అభిజాతి కారణమైనను కాకున్నను తథాగతుడు ప్రశంస నీయుడు. 10. ఈ జన్మమునందలి ఉపక్రమమె కారణమైనను కాకున్నను తథాగ తుడు ప్రశంసనీయుడు. ఈ సిద్ధాంతము తథాగతునకు సమ్మతము.''

భగవంతుని మాటల కెంతయు నలరి భిక్షుసంఘ మతని నభినందించినది.

## ౪

## కేశపుత్రీయసూత్రము, పూర్వారామమున ప్రథమవర్షావా సము, ఆలవకసూత్రము (వి. పూ. 450 - 449)

★ భగవంతుడు బుద్ధుడు కోసలమునందు పాదచర్య నొనర్చుకొనుచు నొకప్పుడు మహాభిక్షుసంఘముతో కూడి కాలాము లనెడి క్షత్రియజాతులకు నెలవైయుండిన కేశపుత్రమను నిగమమును (పెద్ద గ్రామమును) ప్రవేశించెను.

బుద్ధభగవంతుని విశ్రుతకీర్తిని వివిధభంగుల వినియున్న వారగుటబట్టి అమ్మ హానుభావుడు తమ గ్రామమున కరుదెంచియుండుట యెఱింగి దర్శించు కుతూహల మున కేశపుత్రీయకాలాములు ప్రోవై యాతనికడ కేగుదెంచిరి. కొందఱు అభివాద నము జేసిరి. కొందఱు సమ్మోదన మొనర్చిరి. కొందఱూరక చేతులు మోడ్చి కూర్చొనిరి. ఇట్లందఱును సుఖముగ నుపవిష్టులై శ్రమణగౌతమునితో నిట్లనిరి.

''భంతే! పలువురు శ్రమణ బ్రాహ్మణులు మా కేశపుత్ర గ్రామమునకు విటివిగ వచ్చుచుందురు. ప్రతివాడును తమమతమె సర్వోత్తమమని ప్రకటించును. ఇతరసంప్ర దాయములను నిందించును. మేము దేనిని నమ్ముదుము? దేనిని వదలుదుము? ఎవ్వని మాట నిజము? ఎవనిమాటకల్ల? ఈ సందేహము మమ్ము పీడించుచున్నది.''

''కాలాములారా! మీ సందేహము సముచితమైనదే. తగిన చోటనే మీకు సందియము కలిగినది. నాయనా! వినుడు. ఇది చిరశ్రుతమని, ఇది పరంపరాపద్ధతి

---

★ అ. ని. 3 - 7 - 5

యని, ఇది సంప్రదాయనియమమని, ఇది యిట్టిదెయని, ఇది శాస్త్రానుకూలమని, ఇది తర్కయుక్తమని, ఇది న్యాయహేతువని, ఇది మహాఘనుడగువక్త చెప్పిన మాట యని, ఇది చిరకాలమునుండి బహుజనమాన్యమని, ఇది మా గురువు చెప్పినదని ఏ వాదమును మీరు నమ్మకుడు. కాలాములారా! తెలివితో యోచించండి. ఏది అకుశలమో, ఏది సదోషమో, ఏది ఆర్యనిందితమో, ఎద్దాని నాశ్రయించిన - దేనిని గ్రహించిన దుఃఖశోకములందు పడింబది దురపిల్ల వలసియుండునో ఆ వాదమును - ఆ ధర్మమును మీరు సుతరాం పరిత్యజించవలెను. మఱియు వినుడు. పురుషునకు లోపలకలిగెడి లోభము, హితమును చెందించునా? అహితమును పొందించునా? చెప్పుడు.''

''భంతే! అహితమునే పొందించును.''

''కాలాములారా! లోభమునకులొంగిన పురుషుడు ప్రాణుల జంపుచు న్నాడు. పరస్త్రీలను పొందుచున్నాడు. ముచ్చిలించుచున్నాడు. కల్లలాడుచున్నాడు. పరులకూడ అట్లె ప్రేరేపించుచున్నాడు. ఈ నడత వానికి కడ లేని దుఃఖములకు కారణముగాదా?''

''భగవంతా! అవును.''

''కాలాములారా! పురుషునకు లోపలకలిగెడి ద్వేషము, వానికి హితము నాపాదించునా? అహితమును కల్గించునా?''

''భంతే! అహితమునె కల్గించును.''

''కాలాములారా! ద్వేషయుక్తుడగు పురుషుడు ప్రాణులను జంపుచున్నాడు. పరస్త్రీలను పొందుచున్నాడు. ముచ్చిలించుచున్నాడు. కల్లలాడుచున్నాడు. పరులనుకూడ ప్రేరేపించుచున్నాడు. ఆ నడవడి వానికి కడ లేనిదుఃఖములకు కారణ ముకాదా?''

''భగవంతా! అవును.''

''కాలాములారా! మోహము హితమునకా? అహితమునకా?''

''భంతే! అహితమునకే.''

''కాలాములారా! కడలేనిదుఃఖములకు కారణముకాదా?''

''భగవంతా! అవును.''

''అటులైన కాలాములారా! అట్టిధర్మము కుశలమా? అకుశలమా? సావద్యమా? నిరవద్యమా? ఆర్యనింద్యమా? ఆర్యవంద్యమా? మీరే చెప్పుడు.''

''దేవా! అది అకుశలము; సావద్యము; ఆర్యనింద్యమును కూడ.''

''కావుననే, కాలాములారా! ఏ వాదమునైనను, ఏ ధర్మమునైనను గ్రుడ్డిగ అనుకరించకుడని చెప్పితిని. మీరంతకు మీరు పరిపరి విధముల ప్రస్తావించుకొని 'ఇది కుశలధర్మము. ఇది అనవద్యమైనది. ఇది ఆర్యప్రశంసితము. ఇది హితమునకు చక్కనిజాడ' అని గుర్తించి అనుసరించి విహరించండి.

కాలాములారా! లోభ ద్వేష మోహములు దొలగినచో హితము పురుషునకు అఱచేతి నిమ్మపండు. అట్టి ఆర్యశ్రావకుడు స్మృతి సంప్రజన్యములతో కూడి మైత్రీ యుక్త చిత్తమున – కరుణాయుక్తచిత్తమున – ముదితాయుక్తచిత్తమున – ఉపేక్షా యుక్తచిత్తమున దశదిశలను దనుపుచు విహరించుచున్నాడు. వానికీవర్తమాన జన్మముననే నాలుగు ఆశ్వాసనములు (ఊఱటలు) లభించుచున్నవి. 1. పరలోకమనున దుండి పుణ్యపాపకర్మముల ఫలమును అందనుభవింపవలసియె యున్నచో దేహము వదలిన పిదప నాకు సుగతియె నిక్కువము. ఇది మొదటి యూఱట. 2. పరలోకము లేకున్న ఈ లోకమున నీజన్మమందే ప్రశాంతచిత్తమున పుణ్యచిత్తమున సుఖముగ విహరింతును. ఇంతియేచాలు. ఇది రెండవఊఱట. 3. నే నెవ్వనికిని చెడ్డ తలంచనివాడను గాన నా చేయు పనులయం దవశముగ పాపము దొర్లినచో అది దుఃఖము నివ్వజాలదు. ఇది మూడవ ఊఱట. 4. నేను చేయు పనులలో పాపమె లేకున్నచో ఈ సమయముననే రెండింట విముక్తునిగ నన్ను జూచుచున్నాను. ఇది నాల్గవయూఱట. ఓ కాలాములారా! ఆర్యశ్రావకు డిట్లు నాలుగాశ్వాసనములను (ఊఱటలను) ఈ జన్మమునందే పొందుచున్నాడు.''

అని యిట్లు తథాగతు డానతిచ్చిన విని కేశపుత్రియ కాలాములు ప్రముదితహృద యులై ''భగవంతా! నిజము. నిజము. భంతే! ఆశ్చర్యమాశ్చర్యము. నేటి నుండి మమ్ము సాంజలి శరణాగత ఉపాసకులనుగ అనుగ్రహించండి.'' అని వేడికొనిరి.

## పూర్వారామములో వర్షావాసము

★ భగవంతుడు తొమ్మిదినెలలు చారికయొనర్చి తిరిగి శ్రావస్తికి వచ్చెను. విశాఖ తలపెట్టిన ఆరామనిర్మాణము యీ తొమ్మిది నెలలలో ముగిసినది. సుగత

★ ధమ్మపదము. అ. క. 4 – 4

దేవు డరుదెంచుచున్నాడని విని విశాఖ యెదురుబోయి అమ్మహానుభావుని తాను నిర్మించిన విహారములోనికి గొనిచని "ప్రభూ! ఈ చాతుర్మాస్యలయందు భిక్షుసంఘ సహితముగ తామీ చోటనె నివసించునది. నేనీ ప్రాసాదముయొక్క ప్రవేశోత్సవము జరిపించెదను" అని ప్రార్థించెను. అందుకు బుద్ధచంద్రు డంగీకరించెను. ఆనాటి నుండి విశాఖ బుద్ధప్రముఖ భిక్షుసంఘమునకు విహారమునందే భిక్షాదానము జేయు చువచ్చినది. ఒకనాడా మెయొక్క ప్రియసఖియగు నొకకాంత సహస్రమూల్యముగల కంబళము నొకదానిని తీసి కొనివచ్చి విశాఖతో నిట్లనియె. "చెలీ! ఇదియె యీ వస్త్రమును నీవు కట్టించిన మేడయందేచోటనైన క్రింద పఱిపించవలెను. దీనిని యేచోట వేయవలెనో తెల్పవలసినది."

"సహాయికా! నేనేమని జెప్పుదును? అవకాశము లేదనినచో నీమదికి కొతుకు గలుగును. నీవేబోయి ఆ ప్రాసాదములో రిక్తస్థానము – వట్టితావు యెచ్చట నున్న అచ్చట దీనిని పఱువుము.

ఆమెయు వల్లెయని విహారమునకు పోయినది. రెండంతస్తులలోను వేయి గదుల లోను యెక్కడగూడ 'ఖాళీజాగా' లేదు. తాను తీసికొని వెళ్ళిన సహస్రమూ ల్యమగు రత్నకంబళమునకు తక్కువ వెలగల దొక్కటియు నక్కడ లేదు. తానాపుణ్య మునకు నోచనైతినే యని ఆమె యొకచో నొదిగి విలపించుచుండెను. ఆనందుడా విషయమును సాంతముగ నాలకించి "అమ్మా! చింతింపకుము. యిటురమ్ము. నీకు దగిన తావును జూపింతును"ని ఆమెను ఓదార్చి కొంపోయెను. సోపానముల కును పాదప్రక్షాళన స్థానమునకును మధ్య, భిక్షువులు కాళ్లుకడిగికొనినంతట తడి తుడిచికొనుట కుపయోగించునట్లు ఆ వస్త్రమును పఱిపించెను. విశాఖతలంపుకు తట్టియుండని తావును ఆయమకు జూపించి ఆనందస్థవిరుడు "అమ్మా! విహారము లోనికి ప్రవేశించుటకు ముందుముందె భిక్షువులు తమ పాదస్పర్శచేత నీ దానమును కృతార్థము గావింతురుగదా" యని ఆమెను సంతుష్టహృదయను గావించెను. విశా ఖాదేవి విహారమునందలి బుద్ధప్రముఖ భిక్షుసంఘమునకు నాలుగు నెలలును తానె భోజనమర్పించినది. చివరిదినమున సంఘమున కంతటికిని వస్త్రములను – శాటీ లను దాన మొసగినది. ఆ వస్త్రములలో సహస్రమూల్యమునకు తక్కువ యొక్కటి యులేదు. ఇట్లు భిక్షుసంఘమును సత్కరించి తొమ్మిదికోట్లు వెచ్చించినది. భూమిని కొనుటకు తొమ్మిదికోట్లు, విహారనిర్మాణమునకు తొమ్మిదికోట్లు, ప్రవేశోత్సవము నకు తొమ్మికోట్లు వెరసి యిరువదియేడుకోట్లు విశాఖ బుద్ధశాసనమందు దానము జేసినది. స్త్రీయేయగుగాక. ఔరా! దాతృత్వమునకు ఎంతటి ఉజ్జ్వల నిదర్శనము.

## ఆలవక సూత్రము

★ భగవంతుడు ఆలవియందు గోమార్గములో శింశుపావనమున పత్ర శయ్యపై విహరించుచుండెను. ఆ సమయమున హస్తక – ఆలవకుడనువాడు వాహ్యాళికై బయటవచ్చి ఆకులను పఱచికొని దానిపై కూర్చొనియున్న బుద్ధదేవుని దర్శించెను. దగ్గఱబోయి అభివాదనముజేసి యొకచో గూర్చొని యిట్లనెను.

''దేవా! సుఖముగ నిద్రించితిరా?''

''కుమారా! సుఖముగ నిద్రించువారలలో నే నొకడను. సుఖముగ నిద్రించితిని.''

''భగవంతా! మంచురాలెడి రోజులు. ఆవులు త్రొక్కి గతుకులు గతుకులైన (గోకంటకహతము) నేల. పత్రశయ్య పలుచనిది. చలువ కలిగించు కావిగుడ్డలు, ఈదరగాలి. మరి మీరు సుఖముగ నిద్రించితినని చెప్పుదురు.

''కుమారా! ఒకమాట వినుము. అలికిపూసిన, గాలిజొఱని సుందర గృహమునందు కోమలశయ్యపై పరుండి భార్యలచే సేవింపబడు గృహపతి కుమారుడు సుఖముగ నిద్రింపగలడో? లేడో? చెప్పుము.''

''భంతే! సుఖనిద్ర పొందువారిలో వాడొకడు – సుఖముగనె నిద్రించును.''

''కుమారా! ఆ గృహపతిపుత్రుడు రాగద్వేష మోహతాపములచే కాయిక మానసిక వేదన యేర్పడినపుడు సుఖముగ నిద్రింప గలడా?''

''భంతే! లేదు. దుఃఖముతో గూడినవాడై నిద్రించును.''

''కుమారా! తథాగతునకు ఆ రాగద్వేషమోహతాపములు కూడ తలగూలిన తాడివలె సమూలము నశించినవి. అతని సుఖము నిష్కంటకము. హాయిగ నిద్రించును.

*క॥ చల్లనివాడు; ఉపాధుల, నొల్లనివాడిచ్ఛలకును నొగిదూరంబై*
*వెళ్లినవాడభయపదుడు, యెల్లప్పుడు సుఖముగాశయించు కుమారా॥*

---

★ అ. ని. 3 – 4 – 5

ॐ

## రాష్ట్రపాల సూత్రము (వి. పూ. 449)

★ భగవంతుడు బుద్ధుడు ఒకానొక సమయమున కురుదేశమునందు మహా భిక్షుసంఘముతో కూడి చారికనొనర్చుచు కురుజాతికి ఉనికిపట్టగు స్థూలకోష్ఠిత మను గ్రామమునకు చేరుకొనెను.

ఆ గ్రామనివాసులగు బ్రాహ్మణగృహపతులు తమయూరికి శాక్యపుత్రుడు శ్రమణగౌతముడు వచ్చి విహరించుచున్నాడనియు అట్టి అర్హత మహాపురుషుల సందర్శనమెంతయు శ్రేయోదాయకమనియు తలంచి ఆ భగవానుడున్నెడకుపోయి కొందరు అభివాదనములు జేసియు, కొందఱు కుశలప్రశ్నలాడియు, కొందఱూ అకయునునై అందందు ఉపవిష్టులైరి. ఆ స్థూలకోష్ఠితగ్రామనివాసులగు బ్రాహ్మణ గృహపతులను భగవంతుడు ధార్మికోపదేశములచే సందర్శితులను, సముత్తేజితు లను, సంప్రశంసితులనుగ జేసెను.

అదేగ్రామమున నివసించువాడును అగ్రకులసంజాతుడునునగు రాష్ట్ర పాలుడను వాడా సభలో కూర్చొనియుండి భగవంతుడుపదేశించు ధర్మములను దత్తచిత్తమున నాలకించి తనలో నిట్లు తలంచెను. ''ఇమ్మహానుభావుడుపదేశించు ప్రభావోపేతమగు బ్రహ్మచర్యపాలనము గృహమున కాపురము జేయువారికి సులభమై నది గాదు. నేను తలను గడ్డమును గొఱిగించుకొని కావిగుడ్డల గట్టికొని యింటిని వదలి ప్రవ్రజించెదను.''

రాష్ట్రపాలు డిట్లాలోచించుచుండగనె ప్రసంగము ముగిసినది. సభికులంద ఱును శాస్తకు నమస్కరించి తమతమ నెలవులకు బోయిరి. రాష్ట్రపాల కులపుత్రుడు బుద్ధదేవుని సమీపించి యిట్లనియె.

''ప్రభూ! తాముపదేశించు బ్రహ్మచర్యపాలనము గృహవాసులకు సుకరము గాదు. అందుచే దేవరవారివద్ద ప్రవ్రజ్య నభిలషించుచున్నాను.''

''రాష్ట్రపాలా! నీ తలిదండ్రులచే అనుజ్ఞను బొందితివా?''

''దేవా! లేదు.''

---

★ మ. ని. 2 - 4 - 2

''రాష్ట్రపాలా! తలిదండ్రులవద్ద ఆజ్ఞనుబొందని కుమారులకు తథాగతుడు సంన్యాస మివ్వబోడు.''

''భంతే! అట్లే యనుజ్ఞ గొనివత్తును.''

అని పలికి రాష్ట్రపాలుడు ఆసనమునుండి లేచి భగవంతునకు అభివాదన మొనర్చి తలిదండ్రుల కడ కరిగి యిట్లనియె. ''పితరులారా! బుద్ధభగవంతుని ధర్మో పదేశమును విని సంన్యసింపవలెనని కుతూహలముప్పతిల్లినది. ఆ ధర్మము గృహము లందుండి నెరవేర్ప వీలుగానిది. ప్రవ్రజించుటకు నాకు మీరనుజ్ఞ నివ్వవలెను.''

''కుమారా! ఇది యేటిమాట? మా ప్రాణములే నీవు గదా? అయ్యో! కడ గండ్లనునవి కలలో గూడ నెఱుగని సుకుమారుడవు నీవు సంన్యసించి మా బొందిలో ప్రాణము లుండగనె యిల్లు వదలి పోయెదవా!''

ఎంతెంత జెప్పినను తలిదండ్రులు వినలేదు. కుమారుడును వారి యనుమతిని పొందలేనైతినేయని తీవ్ర విచారముతో 'విజయమో – వీరస్వర్గమో' కానిమ్మని ప్రాయోప వేశదీక్షను బూని ఆహారపానములను విసర్జించెను. ఒక దినము గడచినది. రెండునాళ్ళు పోయినవి. మూడవరోజును దాటినది. వారము తిరిగి వచ్చినది.

రాష్ట్రపాలునకు మిత్రుడొకడు గలడు. ఈ వ్యవహారమంతయు నతడు జూచి రాష్ట్రపాలకుమారుని చెంత కరిగి యెంతెంత బ్రార్థించియు నతని మెత్తబఱుపలేక ముదుసళ్ళుదగ్గఱకు వోయి యిట్లనియె.

''ఓ పెద్దలారా! ఇక మీ పట్టుపైన మీరు గట్టిగ నిలిచినచో నిక్కముగ కుమా రుని కోల్పోగలరు. సంన్యసించిన గూడ ఎడపదడప చూచుటకు వీలుండును. చచ్చిన మటేమి జూచెదరు? నా మాటను పాటించి వాని ప్రవ్రజ్యకు సమ్మతింపుడు.''

అనిర్వాహపక్ష మగుటబట్టి యెట్టకేలకు సమ్మతించి వారిట్లనిరి. ''నాయనా! యింటి కంతటికిని ఆ ఒక్కదీపమెగదా? కానిమ్ము. సంన్యసించిన మీదట అపుడపుడు కన్నుల కగపడుచుండునట్లు చెప్పుము.''

తల్లిదండ్రుల యనుమతిని సంపాదించి కొన్నాళ్ళకు దేహమున బలమును చేకూర్చుకొని రాష్ట్రపాలుడు భగవంతుని వద్దకు పోయి ''దేవా! ప్రవ్రజనమునకు నా తలిదండ్రు లనుమతించినారు. దయయుంచి ప్రవ్రజ్య నొసంగుడ''ని మనవి జేసెను.

ఈ విధమున రాష్ట్రపాలుడు భగవంతుని వద్ద ప్రవ్రజ్యను, ఉపసంపదను పొందగలిగెను. రాష్ట్రపాలు డుపసంపన్నుడైన పదునేనవ దినము తథాగతుడు స్థూలకోష్ఠిత నిగమమును వీడి క్రమముగ యాత్ర నొనర్చుకొనుచు శ్రావస్తీనగరము జేరి అనాథపిండకుని జేతవనారామమున విహరించుచుండెను.

అంతట ఆయుష్మంతుడు రాష్ట్రపాలుడు ఆత్మసంయమియై పదిరెండేండ్లు విహరించి, కులపుత్రులు దేనికొఱకు యిండ్లను వదలి ప్రవ్రజించుచున్నారో అట్టి సర్వోత్తమ బ్రహ్మచర్య ఫలమును ఆ జన్మమందె పొంది యథేచ్ఛ విహరింప జొచ్చెను. వానికి జన్మబంధము లూడినవి. బ్రహ్మచర్యఫలము పండినది. కృతకృత్యుడైనాడు. కరణీయములు ముగిసినవి. ఈ విధమున రాష్ట్రపాలుడు అర్హతులలో నొకడయ్యెను.

''భగవంతా! తలిదండ్రుల చూచి రావలెనని కోరిక వొడమినది.'' అని యొక నాడు రాష్ట్రపాల కులపుత్రుడు సుగతదేవుని యాచించెను. ఇత డెట్టి పరిస్థితులలో గూడ భిక్షు శిక్షను వదలి గృహస్థుడు కాబోడని శిష్యుని సేవను గ్రహించిన వాడ గుటబట్టి అమ్మహాను భావుడు సమ్మతి నొసగెను.

అది స్థూలకోష్ఠిత మను గ్రామము. ఆయుష్మంతుడు రాష్ట్రపాలుడు రాజగు కౌరవ్యుని ఉద్యానవనమైన మృగాచీరమున విడిసి విహరించుచున్నాడు. ఒకనాడు పూర్వాహ్ణ సమయమున పాత్రచీవరములను గొని గ్రామములోనికి భిక్షాచారమునకై రాష్ట్రపాలుడు ప్రవేశించెను. ఆదాటున తండ్రి యిల్లె యెదుట బడినది. జనకుడును మొగసాల నిలువబడియుండి భిక్షు వేషముననుండు సుతుని గుర్తింప లేక యెవ్వడో పెఱవాడనుకొని ''ఇట్టి సంన్యాసులే నా యేకైక పుత్రుని యింటినుండి యెడబాపిరి'' ని బిగ్గఱగ నాక్రోశించెను. తండ్రి శ్రమణ భిక్షువుల నాక్షేపించుట సహింపజాలక కుమారుడు దూరదూరముననె యుండెను. అంతలో ఆ యింటపనిచేయు దాసి యొకతె పాసినకూరను పాఱయవేయుటకు లోపలనుండి బైటికివచ్చినది. రాష్ట్రపాలుడది చూచి ''అమ్మా! ఆ పదార్థము మీకు వర్జింపదగినదైనచో ఈ నా పాత్రలో వేయుము''నెను. ఆ పనికత్తెయు దాని నతని పాత్రలో వేయుచు ఆయా కళవళికలను, ఆయా ఆనవాళ్లను పరికించి చూచి గుఱుతుపట్టి ఆతని తల్లివద్దకు బోయి యిట్లనెను.

''అమ్మా! ఆర్యపుత్రుడు రాష్ట్రపాలుడు వచ్చినాడు. మీ రెఱుగుదురా?''

''ఏమే! నిజము చెప్పుచున్నావా? అటులైన నిన్ను యీ దాసీ వృత్తినుండి విముక్తి నొందింతును.''

అని పలికి గృహిణి గృహపతి చెంగట కరిగి యిట్లనెను.

''గృహపతీ! కుమారుడు రాష్ట్రపాలుడు వచ్చియున్నాడట. నీకు తెలియునా?''

''సతీ! నే నెఱుగను. వాడెందున్నాడో అటుచూడుమ'' ని పలుకుచున్నంత రాష్ట్రపాలుడును ఆ పాసిన తిండిని ఒక గోడ మరుగున కూర్చొని తినుచుండెను. తండ్రి కుమారుని చెంతకరిగి యిట్లనియె. ''నాయనా! రాష్ట్రపాలా! ఈ పాడుకూటి నెందుకు తినెదవు? యింటికి పోదము రమ్ము.''

''గృహపతీ! సంన్యాసులకు యిల్లెక్కడిది?''

''కుమారా! రారమ్మ'' ని గృహపతి సుతుని రెట్టపట్టుకొని యింటికి గొంపోయి భోజనమును చేయమనెను. నాటి భోజనమైనదని కుమారుని ప్రతివచనము. జనకుడు మఱునాటి భోజనమునకు నిమంత్రించెను. సుతు డంగీకరించి తన నెలవును జేరుకొనెను.

మఱునాడు రాష్ట్రపాలుని తండ్రి పెక్కుభంగుల ఖాద్యభోజ్యముల నాయిత్త పఱచి యింటియందొకచోట బంగారుకాసుల నొకరాశి బోయించి, బంగారము నొకగుట్ట వేయించి రెంటిని చాపలతో మూయించి మధ్య నొక ఆసనమును బఱిపించి కోడండ్రను పిలిచి యిట్లనియె.

''బిడ్డలారా! వెనుకటిదినములందు రాష్ట్రపాల కులపుత్రుని యిష్టమునకు సూటియైన అలంకారము లెట్టివో వాటినీనాడు బూన్చుకొనుడు.''

వారును అట్లె జేసిరి. ఆయుష్మంతుడు రాష్ట్రపాలుడు పూర్వాహ్ణసమయమ గుడు పాత్రచీవరములను ధరించివచ్చి పఱిచిన ఆసనముపై గూర్చొనెను. తండ్రియు ధనరాశు లపైని ముసుగులు దీయించి కుమారునకు జూపించి యిట్లనియె.

''నాయనా! ఈ ద్రవ్యమంతయు మీ తల్లిది. ఇక పితృపితామహుల ఆస్తి వేఱుగ నున్నది. గృహమేధి సుఖములను బొందవచ్చును. సుకృతముల నార్జింప వచ్చును. కుమారా! నీవును గృహస్థుడవు కారాదా?''

''తండ్రీ! నేనొల్లను. కోరికోరి బ్రహ్మచర్యపాలనమునకు కడంగినాను. ఇంకను మీరు నా మాటను వినగల్గుచో యీ ధనమంతయు గంగాప్రవాహమున దొర్లించుడు. అనర్థములన్నియు తొలగగలవు.''

అని యిట్లు పలుకుచున్న రాష్ట్రపాలునివద్దకు అతని భార్యలొక్కొక్కరు వచ్చి పాదములపైబడి యిట్లనిరి.

''ఆర్యపుత్రా! తాము చేయు తపస్సుకు లభించు ఆ అప్సరసలెట్టివారు?''

''చెల్లెలా! నేను తపస్సును చేయుట అప్సరసలను కోరిగాదు.''

''చెల్లెలా'' అనుపలుకు ములుకై తాకుటచే వారు సొమ్మసిల్లి పోయిరి. రాష్ట్ర పాలుడు తండ్రినిజూచి ''గృహపతీ! సిలుగు లెందుకు బెట్టెదవు? కలిగినచో భోజనము పెట్టి పంపుము''నెను. అంతట చేచేతుల జనకు డుత్తమ భోజ్యములను వడ్డింప ఆయుష్మంతుడు రాష్ట్రపాలుడు తనివిదీఱ భుజించి చేతులు కడుగుకొని లేచి నిలుచుండి యీ క్రింది గీతములను బాడెను.

*తే గీ॥ వ్రణమయంబును ఆతురంబైన దీని । యెవడురా జేసినాడు విచిత్రముగను*
*యెముకల సిటారి దీనికెన్నెన్నొ నగలు । వట్టువలువల నటునిటు జుట్టినారు.*
*మూర్ఖమానవుడిందులో మునిగి జచ్చు । కాని తత్త్వజ్ఞుడిసుమంత కదలబోడు*
*ఓ కిరాతక । వలపన్ని యుంటివయ్య । చిక్కబోదీ మృగంబేల చింతనీకు.*

అనియిట్లీ గీతములనుచ్చరించి రాష్ట్రపాలుడు కౌరవ్యుని ఉపవనమగు మృగాచీరమునకరిగెను. అందొక చెట్టునీడలో విశ్రాంతిగ కూర్చొనెను.

ఆయుష్మంతుడు రాష్ట్రపాలుడు ఒకానొక వృక్షమూలమున ఆసనబద్ధుడై యున్నాడనువార్త రాజగు కౌరవ్యుడు ఉద్యానపాలుని వలనవిని, యిదివఱకె అతని సౌశీల్యవిషయమున ముగ్ధుడైయున్న వాడు కాబట్టి సందర్శన కుతూహలముడెందమున దందడింప ఉచితయానమును సమకట్టబంపి పరిచరగణములు తోడ్తో గ్రక్కదల రాజ ఠీవితో స్థూలకోష్ఠితమునుండి బహిర్గమించెను. పోదగియున్నంత దూరము రథముపైబోయి పదంపడి తేరుడిగి కాలినడకన రాష్ట్రపాలుని సమీపించి సంమోదన మొనర్చి యొక్కెడ గూర్చొని యిట్లనెను.

''రాష్ట్రపాలా! లోకమునందు పలువురు జరాప్రాప్తి – వ్యాధి పీడ – భోగహాని – జ్ఞాతిక్షయమనెడి నాలుగువిధములగు ఉపద్రవములకు లోనై తలలు గొరిగించుకొని కావిబట్టలు కట్టి యిల్లువాకిండ్లు వదలి ప్రవ్రజించుచున్నారు. అందు మొదటిదగు జరాప్రాప్తిచే పురుషుడు దేహపటుత్వముతగ్గి యింద్రియపాటవము చెడి 'ఇక నేను క్రొత్త భోగములను ఆర్జించ లేను. ఉన్నవి అనుభవించలేను. ఈ తరుణమున నేను సంన్యాసమును గైకొనుటయు లెస్స' యని వాడు భావించుచున్నాడు.

రాష్ట్రపాలా! నీవు నడివయస్సువానివి. వెంట్రుకలు నరయలేదు. పండ్లూడిపోలేదు. ఏమి విని, ఏమిగని, ఏమిదెలిసి సంన్యసించి తివి? 2. రెండవదియగు వ్యాధిపీడచే మానవుడు అవయవములు జీర్ణంప దుర్బలుడై 'నేనిక క్రొత్తభోగముల నార్జింపలేను. ఉన్నవి అనుభవింపలేను. ఇప్పొట నేను సంన్యాసమును గొనుటయు బాగు' అని వాడు తలంచుచున్నాడు. రాష్ట్రపాలా! నీవో హృష్టపుష్టాంగుడవు. రోగము రొష్టు లేదు. దేనిని తెలిసి, యేమిగని, యెద్దానిని విని సంన్యసించితివి? 3. మూడవదియగు భోగహానిచే మనుజుడు వ్యాకులుడై 'నా సంపదలు దొలగినవి. భోగములు క్షయించి నవి. దరిద్రుడనైతిని. ఈ సమయమున సంన్యాసినగుట యుక్తియుక్తమని' చింతించు చున్నాడు. రాష్ట్రపాలా! నీ కట్టి భోగహాని లేదు. సంపన్న కులజుడవు. నాల్గవదియగు జ్ఞాతిక్షయమునకు పాల్పడిన నరుడు సంబంధబాంధవులందఱును ప్రమందుడు కొందలమంది 'అయ్యో! నా చుట్టపక్కములు, మిత్రబాంధవులు, యెక్కడివారక్కడ సమసిరి. ఏకాకినైతిని. ఇట్టి యెడ భిక్షుదీక్షను గొనుటయ యోగ్యము' ని నిశ్చయిం చును. రాష్ట్రపాలా! నీకా దురవస్థ లేదు. ఏమి కని విని తెలిసి నీవు ప్రవ్రజించితివి?

అని కౌరవ్యు డడుగ ఆయుష్మంతుడు రాష్ట్రపాలు డిట్లనియె. ''మహారాజా! సర్వజ్ఞుడు సర్వవేత్త సమ్యక్ సంబుద్ధుడు మా భగవంతుడు ధర్మోద్దేశములని నాల్గింటిని చెప్పుచున్నాడు. వాటిని విని వాని నెఱింగి వాటిజూచి కులపుత్రులు గృహ ములను వదలి ప్రవ్రజితులగుచున్నారు. ఆ నాల్గింటిని చెప్పెదను వినుము. 1. ఈ లోకము నిలుకడ లేనిది. దినదినము జాఱిపోవుచున్నది. ఇది మొదటిది. 2. ప్రపంచము పరిత్రాణరహితము. ఆశ్వాసనశూన్యము. ఆదుకొనువారులేరు. ఇది రెండవది. 3. జగత్తు తనది కాదు. అన్నిటిని వీడిపోవలసియేయుండును. ఇది మూడ వది. 4. విశ్వమసంపూర్ణము. సర్వులును ఆశకు దాసులు. ఇది నాల్గవది. ఇట్లు ధర్మోద్దేశములను నాల్గింటిని భగవంతుడాదేశించి నాడు. వాటిని విని కని తెలిసికొని కులపుత్రులు ప్రవ్రజించుచున్నారు.''

''రాష్ట్రపాలా! లోకము నిలుకడ లేనిది. దినదినము జాఱిపోవుచున్నదని చెప్పిన మాట కర్థమేమి?''

''మహారాజా! వినుము. ఇర్వదియేండ్లనుండి యేబదియేండ్లవఱకు నీ వయస్సును జ్ఞప్తి చేసుకొనుము. యుద్ధములందు పోటర్వై, యేనుగును గుఱ్ఱమును రథమును యెక్కి నడపుటయందు సమర్థుడవై వివిధాయుధ విద్యలందు విశారదుడవై సరిసాటి లేక యుంటివిగదా? నేడెట్లున్నావు?''

''రాష్ట్రపాలా! నే నిపుడెనుబదియేండ్లవాడను. జీర్ణవృద్ధుడను. అనుకొన్న చోట అడుగిడలేను. నాటికి నేటికి యెక్కడెక్కడ?''

''మహారాజా! అందుననే లోకము నిలుకడ లేనిది. దినదినము జాఱిపోవుచున్నదని భగవంతుడు చెప్పుచున్నాడు.''

''రాష్ట్రపాలా! ప్రపంచము పరిత్రాణరహితము. ఆశ్వాసనశూన్యము. ఆదుకొనువారు లేరంటివి. మాకు యేనుగులున్నవి. గుఱ్ఱములున్నవి. బలమున్నది. చలమున్నది. మరి నీ మాట కర్థమేమి?''

''మహారాజా! నీకు సహజముగ నేదైన రోగమున్నదా!''

''ఆయుష్మంతా! వాయురోగమున్నది. ఒక్కొకప్పుడు దానిచే పీడితుడనై యుండువేళ మిత్రామాత్య బంధుపరిజనులు నన్ను చుట్టుముట్టి రాజు మరణించును మరణించునని వాపోవువారు.''

''మహారాజా! తలకొక యింత పంచియివ్వగూడదా? నీకు తేలికయగును కదా?''

''రాష్ట్రపాలా! ఆబాధయంతయు నాపాలే.''

''భూపాలా! ప్రపంచము పరిత్రాణరహితము. ఆదుకొనువారు లేరనిన భగవంతుని పలుకు అర్థమైనదా?''

''రాష్ట్రపాలా! అద్భుతమద్భుతము. తర్వాత జెప్పుము.''

''నరేంద్రా! నీవిప్పుడు పంచకామగుణములతో విహరించుచున్నావుగదా? ఈ భోగములను రాబోవు జన్మములకు గొంపోగలవా?''

''రాష్ట్రపాలా! అదెట్లు సాధ్యమగును? ఇవి యిందె రాలి పోవును. నేను నా కర్మానుసారమున పోయెదను.''

''మహారాజా! దీని నాలోచించియే 'జగత్తు తనదిగాదు. అన్నింటిని వీడిపోవలసియె యుండును' ని భగవంతు డుపదేశించినాడు.''

''రాష్ట్రపాలా! ఆశ్చర్యమాశ్చర్యము.''

''మహీపాలా! మఱియొకటి. నీకు విశ్వాసపాత్రుడగు చారుడొకడు చను దెంచి నిన్ను జూచి 'రాజేంద్రా! నేనిప్పుడె తూర్పుదిక్కునుండి వచ్చితిని. అందు

ధనధాన్య స మృద్ధములు. బహుజనాకీర్ణములు రథగజతురగపదాతి సంయుతములు నగు దేశము లనేకము గలవు. బంగారమును వెండియు కుప్పలు గూరలు. అక్కడి అంగనలు బంగారుచుక్కలు.' అనిచెప్పినచో నీవేమి జేతువు?''

''సేనలను విడిపించి దండెత్తి వాటిని లోబఱచుకొందును.''

''రాజా! మఱియొకడు దక్షిణదిశనుండి వచ్చి అట్లే చెప్పినచో''

''రాష్ట్రపాలా! దండెత్తిపోయి వశము చేసికొందును.''

''నరపాలా! వేఱొకడు పడమరదిశనుండివచ్చి చెప్పినచో -''

''రాష్ట్రపాలా! దండెత్తిపోయి జయించి అధికారము చలాయింతును.''

''మహారాజా! కొండొకడు ఉత్తరదిక్కునుండివచ్చి చెప్పినచో''

''ఆయుష్మంతా! అదియు నంతే.''

''మహారాజా! అందుకే ''విశ్వ మసంపూర్ణము. సర్వులును ఆశకు దాసుల'' ని మా బుద్ధభగవంతుడు చెప్పుట, వహవ్వా!''

*''విత్తమోహంబుతో దానమివ్వలేని, ధనికులను లోకమందదెందఱినొ జూతు*
*మరియు మరియు ద్రవ్యమునకై పరువులిడెడి, లోభుల నదెందఱినొగందు లోకమందు.*

*చతురుదధి వేష్టితంబైన సర్వవసుధ, నాక్రమించి దాహముతీఱ కవనివిభుడు*
*ఉదధులకు నావలేమైన యుర్వియున్న. దొక్కొయంచు నువ్విళులూరు చుండు నెపుడు.*

*ప్రభువులేగిరమాత్యులు ప్రళయమైరి, చిన్న పెద్ద సమస్తంబు జీర్ణమయ్యె*
*కటకటా! యెవ్వనికిగాని కామములను, తృప్తి యనునది లోకాన దొరక లేదు.*

*పోయె మావాడు మానాన్న పోయెననుచు మొత్తుకొందురొహో యని మోములెత్తి*
*గుడ్డలంజుట్టి అల్లదే! గొంచుపోయి కాష్టమందిడి దయలేక కాల్చుచుంద్రు.*

*ఉన్నదంతయు దాయాదులూడ్చుకొంద్రు ఓరిజీవుడ! నీది యెడారి దారి*
*దోవ బత్తెంబు కట్టుకొన్నవొ లేదొ చివర నీవెంట రాదొక్క చిల్లిగవ్వ.*

*పండితునిపైన మూర్ఖునిపైన గూడ గాలి సమముగ వీచునొక్కటె విధమున*
*అజ్ఞమనుజుడు గడగడలాడిపోవు, ధీరమానవు డిసుమంత దెరలబోడు.*

*కళకళలు పైన లోలొట్ట కామవితతి విషఫలములుగాయు బెన్వేతలుబెట్టు*
*దినములెన్నియొ దీనిచింతించి మించి మనుజనాయక! శ్రామణ్యమందినాడ.*

# సుందరీసూత్రము, కృశాగౌతమీచరితము, బ్రాహ్మణ ధర్మసూత్రము (వి. పూ. 448 – 447)

★ ఒకప్పుడు భగవంతుడు బుద్ధుడు శ్రావస్తియందు అనాథపిండకుని జేతవనారామమున విహారము చేయుచుండెను. అమ్మహానుభావునియెడను, భిక్షు సంఘమునెడను ప్రజలలో అప్రతిమానమగు భక్తిగౌరవములు – శ్రద్ధాసత్కారములు ప్రబలియుండినవి. తైర్థిక సంఘమువారు దానింజూచి ఓర్వలేక తథాగతుని గౌరవ ప్రతిష్ఠలకు భంగము వాటిల్ల జేయ కృతనిశ్చయులై తమకు పరిచితయైయుండిన సుందరియను పరి వ్రాజకను పిలిపించి యిట్లనిరి.

"చెల్లెలా! జ్ఞాతిబంధువులకు ఉపకారము చేయగలవా?"

"ఆర్యులారా! అది యిది యననేల? ప్రాణములైన నర్పింతును."

"అట్లైన నమ్మా! నిత్యప్రతి – విడువక జేతవనమునకు పోవుచుండుము."

"పూజ్యులారా! మంచిది. అటులనె జేయుదును."

సుందరీపరివ్రాజిక దినదినమును జేతవనమునకు పోయి వచ్చుచుండుట ప్రజాలోకమున చక్కగ వెల్లడియైనది. కొన్నాళ్ళు గడచినంత తైర్థికపరివ్రాజకులా కాంతను చంపించి యెవ్వరెఱుగకుండ జేతవనమునకు సమీపమున నొక గుంట యందు బూడ్పించిరి. మఱునాడు వారు కోసలరాజగు ప్రసేనజిత్తుని చెంతకరిగి యిట్లనిరి.

"మహారాజా! సుందరీపరివ్రాజిక కానవచ్చుట లేదు."

"తైర్థికులారా! మీకెక్కడ సందేహము?"

"మహారాజా! జేతవనమునందు."

"అట్లైన అందె వెదకింపుడు."

తైర్థికపరివ్రాజకులు జేతవనమున వెదకించినట్లు నాటకమును పన్ని అగడ్తలో బూడ్చిన మృతకళేబరమును బైటికి దీయించి మంచముపై బెట్టించి శ్రావస్తియందు వీథులు వీథులు దిరుగుచు యెలుగెత్తి యిట్లు చాటదొడగిరి.

---

★ ఉదాన 4 – 8

''పాపిష్ఠులగు శాక్యపుత్రీయ శ్రమణులొనర్చిన ఘోరకర్మను ప్రజలు చూతురుగాక. వారు నిర్లజ్జులు దుశ్శీలురు పాపులు మిథ్యావాదులు అబ్రహ్మచారులునై గూడ తాము ధర్మచారులమని బ్రహ్మచారులమని సత్యవాదులమని శీలవంతులమని యూరూరక రజ్జులు ప్రేలెదరు. వీరికి శ్రమణధర్మమును లేదు. బ్రాహ్మణధర్మమును లేదు. క్రూరులై స్త్రీహత్య కొడిగట్టిరి.''

తైర్థికుల దుష్ప్రచారముచే శ్రావస్తిపౌరులకు శ్రమణభిక్షువులయెడ నసహ్యము కలిగినది. వారెందెందు గనపడినను ఈసడించువారు, ధిక్కరించువారు, తిట్టిపోయు వారునైరి.

ఒకనాడు భోజనమైనపిదప భిక్షుసంఘము భగవంతుని చెంతకరిగి నమస్కరించి యొండొండ గూర్చొని తైర్థికులు శ్రావస్తియందు నడిపిన తతంగమును, దాని ప్రభావముచే భిక్షుసంఘమున కొడగూడిన ఉపద్రవమును, ప్రజలు తమ్మాడిపోయు చుండుటయు సవిస్తరముగ విన్నవించిరి. బుద్ధదేవు డిట్లనియె.

''భిక్షువులారా! ఈ తుఫాను బహుదినము లుండదు. వారములోపలనే చల్లారగలదు. సహించండి. అసభ్యవాక్కుల మిమ్ము తూలనాడువారికి మీ రీవిధమున ప్రత్యుత్తరమిండు.

తే. గీ. పాపి యగువా డభూతకల్పనములాడి
తేరక నరకవ్యథల గొనితెచ్చుకొనును
చేసియును చేయలేదను చెనటికూడ
వానితోగూడి నరకదావాగ్ని బ్రమందు.

భగవంతుని హితోపదేశమును భిక్షు లనుసరించిరి. అక్కడ కోసలరాజు సుందరీపరివ్రాజికను చంపినవైనము నాచూకీ దీయుటకు గూఢచారుల నియమించెను. ఒకచోట నొకానొకనాడు కొందఱు దుండగీండ్రు కల్లుత్రాగి తాము సుందరీ పరివ్రాజికను చంపి సంపాదించిన ద్రవ్యవిషయమై వివాదమాడుచుండిరి. రాజపురుషు లది గని వారిని బంధించి కొనిపోయి రాజేంద్రునెదుట బెట్టిరి. రాజును వారి మూలమున నిదియంతయు తైర్థికుల కుట్రయని తెలిసికొనెను. తదనంతరము తైర్థిక పరివ్రాజకులను పిలిపించి పలువిధముల చీవాట్లు పెట్టి యిట్లనియె. ''మీరు నగరములోని వీధివీధులను దిరుగుచు 'ఓ ప్రజలారా! సుందరీపరివ్రాజికను మేమె చంపితిమి.

శ్రమణగౌతముని నిందలపాలు జేయుటకై ఆ తప్పును అతనిపై రుద్దితిమి. తప్పు నిజమునకు వారిదిగాదు; మాది.' అని కేకలు పెట్టిరండు'' అని ఆజ్ఞాపించెను. వారును అట్లె చేసివచ్చిరి. ప్రజల భ్రమ తొలగినది. భగవంతు డన్నట్లే వారముదినము లలోగా విషగాలి యంతయును చల్లాఱినది. దీనినంతయు భిక్షువులు శాస్త కెఱిగించిరి. సుగత దేవు డిట్లనియె.

''ఘోరసంగ్రామమున జొచ్చి కుంజరంబు, పేర్చి పై బడు బాణాల నోర్చినట్లు
కుశలధర్ముండు భిక్షువు కుజనులాడు, నిష్ఠురోక్తుల నోర్వంగ నేర్వవలయు.''

## ★ కృశాగౌతమి చరిత్రము

''ఇది దీనురాలని యెవ్వడూకొనడు। కలిగి సమస్తంబు కలదె లాభంబు।
అయ్యయో! కొమరుండు అల్లారుముద్దు। కోమలాంగుడు ప్రీతిగొల్పెడివాడు।
ననువీడి శమనుని నగరికి పోయె। హాయంచు నెంతయు నంగలార్చితిని।
వాడెవ్వడో వల్కె వద్దకువచ్చి। 'పోవరాదా భిక్షుమణి బుద్ధుకడకు'।
ఆమాట విని హుటాహుటి బుద్ధదేవు। సన్నిధి కరుదెంచి విన్నవించితిని।
'పుత్రసంజీవని బోసి నాసుతుని। బ్రతికింపవే, కృపాభండార!' యనుచు।
నావైపు వరికించి నాస్వామి పలికె। 'ఏ యింటిలోమృత్యు వెన్నడులేదొ।
యే వంశమున మృత్యు వెన్నడులేదొ। ఆ యింట పిడికెడు ఆవాలు దెమ్మ।'
నగరంబు శ్రావస్తి నాల్గుమూలలను। పరిపరి విధముల తిరిగి ద్రిమ్మరితి।
నాకట్టి యిల్లొక్కటైన గన్పడదు। స్మృతి త్రిప్పుకొని శవంబును పాఱవైచి।
పరమసంబుద్ధుని పాదాలుకడకు। పఱదెంచు నను జూచి ప్రభువిట్టు లనియె।
పుట్టునదెల్లను గిట్టునదె యని। లోకధర్మంబు నాలోకింపలేక।
నూఱేండ్లు బ్రతికిన నుర్వీలాభంబె। వస్తుస్థితి నెఱుంగు వాడొక్క రోజు।
బ్రతికిన చాలదే బంగారు బ్రతుకు। నీకు నాకేగాదు నిఖిలప్రపంచ।
భూతకోటికి తప్పిపోని ధర్మంబు। సార్వభౌమంబైన సత్యంబు; తల్లి।
అని తథాగతు డానతిచ్చినంతటనె। జ్ఞాననేత్రంబు విస్ఫారమై వెలిగె।
బుద్ధశాసనమును బుద్ధిని నిలిపి। ప్రవ్రజించితి యిల్లువాకిండ్లు వీడి।
అర్హత్త్వమును బొంది హాయిగనుందు। ప్రీతితో – నను కృశాగౌతమి యండ్రు.

---

★ థేరీ అపాదానము, తృతీయ భాణవారము.

# బ్రాహ్మణధమ్మియ సూత్రము

[1]గౌతమబుద్ధుడు శ్రావస్తియందు విహరించు సమయమున [2] కోసల వాసుల నేకులు వృద్ధబ్రాహ్మణులు చనుదెంచి భగవంతునితో సమ్మోదన మొనర్చి యొక్క పెడ కూర్చొని యిట్లనిరి.

"గౌతమా! ప్రాచీన బ్రాహ్మణు లనుష్ఠించిన ధర్మముపై నేటి బ్రాహ్మణులు ప్రవర్తించుచున్నారా?"

"బ్రాహ్మణులారా! అట్లగపడదు."

"గౌతమా! ఆ ప్రాచీన బ్రాహ్మణుల ధర్మమెట్టిదో యెఱిగింపుము."

"బ్రాహ్మణులారా! వినుడు."

తే. గీ. *"సంయతాత్ములు నిశ్శ్రేయసాభిలాషు । లఖిలకామవిరక్తు లధ్యయనపరులు ।*
*నిత్యశుద్ధతపోవ్రత నిష్ఠలెలమి । ఆ సనాతనబ్రాహ్మణు లట్టివారు.*
*గొడ్డుగోదలు లేవు పెందొడ్డ భవన । గణములునులేవు - వెండిబంగారు లేదు,*
*తత్త్వవిజ్ఞానమే వారి ధనము ధాన్య । మా సనాతనబ్రాహ్మణు లట్టివారు.*
*కలిగినంత సంతృప్తితో మెలగువారు । పేర్మిదాతల సద్బుద్ధి పెంచువారు ।*
*అన్నియెడలను సత్కారమందువారు । ఆసనాతనబ్రాహ్మణు లట్టివారు.*
*వసుధలో సంచరించు దేవతలు వారు । వారి రాకలు పోక లవార్యము లెట ।*
*సర్వసమ్మాన్య రాజిత సర్వశక్తు । లా సనాతనబ్రాహ్మణు లట్టివారు.*
*వారజేయులబాధ్యులవధ్యు లెపుడు । మేటి ధర్మమె వారికి కోటగోడ ।*
*సర్వవిశ్వంభరయును దాసానుదాసి । ఆ సనాతన బ్రాహ్మణు లట్టివారు."*

మరియు వారు నలుబదియైదు సంవత్సరముల యీడువఱకు కౌమార బ్రహ్మచర్యపాలన మొనర్చెడివారు. భార్యలను కొనితెచ్చుకొనువారుగారు. పరస్పర ప్రేమలతికినచోటనె దాంపత్యము చేయుదురు. పరదారల పొంతకుబోరు. ఋతు కాల ములదప్ప పెఱవేళలయందు విషయసుఖము నపేక్షింపరు. శీలము ఋజుత్వము మార్దవము తపస్సు అహింసా క్షాంతులు వారికి అందిపొందినవి. వారిలో స్థిరనిష్ఠుడగు వాడు కలయందైనను రతిధర్మమును తలంచడు. వారి యజ్ఞములలో పశుబలి లేదు. నెయ్యి బియ్యము ఉప్పు పప్పులను ధర్మమున సేకరించి యాగములు చేయుదురు.

---

(1) సుత్తనిపాతము 2 - 7. (2) ఫైజాబాదు, గోండా, బారాబంకీ జిల్లాల ప్రాంత భూమి.,

తలిదండ్రులు అన్నదమ్ములు అక్కచెల్లెండ్రవలె గోవులను వారు ప్రేమింతురు. పుష్టిని తుష్టిని ఓజమును తేజమును ప్రసాదించు అవులను క్రతువులలో హతము చేయరు. ఇట్లా బ్రాహ్మణులు వర్తించుచున్నంతవఱకు ప్రజలు ప్రసన్నులైయుండిరి. కాలము గడచినంత మెల్లగ దిగజాతీ విప్రులు రాజకులములతో చెలిమి జేసిరి. భూషాభూషిత లగు యోషామణులు, సుందారాశ్వముల బూన్చిన స్యందనావళులు ఆకాశము నంటు హర్మ్యములు ఉబికి ఉప్పొంగి పొర్లిపొరలు భోగవిలాస సామగ్రులను మహా రాజుల చెంతలపొంతలజూచి వారికి నోట నీళ్ళూరినవి. ధనము కావలెను, ధాన్యము కావలెను, భూములు కావలెను, ధేనువులు కావలెను, సిరి కావలెను, స్త్రీ కావలెను, లోభపిశాచికి బ్రాహ్మణులు దాసులైనారు. ఇక్ష్వాకువంశమువాడై ఆనాడు భూమిని పాలించు రథర్షభ రాజేంద్రుని చెంతకుబోయి వారిట్లనిరి. ''మహారాజా! సర్వమును నీకు గలదు. యజ్ఞములొనర్చి పుణ్యమును సంపాదించు కొమ్ము.'' రాజామాటల కియ్యకొని అశ్వమేధము - నరమేధము - వాజపేయము, సర్వమేధము మున్నగు యజ్ఞములనొనర్చి ధనములతో బ్రాహ్మణుల కుత్తుకబంటి దనిపెను. వారి కోరికలు మరింత కొసలు సాగినవి. ఆశకు ఆకలిదీఱలేదు. మరికొన్ని మంత్రములను నిర్మించుకొని ఇక్ష్వాకుని వద్దకు పోయిరి. ★ ''రాజా! పైర్లు పంటలు తిండి తీర్థములు ధనము ధాన్యములవలె గోవులుకూడ మానవునకు ఉపభోగ్యవస్తువులు. నీవు సర్వసంపన్నుడవు. యజ్ఞములు చేయరాదా?'' యని ప్రోద్బలము చేసిరి. రథర్షభ నరపతి యజ్ఞములను చేయసమకట్టి వేల కొలంది అవులను హననము చేసెను. కొమ్ముల చిమ్మవు. కోఱల బెఱుకవు. సాధుజంతువులను జాలిలేక శస్త్రప్రయోగముచేసి చంపురాజునుజూచి లోకములు 'అలో' యనినవి. ఇంద్రాది దేవతలు కటకటబడిరి. ప్రజలు అధర్మమధర్మమని ఆక్రోశించిరి. అంతవఱకు లోకమునందు 'ఆకలి - కోరిక - ముసలితన' మను మూడె రోగములుండినవి. పశుహింసలు ప్రబలినంతనె తొంబదియెనిమిది విధముల రోగపీడలు వ్యాపించినవి. ఇది సనాతనధర్మమునకు విరుద్ధము. ఈ పురోహితబ్రాహ్మణులు అన్యాయముగ నిర్దోషప్రాణుల చంపుచున్నారు. ధర్మమును ఉల్లంఘించుచున్నారు. అని ఆర్యపురు షులు వారిని నిందించుచుందురు. ధర్మభంగమగుటచేత శూద్రులకును వైశ్యులకును

---

★ అ. క. 'పాలు మొదలగు పంచగోరసములు రుచిగ నున్నవి. మాంసమైనచో నింకను రుచిగనుండును కాబోలు' అని మాంసమును ఆశించిరి. తామె స్వయముగ పశువును చంపితిన్నచో నిందకు పాత్రులు కాగలమని, దానికి కొన్ని మంత్రములు నిర్మించుకొని యిక్ష్వాకునివద్దకు మరియు పోయి యిట్లనిరి.

మచ్చరములు కలిగినవి. వివాదములు పెరిగినవి. క్షత్రియులు కొఱవులవలె రాజిరాజి కొంపలు గూల్చుకొన్నారు. హద్దు నియమములు లేక అందఱును స్వేచ్ఛాచారులైరి. సతి పతిని, సుతుడు జనకుని సరకుగొనరైరి.''

అని భగవంతు డాడిన నుడువుల విని బ్రాహ్మణులు సంతుష్టులై 'ఆశ్చర్యమాశ్చర్యము. బుద్ధుని శరణు జొచ్చుచున్నాము. ధర్మమును శరణుజొచ్చుచున్నాము. భిక్షుసంఘమును శరణుజొచ్చుచున్నాము. గౌతమా! నేటినుండి అంజలి బద్ధ శరణాగత ఉపాసకులనుగ మమ్మనుగ్రహించండి' అని వేడుకొనిరి.

## అంగులిమాల సూత్రము (వి. పూ. 447)

★ భగవంతుడు బుద్ధదేవుడు శ్రావస్తియందు అనాథపిండకుని జేతవనారామమున విహరించెడి దినములు. ఆ కోసలరాజ్యమునందు అంగులిమాలుడను బందిపోటొకడుగలడు. క్రూరత్వము వాని రూపెత్తినది. వానివద్ద దయయనునది మందుకు లేదు. మనుష్యులను చంపుటయనిన వానికి మంచినీరు త్రాగినట్లు. వానిదాడికి తాళ లేక ఊళ్లు పాడైనవి. నిగమములు నిర్జనములైనవి. జనపదములు శ్మశానములైనవి.

అది ఒక రోజు. పూర్వాహ్ణసమయమున దశబలుడు పాత్రచీవరములను గొని శ్రావస్తిలోని కరిగి భిక్షనుగొని భుజించి అంగులి మాలుడు నివసించెడి ప్రదేశమునకు దారిబట్టెను. అది జూచి గోపాలకులు పశుపాలకులు కర్షకులు బాటసారులు మున్నగువారు భగవంతుని నివారించి యిట్లనిరి.

''శ్రమణా! ఆ దారిని బోవద్దు. ఘోరకర్ముడగు అంగులిమాలుని బారిపడి ప్రాణములతో బైటబడుటకల్ల. వాడు ఊళ్ళను ఊడ్చినాడు. పట్టణములను పొట్ట బెట్టుకొన్నాడు. మానవులను చంపిచంపి వ్రేళ్ళను దండగూర్చి మెడలో వేసుకొన్నాడు. ఇరువది ముప్పది నలువది యేబదులకొలది మనుష్యులు జట్లుజట్లై పోయినను నిరపాయముగ మార్గమును దాటినారనిన నిజమునకు గండముగడచి గట్టెక్కినట్లే.''

---

★ మ. ని. 2 - 4 - 6
ఇరువది నాల్గవ వర్షావాసము పూర్వారామమునను యిరువదియైదవ వర్షావాసము జేతవనము నందును నడచినది.

ఇట్లు వారాడు మాటలను పెడచెవిబెట్టి బుద్ధదేవుడు హుటాహుటి వెళ్ళుచుండెను. అంగుళిమాలుడును సరాసరి చనుదెంచు శ్రమణునొక్కనిగాంచి అచ్చెరువుతో పిచ్చలించి ''ఔరౌర! అభూత పూర్వవిషయము. జట్లుజట్లై వచ్చుటకు కూడ జనులు జళుకుచుండ తనకు సాటివారు లేదన్నట్లు వీడు యొక్కటి చనుదెంచుచున్నాడు. కాలము మూడినవానికి వికృతయోచనలకు కొదువేమి?'' అని తలంచుకొని వాలును డాలును గొని భగవంతుని వెంట బడెను. అదేమి మాయయొ కాని బుద్ధుడు చూచుటకు సాధారణముగ నడచినట్లె యున్నది. అంగులిమాలుడు ప్రాణములను కోరువెట్టి పరుగెత్తినను అందుకొనలేకున్నాడు. వాని ఆశ్చర్యమునకు మేర లేదు. ''అమ్మకచెల్ల! దౌడు దీయు గుఱ్ఱములను, యేనుగులను, రథములనైనను అలవోకనవలీల వెంటబడి పట్టెడివాడను. ఇదే మహేంద్రజాలమో?'' అని వితర్కించి అట్టె నిలిచి యిట్లనియె.

''శ్రమణా! నిలునిలుము.''

''అంగులిమాలా! నేను నిలిచియె యున్నాను. నీ వె నిలబడుము.''

''నిలువకనె నేను నిలిచితినందువు. నిలిచిన నాకు నిలుకడ లేదందువు. శ్రమణా! ఈ విపరీతభాష కర్థమేమి?''

''అంగులిమాలా! ప్రాణికోట్ల కన్నిటికిని అభయదాన మిచ్చి నేను సుస్థిరముగ నిలిచితిని. సమస్తప్రాణికోట్లకు భయదాయకుడవై నీ కెక్కడను నిలుకడ లేదు.''

''ఓహో! పూజ్యుల పొంతబోక యెంతోకాలము గడచినది. మహాశ్రమణుడు లభించినాడు. చిరకాలము పేఱుకొనిన పాప పంకిలమును కడుగుకొందును.''

అని చింతించి అసిచర్మములను దూరమున పార్వైచి వినమ్రుడై బుద్ధుని ప్రవ్రజ్య నభిలషించెను. కరుణావరుణాలయుడగు బుద్ధచంద్రుడు 'కుమారా! రారమ్మ'ని చేరదీసి భిక్షు దీక్ష నొసంగెను.

ఆయుష్మంతుడగు అంగులిమాలుడు తన్ననుసరించి నడువ తథాగతుడు యథాస్థానమగు జేతవనారామమును జేరెను. ఆ సమయమున రాజగు ప్రసేనజితుని అంతఃపురమునకు ముంగిట కోలాహలముగ జనులు మూగియున్నారు. ''దేవా! నీ రాజ్యమున అంగులిమాలుడను గజదొంగ గలడు. వాని దెబ్బకు జనపదములు నిర్జనము లగుచున్నవి. లోకము శోకవ్యాకులమైనది. వాని ఉపద్రవమును మాకు తొలగింపుడు.'' అని ప్రజలు ఘోషించుచున్నారు.

అయిదువందలు అశ్వికులు తోడరాగ మధ్యాహ్నవేళ మహీపాలుడు ప్రసేన జితుడు శ్రావస్తినుండి బయలు దేఱి ప్రయాణముఖమున భగవంతుని దర్శింపనెంచి జేతవనారామములోనికి ప్రవేశించెను.

అభివాదనములు జేసి యొకచో గూర్చొనిన ప్రసేనజిత్తుని జూచి ''మహా రాజా! ఈ మహాసన్నాహ మెందులకు? బింబిసారుని మగధము మీదనా, లిచ్ఛవుల వైశాలిపైననా, యేదేశముపై దాడివెడలుట?'' అని భగవంతుడు ప్రశ్నించెను.

''భంతే! అవేమియుగాదు. నా రాజ్యమునందు అంగులిమాలుడను దుష్టు డొకడు గలడు. లోకమునకు వాడు చేయు ముప్పు చెప్పరానిది. ఆ తులువను తెగటార్చుటకు పోవుచున్నాను.''

''మహారాజా! అటు చూడుము. వాడె అంగులిమాలుడు. తలను గడ్డమును గొఱిగించుకొని కాషాయవస్త్రములను కట్టుకొని ప్రాణిహింసను అదత్తాదానమును మృషావాదమును విడనాడి, యేకాహారి బ్రహ్మచారి శీలధారియై కూర్చొనియున్నా డ''ని తన కుఱంగటనెయున్న అంగులిమాలుని జూపించెను. ''వీడేనా అంగులిమా లుడు'' విస్మయభయము లొక్కుమ్మడి గ్రమ్ముకొన మహారాజు మ్రాన్పడి పోయెను.

''రాజా! భయపడకుమ''ని భగవంతుడు తేర్చినంతట కొంతవడికి ప్రసేన జితుడు ప్రశాంతుడై అంగులిమాలుని చెంత జేరి యిట్లనియె.

''ఆర్యా! అంగులిమాలా''

''మహారాజా!''

''తమ తలిదండ్రు లేగోత్రమువారు?''

''మహారాజా! తండ్రి గార్గ్యుడు. తల్లి మైత్రాయణి.''

''ఆర్యపురుషా! గార్గ్యమైత్రాయణిపుత్రా! యథేచ్ఛగ విహరింపుము. మీకు వలయు చీవర – పిండపాత – శయనాసన – గ్లాన ప్రత్యయ – భేషజ్యముల నర్పిం చుచు సేవజేసె దను.'' అని అంగులిమాలునితో బలికి తథాగతుని సమీపించి ధరణి పాలు డిట్లనియె.

''భంతే! ఆశ్చర్యము. అబ్బురము. దుష్టులను దమనము చేయుదురు. కష్టు లకు శాంతి కల్గింతురు. మూఢులకు ముక్తి నొసంగెదరు. దేవా! అస్త్రశస్త్రము

లతో గూడ మే మడంప లేనివారిని దేవరవారు కత్తియు కటారు లేక అవలీలగ నిగ్ర హింతురు. నమస్కారము సెలవిండు.''

అనుజ్ఞను బొంది కోసల నరేశుడు నగరమును బ్రవేశించెను.

ఆయుష్మంతుడు అంగులిమాలుడు ఒకనాడు శ్రావస్తిలోనికి భిక్షాచరణము నకై వెళ్ళి నష్టగర్భమైన కాంత నొక్కతెను జూచి యెంతో విహ్వాలించి ''కటకటా! ప్రాణుల కష్టములకు పారమున్నదా?'' అనుకొనుచు భగవంతుని చెంతకు వచ్చి విన్నవించెను. ప్రభు విట్లనెను.

''అంగులిమాలా! నీవా స్త్రీవద్దకు వెళ్లి ''చెల్లెలా! నేను పుట్టినదాది ప్రాణివధ యనున దెఱుగనివాడనైనచో నీకు మేలు కూడుగాక! నీ గర్భమునకు శుభమగు గాక!'' అని ఆన బలికిరమ్ము.

''దేవా! లోకములో నింతకు మించిన అబద్ధములుండునా? అక్కటా! నే జేసిన ప్రాణివధలకు యిన్ని యన్ని యని యెన్నిక యున్నదా?''

''అటులైనచో అంగులిమాలా! నీవా స్త్రీవద్దకు వెళ్ళి ''చెల్లెలా! నేను ఆర్య జన్మమునందుపుట్టినదాది ప్రాణివధయనున దెఱుగనిచో నీకు మేలొడగూడుగాక! నీ గర్భమునకు శుభమగుగాక!'' అని పలికిరమ్ము.

అతండట్లె చేసెను. కామినికిని గర్భమునకును శుభము చేకూఱినది.

ఆయుష్మంతుడు అంగులిమాలుడు అచిరకాలమునందే జన్మబంధములు క్షయింప సర్వోత్తమ బ్రహ్మచర్యఫలమును బొంది కృతకృత్యుడై అర్హతులలో నొకడ య్యెను.

ఒకనాడు అంగులిమాలుడు భిక్షాచరణమునకై శ్రావస్తిని ప్రవేశించెను. ఒక దుండగుడు రాతిని మీద విసరివేసెను. మఱొకడు కట్టెను విసరిమోదెను. ఇంకొకడు మట్టిని పైన గ్రుమ్మరించెను. బట్ట చిరిగినది. పాత్ర పగిలినది. తలనొగిలినది. రక్తసిక్త మైన శరీరముతో ఆయుష్మంతుడు అంగులిమాలుడు సుగతదేవునివద్దకు వచ్చి సర్వము నివేదించెను. ఆయన యిట్లనియె.

''నాయనా! వేలకొలది యేండ్లతరబడి నరకమున ననుభవించినను నాశము గాని నీకర్మఫలమును యిప్పుడె యీ జన్మమందె అనుభవించుచున్నావు. సహిం చుము. సైరించుము. సమ్మతించుము.''

గురుదేవుని ఆశ్వాసనమున ఊఱటబొందినవాడై అంగులిమాలు డయ్యే యేకాంతములందు విముక్తి సుఖమున విహరించుచు ఆనందగీతముల నిట్లు పాడు కొనుచు చున్నాడు.

తే. గీ. ''వెనుక జేసిన కర్మాల వీటబుచ్చి। చీల్చి మబ్బుల వెలికివచ్చిన సుధాంశు।
కరణి నార్యజనుండు లోకంబుదనుపు। ధవళ ధీధిత కీర్తి వితానములను.
ఎవడు పాపకర్మంబుల నెల్ల పుణ్య। సంచయంబున కప్పంగజాలునొక్కొ
వాడు మబ్బుల దొలగించి బైటవచ్చు। చంద్రమునిభంగి యిలయందు సంచరించు.
విశ్వమందున తరుణుడౌ భిక్షువెవడు। బుద్ధశాసనమందు ప్రబుద్ధుడగునో।
వాడు మబ్బులదొలగించిబైటవచ్చు। చంద్రమునిభంగి యిలయందు సంచరించు''

ఓ విశ్వప్రపంచమా! ఓ దశదిశలారా! నా మాట వినుండు. బుద్ధధర్మము లోనికి రండు. సత్పురుషులు దానినాశ్రయించి లోకసేవ జేయుచున్నారు. ఇషుకారుడు బాణములను, వడ్రంగి కొయ్యలను చక్క జేసినట్లు పండితుడు తన్నుతాను తీర్చిదిద్దుకొనుచున్నాడు.

కొందఱు దండమునకు లోబడుదురు. కొందఱు శస్త్రమునకు లోబడు దురు. నేనో తథాగతునకు ఊరూరకనె లోబడితిని.

హింసకుడని నన్నిన్నాళ్లు పిలిచిరి. నేడు ★ నే నహింసకుడను. నేనెవ్వని హింసింపను. నా పేరు అక్షరాల కృతార్థము.

నేను గడితేఱిన దొంగను. నన్ను అంగులిమాలు డనిరి. ఒక వెల్లువలో దొర్లి వచ్చి బుద్ధదేవుని సన్నిధానము జేరితిని.

---

★ ఆ. క. కోసల రాజ పురోహితునకు మైత్రాయణియను భార్యయందొక కుమారుడు కలిగెను. వానికి అహింసకుడని పేరిడిరి. విద్యాభ్యాసమునకై ఆ బాలుడు తక్షశిలకు పోయెను. అక్కడ ధర్మాంతేవాసియై (ని: శుల్కశిష్యుడు) చదువనారంభించెను. ప్రజ్ఞానిధి - శీలవంతుడు - ఆజ్ఞాకారి - ప్రియవాదియునైన వానిని జూచి తోడి సహాధ్యాయులు ఈసు వహించియుండిరి. అన్యోన్యము గురు శిష్యులకు గల గాఢానురాగమును భగ్నము జేయుటకు గభీరయోచనలు చేసిరి. చివరకొక పథకమును కుదుర్చుకొనిరి. గురుభార్యకును - అహింసకునకును గుప్తసంబంధమున్నదని కింవదంతిని ముట్టించిరి. ఆ మాణవకులందఱును ముందు మూడు జట్లుగ విభాగమైరి. అందు మొదటి జట్టువారు ఆచార్యుని వద్దకు బోయి యిట్లనిరి.

''గురువర్యా! ఒక గాలిమాట విన్నాము.''

''ఏమది?''

''భవములు శమించె దుర్గతి బ్రద్దలయ్యె। కర్మపాకంబులెల్లను కడకుదొలగె।
దివ్యనిర్వాణపదము సాధించిమించి। ఋణములేక భుజింతు నిర్వృతుడనగుచు.
మూఢుడు ప్రమాదములయందు మునుగుచుండు। పండితుడు దాని దాపుననుండనీడు
అప్రమాదంబు వాని సర్వస్వము సుమి। అప్రమత్తుడు విపుల సౌఖ్యములబొందు
బుద్ధదేవుని శరణంబుబొంది యిటకు। వచ్చినాడ సుస్వాగతం బయ్యెనాకు।
అవగతము లేదు, దుర్మంత్రణంబుగాదు। మూడువిద్యల బొందితి ముక్తిగంటి.''

---

''అహింసకమాణవకుడు అంతఃపుర ద్రోహము చేయుచున్నాడని.''

''ఛీ! ఛీ! యేమిమాట. వాడు నా కొడుకువంటివాడు. మా యిరువురి మధ్య కొఱవిబెట్ట వచ్చితిరా?''

ఆ గుంపు పోయినది. మరియొకజట్టు - మరియొకజట్టు మాటిమాటికి చెప్పుటతో ఆచార్యునకు కించకలిగినది. ఆ సందేహదృష్టితో భార్యను - శిష్యుని పరికించుచు వచ్చినాడు. వారిరువురి స్నేహపూర్వసంభాషణ మాతని సందేహమునకు ఊతయిచ్చినది. తనలో నిట్లని తలంచెను.

''నేను వీనిని చంపింతునా, తనవద్దనుండు శిష్యుని చంపించినాడను అపవాదమునకు పాల్పడుదును. విద్యాధ్యయనము ముగిసిన పిదప దక్షిణారూపమున 'వేయిమందిని చంపుమ' ని అజ్ఞాపింతును. వాడట్లు ప్రవర్తించునపుడు యెవ్వడేని యొకడు పుటమార్చగలడు.''

అనుకొన్నట్లు కథ అంతయు నట్లే నడచినది. అహింసకు డిట్లనియె.

''ఆచార్యా! మాది అహింసాకులము. ఆ ఘోరకర్మ మెట్లు జేతును?''

''అబ్బాయీ! దక్షిణ యివ్వనిచో విద్యాఫల మెట్లంటును?''

విధిలేక తెగతెంపు చేసి ఆయుధములను తీసికొని అరణ్యమున ప్రవేశించెను. ఆ అడవియందు కానబడినవానినెల్లను ఖండించుచు వచ్చెను. చివరకు వస్త్రమునైనను తీసికొనడు. లెక్కించుకొనుటకు అనువుగ వారి వ్రేళ్ళను నఱికి మెడలో దండవైచుకొనువాడు. అందుచే వానిని అంగులిమాలు డనిరి. ఆ అరణ్యములోనికి జొరుటకు యెవ్వడును సాహసింపరైరి. దారి యంతయు పాడువడెను. అంగులిమాలుడును రాత్రుళ్ళయందు గ్రామములలో జొచ్చి తన్ని తలుపులు బ్రద్దలుచేసి లోన ప్రవేశించి నిద్రించువారిని చెండాడువాడు. ఊళ్ళు పల్లెలు - నిగమములు నగరములు సర్వశూన్యములు కాజొచ్చుడు చుట్టుపట్టు మూడు యోజనముల పర్యంతము మనుష్యులు యిండ్లు వాకిళ్ళను వీడి, ఆలుబిడ్డలనువెంటగొని శ్రావస్తి జేరికొని శిబిరములు వేసికొనిరి. ఒకనాడా ప్రజలు గుమియై రాజభవనప్రాంగణమునకు బోయి ఆ చెనటి చేయు ఉపద్రవమును రాజానకు విన్నవించిరి.

# ౧
# అష్టక (పారాయణ) వర్గము (వి. పూ. 446)

[1] మంత్రపారంగతుడగు [2] బ్రాహ్మణు డొకడు బావరి యను వాడు రమణీయ మగు కోసల జనపదములను వీడి స్వర్గము నాకాంక్షించి దక్షిణ దేశమునకుబోయెను. అక్కడ [3] అశ్మకుని ఆర్యకుని రాజ్యముల మధ్యయందు గోదావరీ నదీతటమున ఉంఛవృత్తితోడను ఫలమూలాహారముతోడను కాలము గడపుచు నివసించెను.

---

(1) సూత్ర నిపాతము 5 - 1 - 16.

(2) ప్రసేసజితునకు పురోహితుడు. పేరు బావరి. మహాపురుషలక్షణములు మూడింటితో కూడినవాడు. మూడువేదముల ప్రవీణుడు. పదునార్వురు ప్రధానశిష్యు లతనివద్ద విద్యను పఠించినారు. రాజగు ప్రసేనజిత్తునకు గూడ నితడే విద్యాగురుడు. ఒకానొకనాడు నరపాలునిజూచి బావరి యిట్లనియె.

''మహారాజా! నేను సంన్యసించెదను.''

''ఆచార్యా! తండ్రి లేకపోయినను మిమ్ముజూచి ఊఱడిల్లితిని. మీరు సంన్యసించి పోవద్దు.''

మహారాజా! అవశ్యము సంన్యసించవలెను.''

రాజు నివారింపలేక పోయెను. చేయునదిలేక, రేపటమాపట తాను దర్శించుట కనువుగ తనయుద్యానముననె సంన్యసించి యుండుమనెను. అతండును సమ్మతించి పదునారువేల పరివారముగల పదునార్వురు ప్రధానశిష్యులతోగూడి ప్రవ్రజించి రాజుగారి ఉద్యానవనముననె నివసింప దొడగెను. మహీపాలుడును వారికి వలయు వస్తుసామగ్రిని సమర్పించుచు సాయంప్రాతముల నారాధించుచు వచ్చెను. కొంతవడి గడచినంత ఆచార్యుడగు బావరిని చూచి అంతేవాసు లిట్లనిరి. ''ఆచార్యా! పట్టణప్రాంత మందుండు యీ ప్రదేశమున తపస్సునకు అంతరాయములు మెండు. ఎందేని యేకాంతమునకు పోవుదము పద.''

గురువొప్పుకొనెను. నరేంద్రు డెంతయొ నివారించియు యిసుమంతయు లాభములేక కొంత పరివారమును తోడిచ్చి వలయుచోట ఆశ్రమమును నిర్మించుకొండని పంపెను. వారును ఉత్తరమునుండి దిగజారివచ్చి దక్షిణాపథమును జొచ్చిరి.

(3) అ. క. అశ్మక ఆర్యకములు దాపుదాపుననుండు ఆంధ్రరాజ్యములు. ప్రస్తుతము నైజాం రాజ్యమున ఔరంగాబాదునకు పరిసరప్రాంతమై యుండనోపును. ఆ రెండు రాజ్యములమధ్య గోదావరి ప్రవహించి రెండుపాయలుగ చీలినది. అందు మూడుయోజనముల విస్తీర్ణముగల ద్వీప మేర్పడినది.

ఆ దాపున నొక గ్రామము గలదు. అందుచే కూడిన ఆదాయముతో వారొక మహాయజ్ఞమును తలపెట్టి నిర్వర్తించిరి. అంతయు ముగిసినపిమ్మట ధూళిధూసరిత గాత్రుడుగు బ్రాహ్మణు డొకడు వచ్చి తనకైదువందల ద్రవ్యమును దానమిమ్మని కోరెను. బావరియు నతనిని యథోచితముగ సత్కరించి ''అయ్యా! ఉన్నదంతయు నిచ్చి వేసితిని. కడకు నా వద్ద నేమియు లేదే'' యని బదులు చెప్పెను. ''అడిగిన లేదందువా?'' యని కినిసి ఆ నవాగతవిప్రుడు ''ఓయీ! నేటికి యేడవ దినము నీ తల యేడువ్రక్కలవుగాక'' యని భీషణముగ పల్కెను. ఆ దారుణవాక్కును విని బావరి యెంతయు వగచుచు అన్నాహారములను వదలి కృశింపజొచ్చెను. అయినను అతని చిత్తము ధ్యానయుక్తమయ్యే యుండెడిది. విషణ్ణుడగు నాతని స్థితిగతిని చూచి కనికరించి యొకానొక దేవత డగ్గఱి యిట్లనియె.

''బావరీ! చింతింపకుము. శిరస్సనిననేమి? శిరఃపాతమనిననేమి? మూర్ధమనిన నేమి? మూర్ధాపాతమనిననేమి? అనెడి విషయపరిజ్ఞానము పాపమాధనలోభియగు మూఢున కేమి తెలియును? చింతింపకుము.''

''ఓ దివ్యపురుషా! మూర్ధమనిన మూర్ధాపాతమనిన నేమో తెలిసినచో నాకు తెలియజెప్పుము.

''బావరీ! నేనుసైత మెఱుంగజాలను. అది బుద్ధపురుషుల జ్ఞానదర్శనము.''

''ఓ దివ్యుడా! లోకమునందట్టి వాడెవ్వడో ఊహించి చెప్పుము..''

''బావరీ! వినుము. కపిలవస్తుపురమునందు యిక్ష్వాకులవంశమువాడై శాక్యపుత్రుడు జన్మించినాడు. సిద్ధార్థగౌతముడనబడు నతడు ప్రవ్రజించియున్నాడు. బ్రాహ్మణా! అతడు సంబుద్ధుడు. సర్వధర్మపారంగతుడు. రాగాదిమలనిర్ముక్తుడు. లోకమునకు ధర్మోపదేశము చేయుచున్నాడు. అతని పాలికి పొమ్ము. ఆవశ్యకచర్చ నడపి కొమ్ము.''

బుద్ధుడనుమాట వినినంతనె మేనుపులకరించినది. ''ఓదివ్యదేవతా! అతడే యూరివాడు? ఏ దేశమువాడు? ఆ మహాత్ముని నేనెచ్చట గనుగొందును?''

''విప్రుడా! ఆ నరలోకచూడామణి కోసలరాజ మందిరమగు శ్రావస్తిలో నున్నాడు.''

ఇట్లు చెప్పి వేలుపు చనినంత బ్రాహ్మణుడు శిష్యులను పదునాఱువురను బిలిచి యిట్లుగ్గడించెను.

''మాణవకులారా! ఒక హితము నుపదేశింతును. లోకమునందు బుద్ధుడు త్పన్న మైనాడు. అట్టి వారిజన్మములరిది. వైళమ(శ్రావస్తికి పోయి ఆ పురుషపుంగవుని దర్శించి వచ్చెదరా?''

''ఆచార్యా! పోయెదముగాక. అతడు బుద్ధుడని మేమెట్లు గ్రహింపగలము?''

''నాయనలారా! వేదములందు మహాపురుషలక్షణములు ముప్పదిరెండు చెప్పబడినవి. వాటితో నొప్పినవాని జీవితమార్గములు రెండేరెండు. మూడవదారి లేదు. గృహవాసియైనచో లోకలోకములకు యేకచ్ఛత్రాధిపతి కాగలడు. యిల్లువిడచి సంన్యాసియైనచో వియచ్చరులు పిచ్చలింప సర్వోత్తమ్మార్హతుడు సమ్యక్ సంబుద్ధుడ గుట నిక్కము. మీ రాయన కడకరిగి అడగదలంచిన ప్రశ్నలను అంతరంగముననె తలంచుకొనుడు. గుప్తరహస్యములను కూడ బుద్ధులు గ్రహింపగల్గుదురు.''

అని గురుడానతిచ్చినంత అజితుడు - తిష్యమైత్రేయుడు - పూర్ణుడు - మైత్రగుడు – ధోతకుడు – ఉపశివుడు – నందుడు – హేమకుడు – తోదేయుడు – కల్పుడు – జాతుకర్ణి – భద్రాయుధుడు – ఉదయుడు –పోసాలుడు – మోఘరాజు – పైంగ్యుడు నను పదునాఱువురు శిష్యులును ఆచార్యునకు సాష్టాంగవందనము లర్పించి సెలవంది అందఱును జటామృగ చర్మధారులై ఉత్తర మున కేగిరి.

క్రమముగ వారు అర్యకమునుండి ★ 1. ప్రతిష్ఠానమును, 2. మాహిష్మతిని, 3. ఉజ్జయినిని, 4. గోనర్ధమును, 5. విదిశను, 6. వనసాహ్వయమును, 7. కౌశాంబిని, 8. సాకేతమును, 9. శ్రావస్తిని, 10. సేతవ్యమును, 11. కపిలవస్తువును, 12. కుశీనారమును, మందిరమును, 13. పావాను, భోగనగరమును, వైశాలిని, 14. రాజగృహమును, దాటుచు పోయి మనోరమమగు 15. పాషాణక చైత్యమును చేరుకొనిరి.

---

★ 1. గోదావరికి ఉత్తర తీరమందుండు పైఠనము (ఔరంగాబాదుజిల్లా.) 2. నర్మదా నదికి ఉత్తరతటమున నేటి మహేశ్వరము లేదా మహేశము. 3. ఉజ్జైన్ – గ్వాలియర్ రాజ్యము. 4. భోపాలమునకు సమీపమందలి ఒకచోటు. 5. వర్తమాన 'భిల్సా' (గ్వాలియర్) 6. (పవన నగరము) బాంసా (సాగరజిల్లా) 7. అలహాబాదుకు పశ్చిమమున 30 మైళ్ళు. కోసం (అలహాబాదుజిల్లా) 8. అయోధ్య (ఫైజాబాదు.జిల్లా) 9. బలరామపురమునకు 10మైళ్ల సహేట్‌మహేట్. (గోండాజిల్లా) 10. జైనశ్వేతాంబీ 11. తిలౌరా (నేపాల్) 12. కసయా (గోరఖపూర్ జిల్లా) 13. పడరౌనా (కసయాకు 12 మైళ్ళు ఈశాన్యమున ,14. రాజగిరి (పాట్నా జిల్లా) 15. గిర్యక్ పర్వతము (రాజగిరినుండి ఆఱుమైళ్ళు).

అంతటవారు దప్పిగొన్నవాడు నీటినిబలె, వ్యాపారి లాభమునుంబోలె, యెండకు తపించినవాడు నీడనట్లు భగవంతుని దర్శన మపేక్షించుచు వడివడిగ పర్వతము నధిరోహించిరి.

బుద్ధభగవంతుడు యెదుట గూర్చొనియున్న భిక్షుసంఘమునకు సింహగర్జన ముతో ధర్మోపదేశములు చేయుచున్నాడు. అజితుడు అమ్మహాత్ముని మేన లక్షణము లను పరికించి ముదితచిత్తుడై యొక్క చక్కని గూర్చొని మానసికముగ నిట్లు ప్రశ్నిం చెను. ''మా ఆచార్యుని జన్మాదికమును, లక్షణములను, గోత్రమును, విద్యాబుద్ధు లను తెలియజెప్పుడు?''

''బ్రాహ్మణా! నూటయిర్వదియేండ్లు ఆయుస్సు. గోత్రమును బట్టి బావ రియని పేరు. మహాపురుషలక్షణములు మూడుగలవాడు. మూడువేదములందు పారంగతుడు. ధర్మపరాయణుడు. ఏనూర్వురు శిష్యులకు పాఠము చెప్పుచు న్నాడు.''

''ఓ మహాపురుషా! బావరికిగల లక్షణములను విస్తరించి చెప్పుడు.''

''మాణవకా! కనుబొమలనడుమ వెంట్రుకలు, నొసటినితాకు నాలుక, కోశా చ్ఛాది తమగు లింగము ఈ మూడును లక్షణములు.''

ప్రశ్నను వినకనె సమాధానము చెప్పు నతనిమహత్త్వమునకు నివ్వెఱపడి చేతులు జోడించి అంతరంగముననె మఱియు నిట్లు ప్రశ్నించెను.''

''భగవంతా! మూర్ధము (శిరస్సు)ను మూర్ధాపాతము (శిరఃపాతము)ను గూర్చి బావరి తెలిసికొనగోరుచున్నాడు. దయచేసి వివరింపుడు.''

''విప్రకుమారా! అవిద్యను మూర్ధముగ తెలియుడు. శ్రద్ధా, స్మృతి, సమాధి, ఛంద, వీర్యములతో గూడిన విద్యను మూర్ధాపాతినిగ గ్రహింపుము.''

అజితమాణవకుని ఆశ్చర్యమునకు అంతుపంతు లేదు. మృగచర్మము నొక భుజముపై వైచికొని పాదములపై బడి యిట్లనియె.

''ఓ చక్షుష్మంతా! శిష్యసహితముగ బావరి బ్రాహ్మణుడు పాదములకు వందనము లొనర్చుచున్నాడు. ప్రసన్న హృదయుడవు గమ్ము.''

''బ్రాహ్మణా! శిష్యసహితముగ బావరి సుఖించుగాక. మాణవకకుమారా! చిరంజీవివై నీవును సుఖింపుము.''

ఇట్లు బుద్ధదేవు డాడిన శుభాలాపముల కెంతయు నలరి అతనిచే యనుమతి గొని యొక్కెడ గూర్చొని అజితుడు తథాగతుని ప్రథమమున నిట్లు ప్రశ్నించెను.

## అజితమాణవకుని ప్రశ్నలు

అజితుడు:– లోకమును యేది కప్పినది? దేనిచే నిది ప్రకాశించుట లేదు? దేని తోనిదిలేపనము చేయబడినది? దీనికి మహాభయ మేది?

భగవంతుడు:– అవిద్య లోకమును కప్పినది. ప్రమాదముచే నిది ప్రకాశించుట లేదు. ఆశతో నిది పూయబడినది. జన్మాది దుఃఖములు దీనికి మహాభయ ములు.

అజితుడు:– నలుగడలను పాఱు ప్రవాహములను నివారించునది యేది? ఆప్రవా హములు దేనిచే కప్పబడుచున్నవి?

భగవంతుడు:– లోకమునందలి ప్రవాహములన్నింటిని స్మృతి నివారించును. అవి ప్రజ్ఞచే కప్పబడుచున్నవి.

అజితుడు:– ప్రజ్ఞయును, స్మృతియును నామరూపములే గదా? ఈ నామ రూప ములు యెక్కడ నిరుద్ధమగుచున్నవి?

భగవంతుడు:– విజ్ఞానము నిరోధింపబడినచో – అన్ని నామరూపములతో పాటు యివి కూడ నిరోధింపబడుచున్నవి.

అజితుడు:– విజ్ఞాతధర్మములను, భిన్నధర్మములను, వాటి మార్గమును, ఆన తిమ్ము.

భగవంతుడు:– కామములం దాసక్తుడుగాక, మనస్సును మలినము చేసికొనక కుశలధర్మ పరాయణుడై భిక్షువు ప్రవ్రజితుడగుచున్నాడు.

## తిష్యమైత్రేయ మాణవక ప్రశ్న

తిష్య:– ఈలోకమున సంతుష్టుడెవడు? ఎవనికి ఆశలు లేవు? చివరల రెంటిని యెఱింగి మధ్యస్థితుడగువాడెవడు? ఎవ్వని మహాపురుషు డందురు?

భగవంతుడు:- కామములయందు తృష్ణలేక తెలిసికొని ముక్తుడగు వాడు, అంత ములరెంటిని ప్రజ్ఞచే నెఱింగి వాటియందంటు కొనక మధ్యస్థుడై యుండును. వానికి ఆశలు లేవు. వాడు మహాపురుషుడు.

## పుణ్యక మాణవక ప్రశ్నలు

పుణ్యకుడు:- సర్వజ్ఞా! భగవంతా! ఈ లోకమునందు ఋషులును మునులును క్షత్రియులును బ్రాహ్మణులును ఆయా దేవతలకు వేఱువేఱుగ యజ్ఞములను యేల కల్పించినారు?

భగవంతుడు: వారు ఈజన్మమందలి సుఖభోగముల కాంక్షించి బంధములనుండి విడివడ లేక యజ్ఞముల నేర్పఱచినారు.

పుణ్యకుడు:- ఆ యజ్ఞములను కల్పించినవారు అప్రమాదులై జన్మజరాపాశముల నుండి విముకులెనారా?

భగవంతుడు: స్తోమములు హోమములు జేయుచు కామలాభములకై లోభించి భవరాగము లం దనురక్తులై జన్మ జరలనుండి వారు గట్టెక్క లేదు.

పుణ్యకుడు:- భగవన్! వారే గట్టెక్కక పోయినచో లోకమునందు దేవమనుష్యులలో నెవ్వడు జన్మజరలనుండి గట్టెక్కినాడు?

భగవంతుడు: లోకముయొక్క మొదలు చివర జూచి యెందును ఆశ లేక పొగలేని అగ్నివలె శాంతుడైనవాడు జన్మ జరాపారంగతు డగును.

## మైత్రగు మాణవక ప్రశ్నలు

మైత్రగుడు:- దేవా! భావితాత్ముడవగు నిన్ను ప్రశ్నించుచున్నాను. లోకమునందీ విధవిధములగు దుఃఖములు యెక్కడినుండి వచ్చుచున్నవి?

భగవంతుడు: తృష్ణ మొదలగు ఉపధుల కారణముచే దుఃఖము లుత్పన్నమగు చున్నవి. ఆ ఉపధులకు అవిద్య కారణము. మూఢపురుషుడు దానిమూలమున పదింబది దుఃఖమున కెఱయగుచున్నాడు. నిజ మును గుర్తెఱిగి దుఃఖోత్పత్తికి కూకటివేరగు అవిద్యను – ఉపధులను సంభవింపనీయరాదు.

మైత్రగుడు:– జన్మ జరామరణ శోక దౌర్మనస్యములతోడి ఈ భవసాగరమును ధీరపురుష లెట్లు తరించుచున్నారు?

భగవంతుడు:– ప్రత్యక్షధర్మమును యీ శరీరమునందే యెఱిగి స్మరించి ఆచరించి తరించుచున్నారు.

మైత్రగుడు:– భవతారకమగు ఆ ప్రత్యక్షధర్మమేది?

భగవంతుడు:– క్రింద మీద లోపల వెలుపల కానవచ్చువాటియందు తృష్ణను, అభినివేశమును, సంస్కారమును, విజ్ఞానమును బోద్రోచికొను నతడు భవసాగరమును తరించుచున్నాడు. అట్లప్రమాదియై విహరించు నతండు మమత్వమును కూలద్రోసి, జన్మ జరామరణ శోకపరిదేవనముల నూడదన్ని దుఃఖమున కతీతుడయి యున్నాడు. ఓ భూదేవ కుమారా! జ్ఞాని, పరిగ్రహరహితుడు, కామభవనమునందు ఆసక్తి లేనివాడునగు బ్రాహ్మణుడు యీ భవసాగరమును గట్టెక్కుచున్నాడు. భవాభవముల సంగమును వదలి తృష్ణాదిరహితుడైన విద్వాంసుడు జన్మజరాసముద్రమున కద్దరి చేరుచున్నాడు.

## ధోతకమాణవకుని ప్రశ్నలు

ధోతకుడు:– హే బ్రహ్మన్! దయయుంచి వివేకధర్మము నుపదేశింపుడు. దాని నాశ్రయించి నేను శాంతుడనై, ముక్తుడనై విహరించెదను.

భగవంతుడు:– ప్రత్యక్షమగు ధర్మమును యీ శరీరమునందే యెఱింగి స్మరించి ఆచరించి తరించుము. ముక్తుడవై విహరించుము.

ధోతకుడు:– భగవంతా! ఆ ప్రత్యక్ష ధర్మ మెద్ది?

అని యడిగిన ధోతకునకు బుద్ధదేవుడు, వెనుక మైత్రగునకు ఉపదేశించినట్లె ఉపదేశించెను.

## ఉపశివమాణవక ప్రశ్నలు

ఉపశివుడు:– ఓ దేవా! ఈ మహాసంసార ప్రవాహమును ఒంటరిగ తరించుటకు సాహసింప లేకున్నాను. నాకొక ఊతను – తోడును పట్టుగొమ్మను చూపింపుము.

భగవంతుడు:- ఆకించన్యమును (ఏమియు లేదనుటను) గుర్తెఱిగి, స్మృతిమంతుడవై, ఆ ఆకించన్యమునే ఆలంబనముగ గొని ప్రవాహమును దాటుము. కామముల విడనాడుము. వాదవివాదముల విరతుడవగుము. రాత్రిందివములు తృష్ణాక్షయమునకై పాటుపడుము.

ఉపశివుడు:- కామభోగములందు విరక్తుడు 'ఏమియు లేదను' ఆకించన్యమును అవలంబించినవాడు పరమ సంజ్ఞ విమోక్షములనుండి విముక్తుడైన వాడు ఆ ఆకించన్యమున అచలుడై నిలువ గలడా?

భగవంతుడు:- అట్టివాడు అందు అచలుడై నిలువగలడు.

ఉపశివుడు:- ఓ సమంతచక్షూ! వాడందు అచలుడై బహువత్సరములు నిలిచినచో అందే వాడు ముక్తుడగునా? అటనుండియే వాని విజ్ఞానము (జీవుడు) జాఱిపోవునా?

భగవంతుడు:- గాలికి దీపజ్వాల ఆఱిపోయి యిటుబోయిన దటు బోయినదని చెప్పుటకు వీలుగానట్లు, మునియగువాడు నామ కాయమును దొఱగి అస్తమించుచున్నాడు. వ్యవహారమున కతీతుడైనాడు.

ఉపశివుడు:- అస్తంగతుడైనాడా? లేదా? యెప్పటికిని వాడు అరోగుడేకదా?

భగవంతుడు:- అస్తంగతునకు (నిర్వాణప్రాప్తునకు) ప్రమాణము లేదు. అన్ని ధర్మములును నశించిన తర్వాత అది యిది యని, అట్లిట్లని చెప్పుట మాత్ర మెట్లు మిగిలియుండును?

## నందమాణవక ప్రశ్నలు

నందుడు:- లోకమునందు మును లున్నారని ప్రజలు చెప్పుదురు. జ్ఞానము కలిగినవాడా? కఠోరతపస్సుల కాలము గడపువాడా? ముని యనగ నెవ్వడు?

భగవంతుడు:- దృష్టిచే, సంప్రదాయముచే, శ్రుతిచే, పాండిత్యముచే యెవ్వనిని కూడ 'ముని' యని పండితుడనడు. లోభమును విషమును వలె చూచి, ఆశను పిశాచివలె బావించిన వానినె నేను ముని యనుచున్నాను.

నందుడు:- కొందరు శ్రమణబ్రాహ్మణులు మతముచే, శ్రుతముచే, వ్రత ముచే, శీలముచే శుద్ధికలుగునని చెప్పుచున్నారు. అట్టి ఆచరణ గలవారు జన్మమృత్యువుల నుండి కడతేఱగలరా?

భగవంతుడు:– అట్టివాడు కడతేఱ లేరని చెప్పుదును.

నందుడు:– అట్లయిన దేవమనుష్య లోకములందు జన్మజరా మృత్యువులనుండి గట్టెక్కిన వాడెవ్వడో చెప్పుము?

భగవంతుడు:– శ్రమణబ్రాహ్మణుల నందఱిని జరా జన్మములనుండి నివృత్తులని నేను చెప్పబోను. మతమును, శ్రుతమును, వ్రతమును, శీలమును వదలి – అనేకరూపములను వీడి – రాగాది ఆస్రవములను చీల్చి, తృష్ణాక్షయమును బొందిన నరులనె నేను గట్టెక్కినవారనుచున్నాను. కడతేఱినవారనుచున్నాను.

## హేమక మాణవక ప్రశ్న

హేమకుడు:– తొల్లింటివారు గౌతమునికంటె భిన్నముగ – 'ఇట్లుండెను, ఇట్లుండును, అది యంతయు నిట్టిదిట్టిద' ని నాకు చెప్పెడివారు. ఆ ప్రసంగములు తర్కమును బెంచునవి. ఓ సమంతభద్రా! నా కవి నచ్చ లేదు. దేనిని తెలిసిన, దేనిని స్మరించిన, దేనిని ఆచరించిన లోకమునందు తృష్ణను దాటుదునో అట్టి ధర్మము నుపదేశింపుము.

భగవంతుడు:– ఇష్ట (మత) శ్రుత, స్మృత విజ్ఞాతములనుండి రాగమును యెడబాయుట స్థిరమగు నిర్వాణపదము. దానినెఱింగి స్మరించి ఆచరించి యీ జన్మమునందే నిర్వాణమును బొంది ఉపశాంతులై తృష్ణను దాటిపోవు చున్నారు.

## తోదేయ్య మాణవక ప్రశ్నలు

తోదేయుడు:– కామతృష్ణ లెవనికి లేవో, వాదవివాదముల నెవడు గడచినాడో వాని విమోక్ష మెట్టిదిగ నున్నది?

భగవంతుడు:– వానికి విమోక్షము (యెనిమిది విధములు) లేదు.

తోదేయుడు:– వాడు ఆశ్వాసన సహితుడా? ఆశ్వాసన రహితుడా? ప్రజ్ఞావంతుడా? ప్రజ్ఞావంతునివలె నుండువాడా?

భగవంతుడు:– వాడు ఆశ్వాసన రహితుడు. ఆశ్వాస సహితుడు కాడు. ప్రజ్ఞావంతుడు. ప్రజ్ఞావంతునివలె నుండువాడుగాడు. కామభవములందు ఆసక్తి లేని యీ మునిని, ఓ తోదేయా! అకించనునిగ గుర్తింపుము.

## కల్పమాణవక ప్రశ్న

కల్పుడు:- మహాఘోరప్రవాహమున కొట్టుకొని పోవు నాకొక గడ్డను చూపిం పుము. తిరిగి నేను సంసారదుఃఖముల పాలుగాకుందును.

భగవంతుడు:- అకించనత్వమె - దేనిని గ్రహింపకుండుటయె సర్వోత్తమ ద్వీపము. దానినె నేను జన్మమృత్యు వినాశరూపమగు నిర్వాణముగ జెప్పుచు న్నాను. దానిని తెలిసి దానిని స్మరించి ఈ జన్మమునందే వాడు నిర్వాణమును పొందుచున్నాడు. వాడిక మారునివలలో పడడు.

## జాతుకర్ణిమాణవక ప్రశ్న

జాతుకర్ణి:- ఓ సహజనేత్రా! సూర్యునివలె భూమిపై విహరించుచున్నావు. అల్ప ప్రజ్ఞుడనైన నాకు జరాజన్మముల నశింపజేయు ధర్మము నెఱుంగ జెప్పుము.

భగవంతుడు:- కామములయందలి లోభమును వదలి - నిష్కామనను పాదుకొల్పి కొని, దేనియందును ఆవాహన విసర్జనములు లేక, తొలుతటి దానిని తొలగించుకొని వెనుక దానిని గ్రహింపక మధ్య ఉదాసీనుడై ఉపశాంతుడగువానికి నామరూపములందు ఆసక్తి లేదు. సర్వానర్థ మూలములగు ఆస్రవములు లేవు. వాడు తరించుచున్నాడు.

## భద్రాయుధ మాణవక ప్రశ్న

భద్రాయుధుడు:- మహాత్మా! మీ వచనములు వినుటకు ప్రోవయినాము. చక్కగ వ్యాఖ్యా నింపుము. మీ రఖిల ధర్మవేత్తలు గదా?

భగవంతుడు:- సంగ్రహపరులగు ప్రాణులను వెంటబడి మారుడు వేటాడుతాడు. సంగ్రహబుద్ధిగలవారు మృత్యుదేవతకు బలి పశువులు. ఈ విషయ మెఱింగి యెల్లయెడల సంగ్రహింపవలె నను తృష్ణను వదలుము.

## ఉదయమాణవక ప్రశ్నలు

ఉదయుడు:- ప్రభూ! ప్రజ్ఞావిమోక్షమును గూర్చి చెప్పుము.

భగవంతుడు:- కామరాగమును దౌర్మనస్యమును నడంచి, స్త్యానమృద్ధమును కౌకృ త్యమును నివారించి ఉపేక్షాస్మృతితో పరిశుద్ధమైన తర్క పూర్వక ధర్మమును ప్రజ్ఞా విమోక్ష మనుచున్నారు.

ఉదయుడు:- లోకమునందు సంయోజన (బంధ) మెద్ది? దాని విచారణ యేది? ఏది నశించిన నిర్వాణము లభించును?

భగవంతుడు:- లోకమునందు తృష్ణయె సంయోజనము. వితర్కము దానికి విచారణ, తృష్ణ నశించినచో నిర్వాణము లభించును.

ఉదయుడు:- ఏమి స్మరించుచు వచ్చిన విజ్ఞానము నిరుద్ధమగును?

భగవంతుడు: లోపలి వెలుపలి వేదనలను అభినందించక, యిట్లు స్మరించుచు వచ్చిన ముముక్షువుయొక్క విజ్ఞానము నిరుద్ధమగును.

## పోసాలమాణవక ప్రశ్న

పోసాలుడు:- రూపసంజ్ఞలను పోద్రోసి సర్వకామనలను వదలి 'లోపల వెలుపల నేమియులేదు' అని చూచెడి జ్ఞానముగల పురుషుడెట్లు వర్తించును?

భగవంతుడు: సమస్తవిజ్ఞాన స్థితుల నెఱింగి విముక్తుడగు తథాగతుడు దీనిని తమ పరాయణముగ నెఱుంగుచున్నాడు. అకించన్య జనకమునకు ఉత్పాదకము అరూపరాగ నంది సంయోజనమని యిట్లు తెలిసి చూచుచున్నాడు. అట్టి చిరాభ్యాసశీలుడగు బ్రాహ్మణునియొక్క యీ జ్ఞానము తథ్యసత్యమైనది.

## మోఘరాజమాణవక ప్రశ్న

మోఘరాజు:- నేను రెండుమార్లు శక్రుని ప్రశ్నించితిని గాని సమాధానమును బడ యనైతిని. దేవఋషియగు బుద్ధుడు ముమ్మాఱైనను సమాధానమిత్తురట. అందుచే ప్రశ్నించుచున్నాను. లోకమును యేవిధమున చూచువానిని మృత్యుదేవత చూడలేదు?

భగవంతుడు:- సదాస్మృతిని యెదుట బెట్టుకొని, లోకమును శూన్యముగ నెఱింగి ఆత్మదృష్టిని వీడిన వానిని మృత్యువు తొంగి చూడలేదు.

## పైంగ్యమాణవక ప్రశ్నలు

పైంగ్యుడు:- నేను జీర్ణుడను - దుర్బలుడను - జరా జన్మములను నశింపజేయజాలు ధర్మమును చెప్పి నన్నుద్ధరింపుడు.

భగవంతుడు:- ప్రమత్తులగు ప్రాణులు రూపముల నిమిత్తమై నష్టమగుచున్నారు.
నీవు సంసారమున తిరిగి పుట్టకుండుటకై రూపములను వీడుము.
తృష్ణావశులగు నరులు పలువిధముల పీడింపబడుట యెఱింగి తిరిగి
పుట్టకుండుటకొఱకు తృష్ణను విడనాడుము.

ఇట్లు భగవంతుడు బుద్ధుడు మగధ దేశమున పాషాణచైత్యమున విహరించుచు దీనిని చెప్పెను. ఇది పారము (తీరము) ను జేర్చునది గాన పారంగమనీయ ధర్మమని చెప్పిరి. మఱియు పారాయణమని కూడ పేరిడిరి.

## ౬

## శునకాది సూత్రములు (వి. పూ. 445 - 443)

★ సిద్ధార్థబుద్ధుడు శ్రావస్తియందు అనాధపిండకుని జేతవనారామమున విహారము చేయుచున్నాడు. ఒకనాడు భిక్షువులను సంబోధించి యిట్లనియె.

"ఓ భిక్షువులారా! సనాతన కాలమునాటి బ్రాహ్మణుల ప్రాచీనధర్మము లైదును ఈనాడు కేవలము శునకములయందు మాత్రము గోచరించుచున్నవి. ఆనాటి బ్రాహ్మణు లెట్టివారు? 1. బ్రాహ్మణ స్త్రీని మాత్రము పొందువారు. ఈనాటి బ్రాహ్మణులు అబ్రాహ్మణస్త్రీలనుసైతము పొందుచున్నారు. కుక్క తనజాతిని తప్ప అన్య జాతితో సంగమించదుగదా? కావున ప్రాచీనధర్మమును అవియె పాటించుచున్నవి. 2. మరియు పూర్వీక బ్రాహ్మణులు ఋతుమతియగు కాంతతో మాత్రము కలి యుచుండిరి. ఈనాడాహద్దేమియు లేదు. శునకములు ఋతుకాలములందె మైథున మపేక్షించుచున్నవి. 3. గతకాలమునాటి బ్రహ్మణులు కన్యను అమ్ముటయు లేదు; కొనుటయు లేదు. ప్రేమతోడనె వారు ముడివేయబడువారు. ఈనాటి బ్రాహ్మణుల కథ అట్టిదికాదు. కాని శునీశునకములు ప్రేపబద్ధములయ్యే వర్తించుచున్నవి. 4. వెనుకటి బ్రాహ్మణులు ధనధాన్యములను, వెండి బంగారములను కూడబెట్టియుంచెడి వారుకారు. కాని నేటి విప్రుల కదేపనియైనది. సంగ్రహబుద్ధి కుక్కలకేమున్నది? 5. తొల్లింటిబ్రాహ్మణులు యేపూట భోజనమును ఆపూట వెదకికొనెడివారు. నేటి వారో కక్కుర్తిగ కడుపుకుదిని కడమది సంచులకు నింపువారు. ఆ పెద్దలనాటి పద్ధతి కేవలమా కుర్కురములందే కన్పడుచున్నది. ఈ బ్రాహ్మణులయందు లేదు. అందువలననే పూర్వీకబ్రాహ్మణ పంచధర్మములు యీనాడు కుక్కలయందు మాత్రమె గోచరించుచున్నవని చెప్పితిని.

★ అ. ని. 5 - 4 - 4 - 1 (ఇరవై యేడవ వర్షావాసము శ్రావస్తి జేతవనమునందు)

# ద్రోణసూత్రము

★ యథారీతి భగవంతుడు జేతవనారామమునందె విహరించుచున్నాడు. ద్రోణుడను బ్రాహ్మణుడచ్చోటికరుదెంచి మహాశ్రమణునితో కుశలప్రశ్నము లాచరించి యిట్లనియె.

''గౌతమా! నేనాయాచోట్ల 'శ్రమణగౌతముడు వయస్సు చెల్లిన వృద్ధబ్రాహ్మ ణులనుచూచి అభివాదనము చేయడు - ఆసనమర్పింపడు - ఆదరింపడ' ని పలు వురు చెప్ప వినియున్నాను. అది యుచితమేనా?''

''ద్రోణా! నీవు బ్రాహ్మణుడనని పంతమాడగలవా?''

''గౌతమా! అవును. తల్లి వంశమునుండియు తండ్రివంశమునుండియు పవిత్రుడును, మంత్రవేత్తయు, అధ్యయనపరుడునగు వానిని చొక్కముగ బ్రాహ్మణు డనవలెను. నన్ను అట్టివానిగనె చెప్పనగును.''

''ద్రోణా! మీరిప్పుడు చదువు, స్వాధ్యాయము చేయు వేదమంత్రములకు ప్రవక్త లును, కర్తలును నగు అష్టక వామక వామదేవ విశ్వామిత్ర జమదగ్ని అంగిరస్సు భరద్వాజుడు వశిష్ఠుడు కశ్యపుడు భృగువు మొదలైన పూర్వీకఋషులు 1. బ్రహ్మసముడు 2. దేవసముడు 3. మర్యాదకుడు 4. సంభిన్నమర్యాదకుడు 5. బ్రాహ్మణ చండాలుడని అయిదు విధముల బ్రాహ్మణులను చెప్పుచున్నారు. అయ్యా! అందులో నీవెవ్వడవు?''

''గౌతమా! 'మేము బ్రాహ్మణులము' అంతమట్టుకె నాకు తెలియును. నీవు చెప్పినది క్రొత్తవిషయము. దయచేసి సెలవియ్యండి.''

''ద్రోణా! చెప్పెదను వినుము. బ్రహ్మసముడగు బ్రాహ్మణుడు మొదటివాడు. వాడు ఉభయవంశములనుబట్టియు పవిత్రుడు. వేదములను పఠించుచు నలుబదియై దేండ్ల వఱకు కౌమార బ్రహ్మచర్యమును పాలించును. అటుపిమ్మట ధర్మముచే సంపా దించిన ధనమును ఆచార్యునకు దక్షిణగ నొసగును. ఆ ధనము పాత్ర పట్టినంత గ్రహించుచువచ్చి భిక్షాచర్యవలన సంపాదించినదియెగాని కృషివలన, వాణిజ్యము వలన, గోపాలనమువలన, శస్త్రజీవికవలన, రాజపురుషదాస్యమువలన ఏదేని శిల్ప మువలన సంపాదించినదిగాదు. గురుదక్షిణ నర్పించిన పిమ్మట తలను గడ్డమును

★ అ. ని. 5 - 4 - 5 - 2

గౌరిగించుకొని ప్రవ్రజితుడై మైత్రీయుక్త చిత్తముతోడను, కరుణాయుక్తచిత్తము తోడను, ముదితాయుక్తచిత్తముతోడను, ఉపేక్షా యుక్తచిత్తముతోడను గూడినవాడై దిక్కుదిక్కులనన్నిటిని తన దివ్యచిత్తమున ముంచి తేల్చుచు విహరించుచున్నాడు. అట్టివాడు శరీరమును వదలిన పిదప బ్రహ్మలోకమున నుత్పన్నమగుచున్నాడు. వాడె బ్రహ్మసముడగు బ్రాహ్మణుడు.

ద్రోణా! దేవసముడగు బ్రాహ్మణుడు రెండవవాడు. ఉభయవంశముల పరిశుద్ధుడు. నలుబదియెదేండ్ల యీడువఱకు కౌమార బ్రహ్మచర్యమును పాలించువాడు. ధర్మార్జితమగు ధనమును ఆచార్యునకు దక్షిణనిచ్చి ధర్మపత్నిని చేబట్టుచున్నాడు. ధనమిచ్చి కొనక ధారాదత్తమగు కన్యను గ్రహించుచున్నాడు. కేవలము బ్రాహ్మణస్త్రీనె పరిగ్రహించును. క్షత్రియ, వైశ్య, శూద్రస్త్రీల పొంతకుబోడు. చూలు నిలిచిన కాంతను కలియడు. పాలిచ్చుపడతిని పొందడు. గర్భవతితో కలిసినచో అతిమేహరోగ సంతతి కలుగును. పాలిచ్చుపడతిని బొందినచో సంతానము అశుచి ప్రతిపీతనామకమగును. మరియు వాడు ఋతువేళల నతిక్రమించడు. అతనిపత్ని కామమదమున భోగము నపేక్షించునదిగాదు. ప్రజార్థమై మాత్రమె రతి నపేక్షించునది. ఇట్లు పుత్రుడును పుత్రికయు కల్గినమీదట ఆ బ్రాహ్మణుడు సంన్యసించుచున్నాడు. క్రమముగ ప్రథమధ్యానమును, ద్వితీయధ్యానమును, తృతీయధ్యానమును, చతుర్థధ్యానమునుబొంది విహరించుచున్నాడు. శరీరమును వదలినంత స్వర్గలోకము నందు సంభవించుచున్నాడు. వీడె దేవసమబ్రాహ్మణుడు.

ద్రోణా! మర్యాదకబ్రాహ్మణుడు మూడవవాడు. ఉభయవంశపవిత్రుడు. నలభై యైదేండ్లు కౌమారబ్రహ్మచర్యమును పాలించి ధర్మముతో ఆచార్యదక్షిణనిచ్చి ధర్మపత్నిని గ్రహించి సంతానము నుత్పాదించి యింటనె నివసించును. ప్రవ్రజితుడు కాడు. పెద్దల మర్యాదను దాటిపోడు. వీడె మర్యాదక బ్రాహ్మణుడు.

ద్రోణా! సంభిన్న మర్యాదక బ్రాహ్మణుడు నాల్గవవాడు. వీడును పైవానివలెనే ఉభయవంశ శుద్ధుడు. కౌమారబ్రహ్మచర్యధారి. ఆచార్యదక్షిణను ధర్మముతో సమర్పించినవాడు. కాని పత్నీగ్రహణము ధర్మముచేనైనను, అధర్మముచేనైనను చేయును. బ్రాహ్మణస్త్రీని క్షత్రియస్త్రీనికూడ పొందును. ఋతుకాలముల పాటింపు లేదు. ఆర్యబ్రాహ్మణుల మర్యాదలో నిలువడు. వీడు సంభిన్నమర్యాదకుడు.

ద్రోణా! బ్రాహ్మణచండాలుడు అయిదవవాడు. వీడు ఉభయవంశముల పరిశుద్ధుడు. నలువదియైదేండ్లు బ్రహ్మచర్యపాలనముచేసి ధర్మముతోనూ అధర్మ

ముతోనూ ధనమును సంపాదించి ఆచార్యదక్షిణను సమర్పించును. ధర్మమును అధర్మమును సరకుగొనక భార్యను స్వీకరించును. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది స్త్రీలతో సంగమించును. ఋతుకాలముల హద్దులేదు. అతని పత్ని కామమదమున రతి నపేక్షించును. బ్రతుకుకొఱకై వాడన్నివృత్తులలోను దిగబడును. 'అన్నివృత్తులలో – అన్ని పనులలో ప్రవేశించి జీవికను గడపు నీవు బ్రాహ్మణుడ వెట్లయ్యెదవ' ని యెవ్వడైన నడిగినచో 'అగ్నికి కాల్చరాని దొకటి లేదు. ఏదికూడ అగ్నినంటుకొనదు. పోపొమ్మ' ని తన్ను సమర్థించుకొనును. వీడె బ్రాహ్మణ చండాలుడు. పూర్వఋషు లిట్లు చెప్పిరి. అయ్యా! ఈ అయిదుగురిలో నీ వెవ్వడవు?

''గౌతమా! నిజమునకు నేను కడవానితో తూగుటకూడ కనాకష్టము. భంతే! ఆశ్చర్యమాశ్చర్యము. నేటినుండి నన్ను సాంజలి శరణాగత ఉపాసకునిగ అనుగ్ర హింపుము.''

## సహస్ర సూత్రము

[1] ఒక సమయమున భగవంతుడు శ్రావస్తియందు [2] రాజకారామములో విహరించుచున్నాడు. అట్టియెడ వేయిమంది భిక్షుణీ జనము బుద్ధదేవుని సన్నిధాన మున కరుదెంచి అభివాదనములు జేసి యొక చక్కిని నిలువబడిరి. వారిని జూచి భగవంతు డిట్లనియె.

---

(1) స. ని. 54 : 2 : 2.

(2) అ. క. రాజునిర్మించిన ఆరామము కాబట్టి రాజకారామమనిరి. కోసల రాజు ప్రసేనజిత్తుడు దీనిని నిర్మించినాడు.

ప్రథమ బోధియందు (బుద్ధత్వమునకు తర్వాత యిర్వదియేండ్లు) భగవంతుని కీర్తిప్రతిష్ఠలు పెచ్చుపెరుగుటను సహింపలేక తైర్థికులిట్లు విచారించిరి. ''శ్రమణగౌతమునికిట్టి యశస్సు కల్గుటకు యేదేని కారణముండవలెను. దీనికి మూలము యే తపస్సుకూడ గాదు. భూమి శిరస్సును ఆక్రమించి దానిపై విహారమును కట్టించి నివసించుచున్నాడు. ఇది దాని ప్రభావమే. మనముకూడ ఆ జేతవనమునకు దాపున ఆరామమును నిర్మింతము'' అని వారు తలంచి శిష్యుల మూలమున నొక లక్ష ద్రవ్యమును సంపాదించి రాజేంద్రుని వద్దకుబోయి యిట్లనిరి. ''నరపాలా! మేము జేతవన సమీపమున నొక తైర్థికా రామమును కట్ట నుద్యమించితిమి.

''ఓ భిక్షుణులారా! ఆర్యశ్రావకుడు చతుర్విధములగు ధర్మములతో గూడి స్రోతాపన్నుడగుచున్నాడు. (స్రోతాపన్నుడు = జాతిపోని స్థిరసంబోధిని పొందిన వాడు) ఆ నాల్గింటిని చెప్పెదను వినుడు. ఆర్యశ్రావకుడు 1. బుద్ధునియందు అత్యంత ప్రసన్నుడై, భగవంతుడు అర్హతుడు సమ్యక్ సంబుద్ధుడని స్మరించుచు 2. అతని ధర్మమును 3. సంఘమును స్వాఖ్యాతమనియు ప్రత్యక్షఫలప్రదమనియు భావించుచు కమనీయములగు 4. ఆర్యశీలములందు కూడుకొనినవాడై భిక్షువు స్రోతాపన్నుడగు చున్నాడు.

---

శ్రమణగౌతముని వలనగాని అతని శిష్యుల వలనగాని యెట్టి ఆటంకమును కలుగకుండ తాము నివారింప వలసినది'' అని చెప్పి కొంత లంచమిచ్చిరి. రాజా దానిని గ్రహించి ''పొండు - మీపని చేసికొండని'' పంపించెను. వారును ఆయా సామానులను చేరవేసుకొని సేవకులతో పనులు జేయించుచుండిరి.

చేరువనే కలకలము గల్గుటవిని భగవంతుడు గంధకుటినుండి బయటకు వచ్చి ఆనందుని బిలిచి ''ఆనందా! ఏమిటా కోలాహలమ''ని యడిగెను.

''భంతే! మన చెంతనె తైర్థికులు తైర్థికారామమును నిర్మించుటకు దొడంగినారు.''

''ఆనందా! ఇది చట్టమునకు విరుద్ధము. భిక్షుసంఘమునకు ప్రతికూలము. పోయిరాజాతో చప్పి నివారంపజేయుము.'' ఆనందస్థవిరుడు కొంత భిక్షుసంఘముతో కూడి రాజద్వారమునకు పోయి లోనికి రాజునకు చెప్పి బుత్తెంచెను. లంచము తినిన దోషమున నరపాలుడు బైటికి మొగము చూపలేదు. రెండవతూరి తథాగతుడు సారిపుత్రమౌద్గల్యాయనుల బంపెను. ఫలశ్రుతి మొదటివలెనె నైనది. అంత భగవంతుడె స్వయముగ బయలుదేరి రాజభవన ప్రాంగణమునకు వచ్చి నిలచినంత మహారాజా వార్తవిని సంభ్రమముగ జనుదెంచి సాదరముగ ఆసనమును సమర్పించెను. శాస్త యిట్లనియె. ''రాజా! తొల్లి మహాపరాక్రమియగు కురురాజు ఋషుల కన్యోన్యము కలహము గలిగించి సర్వనాశమై పోయెను.''

భగవంతుడాడిన ఆ మాట సూటిగ తనకె తగులుటచే భూపాలుడు తాను చేసిన అకృత్యమునకు వగచి భటులను పంపించి తైర్థికుల వెళ్ళగొట్టించెను. సామానులను కూడ తన వశమె చేసికొనెను. ఆ చోటనే వాటితోడనె ఒక ఆరామమును నిర్మింపజేసి బుద్ధదేవునకు సమర్పించెను. అదియె రాజకారామము.

# సుందరికా భారద్వాజసూత్రము

★ ఒకానొకప్పుడు భగవంతుడు బుద్ధదేవుడు కోసలదేశమునందు సుందరికానదీతీరమున విహారము చేయుచుండెను.

భారద్వాజుడను బ్రాహ్మణు డొకడు ఆ యేటిఒడ్డున అగ్నిహోమము జేయుచు ఆహుతు లిచ్చి ముగించి ఆసనమునుండి లేచి నలుకడల కలయబరికించి 'ఈ హవ్య శేషమును భుజించుటకు అర్హుడెవ్వడా' యని వితర్కించెను. ఒక్కింత దూరమున నొక చెట్టుక్రింద ముసుగు వేసికొని కూర్చొనియున్న బుద్ధదేవుని జూచి హవ్య శేషమును యెడమ చేతను, కమండలువును కుడిచేతను గొని సమీపించి వచ్చెను. అడుగుల సవ్వడి విని భగవంతుడు ముసుగు దొలిగించి చూచెను. వెంటనె భారద్వాజుడును 'ఓహో! ముండకుడు (బోడివాడు.) ముండకుడు (బోడివాడు)' అని చీదరించుకొని వెనుకకు రెండడుగులు వైచి 'ఇట్టివారిలోను బ్రాహ్మణులుకూడ నుండుటకద్దు. విచారించి తెలిసికొందునుగాక' యని వెండియు బుద్ధుని వద్దకుబోయి యిట్లనియె.

భారద్వాజుడు:– "అయ్యా! తామే జాతివారు?"

భగవంతుడు:–

"జాతినడుగకుమోయి! ఆచరణమడుగు కట్టెలో నగ్నిపుట్టుటగాంచలేదె
హీనకులమందునైన ప్రజ్ఞానఘనుడు పుణ్యుడు తపస్వి జన్మింపబోలడొక్కొ
యెవడు సత్యవ్రతుడొ దాంతుడెవడొ వేదశిఖలనెఱిగెనొ యెవ్వండు శిష్టశీల
సమ్మతుడొ వాడు దినము యజ్ఞావశిష్టమైన ఆహారమునె ప్రీతి నారగించు."

భారద్వాజుడు:– "నా యిష్టము ఫలించినది. గౌతమా! నీవు బ్రాహ్మణుడవు. నీ యట్టి వాడు లభింపకపోవుటచేతనే యజ్ఞ శేషము పరుల పాలగుచున్నది. దయ చేసి దీనిని భుజింపుడు."

భగవంతుడు:– "బ్రాహ్మణా! నేనీ భోజనమును గూర్చి 'గాథ'ను పాడితిని. ఇది నాకు భుజింపరానిదైనది. గాథమూలమున ప్రసంగించిన దానిని బుద్ధులు పరిత్యజించెదరు."

భారద్వాజుడు:– "గౌతమా! తగిన పాత్రను బొంది దాత పుణ్యవంతుడగుచున్నాడు. ఈ హవ్య శేషమును మఱియెవ్వరికిత్తును?"

---

★ సం. ని. 7 – 1 – 9.

భగవంతుడు:- "బ్రాహ్మణా! తథాగతుడు లేదా అతని శిష్యులు తప్ప దీనిని తిని జీర్ణించు కొను వాడెవ్వడును నాకు పొడగట్ట లేదు. కాబట్టి గడ్డి లేనిచోటగాని, ప్రాణికోటిలేని నీటగాని దీనిని వదలుము."

ఇట్లు భగవంతు డానతిచ్చిన భారద్వాజుడును ఆ హవ్య శేషమును ప్రాణిరహిత మగు జలమునందు విసర్జించెను. వెంటనే నీటినుండి చిటపట చిటపట యని ధ్వని బయలు దేఱినది. దానిని జూచి వెఱగు పడి భారద్వాజుడు వడివడి భగవంతుని కడకు పరుగిడి వచ్చి యొక యోర నిలువబడెను. సంబోధినాథుడు పలుకుచున్నాడు.

"బ్రాహ్మణా! పుల్లలకగ్గిపెట్టి పుణ్యాత్ముడనైతినని తలంచితివా? పవిత్రత దీని చేతనె లభించునని పండితులు పలుకరు. ఈ పైపై బూటకములతో భావశుద్ధి యేర్పడునా? వెఱ్ఱివాడా? ఈ కట్టెలను కాల్చుకొనుటమాని అంతర్జ్యోతిని వెలిగింపుము. నిత్యాగ్ని హోత్రివై నిత్యఏకాంతివై బ్రహ్మచర్యమును పాలింపుము. నే నట్టి వాడనై యున్నాను. నీ అభిమానము కట్టెలమోపు, క్రోధము ధూమము. అసత్య భాషణము బూడిద. నాలుక స్రువము. హృదయము జ్యోతి వెలుగు ప్రమిదె. తన్ను దాను నిలుపుకొనినవాడు జ్యోతిని దర్శించును. విప్రవరా! ధర్మమను మడుపుగలదు. దానికి శీలమను రేవున్నది. సత్పురుషులు దానిని పొగడుచుందురు. వేదాంతి యగువాడు దానియందు మునిగి తడియకుండగనె ఆవలిదరి చేరికొనును. శ్రేయస్సు, సత్యధర్మములపై - సంయమబ్రహ్మచర్యములపై ఆధారపడియున్నది. అట్టి అంతర్యజ్ఞముల నొనర్చినవారికి నమస్కరింపుము. వారు లోకానికి జ్యోతిస్తంభాలని నేను చెప్పుచున్నాను."

ఆ మధుర బోధాసుధారసముల చెవులపండువుగనాని సుందరిక భరద్వాజుడు "గౌతమా! అశ్చర్యము అబ్బురము. నన్ను నేటినుండి సాంజలిశరణాగత ఉపాసకునిగ అనుగ్రహింపుమ"ని వేడుకొనెను. కొన్నాళ్ళకు ఆయుష్మంతుడు భరద్వాజుడు అర్హతులం దొకడాయెను.

## ఆత్మద్వీప సూత్రము

★ శ్రావస్తియందు జేతవనారామమున భగవంతుడు బుద్ధుడు విహరించుచు భిక్షువుల సంబోధించి యిట్లనెను.

★ సం. ని. 21 - 5 - 1. భగవంతుడు ఇరవై యెనిమిదవ వర్షావాసము శ్రావస్తియందును, ముప్పదియవది జేతవనమందును.

"భిక్షువులారా! ఆత్మశరణ్యులై (స్వావలంబులు), ధర్మశరణ్యులై, అన్యము నాశ్రయింపక విహరింపుడు. అట్టి మీరు కారణసహితముగ పరీక్షింపుడు. శోక దుఃఖములు యెక్కడినుండి వచ్చుచున్నవి. భిక్షువులారా! ఆర్యధర్మముల నెఱుంగని పృథగ్జనుడు రూపమును ఆత్మగనో, రూపవంతుని ఆత్మగనో, ఆత్మయందు రూప మునో, రూపమునందు ఆత్మనో చూచుచున్నాడు. అట్టివాని రూపము చెడిపోవు చున్నది; మార్పొందుచున్నది. అప్పుడు శోకదుఃఖములు ఉత్పన్నమగుచున్నవి. రూపములయొక్క అనిత్యతను గమనించి 'పూర్వమందలి రూపములు – యిప్పటి రూపములు అన్నియు అనిత్యములు, దుఃఖములు విపరిణామ ధర్మములుగలవి' అని లెస్సగ నెఱింగిన శోకదుఃఖములు జాఱిపోవుచున్నవి. నశించుచు న్నవి. వాడు నిర్భయుడగుచున్నాడు. సుఖవిహారి యగుచున్నాడు. అట్టివానిని ముక్తుడందురు.

భిక్షువులారా! ఆర్యధర్మముల నెఱుంగని పృథగ్జనుడు వేదనను ఆత్మగనో, వేదనావంతుని ఆత్మగనో, ఆత్మయందు వేదననో, వేదనయందు ఆత్మనో చూచు చున్నాడు. వాని వేదన నిహతమగుచున్నది. మార్పొందుచున్నది. అప్పుడు శోక దుఃఖము లుదయించుచున్నవి. వేదనలయొక్క అనిత్యతను గమనించి 'పూర్వ మందలి వేదనలును, యిప్పటి వేదనలును అన్నియు ననిత్య దుఃఖ విపరిణామధర్మ ములు కలవి' యని లెస్సగ నెఱింగినచో శోకదుఃఖములు నశించుచున్నవి. వాడు నిర్భయుడై సుఖవిహారియగుచున్నాడు. అట్టివానిని ముక్తుడందురు.

భిక్షువులారా! అట్లే మరియు పృథగ్జనుడు సంజ్ఞాసంస్కారవిజ్ఞానములను ఆత్మయనియొ, సంజ్ఞాసంస్కార విజ్ఞానములు గల వానిని ఆత్మయనియొ, ఆత్మయందు సంజ్ఞాసంస్కార విజ్ఞానములనో, సంజ్ఞాసంస్కార విజ్ఞానములయందు ఆత్మనో చూచుచు న్నాడు. వాని సంజ్ఞాసంస్కార విజ్ఞానములు నిహతమగుచున్నవి. మార్పొందుచున్నవి. అప్పుడు శోకదుఃఖము లుదయించుచున్నవి. సంజ్ఞాసంస్కార విజ్ఞానముల అనిత్యతను గమనించి 'తొల్లిటి సంజ్ఞాసంస్కార విజ్ఞానములును, యిప్పటి సంజ్ఞాసంస్కార విజ్ఞానములను అన్నియు అనిత్యదుఃఖవరిణామ ధర్మములు కలవియొ' యని లెస్సగ నెఱింగినచో శోకదుఃఖములు నశించుచున్నవి. వాడు నిర్భయుడై సుఖవిహారియగుచున్నాడు. అట్టివానినె ముక్తుడందురు.

## మల్లికా సూత్రము

★ అదియొక సమయము, తథాగతుడు శ్రావస్తియందు జేతవనారామమున విహరించుచున్నాడు. అట్టియెడ రాజగు ప్రసేనజితుడు భగవంతునికడకరుగుదెంచి

★ సం. ని. 3 – 2 – 6

అభివాదనములు చేసి యొకచోట గూర్చొనెను. అంతలో నొక పురుషుడు కోసల నరేంద్రుని వద్దకు వచ్చి రహస్యముగ "దేవా! మల్లికాదేవి కొమార్తెను కనిన" దని చెవిలో చెప్పెను. ఆ మాటను వినినంతనె ప్రసేనజితుడు విషణ్ణవదనుడయ్యెను. సర్వజ్ఞుడగు బుద్ధదేవు డావిషయమును గ్రహించి యిట్లనియె.

"మహారాజా! అత్తమామలయెడ భక్తిగలది, పతియే పరమ గతిగ తలంచినది, ప్రజ్ఞాశీలముల నొప్పునదియగు స్త్రీ పురుషునకంటె శ్రేష్ఠమనుట నిక్కము. అట్టి కాంతయందు జన్మించిన పురుషుడు శూరవీరుడై దిక్కులకు అధిపతియగుచు న్నాడు."

## ౧౦

## స్వర్ణాదిసూత్రములు (వి. పూ. 442 - 441)

[1] భగవంతుడు బుద్ధుడు శ్రావస్తియందు అనాథపిండకుని జేతవనారామమున విహారము చేయుచుండెను.

ఆయుష్మంతుడు మహాకాత్యాయనుడు [2] అవంతీదేశములో కురరగృహసంబంధ మగు ప్రపాతపర్వతముపై నివాసము చేయుచుండెను. అట్టియెడ స్వర్ణకోటి కర్ణుడను ఉపాసకుడు ఆయుష్మంతుడగు మహాకాత్యాయనునకు ఉపస్థాపకుడుగ (పరిచారకుడు) నున్నాడు. వాడొక నాడేకాంతమున గూర్చొని వితర్కించుచు "ఆర్యుడగు మహాకాత్యాయను డుపదేశించు ధర్మము మిగుల పరిశుద్ధమైనది. దానిని గృహములలో కాపుర మొనర్చువారు సాధించుట దుష్కరము. కాబట్టి నేను ప్రవ్రజించెదన"ని తలంచెను.

అంతట నొకనా డదను చూచి స్వర్ణుడు మహాకాత్యాయనుని చెంతకరిగి తనకు పొడమిన అభిలాష నెఱింగించి 'నన్ను ప్రవ్రజితుని చేయుమ'ని కోరెను. ఆ మాట విని మహాకాత్యాయను డిట్లనియె.

"స్వర్ణా! బ్రహ్మచర్య పాలన మనునది మాటలతో గాదు. యావజ్జీవము ఏకాహారియై, ఏకశయ్యాపరుడై యుండవలసియున్నది. అంతకంటె యిప్పటివలె గృహస్థుడవై యుండి బుద్ధశాసనము ననుసరించుచు పర్వదినములయందు బ్రహ్మచర్య వ్రతనిష్ఠ డవై యుండుము."

---

(1) ఉదాన 5 - 6 (2) ఇప్పటిమాల్వా

స్వర్ణునకు ప్రవ్రజ్య కావలెనను ఉబలాటము తత్కాలమున తగ్గినది. మరికొన్ని దినములు గడచినవి. మరియు తన్ను తాను ప్రేరేపించుకొని మొదటివలెనే మహా కాత్యాయనుని వద్దకు బోయి అభ్యర్థించెను.

ఇట్లు మూడు పర్యాయము లైనంత మహాకాత్యాయనుడు స్వర్ణకోటికర్ణ ఉపాసకునకు శ్రామణేర భిక్షుదీక్ష నొసంగి పదంపడి మూడేండ్లు గడచినంత పదిమంది భిక్షువులను ప్రోగుజేసి అతని నుపసంపన్నుని జేసెను.

ఆయుష్మంతుడగు స్వర్ణున కొకప్పుడు భగవంతుని దర్శింపకుతూహల మొదవినది. 'ఇన్నాళ్లు భగవంతు డట్టివాడిట్టివాడని చెప్పగ వినుటయేగాని ప్రత్యక్షముగ నేను దర్శించియుండలేదు. అమ్మహానుభావు డున్న చోటికి బోయి దర్శనము చేసికొని వత్తున'ని నిశ్చయించెను.

అంతట సాయంకాల ధ్యానమునుండి లేచి ఆయుష్మంతుడు స్వర్ణుడు ఆచార్యుడగు మహాకాత్యాయనునివద్ద కరిగి తన మనోరథము నెఱిగించి బుద్ధదేవుని సన్నిధికరుగ ననుజ్ఞ వేడికొనెను. అతని సదభిలాషకు ముదితహృదయుడై మహాకాత్యాయనుడు ''కుమారా! లెస్స! లెస్స! భగవంతుని అర్హతుని సమ్యక్ సంబుద్ధుని సందర్శనమునకు అవశ్యము పోయిరమ్ము. సుందరుడు సుప్రసన్నుడు సుమనోహరుడగు సుగత దేవునకు నామాఱుగ ప్రణమిల్లి నా మాటలలో కుశల ప్రశ్నలందింపుము. పొమ్ము'' అని అనతిచ్చెను. మహాప్రసాదము, పోయివత్తున''ని సోణుడు (స్వర్ణుడు) తన శయనాసనములను పాత్రచీవరములను వెంటగొని భగవంతుడుండు శ్రావస్తీనగరమును, క్రమముగ చారికనొనర్చుకొనుచు వచ్చి చేరి అనాథపిండకుని జేతవనారామమును జొచ్చెను.

లోనికరిగి బుద్ధచంద్రునకు సాష్టాంగమెఱగి యొక్క చక్కని గూర్చొని ''భంతే! మా ఉపాధ్యాయుడగు మహాకాత్యాయనుడు భగవానులవారి శ్రీపాదములకు నమస్కరించుచున్నాడ''ని విన్నవించెను.

''భిక్షూ! మీ రందఱును కుశలురెగదా? శరీరయాత్ర నెమ్మదిగనె సాగుచున్నది గదా? ప్రయాణములు సుఖకరములెగదా?''

''దేవా! అంతయు ననుకూలమె.''

పిమ్మట భగవంతు డానందుని పిలిచి ''ఆనందా! ఈ ఆగంతుక భిక్షునకు శయనాసనములనిచ్చి బస చూపింపుము.'' అని వ్రాకుచ్చెను. ఆయుష్మంతుడు

ఆనందుడును సోణభిక్షువునకు వలయు నాస్తరణముల నిచ్చి) భగవానుడు విహరించు భవనమునందే వానికి వసతిని చూపించెను. బుద్ధదేవుడును వేకువనె లేచి స్వర్ణునితో ''భిక్షూ! నీవు నేర్చిన ధర్మప్రసంగము నేదైన నొకదానిని ఒప్పింపుము'' అని ఆదేశించెను.

''స్వామీ! మంచిది'' ని మాఱుపల్కి పదునాఱు అష్టకవర్గకములను పారాయణము చేసెను. చక్కగ స్వరసహితముగ పలికిన సోణభిక్షువును ప్రశంసించుచు అమ్మహాత్ముడు ''భిక్షూ! చాల చక్కగ నేర్చితివి. విస్పష్టమును, కల్యాణయుక్తమును, అర్థవిజ్ఞాపన యోగ్యమును నగు వాక్కుతో సొంపుగ పఠించితివి. నాయనా! నీవు ఉపసంపదను బొంది యెన్నేండ్లైనది?'' అని ప్రశ్నించెను.

''దేవా! ఒక్క సంవత్సరము.''

''భిక్షూ! యింత తడ వేల జేసితివి?''

''ప్రభూ! కామములవలన గలుగు చెడుగును నేను చాల విలంబముగ గ్రహింపగల్గితిని. గృహవాస మొక ఉమ్మలిగుంతగదా? చప్పున బైటబడుటనునది సాధ్యమగునా?''

భగవంతు డంతట యీ క్రింది ఉదానమును పాడెను.

తే. గీ. ఆర్యపురుషుడు దుష్పరిణామములను
లోకమునగాంచి, ఉపధుల లోనుగాక
పూర్ణధర్మంబునెఱిగి సంబుద్ధుడగుచు
కిల్బిషంబుల నంటక గ్రీడసేయు.

భగవంతుని యంతికమున కొంతకాలముండి స్వర్ణుడు యథాస్థానమగు మహాకాత్యాయనుని చేరువ జేరికొనెను.

## భగవంతుని సన్నిధిలో స్వర్ణకోటికర్ణుడు

★ మరికొంతకాల మరుగుడు సోణకుటికణ్ణ (స్వర్ణకోటికర్ణు) నకు తిరిగి బుద్ధదేవుని సందర్శించిరావలెనను తమకము కలిగినది. ఆచార్యునియొద్దకు చని సెలవడిగెను. ఆయనయు ప్రేమతో నొడంబడి యిట్లనియె.

---

★ మహావగ్గ 5.

''సోణా! భగవంతునకు వందనము లర్పించి వెండియు నిట్లు వేడికొనుము. భంతే! దక్షిణాపథమగు అవంతీప్రాంతములందు భిక్షువుల సంఖ్యకడుంగడు అరుదు. మూడేండ్ల పొడవున పోరాడిపోరాడి పదిమంది భిక్షువులను ప్రోగుజేసికొని నేను ఉపసంపదను పొందితిని. అందువలన యికమీదట మఱింత కొద్ది భిక్షుసంఘము తోనైనను ఉపసంపదా దీక్షను నెరవేర్చుకొనజాలునట్లు అవంతీదక్షిణాపథవాసులకు దేవరవారనుమతి నివ్వవలెను. 2. మరియు నక్కడినేలలు కఱకునేలలు. పశువుల త్రొక్కిడిచే యెగుడుదిగుడై యుండును. కావున నచ్చటి భిక్షువులు పాదుకలు ధరించునట్లనుజ్ఞనివ్వవలెను. 3. ఆ దేశ వ్యవహారము ననుసరించి భిక్షువులకును నిత్యస్నానము ననుమతింపవలెను. 4. ఆ దేశమునందు కూర్చొనుటకును పరుండుటకును ఆస్తరణములుగ చర్మములనె వాడుదురు. కాబట్టి భిక్షువులుకూడ మేకచర్మములను – గొఱ్ఱెచర్మములను – జింకచర్మములను వాడుకొనునట్లు ఆజ్ఞ యివ్వవలెను. సోణా! నీవిట్లు భగవంతుని ప్రార్థించిరమ్మ'' ని పంపించెను.

స్వర్ణుడును ముందటివలెనే శ్రావస్తికరిగి భగవంతుని చెంగటచేరి ధర్మప్రసంగ ములు నడపుకొని తన ఆచార్యుడగు మహాకాత్యాయనుడు సూచించిన వరముల నభ్యర్థించి యంగీకారము వడసి యెప్పటివలె అవంతీదేశమందలి కురరఘర ప్రపాత పర్వతమున నివసించు ఆయుష్మంతుడు మహాకాత్యాయనుని చెంతకువచ్చి చేరెను.

## జటిల సూత్రము

[1] ఒకప్పుడు శాక్యమునిచంద్రుడు బుద్ధుడు శ్రావస్తీపురమందు మృగారమాత విశాఖ నిర్మించిన [2] పూర్వారామ ప్రాసాదమున విహారము చేయుచుండెను.

అది సాయంకాలము వేళ. ధ్యానమునుండిలేచి ద్వారమునకు వెలుపల బుద్ధస్వామి కూర్చొనియున్నాడు. కోసలరాజా ప్రసేనజితుడు చనుదెంచి అభివాదన మొనర్చి యొక్కెడ కూర్చొనెను. అంతలో అంతలంతల నఖరోమములను పెంచు కొనిన జటిలులు, నిగంఠువులు, అచేలకులు, ఏకశాటికులు, పరివ్రాజకులు యేడే డ్వురుమంది భగవంతునకు చెంతలపొంతల నగరములోనికి ప్రవేశించుచుండిరి. వారిని జూచి ప్రసేనజితుడు ఆసనమునుండి లేచి ఉత్తరీయము నెడమభుజముపై

---

(1) సం. ని. 3 – 2 – 1.

(2) ముప్పదియవ వర్షావాసము శ్రావస్తియందు పూర్వారామమున నడచినది. ఆ ప్రాసాదము, చుట్టును నాలుగు వాకిండ్లుగల ప్రాకారముతో కూడినది. భగ వంతుడు తూరుపు ద్వారమునకు బైట కూర్చొనినాడు. (అ. క.)

సర్దుకొని వారివైపుమళ్లి మోకాళ్ళపై కూర్చొని, అంజలిబంధించి, ''స్వామీ! నేను కోసలరాజా ప్రసేనజితుడ''నని ముమ్మాఱు పలికి నమస్కరించెను.

ఆ జటిలులు కనుచాటయినంత పదంపడి భగవంతుని చెంత జేరి మహీకాంతుండు ''దేవా! వీరు అర్హతులైన లేదా అర్హతమార్గము నధిష్ఠించిన వారియందు చేరినవారి''ని పలికెను.

''మహారాజా! కామభోగములు, కాంతాపుత్రులు, గంధమాల్యములు, చందన సుగంధములు, వెండిబంగారములు, యిండ్లు వాకిండ్లు – ఇవి మీకు తెలిసిన విషయములు. కాని అర్హతులనిన అర్హతమార్గము నధిష్ఠించిన వారనిన మీకెట్లు తెలియును? శీలమును చెలిమిచేసి తెలిసికొనవచ్చునుగాని అదియు చిరకాల సాధ్యము. చిటికలమీదగాదు. లోతుగ విచారించియెగాని పైపైన పారజూచి కాదు. బుద్ధిమంతునకే శక్యముగాని మందబుద్ధికి గాదు.''

''భంతే! నిజము. నిజము.''

''మహారాజా!

గిల్ టు సొమ్ములు పసిడిని గేలిసేయు
కరణి ధూర్తుడు వేషాన కాంతిబొందు
తెలివిగలవాడు వన్నెచిన్నెలకు లోగి
కనిన దెల్లను కొనుటకై జనగరాదు.''

## ప్రియజాతిక సూత్రము

★ కోసలదేశమున శ్రావస్తీనగరము జేతవనారామము భగవానులకు విహారభూమి. ఒకానొకనాటికథ. పురవాసియగు నొక వైశ్యునకు ఉప్పుగల్లువలె ఒకే ఒకడు కొడుకు. వాడు తండ్రికి ప్రాణాలకు సరియెత్తు. కాలము వానిని కబళించినది. సుతుడు గతించుడు జనకునకు లోకమె పాడైనది. అన్నము యింపితము లేదు. పనులనిన బేజారు. ఒకనాడు భగవంతుని పజ్జకు వచ్చి అభివాదనములు జేసి యొకయోర కూర్చొనెను.

''గృహపతీ! నీలో నీవు లేవేమి? తహతహగనున్నావే?''

''స్వామీ! ఏకైక పుత్రుడు మరణించినాడు. ఇక ప్రశాంతి యెక్కడిది?''

★ మ. ని. 2 – 4 – 7. ఇరవై యొకటవ వర్షావాసము శ్రావస్తి జేతవనమున గడచినది.

''గృహపతీ! వాస్తవమంతే. శోక పరిదేవన దుఃఖదౌర్మనస్యములు ప్రియజాతికములుగదా? – ప్రియవస్తువులనుండి కలుగునవి గదా?''

''భంతే! అది యెట్లు? మీ రాడుమాట నేనొప్పన'' ని ఆ వైశ్యుడు చిడిముడి పడుచు లేచిపోయెను. కొంతదూరమున కొందఱు జూదరులు జూదమాడుకొనుచుండిరి. వారి వద్దకేగి గృహపతి యిటులనియె.

''ఏమండీ! చూచితిరా! శోకదౌర్మనస్యములు ప్రియవస్తువులమూలమున కల్గునవి యని శ్రమణగౌతముడు చెప్పుచున్నాడు. అదెట్లు? ప్రియవస్తువులవలన కలుగునవి సుఖ సౌమనస్యములెకదా?''

''అవును. గృహపతీ! నిజమే. ప్రియజాతికములు సుఖ సౌమనస్యములనుటె ఒప్పైనమాట.''

''ఈ ప్రసంగ మటనిట ప్రాకి అంతఃపురమునకు కూడ యెగబ్రాకినది. రాజా ప్రసేనజితుడు తన యిల్లాలగు మల్లికాదేవిని చేర బిలిచి యిట్లనియె. ''ప్రియే! వింటివా? శోకదౌర్మనస్యాదులు ప్రియజాతికములని మీ శ్రమణగౌతములవారు సెలవిచ్చినారట?''

''మహారాజా! భగవంతుడు చెప్పియున్నచో దానికి తిరుగేమున్నది?''

''ఓహో! మల్లికా! 'యథాగురు స్తథాశిష్యః' యిక లోటేమున్నది. శిష్యులు గంగిరెద్దులైనచో గురువుల సుభాషితములు 'నల్లేటిపై బండి నడచినట్లు' సామ్రాజ్యము వారిదేగదా? అడ్డమేమున్నది? పోపొమ్ము. చాటుకుపొమ్ము.''

పతికి మాఱాడ లేక మల్లికాదేవి ప్రక్కకు వైదొలగి అప్పుడగు నాలీజంఘుడను బ్రాహ్మణు నొకని పిలిచి యిట్లనియె.

''విప్రా! నీవు బుద్ధభగవంతునివద్ద కరిగి నామాఱుగ నమస్కరించి కుశల మడిగి 'దేవా! శోకదౌర్మనస్యాదులు ప్రియజాతికములని తాము నుడివినారట. నిజమేనా?' అని ప్రశ్నించి యేమి చెప్పుదురో తెలిసికొనిరమ్ము.''

బ్రాహ్మణుడును వల్లెయని సుగతదేవుని చేరబోయి మల్లికాదేవి మాటలను మనవి జేసెను. భగవంతు డిట్లనియె.

''విప్రవరా! వాస్తవమంతే. పూర్వమొకప్పుడీశ్రావస్తీనగరమున నొకస్త్రీ తన తల్లిని కోల్పోయినది. ఆమె దురవస్థ యేమని చెప్పవలెను? ఉన్మత్తయై వీధులు వీధులు

తిరిగనది. 'మా తల్లిని చూచితివా? మాయమ్మ యెందున్నది?' అని తలకలిగినవాని నెల్లను అడిగినది. అయ్యో! ప్రియవస్తువుల చివరిపంట దుఃఖముకాక మఱేమి. అట్లే మఱియొక నెలత తండ్రిని కోల్పోయినది. ఆమె దుర్గతియునంతే? ప్రియజాతి సమూహ మనుకొనిన సోదరీసోదరులు – కుమారీకుమారకులు – భార్యాభర్తలు మృత్యుగర్భములోనికి గుభిల్లన జాఱినపుడు లోకమేమగుచున్నది? శోక కుంభీ పాకమున కుతుకుతలాడుచున్నది.

బ్రాహ్మణా! తొల్లి యొకప్పుడు ఒక పడతి పుట్టింటికి పోయినది. ఆమెయొక్క సోదరబంధువు లామెను భర్తనుండి విడదీసి వేరొకని సొత్తు చేయుటకు నిశ్చయించిరి. దాని కామె యొడంబడక వారి నిర్బంధమును పతికి తెలిపినది. వాడును "ఎందుకీ బెడద? ఈ దేహము లింతటితో వీడి యిరువురమును జంటగ వేఱొకచోట పుట్టు దము"ని చెప్పి ఆ కాంతను ఖండించి తానును చచ్చెను. "అయ్యో! ఈ వికట సంఘట నకు ఆదిమూల మెద్ది? యోచింపుము. పొమ్ము."

భగవంతునితో పనివిని బ్రాహ్మణుడు మల్లికాదేవికి జరిగిన కథాసల్లాపముల పూస గ్రుచ్చినట్లు చెప్పెను. తదనంతర మామెయు పతియున్న తావుకేగి ప్రసంగమును దించుకొని మెల్లగ నిట్లనియె.

"మహారాజా! వజ్రిణి మీకు ప్రియమైనదెగదా?"

"మల్లికా! యేమట్లందువు? ఏకైక పుత్రికగదా? మిగుల ప్రియమైనది."

"నరపాలా! ఆ కుమారికకు యేదైన సంకటము వాటిల్లినచో, చెడుగు మూడి నచో మీకు శోకదౌర్మనస్య దుఃఖ ఉపాయాసములు సంభవింపవా?"

"ప్రియులారా! అది యిది యేమిటి? ప్రాణములు నిలుచునో నిలువవా?"

"నాథా! అందుకే సర్వమెఱిగిన పెద్ద బుద్ధదేవుడు 'శోకదౌర్మనస్యాదులు ప్రియజాతికములు'ని వాక్రుచ్చినాడు. మహారాజా! వాసభ క్షత్రియుడును, విడూడభ సేనాపతియును మీకు ప్రియులేగదా?"

"మల్లికా! అక్షరాలా ప్రియులే."

"ప్రభూ! వారికి యేదైన సంకటము వాటిల్లినచో చెడుగు దాపురించినచో మీకు శోకదౌర్మనస్య దుఃఖఉపాయాసములు సంభవింపవా?"

"సాధ్వీ!వెయ్యేల నేను జీవించుటయె సందేహమగును."

''మహారాజా! అందుకే సర్వజ్ఞసింహుడు సుగతనాథుడు 'శోకాదికములు ప్రియ జాతికములు' ని చెప్పుట – కోసలేశ్వరా?' కాశీ కోసల వాసులగు ప్రజలు మీకు ప్రియ పాత్రులే గదా?

''ఆహా! అవశ్యము. ఈ సుఖభోగములకు కారణము వారి శ్రేయస్సేగదా?''

''భూపాలా! వారు కడగండ్లకు గుఱియగుచో –''

''ప్రేయసీ! ఏమట్లందువు? నాజీవితసౌధమునకు పిడుగుపోటు.''

''భూనాథా! బుద్ధుడు రిత్తలు ప్రేలెడివాడా? పోనిమ్ము. మహారాజా! నేను నీకు ప్రియురాలనేనా?''

''చెలీ! ప్రియురా లేమిటి? ప్రియతమురాలవు.''

''నాథా! నాకేమైన చేటుమూడినచో –''

''ఛీఛీ! అమంగళము శాంతించుగాక. దేవీ! నా ప్రాణాలు నీతోడివై యున్నవి.''

''స్వామినాథా! ఇంతవట్టు విచారించియే సంబోధినాథుడు బుద్ధుడు 'శోక దౌర్మనస్య దుఃఖ ఉపాయాసములు ప్రియజాతికములు' ని నుడువుట.''

''మల్లికా! అహాహా! అద్భుతము. ఆ చుఱుకుచూపుకు చొఱరాని చోటు లేదు. ఆ అపార ప్రజ్ఞకు అందరాని విషయము లేదు.''

అని పలికి కోసలదేశాధీశుడు ప్రసేనజితుడు ఆసనమునుండి లేచి భగవంతుడున్న దిక్కునకుమళ్ళి కరపుటాంజలి నొసటగీలించి భక్తి ప్రవణమై చిత్తము తొట్రుపడ – యెలుంగుడిందుపడ –

[1] ''నమోతస్స భగవతో అర్హతో సమ్మా సంబుద్ధస్స'' అని ముమ్మాఱు ప్రణమిల్లెను.

## పుణ్యసూత్రము

[2] అనాథపిండకుని జేతవనారామమున మహానుభావుడు బుద్ధుడు విహారము చేయుచున్నాడు. అట్టియెడ ఆయుష్మంతుడు [3] పూర్ణుడు భగవంతుని సమీపించి అభివాదనము సలిపి యొకచో నాశీనుడై యిట్లనెను.

---

(1) నమోతస్స భగవతో అర్హతో సమ్యక్ సంబుద్ధస్య (సంస్కృతరూపము.) = అర్హతుడు సమ్యక్ సంబుద్ధుడునగు ఆ భగవంతునకు నమస్కారము (తెలుగుసేత)

(2) సం. ని. 34 – 4 – 6.

(3) అ. క. ఈనాటి థానా – సూరత్‌జిల్లాల ప్రాంతభూమియై యుండిన సూనాపరాంతను రాష్ట్రమున నొకగ్రామమునందు యిద్దఱు సోదరులుండిరి. వారు వణిజులు.

''స్వామీ! దయచేసి దేవరవారు నాకు టూకీగా ధర్మము నుపదేశించుము. దానిని విని యెందేని యేకాంతమున సంయమినై విహరించుచుందును.''

''పూర్ణా! వినుము. కంటికి కానబడు విషయములు ప్రియరూపములు. ఆహ్లాదకరములు. వాటిని చూచి భిక్షువు తలయూపినచో గుటకలు మింగినచో ఒడి సాచినచో సంసిద్ధముగ తృష్ణ ప్రత్యక్షమగుచున్నది. అది దుఃఖములకు కూకటివేరు. విషయములకు లోబడని భిక్షువు తృష్ణయొక్క తలగిల్లినవాడు. తృష్ణే లేనిచో దుఃఖము లెక్కడివి?

అట్లే పూర్ణా! చెవికి వినవచ్చునవి, చర్మమునకు తగులునవి, నాలుకకు రుచి యైనవి, ముక్కు నాకర్షించునవి, మనస్సుకు తెలియవచ్చునవి యగు సకల విషయ రూపములును ప్రియమును కలిగించునవి; ఆహ్లాదము నొదవించునవి. వాటిపాలై ఆర్యశ్రావకుడు తృష్ణకు దాసుడు కారాదు. దుఃఖములకు తృష్ణ ఆదిస్రోతము. తృష్ణకు నిలువ నీడ లేదా ఇక దుఃఖములా పొలిమేర ద్రొక్కవు. నేను చెప్పిన యీ సంక్షిప్తధర్మమును హృదయమునకు నాటిపోయుమము.''ఆయుష్మంతా! ఏ దేశమునకు వెళ్ళెదవు?

''భంతే! సూనాపరాంతమను దేశమునకు పోయి అందే విహరింతును.''

''పూర్ణా! సూనాపరాంత ప్రజలు దయాధర్మములు లేని వారు. కఠోరకర్కశులు. ఊరూరకనె దుర్భాషలాడెదరు. పాపము! నీవేమగుదువో?''

''స్వామీ! పుణ్యులు – మహాపుణ్యులని కొండాడుదును. చేతులకాళ్ళ మోదకుండా గాలికిపోవు మాటలతోనే నన్ను విడిచి పుచ్చిన వారు పుణ్యులుగాక మఱెవ్వరు?''

''పూర్ణా! ఒకవేళ వారంతటికిని తెగబడినచో –''

''దేవా! ఉదారులు – మహోదారు లనుకొందును. కట్టెలతో నలియగొట్టకుండా కాళ్ళచేతుల మోది విడుచుట నయము కాదా?''

---

ఒకప్పుడు పెద్దవాడగు పూర్ణుడు వ్యాపారమునకై యేనూఱుబండ్లను కట్టుకొని శ్రావస్తీపురమునకువచ్చి జేతవనసమీపమున బండ్లను విడిపించెను. పౌరులు భగవంతుని దర్శింప గంధపుష్పములనుగొని జేతవనమును జొచ్చుచుండిరి. పూర్ణుడును వారితో బోయి భగవంతుని ధర్మోపదేశములు విని విరక్తుడయ్యెను. వెంటివచ్చిన పరిజనముతో బండ్లను – సామానులను వెనుకకు తమ్మునివద్దకు పంపి తాను బుద్ధదేవునివలన ప్రవ్రజ్యను పొందెను. కాని అతని యోగాభ్యాసమునకు ఆ చోటు అనుకూలము గాక స్వదేశమునకు పోదలంచెను.

''పూర్ణా! కాలకర్మ సంయోగముతో వారు కట్టెలతోనే గొట్టినచో -''

''ప్రభూ! కత్తులతో నఱుక లేదుగదా?''

''పూర్ణా! మాటకనుకొందము. కత్తితోనే నఱికిరిబో -''

''స్వామీ! వారి ఉపకారము యీడుజోడు లేనిది. మలపిండముతోడివలె దేనితోడి పొత్తును ఆర్యశ్రావకు డహరహమసహ్యించుకొనుచుండి గూడ అనివార్యముగ అనుభవించుచున్నాడో అట్టి తుచ్ఛ - మలిన దేహముతోడి సంసర్గ మును అయాచితముగ - అప్రయాసముగ విడిపించినవారు ఉపకారులెగాదు - మహోపకారులు.''

''పూర్ణా! ధన్యుడవు. ధన్యుడవు. నీ శమదమములకు మితి లేదు - పరిమితి లేదు. సూనాపరాంతమునందె గాదు; నాయనా! సకల విశ్వంభరయందును జయము నీ పాలిటిదే.''

అని యిట్లు భగవంతు డగ్గించుటయు పూర్ణుడు ఆసనమునుండి లేచి శాస్తకు అభివాదనముచేసి శయనాసనములను పాత్రచీవరములను తోడగొని క్రమముగ చారిక నొనర్చుకొనుచు సూనాపరాంత జనపదమును ప్రవేశించెను. ప్రవేశించిన ఆ సంవత్సరమందే యేనూరుమంది ఉపాసకులకు జ్ఞానమును కలిగించెను. తానును జ్ఞానసాక్షాత్కారమును బొంది ఆవాగమనరహితమగు పరినిర్వాణమును ప్రాపించెను.

## ౧౧

## మఖాదేవాది సూత్రములు (వి. పూ. 440 -36)

★ మిథిలానగరములో మఖాదేవ ఆమ్రవనమున విహరించుచు, భగవంతు డొకప్పుడు నవ్వెను. నికటవర్తియగు ఆనందు డది చూచి 'నిష్కారణముగ భగవం తుడు నవ్వడు. ఏదేని కారణముండగలద' ని తలంచి సమీపించి ''దేవా! తామెందుకు నవ్వితిరో సెలవియ్యవలయును'' ని సవినయముగ ప్రార్థించెను

''ఆనందా! కౌతూహలపూర్ణమగు పూర్వవృత్తము నొక్కటి చెప్పెదను వినుము. తొల్లి మిథిలాపురియందు పరమధార్మికమూర్తియగు మఖాదేవుడను రాజొ కడుండెను. అతని ధర్మప్రభాలోకములు మూలమూలలకును బ్రాకినవి. ఆయన అమావాస్య - పౌర్ణమి - ఉభయపక్ష అష్టమీలయందును ఉపవాసవ్రతమును చేయువాడు.

★ మ. ని. 2 - 4 - 3.

ఒక నాడారాజు పెద్దకొడుకును వద్దకు చేర్చుకొని యిట్లనియె. ''కుమారా! పిలుచుకొనిపోవుటకు వచ్చిన దేవదూతలో యన్నట్లు, యివియె నెరసిన వెంట్రుకలు నా తలయందు పొడగట్టుచున్నవి. ఇన్నాళ్ళు వలసినట్లు మానుషభోగముల ననుభవించితిని. ఇక దివ్యభోగములకై పాటుపడవలెను. ఇదె యీ రాజ్యమును నీకప్పగించి పుత్రా! నేను యిండ్లువాకిండ్లు విడిచి సంన్యసించిపోయెదను. నీవును ముసలి తనము తొంగి చూచినంతనె అగ్రసుతుని రాజ్యాధిపతిగజేసి నావలెనే ప్రవ్రజితుడవై పొమ్ము. ఈ కల్యాణమార్గము నాతోనే కడయగునట్లు చేయకుము.''

అని కుమారున కుపదేశించి, ఆనందా! రాజగు మఖాదేవుడు తలను గడ్డమును గొఱిగించుకొని మంగలి కొక గ్రామమును కానుక నిచ్చి ఈ మామిడివనమున ప్రవ్రజించెను. అతడిందు వసించుచు [1] బ్రహ్మవిహారముల భావించుచున్నవాడై మేను విడిచి బ్రహ్మలోక ప్రాప్తు డయ్యెను.''

''ఆనందా! ఆ మఖా దేవుని పుత్రులును, అతని పుత్రపౌత్రులు గూడ సంప్రదాయక్రమమును వీడక ఈ ఆమ్రవనమునందే సంన్యసించుచు వచ్చిరి. కాలము కొంత గడచినంత వారి పరంపరయందు నిమియను మహారాజొకడు ఉత్పన్నమయ్యెను.

అతడు తన పూర్వుల అడుగుజాడల ననువర్తించుచు ప్రజానురంజన తత్పరుడై యుండెను. ఒకప్పుడు త్రయస్త్రింశ దేవతలు సుధర్మానామక సభయందు సమావిష్టులై ''వహవా! విదేహుల భాగ్యమె భాగ్యము. మహాధర్మాత్ముడగు నిమిచక్రవర్తి వారి వంశమునందుదయించినాడు. ధన్యులు ధన్యుల''ని పలువిధముల ప్రశంసించిరి.

ఆనందా! ఆ నిమిరాజు కుమారుడు కలారజనకుడు. అతడు గృహత్యాగము చేసి సంన్యసించ లేదు. ఆ కల్యాణమార్గ మతనితో తెగినది. ''ఆ విషయమును స్మరించుకొని నవ్వితిని.''

ఆయుష్మంతా! నేనును యీ కళ్యాణపథమును నెలకొల్పితిని. నిర్వేదము కొఱకు, విరాగముకొఱకు, నిరోధముకొఱకు, అభిజ్ఞకొఱకు, సంబోధికొఱకు, నిర్వాణముకొఱకు – సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పము, సమ్యక్ వచనము, సమ్యక్ కర్మాంతము, సమ్యక్ ఆజీవము, సమ్యక్ వ్యాయామము, సమ్యక్‌స్మృతి, సమ్యక్ సమాధి యనెడి ఆర్యాష్టాంగికమార్గమును ప్రతిష్ఠించితిని. దీనిని మీరు పదికాలముల

---

(1) మైత్రీ,కరుణా, ముదితా, ఉపేక్షలు నాలుగు.

పాటు ప్రవర్తించునట్లు జేయుడు. కాని నిమిరాజు కొడుకువలె మీరే అంతిమపురుషులు కావద్దు.

ఆ మధురవాక్యములు విని ప్రసన్నుడైన ఆనందుడు భగవంతుని పలువిధముల ప్రశంసించెను.

## సారిపుత్ర సూత్రము

[1] భగవంతు డొకప్పుడు శ్రావస్తీ జేతవనమున విహారము చేయుచుండెను. ఆయుష్మంతుడు సారిపుత్రుడు సమీపించి అభివాదనములు చేసి యొకవైపు కూర్చొనెను. అతని చూచి భగవంతు డిట్లనియె.

''సారిపుత్రా! స్రోతాపత్త్యంగమని, స్రోతాపత్తి – అంగమని చెప్పుచుందురు. ఆ స్రోతాపత్తియొక్క అంగమనగ నేమి?''

''భగవంతా! సద్ధర్మశ్రవణము స్రోతాపత్తికి అంగము. చక్కని మనస్సమాధానము స్రోతాపత్తికి అంగము. ధర్మానుకూలవర్తనము స్రోతాపత్తికి అంగము.''

''సారిపుత్రా! స్రోతము స్రోతమనుచుందురుగదా? స్రోతమన నేమి?

''స్వామీ! సమ్యక్ దృష్టి మొదలగు ఆర్యాష్టాంగికమార్గమును స్రోతమందురు.''

''సారిపుత్రా! స్రోతాపన్నుడనగ నెవడు?''

''భంతే! ఆర్యాష్టాంగికమార్గమున ప్రవర్తించువాడు స్రోతాపన్నుడు.''

''కుమారా! సాధు. సాధు.''

## స్థపతి సూత్రము

[2] బుద్ధదేవుడు శ్రావస్తీ జేతవనమున నున్నాడు. ఆ సమయమున భిక్షువులు పలువురు చీవరకర్మ (వస్త్రములుకుట్టుట) యందు మగ్నులైయున్నారు. ఆ పని ముగిసినంతనె భగవంతుడు చారికకై పోయెదరు.

---

(1) సం. ని. 54 – 1 – 5 ముప్పదిరెండవ వర్షావాసము శ్రావస్తీ పూర్వారామమునను, ముప్పదిమూడవ వర్షావాసము జేతవనమునను నడచినది.

(2) సం. ని. 54 – 1 – 6

సాధుకగ్రామమున నివసించు ఋషిదత్తుడు, పురాణుడను యిరువురు శిల్పులు భిక్షువులొనర్చు చీవరకర్మ తర్వాలో ముగియగలదని వినిరి. వారు తమ పరిజనులను కొందఱిని పిలిచి "అప్తులారా! మీరు దారియందు వేచికొనియుండుడు. భగవంతుడు సమ్యక్ సంబుద్ధుడు తర్వాలో పాదచర్య నొనర్చుచు యీ మార్గముననె రాగలడు. మీ రవశ్యము గ్రహించి మా వద్దకు వచ్చి చెప్పునది" ని ఆనతిచ్చిరి. కొన్నాళ్లు గడచినది.

భగవంతుడు ముందు బోవుచున్నాడు. వెనుక వెనుక స్థపతు (శిల్పు) లిరువురు ఋషిదత్తుడును పురాణుడును అనుసరించి చనుచున్నారు. మార్గమునుండి పైదొలగి సుగతదేవుడొక చెట్టు క్రిందికి బోయెను. వారును పోయి సుఖాసనమున కూర్చొనియున్న తథాగతునకు సాగిలి మ్రొక్కి యిట్లనిరి.

"దేవా! తాము శ్రావస్తినుండి కోసలమునకు బయలుదేరుచున్నారని వినిన కడుపులో చేయివెట్టి కలచినట్లుండును. ప్రభుదేవుడు మాకు దూరమగుచున్నాడే యని తహతహపడెదము. [1] కోసలమునుండి [2] మల్లదేశమునకు పోవుచున్నారని వినిన మఱింత దూరమగుచున్నారే యని వేదన బొందెదము. అటనుండి వజ్జిదేశమునకును, అందుండి కాశీదేశమునకు, అచ్చోటినుండి మగధదేశమునకును పోవుచున్నారని వినినచో యింక నింకను దూరమగుచున్నారని మిగుల నీరసించిపోయెదము.

వెండియు తాము మగధదేశమునుండి కాశీ దేశమునకు దిగి వచ్చుచున్నారనిన విని మేము ఉబ్బిపోయెదము. కాశీదేశమునుండి వజ్జి దేశమునకును, అటనుండి మల్ల దేశమునకును, అచ్చోటినుండి కోసలమునకు, కోసలమునుండి శ్రావస్తికిని వచ్చుచున్నారన్నచో మా ఉత్సాహమునకు పట్టపగ్గములుండవు. భగవానులవారాను కొని వచ్చుచున్నారని ఉప్పొంగిపోయెదము. అనాథపిండకుని జేతవనారామమున తాము విహరించుచున్నారని విని హాయిగ ఆదమఱచి నిద్రింతుము."

"స్థపతులారా! సాగను. సాగను. మీ మంజులాలాపము లెంతకైన మెచ్చదగినవి. నాయనా! గృహము బందెదొడ్డివంటిది. గృహస్థుడందు బంధింపబడినాడు. వాని యిడుమ లకు కడలేదు. సంన్యాసము బటాబయలు. గృహవాసులగు వారు సావధానులై ప్రమత్తులు గాక మెలగవలెను. అప్రమాద మాతనికి శ్రీరామరక్ష.

---

(1) కోసలము = అవధ, బస్తీ, గోరఖ్‌పూర్, ఆజంగఢ్, జైనపుర జిల్లాల ప్రాంతభూమి.

(2) మల్లదేశము = గోరఖ్‌పూర్, ఛపరా జిల్లాలు.

అదియే వానికి వజ్రకవచము. మఱియు, నాలుగు ధర్మముల నాశ్రయించిన ఆర్య శ్రావకుడు అస్ఖలితమగు స్రోతాపత్తిని నియతసంబోధిని ప్రాపించుచున్నాడు. ఆ నాలుగు యేమిటి? బుద్ధునియం దాసక్తుడగుట, ధర్మమునం దనురక్తుడగుట, సంఘమునందు ప్రసక్తుడగుట యివి మూడుధర్మములు, గృహవాసియయ్యు ముక్తహస్తుడై, త్యాగరతుడై దానశీలుడైయుండుట నాల్గవ ధర్మము. ఈ నాల్గిట నొప్పినవాడు స్రోతాపన్నుడు కాగలడు. స్థపతులారా! మీరును యీ ధర్మముల ననుసరించి దానపరాయణులై శీలవంతులై కల్యాణధర్ములై విలసిల్లండి. నాయన లారా! కోసలదేశమున మీబోటివారు తఱచుగ నుందురు.''

భగవంతుని అనుగ్రహమునకు పాత్రులమైతిమని వారు మిక్కిలి సంతసించిరి.

## విశాఖా సూత్రము

★ భగవంతుడు శ్రావస్తియందు విశాఖామృగారమాతయొక్క పూర్వారామప్రాసాదమున విహరించుచుండెను. ఆ సమయమున విశాఖాదేవియొక్క గారాము మనుమడు మరణించెను. ఆమె తడిసిన బట్టలతో తడిసిన వెంట్రుకలతో మధ్యాహ్నవేళ యందు భగవంతుని చక్కటికి వచ్చి నమస్కరించి యొక యొరగూర్చొనెను.

''విశాఖా! ఈ వేషముతో యీ మధ్యాహ్న వేళ యెందు కొచ్చితివి?''

భగవంతా! నా మనుమడు మరణించుటచే వికలహృదయనై వచ్చితిని.''

''విశాఖా! ఈ పురమునందుండు వారందఱును నీ బిడ్డలును, మనుమలును గాదా?''

''భంతే! నే నట్లే తలంచితిని.''

''విశాఖా! ఈ శ్రావస్తియందు దినమున కెందఱు మనుష్యులు చత్తురు?''

''దేవా! ఇంతపట్టణములో చావనునది లేనిదినముండదు. ఒక్కరిద్దరు పది వఱకు చచ్చుచునె యుందురు.''

''విశాఖా! అట్లయిన నీకు నిత్యప్రతి తడిబట్టలు తప్పని సరియేగదా?''

''మహాస్వామీ! లేదు. నా సొంత బిడ్డలు – మనుమల కొఱకయియే –''

''విశాఖా! ప్రియము దుఃఖము యిరుగుపొరుగు. నూఱు ప్రియములకు

---

★ ఉదాన 8 – 8 (34 వ వర్షావాసము భగవంతుడు శ్రావస్తీపూర్వారామమున గడపెను)

నూఱు దుఃఖములు. ఏబదికి ఏబది. పదికి పది. ఒక ప్రియమున కొక దుఃఖము. ప్రియములు లేవా దుఃఖములును లేవు. సర్వత్ర ప్రియరహితునకు శ్రమయే లేదు.

*తే॥ గీ॥ ప్రియమె దుఃఖంబు గల్గించు ప్రియమె వివిధ - శోకపరిదేవనంబుల కాకరంబు*
*అవని యెవనికి ప్రియవస్తువనునదొకటి - లేదొ వానికి దుఃఖాలు లేనె లేవు.*

*క॥ లేడెవ్వడు నరుడతనికి - యీడును జోడునగువాడు యిలనెందేనిన్*
*కీడుడుగును ప్రియముడిగిన - పోడిమినిదిగాంచు ప్రాజ్ఞపురుషుండెదలోన్.*

## ప్రధానీయసూత్రము

★ అది జేతవనారామమున భగవంతుడుండు సమయము. ఒకనాటి సాయం కాలము ధ్యానమునుండి లేచి బుద్ధదేవుడు ఉపస్థానశాలకరిగి ఆసనముపై గూర్చొ నెను. గురునాథుని పరివేష్టించి ప్రముఖ శిష్యులగు సారిపుత్ర మౌద్గల్యాయన మహాకా శ్యప మహాకాత్యాయన మహాకోష్ఠిత మహాచుంద మహాకప్పిన అనురుద్ధ రేవత ఆనంద ప్రభృతులు ఆయా ఆసనములందుపవిష్టులై యుండిరి. రాత్రి మిక్కిలి గడచునంత వఱకు ఆ సభలోనె యుండి తథాగతుడు లేచిపోయెను. వారితోడనె ముఖ్యులగు వారందఱును లేచిపోయిరి; కాని క్రొత్తగ ప్రవ్రజితులైన భిక్షువులు కొందఱుమాత్ర మందేపరుండి ప్రొద్దుపొడచునంత వఱకును గుఱకలుపెట్టి నిద్రించుచుండిరి. భగవంతుడచ్చోటికి బఱతెంచి భిక్షువుల నుద్బోధించి యిట్లనియె.

"భిక్షువులారా! సారిపుత్రుడు మొదలగు స్థవిర శ్రావకులేరేరి?"

"స్వామీ! మీరు లేచినంతనె వారును వారివారి విహారములకు బోయిరి."

"ఆయుష్మంతులారా! ప్రాతక్రొత్తభిక్షువులందఱును సూర్యోదయము వఱకు గుర్వెట్టి నిద్రింపనేర్చితిరా? భిక్షువులారా! ఇష్టము వచ్చినట్లు తిని, ఇచ్ఛా నుసారము నిద్రించి శయనసుఖమున స్పర్శసుఖమున సొక్కి సోలుచుండు క్షత్రియ నరపతి చిరకాలము జీవిత మున్నంతవఱకు లోకప్రియుడై రాజ్యమేలగలుగుటను మీరు కనియున్నారా? వినియున్నారా?"

"దేవా! లేదు."

"భిక్షువులారా! నిజమే. నేను కూడ యెఱుగను. పోనిండు. రాష్ట్రికుల (గవ ర్నరు) నైనను, పేత్తణకుల (నగరాధికారి)నైనను, సేనాపతులనైనను, గ్రామాధిప

★ అ. ని. 6 - 1 - 2 - 7. (35 వ వర్షావాసము జేతవనమునందు).

తుల నైనను తిని తిరిగి యథేచ్ఛగ నిద్రించి అభ్యున్నతి కాంచినవారిని చూచియు న్నారా?''

''స్వామీ! లేదు.''

''భిక్షువులారా! ఇంద్రియములకు అదుపాజ్ఞ లేక, భోజనమునకు మితిమేర లేక, జాగరణమునందు శ్రద్ధలేక, కుశలధర్మములందు విపశ్యనలేక పూర్వాపరరాత్రు లందు బోధిపక్షీయ ధర్మభావనలేక యే శ్రమణబ్రాహ్మణుడైనను ఆస్రవముల నూడగొట్టి చిత్త విముక్తి – ప్రజ్ఞావిముక్తులను చేపట్టి యీ జన్మమునందే జ్ఞానసాక్షా త్కారమును పొందగలిగి యున్నాడని మీ రెందైన కనినారా? వినినారా?''

''ప్రభూ! లేదు.''

''భిక్షువులారా! మంచిది మంచిది. మీరేకాదు; నేనుకూడ కనలేదు, వినలేదు. ఏదీ లెండు. ప్రతిజ్ఞ చేయుడు. 'ఇంద్రియద్వారములను రక్షించెదను. భోజనమున మితమును గుర్తింతును. జాగరణమందు శ్రద్ధవహించెదను. కుశలధర్మములందు విపశ్యకుడనౌదును. పూర్వాపరరాత్రులలో బోధపక్షీయధర్మములను భావింతును' అని శపథము చేయుడు. భిక్షువులారా! మీకు మేలగుగాక!''

## జరాసూత్రము

★ అది యొక దినము. భగవంతుడు బుద్ధచంద్రుడు శ్రావస్తియందు సాయం కాలమున ధ్యానమునుండి లేచి పూర్వారామ ప్రాసాదమునకు వెనుకవైపు నీరెండలో కూర్చొనియుండెను. ఆయుష్మంతుడు ఆనందుడు సమీపించి నమస్కరించి శరీర మును తన చేతులతో నిమురుచు తోముచు దశబలునితో నిట్లనియె.

''భంతే! ఆశ్చర్యము. భగవానులవారి దేహకాంతి మసకినది. వెనుకటివలె చర్మము తళతళ యని లేదు. అవయవములు బిగువు దప్పినవి. మేను ముడుతలు బాటినది. పూర్వాంగము ముందుకు మ్రొగ్గినది. చక్షురాది యింద్రియములు దీన దుర్బలములగుచున్నవి. దేవా! ఇది యేమి?''

''ఆనందకుమారా! అది నైజమేగదా! యౌవనమున ముసలి తనము, ఆరోగ్య మున వ్యాధి, జీవనమున మరణము అవినాభావముగ పొంది పాదిగియె యున్నవి'' అని నుడివి సుగతదేవుడు మరియు నిట్లనియె.

---

★ ముప్పదియాఱవ వర్షావాసము శ్రావస్తి పూర్వారామమునందు గడపెను.
స.ని. 47 – 5 –1.

''మానవకోటినంతను గ్రమ్మగజేయు ఓ ముసలితనమా! నీకు ధిక్కారము. ధిక్కారము. నీ ప్రాజాపత్యము చెల్లనిచోటు లేదు కదా? నూఱేండ్లు బ్రతికినను నీకు తలవంచవలసినదే.''

## ౧౨

## బోధిరాజకుమార సూత్రము (వి. పూ. 435)

[1]ఒకప్పుడు సుగతభగవంతుడు భర్గదేశములో [2] సుంసుమారగిరియొక్క భేసకలావన మృగదావమున విహరించుచున్నాడు. ఆ సమయమున బోధిరాజకుమారుడు కోకనదమను పేరుగల నొక ప్రాసాదము (మేడ) ను నూతనముగ నిర్మించినవాడై అందు మొమ్మొదట ఒక శ్రమణుని మూలమున లేదా బ్రాహ్మణుని మూలమున ప్రవేశోత్సవము నిర్వర్తింప కుతూహలించెను. ఒకనాడు తన మిత్రుడగు బ్రాహ్మణ మాణవకుని సంజికాపుత్రుని బిలిచి ''సౌమ్యా! బుద్ధభగవంతుని వద్ద కరిగి నామాఱుగ నమస్కరించి నా మాటలలో కుశలప్రశ్న లడిగి యెల్లి భోజనమునకు భిక్షుసంఘ సమేతముగ నతని నాహ్వానించి రమ్మ''ని పంపించెను.

అతండును వల్లెయని వీడ్కొని బుద్ధదేవుని వద్ద కరిగి చెలికాడు చెప్పినట్ల యొనర్చి మరలివచ్చి బోధిరాజకుమారునితో భగవంతుడు నిమంత్రణము నంగీకరించినాడని తెలియజేసెను.

రాత్రిగడచినది. వలయు వంటకములు సంసిద్ధమైనవి. కోకనదప్రాసాదమున కట్టకడ సోపానము మొదలుకొని నేలనంతటిని తెల్లని చలువ వలువలను బఱపించి బోధిరాజకుమారుడు సంజికాపుత్రుని జీఱి భగవంతునకు సమయసూచన నిమ్మని పంపించెను.

సరిసుమారు పూర్వాహ్ణ సమయము. సరాసరి బోధిరాజకుమారుని యింటికి పాత్రచీవరములను కైకొని మహాపురుషుడు వచ్చుచున్నాడు. దౌదవ్వులనె గాంచి యెదురేగి రాజకుమారుడు నేలకెఱగి ప్రణమిల్లి ముందుముందు దారి జూపుచు తోడ్కొనివచ్చి ప్రాసాదము ముంగిట నిలిచెను. భగవంతుడును చిట్టచివరి క్రింది మెట్టు వద్ద గప్పున ఆగి నిలువబడెను. ''స్వామీ! మడుగులపై అడుగులుంచి లోనికి వేంచేయండి. తరతరముల తరబడి మాకు చిరహితమును ప్రసాదించండి''

---

(1) మ. ని. 2 -45; చుల్లవగ్గ 5. (2) చునార్ (మీర్జాపూర్‌జిల్లా)

యని రాజపుత్రుడు వినమ్రుడై వేడుకొనెను. భగవంతుడు పలుకలేదు. బోధిరాజ కుమారుడు మూడుమాఱులు నివేదించెను. మౌనముద్రాముద్రితుడగు బుద్ధదేవుని సూచనాగర్భితమగు ఓరచూపొకటి పజ్ఞనున్న ఆనందునిపై విసరుకొనిపడినది. ఆనందుడిట్లనియె.

''రాజకుమారా! వస్త్రములను ముడిచి వేయుము. భగవంతుడు బట్టలపై అడుగిడడు. భవిష్యత్ ప్రజలనుగూర్చి తథాగతుడు దూరమాలోచించినాడు.''

వలువలను గబగబ చుట్టిరి. భగవానుడు మేడనెక్కి పఱచిన ఆసనములపై సంఘముతో కూడ కూర్చొనెను. బోధిరాజకుమారుడును తన చేచేతుల ఉత్తమ భోజ్యములను భిక్షుసంఘ సహితముగ బుద్ధునకు వడ్డించి వారు సంతృప్తిగ భుజించినంత నిమ్మళముగ నుచితాసనముల గూర్చుండబెట్టి క్రిందివైపున తానును గూర్చొని యిట్లు పలికెను.

''మహాస్వామీ! 'సుఖము సుఖమువలన దొరకదు; దుఃఖము వలననె లభించున' ని నాకు తోచుచున్నది.''

''రాజకుమారా! నీవు చెప్పినట్లు 'సుఖము సుఖమువలన దొరకదు. దుఃఖ మూలముననె లభించున' ని నేనుకూడ బుద్ధుడను గాక ముందు – బోధిసత్త్వుడుగ నుండు దశయందు భావించుచుంటిని. ఆ తరుణమున నేను కోడెవయసువాడను. నిగనిగలాడెడి నల్లనివెంట్రుకలు తెగబారెడుండెడివి. అట్టి యౌవనముఖారంభముననె కులమువారెల్ల గొల్లున వాపోవుచుండ గృహత్యాగముజేసి సంన్యసించితిని. జిజ్ఞాసువునై తొలుత ఆలారకాలామునికడకు వచ్చితిని. అయనకు నమస్కరించి 'మహాత్మా! తమ ధర్మసంప్రదాయమున బ్రహ్మచర్యవాసమొనర్ప యిచ్చగలద' ని వచించితిని. ఆయనయు సమ్మతించి 'ఆయుష్మంతా! మా ధర్మవినయమున నెందరో సమాధాన మొందినారు. శీఘ్రమున నీవుకూడ కృతార్థుడవు కాగల' వనెను. నేనును ఆతని విద్యను వడివడిగ గ్రుక్కలు గ్రుక్కలు మ్రింగితిని. అదంతయు చిలుకపాఠము. నాకు తృప్తికలుగ లేదు. వెండియు ఆచార్యునివద్ద కరిగి 'ఆర్యా! మీ ధర్మసాక్షాత్కారమునకు యోగ్యమగు మార్గము నెఱిగించుమ' ని వేడితిని. ఆయనయు నాకు సమాధితత్త్వమున 'ఆకించన్యాయతనమును' తెలియజేసెను.

'ఆలారకాలామునికంటె నాయందు శ్రద్ధావీర్యస్మృతిసమాధి ప్రజ్ఞలధికమై యున్నవి. నేనెందుకు పొందలేను? సాధింతున' ని సతతపరిశ్రమజేసి అచిరకాలముననె ఆకించన్యసమాధిని పొందితిని. పదపడి ఆలారకాలాముని యొద్దకుబోయి 'ఆయు

ష్మంతా! మీరు చెప్పిన సమాధిని సాక్షాత్కరించుకొంటిని. ఇకపై నాకర్తవ్యమేమ' ని యడిగితిని. ఆ మాటకాయన సంతోషించి 'సిద్ధార్థా! నీ కిక చెప్పునదియు లేదు; నీవు చేయునదియు లేదు. నాకువలెనే నీకును ధర్మసాక్షాత్కారమబ్బినది. నా సాటి వాడవు నీవు. మన మిర్వురమును గలసి శిష్యశాఖను పెంపొందింపజేయుద' మని ఆకాలామగురుడు తాను నా కాచార్యుడై యుండిగూడ సాటిగౌరవము నిచ్చి సత్క రించెను. కాని నా మనస్సు తేఅలేదు. 'ఈ ధర్మము ఆకించన్యాయతన సిద్ధివఅకె చాలినది. దీనిచే నిర్వేదము గలుగదు. ఇది వైరాగ్యమునకు కొఱగాదు. దీనివలన నిర్వాణసిద్ధిలేదు. దీనికంటె శ్రేష్ఠమైన తెరువును గ్రహింతునుగాక' యని ఆ చోటు వదలి వెళ్ళితిని.

రాజకుమారా! సర్వోత్తమమగు శాంతిలాభమునకు సాధనమైన కుశలధర్మ మును వెదకుచున్న నేను తదనంతరము ఉద్దకరామపుత్రుని చెంతజేరితిని. ''ఆయు ష్మంతా! మీ ధర్మవినయమునందు బ్రహ్మచర్యపాలన మొనర్తును'' అని ఆయనను ప్రార్థించితిని.

అతండును తన సంప్రదాయమును అంతలింతలు పొగడి నన్ను చేరదీసి కొనెను. నేనును అల్ప స్వల్పకాలముననె ఆ ధర్మవాదమును కబళించితిని. కాని అదియుకూడ ముందటిదానివలెనే వాచావిజృంభణమె యగుటచేత తనివిసనక ఉద్దకుని దాపుకరిగి సాక్షాత్కారమునకు యోగ్యమగు పద్ధతిని చెప్పుమంటిని. ఆయనయు 'నైవసంజ్ఞానాసంజ్ఞా యతన' సమాధిని బోధించెను. 'ఉద్దకరామపుత్రు నియొద్ద శ్రద్ధావీర్యస్మృతి సమాధిప్రజ్ఞలు కొఱతైయున్నవి. నాకడ వాటికి లోటులేదు. సాధింతునుగాక' యని అనతికాలముననె 'నైవసంజ్ఞానా సంజ్ఞాయతన' సమాధిని చూఱగొంటిని. అదియుకూడ పూర్ణత్వసిద్ధికి చాలదని తలంచి ఆచార్యుని చేరువకు బోయి ఆపై సాధనను తెలుపుమంటిని. ఉద్దకుడును తానెఱిగిన దంతవఱకెయనియు పై పెచ్చేమియు లేదనియు చెప్పి సగౌరవముగ ముందటి ఆలారకాలామునివలెనే సన్మానము చేసెను. కాని నిర్వేదమునకు వైరాగ్యమునకు నిరోధమునకు ఉపశమ మునకు అభిజ్ఞకు సంబోధికి నిర్వాణమునకును సమర్థముగాని ఆ పదవిని పట్టుకొని యుండుట నాకు గిట్టలేదు. అందుచే దానికంటెను మేలైన ప్రయత్నమున పాల్గొందు నని నిశ్చయించి ఉద్దకరామపుత్రునితో సెలవు గైకొంటిని.

అటనుండి కదలి మగధదేశమున సంచరించుచు సేనానీగ్రామమును చేరితిని. అందలి సుందరవనఖండములు, రమణీయభూములు, సుభిక్షావాసములు,

జలపూర్ణ నదులు నా హృదయమును ఉవ్వెత్తుగ గొన్నవి. నిర్వాణప్రాప్తికై అఱ్ఱులు సాచు నా ప్రబల ప్రయత్నమునకు ఆస్థానము సర్వోత్తమమైనదని తలపోసి అందొకచో టున కూర్చొంటిని. ఆ సమయమున అద్భుతములగు మూడు ఉపమానములు నాకు తట్టినవి.

రాజకుమారా! ఒక పచ్చికొయ్య నీటిలో వేయబడినది. అట్టిదానిని యెంత మథించినను అగ్ని కలుగదు. అట్లే లోపలను బైటను కామవాసనలచే పీడితుడగు శ్రమణ బ్రాహ్మణుడు యెంత ప్రయత్నించినను ప్రయాసయె తప్ప, పరమజ్ఞానమును పొందలేడు. ఇదియొక ఉపమానము.

ఒక పచ్చికొయ్య నీటి ప్రక్కన ఉంచబడినది. దానిని గూడ యెంత మథించినను అగ్ని సంభవింపదు. శ్రమయె మిగులును. అట్లె కామవాసనా పీడితుడగు శ్రమణ బ్రాహ్మణుడు ప్రయత్నించియుకూడ పరమజ్ఞానమును పొందలేడు. వేదనను మాత్రమె పొందగలడు. ఇది రెండవ ఉపమానము.

స్వయముగ యెండినకట్టె నీటికి దూరమునున్నది. అట్టికట్టెను తరిచినచో అవస్యము అగ్ని కలుగును. అట్లే అంతర్బాహ్యములందు కామవాసనలు శమించినవాడు ప్రయత్నము చేసినచో కష్టవేదనలను అనుభవించినముకూడ పరమజ్ఞానమును పొందగలడు. ఇది మూడవ ఉపమానము.

అట్లా ఉరువేలప్రాంతమున కూర్చొని మరియు వితర్కించితిని. 'పండ్లను బిగించి నాలుకతో తాలువులనొత్తి బలవంతముగ మనస్సును నిగ్రహింతును గాక' అని తలంచి అట్లే చేసితిని. అందుకు తగిన ఉత్సాహమును, పట్టుదలయు సహనశక్తియుగూడ నుండినది. కాని బలవంతుడగు పురుషుడు దుర్బలుడగువాని తలనుబట్టి అదిమినచో వాడు తపించినట్లు శరీరముకూడ తపించినది. చెమటలుగాఱినవి.

తదనంతరము శ్వాసనుకూడ నిలిపి ధ్యానముచేయ నుపక్రమించితిని. ముఖమునుండి ముక్కులనుండి శ్వాసప్రశ్వాస లాగిపోవుటచే కమ్మరివాని కొలిమితిత్తిలోనుండివలె చెవులనుండి సుయ్యిసుయ్యిమని వేడిబుసలు బయలు దేఱినవి. కాని నా ఉత్సాహము క్రుంగలేదు. స్మృతి చెడలేదు. శరీరము వడకలేదు.

మరియు చెవులనుండి వచ్చు వాయువును కూడ నిరోధించితిని. హోరుమని శిరస్సున ఘోరవేదన జనించినది. కాని ఉత్సాహము క్రుంగలేదు. స్మృతి చెడ లేదు. శరీరము వడక లేదు.

ఊపిరినుడిపి ఉగ్రతపస్సునకు తలపడితిని. అదుమబడిన వాయువు ఉదరమున ప్రవేశించి అంపముతో కోసినట్లు తీవ్రబాధను కల్గించినది. నిప్పులబొరలినట్లు శరీరమంతయు మంటలు రేగినవి. అంగాంగము లుడికిపోయినవి. పార్శ్వవర్తులగు దేవతలు శ్రమణగౌతముడు మరణించె మరణించెనని గోలున వాపోయిరి. లేదు లేదు. మరణించలేదు. అర్హతుడతడు మరణించడని మఱికొందఱు సమాధానము చెప్పిరి.

ఆహారమును సుతరాం వదలదలంచితిని. అంతట దేవతలు చేరవచ్చి 'మార్షా! నీ వాహారమును త్యజించినచో మేము రోమకూపములద్వారా ఓజస్సును నీలో నింపుచుందుము. దానిచే నీవు తాళుకొనవచ్చు' నని ఊఱడబలికిరి. నిరాహారినని ప్రతిన జేసినపిమ్మట ప్రచ్ఛన్నమగు మీరిచ్చు ఓజశ్శక్తిని గ్రహించుట ప్రకారాంతరమున ఆహారమును గొనుటయేగదా! తుచ్ఛము. ఛీ! ఛీ! వద్దు. పొపొమ్మంటిని.

మొమ్మొదట పుడిసెడు అంబలిని త్రాగుచు కాలము గడపితిని. దేహము కాదగినంత దుర్బలమైపోయినది. చర్మమాంసములెండి శరీరము కట్టె అయినది. మిద్దెదంతెలవలె యెముక లేర్పడినవి. అగాధమగు బావినీటియందు ప్రతిఫలించి తోచు చుక్కలవలె కనుగ్రుడ్లు మిణుకుమిణుకు మన్నవి. యెండిపోయిన లేత సొరకాయవలె తల కుదిసిపోయినది. పొట్టయు వెన్నెముకయు నొకటైనది. కదలినచో శిరస్సు కుమ్మరిసారెవలె దిరిగెడిది. వెంట్రుకలు ఊచిపోయినవి. కాంతి యంతయు కరగి కాయము నల్లనైనది. రాజకుమారా! నేను అమాంతము మాఱిపోయితిని.

ఘనఘోర భయంకరమగు యిట్టి తీవ్రవేదనలను, గతించిన కాలమునందు యేశ్రమణబ్రాహ్మణుడును సహించియుండలేదు. నేడు లేడు. మున్ముందును ఉండబోడు. ఇంతపాటుపడియు – ఇంతింత గగన ప్రయత్నము జేసియు రాజకుమారా! నేను ఈ తపస్సువలన అలమార్యజ్ఞానదర్శనమును, ఉత్తరమనుష్య ధర్మమును ప్రాపింపలేక పోయితిని.

రాజకుమారా! చిఱుతవయస్సునందు నేను నా తండ్రియగు శుద్ధోదనునితో కూడి బీజావాపనోత్సవ సందర్భమున పొలముల చెంగటకు వోయినపుడు ఒక నేరేడు చెట్టుక్రింద కూర్చొని కామాది అకుశలధర్మముల నెడబాసి ప్రథమధ్యానమును పొందియుంటిని. అకుశల ధర్మములకు వేరైన ఆ సుఖమునె యీనాడును నేన పేక్షించునది. అట్టి సుఖము యీ కృశీభూతాంగముతో – యీ దీనదుర్బలశరీరముతో సాధించుటనునది గగనకుసుమము. స్థూలాహారమును సేవించి తిరిగి బల

పాటవములను శరీరములోనికి చేదుకొందునుగాక అని నిశ్చయించి అన్నమును కూరను తినుట కుపక్రమించితిని. శ్రమణగౌతముడు పరమోత్తమసుఖమును తప్పక సాధింపగలడు. ఆయనవలన మనముగూడ గ్రహింతముగాక యని ఆసలు పెట్టుకొని నన్నాశ్రయించియుండిన ఏవురు భిక్షువులు నేను స్థూలాహారమును స్వీకరింప మొదలిడినంతనే – శ్రమణగౌతముడు బాహులికుడైనాడు. తిండిపోతయ్యాడు. తపస్సిద్ధియందు నిరాశవహించి ప్రయత్నమున వెనుకంజవేసినాడు. ఇక నితనితో మనకేటిపని యని వారు ఉదాసీనులై నన్ను దిగవిడిచిపోయిరి.

నేనును కొంత కొంత ఆహారమును ఆరగించుచు అకుశలధర్మముల నెడబాసి వితర్కవిచార సహితమును, వివేకసంభవమును, ప్రీతిసుఖము గలదియునగు ప్రథమధ్యానమును పొందితిని. అటపై వితర్కవిచారము లుపశమింప చిత్తము ప్రసన్నతాయుక్తముకాగ సమాధి సంభవమగు ప్రీతిసుఖముతో కూడిన ద్వితీయ ధ్యానమును పట్టుకొంటిని. క్రమముగ ప్రీతిని విరాగమును ఉపేక్షించి స్మృతి సంప్రజన్యములతోడ గూడి కాయముతో సుఖసంవేదనను బొందుచు ఉపేక్షకుడు, స్మృతి మంతుడు, సుఖవిహారినాబరగి తృతీయధ్యానమును చూఱగొంటిని.

సుఖదుఃఖములును సౌమనస్య దౌర్మనస్యములును ముందె అస్తమించి యుండుటచే సుఖదుఃఖములం దుపేక్షకుడనై స్మృతిపరిశుద్ధితో గూడి చతుర్థధ్యానమును సంపాదించి విహరింపజొచ్చితిని. పిమ్మట సమాధి సంపన్నమై మృదువును స్థిరమును పరిశుద్ధమును క్లేశరహితమును నగు చిత్తమును పూర్వజన్మములయొక్క స్మృతిజ్ఞానమునకై (పూర్వనివాసానుస్మృతి) మొగ్గించితిని. లోగడ గడచిన అనేక జన్మలయొక్క సమగ్రస్మరణ నాకు లభించినది. ఆకారసహితముగ ఉద్దేశ్యసహితముగ పూర్వజన్మములను భావించి స్మరించుచు ప్రమాదశూన్యుడనై ఆత్మసంయమినై యుండు నాకు రాత్రియొక్క మొదటి జామునందు ప్రథమవిద్య సాక్షాత్కరించినది. మఱియు చిత్తము నేకాగ్రము జేసి అశేష ప్రాణులయొక్క జన్మమరణజ్ఞాన గ్రహణమునకై ఉద్యమించితిని. అతిమానవమగు దివ్య నేత్రమును బొంది శుభాశుభములతో సుఖదుఃఖమలతో నిత్యనిరంతరము సతమతమగుచు పుట్టుచు చచ్చుచున్న ప్రాణికోటి సందోహమును పరికించితిని. ఈ విధమున రాత్రియొక్క రెండవజామునందు ద్వితీయవిద్య లభించినది.

వెండియు చిత్తమును ఆస్రవక్షయముకొఱకై, జ్ఞానసిద్ధికొఱకై మఱింత ప్రేరేపించితిని. అంతట 'ఇది దుఃఖమని – ఇది దుఃఖ సముదయమని – ఇది దుఃఖ

నిరోధమని - ఇది దుఃఖ నిరోధగామినీ మార్గమ'ని యథార్థముగ నెఱుగగల్గితిని. ఇది ఆస్రవమని - ఇది ఆస్రవ సముదయమని - ఇది ఆస్రవ నిరోధమని - ఇది ఆస్రవ నిరోధగామినీ మార్గమని విస్పష్టముగ తెలియగల్గితిని. చిత్తమునకు కామాస్రవములు, భవాస్రవములు, అవిద్యాస్రవములు వీడిపోయినవి. విముక్తి లభించినది. జన్మబంధము లూడినవి. బ్రహ్మచర్యఫలము సిద్ధించినది. చేయవలసినది చేసితిని. చేయదగినదిక లేదని గ్రహించితిని. విద్య కలిగినది, అవిద్య తొలగినది. ఆలోకమబ్బినది. అంధకారము కడజనినది. రాత్రియొక్క చివరిజామునందిట్లు తృతీయ విద్య చేకూఱినది

బోధిరాజకుమారా! ఆ ధర్మమునె తొలుత పంచవర్గీయ భిక్షువులకు ఉపదేశించితిని. దాని యథార్థజ్ఞానమును వారు పొందగలిగిరి.''

అని నుడివిన భగవంతుని దీర్ఘప్రసంగమును విని రాజకుమారు డిట్లనియె. ''స్వామీ! తథాగతుని ఆశ్రయించి భిక్షువు యీ అనుత్తమ బ్రహ్మచర్యఫలమును యెన్నాళ్ళకు పొందగల్గును?''

''రాజకుమారా! నేనడిగిన మాటలకు ప్రత్యుత్తరమిమ్ము. నీకు హస్తిపకవిద్య (ఏనుగులను నడపు శిల్పము) తెలియునుగదా?''

''భంతే! తెలియును.''

''రాజపుత్రా! ఆ విద్యను నేర్చుకొందునని నీ వద్దకొక పురుషుడు వచ్చినాడనుకొందము. వాడు శ్రద్ధాహీనుడు శ్రద్ధగలవాడు విద్యను గ్రహించినట్లు వీడు గ్రహింపగలడా?''

''దేవా! గ్రహించుటకయోగ్యుడు.''

''రాజకుమారా! వాడు మరియు రోగగ్రస్తుడు. ఆరోగ్యవంతునివలె విద్యను గ్రహింపగల్గునా? వాడు శఠమాయావి. సోమరిపోతు. మందప్రజ్ఞుడు. అట్టియెడ సుశీలుడు, జాగరూకుడు, ప్రజ్ఞావంతునకువలె ఆ విద్యాశిల్పము వాని కంటగలదా?''

''ప్రభూ! ఏ ఒక్కదోషమున్న కూడ నా హస్తిపకవిద్యకు (మావటివాని విద్య) వాడయోగ్యుడు. ప్రత్యుత, దోషములైదును నున్నచో ఇక చెప్పవలసిన దేమున్నది.?''

''అట్లే. బోధిరాజకుమారా! నిర్వాణసాధనకుకూడ అయిదు అంగము లున్నవి. 1. భిక్షువు శ్రద్ధగలవాడై భగవంతుడు అర్హతుడు, సమ్యక్ సంబుద్ధుడు,

విద్యాచరణసంపన్నుడు. సుగతుడు, లోకవిదుడు, అనుత్తరుడు, పురుషదమ్య సారథి, దేవమనుష్యశాస్త బుద్ధదేవుడని తలంచి అతనియెడలను, ఆతని పరమజ్ఞానము నెడలను శ్రద్ధాతత్పరుడగుచున్నాడు. 2. భిక్షువు మఱియు రోగహీనుడై సాధనా యోగ్యమగు సమప్రకృతిగలవాడై యుండును. 3. కుత్సితుడుగాక గురువు నెడను సబ్రహ్మచారులకడను వంచన లేక వర్తించును. 4. కుశలధర్మసంపాదనమునందు కాడికి వైదొలగక దృఢపరాక్రమి యగుచున్నాడు. 5. సమ్యక్ దర్శనమును సాధింప జేయు ప్రజ్ఞతో కూడియున్నాడు.

రాజకుమారా! ప్రధానములగు ఈ అయిదుఅంగములతో కూడిన భిక్షువు తథాగతుని గురువుగ బొంది యీ జన్మమునందే అనుత్తర బ్రహ్మచర్యఫలసిద్ధికి అర్హుడగుచు న్నాడు. అట్టి వానికి కాలవ్యవధి లేదు. ఏడేండ్లలోనైనను ఆఱేండ్లలోనైనను, అయిదు – నాలుగు – మూడు – రెండు – ఒక సంవత్సరము – ఒక్కనెల – వెయ్యేల ఒకే ఒక దినములోనైనను తత్త్వసాక్షాత్కారమును – నిర్వాణమును పొందగల్గుచున్నాడు.''

అని యిట్లు సర్వజ్ఞ దేవుడు బుద్ధసార్వభౌముడు బోధించినంత ★ బోధిరాజ కుమారుడు అమృతస్నానమును చేసినవాడువలె పరమానందమును బొంది 'ఔరా! బుద్ధుడు 'ఔరా! ధర్మము; ఔరౌర! ధర్మగౌరవము'' అని కొనియాడెను.

---

★ మ. ని. అ. క. 2 -4 – 5 - కౌశాంబియందు పరంతపుడను రాజుండెను. గర్భవతియగు అతని భార్య యొకప్పుడు యెఱ్ఱటి కంబడిని కప్పుకొని మేడయొక్క పై అంతస్తుపై భాగమున యెండ సోకునట్లు కూర్చొనియుండెను. ఆకస్మికముగ నొక మహాగరుడపక్షి ఆకసమున బోవుచు మాంసపిండముగ దలంచి ఆమెను యెత్తికొనిపోయి ఒకానొక పర్వతముపైన నొక చెట్టుమీద నుంచినది. ఆమె ఆక్రోశించుచున్నంత సమీపముననుండిన తాపసి యొకడు వచ్చి చెట్టునుండి దింపుకొని తన కుటీరమునకు కొంపోయెను. ఆ కాంత పూర్ణగర్భిణియై యుండి యుండుటచే వెంటనె శిశువును ప్రసవించినది. ఉదయనుడని ఆ శిశువునకు పేరిడిరి. తల్లిని బిడ్డను ఆ తపస్వియె పోషించుచుండెను. కొన్నాళ్లకు తపోభ్రష్టుడై ఆ రాణికి అందె పతి యయ్యెను.

కొంతకాలమునకు కౌశాంబియందు రాజగు పరంతపుడు మరణించెను. తాపసుడును ఉదయన కుమారునకు రాజ్యాభిలాష యుండుటను తెలిసికొని తాను నేర్చియుండిన హస్తిగ్రంథి విద్యను బోధించి తల్లివద్దనుండు కంబళమును అంగులీయకము నిచ్చి కౌశాంబికి పంపించెను.

పరిసరమునన్న సంజికాపుత్రు డది చూచి ''రాజకుమారా! అట్టి ధర్మ మును శరణుజొచ్చుట మీకు తగియున్నది. మరి యూరకుందు వేల'' యని ప్రేరేపిం చెను. బోధిరాజకుమారు డిట్లనియె.

సౌమ్యా! అట్లనకుము. మా తల్లివలన నేను వినిన విషయమొండు రెండు గలదు. వినుము. నేను గర్భమునందుండు సమయమున నొకప్పుడు మాయమ్మ కౌశాంబిలోని ఘోషితారామమునకు భగవంతుని దర్శింప నేగినది. అచ్చటికేగి తథాగతునకు ప్రణమిల్లి ''దేవా! నా కుక్షియందుండు బిడ్డ యిప్పుడే బుద్ధునకును, ధర్మమునకును, సంఘమునకును శరణుజొచ్చుచున్నాడు. మీరాబిడ్డను నేటి నుండి సాంజలిశరణాగత ఉపాసకునిగ ధరింపవలె'' నని విన్నవించినది.

సౌమ్యా! మఱియొకప్పుడు భగవంతుడు భర్గదేశమున శుంశుమారగిరియొక్క భేసకలావన మృగదావమున విహరించువేళ దాదియొకతె నన్ను ఒడిలోనుంచికొని పోయి భగవానునకు అభివాదనము చేసి 'భంతే! బోధిరాజకుమారుడు భగవంతుని, ధర్మమును, సంఘమును శరణుజొచ్చుచున్నాడ' ని పల్కినది.

ఓ సంజికాపుత్రా! ఇదె నేను స్వయముగ మూడవసారి పలుకుచున్నాను. ''బుద్ధం సరణం గచ్ఛామి; ధమ్మం సరణం గచ్ఛామి; సంఘం సరణం గచ్ఛామి.''

---

ఉదయనుడు కౌశాంబీనగర ప్రాంతమున కరిగి యొక మఱ్ఱిచెట్టుపై కూర్చొని తన వీణను మ్రోగించి హస్తిగ్రంధి విద్యాప్రభావమును జూపెను. హస్తిశాలయందుండు యేనుగు లన్నియు పారిపోయినవి. రెండవతూరి విపరీత ప్రయోగమొనర్చి వాటినన్నిటిని తనకడకు చేర్చుకొనెను. వాటిలో నొక ఉత్తమ గజము నారోహించి నగరములోనికి పోయి ''తాను పరంతపరాజుయొక్క పుత్రుడననియు రాజ్యమునకు అధికారిననియు చాటబంచి అమాత్యులను పౌరులను ప్రోగుజేసి తాను తెచ్చిన ఆనవాళ్ళిచ్చి రాజ్యపీఠము నధిష్ఠించెను.

ఒకప్పుడు చండప్రద్యోతనుడు ఆ విద్యను నేర్వదలంచి వంచనతో నొక కొయ్యయేనుగును చేయించి దానిలో సైనికులను దాచి ఉదయనుని పట్టుకొనునట్లు చేసెను. అట్లు పట్టుపడిన అతనివద్ద విద్యనభ్యసించుటకు కూతురను పంపించెను. ఉదయనుడు ఆమెను వలచి తనవెంట దీసికొని నగరమునకు చేరెను. వారిరువురకు కల్గిన కుమారుడు బోధిరాజకుమారుడు.

# ౧౩

## కర్ణస్థలకాది సూత్రములు (వి. పూ. 435 - 431)

[1] ఒకప్పుడు[2] బుద్ధదేవుడు[3] ఉరుంజయందు[4] కర్ణస్థలకమృగదావములో విహారము చేయుచున్నాడు. కోసలరాజు ప్రసేనజితు డతని దర్శింప కుతూహలించి యొక పరిచరుని బిలిచి యిట్లనియె.

''ఓయీ! భగవంతుడు బుద్ధుడున్నచోటికి బొమ్ము. నాకు ప్రతిగ వారి చరణములకు ప్రణమిల్లుము. ఆరోగ్యమును - బలమును - సుఖమును గూర్చి నా మాటలలో ప్రశ్నింపుము. మరియు నమ్మహాత్మునితో 'స్వామీ! భోజనానంతరము ప్రసేనజితుడు తమ దర్శనమునకు రాగలవాడ'ని మనవి చేయుము'' అని చెప్పి పంపించెను.

సుగతదేవుని శుభదర్శనమునకు రాజు పయనమగుచుండెను. అతనిరాణులు అక్క చెల్లెండ్రునగు సోమ - సకుల యను వారిరువురు పతిదేవుని చెంతకుపోయి సాదరముగ నిట్లనిరి.

''మహారాజా! భగవంతునకు బుద్ధునకు మా కొఱకై నమస్కరించి మా మాటలుగ కుశలప్రశ్నము లందించవలసినది.''

రాజామాటలను మేకొని తలంచినట్లు తథాగతుని చేరువకరిగి అభివాదనము లొనర్చి యొకచోట కూర్చొని యిట్లనెను.

''దేవా! సోమాసకుల దేవులు తమపాదములకు నమస్కరించి కుశలముల నడుగుమని చెప్పిపంపిరి.''

''మహారాజా! ఆ సోదరీమణులు వార్తను పంపుటకు వారికింతకంటె మంచి ధూత దొరక లేదుగాబోలు.''

''మహాస్వామీ! భగవానుని దర్శనమునకు బయలు దేరుచున్న నాతో వారా మాటను చెప్పిరి. దేవా! యొక మనవి. క్షత్రియ బ్రాహ్మణ వైశ్య శూద్రవర్ణములందు వ్యత్యాసమేమి? భేదమేమి?''

---

(1) ముప్పదియేడవ వర్షావాసమును భగవంతుడు శ్రావస్తి జేతవనమునందు గడపెను. ముప్పది యెన్మిదవ వర్షావాసమును పూర్వారామమున నడపెను.

(2) మ. ని. 2 - 4 - 10.  (3) ఆ రాష్ట్రమునందలి ఒకానొక నగరము

(4) ఆ ప్రాంతమందలి యొక రమణీయ భూభాగము.

''మహారాజా! నాలుగువర్ణములలోను అభివాదనమును, ప్రత్యుత్థానమును జేయుటకు క్షత్రియ బ్రాహ్మణులు శ్రేష్ఠులు.''

''భగవంతా! నేను ఈ లోకవిషయమున అడుగ లేదు. పరలోక సంబంధమును గూర్చి ప్రశ్నించితిని.''

''మహీపాలా! పారలౌకిక ధర్మమునందు హితసుఖములను బొందుటకు ప్రధానీయాంగము లయిదు గలవు. నాలుగు వర్ణములందెవ్వడైనను వాటిని పొందినవాడె యధికారి. మొదట భగవంతుడు – అర్హతుడు – సమ్యక్ సంబుద్ధుడగు తథాగతుని జ్ఞానమునందు 1. శ్రద్ధాలువుగావలెను. 2. రోగహీనుడును సాధనాయోగ్యమగు సమప్రకృతి కలవాడై యుండవలెను. 3. శఠుడు, మాయావి కారాదు. 4. ఉద్యోగశీలుడు కావలెను. 5. ప్రజ్ఞతోకూడి యుండవలెను. ఈ అయిదు అంగములతో కూడిన భిక్షువు చిరకాలము హితసుఖములను బొందగలుగును. వర్ణములను దృష్టియందుంచుకొని యిట్టివారియందు నేను భేదమును – వ్యత్యాసమును చెప్పను. అగ్ని యేజాతికట్టెయందు బుట్టినను ప్రకాశములో తారతమ్యముండదు గదా? అట్లే వారి ప్రయత్న ప్రభావమున కలిగిన విముక్తి యందుకూడ న్యూనాధికతలు లేవు.''

''దేవా! లెస్సగ సెలవిచ్చితిరి. సంతుష్టులమైతిమి. మేము బహుకార్య లంపటులముగాన సెలవిచ్చినచో పోయివత్తుము.''

''మహారాజా! మంచిది.''

## సంఘభేదక ఖందకము

[1] బుద్ధభగవంతుడు కౌశాంబియందు ఘోషితారామమున విహరించుచుండను. [2] అట్టిసమయమున దేవదత్తుడు యేకాంతమున గూర్చొని యిట్లు చింతించెను. ''నేను యెవ్వని లోబఱచుకొన్నచో అపరిమితలాభ సత్కారములకు పాత్రుడనగుదును? అవును. అజాతశత్రుకుమారుడే నాకు నచ్చినవాడు. ఒంట వేడిరక్తము గలవాడు. ముందట ముందట అభివృద్ధిని బొందువాడు. అతనిని వలలో వేసికొన్నచో నా కత్తికిక యెదుఱు లేదు.''

---

(1) ముప్పదితొమ్మిదవ వర్షావాసమును భగవంతుడు శ్రావస్తి జేతవనమునందు గడపెను.
(2) చుల్లవగ్గ 7

దేవదత్తు డిట్లాలోచించి తన శయనాసనములను – పాత్రచీవరములను సంభాళించి చంకనబెట్టి ప్రయాణమై రాజగృహపురమును జేరెను. అంతట తన ఆకార ప్రకారములను మఱుగుజేసి దివ్యశక్తి ప్రభావముచే కామరూపియై తరుణకుమారునివలె కన్పట్టుచు అజాత శత్రుని యెదుట సాక్షాత్కరించెను.

అజాతశత్రు డులికిపడి వెల వెల బోయెను.

''రాజకుమారా! భయపడితివా?''

''అవును. అయ్యా! తామెవరు?''

''నేను దేవదత్తుడను.''

''ఆర్యా! మీరు దేవదత్తులరె యైనచో మీ నిజరూపమును చూపండి!''

అంతట దేవదత్తుడు ఆ కుహనావేషమును వీడి తన భిక్షాపాత్రతో – తన కావిబట్టలతో స్వస్వరూపమున కానబడెను. ఆ దివ్య చమత్కారమునకు పండ్లు పులిసిన అజాతశత్రుడు దేవదత్తుని తనకు ఆచార్యునిగ వరించి సాయంప్రాతములందతని సన్నిధికి దర్శనమునకై యరుగుచు సేవించుచుండెను.

[1] అక్కడ సుగతదేవుడు కౌశాంబియందు స్వేచ్ఛగ విహరించి పదంపడి రాజగృహపురమున కరుగుదెంచి వేణువనకలందక నివాసమున విహారము చేయుచుండెను.

# దేవదత్త సూత్రము

భగవంతుడు వేణువనకలందక నివాసమున నుండుదినములు. [2] అజాతశత్రువు యేనూరురథములతో కూడి యేనూరుస్థాలీపాకముల భోజనమును వెంటకొని రేపు మాపు నిత్యప్రతి దేవదత్తుని సన్నిధికి వచ్చి అర్పించిపోవువాడు. ఆ విషయమును కొందఱు భిక్షువులు భగవంతునకు నివేదించిరి. శాస్త యిట్లనియె.

''భిక్షువులారా! దేవదత్తునకు కలిగిన లాభసత్కారములకై మీరు ఉవ్విళ్ళూరకుడు. దానినిగూర్చి భూరిభూరి ప్రశంసలను జేయకుడు. ఆ వైభోగమతని కుశల ధర్మములకు వేరుపురుపు. కుక్కకు పిచ్చి బట్టినది. దానికదే ప్రళయము.''

(1) చుల్లవగ్గ. (2) స.ని. 16 – 4 – 6.

అక్కడ దేవదత్తుడును తన కొదవిన శ్రీమద్వైభవమువలన మన్నుమిన్ను గానక సమస్త భిక్షుసంఘమునకు తానె సర్వాధిపతి కావలెనని ఆసజేసెను. వాని దుశ్శీలవర్తనముచే యోగబలము క్షీణింపజొచ్చెను.

అది మఱియొక సమయము. బ్రహ్మాండమగు సభలో బుద్ధభగవంతుడు ధర్మోపదేశ మొనర్చుచుండెను. దేవదత్తుడు తన ఆసనమునుంచి లేచి చేతులు జోడించి భగవానునితో యిట్లనెను.

''భంతే! తమకు వయస్సు పండినది. అవయవములు శిథిలములైనవి. ఈ భిక్షు సంఘమును నా కప్పగించి తాము విశ్రాంతిని వహించుడు. ఈ పెత్తనమును నేను బూనెదను.''

''చాలు, చాలు. దేవదత్తా! అది యేనాడును పొసగనిపని.'' అని నిరాకరించినను ఉడుగక దేవదత్తుడు మరియు ముమ్మారడిగెను. అంత భగవంతు డిట్లనియె. ''దేవదత్తా! సారిపుత్ర మౌద్గల్యాయనుల వంటి సమర్థులగువారికె అర్పింపకుండు నపుడు తుచ్ఛుడవగు నీ మాటేమిటి?''

భగవంతుడు తూలనాడుట దేవదత్తునకు భరింపరానిదైనది. నిండుసభలో సారిపుత్రమౌద్గల్యాయనుల గొప్ప జేసి తన్ను తృణీకరించుటకు కుపితకుపితుడై తఱియెఱిగి కసిదీర్చుకొనుటకు పగబట్టెను.

అసభ్యవర్తనుడై సభనుండి లేచి గబగబ దాటిపోయిన దేవదత్తుని చూచి బుద్ధదేవుడు భిక్షుసంఘముతో ''ఓ భిక్షువులారా! దేవదత్తుడు మనకు వేరైనాడు. వాని పనులు – వ్యవహారములపట్ల బుద్ధునకును – బుద్ధధర్మమునకును – బుద్ధ సంఘమునకును యికమీదట ఉత్తరదాయిత్వము లేదు'' అని ఆనతిచ్చెను.

దేవదత్తుడు అజాతశత్రువునొద్దకు బోయి ఆయా ప్రసంగములను కదిపి ఆపై నిట్లనియె. ''కుమారా! పూర్వమువలె నేటి మానవులు దీర్ఘాయుష్కులుకారు. నిండుగ నూటేండ్లైనను మనుష్యుడు జీవించునని నిష్కర్షగ జెప్పవీలులేదు. మీ తండ్రికంటె ముందుగనే రాజ్యసుఖములను చవిచూడకనె నీకు మరణము ఘటించి నను ఘటింపవచ్చును. కావున హెచ్చరిక బొంది రాజును జంపి రాజవగుము. నేనును బుద్ధుని జంపి బుద్ధుడనగుదును.''

ఆ మంత్రము అజాతశత్రునిపై లెస్సగ పాఱినది. వాడును ఒక పదునైన కత్తిని నిగూఢముగ పెట్టుకొని మిట్టమధ్యాహ్నము వేళ జనకుని దునుముటకై అంతఃపురము

లోనికి జొఱబాఱెను. అతని వాలకమును బట్టి మంత్రులును పరిజనులును శంకించి అడ్డమై నిరోధించి యిట్లనిరి.

''కుమారా! నీతలంపేమి?''

''తండ్రిని చంపెదను.''

''ఈ బుద్ధిని నీ కెవ్వడు చెప్పెను?''

''ఆచార్యుడు దేవదత్తుడు.''

అని ప్రసంగించుచుండ మగధపతి బింబిసారు డాచోటికివచ్చి కుమారుని జూచి యిట్లనియె.

''పుత్రా! నన్నెందుకు చంపగోరితివి?

''నాయనా! రాజ్యమును కోరి –''

కుమారా! రాజ్యమేనాడైనను నీదేగదా. ఈనాడె గైకొనుము. యిచ్చెద'' నని పలికి తక్షణము బింబిసారుడు రాజ్యమును కొడుకున కప్పగించెను.

మగధనాథుడు అజాతశత్రుడు తనచేతి కీలుబొమ్మయగుటచే దేవదత్తుడు తన కెదుఱాడువారు లేక బుద్ధదేవుని బొరిగొందునని నిశ్చయించెను. ఒకనాడొక హంతకుని పిలిచి యిట్లనియె.

''ఓరీ! నీవు శ్రమణగౌతముని చంపి యీ దారిని రావలసినది'' యని చెప్పి ఆ దారియందిద్దరి నునిచి ఒంటరిగవచ్చెడి వానిని మీరు వధించి ఆ మార్గమున పొండని ఆదేశించి, ఆ మార్గమునందు నల్గురిని కాపుంచి ఈ త్రోవనువచ్చు యిద్దఱిని సంహరింపుడని వారికి సలహా చెప్పి వారిని త్రెంచుటకు పైన యెనమండ్రను, వారిని దెగటార్చుటకు మరిమీద పదునార్వురిని యిట్లు కనుపులు కనుపులుబెట్టి దేవదత్తుడు దురంతవిద్రోహ సాధనయందు కసిమసగి యుండెను.

హంతకుడు భగవంతుని సమీపించెను. ఒళ్ళు జలదరించినది. గుండెలు బరువైనవి. ఆపాదమస్తకము స్వవశము దప్పినది.

''దేవా! శరణు. శరణు.''

''ఆయుష్మంతా! భయపడకుము.''

''ప్రభూ! పాపినై మూఢుడనై మహాపచారమునకు ఒడిగట్టితిని. నన్ను మన్నించండి. మీదట నేనిట్టి దురితముల పొంతకుపోను.''

''ఆయుష్మంతా! అపరాధము నొప్పికొంటివి. ముందు ముందు ధర్మమార్గమున నడతునని బాసచేసితివి. అందుచేత నిన్ను అనుగ్రహించుచున్నాను.''

''అట్లాపురుషుడు తథాగతుని కరుణకు పాత్రుడై ధర్మచక్షువును బొంది సాంజలి శరణాగత ఉపాసకుడుగ గ్రహింపబడెను.

వాడు రాలేదని వెనుకనుండు యిద్దరు పురుషులు వచ్చి బుద్ధదేవునకు శిష్యులైరి. అట్లే కడవఱకు కాపువెట్టిన వారందఱును బుద్ధుని సమీపించి మొదటివానివలె ఉపాసకులుగ గ్రహింపబడిరి.

పన్నిన పథకమంతయును పంచబంగాళమై పోవుటచే దేవదత్తుడు మ్రింగను క్రక్కను జాలక పరితపించుచుండెను.

ఒకనాడు గౌతమబుద్ధుడు గృధ్రకూట పర్వతముయొక్క చఱియయందు చల్లని నీడలో కూర్చొని యుండెను. అక్కసము వెక్కసమైయున్న దేవదత్తుడా యదనుగని పెట్టి నేడు బుద్ధుని నుగ్గునూచము చేయుదునని కొండపై కెక్కి చక్కగ నొక్క మహాశిలను ఆయనపై దొర్లించెను. ఫెల్లుఫెల్లుమని క్రిందికి దుముకుచున్న ఆ గుండు దేవమాయా ప్రభావమున నడుమంతరమందే యొక గండశిలకు దగిలి పొడిపొడియైనది. అందులో నొకముక్క చిట్లి భగవంతుని పాదమునకు దగిలెను. నెత్తురు జొట జొట కాఱజొచ్చినది.

## శకలికా సూత్రము

[1] రాజగృహ నగరమున [2] మద్రకుక్షి మృగదావమునందు సంబుద్ధుడు విహారము చేయుచుండెను. పాషాణశకలిక తగులుటచే పాదమంతయు క్షతవిక్షతమై యున్నది. జివ్వుజివ్వుమని తీవ్రవేదన విపరీతముగనున్నను స్మృతి సంప్రజన్య సమాధి నవలంబించి భగవంతుడా శోకమునకు లోనుగాక యుండెను. సంఘాటి ( దుప్ప

(1) స. ని. 1 - 4 - 8.

(2) అ. క. దేవదత్తుడువైచిన రాయి తుత్తుమురై అందొక శకలము యెగిరివచ్చి భగవంతుని పాదమునకు తగిలి రక్తసిక్తము జేసినది. ఆ చోటు విహారమునకు అనుకూలము గాదని తలంచి భిక్షువులు భగవంతుని డోలీయందుంచుకొని మద్రకుక్షికికొని పోయిరి.

ట్)ని నాల్గుమడతలుగ మడచి కాలిపై కాలువేసికొని సింహశయ్య నవలంబించి యుండెను.

## దేవదత్త విద్రోహము

[1] తానెత్తిన యెత్తులన్నియు నొక్కొక్కటి మొక్క పోవుటచే దేవదత్తుడున్మత్తుడై రాత్రింబవళ్ళు అదేరంధియందు కాలము గడప జొచ్చెను. ఆనాటిదినములందు రాజగృహపురమున నొక మదపుటేనుగు ఉండెడిది. దానిపేరు నాలాగిరి. మనుష్యులను జూచిన కాలబెట్టి నేలరాచి ధూళిగలిపెడి చండగజము. ఒకనాడు దేవదత్తుడు గజశాలలోనికి బోయి మావటీని బిలిచి ''ఓయీ! ఈనాడు శ్రమణగౌతముడు వీధివెంబడి వచ్చునపుడు యీ నాలాగిరి గజమును విప్పి అతనిపై కవియించునది'' అని ఆజ్ఞాపించెను.

భిక్షుసంఘము వెనువెంట వచ్చుచుండ రాజగృహపురవీధియందు పూర్వాహ్ణ సమయమున భిక్షాచారమునకై భగవంతుడు బయలు దేరినాడు. వేచుకొనియున్న మావటివాడు యేనుగును గొలుసువిప్పి హుమ్మని కవియించెను. అదియు తొండమును ఆకసమునకెత్తి ఘీంకరించుచు చెవులజాడించుచు నడివీధిని బడినది. ఊరంతయు గలిబిలియైనది. గోడలెక్కి మేడలెక్కి పురజనులు ప్రక్కకు పొమ్ము – పొమ్మని భగవంతుని అదలించుచుండిరి. మహాశ్రమణుడు యీనాటితో సరియని కొందఱును, యేనుగు యేనుగును ఢీకొన్నది; యేమగునోయని కొందఱును తోచినట్లు సంభాషించిరి.

సుగతదేవుడు మైత్రీభావనాయుక్తమగు చిత్తవృత్తితో యేనుగును స్పృశించెను. మచ్చుజల్లినట్లు అదియు తొండమును క్రిందికి వాల్చి భగవంతుని దాపుకువచ్చి నిలిచెను. పవిత్రమగు తన హస్తముతో అమ్మహాత్ముడు దాని కుంభస్థలమును నిమిరెను. అంతట ఆ గజము తన తొండముతో ఆ దివ్యపురుషుని పాదములను ముట్టి ఆ చరణధూళిని నెత్తిపై జల్లుకొని మరలి చని తన శాలయందు యథాస్థానమున నిలిచెను.

మరియొకప్పుడు దేవత్తుడు తన శిష్యులగు కోకాలికుడు, కటమోరతిష్యుడు, ఖండదేవుడు, సముద్రదత్తుడు ననువారిని కూర్చుకొని యిట్లు నుడివెను. ''ఆయుష్మంతులారా! మనము శ్రమణగౌతముని సంఘమునందు విషబీజములు నాటి

(1) చుల్లవగ్గ.

భేదమును జేకెత్తించవలెను. దానికి అనువైన మార్గమును వెదకితిని పదండు పోద'' మని అందఱును గలిసి భగవంతుని చెంతకు పోయి అభివాదములు చేసి కూర్చొనిరి. దేవదత్తు డిట్లనియె.

''భంతే! భిక్షునియమములను మార్పు చేయదలంచి అయిదు విషయములను నేను నిర్ణయించుకొని వచ్చితిని. వాటిని భిక్షుసంఘము పాలించునట్లు తామాజ్ఞ యివ్వవలెను. 1. భిక్షువైనవాడు యావజ్జీవము అరణ్యముననె వసింపవలెను. గ్రామములలోనికి రారాదు. 2. బ్రదికినంతకాలము భిక్షాచరణముననె మెలగవలెను. ఏనాడును నిమంత్రణలకును, విందులకును పోరాదు. 3. జీవించియున్నంతకును పాంసుకూలికుడు (పేలికలనుగూర్చి కట్టుకొనువాడు) గనె యుండవలెను. గృహస్థులిచ్చు చీవరములను – వస్త్రములను ధరింపరాదు. 4. ఎప్పటికిని వృక్షమూల వాసియె కావలెను. మఱి యేఆశ్రయమును కొనరాదు. 5. ఆజన్మాంతము మత్స్య మాంసములను దినరాదు. ఈ అయిదు నియమములను నేనూహించితిని. వీటికి తప్పినవాడు 'దోషి' యని యెన్నబడును.''

''దేవదత్తా! చాలుచాలును. భిక్షువు యిష్టమున్నచో అరణ్యమున నుండ వచ్చును. లేదా గ్రామముననుకూడ నివసింపవచ్చును. భిక్షను గొనవచ్చును; నిమంత్రణమునకును బోవచ్చును. పాంసుకూలికుడు కావచ్చును. లేదా గృహస్థు లిచ్చు వస్త్రములను ధరింప వచ్చును. ఎనిమిది నెలలు వృక్షమూలమున నివసింపవలెనని భిక్షువులకు యీవఱకె అనుజ్ఞ యిచ్చియున్నానుగదా [1] దృష్ట – శ్రుత – పరిశంకిత మగు మాంసమును నేను నిషేధించియె యున్నాను. దేవదత్తా! ఇంతకుమించి అనివార్యములుగ జేయుటకు నే నొడంబడను.''

అంతట దేవదత్తు డచ్చోటినుండి లేచిపోయి ఉత్తమములగు తన నియమములను బుద్ధుడు త్రోసిరాజనినాడ'ని అందందు కుప్రచారము జేసెను. వైశాలినుండి ఆ సమయమున క్రొత్తగ వచ్చిన వజ్జిపుత్తక భిక్షువులు యేనూర్వురు యథార్థమెరుంగ లేక అతనితో గలిసిరి. ఇట్లు సంఘభేదము కల్గించి యేనూర్వురు భిక్షువులను తోడ గొని [2] గయాశీర్ష పర్వతమునకు బోయెను.

---

(1) దృష్టము = తనకొఱకై చంపబడినదిగ చూచుట. శ్రుతము = తనకొఱకై చంపబడినదని వినుట. పరిశంకితము = తనకొఱకై చంపబడినదిగ ఊహకు తట్టుట.

(2) బ్రహ్మయోనిపర్వతము (గయ)

ఆయుష్మంతులు సారిపుత్ర మౌద్గల్యాయనులు భగవంతుని సన్నిధికి బోయి యిట్లు నివేదించిరి.

''పూజ్యా! దేవదత్తుడు సంఘమును చీల్చి యేనూర్వురు భిక్షువులను గొని గయాశీర్షమునకు పోయినాడు.''

''ఆయుష్మంతులారా! మీకు మీ తోడి భిక్షువులయందు దయలేదా? ఉపేక్షిం చెద రేల? వారు పూర్తిగ చెడకముందె పోయి ఉద్ధరిచండి.''

భగవంతుని ప్రేరణను గొని సారిపుత్రుమౌద్గల్యాయనులు దేవదత్తుడున్న చోటికి బయలుదేరి పోయిరి. సభామధ్యమున కూర్చొని ధర్మోపదేశము చేయుచున్న దేవదత్తుడు తనచెంతకు వారిరువురు వచ్చుచుండుట చూచి భిక్షువులతో నిట్లనియె.

''భిక్షువులారా! నా ధర్మముయొక్క ప్రభావమును చూడుడు. బుద్ధునకు పట్ట శిష్యులైన సారిపుత్రమౌద్గల్యాయనులుకూడ ఈ ధర్మము నాశ్రయించుటకు ప్రాకులాడి వచ్చుచున్నారు.''

ఆ మాట విని కోకాలికుడు దేవదత్తునితో నిట్లనియె. ''ఆర్యా! వారు మహా మాయావులు. వారిని నమ్మకుడు.''

సారిపుత్రమౌద్గల్యాయనులు సభలోనికి ప్రవేశించిరి. దేవదత్తుడును వారికి స్వాగతమిచ్చి తన అర్ధాసనమున కూర్చొనునట్లు ప్రార్థించెను. కాని వారు సమ్మతిం పక ప్రత్యేకమగు ఆసనములందు కూర్చొనిరి. అది రాత్రిసమయము. చాల ప్రొద్దు పోవువఱకు ధర్మములను బోధించి దేవదత్తుడు సారిపుత్రునితో నిట్లనియె.

''ఆయుష్మంతా! సారిపుత్రా! ధర్మములను వినుటయందు భిక్షుసంఘ ముత్సాహముగనె యున్నది. నే నలసితిని. కొంత సేదదీర్చికొందును. మీరు ప్రబో ధించుచుండుడు'' అని చెప్పి తన సంఘాటిని పఱచుకొని దేవదత్తుడు పరుండెను. పరుండుటయె తడవుగ స్మృతి సంప్రజన్యముల గోల్పోయి గాఢనిద్రను చెందెను. అచ్చట సారిపుత్రుడును మౌద్గల్యాయనుడును తమ అసామాన్య ప్రతిభాశక్తివలనను అద్భుత యోగబలము వలనను భిక్షుసంఘము మంత్రముగ్ధమగునట్లు ధర్మదేశన మును ధర్మానుశాసనమును జేసిరి. వెంటవెంటనె భిక్షువులకు 'సముదయధర్మ మెల్లను నిరోధధర్మమె' యనెడివిమల ధర్మచక్షువు సంభవించినది.

''ఓ భిక్షువులారా! మేము బుద్ధభగవంతుని అనుయాయులము. మా యీ ధర్మము రుచించినవారెల్లరును యిదె మాతోడ బుద్ధదేవునివద్దకు వచ్చునది'' అని సారిపుత్రమౌద్గల్యాయను లుగ్గడించి బయలు దేరినంత యేనూర్వురు భిక్షువులు వారిని వెన్నంటిరి. అందఱును వేణువనమును జేరికొనిరి.

ఇక్కడ కోకాలికుడు దేవదత్తుని మేల్కొల్పి నడచిన కథయంతయు తెలియజెప్పి ''అయ్యా! సారిపుత్రమౌద్గల్యాయనులను నమ్మవద్దని చెప్పితిని. వింటివి గాదుగదే'' యని అంగలార్చెను.

## విశాఖా సూత్రము

[1] భగవంతుడు బుద్ధుడు శ్రావస్తియందు పూర్వారామమున విహరించుచున్నాడు. మృగారమాత విశాఖ, మధ్యాహ్న వేళయందు భగవానుడున్నెడకు పోయి ఒక చోట గూర్చొనినది. సుగతు డిట్లడిగెను.

''విశాఖా! ఏల చికాకుగనున్నావు? ఈ మధ్యాహ్న వేళ యెచ్చటినుండి వచ్చితివి?''

''స్వామీ! [2] మా వ్యవహార మొకటి రాజువద్ద తగుల్కొనినది. అది యింకను తీర్మానము కాలేదు. ఆ పనికై రాజకీయ కార్యాలయమునుండి వచ్చుచున్నాను.''

ఆ ప్రసంగము నాలకించి భగవంతు డీక్రింది ఉదానమును పాడెను.

*క॥ పరవశమే దుఃఖంబగు । పరగు సుఖము స్వవశమగుచు ప్రాణులకెల్లన్*
*పారి – కామభోగవాంఛల । నరిదిగదా దాటి వేయుటన నెవ్వరికిన్ ॥*

## జటిల సూత్రము

[3] మఱియొకప్పుడు బుద్ధుడు గయయందు గయాశీర్ష పర్వతముపై విహరించుచుండెను.

జటిలతాపసులు పలువురు ముమ్మరముగ మంచుకుఱియు [4] అంతరాష్టక దినములలో నీటియందు మునుగుచు – నానుచు – హోమము లొనర్చుచు నుండిరి. పాపము తొలగుటకు, చిత్తశుద్ధిని పొందుటకు వారట్లు క్లేశముల నోర్చుచు వచ్చిరి. భగవంతు డది గాంచి క్రింది యుదానమును పాడెను.

*తే. గీ. మునుగుచున్నారు, బుడకోళ్ళు మునిగినట్లు*
*దీనిచే చిత్తశుద్ధి సిద్ధింపబోదు*
*సత్యమున ధర్మమున మెల్గజాలినపుడు*
*వాడె శుచి వాడె ఋషి వాడె బ్రాహ్మణుండు.*



(1) ఉదానము 2 – 9 (నలుబదియవవర్షావాసము పూర్వారామమునందు)
(2) అ. క. విశాఖయొక్క పుట్టింటివారు ఆమెకు కాన్కగ అమూల్య ధనమును బంపిరి. నగరద్వారమువద్ద ప్రభుత్వాధికారులు వాటిని జూచి పన్ను నధికముగ వసూలు చేసిరి.
(3) ఉదానము 1 – 9.
(4) మాఘమాసమున చివరినాల్గుదినములును, ఫాల్గుణమున మొదటి నాలుగు దినములును అంతరాష్టకము లందురు.

ఆయుస్సు 75 - 80 వి. పూ. 431 - 456

# శ్రీ బుద్ధచర్య

## పంచమ ఖండము

### సంగ్రామాది సూత్రములు (వి. పూ. 431 - 430)

[1] భగవంతుడు బుద్ధుడు శ్రావస్తియందు జేతవనారామమున విహరించుచుండెను. [2] ఆ సమయమున వైదేహీ పుత్రుడగు అజాతశత్రునకును కోసలపతి ప్రసేనజిత్తునకును యుద్ధము పొసగినది. అజాతశత్రువు తన చతురంగిణీ సేనలను సిద్ధము జేసికొని కాశివైపు ప్రయాణమయ్యెను. ప్రసేనజిత్తుడును ఆ వార్త విని తన సేనలతో ఆతని యెదుర్కొనెను. ఆ యిరువురకును హోరాహోరి ఘోరు నడచినది. అందు అజాతశత్రుడు జయించెను. కోసలుడు ఓటమిని బొంది తన రాజధానియగు శ్రావస్తికి మఱలి వచ్చెను.

---

(1) స. ని. 3 - 2 - 4 (41 వ వర్షావాసమును [ 431 వి. పూ. ] శ్రావస్తి జేతవనమున గడపెను.)

(2) అ. క. ప్రసేనజితుని తండ్రి మహాకోసలరాజు తన కూతురను బింబిసారున కొసగునపుడు రెండు రాజ్యములనడుమ నొక లక్షధనము రాబడిగల కాశీ గ్రామమును కొమార్తెకు కానుకగ నిచ్చెను. తర్వాత అజాతశత్రుని అత్యాచారమున బింబిసారుడును అతని భార్యయు మరణించిరి. దాని విని సహింపక కొడుకగు ప్రసేనజితు డా గ్రామమును వెండియు లాగికొనుటకు యత్నించెను. అజాతశత్రుడు యెదిరించెను. ఇట్లు మామకును అల్లునకును యుద్ధము జరిగినది.

భిక్షువులు పూర్వాహ్ణసమయమున పాత్రచీవరములను ధరించి శ్రావస్తీ నగరములోనికి భిక్షకొఱ కరిగి వచ్చి భోజనముచేసి భగవంతుని వద్దకు చనుదెంచి యిట్లనిరి. ''దేవా! ప్రసేనజితుడు అజాతశత్రునితో నోటమి బొంది శ్రావస్తికి మఱలి వచ్చినాడు.''

''భిక్షువులారా! అజాతశత్రువు దుస్సంగమున, పాపసంగమున మెలగువాడు. ప్రసేనజితుడు సత్సంగమున కుశలసంగమున సంచరించువాడు. అపజయమును పొందినవాడు కావున యీనాటి రాత్రిని అతడు దుఃఖముతో వేగించును. అది యట్టిదె గదా.

తే. గీ. జయముగల్గిన వైరంబు జన్మమెత్తు,
జయముతప్పిన దుఃఖంబు సంభవించు,
శాంతిసుఖమున తృప్తుడౌ సాధువెపుడు,
జయపరాజయముల వీడి సంచరించు.

అని భగవంతుడు భిక్షువులకు బోధించెను.

కొంతకాలము గడచినంత ప్రసేనజిత్తునకును అజాతశత్రువునకును లోలోపల రగుల్కొనుచున్న వైరాగ్ని మఱొక్కసారి యుద్ధరూపమున భగ్గున మండినది. ఈ తడవలో ప్రసేసజిత్తునకు జయమబ్బినది. అజాతశత్రుడు బందీగా పట్టుపడి నాడు. కోసల నరపతి యగు ప్రసేనజితుడు మగధనాథుడగు అజాశత్రుని రథగజ తురగ పదాతి వర్గములను తన వశము జేసికొని అల్లుడను జాలిచేత నతని ప్రాణములతో వదలిపెట్టెను. ఆ వార్తను భిక్షువులవలన విని భగవంతు డీ క్రింది గీతములను బాడెను.

తే. గీ. పాపములు చేయునప్పుడు పాలసుండు,
మిన్నుమన్నెఱుగక యట్టె మిడిసిపడును
కాని పరిపాకమున నవి కట్టి కుడుపు
నపుడు 'హా' యని విలపించు - నంగలార్చు.

ఆ. వె. హంతకుండు పొందు హత్య - నిందకుడొందు
నింద - కీడుజేసి చెందుకీడు
మేలుజేసినతడు మేలునె ప్రాపించు,
తాను చేసినంతె తనదు పాల.

## కోసల సూత్రము

[1] శ్రావస్తీనగరమందు అనాథపిండకుని జేతవనారామమున బుద్ధభగవంతుడు విహరించుచుండెను. అట్టియెడ యుద్ధమునందు జయమును సంపాదించి యిష్టార్థ సిద్ధినిగాంచి కోసలాధీశ్వరుడు ప్రసేనజితుడు వెనుదిరిగి పట్టణమునకు వచ్చుచు భగవంతుడు విహరించు ఆరామమునకు బఱతెంచెను. కొంతదూరమున రథమును దిగి పాదచారియై లోనికి ప్రవేశించెను. బుద్ధదేవుడు బయట కానరాలేదు. భిక్షువులను చూచి ''భిక్షువులారా! సుగతస్వామి యెందున్నారు? దర్శించవలె'' నని యడిగెను.

''మహారాజా! అదె ఆ విహారమునందున్నారు. నెమ్మదిగ సమీపించి గొళ్ళెము (చిలుకు) ను కదలించి సూచననిండు. తలుపు తెఱచెదరు'' అని భిక్షువులు సమాధానమిచ్చిరి. ఆ రాజును అట్లె జేసెను. లోపల విహరించుచున్న బుద్ధస్వామి వాకిలిని తెఱచెను. అంతట ప్రసేనజితుడు లోనికి ప్రవేశించి భగవంతుని చరణారవిందములపై తలనుంచి నమస్కరించి, భక్తిభావాతిరేకమున తనివిసనక పాదములను కండ్ల కద్దుకొనును. ముద్దిడుకొనును. అల్లనల్లన చేతులతో నొత్తును. ''ప్రభూ! నేను కోసల రాజును: ప్రసేనజితుడను; యిదె అభివాదన మొనర్చుచున్నా'' నని తేపతేపకు పలుకును. తథాగతుడిట్లనియె.

''మహారాజా! ఈ శరీరమునందింతటి మక్కువను, యింతటి ఆదరమును యేల గనబఱచుచున్నావు?''

''దేవా! బహుజనసుఖార్థమై బహుజనహితార్థమై దేవరవారవతరించితిరి. కల్యాణధర్మమును నెలకొల్పి చీకటిలోకమునకు వెలుగు జూపించితిరి. ఇది నా కనీసపు ధర్మము. ఇంతమాత్రమైనను కృతజ్ఞతను ప్రకటించవలదా? ప్రభూ! పాహి. పాహి.''

## వాహీతిక సూత్రము

[2] గౌతమబుద్ధుడు జేతవనారామమునందు విహరించుచుండెడి సమయము. దాదాపు మధ్యాహ్నమువేళ. పగటి విహారమునకై ఆయుష్మంతుడు ఆనందుడు విశాఖ

(1) అ. ని. 10 - 1 - 10.
(2) మ. ని. 2 - 4 - 8

నిర్మించిన పూర్వారామమువైపునకు పోవుచుండెను. ఆ తరుణముననె రాజగు ప్రసేనజిత్తుడు పుండరీకమను భద్రగజమునెక్కి పురివెలుపలికి బోవుచు ఆయుష్మంతుడు ఆనందుడు దూరమునందు వచ్చుచుండుట గాంచి తన ప్రధానామాత్యుడగు శ్రీవర్ధనుని యెదురుగ బంపించి తన యొద్ధకు వారిరువురు వచ్చినంతనె యేనుగును దిగి సాదరముగ ఆనందునితో నిట్లనియె.

''స్వామీ! తమకు సమ్మతమైనచో అచిరవతీ నదీతీరమునకు పోవుదముపద. అందు కొంత వడి హాయిగ విశ్రమించవచ్చును.''

ఆ మాటను ఆనందుడు మౌనముతో అంగీకరించెను. ఇరువురును నడచియే నదీతటమునకు బోయిరి. మహారా జిట్లనెను.

''స్వామీ! ఆనందా! తుదిదాక నాలోచింపనివారగు మూర్ఖులమాటలను మే మాలకింపము. పారంగతులు దీర్ఘ దర్శులునగు పండితుల మాటలనె మేము పాటింతుము. తాము సెలవియ్యండి. శ్రమణబ్రాహ్మణులు నిందించెడి తిరస్కరించెడి కాయిక వాచిక మానసిక క్రియా చరణములందు భగవంతుడు బుద్ధుడు ప్రవర్తించునా?''

''మహారాజా! ప్రవర్తించడు.''

స్వామీ! ఆ ఆచరణము లెట్టివి?''

''మహారాజా! అవి అకుశలములు.''

''భంతే! అకుశలములనగా నేమి?''

''మహారాజా! దోషములతో కూడినవి.

''ఆర్యా! అవి యెట్టివి?''

''రాజేంద్రా! హింసాయుక్తములు.''

''ఆనందా! హింసాయుక్తము లనగా నేమి?''

''భూపాలా! దుఃఖపరిణామము గలవి. చివరకు దుఃఖమును కలిగించునవి. తనకును పరులకును ఉభయులకును పీడను బాధను క్లేశమును కలిగించునవి. అకుశలధర్మములను పెంపు జేయునవి. కుశలధర్మములను క్రుంగదీయునవి. అట్టి ఆర్యనింద్యములగు కాయికవాచిక మానసిక ప్రవృత్తులయందు భగవంతుడు ప్రవర్తింపడు.''

స్వామీ! ఆనందా! శ్రమణబ్రాహ్మణులు ప్రశంసించెడి - పురస్కరించెడి కాయిక వాచిక మానసిక క్రియాచరణములందు భగవంతుడు ప్రవర్తించునా?''

''అవును. నరనాథా! ప్రవర్తించును. ప్రశంసించును.''

''స్వామీ! ఆ ఆచరణము లెట్టివి?''

''రాజేంద్రా! అవి కుశలములు; నిర్దోషములు; అహింసకములు; తనకుగాని పరులకుగాని ఉభయులకుగాని పీడను బాధను కలిగించనివి. అకుశలధర్మములను అంతము చేయునవి. కుశలధర్మములను కూడబెట్టునవి.''

''పూజ్యుడా! అమృతరసమును చిప్పిల్ల జేయు మీమధురవాణిని విని కడుం గడు తనిసితిని. ఏనుగుల - గుఱ్ఱముల - గ్రామముల నైన నిచ్చి మిమ్ము సత్కరింప వలెనని కౌతూహల ముబికి ఊటెత్తుచున్నది. కాని వాటిని స్వీకరించుటకు తాము ఒడంబడరు. దేవా! మఱొక్క మనవి. మగధాధిపతి మా అజాతశత్రు డొక మనోహ రమగు వస్త్రమును నాకు కానుకగ పంపినాడు. అది పదునాఱుమూరల పొడవు గలది. ఎన్మిదిమూరల వెడల్పు గలది. వాహీతరాష్ట్రమున నిర్మింప బడినదవు టచే దానిని వాహితికవస్త్రమందురు. అది మీ కర్పింపబడుచున్నది. అవశ్యము స్వీకరింప వలెను.''

''రాజా! నాకు కావలసిన చీవర (వస్త్ర) ములు మూడును సంతృప్తిగ నున్నవి. ఇక నాకు పని లేదు.''

''మహాత్మా! ఆనందా! ఆ చీవరములను సబ్రహ్మచారులగు భిక్షువులు పంచు కొందురుగాక. కాని నే నిచ్చు యీ వస్త్రమును తాము తప్పక గ్రహించవలెను. అది యొక్కటియె మీకు మూడు చీవరములుగ కాగలదు. నా కోర్కె సఫలమగును. నా దానము కృతార్థమగును.''

అని పలికి ఆనందుని ఒప్పించి వస్త్రమును సమర్పించి ప్రసేనజితుడు యథేచ్ఛ బోయెను. ఈ విషయమంతయును విని బుద్ధభగవంతుడు రాజేంద్రుని సౌజన్యమును - సౌశీల్యమును - సౌభాగ్యమును పెక్కు భంగుల కొనియాడెను.

## చంక్రమసూత్రము

భగవంతుడు నలభై రెండవ వర్షావాసమును (వి. పూ. 430) పూర్వారా మమున గడపెను.

[1] అదియొక సమయము. బుద్ధదేవుడు రాజగృహమునందు గృధ్రకూట పర్వతముపై విహారము చేయుచున్నాడు. అందందే ఆయాప్రాంతములందే ఆయుష్మంతుడు సారిపుత్రుడు, మహామౌద్గల్యాయనుడు, మహాకాశ్యపుడు, అనురుద్ధుడు, పూర్ణమైత్రాయిణీ పుత్రుడు, ఉపాలి, ఆనందుడు, దేవదత్తుడును వారివారి భిక్షుసంఘ సహితముగ విహరించుచుండిరి. అట్టియెడ తనతోడనుండు భిక్షువులను బిలిచి తథాగతు డిట్లనియె.

''భిక్షువులారా! అటుచూడుడు. అతడె సారిపుత్రుడు. అదంతయు నతని భిక్షుసంఘము. వారందఱును మహాప్రాజ్ఞులు. ఆయన మహామౌద్గల్యాయనుడు. ఆ మొత్తము సంఘము మహాసిద్ధిధారులు. ఆ గుంపునకు మహాకాశ్యపు డధినేత. వారందఱును అవధూతగుణముల నాశ్రయించినవారు. ఆ సమాజమునకు అనురుద్ధుడు ముఖ్యుడు. వారందఱును దివ్యచక్షువుగలవారు. అల్లదిగో! అతడు పూర్ణమైత్రాయిణీపుత్రుడు. వారెల్లఱును ధర్మకథికులు. అడుగో! వాడె ఉపాలి. ఆ గుంపంతయు వినయధరులు. అది ఆనందుని సంఘము. వారు బహుశ్రుతులు. భిక్షువులారా! ఆతడే దేవదత్తుడు. వారందఱును అతనితోడి భిక్షువులు. వారి ఆచారము కొఱగానిది. చక్కనిజతయె కుదిరినది. ఎన్నిమార్లు కరిగించి తిరుగ బోసినను తఱుగుపోవువారుగారు. లోకమునందలి ప్రాణికోట్లు, స్వభావము ననుసరించి – చిత్తప్రకృతి ననుసరించి జతపడియుందురు. హీనులు హీనులతోడనె కూడుదురు. ఉత్తములు ఉత్తమసంఘముననె కలియుదురు. ఇది యీనాడు క్రొత్త గాదు. గతించిన కాలముగూడ దీనికి విరుద్ధముకాదు. రాబోవు భవిష్యత్తు గూడ యీ నియమమును త్రోసిపుచ్చలేదు.''

అని నుడివిన భగవంతుని, భిక్షుసంఘము పలుతెఱగుల నభినందించెను.

## ఆమ్రయష్టికయందు

ఇట్లు బుద్ధభగవంతుడు రాజగృహపురమందును గృధ్రకూట పర్వతముననను కొన్నాళ్ళు విహరించి పదంపడ ఆమ్రయష్టికా నగరమున కరుదెంచి రాజాగారకమున నివసించుచు భిక్షుసంఘమునకు ఆయాధర్మకథల నుపదేశించుచుండెను. మరికొన్ని దినము లచ్చట విహరించి ఆనందుడును భిక్షుసంఘమును తోడవచ్చుచుండ సుగతదేవుడు [2] నాలందాపురిని ప్రవేశించెను. అందు నాలందాపురమున ప్రావారికుని మామిడివనములో విహారము చేయుచుండెడి ఒకానొక వేళయందు ఆయుష్మంతుడు

---

(1) సం. ని. 13 – 2 – 5.

(2) ప్రస్తుతము పాట్నాజిల్లా సిలావనగరము.

సారిపుత్రుడు గురునాథుని సమీపించి ప్రణమిల్లి యొకచో గూర్చొని చేతులు జోడించి యిట్లనియె.

"భగవంతా! తాము మాపాలిటి భాగ్యదేవతలు. మాసర్వోసర్వమగు శ్రేయస్సు తమకడనె యున్నది. తమకంటె నధికులగు శ్రమణ బ్రాహ్మణులు - సమ్యక్ సంబుద్ధులు గతకాలమున పుట్టియుండ లేదు. భవిష్యత్తున పుట్టబోరు. వర్తమానమున లేరు. ఇది నా నిశ్చయము."

"సారిపుత్రా! తటపటాయించక ఉదారముగ మాటాడితివి. ఈ మాట నీ భక్తికి దగిన ఆనవాలు. అయినను యింత దృఢముగ గర్జించి చెప్పునంతటి సాహసము నీ కెట్లు కలిగినది? గతించిన బుద్ధుల విషయము నీ కెట్లు పరిచితము? వారి శీలమును ధర్మమును ప్రజ్ఞయు విహారమును విముక్తియు యిట్టిదిట్టిదని నీకు తెలియునా?"

"దేవా! తెలియదు."

"రాబోవు వారిని గూర్చియైనను తెలియునా?"

"స్వామీ! తెలియదు."

"ఆయుష్మంతా! వారిని గూర్చిన నీ ప్రసంగము సరియేనా?"

"భగవంతా! సరిగాదు."

"సారిపుత్రా! నేను సమ్యక్ సంబుద్ధుడనని నన్ను గూర్చియు నా శీలధర్మ ప్రజ్ఞావిహార విముక్తులను గూర్చియు నీకు పూర్ణ పరిచయము గలదా?"

"దేవా! లేదు."

"అటులైన అంతటి ఉదారవాక్యము లెట్లు పలుకగల్గితివి?"

"పూజ్యుడా! అతీత అనాగత వర్తమాన బుద్ధులయొక్క చిత్తపరిజ్ఞానము నాకు లేకున్నను, పరంపరాక్రమమగు ధర్మమును నే నెఱుగుదును. ఆ ధర్మ మందఱికిని ఒకటియెగదా! అందుననే తమకంటె నధికులు లేరని పలుక సాహసించితిని. ఒకానొక రాజు తన పురముచుట్టును దృఢమును ఉన్నతమును నగు కోటను గట్టించి లోనికి వచ్చుటకు ఒకే యొక ద్వారము పెట్టినాడు. ద్వారము వద్ద నేర్పరియు ప్రజ్ఞావంతుడును నగు ద్వారపాలుని నియమించినాడు. వాడు అర్హు లైన వారిని లోనికి పంపును. అనర్హులను నివారించును. పిల్లి మొదలుకొని యేనుగువఱకు చిన్న పెద్ద యన్నింటికి ఆ ఒక్క ద్వారమే గతి. అట్లే ఓ భగవంతా! భూత భవిష్యద్వర్త

మానకాలములందలి అర్హతసంబుద్ధు లందరికి ఒకే ఒక ధర్మమార్గము శరణ్యమై యున్నది. కామము, హింస, ఆలస్యము, సంశయము, మోహము ననెడి నీ వరణము (ప్రతిబంధము) లను దూరముజేసి, ప్రజ్ఞను దుర్బలమొనరించు చిత్తోపక్లేశములను తుడిచివైచి, స్మృతి ప్రస్థానముల నాలిగింటిని, బోధ్యంగముల నేడింటిని చక్కగ భావనచేసి సమ్యక్ సంబోధిని – పరమజ్ఞానమును బొందుట బుద్ధు లందఱికిని పద్ధతియై యున్నది. ఇదియె యేకమాత్రద్వారమని యెఱుగగల్గితిని.''

అని పలికిన సారిపుత్రుని నుడుల నాలకించి బుద్ధదేవు డెంతయు సంతోషించెను.

## ఉపాలి సూత్రము (వి. పూ. 430)

★ ఒకానొకప్పుడు భగవంతుడు బుద్ధుడు నాలందయందు ప్రావారికుని మామిడివనమున విహరించుచుండెను. నిర్గ్రంథజ్ఞాతృ పుత్రుడును జైనసాధువుల యొక్క మహాసంఘముతో గూడి నాలందాపురియందే ఆ సమయమున విడిసి యుండెను. ఒకనాడు దీర్ఘ తపస్వి యను జైనసాధు వొకడు ప్రావారిక – ఆమ్రవన మున కరిగి సుగతదేవుని దర్శించి సమ్మోదన మొనర్చి యొకచోట కూర్చొనెను. ఆతని జూచి బుద్ధదేవు డిట్లనియె.

''తపస్వీ! పాపకర్మములను చేయుటకు, పాపకర్మములందు ప్రవృత్తుడగు టకు విధానము లెన్నియని మీ ఆచార్యుడు సూచించినాడు?''

''గౌతమా! కర్మము – కర్మము అనుట మా ఆచార్యుని పద్ధతి గాదు. అతడు దండము – దండము అనును.''

''తపస్వీ! అవి యెన్ని విధములు.''

''గౌతమా! కాయదండము – వచనదండము – మనోదండమని మూడు విధములు.''

''తపస్వీ! మీ గురుడగు నిగంఠనాతపుత్తుడు ఆ మూడింటిలో దేనిని ప్రబలమై నదిగను, మహాదోషయుక్తముగను ప్రతిపాదించును.''

---

★ మ. ని. 2 – 2 – 6.

''గౌతమా! తక్కిన రెంటికంటె కాయదండమునె గొప్పగ చెప్పును.''

''తపస్వీ! కాయదండమునేనా?''

''గౌతమా! అవును. నీవు యే దండమును ప్రబలమైనదిగ చెప్పుదువు?''

''తపస్వీ! దండము – దండమని చెప్పుట నా పద్ధతి గాదు. కర్మము కర్మమని చెప్పుట తథాగతుల పద్ధతి. తక్కిన రెండింటికంటె మనఃకర్మమును నేను ప్రబలమైన దిగ జెప్పుదును.''

''ఆయుష్మంతా! గౌతమా! మనఃకర్మమునేనా?''

''అవును. తపస్వీ! అవును.''

ఆ మాట విని దీర్ఘ తపస్వి యగు నిగంఠు డాచోటు బాసి తన గురుడగు నిర్గ్రంథజ్ఞాతృ పుత్రుడున్న చోటికి పోయెను. ఆ తరుణమున జైనాచార్యుడు పెద్ద సభను కూర్చుకొని కూర్చొని యుండెను. అందులో ఉపాలి మొదలగు గృహస్థులు కూడ పలువురుండిరి. అచ్చటికి బోయి దీర్ఘ తపస్వి తనకును శ్రమణగౌతమునకును జరిగిన ప్రసంగమును పూసగ్రుచ్చినట్లు వివరముగ నిగంఠనాతపుత్తున కెఱిగించెను. అదంతయు నాలకించి ఆయన యిట్లనియె.

''అయ్యా! తపస్వీ! సమర్థుడవు. ఆచార్యుని ఉపదేశమర్మమును చక్కగ యెఱిగితివి. దానినె శ్రమణగౌతమునకు తెల్పితివి. అయినను ఆపక్షి కేమి తెలియును? పాపప్రవృత్తులయందు కాయమునకంటె మనస్సుయొక్క జోక్యమె మిగుల దోషమను మాట యెట్లు రాణించును?''

అని ముచ్చటించు నిగంఠనాథుని జూచి సభాస్తారుడైయున్న ఉపాలియను గృహపతి యిట్లనియె. ''స్వామీ! దీర్ఘ తపస్వి పారమర్మమును నిక్కముగ చెప్పినాడు. కాని గౌతముడే పప్పులో అడుగువైచి జాఱిపోయినాడు. నే నిప్పుడే శ్రమణగౌతముని వద్దకు బోయి వాదమునకు తలపడెదను. అదను దొరకినది కావున అడకత్తెరలో ఒత్తెదను. ఏమి సమాధాన మివ్వగలడో చూచెదను.''

అని నుడివిన ఉపాలిమాటలకు జైనగురుడు సమ్మతించెను. అంతట దీర్ఘ తపస్వి ఆచార్యునితో నిట్లనియె.

''స్వామీ! శ్రమణగౌతముడు సామాన్యుడుకాడు. మహామాయావి. ఆ మహేంద్రజాలములోన యెట్టివారినైన ముంచగలడు. దాపునకు పోయినవాడు. అతనికి శిష్యుడుగాక తప్పదు. ఆలోచించి ఉపాలగృహపతికి అనుజ్ఞ నివ్వండి.''

"తపస్వీ! ఎక్కడిమాట? మన ఉపాలి గౌతమునకు శిష్యుడగునను జంకు కలలో గూడ అనవసరము."

హుటాహుటి బయలు దేఱిన ఉపాలిగృహపతి ప్రావారిక – ఆమ్రవనమును చేరుకొనెను. అచ్చట భగవంతునకు ప్రణమిల్లి ఒకవైపు కూర్చొని మెల్లగ ప్రసంగమును కదలించుచు యిట్లనియె.

"పూజ్యుడా! నిగంఠుసాధువు దీర్ఘ తపస్వి యిచ్చటికి వచ్చి యుండినాడా?"

"గృహపతీ! వచ్చియుండెను." అని పలికి జరిగిన వృత్తాంతమంతయు బుద్ధ దేవు డెఱింగించెను. పదంపడి ఉపాలి యిట్లనియె.

"ఔరౌర! దీర్ఘ తపస్వి సత్యసారమును చక్కగ తెలిపినాడు. భంతే! గౌతమా! వచనదండమున కంటెను, మనోదండమునకంటెను కాయదండమే ప్రబలమైనది. అదియె మహాదోషయుక్తము."

"ఉపాలీ! నిజమునందు నిలుకడగా నిలువగలిగినచో తప్పక మన మిరువు రమును యీ విషయమున కొంతసేపు ముచ్చటించుకొనగలుగుదుము."

"భంతే! అట్లే కానిమ్ము."

"గృహపతీ! ఒకానొక రోగి చన్నీటిని అభిలషించి అవి తనకు లభింపక పోవు టచే మరణించినాడు. మీ సిద్ధాంతము ననుసరించి వాడు తిరిగి యెచ్చట పుట్ట గలడు?"

"స్వామీ! మనస్సత్త్వమను దేవతాకోటి గలదు. దాని యందు పుట్టును."

"గృహపతీ! యోచించుకొనుము. తూరుపు పోవువానికి పడమర లభింపదు. మఱియొక మాట. ★ చాతుర్యామములను చక్కగ పాలించుచు, ధూతపాపుడని యెంచబడు జైనసాధువు వచ్చునపుడు పోవునపుడు ఆయా వ్యవహారములలో పాల్గొనునపుడు యెన్నియో సూక్ష్మప్రాణులను పిలుకుమార్చుచున్నాడు. దాని విపాకమును మీ ఆచార్యుడు యేమని చెప్పును?"

---

★ చాతుర్యామములు = 1. ప్రాణిహింసను చేయకుండుట, చేయింపకుండుట, అనుమోదించకుండుట, 2. దొంగతనమును, 3. అసత్యాలాపములను, 4. వ్యభిచారమును చేయకుండుట, చేయించకుండుట, అనుమోదించకుండుట.

''పూజ్యుడా! తెలిసి చేయలేదు కాబట్టి అది మహాదోషము కాదు.''

''గృహపతీ! తెలిసి తెలిసి చేసియున్నట్లయితేనో?''

''భంతే! మహాదోషమనుట తప్పదు.''

''ఉపాలీ! తెలిసి తెలిసి యనుట యేదండములో చేరును?''

''భంతే! మనోదండములోనికి చేరును.''

''గృహపతీ! యోచించి చెప్పుము. తూర్పునడచువానికి పడమర లభింపదు సుమా! ఒకానొక పురుషుడు ఖడ్గమును చేతబట్టి 'ఈ నాలందానగరములోని ప్రాణులనన్నిటిని క్షణమాత్రమున కడికండలు చేసివైచెద' నను. అంతమాత్రమున వాడు చేయగల్గుచున్నాడా?''

''స్వామీ! ఒక్కడేమి చేయగలుగును.''

''ఉపాలీ! బుద్ధిమంతుడు సిద్ధిమంతుడు నగు శ్రమణబ్రాహ్మణుడొకడువచ్చి 'ఈ నాలందనంతటిని సంకల్పమాత్రమున దగ్ధదగ్ధము చేయుదు'నని పలుకును. వాడట్లు చేయుటకు చాలియుండునా?''

''స్వామీ! ఈ ఒక్క నాలందాపురి వానికొక లెక్కలోనిది గాదు.''

''గృహపతీ! దండకారణ్యము, కలింగారణ్యము, మేధ్యారణ్యము, మాతంగారణ్యమునను వీటి మొట్టమొదటి పుట్టుకతను విని యున్నావా?''

''స్వామీ! వినియున్నాను. అవి మహాజనపదములై యుండి కూడ ఋషిపుంగవుల కోపమునకు గుఱియై వారి సంకల్పబలమున కాఅడవులై పోయినవి.''

''గృహపతీ! యోచించి చెప్పుచున్నావు గదా?''

''దేవా! మొదట మొదటియందే నాకు తగిన సమాధానమును బొంది సంతుష్టుడ నయితిని. కాని మరియు మరియు మీ మాటలను వినగోరి ప్రతివాదినై యుంటిని. గ్రుడ్డివానికి చూపు లిచ్చినట్లు దారితప్పినవానికి మార్గము నెఱిగించినట్లు, ప్రభూ! ధర్మమును వివిధ పర్యాయములు తెలియజెప్పితిరి. తథాగతుని, ధర్మమును, సంఘమును శరణుజొచ్చుచున్నాను. నేటినుండి నన్ను సాంజలిశరణాగత ఉపాసకునిగ అనుగ్రహించండి.''

''గృహపతీ! నీవు పేరు ప్రతిష్ఠలు గలవాడవు. పై పెచ్చు జైనసాధులపాలిటి కల్పవృక్షమవు. నెమ్మదిగ యోచించుకొనుము.''

''దేవా! నీ ఔదార్యము ఆకసమునకంటె గొప్పది. ఇంతమాత్రము వేఱొక గురువువద్దకు వెళ్ళి 'నన్ను మీ శిష్యునిగ గ్రహింపుడ' ని కోరియున్నచో వారు తక్షణమే 'ఉపాలిగృహపతి మాకు శిష్యుడైనాడ' ని దేశమంతటను ప్రచారము నెఱపియుందురు. ఇప్పుడు మీరు నన్ను తాళజెప్పుచున్నారు. వహవ్వా! బుద్ధుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును శరణుజొచ్చుచున్నాను. సంఘమును శరణుజొచ్చుచున్నాను.''

అని ప్రార్థించిన ఉపాలిగృహపతికి భగవంతుడు అనుపూర్వికథను ఉపదేశించెను. శుభ్రవస్త్రమునకు రంగు అతికినట్లు కూర్చొన్న ఆసనముపైననే ఉపాలికి విరజధర్మచక్షువు ఉదయించినది. అట్లు తథాగతుని ధర్మమునందు నిష్ణాతుడై భగవంతునకు అభివాదనములు చేసి ఉపాలి తన గృహమున కరిగి ద్వారపాలునితో నిట్లు చెప్పెను.

''ఓయీ దౌవారిక! నేటినుండి స్వతంత్రముగ ముందటివలె జైనసాధువులు నాయింటిలోనికి ప్రవేశింప వీలులేదు. ఆ అధికారమును బౌద్ధభిక్షువులకును, భిక్షుణి లకును యిచ్చుచున్నాను. హెచ్చరిక!''

ఊరంతయు ఒకటే పుకారు. ''ఉపాలి గృహపతి బుద్ధశిష్యుడైనాడు. నిగంఠ సాధులు వాకిలి మ్రోలనుండవలసినదే. భిక్ష కావలసినచో ద్వారపాలకుడు బైటికి తెచ్చియే బడవేయును. లోన అడుగు పెట్టనీడు.''

జైనసంఘము కుతకుతలాడినది. దీర్ఘ తపస్వి పరుగెత్తుకొని పోయి ఆచార్యుడగు నిగంఠనాతపుత్తున కీవార్తను యెఱిగించెను. ఆతండును ఆ మాటను నమ్మియు నమ్మక తన యనుచరు నొకని గృహపతి యింటికి బంపించి అంతమట్టుకు నిక్కముగనె యెఱింగి సహింపజాలక తన శిష్యసంఘముతోకూడ బయలుదేరి, ఉపాలి యొక్క గృహద్వారముకడ కరుదెంచెను. ద్వారపాలుడును వారినందఱిని అక్కడనె నిలిపి ''పూజ్యులారా! ఉపాలిగృహపతి శ్రమణగౌతమునకు ఉపాసక శిష్యుడైనాడు. పూర్వమువలె మీరు లోపలకరుగుటకు అనుజ్ఞ లేదు. భిక్షకావలసినచో యిక్కడికి తెచ్చి పెట్టుదు''ననెను.

''ఓయీ! ద్వారపాలా! మేము భిక్షకు రాలేదు. నిగంఠనాతపుత్తుడు వాకిటి ముందట నిలిచియున్నాడని చెప్పి మీ యజమానిని పిలిచికొనిరమ్ము.''

ద్వారపాలకు డావార్తను లోపల గృహపతికి నివేదించెను.

అతడును తాను కూర్చొనియున్న నడిమియింటియందు వేఱొక ఆసనమును బఱిపించి రమ్మని కబురంపెను. నిర్గ్రంథజ్ఞాతృపుత్రుడును లోనికి ప్రవేశించెను.

ఉపాలిగృహపతి తాను కూర్చొనియుండియె ఆ జైనాచార్యునకు ఆసనమును చూపించెను. మునుపటి ఆదరసత్కారములు కొఱవడుటచే అగ్గియైమండి నిగంఠనాతపుత్తుడిట్లనియె.

''ఓ గృహపతీ! ఉన్మత్తుడవైనావా ఏమి? వాదమును కుళ్ళగించి శ్రమణగౌతమునకు శృంగభంగము చేసివత్తునని పోయి నీవే ఆతని వలలో పడితివా? గౌతముని ఆవర్తనీమాయలో నీవుకూడ జారిపడిపోయినావే?''

''స్వామీ! శుభమగుగాక. అది గౌతముని ఆవర్తనీమాయయేయైన ఆ మాయయె నాకు పరమగతి. నేనెగాదు, నా ఆప్తమిత్రులును, నా హితపరిచితులును, బంధుబలగమును ఆ మాయలోనికె జారిపోదురుగాక యని తపస్సైన జేసెదను. విశ్వమానవ ప్రాణికోటికి అంతకంటె సుఖమును లేదు – శుభమును లేదు. మహానుభావా! జైనవాదము పామరులను, అజ్ఞులను, బాలురనుమాత్రము రంజింప జేయునది. అర్హతుని సమ్యక్ సంబుద్ధుని ధర్మము పండితులనుసైతమాకర్షింప జాలునది.''

''ఆయుష్మంతా! నరనాథుడు మొదలుకొని సామాన్యనరుని వఱకుకూడ ఉపాలిగృహపతి నిగంఠనాతపుత్తుని శిష్యుడని సుప్రసిద్ధమైయున్నది. మరి యిప్పుడు నీ వెవని శిష్యుడవని ప్రకటించుకొనుచున్నావు.''

''స్వామీ! వినుండు.'' అని పలికి ఉపాలిగృహపతి ఆసనమునుండి లేచి ఉత్తరీయము నొకభుజముపై సర్దుకొని భగవంతుడున్న వైపుకు మళ్ళి చేతులు జోడించి నిలువబడి యిట్లనియె.

చ. నరసుర కోటిభోగముల నాదట నూడ్చినవాడు; శాంతిలో
కురిసెడివాడు; సర్వశుభకోటికి నాకరమైనవాడు, దు
ర్భరమగు దుఃఖరాశి నెడబాయగ నేర్చినవాడు; వాడె నా
గురుడు తథాగతుం డతని కూరిమి శిష్యుడ నేను, పూజ్యుడా!

ఉ. బుద్ధియుతుం డశేష గుణరూపవిలాస విమోహదూరు డ
త్యుద్ధత మారసైన్య దళనోగ్రనిభాసి, నిరస్తమాని, సం
శుద్ధుడు, లోకవేత్త, గుణశోభను డక్షరు డద్వితీయుడౌ;
బుద్ధుడు నాకు సద్గురుడు – పూజ్యుడు; శిష్యుడ నేను సుమ్మిలన్.

శా. త్రైవిద్యుండు, మహాభిషఙ్మణి, లసత్ తత్త్వజ్ఞ సంభావితుం
డావిర్భావ తిరోభవాది రహితుం డానంద పూర్ణుండు సు
శ్రీవర్ధిష్ణువు, దమ్యసారధి గురుశ్రేష్ఠుడు సన్మాన్యుడౌ,
దేవారాధ్యుడు బుద్ధదేవునకు నంతేవాసి నౌదుంజుమీ.

అని ఉపాలి పలికెడి ప్రశంసావాక్యములను వినలేక నిగంఠనాతపుత్తుడు గమ్మున లేచిపోయెను.

## 3

## అభయరాజకుమార సూత్రము (వి. పూ. 430)

★ భగవంతుడు బుద్ధుడు ఒకప్పుడు రాజగృహమున వేణువన కలందక నివాసములో విహారము చేయుచుండెను. అట్టి తరుణమున అభయరాజకుమారుడు నిగంఠనాతపుత్తుని (నిర్గ్రంథజ్ఞాతృపుత్రుని) వద్దకు వెళ్ళి నమస్కరించి యొకచోట కూర్చొనెను. ఆతని గాంచి జైనాచార్యు డిట్లనియె.

''రాజకుమారా! శ్రమణగౌతమునితో నీవు శాస్త్రార్థవాదమునకు పూనుకొన గలవా? ఏవిధముగనైన సఫలుడవైనచో నీ కీర్తిని దిక్కులు మోయ లేవు. సుప్రసిద్ధుడగు శ్రమణగౌతమునకు ప్రతిపక్షియై అభయుడు నిలిచినాడను కీర్తియైనను చాలదా? పోపొమ్ము.''

''స్వామీ! పోయినంతనె ఫలమేమి? వాదమును తేపుటకు మొదటి అని, యెట్లు?''

''రాజకుమారా! నీ కొక కీలకము చెప్పెదను. ఆ పద్ధతిలో నడువుము. వినుము. గౌతముని వద్దకు వెళ్ళి యిట్లనుము. 'స్వామీ! తాము యితరులకు యింపితముగాని మాటలను పలుకుచుందురే?'' యని అనుము. 'అవును' అని అతడనెనా వెంటనె అందుకొని ''స్వామీ! అటులయిన మీకును సామాన్య మానవులకును యిక తేడా యేమున్నది?'' అని ఉద్ఘాటించుము. ఒకవేళ 'నేనట్లు పలుకుట లేద'ని అత డనినచో 'స్వామీ! దేవదత్తుని మీ రెన్నియో విధముల నిందించుచుందురు.' అతడు నరకగామియని చక్కపఱుప వీలుకాని వాడని ముందు ముందుగనె తిట్టుచుందురుగదా? అని పలుకుము. ఎటు మసలను వీలు లేక యీ గండకత్తెరలో గౌతముడు చిక్కక పోడు. ఈ ఉపాయము రామబాణము పోపొమ్ము.''

వల్లెయని గురుని వీడ్కొని అభయరాజకుమారుడు భగవంతుని చెంతకు జని అభివాదనము చేసి కూర్చొనెను. వాదమును విసరుటకు తగిన అవకాశము

---

★ మ. ని. 5 – 1 – 8.

లభింపలేదు. రేపు గృహమునందే వివాదమును లేవదీయవచ్చునని నిశ్చయించి బుద్ధునితో ''దేవా! రేపటి దినము తాము నల్వురు శిష్యులతో గూడి నా యింట భోజనమును స్వీకరింప వలె'' నని ప్రార్థించెను. మౌనముననె తథాగతు డందులకు సమ్మతించెను.

ఆనాడు గడచినది. మఱునాడు వచ్చినది. యథాసమయమునకు భగవంతుడు బుద్ధుడు పాత్రచీవరములను ధరించి అభయరాజకుమారుని యింటికి జనుదెంచెను. యథావిధిగ భోజన సత్కారములు ముగిసి భగవంతుడు తిన్నగ కూర్చొని యున్నాడు. అభయు డిట్లనెను.

''దేవా! ఇతరులకు యింపు లేని మాటలను తాము పలుకుచుందురట గదా?''

''కుమారా! ఆ విషయమును నే నంతరూఢిగ జెప్పలేను. పలుక వచ్చును; పలుకక పోవచ్చును.''

''ఔరౌర! ఒక్క దెబ్బకే తోకలు దెగినవి.''

''రాజకుమారా! ఎందు కట్లనుచున్నావు?''

అని భగవంతు డడిగిన మొదటినుండి కథ నంతయు అభయుడు చెప్పి వెల్లడించెను. బుద్ధదేవు డంతయు నెమ్మదిగ నాలకించెను. ఆ సమయమున అభయరాజ కుమారుని ఒడిలో ఒక పసిబిడ్డడు ఉండినాడు. వానిని చూసి తథాగతు డిట్లనియె.

''ఈ శిశువు ప్రమాదముతోనో – అజ్ఞానముతోనో మట్టిపెళ్ళను లేదా కట్టెపుల్లను నోటిలో వేసికొనును. అప్పుడు నీ వేమి చేయుదువు?''

''స్వామీ! బైటికి వచ్చునట్లు లోడివేసెదను. కక్కి ఉక్కిరి బిక్కిరియైనను కూడ పోనివ్వను. బైటికి లోడియే తీరెదను.''

''అభయా! ఎందుకట్లు చేయుదువు?''

''దేవా! వానియందుండెడి మక్కువచేత.''

''రాజకుమారా! నా పనికూడ నట్టిదే. ఉపయోగము లేనివియు ఇతరులకు వేదన గల్గించునవియు నగు మాటలను తథాగతుడెన్నడును పలుకడు. పరుల నుబ్బించుటకై లేనిపోని ప్రసంగములలో పాల్గొనడు. నిష్కారణముగ యింపులేని

మాటలను బుద్ధు డాడడు. హితకరములును యింపితములును నగు ప్రసంగము లందె అతడు వర్తించును. ఆయనకు ప్రాణికోట్లయెడ అపారమైనదయ.''

''స్వామీ! ఆ ప్రశ్నల నీ ప్రశ్నల నేరుకొని మీ పై ప్రయోగించుటకు మహాపండితులు హేమాహేమీలు పల్వురు వచ్చుచుందురుగదా? ఆ రణగణధ్వనులను లీలా జాలముగ నూదివేయుచుందురే! ప్రభూ! ముందుగనే యీ ప్రశ్నకీ సమాధానమని అనువులు పెట్టుకొని యొండెదరా?''

''అభయా! ఒక్కటి అడిగెదను. జవాబిమ్ము. నీవు రథసంబంధమగు విషయమున పూర్ణజ్ఞానివిగదా! ఎవడైన వచ్చి ఫలానా అంగప్రత్యంగ మెట్లని యడిగిన తడుముకొనకుండా సమాధానమిత్తువుగదా? అది ఎట్లు?''

''భంతే! దాని విషయమున నాకు సమగ్రజ్ఞానము కలదు. కావున ఎప్పటి కప్పుడు ఆయాసంగతులు నిర్నిరోధముగ భాసించును.''

''అభయా! అట్లే తథాగతునకు ధర్మధాతువిషయమున కూలంకష పరిజ్ఞానము కలదు. ఎవ్వ డేవిషయము నడిగినను అప్పటికప్పుడవియన్నియు యెదుట భాసించుచుండును. కావున, ధార్మికవిషయ ప్రసంగములందు నేను మీన మేషము లంచపని లేదు.''

''మహాస్వామీ! అద్భుతము. ఆశ్చర్యము. బుద్ధుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును శరణుజొచ్చుచున్నాను. సంఘమును శరణుజొచ్చుచున్నాను. ఈనాటి నుండి నన్ను సాంజలి శరణాగత ఉపాసకునిగ అనుగ్రహించండి.''

అని అభయ రాజకుమారుడు సుగత దేవునకు మనవి జేసికొనెను.

## ౪

## శ్రామణ్యఫల సూత్రము (వి. పూ. 430)

[1] భగవంతుడు రాజగృహమునందు [2] జీవకకౌమారభృత్యుని ఆమ్రవనము లోన సార్ధద్వాదశ శతభిక్షు సంఘముతో కూడి విహరించుచుండెను.

---

(1) దీ. ని. 1 - 1 - 2.

(2) జీవకకౌమారభృత్యుడు దినమునకు రెండు మూడు తడవలు భగవంతుని దర్శనమునకు బోవువాడు. బుద్ధదేవుడు విహరించు వేణువన మతిదూరమున నున్నది. సమీపతరముగ నుండు నా ఆమ్రవనమున విహారమును నిర్మించి యిచ్చెదనని తలంచి జీవకుడట్లే చేసెను. అందు భగవంతునకు ప్రత్యేకముగ గంధకుటిని గూడ కట్టించెను.

ఆనాడు శరత్పూర్ణిమ. ఉపోసథ దినము. పిండారబోసిన పండు వెన్నెల. మగధరాజు [1] అజాతశత్రుడు తన ప్రాసాదోపరిభాగమునందు సుఖాసనాసీనుడై

(1) అజాతశత్రువు గర్భమునం దుండునపుడు రాణికి పతిరక్తమును త్రాగ వలెనని కోరిక బుట్టినది. రాజు భుజమునుకోసి గిన్నెకు నెత్తురుబట్టి త్రాపించెను. పుట్టెడివాడు రాజునకు శత్రువు కాగలడు; మారకుడు కాగలడని దైవజ్ఞులు పలికిరి. రాజపత్ని గర్భవిచ్ఛేదనమునకై పాటుపడెను గాని దైవికముగ నది కొనసాగలేదు. కుమారు డుదయించెను.

అజాతశత్రునకు దేవదత్తునితో చెలిమి యేర్పడినది. పదునాఱేండ్ల యీడున యువరాజయ్యెను. దేవదత్తుని దుర్మంత్రణతో తండ్రిని చంపుటకు యత్నించెను. తండ్రియగు బింబిసారుడు రాజ్యము నతనికి యిచ్చివేసెను. నీ జనకునిచే నీకు యేనా డెట్టి ముప్పు మూడునో యెవ్వ రెఱుగుదురని దేవదత్తుడు దుర్బోధ చేయుటచే తండ్రిని తాపసగృహమందు నిర్బంధించెను. బ్రహ్మాండముగ కమ్మరిపని జరుగు కర్మాగారమునందలి పొగనంతటిని చేర్చి నిలువజేసిపెట్టు గృహమును తాపసగృహమందురు. చేచేతుల ఆయుధమునుబట్టి తండ్రిని చంపుట బాగుండదని అతడా పని జేసెను. తల్లి తప్ప మరెవ్వరుకూడ చూచుటకు పోరాదు. ఆమె చాటు మాటున కొన్నాళ్ళు ఆహారము కొంపోయినది. రాజాజ్ఞ దానిని నిషేధించినది. కొన్నాళ్ళు పలుచని మధురాహారమును ఒంటికి రాచుకొని పోవుచుండినది. దానిని నాకికొని రాజు కాలము గడుపు వాడు. తల్లికూడ వెళ్ళుటకు వల్లగాదని నరేంద్రుని శాసనము. "నాథా! ఆనాడే గర్భచ్ఛేదనమునకు ఒప్పవైతివి. చేతులార మృత్యువును పెంచుకొంటివి. ఇది చివరిదర్శనము. తప్పులున్న క్షమించండి" అని గుండెలవియ గొల్లున వాపోయి రాణి వెనుకకు మరలిపోయినది.

ఆహారము లభింపకున్నను, రాజు స్రోతాపత్తి ఫలసంపన్నుడు. కావున నిమ్మళించుకొని యుండెను. "ఓరీ! కారాగారమునందు బద్ధుడైయున్న మా తండ్రి బింబిసారుని అరికాళ్ళను కత్తితో కచ్చులు కచ్చులుగ చీల్చి చంద్రనిప్పుల పొర్లించవలసినది" అని ఒక మంగలి వానికి ఫర్మానా, జైలునందు వృద్ధరాజు మరణించినాడను వార్తాపత్రము మంత్రులచేతి కందినది. అంతఃపురము నుండి అజాతశత్రునకు పుత్రుడు జన్మించినాడను ప్రియవార్తయు వచ్చినది. మంత్రులు తొలుత పుత్రజన్మోత్సవ పత్రికను రాజున కందించిరి. మహదానంద నిర్భరుడై అజాత శత్రుడు "నా జన్మదినమునకూడ నా తండ్రి యిట్లే సంతోషించి యుండునుగదా" యని తలంచి జైలునుండి జనకుని విడుదల చేయించుడని మంత్రుల కాజ్ఞ యొసంగెను. "మహారాజా! వారు చిరశాశ్వతముగ విడుదలయైనారు. ఇదియె కైకొనుడని మరణవార్తను చేతికిచ్చిరి. ప్రక్కనె కూర్చొనియున్న తల్లి యిట్లనియె. "కుమరా! నీవు పసివాడవై యున్నపుడు నీ చేతి వ్రేలికొక పుండు లేచినది. ఏడ్చుచున్న నిన్ను మే మందఱమును ఓదార్చలేకపోయితిమి. నీ జనకుడు నిన్ను సభలోనికి కొంపోయి తొడమీద కూర్చొనబెట్టికొని నీ వ్రేలిని తన నోటియందుంచుకొనెను. కొంతసేపటికి ఆ పుండు చిదిగినది. నీ మీదనుండు మితిలేని గారాబముతో నోటిలోనికి వచ్చిన చీము నెత్తురలను కూడ ఉమ్మివేయక నీ తండ్రి మ్రింగివేసినాడు." ఆ మాటలు విని అజాతశత్రుడు అపరిమిత వేదనను చెందెను.

సారిపుత్ర మౌద్గల్యాయనుల ప్రభావమున తన సంఘమంతయును తన్నెడబాసి పోయినంతట దేవదత్తుడు మనోవ్యాధికి పాల్పడి క్షయరోగగ్రస్తుడయ్యెను. తాను చేసిన పాపములను తలపోసి పశ్చాత్తప్తుడై యొకనాడు భగవంతుని బుద్ధుని సందర్శింప పయనమై జేతవనమును ప్రవేశింపకముందే ప్రాణముల గోల్పోయెను.

యుండి మంత్రులతో నిట్లనియె. ''ఆహా! ఈ రాత్రి యెంత రమణీయమైయున్నది. ఈ తరుణమున మహానుభావుడగు నొక శ్రమణబ్రాహ్మణనితోడి పొత్తు లభించినచో నా చిత్తమునకు గలుగు సంతోష మింతింతనరానిది. అట్టివారు ప్రస్తుత మీ రాజ గృహమున నెవరైన నున్నారా?''

ఇట్లు అజాతశత్రు డాడినమాట నాలించి మంత్రు లొక్కొక్కరు తమ రుచికి అనుకూలముగ పూర్ణకాశ్యపుని – మస్కరీగోశాలుని – అజితకేశకంబలుని – ప్రకృధ కాత్యాయనుని – నిర్గ్రంథజ్ఞాతృపుత్రుని – సంజలవేలట్ఠి పుత్రుని ప్రశంసించి చెప్పుచు వచ్చిరి. చివరకు జీవకకౌమారభృత్యుడు లేచి ''మహారాజా! భగవంతుడు – అర్హతుడు – సమ్యక్ సంబుద్ధుడు మన ఆమ్రవనమునందు విహారము చేయుచున్నాడు. అతని కీర్తి దిగంతవిశ్రాంతము. వారిని దర్శించుట మంచిది. మీరుత్తమ శాంతిని పొంద గలరు.'' అని విన్నవించెను.

''జీవకా! ప్రయాణమునకు హస్తిదళములను సన్నద్ధము చేయింపుము.''

''దేవా! చిత్తము.''

ఏ నూర్వురు కాంతలు యే నూరేనుగుల నెక్కి తన్ను పరివేష్టించి యుండ, పరిజనములు దీవిటీలు పట్టి త్రోవజూపింప, జీవకకౌమారభృత్యునితో గూడి ఆరోహ ణీయమను గజము నారోహించి అతుల రాజవైభవముతో అజాతశత్రుడు ఆమ్రవన మును సమీపించెను. [1] ఒడలు గగుర్పొడిచినది. గంభీరనీరవమైన ఆ ప్రదేశమున భయము తట్టినది. ''జీవకా! ఈ చోటికి నన్నెందుకు తోడి తెచ్చితివి? శత్రువశము చేయుటకై వంచించి కొని రాలేదుగదా? పదిరెండునూర్ల యేబది మంది భిక్షుసంఘ మున్న చోటని యంటివి. అందున్నచో దగ్గుట – తుమ్ముటయైన లేకపోవునా? మానిసి పొలకువె కానరాలేదే?''

మహారాజా! జడియకుము. నిన్ను శత్రువుల చేతికి చిక్కించునంతటి ద్రోహిని నేను గాదు. అదిగో! దీపము మినుకు మినుకు మనుచున్నది గదా! అదియె భగవంతు డుండుచోటు. సమీపించినాము. పద.''

---

(1) అ. క. రాజగృహ పురమునకు మహాద్వారములు ముప్పదిరెండును, చిన్న ద్వారములు అరువదినాల్గును కలవు. జీవకుని ఆమ్రవనము గృధ్రకూటపర్వత మధ్యమందు న్నది. తూర్పు ద్వారమునుండి వారు బయలుదేరిరి. ఆ సమయమునకు చంద్రుడు పర్వతశిఖరముయొక్క చాటుకు పోయియుండుటచే చీకటి యేర్పడినది.

అందఱును ఏనుగులను దిగిరి. లోనికి బోయిరి. శిష్యమండలి మధ్యమున నడిమికంబమున కెదుట తూరుపు మొగమై భగవానుడు విరాజిల్లుచున్నాడు. ఆ ప్రదేశమునందలి స్తిమిత ప్రశాంతత అజాతశత్రుని హృదయము నువ్వెత్తుగ నాకర్షించి నది. ''ఆహా! ఈ దృశ్యమెంత ప్రసన్నముగ నున్నది. నా కుమారుడగు [1] ఉదాయి భద్రుని జీవితము కూడ యిట్లె శాంతిపూర్ణముగ విలసిల్లుగాక'' అనుమాట అవశ ముగ రాజేంద్రుని నోటినుండి బయటపడినది.

తదనంతరము మగధనాథు డజాతశత్రుడు బుద్ధభగవంతుని చెంతకు బోయి భక్తిభావమున నమస్కరించి, ''దేవా! దేవరవారి యనుజ్ఞ యైనచో నేదేని యడుగ దలంచి యున్నా'' ననెను.

''మహారాజా! నిస్సందేహముగ నడుగవచ్చును.''

''స్వామీ! ప్రపంచమునందు వివిధములగు కర్మలయందు ప్రవర్తించుచు జీవనములను గడుపువారిని చూచుచున్నాము. రథములను తోలి, గుఱ్ఱములను తోలి, యేనుగుల నడిపించి యుద్ధములను జేసి ఆయా వృత్తులద్వారా సుఖభోగ ముల ననుభవించుచున్నారు. చాకలియై మంగలియై కమ్మరియై కుమ్మరియై యేదో ఒక లాభములను సంపాదించి జీవనయాత్రను ప్రమోదముగ సాగించుచున్నారు. వారి కుటుంబములను పోషించుకొనుచున్నారు. యథాశక్తి దానధర్మములు చేసి పుణ్యలోకములను కూడ ఆర్జించుచున్నారు. ఇట్టి పనిపాటలవలన ప్రజాలోకము ప్రత్యక్షఫలమును ప్రాపించుచున్నది. భగవంతా! ప్రపంచమును విసర్జించి విరక్తశీలు డైన శ్రమణునకు ప్రత్యక్షఫలము యేమి సిద్ధించుచున్నది?''

''మహారాజా! ఈ విషయమును గూర్చి యింతకు ముందు నీ వెవ్వరినైన ప్రశ్నించి యుంటివా?''

''భగవంతా! ఒకప్పుడు నేను పూర్ణకాశ్యపుని యిట్లే ప్రశ్నించితిని. ఆయన యీ విధమున చెప్పెను. 'చేయుచు చేయించుచు, నఱకుచు నఱికించుచు, దొంగతన

---

(1) అ. క. ఈ రాజవంశమున పితృహత్య అయిదు తరములవఱకు నడచినది. బింబి సారుని అజాతశత్రుడు చంపెను. అజాతశత్రుని ఉదయుడు, ఉదయుని మహాముండుడు, వానిని అనురుద్ధుడు, అనురుద్ధుని నాగదాసుడును చంపిరి. ఇట్లు కుమారులచేతనే తండ్రులు వధింప బడిరి. పితృహంతకుడు, వంశచ్ఛేదకుడునని నాగదాసును వాని రాజ్యమునందలి ప్రజలే చంపి వేసిరి.

మును పరస్త్రీగమనమును జేయుచు అసత్యమాడుచు వెయ్యేల! సమస్త ప్రపంచమును కాల్చి బూడిద చేసియు పాపమును లేదు. పాపము వచ్చుటయును లేదు. మంచి యనునదంతయు జేసినను పుణ్యమును లేదు. పుణ్యము వచ్చుటయును లేదు.' అని ఆతడు అక్రియావాదమును చెప్పెను. పప్పు అడిగితిని. ఉప్పు పెట్టెను.

మరి యొకప్పుడు సాంధృష్టిక శ్రామణ్యఫలమును గూర్చి మస్కరీ గోశాలుని యిప్పుడు మీ వలెనే యడిగితిని. ఆతం డిట్లనెను. 'ప్రాణుల సుఖదుఃఖములకు బంధమోక్షములకు హేతువు లేదు. ప్రయత్నమునకు చోటులేదు. ఎవ్వరికైనగాని యోనులన్నింటను జన్మించినగాని మోక్షము లేదు. అపై సహజముగనె లభించును. స్వప్రయత్నమును లేదు. పరుల తోడ్పాటును లేదు. ప్రాణులన్నియు సంయోగము నకు నియతికి ఆధీనములు.' అని ప్రత్యుత్తరమిచ్చెను. నేను శ్రామణ్య ప్రత్యక్షఫలము నడిగితిని. ఆయన సంసారశుద్ధివాదమును చెప్పెను. అడిగన దొకటి, చెప్పినది మఱి యొకటి.

మరి యొకప్పుడు అజితకేశకంబలుని ప్రశ్నించితిని. ఆయన యిట్లనినాడు. 'దానము లేదు; యజ్ఞము లేదు; దానిఫలములును లేవు. ఇహములేదు; పరము లేదు; మంచిచెడ్డల పరిపాకములును లేవు. మనుష్యుడు నాల్గు మహాభూతములతో పుట్టును. వాడు చచ్చినంతట పృథివీజల అగ్నివాయువులు దేనియందవి కలిసిపోవును. ఇంద్రియములు ఆకాశమున లీనమగును. పీనుగును కాల్చినంతట మరి మిగిలి యేమియు లేదు. ఆస్తికవాదము ఉళ్ళకి. పండితుడును మూర్ఖుడును సమముగనె చచ్చుచున్నారు. అని ఉచ్ఛేదవాదమును నాకు చెప్పెను. వీపుపై తన్నిన మూతిపండ్లు రాలెనన్నట్లు ప్రశ్నయొకటి, జవాబింకొకటి.

వేఱొకప్పుడు ప్రకృధ కాత్యాయనునితో ప్రశ్నించితిని. ఆతండిట్లనియె. 'భూమి, జలము, అగ్ని, వాయువు, సుఖము, దుఃఖమునను యీ యేడు పదార్థ ములును నిత్యములు. వీటినెవ్వడును పుట్టించలేదు. చంపువాడు చంపించువాడు నను వ్యవహారమంతయు మూర్ఖజల్పనము. ఎవ్వని తలనైన ఛేదించినచో ఆ శస్త్రధార యీ యేడింటిలో దేనిని కూడ తాకనుగాని భంగము చేయనుగాని వీలు లేదు' అని యేమేమో నుడివెను. నే నడిగినది శ్రామణ్యఫలము; ఆయన చెప్పినది అన్యోన్య వాదము.

ఇంకొకప్పుడు నిర్గ్రంథజ్ఞాతృపుత్రుని కలిసికొని యీ విషయమునె పృచ్ఛించితిని. ఆయన యిట్లు పలికెను. నిర్గ్రంధునకు యెట్టి పాపప్రతిబంధమును లేదు. సమస్తపాపముల నున్మూలించుటకై అతడు యత్నించును. పాపావరణముల నుండి అతడు విముక్తుడు' అని చాతుర్యామ సంవరమును గూర్చి ముచ్చటించెను. ప్రశ్న యెక్కడ? జవా బెక్కడ? తీర్థమునకు తీర్థము. ప్రసాదమునకు ప్రసాదము.

మఱియొకప్పుడు శ్రమణునకు ప్రత్యక్షఫలమేదియని సంజయవేలట్ఠిపుత్రు నడిగితిని. ఆయన యిట్లు చెప్పెను. 'అదియు కాదు. ఇదియుకాదు. రెండును కాదు. రెండును కాదనుటయుకాదు. పరలోక మున్నదనికాని లేదనికాని, కర్మఫలములు సిద్ధించుననికాని, సిద్ధించవని కాని, తథాగతునకు జన్మములున్నవనికాని లేవనికాని నేను చెప్పను.' అని సంజయుడు విక్షేపవాదమును చెప్పెను. భగవంతా! పూర్వోక్తులగు ఆర్గురు తీర్థంకరుల సమాధానములు నాకు శాంతిని కల్గించ లేదు; తృప్తిని చేకూర్చలేదు. పెద్దవారి మాటను తిరస్కరించరాదని ఊరూరకనె తల యూపితిని. ఇక తామే సెలవియ్యండి.''

''మహారాజా! నేనొక ప్రశ్న నడుగుదును. మొదట నీవు దానికి సమాధానమిమ్ము. నీ వద్ద ననేకులు సేవకులు గలరు. వారు నీ కనుసన్నల మెలగుచు కఠోర పరిశ్రమల నొనర్చువారు. వారిని నీవు ఆ యా విధముల తృప్తి నొందింతువు. అందొక సేవకుడు విరక్తి చెంది 'ఈ పరతంత్రత – ఈ పరిశ్రమ నా కేల?'నని విసర్జించి సాధువై ఏకాంతమున సంయమజీవనమును గడపుచున్నచో వానిని నీవు తిరిగి సేవావృత్తికై నిర్బంధించెదవా?''

''భగవంతా! మీదుమిక్కిలి అట్టివానిని ఆదరింతును; సత్కరింతును. అంతే కాని తిరిగి దాస్యవృత్తికి రమ్మని బలాత్కారము చేయను.''

''మహారాజా! అదికూడ శ్రమణభావము పూనుటయొక్క ప్రత్యక్షఫలమని నీవైన సమ్మతింతువు. పరతంత్రుడగు సామాన్యమానవుని మాటయె అట్లుండ, స్వతంత్రుడు సంపన్నుడునగు జనుడు సమస్తమును వర్జించి కోరికోరి యతిధర్మమును వరించినచో అట్టివాడు లోకపూజ్యుడౌననుటలో సందియమెందులకు? ఇదంతయు సామాన్య ప్రయోజనము. ఇంతకుమించి విశేషప్రయోజనమును కూడ త్యాగశీలుడగు పురుషుడు పొందగల్గుచున్నాడు. సావధానుడవై వినుము.

లోకవాసనలను నిర్జించి యింద్రియవృత్తులను పిడికిటబట్టి పూర్ణజ్ఞానమును పూర్ణసత్యమును స్వాయత్తము చేసికొనిన సంబుద్ధజ్ఞానుల – శ్రమణబ్రాహ్మణుల

దర్శనముచే సాంసారిక మనుష్యులకు సర్వోత్తమమగు లాభము చేకూఱుచున్నది. అట్టివారికి క్లేశబంధములందు తగుల్కొనియుండుట బొత్తుగ రుచింపదు. స్వేచ్ఛా విహారము చేయు పక్షిని జూచి పంజరమున చిక్కొనియున్న పక్షి, తానుగూడ ఉప్పర వీధి కెగసి ఉల్లాసపడుటకు ఊహలు సాచినట్లు ముక్తపురుషుల దర్శనముచేత వికల సంసారజీవులు ముముక్షువులగుచున్నారు. ఆ ఆదర్శమునకు తమ జీవితమును ఎగద్రోసి ఏకాంతవాసులై ఆత్మసంయములై కామనాదూరులై వారు పామరజనము లకు యెడమెడముగ మెలగుచుందురు. మరియు వారు కనుచు వినుచు తినుచు త్రాగుచు చనుచు మనుచు యెల్ల వేళలయందును పరమశాంతిని పరమసుఖమును ప్రాపించి పరమోన్నతమగు పారమార్థిక శిఖరమందు ప్రతిష్ఠితులై యున్నారు. రోగ గ్రస్తుడు ఆరోగ్యమునుబొంది ఆనందించినట్లు, కారాగారబద్ధుడు విముక్తిని బొంది సంతోషించినట్లు, ఎండకు నడగొన్నవాడు కల్పవృక్షమును, దాహమునకు తపించిన వాడు అమృతమును, నిఱుపేద పెన్నిధిని పొంది అపూర్వసమ్మోదమున కర్హులైనట్లు, ప్రశాంతజీవితమును బడసి భిక్షువులు సంచరించుచున్నారు. మహారాజా! శ్రమణత్వ మునకు నిదియొక ప్రత్యక్షలాభము.

మహీపాలా! మరియు వినుము. పైన మేఘము కురిసినను కురియకున్నను జీవనది నిత్యనిరంతరము ఆ దరి యీ దరి నొరసి ప్రవహించునట్లు నిర్వాణ నిలయు డగు భిక్షువు అవిచ్ఛిన్న ఆనందప్రవాహము అంతరంగమున వెలితిలేక పొంగిపొరలి ప్రవహించుచుండ బాహ్యప్రకృతినుండి సుఖములు లభించినను లభించకున్నను సమ భావమున ఏకరసుడై వర్తించుచున్నాడు. రాజా! శ్రమణజీవనము నకు యిదియొక ప్రత్యక్షఫలము.

రాజచంద్రా! గమనాగమనములందు ఆలోకన విలోకనములందు ఆకుంచన ప్రసారణములందు ఆహారనిద్రలయందు పాత్రచీవరధారణమందు, వెయ్యేల సర్వకాల సర్వావస్థలయందును సంప్రజన్యయుక్తుడై - యెఱుకతో గూడినవాడై శీలస్కంధము, యింద్రియ సంవరము, స్మృతిసంప్రజన్యమును తన్నాశ్రయింప అడవి యందో కొండగుహలలో నో చెట్టుచాటుననో గడ్డివాములక్రిందనో శ్మశానవాటికనో కాలక్షేపము జేయుచు లోభమును జయించి, ద్రోహమునకు స్వస్తిజెప్పి, చిత్తాలస్యము తోడి పొత్తుడిగి ఔద్ధత్యమును సాగనంపి విచికిత్సకు దండము పెట్టి కుశలధర్మములు సర్వోసర్వము తనవైయుండ అది యిది యనక ఆర్యశీలుడు తాను తానై విహరించు చుండును. మహారాజా! భిక్షువునకు యిది ప్రత్యక్షఫలముగాదా?

వెండియును నిర్వాణపథము నధిష్ఠించి భిక్షువు వివేకజన్యమును, వితర్క విచారసహితమును, ప్రీతిసుఖరూపమునగు ప్రథమధ్యానమును బొంది విహరించు చున్నాడు. ఆ ప్రీతిసుఖము వాని శరీరమునంతటిని ముంచి తేల్చుచున్నది. భూపాలా! ఇదిగూడ సాందృష్టిక శ్రామణ్యఫలమే.

అట్లే ద్వితీయ ధ్యానము, తృతీయధ్యానమును చతుర్థ ధ్యానమును పొంది మనోమయ శరీరమూలమున ననేక కాయములను సృష్టించుచున్నాడు. ఆవిర్భావ తిరోభావములందు నేర్పరియై బ్రహ్మలోకపర్యంతము వశము చేసికొని మెలగుచు న్నాడు. అద్దమునందు ముఖమునువలె పరుల చిత్తములను స్పష్టముగ గ్రహించు చున్నాడు. గతించిన పూర్వజన్మములను దివ్యనేత్రమున చూడగల్గుచున్నాడు. ప్రాణికోటులు చేయు పాపపుణ్యములను జన్మమరణములను తెలిసికొనగలుగుచు న్నాడు. మహారాజా! ఇది శ్రామణ్య ప్రత్యక్ష ఫలముగాదా?''

అని యిట్లు పలు తెఱంగుల మహానుభావుడు బుద్ధదేవుడానతిచ్చిన వాక్యము లను విని ఆశ్చర్యపులకితశరీరుడై అజాతశత్రుడు చేతులు మొగిడ్చి ''దేవా! పడిన వానిని లేవదీసినట్లు, చీకటిని జిక్కినవానికి వెలుగుజూపించినట్లు వివిధపర్యాయముల ధర్మము నెఱుగజెప్పితిరి. బుద్ధుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును శరణు జొచ్చుచున్నాను. సంఘమును శరణుజొచ్చుచున్నాను. నన్ను అంజలిబద్ధ శరణాగత ఉపాసకునిగ గ్రహింపుడు. భగవంతా! తుచ్ఛమగు రాజ్యలోభమున ధర్మమూర్తియగు తండ్రినిచంపి భీభత్సమగు పాతకమును జేసితిని. ఈ వజ్రపాపిని దాపునకు చేర్చుకొని కృతార్థునిగి జేయరే'' అని సవినయముగ ప్రార్థించెను.

అంతట బుద్ధదేవు డిట్లనియె. ''రాజా! వాస్తవముగ కడుంగడు ఘోరపాపము చేసితివి. అయినను పశ్చాత్తాపమున నిప్పుడు వగచుచున్నావు. గడచినదానికి ప్రతీకారము జేయుటయు, భవిష్యత్తున పాపమును చేయకుండుటయు ఆర్యవినయ పద్ధతి. మంచిది. పోయిరమ్ము.''

ఇట్లు సెలవంది అజాతశత్రుడు తన నగరికి పోయెను. భిక్షుసంఘమును జూచి భగవంతు డిట్లనియె. ''భిక్షువులారా! ఈ రాజు హతభాగ్యుడు. అసహ్యమగు పితృహత్యాదోష మితనికి అంటకున్నచో యిప్పుడీ ఆసనమందే విమలధర్మచక్షు జ్ఞానమును పొందియుండెడివాడు.''

ఊ

# ఏతదగ్రవర్గము (వి. పూ. 429)

★ భగవంతుడు బుద్ధుడు నలభైమూడవ వర్షావాసమునందు శ్రావస్తీ జేతవన విహారమున విహరించుచు నొకనాడు భిక్షువులతో నిట్లనియె. ఓ భిక్షువులారా!

1. నా అనురక్తి నెఱింగిన వారిలో అజ్ఞాతకౌండిన్యుడు అగ్రుడు. (శేష్ఠుడు)
2. మహాప్రాజ్ఞులయందు సారిపుత్రుడు అగ్రుడు.
3. బుద్ధిమంతులయందు మహామౌద్గల్యాయనుడు అగ్రుడు.
4. అవధూతలయందు మహాకాశ్యపుడు,
5. దివ్యచక్షువు గలవారియందు అనురుద్ధుడు,
6. ఉచ్చకులీనులయందు కాలిగోధాపుత్రుడు భద్దియుడు,
7. కోమలస్వరమున బోధించుటయందు లకుంటకభద్దియుడు,
8. సింహనాదులయందు పిండోలభారద్వాజుడు,
9. ధర్మకథకులందు పూర్ణమైత్రాయిణీపుత్రుడు,
10. సంక్షేపముగ చెప్పిన దానిని వివరించుటయందు మహాకాత్యాయనుడు,
11. మనోమయ కాయ నిర్మాణమునను, చిత్తవివర్తమునందును చుల్లపంథకుడు,

---

★ అం. ని. 1. 2. 1. 7.

1. శాక్యదేశమున కపిలవస్తు నగరసమీపమున ద్రోణవస్తు గ్రామమున బ్రాహ్మణ కులమున పుట్టుక
2. మగధదేశమందు రాజగృహప్రాంతమున ఉపతిష్య = నాలకగ్రామమునందు ( ప్రస్తుతము పాట్నాజిల్లాయందలి సారీచక గ్రామమున) బ్రాహ్మణకులమందు జన్మము.
3. మగధదేశమునందు రాజగృహసమీపమున కోలితగ్రామమున బ్రాహ్మణకులమున జన్మము.
4. మగధదేశమందు మహాతీర్థ బ్రాహ్మణగ్రామమున బ్రాహ్మణకులమున జననము.
5. శాక్యదేశమునందు కపిలవస్తునగరమున భగవంతుని పినతండ్రియగు అమృతౌదన శాక్యునకు పుత్రుడై క్షత్రియకులమున జన్మము.
6. శాక్యదేశమునందు కపిలవస్తునగరమున క్షత్రియకులమునందు.
7. కోసలదేశమున శ్రావస్తీనగరమందు మహాభోగకులములో.
8. మగధదేశమునందు రాజగృహమున క్షత్రియకులములో.
9. శాక్యదేశమున కపిలవస్తు సమీపమున ద్రోణవస్తుగ్రామమునందు బ్రాహ్మణకులములో.
10. అవంతీదేశమునందు ఉజ్జయినీపురములో బ్రాహ్మణకులమున జన్మము.
11. మగధదేశమందు రాజగృహములో శ్రేష్ఠికన్యాపుత్రుడు.

12. సంజ్ఞావివర్తచతురులయందు మహాపంథకుడు,
13. అరణ్య విహారులయందు, దక్షిణేయులయందు సుభూతి,
14. ఆరణ్యకులందు రేవతఖదిరవినయుడు.
15. ధ్యానులయందు కంఖా రేవతుడు,
16. ఆరబ్ధవీర్యులయందు (ప్రయత్నపరులయందు) స్వర్ణకోటివింశుడు,
17. సువక్తలయందు స్వర్ణకోటికర్ణుడు,
18. లాభవంతులయందు సీవలి,
19. శ్రద్ధావంతులలో వక్కలి,
20. శిక్షావిధేయులందు రాహులుడు,
21. శ్రద్ధతో ప్రవ్రజించినవారియందు రాష్ట్రపాలుడు,
22. ప్రథమ శలాకాగ్రాహకులందు (అగ్రేసరులందు) కుండధానుడు,
23. కవులయందు వంగీసుడు,
24. సమంత ప్రాసాదికులందు ఉపసేన వంగంతపుత్రుడు,
25. గృహప్రబంధకులందు ద్రవ్యమల్ల పుత్రుడు,
26. దేవతా ప్రియులయందు పిలిందవాత్స్యుడు,
27. ప్రఖరబుద్ధులయందువాహియదారు చీరియుడు,

---

12. మగధదేశమున రాజగృహములో శ్రేష్ఠికన్యాపుత్రుడు.
13. కోసలదేశమందు శ్రావస్తీనగరములో వైశ్యకులమున జన్మము.
14. మగధదేశమందు నాలకబ్రాహ్మణగ్రామములో జన్మము .(సారిపుత్రునితమ్ముడు)
15. కోసలదేశమందు శ్రావస్తిలో మహాభోగ కులమున.
16. అంగదేశమున చంపానగరమందు శ్రేష్ఠికులములో.
17. అవంతీదేశమున కురరఘరములో వైశ్యకులమందు.
18. శాక్యదేశమందు కుండియా గ్రామములో క్షత్రియకులమందు.
19. కోసలదేశమందు శ్రావస్తీపురిలోన బ్రాహ్మణకులమున.
20. శాక్యదేశమున కపిలవస్తునందు క్షత్రియకులములో.
21. కురుదేశమున స్థూలకోష్ఠిత గ్రామమందు వైశ్యకులములో.
22. కోసలదేశమందు శ్రావస్తీనగరములో బ్రాహ్మణకులమున.
23. కోసలదేశమందు శ్రావస్తీనగరములో బ్రాహ్మణకులమున.
24. మగధదేశమున నాలకబ్రాహ్మణ గ్రామములో బ్రాహ్మణకులమందు.
25. మల్లదేశమునందు అనూపియా నగరమున క్షత్రియకులమందు.
26. కోసలము – శ్రావస్తి – బ్రాహ్మణకులము.
27. వాహియరాష్ట్రము( ప్రస్తుతము కపూరథలా రాజ్యము, హోశియార్‌పూర్) కులపుత్రుడు

28. విచిత్రవక్తలందు కుమారకాశ్యపుడు,
29. ప్రతిసంవిత్ ప్రాప్తులయందు మహాకోష్ఠితుడు,
30. బహుశ్రుతులయందు స్థితిమంతులందు గతిమంతులందు శుశ్రూషకులందు ఆనందుడు,
31. మహాసంఘవంతులందు ఉరువేలకాశ్యపుడు,
32. కులప్రసాదకులందు కాల ఉదాయి,
33. రోగహీనులందు వక్కలుడు,
34. పూర్వజన్మ స్మృతిమంతులయందు శోభితుడు,
35. వినయధరులయందు ఉపాలి,
36. భిక్షుణీసంఘమునకు ఉపదేశించుటయందు నందకుడు,
37. జితేంద్రియులందు నందుడు,
38. భిక్షుసంఘోపదేశకులందు మహాకప్పినుడు,
39. తేజధాతుకుశలులందు స్వాగతుడు,
40. ప్రతిభాశాలురయందు రాధుడు,
41. రాక్షస చీవరధారులందు మోఘరాజు,

భిక్షువులారా!

42. నా అనురక్తి నెఱింగిన భిక్షుణీశ్రావికలలో మహాప్రజాపతీగౌతమి శ్రేష్ఠురాలు,
43. మహాప్రజ్ఞావంతులలో ఖేమా, (క్షేమాదేవి)

---

28. మగధము – రాజగృహము.
29. కోసలము – శ్రావస్తి – బ్రాహ్మణకులము.
30. శాక్య – కపిలవస్తు – క్షత్రియకులము – అమృతౌదన పుత్రుడు.
31. కురుదేశము – వారాణసీ నగరము – బ్రాహ్మణకులము.
32. శాక్య – కపిలవస్తు – అమాత్య గృహమందు.
33. వత్సదేశము – కౌశాంబి – వైశ్యకులము.
34. కోసలము – శ్రావస్తి – బ్రాహ్మణకులము.
35. శాక్యదేశము – కపిలవస్తు – మంగలికులము.
36. కోసలము – శ్రావస్తి – కులగృహము.
37. శాక్య – కపిలవస్తు – క్షత్రియకులము. (మహాప్రజాపతీ పుత్రుడు)
38. సీమాంతదేశము – కుక్కుటవతీ నగరము – రాజవంశము.
39. కోసలము – శ్రావస్తి – బ్రాహ్మణకులము.
40. మగధము – రాజగృహము – బ్రాహ్మణకులము.
41. కోసలము – శ్రావస్తి – బ్రాహ్మణకులము. (బావరి శిష్యుడు)
42. శాక్య – కపిలవస్తు – శుద్ధోదనుని భార్య – క్షత్రియకులము.
43. మద్రదేశమున స్యాలకోటయందు జన్మము, మగధరాజగు బింబిసారుని భార్య.

44. బుద్ధిమతులలో ఉత్పలవర్ణ,
45. వినయధరులలో పటాచార,
46. ధర్మకధికులలో ధర్మదిన్న,
47. ధ్యానపరలలో నంద,
48. ఆరబ్ధవీర్యలలో స్వర్ణ,
49. ప్రఖరబుద్ధియుతలలో భద్రాకుండలకేశ,
50. పూర్వజన్మ స్మృతియుతలలో భద్రకాపిలాయని,
51. మహాభిజ్ఞలలో భద్రాకాత్యాయని,
52. రుక్ష చీవర ధారిణులయందు కృశాగౌతమి,
53. శ్రద్ధాయుక్తలయందు శృగాలమాత,

భిక్షువులారా! నా ఉపాసక శ్రావకులందు-

54 – 55. ప్రప్రథమ శరణాగతులు తపస్సు - భల్లుకులు,
56. దాతలలో అనాధపిండక సుదత్తగృహపతి శ్రేష్ఠుడు,
57. ధర్మకథకులలో మచ్ఛికాషండవాసియగు చిత్రగృహపతి,
58. సంగ్రహవస్తువులు నాల్గింటిచే సంఘమును కూర్చినవారిలో హస్తక ఆవలకుడు శ్రేష్ఠుడు,
59. ఉత్తమ దాతలలో మహానామ శాక్యుడు,
60. ప్రియదాతలలో ఉగ్రగృహపతి,

44. కోసలము – శ్రావస్తి –
45. కోసలము – శ్రావస్తి –
46. మగధము – రాజగృహము – విశాఖశ్రేష్ఠి భార్య.
47. శాక్య – కపిలవస్తు – మహాప్రజాపతీ గౌతమియొక్క పుత్రిక.
48. కోసలము – శ్రావస్తి – కులగృహము.
49. మగధము – రాజగృహము – శ్రేష్ఠికులము.
50. మద్రదేశము – స్యాలకోటనగరము – మహాకాశ్యపుని భార్య – బ్రాహ్మణకులము.
51. శాక్య – కపిలవస్తు – రాహులమాత . (దేవదహవాసి సుప్రబుద్ధుని కొమార్తె)
52. కోసలము – శ్రావస్తి – వైశ్యకులము.
53. మగధము – రాజగృహము – శ్రేష్ఠికులము.
54 – 55. అసితంజన నగరమందు కుటుంబికగృహమున జన్మము.
56. కోసలదేశము – శ్రావస్తీనగరము – సుమనశ్రేష్ఠి పుత్రుడు.
57. మగధదేశము – మచ్ఛికాసండ నగరము – శ్రేష్ఠికులము.
58. పాంచాలదేశము – ఆలవీ (అర్వలము, ఫరూఖాబాద్ జిల్లా) – రాజకుమారుడు.
59. శాక్యదేశము కపిలవస్తు – (అనురుద్ధుని అన్న) క్షత్రియుడు.
60. వజ్జిదేశము – వైశాలి – శ్రేష్ఠికులము.

61. సంఘసేవకులలో ఉగ్రగృహపతి,
62. అత్యంత ప్రసన్నులలో శూరఅంబష్ఠుడు,
63. పుద్గల ప్రసన్నులలో జీవకకౌమారభృత్యుడు,
64. విశ్వాసకులలో నకులపితాగృహపతి శ్రేష్ఠుడు,

ఓ భిక్షువులారా! ఉపాసికా శ్రావికలందు–

65. ప్రప్రథమ శరణాగతి పొందినవారిలో సేనానీదుహిత సుజాత శ్రేష్ఠురాలు,
66. దాతృత్వమునందు విశాఖమృగారమాత,
67. బహుశ్రుతత్వమునందు కుబ్జఉత్తర,
68. మైత్రీవిహార ప్రాప్తియందు సామావతి,
69. ధ్యానపరాయణలందు ఉత్తరానందమాత,
70. ఉత్తమదాతలయందు కోలియ దుహిత సుప్రవాస,
71. రోగి శుశ్రూషికలందు సుప్రియ,
72. అత్యంత ప్రసన్నులయందు కాత్యాయని,
73. విశ్వాసికలందు నకులమాతా గృహపత్ని,
74. అనుశ్రవ ప్రసన్నులయందు కురరఘరమందలి కాలీఉపాసిక,

వీరలు శ్రేష్ఠులు

---

61. వజ్జిదేశము – హస్తిగ్రామము – శ్రేష్ఠికులము.
62. కోసలము – శ్రావస్తి – శ్రేష్ఠి కులము.
63. మగధ దేశము – రాజగృహము – అభయరాజకుమారునకు సాలవతీ గణికయందు పుట్టినవాడు.
64. భర్గదేశమున – సుంసుమారగిరి – శ్రేష్ఠికులము.
65. మగధ దేశము – ఉరువేలా సేనానీగ్రామము – సేనానీ పుత్రి
66. కోసలము – శ్రావస్తి – వైశ్య.
67. వత్సదేశము – కౌశాంబి – ఘోషకశ్రేష్ఠి యింటి దాదిబిడ్డ.
68. భద్రవతీ రాష్ట్రము – భద్రికా నగరము – భద్రపతికశ్రేష్ఠి పుత్రి, (తర్వాత) వత్సదేశ – కౌశాంబీనగర – ఘోషితశ్రేష్ఠి ధర్మపుత్రి – వత్సరాజగు ఉదయనుని భార్య.
69. మగధ దేశము – రాజగృహము – సుమనశ్రేష్ఠికి అధీనుడగు పూర్ణసింహుని పుత్రి.
70. శాక్య – కుండియ – సీనలిమాత – క్షత్రియకులము.
71. కాశీదేశము – వారాణసీ – వైశ్యకులము.
72. అవంతి – కురరఘరము – వైశ్యకులము – స్వర్ణకోటికర్ణుని మాత.
73. భర్గదేశము – సుంసుమారగిరి – నకులపితా గృహపతి భార్య.
74. మగధ దేశము – రాజగృహమున పుట్టుక. అవంతి కురరఘరమున పెండ్లి.

## ౬

## ధర్మచైత్య సూత్రము (వి. పూ. 428)

[1] భగవంతుడు బుద్ధుడు శాక్యదేశమునందు మేతలుంపమను పేరుగల నిగమ (పెద్దగ్రామ) మున విహారము చేయుచుండెను.

[2] కోసలరాజు ప్రసేనజితుడు యేదో పనిమీద నగరక మనుపురమునకు వచ్చియుండి సుగతదేవుని దర్శింప కోరిక పొడమి తన సేనాధిపతియగు ధీర్ఘ కారాయణునితో యిట్లనియె.

---

(1) మ. ని. 2, 2, 9.

(2) ధమ్మపదము, అ. క. (4 – 3) శ్రావస్తి మహాకోసల రాజపుత్రుడు ప్రసేనజితుడు, వైశాలి లిచ్ఛవీకుమారుడు మహాలి, కుసీనారముయొక్క మల్లరాజపుత్రుడు బంధులుడు, ఈ ముప్వురు రాజకుమారులును కలిసి తక్షశిలయందు దిశాప్రమోఖ్యుడను ఆచార్యునివద్ద విద్యాభ్యాసము చేసిరి. శీఘ్రముననె వివిధశిల్పములం దుత్తీర్ణులై తమ తమ నగరములకు వచ్చిరి. ప్రసేనజితుడు తాను నేర్చిన విద్యను తనతండ్రియెదుట ప్రదర్శించి అతని మన్నన గాంచి రాజ్యాభిషేకమును బొందెను. మహాలీకుమారుడు లిచ్ఛవీగణమునకు తన విద్యను చూపునప్పుడు అత్యధిక ఉత్సాహావేశమున కన్నులను కోల్పోయి గ్రుడ్డివాడయ్యెను. అది కాంచి ప్రజాతంత్రపాలకులగు లిచ్ఛవీరాజు లతనిని కరుణించి సాదరముగ సత్కరించి యేటయేట లక్షధనము రాబడిగల జాగీరును బహుమతించిరి. అంధుడై కూడ అతడును యేనూర్వురు రాజకుమారులను విద్యాభ్యాసము చేయించుచుండెను.

మూడవ వాడగు బంధులుడు తన మల్లరాజకులమున తానేర్చిన విద్యను ప్రదర్శింప యేర్పాటు చేయబడెను. ఇనుపకమ్మీలను లోపలజొనిపిన వెదురుకట్టెలను అరవై అరవై యింటిని ఒక్కొక్కకట్ట గట్టి అట్టి కట్టలను అరువదింటిని వరుసగ నిలువబెట్టి కత్తితో నఱకుమని ప్రేక్షకసమితివారు బంధులునకు ఆజ్ఞయిచ్చిరి. వెదురులకు లోపల యినుపకమ్మీ లున్నవనుట బంధులునకు తెలియదు. ధణం ధణయని వరుసపెట్టి నఱకుకొనివచ్చు సమయమున చిట్టచివరి కలాపమును త్రెంచునపుడు లోని అయశ్శలాకలు ఖణఖణ యని శబ్దమిచ్చినవి. అది యేమని అడిగి బంధులుడు ఉన్నవిషయ మెఱింగి రుష్టుడై కత్తి నెడముగ విసరిపాఱవైచి "ఛీ! ఛీ! ఇందఱును నావారై కూడ ఒక్కనికేని నా యెడ ప్రేమ లేకపోయినది. లోహశలాకలు లోనున్నవని ఒక్కడైనను ముందుగ చెప్పకబోయెను గదా! వీరి మొగమును చూడరాదు" ని ఆ చోటు విడిచి సహాధ్యాయియు – పరమ మిత్రుడగు ప్రసేనజితుని వద్దకు వచ్చెను. కోసలేంద్రుడును బంధులునకు స్వాగతమొసగి సేనాపతి పదమున ప్రతిష్ఠితుని జేసెను.

బుద్ధుని యందుగల భక్తివిశేషములచే ప్రసేనజిత్తు శాక్యకులముతో సంబంధముచేయ కుతూహలించి తన కొక కన్యనిమ్మని శాక్యరాజులకు చెప్పి పంపెను. శాక్యులు విపరీతమగు

''కారాయణా! భగవంతుడు బుద్ధుడు యిప్పుడెందున్నాడో?''

''మహారాజా! శాక్యులకు చెందిన మేతలుంపగ్రామమున విహరించుచున్నారట.''

''సౌమ్యా! అది యిచ్చటి కెంతదూరము?''

''మహారాజా! మూడు యోజనములు మాత్రము. సాయంకాలమునకు చేరవచ్చును.''

''సేనాపతీ! అట్లైన ప్రయాణసన్నాహము చేయుము.''

---

కులాభిమానము కలవారు. అందఱును ఒకచోట ప్రోవైరి. ''ప్రసేనజిత్తు వర్ణశుద్ధియందు మనకంటె చిన్న. బలపౌరుషములందు మనకు మిన్న. కాదని కన్యనివ్వక నిరాకరించినచో బలవంతముగనైన పట్టు నెగ్గించుకోగల సమర్థుడు. ఇపుడు మన కర్తవ్యమేమి?'' అని వితర్కించిరి. మహానామశాక్యునకు దాసియందు కలిగిన మిగుల సుందరియగు నొక కన్యగలదు. దానిపేరు వాసభక్షత్రియ. రహస్యము చిట్లకుండా మహానాముని కూతురని చెప్పి ఆ కన్యను యిచ్చెదమని వర్తమాన మంపిరి. ''శాక్యులు మోసగాండ్రు. ఆ కన్యక తన తండ్రి పొత్తున భుజించునా? లేదా? అనుటను గమనించి కులగోత్రముల విచారించి నిశ్చితార్థము చేసిరండ''ని కోసలనరపతి తనమంత్రులను బంపెను. అక్కడ మహానామశాక్యుడును అవసరమునుబట్టి ఆ వడుచును అలంకరించి, వచ్చిన కోసలేంద్రుని మంత్రులు చూచునట్లు పొత్తున భోజనము చేయుచున్న పగిది విడంబించెను. శుభముహూర్తమున వివాహమైనది. కోసలరాజునకు వాసభక్షత్రియ పట్టపురాణి యైనది. కొన్నాళ్ళకొక పుత్రుడు కలిగెను. విదుర్థభుడని వానికి పేరుపెట్టిరి.

సేనాపతియగు బంధులుని భార్య మల్లికాదేవి చిరకాలమునకు గర్భవతియైనది. వైశాలీ నగరమందలి రాజపుష్కరిణిలో స్నానమాడవలెనని ఆమెకు దోహదము (వేవిలి) కలిగినది. మహాపరాక్రమియగు బంధుల సేనాధిపతి భార్యను రథమున గూర్చుండ బెట్టుకొని వైశాలికరిగి పుష్కరిణి చుట్టును కావలియుండు రక్షకభటులను చెల్లాచెదరుజేసి అడ్డముగనున్న యినుపవలను తెగనఱకి ఆ అభిషేక సరస్సునందు పత్నితోగూడి స్నానము జేసెను. లిచ్ఛవీరాజులు మూకలు మూకలై యెదుర్కొనిరి. గాని తెరకు దేర అసువుల గోల్పోయిరి. ఇట్లు నన్య సాధ్యమగు కార్య మొనర్చి తిరిగి బంధులుడు సతీసహితముగ తన పురమునకు మరలి వచ్చెను.

పదంపడి అతనికి మీదమీద పదునార్వురు పుత్రులు గలిగిరి. ధర్మపక్షపాతియై బహుముఖముల బంధులుడు ప్రజారంజకుడయ్యెను. అతని గొప్పతనమును ఓర్వలేని మంత్రులు కొందఱు రాజుతో చాడీలుచెప్పి పొరపు గల్గించిరి. రాజేంద్రు డామాటలను విశ్వసించి యేదోవ్యాజమున పుత్రసహితముగ బంధులుని అరణ్యమునకు పంపించి దుండగీండ్రచే చంపించెను.

కొన్నాళ్ళకు నిజము బయటపడినది. భూపాలుడు మిగుల వాపోయి చేయునది లేక బంధులుని మేనల్లుడగు దీర్ఘకారాయణుని సేనానాథునిగ చేసికొనెను. మామను చంపినాడను

చిత్తమని దీర్ఘకారాయణుడు వివిధ యానములను సిద్ధపఱచెను. మహారాజా ప్రసేనజితుడు తనకు యోగ్యమగు వాహనముపై నెక్కి పరిచరసంఘములు తోడ బలిసిరాగా భగవంతుడు విహరించు మేతలుంపా గ్రామమును ప్రవేశించెను. దవ్వులనె వాహనమును దిగి చేతిఖడ్గమును, తలపాగాను కారాయడణుని చేతికిచ్చి కాలినడకతో ఆరామములోనికి జొచ్చెను. కారాయణుందే నిలువబడెను.

---

వైరమును మదిలో పెట్టుకొని సమయము చిక్కించుకొనుటకు కారాయణుడు వేచియుండినాడు. బంధులుని భార్యయగు మల్లిక నిలువ నీడలేక పుట్టినిల్లు జేరినది.

నిరపరాధియగు బంధులుని చంపించి చిత్తమున కూరటలేక ప్రసేనజిత్తుడుండినాడు. కొడుకగు విదుర్ధభుడు పదునాఱేండ్ల యీడువాడై మాతామహులను, మాతులురను చూచివచ్చుటకై కపిలవస్తువునకు బయలుదేరెను. కుమారుడు వచ్చుచున్నాడనియు తగినసత్కారము లేకపోయినచో మీదట ముప్పు తప్పదనియు వాసభక్షత్రియ మహానామ శాక్యునకు గూఢముగ కబురంపినది. శాక్యులును సంస్థాగారమున సమావేశమై కోసల రాజకుమారుని విదుర్ధభుని చక్కగ సన్మానించిరి. అతండును అందఱకును నమస్కరించి, తనకు నమస్కరించువా రెవ్వరు లేకపోవుటకు కారణమేమని శాక్యుల నడిగెను. చిఱుతవారందఱును వేటకై పోయినారని వారు విదుర్ధభునకు సమాధానమిచ్చిరి. ఆమోదప్రమోదముల తాతగారియింట కొన్నాళ్లు వసించి వెండియు కోసలమునకు విడూడభుడు పయనమయ్యెను. ఊరివెలుపటకు పోయినారు. పరిచరులలో నొకడు దేనినో మఱచియుండుటవలన వెనుకకు పురములోనికి తిరిగి వచ్చెను. సంస్థాగారము వద్ద ఒక దాసి విడూడభుడు కూర్చొనిన పీఠమును పాలతో కడుగుచు 'దాసీ పుత్రుడు విడూడభుని పీఠమ'నుచు నిందావాక్యము లాడుచుండెను. ఆ సేవకుడా మాటలను వినిపోయి తన యజమాని కెఱిగించెను. విదుర్ధభుడు గ్రుడ్డై మండి 'వారాపీటను పాలతో కడిగించినారు. కాలము కలిసివచ్చి నేనే రాజునైనచో అదేపీఠమును క్షుద్రులగు శాక్యుల రక్తముతో కడిగింతు' నని శపథము జేసెను.

తన భార్యయగు వాసభక్షత్రియ దాసీపుత్రియని కొన్నాళ్ళకు ప్రసేనజితునకు తెలిసినది. అత డీసడించికొని భార్యను, కుమారుని గౌరవదూరులుగజేసి భృత్యోచితస్థానమున నుంచెను. ఒకప్పుడు బుద్ధదేవుడు రాజభవనమునకు వచ్చి రాజుచే సత్కృతుడై విషయమంతయును విని యిట్లనియె. ''మహారాజా! నిజమునకు శాక్యులు అక్రమమొనర్చినారు. అయినను వాసభక్షత్రియకు తండ్రి పరిశుద్ధరాజవంశమువాడు. తండ్రిగోత్రమే ప్రశస్తముగదా! విడూడభుడు కూడ క్షత్రియబీజోత్పన్నుడు. వారిని సన్మానదూరులుగ చేయుట తగదు. యథాపూర్వముగ నాదరింపుమ'' ని హితము నుపదేశించి చనెను.

బుద్ధదేవుని దర్శించి కకావికలయిన చిత్తమునకు ప్రశాంతత చేకూర్చుకొందునని తలంచి ప్రసేనజితుడు భగవంతుడు నిరూపించుచున్న శాక్యగ్రామమునకు బయలుదేరెను. తనతోడ మహాసేనతోగూడి దీర్ఘకారాయణకు (సేనానాయకు) డున్నాడు. ఆరామమునకు వెలుపలనె సైన్యమును విడిపించి రాజలాంఛనములగు గొడుగు, ఖడ్గము, తలపాగా, పాదుకలను కారాయణుని వశముజేసి ఒంటరిగ భగవంతుడుండు గంధకుటీరములోనికి ప్రవేశించెను.

ఆరు బైట హాయిగ విహరించు మహానుభావుడగు బుద్ధభగవంతుని సన్నిధానమునకు జేరబోయి దీర్ఘదండనమస్కారము లర్పించి ఆ పవిత్ర కోమలచరణములను అల్లనల్లన తాకుచు, మెల్లమెల్లన తడవుచు, అలవోక ముద్దు పెట్టుకొనుచు, మెత్తమెత్తగ పిసుకుచు అపారభక్తిప్రేమలతో ముగ్ధముగ్ధుడై మునిగి తేలుచున్న కోసలేశ్వరుని జూచి గురుదేవు డిట్లనియె.

---

తటిని వేచియున్న కారాయణుడు రాజబిరుదములను పదిలముజేసికొని రాజాకొలికు ఒకగుఱ్ఱమును, భటునిమాత్ర మందుంచి సమస్తపరివారముతో శ్రావస్తిని జేరుకొనెను. అచ్చట విదుర్ధభునకు పట్టముగట్టి రాజపదవి నతని కప్పగించెను. ప్రసేనజిత్తుడు బుద్ధగురునివలన సెలవంది బయటవచ్చి భార్యవలన యావద్వృత్తాంతమును విని, తన మేనల్లుడగు అజాతశత్రుని సహాయముతో విడూడభుని పట్టి నిర్బంధించవలెనని తలంచి రాజగృహమునకు ప్రయాణమయ్యెను. సాయంకాలమై పురద్వారములు మూయబడియుండుటచే భార్యతోగూడి యొక సత్రమునందు రాత్రి నివసించెను. విరేచనము లధికముగ తగుల్కొనుటచే తెల్లవారుసరికి ఆ ధర్మశాలయందే మరణించెను. అజాతశత్రు డావార్తవిని మిగుల దుఃఖించి మామకు తగినట్లు అంత్యక్రియల నడపెను.

ప్రభుత్వము చేతి కబ్బినంతనె విడూడభుడు శాక్యరాజులపై దండెత్తెను. ఒకనాడు ఉభయరాజ్యములయొక్క పొలిమేరగట్టునందు తనసేనల విడిపించి తాను తన పొలములోనుండి నొక చెట్టుక్రింద విశ్రమించెను. బుద్ధభగవంతుడు ఆ ప్రక్కనే శాక్యభూమియందొక చెట్టుక్రింద కూర్చొనియున్నాడు. విడూడభు డాయనను చూచి సమీపించి నమస్కరించి ''స్వామీ! మీరు యీ వృక్షముక్రింద, యీ పాడనీడలో కూర్చొనుట యెందుకు? అదిగో! నేనున్న వృక్షము క్రిందికి రండు. అది దట్టమైన నీడగలది'' అని విన్నవించెను. ''రాజా! యెట్లున్నను బంధువుల పంచన చల్లగనే ఉండును.'' అని బుద్ధుని సమాధానము. ఆ మాటలోని అభిప్రాయము గ్రహించి విడూడభుడు శ్రావస్తికి వెనుకకు మరలిపోయెను. మరియొకసారికూడ యిట్లే నడిచినది. మూడవ పర్యాయముకూడ బుద్ధుడు అడ్డుదగిలెను. నాల్గవతూరి దండెత్తినపుడు భగవంతుడు అడ్డుపడలేదు.

విడూడభునకును శాక్యులకును ఘోరసంగ్రామము నడచుచున్నది. ''తాతయగు మహానాముని దాపున చేరినవారిని, గడ్డి నోటకఱచుకొన్నవారిని, వీపునిచ్చి పరిగెత్తువారిని, శరణన్నవారిని దప్ప శాక్యపురుషు లోకమున లేకుండ శాక్యజాతి నాఱులేకుండ సర్వనాశము జేయుడు'' ని సేనలకు విదుర్ధభుని ఆజ్ఞ. శాక్యరాజుల రక్తముతో పీఠమును కడిగించి ప్రతిజ్ఞను సఫలముజేసి సేనలతో తనపురమునకు మరలివచ్చుచు దారియందు అచిరవతీ నదీతీరమున నొకనాటిరాత్రి శిబిరములు వేయించి విడిసెను. పైనెందో అకాలమేఘములు అపారముగ వర్షించుటచే అచిరవతీనది అపరిమితమగు వెల్లువలతో పొంగిపొరలి విడూడభుని, అతని సేనలను డేరాలతోకూడా అమాంతము సముద్రగర్భమునకు చేర్చివేసెను.

''మహారాజా! అత్యంత ప్రేమవివశుడవై ఈ శరీరమును యింతలింతలుగ యెందుకు గౌరవించుచున్నావు? దీనియందంతటి గొప్పతన మేమి జూచితివి?''

''భగవంతా! తాము సమ్యక్ సంబుద్ధులరు; తమ ధర్మము స్వాఖ్యాతము; తమ సంఘము సుప్రతిష్ఠితము. బాపురే! స్వయముగ మూర్తీభవించిన ధర్మదేవత తాము. లోకములో పదియేండ్లు, యిరవైయేండ్లు, ముప్పైయేండ్లు, ఒకానొక పరిమిత కాలమువఱకు బ్రహ్మచర్యపాలన మొనర్చు శ్రమణబ్రాహ్మణుల పలువురను జూచుచుందును. కాని యింత నికాలతుగ యింత నికరముగ అఖండబ్రహ్మచర్య పాలనమునకై నడుముగట్టుట, మహాప్రభూ! మీ సంఘమున దప్ప యెందును పొడ గానను, మీరు సమ్యక్ సంబుద్ధులరు. మీ ధర్మము శోభనఖ్యాతము. మీ సంఘము సుందర ప్రతిష్ఠితము.

మరియును, భంతే! క్షత్రియ క్షత్రియులలో, బ్రాహ్మణ బ్రాహ్మణులలో, గృహపతి వైశ్యులలో, భార్యాభర్తలలో, తండ్రి కొడుకులలో, తల్లిబిడ్డలలో, అన్నదమ్ములలో, అక్కచెల్లెండ్రలో, యిరుగుపొరుగున, యింటింట కలహములు కల్లోలములు, గలభాలు గందరగోళములు లేనిచోటు లేదు. ఇంతటి ఐకమత్యము, యింతటి కలుపుగోలుతనము, యింతటి నీతియు నిబ్బరము, యింతటి ఒకటే కట్టుబాటు, దేవా! తమ భిక్షుసంఘమున తప్ప లోకమున గాలించినను కానరాదు. మీరు సమ్యక్ సంబుద్ధులరు. మీ ధర్మము శోభనఖ్యాతము. మీ సంఘము సుప్రతిష్ఠితము.

తథాగతా! ఆరామములందు, అడవులయందు, ఉద్యానములందు ఉపవన ములందు కృశులను కర్కశులను దుర్వర్ణులను దీనహీన సదనులను దిగంబరులను దృష్టిభీకరులను ఆయాయెడల నెందఱినో శ్రమణబ్రాహ్మణుల జూచుచుం దును. హృష్టపుష్టాంగులు ఉదారస్వభావులు ప్రశాంతచిత్తులు పరమకల్యాణ మూర్తులు, గురునాథా! మీ శ్రావకసంఘమున దప్ప మఱెందును యిట్టివారిని నే నెఱుగను. మీరు సమ్యక్ సంబుద్ధులరు; మీ ధర్మము శోభనఖ్యాతము; మీ సంఘము సుప్రతి ష్ఠము.

సర్వజ్ఞమూర్తీ! నేను రాజాధిరాజును. మూర్ధాభిషిక్తుడను. ఆగ్రహింప నను గ్రహింప సమర్థుడను. అయినను రాజకీయరంగములలో, సభాగృహములలో నా సమక్షమున నే పరిజనులును సభికులును అడ్డదిడ్డము మాట్లాడుచుందురు. మాట ముగిసినంతకు మఱొక్కరు మాటాడవద్దని శాసించినను వారి హడావుడివారు

వదలరు. ఔరా! ఎంతటి సువ్యస్థత? ఎంతటి సుప్రబంధత? యెంతటి నియమబద్ధత? యింతటి మహాపరిషత్తులో దగ్గనురాదు; తుమ్మనురాదు. మహాస్వామీ! ఈ కట్టడి మీ శిష్యసంఘమునదప్ప విశ్వవసుంధరయందు యెందును అగోచరము. ఈ విద్యకు మంత్రమేది? యంత్రమేది? కత్తిలేదు, కటారులేదు. కుమ్ముట లేదు, తిమ్ముట లేదు. సొగసు సొగసు. తాము సమ్యక్ సంబుద్ధులరు. తమ ధర్మము శోభనఖ్యాతము. తమ సంఘము సుప్రతిష్ఠితము.

షడభిజ్ఞా! తలదాటిన మేధావులు, కొమ్ములుతిరిగిన పండితులు, వెంట్రుకలకు పొరలుదీయు సమర్థులు క్షత్రియులు బ్రాహ్మణులు వైశ్యులు పలువురు ప్రబలశాస్త్రార్థవాదముతో శ్రమణగౌతముని ఢీకొందుమని వచ్చుచుందురు. సమీపించినంతనె ఉడుకును ఉల్లాసమును చప్పున చల్లారి ఏర్చిపెట్టుకొన్న పాతాళ ప్రశ్నలను తామె మఱచిపోయి తికమకలై ఆ హేమాహేమీలు ఆ ఘటాఘటీలు మొగమింత చేసికొని వచ్చినదారి పోవుచుందురు. దేశికచంద్రా! ఆ అలోకసామాన్య ప్రభావమునకు తామొక్కరె నిదర్శనము. మీరు సమ్యక్ సంబుద్ధులరు. మీ ధర్మము స్వాఖ్యాతము. మీ సంఘము సుప్రతిష్ఠము.

సమంతభద్రా! దేవమానవ పూజ్యుడవగు నీ చరణ సరసిజముల మఱుగుజేరి ప్రవ్రజ్యను - ఉపసంపదను - ధర్మచక్షువును - అనుత్తర బ్రహ్మచర్యఫలమును, అలమార్యజ్ఞానదర్శనమును బొంది ఆర్యశ్రావకులు అయ్యో! యిన్నాళ్ళు శ్రమణత్వము పొందకనే శ్రమణులమని కాఱులు ప్రేలితిమి. బ్రాహ్మణత్వము పొందనిదే బ్రాహ్మణులమని ప్రగల్భము లాడితిమి. అర్హతులముకాకనె అర్హతులమని దంభములు పల్కితిమి. ఈనాడు గదా మేము శ్రమణులము; బ్రాహ్మణులము; అర్హతులము' అని ఉప్పొంగిపోవువారు. మహాత్మా! తాము సమ్యక్ సంబుద్ధులరు. తమ ధర్మము స్వాఖ్యాతము. తమ సంఘము సుప్రతిష్ఠము.

పురుషపుంగవా! ఋషిదత్తుడు పురాణుడను యిద్దరును నాకు మావటీంద్రు. వారికి జీతము బత్తెము అన్నము వస్త్రము యిచ్చి పోషించువాడను నేను. కాని వారు మీ యెడ జూపు గౌరవమును నాకడ జూపరు. ప్రసంగములో మీ పేరు వచ్చినచో లేచి నిలుచుండి మీరున్నదిక్కుకు మళ్ళి చేతులెత్తి నమస్కరించెదరు. మీరున్న దిక్కు వైపు పాదములు పెట్టి పరుండరు. వహవ్వా! స్వామీ! మీరు సమ్యక్ సంబుద్ధులరు. మీ ధర్మము స్వాఖ్యాతము. మీ సంఘము సుప్రతిష్ఠము.

శాక్యముని సార్వభౌమా! దేవరవారు క్షత్రియులు; నేనును క్షత్రియుడను. కోసల గోత్రజులు తాము. నేనును అంతె. మీ యీడు యెనభైయేండ్లు. దరిదాపు నాకును అంతే. స్వామినాథా! ప్రేమించుటకు పూజించుటకు ఆదరించుటకు గౌర వించుటకు యింతకు మించిన పాత్రము, యింతకు మిక్కిలి చోటు, యింతకు మీఱిన భాగ్యము నా కెక్కడ లభింపగలదు? రాజులము బహుకార్య లంపటులము. సెలవిండు. పోయివత్తును.

''మహారాజా! మంచిది.''

కోసలాధీశ్వరుడు ప్రసేనజితుడు ప్రదక్షిణముచేసి యథేచ్ఛ [1] బోయెను. అంతట భగవంతుడు భిక్షువుల నామంత్రించి యిట్లనియె.

''ఓ భిక్షువులారా! ప్రసేనజితుడు పలికిన ధర్మచైత్యములను వింటిరిగదా? మీరు వాటిని లెస్సగ తలంచుడు; భావించుడు; స్మరించుడు; ధరించుడు. ఆ ధర్మచైత్యములు సార్థకమైనవి. శుద్ధబ్రహ్మ చర్యమును ప్రదీప్తము జేయునవి.''

బుద్ధదేవుని మాటలను విని భిక్షువులు సంతుష్టులైరి.

## సామగ్రామ సూత్రము (వి. పూ. 428)

[2] భగవంతుడు బుద్ధుడు శాక్య దేశమునందలి సామగ్రామమున విహరించు చుండెను. దాదాపు ఆలోగానే జైనతీర్థంకర మహావీరుడగు [3] నిగంఠనాత పుత్తుడు పావానగరమందు మరణించియుండెను. గురువు మృతుండైనంతనె నిగంఠజైనసాధు వులు రెండు చీలికలై పరస్పర నిందాలాపములతో 'నీవు మిథ్యావాదివి. నీకీధర్మవిన

(1) అ. క. ప్రసేనజితుడు భార్యతోకూడి రాజగృహపురమునకు బోవుచు దారి పొడవున ఆయా అన్నము దిని ఆయా నీరుద్రావి సుకుమారుడౌటచే జీర్ణించుకొనలేక పోయెను. రాజగృహపురమున ద్వారములు మూసియుండుటచే నగరబాహ్యమున నొక ధర్మశాలయందు రాత్రికి వసించెను. కాని విరేచనము లధికముగ కలిగి నీరసుడై తెల్లవారుసరికి భార్య ఒడిలో మరణించెను. అజాతశత్రుడు మామకు అంత్యక్రియలు జరిపి విడూడభునిపై దండయాత్రకు సన్నద్ధుడయ్యెను. కాని మంత్రులు మిగుల ప్రాధేయపడి నివారించిరి.

(2) మ. ని. 3 - 1 - 4.

(3) అ. క. నాలందావాసియగు నాతపుత్తుడు ఉపాలి గృహపతి చేసిన బుద్ధప్రశంసను విని మనోవ్యాధికి గుఱియైనంత నతని పావాకు చేర్చిరి. అత డందే గతించెను.

యము తెలియదు. అయోగ్యముగ నిట్లు పలికితివి. ముందు చెప్పదగినది వెనుక చెప్పితి' వని వివదించుకొనుచు కలహించుకొనుచు భండనములు చేయుచుండిరి. వారి గృహస్థశిష్యులు కూడ ప్రతిష్ఠను శాంతిని నిర్వాణమును పొందింపలేని ఆభాస ధర్మమును పట్టుకొని వ్రేలాడుచు వృథాయాస వివశులై యుండురి.

అట్టి సమయమున [1] చుందశ్రమణోద్దేశుడు పావాయందు వర్షావాసముచేసి సామగ్రామమునకు వచ్చి ఆయుష్మంతుడగు ఆనందుని కలిసికొని అభివాదన మొనర్చి జైనాచార్యుడగు నిర్గ్రంథజ్ఞాతృపుత్రుడు దేహము వీడుటయు, తదనంతరము వారి శిష్యసంఘ మవ్యవస్థమై అవకతవకలుగ నుండుటయును తెలియజేసెను.

ఆ పలుకు లాలించి ఆయుష్మంతుడు ఆనందుడు, చుందశ్రమణోద్దేశుని వెంటగొని భగవంతునికడ కరిగి నమస్కరించి యిట్లనియె.

''భంతే! నిగంఠనాతపుత్తుడు యీ లోపలనె మరణించియున్నాడు. అతని శిష్యసంఘము ముక్కలు చెక్కలై కలహకల్లోలములకు గుఱియైనది. దేవా! జన హితము లోకకల్యాణములకై నెలకొనిన మన భిక్షుసంఘమునందు భగవంతుని యనంతర మట్టి ఉపద్రవము ఘటిల్లకుండుగాక.''

''ఆనందా! నేను సాక్షాత్కారమును బొందిన ధర్మములనుపదేశించితిని. స్మృతి ప్రస్థానములను, సమ్యక్ ప్రధానములను, ఋద్ధిపాదములను, పంచేంద్రియములను, పంచబలములను, బోధ్యంగములను, అష్టాంగిక మార్గమును బోధించితిని. ఇందు సందేహబీజము లంకురింప నవకాశము గలదా?''

''భగవంతా! తమ ధర్మమునందు మతభేదము లేదు. కాని భగవానులవారి ఉత్తరకాలమున సంఘమునందు జీవనవృత్తిని, నియమవిధిని గూర్చి వివాదము లావిర్భవించునేమో? అదిమాత్రము లోకకంటకముగాదా?''

''ఆనందా! జీవనవృత్తివిషయమున ప్రాతిమోక్ష విషయమున కలుగు వివాదము అపేక్షాకృత తుచ్ఛము. కాని ధర్మవిషయమున కలుగు వివాదమె మరింతచేటైనది. వివాదములకు మూలములారు. భిక్షువు తామసుడు, పాషండుడగుట; రోషియు దురాగ్రహియునగుట; ఈర్ష్యామత్సరములు కలవాడగుట; శఠుడు మాయావి యగుట;దుర్జయుడు, మిథ్యాదృష్టి యగుట; దృష్టి పరామర్శి,

(1) అ. క. ఇతడు సారిపుత్రుని తమ్ముడు, ఉపసంపదనుబొంది 'భిక్షుచుంద శ్రమణోద్దేశు'డని పిలువబడెను.

ఆధీనగ్రాహి యగుట; ఈ ఆఱుకారణములచే భిక్షువు గురుని, ధర్మమును, సంఘ మును, నియమమును నిరాదరించుచున్నాడు. ఆనందా! వివాద మూలములైన వీటిని తుదముట్టింప యత్నించుచుండవలెను.

వివాద - అధికరణము, అనువాద అధికరణము, ఆపత్తి అధికరణము. కృత్యాధికరణమని అధికరణములు నాలుగు. వీటిని ఉపశమింపజేయు అధికరణశమ థములు యేడు. వీటిచే ఆయా అధికరణములు (జగడములు) శాంతిచగలవు. 1. సమ్ముఖవినయ మొసగుట 2. స్మృతివినయ మొసగుట 3. అమూఢవినయ మొసగుట 4. ప్రతిజ్ఞాతకరణము 5. యద్భూయసికము 6. తత్పాపీయసకము 7. తృణవిస్తారకము.

ఆసన్నుడైనవానికి యెదుట చెప్పుట సమ్ముఖవినయము. సూచన నిచ్చుట స్మృతివినయము. పదింబది చెప్పుట అమూఢవినయము. భవిష్యత్తునందు సావధానత కొఱకై ప్రతిజ్ఞ చేయించుట ప్రతిజ్ఞాతకరణము. పలువుర గుంపుచేసి చెప్పుట యద్భూయసికము. మఱింత దోషమని బెదరించి బోధించుట తత్పాపీయసకము. దోషమును మాటుచేసి మన్నింపుడని సంఘమునకు నివేదింపజేయుట తృణవిస్తార కము.

ఆనందా! సంఘసామరస్యమునకు ఉపకరించునవియు, ఉత్తమములైనవియు నగు సారాణీయధర్మముల నాఱింటిని వినుము. 1. భిక్షువు సబ్రహ్మచారులయెడ మైత్రీభావయుక్తమగు కాయిక కర్మమున వర్తించుట 2. మైత్రీభావయుక్తమగు వాచిక కర్మమున వర్తించుట 3. మైత్రీభావయుక్తమగు మానసిక కర్మమున వర్తించుట 4. ధర్మమున లభించు యేకొంచెమైనను పంచి తినుట 5. సమాధికి సహకరించు శ్రామణ్య శీలముల నొప్పుట 6. దుఃఖక్షయము నాపాదించు, నిర్వాణమునకు దారిదీయు ఆర్యసిద్ధాంతములకు అనుకూలుడై విహరించుట. ఓ ఆయుష్మంతా! ఆనందా! ఉత్తమములగు నివి యాఱును సారాణీయ ధర్మములు.''

భగవంతుని ప్రియాలాపములకు ఆనందుడు మిగుల సంతుష్టుడయ్యెను.

## ౮

## సంగీతిపర్యాయ సూత్రము

[1]అదియొక సమయము. భగవంతుడు బుద్ధుడు యేనూర్వురు భిక్షుసంఘ ముతోగూడి మల్ల దేశమునందు [2] పావానగరమున చుందకర్మారపుత్రుని ఆమ్రవన ములో విహారము చేయుచుండెను.

(1) దీ. ని. 8 - 10 - 2. (2) పావాపురము (పస - ఉచము, గోరఖ్‌పూర్ జిల్లా.)

ఆ నగరమున ప్రజాతంత్ర పరిషద్ భవన మొకటి అత్యంతశోభాయమానముగ అప్పుడప్పుడె క్రొత్తగ నిర్మింపబడినది. తొలుతొలుతనె అందు బుద్ధభగవంతుని ప్రవే శింపజేసి ఆ సంస్థాగారముయొక్క ప్రారంభోత్సవమును మిగుల శుభసంపన్న మొనర్ప వలెనని పావావాసులగు మల్లురకు కోరిక పొడమినది. బుద్ధదేవుని అంగీకారము కూడ వచ్చినది. సభాభవనము నయనాభిరామముగ అలంకరింప బడినది.

పాత్రచీవరములనుగొని మహాభిక్షుసంఘము తన వెంటవెంట వచ్చుచుండ మహానుభావుడు తథాగతుడు సంస్థాగారమును ప్రవేశించి మధ్యయందుండు స్తంభము నానుకొని తూరుపుమొగమై కూర్చొనెను. భిక్షుసంఘముకూడ తూరుపు గోడనానుకొని భగవంతున కెదురెదురుగ పడమటి మొగమై కూర్చొనిరి. పావా పౌరులు మల్లురుకూడ బుద్ధుని పరివేష్టించి ఉచితస్థలమున నుపవిష్టులైరి. ఆ రాత్రి యందు మరింత ప్రొద్దుపోవువఱకు సుగతదేవుని ధార్మికకథా సల్లాపముల నానంద ముగ నాకర్ణించి తదుపరి నమస్కరించి సెలవంది మల్లురు తమతమ మనికి పట్టులకు పోయిరి.

ధార్మికకథా శ్రవణమందు దత్తచిత్తులై ప్రశాంతగంభీరముననుండు భిక్షుసంఘము నవలోకించి గౌతమబుద్ధుడు ప్రసన్న హృదయమున సారిపుత్రుని పిలిచి యిట్లనియె. "సారిపుత్రా! అలత - ఆయాసము. విసుగు - వేసట లేక భిక్షువులు ఉత్సాహముగ నున్నారు. మరింతసేపు ధర్మములను బోధింపుము. ★ నాకు వీపులు మూపులు పోట్లెగిరినవి. ఒక్కింతతడవు విశ్రమించెదను."

"దేవా! ఆజ్ఞ" అని సారిపుత్రు డొడంబడెను. భగవంతుడు పై దుప్పటి పఱచుకొని కుడి రెట్టవైపు నేలకు ఆని స్మృతిసంప్రజన్యములతో గూడి ఉత్థానసంజ్ఞను మనస్సునందు చేర్చి సింహశయ్యపై పరుండెను. ఇంచుమించు అప్పుడప్పుడే నిర్గ్రం థజ్ఞాతృపుత్రుడు పావానగరములో మరణించియుండెను. గురువు గతించుడు శిష్యు లగు జైనసాధువులు రెండు చీలికలై వాద వివాదములకు పాల్పడి జగడములతో కాలము గడపుచుండిరి. ఆ విషయమును మనస్కరించి సారిపుత్రుడు భిక్షువులతో నిట్లనియె.

"ఆయుష్మంతులారా! మొన్న మొన్ననే నిగంఠనాతపుత్తుడు కాలము చేసి నాడు. ఆతని శిష్యులగు నిగంఠువులు రెండుకక్షలుగ చీలి 'నీవు మిథ్యావాదివి. నీ

★ అ. క. ఆఱేండ్లొనర్చిన ఘోరతపః ప్రభావమున బుద్ధునకు వీపునందు వాతరోగ ముత్పన్నమైనది.

కీ ధర్మవినయము తెలియదు. అయోగ్యముగ నిట్లు పలికితివి. ముందు చెప్పదగినది వెనుక చెప్పితి' వని పరస్పరము తూలనాడుకొనుచు వృథాకయ్యములకు కాలు ద్రవ్వు కొనుచున్నారు. శ్వేతవస్త్రధారులగు వారి గృహస్థశిష్యులు గూడ ప్రతిష్ఠను, శాంతిని, నిర్వాణమును పొందింపలేని అలీకధర్మవినయమును పట్టుకొని ప్రాకులాడుచు వ్యర్థాయాసపరవశులై యున్నారు. భిక్షువులారా! బహుజనసుఖార్థముగ బహుజనహితార్థముగ భగవంతుడు బుద్ధుడు ప్రతిష్ఠను శాంతిని నిర్వాణమును పొందింపజాలు ధర్మమును ఉపదేశించినాడు. అది చిరంజీవి. అది సర్వైక సమ్మతము. వితర్క వివాదములందు చొఱరాదు. ఆ ఒక్కధర్మము ఏది? సమస్తప్రాణులును ఆహారాధీనములనుట, దీనిలో వివాదమెవ్వనికిని లేదు.

ఆయుష్మంతులారా! బుద్ధదేవుని ధర్మములను వినుడు.

ఒక ధర్మము = సర్వప్రాణులు ఆహారస్థితికములు.

జంటధర్మములు = నామము – రూపము

అవిద్య – భవ (ఆవాగమన) తృష్ణ.

భవ (నిత్యతా) దృష్టి – విభవ (ఉచ్ఛేద) దృష్టి.

అహ్రీకత (సిగ్గులేమి) – అనవత్రాప్యము (భయము లేమి)

హ్రీ (సిగ్గు) – అవత్రప (భయము)

దుర్వచనత – పాపమిత్రత

సువచనత – కల్యాణమిత్రత

ఆపత్తికుశలత్వము – ఆపత్తివ్యుత్థానము

సమాపత్తి (ధ్యాన) కుశలత్వము – సమాపత్తివ్యుత్థానము

[1] ధాతుకుశలత – [2] మనసికారకుశలత

[3] ఆయతనకుశలత – ప్రతీత్యసముత్పాదకుశలత

స్థానకుశలత – అస్థానకుశలత

(1) ధాతువులు పదునెనిమిది. చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణ, కాయ, మనో, రూప, శబ్ద, స్పర్శ, రస, గంధ, ధర్మ, చక్షుర్విజ్ఞాన, శ్రోత్రవిజ్ఞాన, కాయవిజ్ఞాన,, జిహ్వావిజ్ఞాన, ఘ్రాణవిజ్ఞాన, మనో విజ్ఞానములు.

(2) ఆ ధాతువులను ప్రజ్ఞచే తెలియదగు నిపుణత.

(3) ఆయతనములు పండ్రెండు. చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణ, కాయ, మనో, రూప, శబ్ద, రస, గంధ, స్పర్శ, ధర్మములు.

ఆర్జవము – మృదుత్వము
క్షాంతి – సౌశీల్యము
సాఖిల్యము (మధురవచనము) – ప్రతిసంస్తారము (ధర్మగోపనము)
అహింస – మైత్రీభావన
స్మృతిలోపము – అసంప్రజన్యము (అవిద్య)
స్మృతి – సంప్రజన్యము (విద్య, జ్ఞానము)
అజితేంద్రియత – అనియత భోజనము
జితేంద్రియత – నియత భోజనము
ప్రతిసంఖ్యాన (స్థిరజ్ఞాన) బలము – భావనాబలము
స్మృతిబలము – సమాధిబలము
శమథము (సమాధి) – విపశ్యన (ప్రజ్ఞ)
శమథనిమిత్తము – విపశ్యనానిమిత్తము
ప్రగ్రహము (చిత్తనిగ్రహము) – అవిక్షేపము
శీలవిపత్తి (ఆచారదోషము) – దృష్టివిపత్తి (సిద్ధాంతదోషము)
శీలసంపద – దృష్టిసంపద
శీలవిశుద్ధి – దృష్టివిశుద్ధి
కుశలధర్మ అసంతుష్టి – ప్రధాన (ప్రయత్న) నిరాలసత
విద్యావిముక్తి (ఆస్రవవిముక్తి) – నిర్వాణము

ధర్మత్రయము:–

అకుశలమూలములు = లోభము – ద్వేషము – మోహము
కుశలమూలములు = అలోభము – అద్వేషము – అమోహము
దుశ్చరితములు = కాయికము – వాచికము – మానసికము
సుచరితములు = కాయికము – వాచికము – మానసికము
అకుశలవితర్కములు = కామము – వ్యాపాదము (ద్రోహము) – విహింస
కుశలవితర్కములు = నిష్కామము – అవ్యాపాదము – అవిహింస
లోకధాతువులు = కామధాతువు – రూపధాతువు – అరూపధాతువు
చిత్తధాతువులు = హీనధాతువు – మధ్యధాతువు – ప్రణీతధాతువు
తృష్ణలు = కామతృష్ణ – భవ (ఆవాగమన) తృష్ణ – విభవతృష్ణ

సంయోజన (బంధ) ములు = సత్కాయదృష్టి - విచికిత్స (సందేహము) - శీలవ్రత పరామర్శ

ఆస్రవము (చిత్తమలము) లు = కామము - భవము - అవిద్య

భవ (ఆవాగమన) ములు = కామధాతువునందు - రూపధాతువునందు - అరూప ధాతువునందు

ఈషణలు = కామము - భవము - బ్రహ్మచర్యము

ప్రకారములు = సర్వోత్తముడను - సమానుడను - హీనుడను

అంతములు = సత్కాయము - సత్కాయసముదయము - సత్కాయనిరోధము

వేదనలు = సుఖము - దుఃఖము - అదుఃఖమసుఖము

దుఃఖములు = దుఃఖదుఃఖము - సంస్కారదుఃఖము - విపరిణామదుఃఖము

ప్రతిబంధములు = రాగము - ద్వేషము - మోహము

అగ్నులు = రాగము - ద్వేషము - మోహము

సంస్కారములు = పుణ్యము - అపుణ్యము - అనింద్యము

పుద్గలులు = శైక్ష్య (అముక్త) - అశైక్ష్య - నశైక్ష్యనాశైక్ష్య

స్థవిరు (వృద్ధు) లు = జాతి - ధర్మ - సమ్మతి

పుణ్యక్రియావస్తువులు = దానమయ - శీలమయ - భావనామయము

చోదనలు = కనిన - వినిన - అనుమానించిన

ప్రజ్ఞలు = చింతామయి - శ్రుతమయి - భావనామయి

ఆయుధములు = శ్రుతము - ప్రవివేకము - ప్రజ్ఞావివేకము

చక్షువులు = మాంసచక్షు - దివ్యచక్షు - ప్రజ్ఞాచక్షు

శిక్షలు = అధిశీలము - అధిచిత్తము - అధిప్రజ్ఞ

భావనలు = కాయభావన - చిత్తభావన - ప్రజ్ఞాభావన

అనుత్తరీయ (శ్రేష్ఠ) ములు = అనుత్తరీయదర్శనము - అనుత్తరీయమార్గము - అనుత్తరీయవిముక్తి

సమాధులు = సవితర్కసవిచార - అవితర్కవిచార - అవితర్క అవిచారములు

కౌశల్యములు =ఆయకౌశల్యము - అపాయకౌశల్యము - ఉపాయకౌశల్యము

మదములు = ఆరోగ్యమదము - యౌవనమదము - జాతిమదము

ఆధిపత్యములు = ఆత్మాధిపత్యము - లోకాధిపత్యము - ధర్మాధిపత్యము

విహారములు = దివ్యవిహారము - బ్రహ్మవిహారము - ఆర్యవిహారము

ప్రాతిహార్యములు = ఋద్ధి - ఆదేశనము - అనుశాసనము

ధర్మచతుష్టయము:–

స్మృతి ప్రస్థానములు = 1. కాయమునందు కాయానుపశ్యన, 2. వేదనయందు వేదనానుపశ్యన, 3. లోకమునందు లోకానుపశ్యన, 4. ధర్మమునందు ధర్మానుపశ్యన.

సమ్యక్ ప్రధానములు = 1. అకుశలధర్మము లుదయించకుండ, 2. ఉదయించినవి నశించునట్లు, 3. కుశలధర్మములు ఉదయించునట్లు, 4. ఉదయించినవి పెంపొందునట్లు చేయుప్రయత్నము.

ఋద్ధిపాదములు = 1. ఛందస్సమాధి ప్రధాన సంస్కారము, 2. చిత్తసమాధి ప్రధాన సంస్కారము, 3. వీర్యసమాధి ప్రధాన సంస్కారము, 4. విమర్ష సమాధి ప్రధాన సంస్కారము.

ధ్యానములు = ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ.

సమాధిభావనలు = 1. బుద్ధిప్రాపకము, 2. జ్ఞాన దర్శకము, 3. స్మృతి సంప్రజన్య యుక్తము, 4. ఆస్రవక్షయకరము.

అపరిమాణములు = 1. మైత్రీయుక్త, 2. కరుణాయుక్త, 3. ముదితాయుక్త, 4.ఉపేక్షాయుక్త చిత్తములు.

ఆరూప్యములు = 1. ఆకాశానంత్యాయతనము, 2. విజ్ఞానానంత్యాయతనము, 3. అకించన్యాయతనము, 4. నైవసంజ్ఞానాసంజ్ఞాయతనము.

ఆర్యవంశములు = 1. చీవరతుష్టి, 2. పిండపాతతుష్టి, 3. శయనాసనతుష్టి, 4. త్యాగరతి.

ప్రధాన(ప్రయత్న)ములు = 1. సంయమప్రధానము, 2. ప్రహాణప్రధానము, 3. భావనాప్రధానము, 4. అనురక్షణప్రధానము.

జ్ఞానములు = 1. దుఃఖ 2. సముదయ 3. నిరోధ 4. నిరోధగామినీ మార్గజ్ఞానములు.

స్రోతాపత్తి అంగములు : 1. సత్పురుషసేవనము 2. సద్ధర్మశ్రవణము 3. కారణపూర్వకవిచారము 4. ధర్మానుధర్మ ప్రతిపత్తి.

స్రోతాపన్నుని అంగములు = 1. బుద్ధానురక్తుడగుట 2. ధర్మానురక్తుడగుట 3. సంఘానురక్తుడగుట 4. ఆర్యశీలసంయుక్తుడగుట.

శ్రామణ్యఫలములు = 1. స్రోతాపత్తి 2. సకృదాగామి 3. అనాగామి 4. అర్హత్వ ఫలములు.

ధాతువులు = 1. పృథీవీధాతువు 2. జలధాతువు 3. అగ్నిధాతువు 4. వాయుధాతువు.

ధర్మసమాధానములు 1. వర్తమానమున దుఃఖము భవిష్యత్తున దుఃఖము 2. వర్తమానమున దుఃఖము భవిష్యత్తున సుఖము 3. వర్తమానమున సుఖము భవిష్యత్తున దుఃఖము 4. వర్తమానమున సుఖము భవిష్యత్తున సుఖము.

బలములు = 1. వీర్య 2. స్మృతి 3. సమాధి 4. ప్రజ్ఞ.

ప్రశ్నవ్యాకరణ = 1. ఏకాంశము 2. ప్రతిపృచ్ఛ 3. విభజ్యము 4. స్థాపనీయము.

కర్మములు = 1. కృష్ణకర్మము, కృష్ణవిపాకము 2. శుక్ల కర్మ శుక్ల విపాకము 3. శుక్ల కృష్ణ కర్మము శుక్ల కృష్ణ విపాకము 4. అకృష్ణ అశుక్ల కర్మము అకృష్ణ అశుక్ల విపాకము.

సాక్షాత్కరణీయములు = 1. స్మృతిమూలమున పూర్వజన్మస్మరణము 2. చక్షువుచే ప్రాణుల జన్మమరణదర్శనము 3. కాయముతో యెనిమిది విమోక్షములు 4. ప్రజ్ఞామూలమున ఆస్రవక్షయము.

ఉపాదానములు = 1. కామ 2. దృష్టి 3. శీలవ్రతపరామర్శ 4. ఆత్మవాద ఉపాదానములు.

అనార్యవ్యవహారములు : 1. మృషావాదము 2. పిశున వచనము 3. సంప్రలాపము 4. పరుషవచనము.

పుద్గలులు = 1. తమస్తమోపరాయణుడు 2. తమోజ్యోతిపరాయణుడు 3. జ్యోతిస్తమపరాయణుడు 4. జ్యోతిర్జ్యోతిపరాయణుడు.

### ధర్మపంచకము:

స్కంధములు = 1. రూప 2. వేదనా 3. సంజ్ఞా 4. సంస్కార 5. విజ్ఞాన ములు

గతులు = 1. నిరయ 2. తిర్యక్ 3. ప్రేత 4. మనుష్య 5. దేవ.

నీవరణములు = 1. కామచ్ఛందము 2. వ్యాపాదము 3. స్త్యానమృద్ధము 4. ఔద్ధత్యకౌకృత్యము 5. విచికిత్స.

అవరభాగీయ సంయోజనములు= 1. సత్కాయదృష్టి 2. విచికిత్స 3. శీలవ్రతపరామర్శ 4. కామచ్ఛందము 5. వ్యాపాదము.

ఊర్ధ్వభాగీయ సంయోజనములు = 1. రూపరాగము 2. అరూపరాగము 3. మానము 4. ఔద్ధత్యము 5. అవిద్య.

అభవ్యములు = 1. ప్రాణిహింస 2. అదత్తాదానము 3. మైథునము 4. మృషావాదము 5. సన్నిధి (సంగ్రహ) కారకము.

వ్యసనములు = 1. జ్ఞాతివ్యసనము 2. భోగవ్యసనము 3. రోగవ్యసనము 4. శీలవ్యసనము 5. దృష్టివ్యసనము.

ఇంద్రియములు = 1. శ్రద్ధా 2. వీర్య 3. స్మృతి 4. సమాధి 5. ప్రజ్ఞలు

### ధర్మషట్కము:-

ఆయతనములు = 1. చక్షు 2. శ్రోత్ర 3. ఘ్రాణ 4. జిహ్వా 5. కాయ 6. మన ఆయతనములు.

అనుస్మృతిస్థానములు = 1. బుద్ధానుస్మృతి 2. ధర్మ 3. సంఘ 4. శీల 5. త్యాగ 6. దేవతానుస్మృతులు.

### ధర్మసప్తకము:-

ఆర్యధనములు = 1. శ్రద్ధా, 2. శీల, 3. హ్రీ, 4. అవత్రపా, 5. శ్రుత, 6. త్యాగ, 7. ప్రజ్ఞలు.

బోధ్యంగములు = 1. స్మృతి, 2. ధర్మవిచయ, 3. వీర్య, 4. ప్రీతి, 5. ప్రశ్రబ్ధి, 6. సమాధి, 7. ఉపేక్ష.

సంజ్ఞలు = 1. అనిత్య, 2. అనాత్మ, 3. అశుభ, 4. ఆదినవ, 5. ప్రహాణ, 6. విరాగ, 7. నిరోధములు.

బలములు = 1. శ్రద్ధా, 2. వీర్య, 3. స్మృతి, 4. సమాధి, 5. ప్రజ్ఞా, 6. హ్రీ, 7. అవత్రప.

ధర్మఅష్టకము:-

సమ్యక్ త్వములు 1. సమ్యక్ దృష్టి, 2. సమ్యక్ సంకల్పము, 3. సమ్యక్ వాక్కు, 4. సమ్యక్ కర్మాంతము, 5. సమ్యక్ ఆజీవము, 6. సమ్యక్ వ్యాయామము, 7. సమ్యక్ స్మృతి, 8. సమ్యక్ సమాధి.

ధర్మనవకము:-

అనుపూర్వములు 1. ప్రథమధ్యానము, 2. ద్వితీయధ్యానము, 3. తృతీయ ధ్యానము, 4. చతుర్థధ్యానము, 5. ఆకాశానంత్యాయ తనము, 6. విజ్ఞానానంత్యాయతనము, 7. ఆకించన్యా యతనము, 8. నైవసంజ్ఞానాసంజ్ఞాయతనము, 9. సంజ్ఞా వేదయిత నిరోధము.

అనుపూర్వనిరోధములు = ప్రథమధ్యాన ప్రాప్తునకు కామసంజ్ఞయు, ద్వితీయధ్యాన ప్రాప్తునకు వితర్క విచారమును, తృతీయధ్యాన ప్రాప్తునకు ప్రీతియు, చతుర్థధ్యానప్రాప్తునకు ఆశ్వాసప్రశ్వాసము లును, ఆకాశానంత్యాయతనప్రాప్తునకు రూపసంజ్ఞయు, విజ్ఞానానంత్యాయతన ప్రాప్తునకు ఆకాశానంత్యాయతన సంజ్ఞయు, ఆకించన్యాయతన ప్రాప్తునకు విజ్ఞానానంత్యా యతనసంజ్ఞయు, నైవసంజ్ఞానాసంజ్ఞాయతన ప్రాప్తునకు ఆకించన్యాయతన సంజ్ఞయు, సంజ్ఞావేదయిత నిరోధ ప్రాప్తునకు సంజ్ఞావేదనలును నిరుద్ధములగును.

ధర్మదశకము:-

అకుశలధర్మములు = 1. ప్రాణాతిపాతము (హింస), 2. అదత్తాదానము (చౌర్యము), 3. కామ మిథ్యాచారము (వ్యభిచారము), 4. మృషావాదము, 5. పిశునవచనము, 6. పరుష వచనము, 7. సంప్రలాపము (వదరుబోతుతనము), 8. అభిద్య (లోభము), 9. వ్యాపాదము (ద్రోహము), 10. మిథ్యా దృష్టి.

ఇట్లు సారిపుత్రుడు చెప్పిన సంగీతిపర్యాయము (ఏకతా విధానము) నందు భగవంతుడు సహమతుడై ప్రశంసించెను. భిక్షువులును సంతుష్టులైరి.

## చుంద సూత్రము - సారిపుత్ర మౌద్గల్యాయనుల పరినిర్వాణము (వి. పూ. 428 - 427)

[1] భగవంతుడు బుద్ధుడు నలుబదినాల్గవ వర్షావాసమును శ్రావస్తియందు పూర్వారామమున గడపెను. నలుబదియైదవ వర్షావాసము అనాథపిండకుని జేతవనారామమున గడపుచుండెను. ఆ సమయమున ఆయుష్మంతుడు సారిపుత్రుడు [2] నాలకగ్రామమునందు అత్యంత రోగపీడితుడై శరీరమును వదలెను.

---

(1) సం. ని. 45 - 2 - 3.

(2) అ. క. అది యొక సమయము. బుద్ధదేవుడు జేతవనమునం దున్నాడు. సారిపుత్రుడు కూడ తోడనే వసించియున్నాడు. తనకు పరినిర్వాణప్రాప్తి సమీపించి యున్నదనియు తాను పుట్టినచోటనే తనువును దొఱగి జన్మ ముపసంహరించుకోవలెననియు తలంచి సారిపుత్రు డొకనాడు చుందుడను స్థవిరునితో ''ఆయుష్మంతా! మన భిక్షుసంఘము యేనూర్వురు మందిని పాత్ర చీవరములను సంబాళించుకొని పయనము గమ్మనుము. నా జన్మస్థలమగు నాలకగ్రామమునకు పోవలెను. నీవును సన్నద్ధముగమ్ము'' ని చెప్పెను. చుందస్థవిరుడును అన్నియు నట్లే ఆయత్తపఱచెను.

ధర్మసేనాపతి సారిపుత్రస్థవిరుడు తన యేనూర్వురు భిక్షుసంఘముతోగూడి భగవంతుని చెంతకుబోయి సాష్టాంగవందనము లర్పించి యిట్లనియె.

''గురుదేవా! అనుజ్ఞ యిండు. శరీరత్యాగమునకు సమయము సమీపించినది. పరినిర్వాణమునకు అనుమతి యిండు. పోయి వత్తును.''

చుందశ్రమణోద్దేశుడు సారిపుత్రస్థవిరుని పాత్రచీవరములను అస్థిసమూహ మునుగొని శ్రావస్తికి జనుదెంచి జేతవనారామమును జొచ్చి ఆయుష్మంతుడగు ఆనందునకు నమస్కరించి యిట్లనియె.

''పూజ్యుడా! సారిపుత్రుడు పరినిర్వృతుడైనాడు. ఇవి యతని వస్త్రములు. ఇది యతని భిక్షాపాత్ర. ఇయ్యవి ఆతని అస్థులు.''

---

''సారిపుత్రా! పరినిర్వాణమునకు యేచోటు నిశ్చయించితివి?''

''దేవా! మగధదేశమునందు నాలకగ్రామమున నేను పుట్టినింటనే పరినిర్వృతుడ నయ్యెదను.''

''సారిపుత్రా! నీకు వలయునట్లు చేయుము.''

ఇట్లు భగవంతు డనుజ్ఞనిచ్చినంత స్వర్ణకచ్ఛపసదృశములైన అమ్మహానుభావుని చరణములను రక్తకోమలములగు తన హస్తములచే బట్టుకొని శిరంబునిచి ''దేవా! ఈ పవిత్రపాద సన్నిధిని పొందనభిలషించి లక్షలాదికల్పములు తపస్సు చేసితిని. అసంఖ్య పారమితలనార్జించితిని. నా కోర్కెలు ఫలించినవి. ఇక యీ శరీరములకు కలియిక లేదు. బుద్ధపురుషు లందఱును చెందు చోటగు నిర్వాణభూమి నధిగమించుచున్నాను. నా కాయిక వాచికకర్మములచే భగవానులవారికి అయిష్టమగు తప్పునో ప్రమాదమునో చేసియున్నచో క్షమింతురు గాక!''

''ఆయుష్మంతా! నాకు విద్ధారమును విరుద్ధమును నగు పనిని నీవు యేనాడును చేయలేదు. అయినను అన్నివిధముల నిన్ను క్షమించుచున్నాను, పొమ్ము.''

తథాగతుని వీడ్కోలుపొంది ఆయుష్మంతుడు సారిపుత్రుడు లేచి నిలువబడెను. భగవం తుడును సారిపుత్రుని యందలి సత్కారమును సూచించుచు తన కుటీరమునకు వెలుపలనుండు మణిఫలకము వరకు వచ్చి సాగనంపెను. తనివిదీఱని వానివలె ధర్మసేనాపతి మఱియు గురుదేవుని చరణములను ముద్దిడుకొని ''ప్రభూ! లెక్కలేని కల్పములనుండి నీ పాదమూల మపేక్షించి నేటికి కృతార్థుడ నైతిని. నా తపఃఫలముగ నిన్ను దర్శించితిని. ఆనాడు తొలిదర్శనము. ఈనాడు కడ దర్శనము. ఈ చూపులు చివరి చూపులు. సెలవు'' అని నుడివి భగవంతుడు కనుచాటగు నంతవఱకు వీపును చూపకుండ ఎదురెదురు మళ్ళి వెనుక వెనుకకు బోవుచు జేతవనమును దాటి పోయెను.

తమకు పెద్దన్న – ధర్మసేనాపతి యగు సారిపుత్రుడు మహాప్రస్థానము చేయుట యెఱింగి జేతవనారామమున నుండు భిక్షువులు భిక్షుణిలు ఉపాసకులు ఉపాసికలు జట్టుమొత్తము కట్టగట్టు కొని భగవంతుని బుద్ధుని ఒక్కని గంధకుటియందు దిగవిడిచి తోడ్తోడబడివచ్చిరి. శ్రావస్తీ నగర వాసులు సారిపుత్రుని విరహమునకు ఓర్వలేక వీథులను పట్టకుండ ఒకరిపై నొకరు బడుచు గంధమాల్యములను దోసిటపెట్టుకొని ''మహాప్రజ్ఞు డెక్కడ? మా ధర్మసేనాపతి యెక్కడ? ఇక మాకు దిక్కేది? భగవంతునకు బుద్ధునకిక ఆధారమేది?'' యని విలపించుచు వెంటబడిరి.

''ఆయుష్మంతా! చుందా! విశేషవార్త దెచ్చితివి. భగవంతుడున్నెడకు పోయి నివేదించెదము. పద.''

ఇరువురును దశబలుని వద్దకుబోయి గోత్రనామములు చెప్పి వందనములు చేసి విషయమును విన్నవించిరి. ఆనందు డిట్లనియె.

''భగవన్! చుందస్థవిరుడు పిడుగువంటివార్తను దెచ్చి వినిపించెను. శరీరము విరవిరబోవుచున్నది. మదికి కుదురు లేదు. దిక్కు దోపకున్నది. సారిపుత్రుని మరణ వార్తను హృదయము భరింపలేకున్నది.''

---

కొంత దవ్వరిగినంత మహానుభావుడు సారిపుత్రుడు పౌరజనము నోదార్చి వెనుకకు బంపి, భిక్షుసంఘము ననునయించి ''ఆయుష్మంతులారా! మరలిపొండు. అప్రమత్తులై గురు నాథుని రక్షించుకొనుడు'' అని హితమునాదేశించి తన సంఘముతో గూడి తాను తరలెను.

గ్రామైక రాత్రముగ గడచి చనుచు దారిపొడువున ప్రజానీకమునకు ధర్మములుపదేశించుచు యేడవదినము సాయంకాలమునకు నాలకగ్రామమును జేరి ఊరిబయట నొక మఱ్ఱిచెట్టుక్రింద విడిది జేసెను. మేనల్లుడగు ఉపరేవతుడు ఊరికి వెలుపలవచ్చి మామయగు సారిపుత్రస్థవిరుని జూచి నమస్కరించి నిలువబడెను. స్థవిరు డిట్లనియె.

''నాయనా! మీ అవ్వ యింటియం దున్నదా?''

''స్వామీ! ఉన్నది.''

''అట్లులైన నీ వింటికి పోయి మాతామహికి మేము వచ్చియున్నామనియు, ఈనాటి ఒక్క రాత్రి నేను జన్మించిన గృహమందు నివసించెదమనియు, యేనూర్వురు భిక్షువులకు తగినట్లు స్థలమును చక్కబఱపుమనియు చెప్పుము.''

వాడును వల్లెయని వీడ్కొనిపోయి తన మాతామహి (అవ్వ) తో యావద్విషయము నెఱింగించెను. ఆమెయు ''ఓహో! వయస్సంతయు గడచిన మీదట యిప్పుడు ముసలితనమున గృహస్థుడు కాగోరినాడా? అయినను, తోడ నింత గుంపెందుకు?'' అని పలికి గృహమును పరిశుద్ధము జేసియుంచి రమ్మనిచెప్పి పుత్తెంచెను.

స్థవిరుడు గృహమును ప్రవేశించినంతనే మరణాంతకమగు వేదనకలిగి నెత్తురు గ్రక్కుట కారంభించెను. తల్లియు తనయుని విషయమేమియు గుర్తింపలేక తలవాకిట నిలువబడినది. సారిపుత్రునకు పరినిర్వాణసమయమని గుర్తెఱిగ శుశ్రూషలు జేయుటకై మహాబ్రహ్మలును మహారాజిక దేవతలును వచ్చిరి కాని స్థవిరుడు వారిని నిరాకరించి వెనుకకు బంపించెను.

దేవతల రాకపోకలను గాంచి అబ్బురముతో వృద్ధబ్రాహ్మణి కుమారుని చెంతకుబోయి ''నాయనా! నీవు దేవతలకంటె గొప్పవాడవా?'' అని యడిగెను. ''ఉపాసికా! వారు మా పరి వారకుల'' ని సారిపుత్రుడు బదులాడెను. ఆ మాట విని ఆ ముసలమ్మ ''ఔరా! యితడె యింతటి వాడైనచో యీతని గురుడగు బుద్ధుడెంతటివాడో?'' యని భావించుచున్నంత పుత్రుడు సారిపుత్రు డిట్లనియె.

ఆనందా! శీల స్కంధమును, సమాధిస్కంధమును, ప్రజ్ఞాస్కంధమును, విముక్తి స్కంధమును యెడబాయక వాటితో గూడియె సారిపుత్రుడు పరినిర్వాణ మును పొందినాడా?''

''లేదు. లేదు. దేవా! వాటి నన్నిటిని వదలియె పరినిర్వృతుడైనాడు. ఆ పరమో పదేశకుడు. ఆ ప్రాణప్రియుడు ఆ సర్వవేత్త ఆ శాంతసౌరభస్వభావు డికలేడె యని మాటిమాటికి దలంచి చింతింతును.''

''ఆయుష్మంతా! ఆనందా! సంసార మొక విషాదాంత నాటకము. ఇందు కూడునవన్నియు వీడునవే. ప్రియములన్నియు దుఃఖములే. సుఖములన్నియు కష్టములే. పరిణామముదప్ప ప్రపంచము వేఱులేదు. అయ్యో! నశించెనే యని అడలుట దూరపుచూపు లేని మాట. పుట్టునదంతయు గిట్టునదే. ఈ చట్టమునకు

---

''మహాఉపాసికా! సర్వజ్ఞుడు సుగతుడు బుద్ధభగవంతుడు సరిదీటులేనివాడు. శీలసమాధి ప్రజ్ఞావిముక్తి జ్ఞానదర్శనములందు అతనికి అతడె సాటి.'' అని వర్ణించి ధర్మము నుపదేశించెను. ఆమెయు తక్షణమ స్రోతాపత్తిఫలమును బొంది యథారీతి ద్వారముకడ కరిగెను. అంతట సారి పుత్రుడును చుందుని బిలిచి-

''చుందా! సమయ మేమైనది'' అని యడిగెను.

''స్వామీ! తూరుపు తెల్లమొగము వేసినది. ప్రభాతసమయము.''

''చుందా! నన్ను లేపి కూర్చొనబెట్టి భిక్షువులను ప్రోగుచేయుము.''

సమావిష్టులైన భిక్షువులను చూచి సారిపుత్రు డిట్లనియె. ''ఆయుష్మంతులారా! మీతో కలిసి తిరుగబట్టి నలభై నాల్గేండ్లయినది. ఇన్నినాళ్ళపాడవున నావలన నేదైన అపరాధము కలిగి యున్నచో క్షమించండి.''

''మహానుభావా! అల్పజ్ఞులమగు మాయెడ నేదైన అపరాధమున్నచో మన్నించండి. మీ నీడన యిన్నాళ్ళు హాయిగ నుంటిమి. ప్రభూ! కరుణించుము.''

స్థవిరుడు సారిపుత్రుడు కుడివైపు నొత్తిగిలి పండుకొని వస్త్రమును నిండుముసుగు గప్పెను. క్రమముగ ప్రథమాది చతుర్థధ్యాన పర్యంతము అనులోమ ప్రతిలోమమున నధిరోహించి ఆ పై నిర్వాణము బొందెను. వృద్ధబ్రాహ్మణి సుతుడు పరినిర్వృతుడగుట యెఱింగి మిక్కిలి వాపోయెను.

గ్రామవాసులును భిక్షువులును కలిసి ఉత్సవయానమును ప్రభ నొక్కదానిని గట్టి శవము నందుంచి ఊరంతయు నూరేగించిరి. సారిపుత్రుని తల్లి ఆ గుంపులో కలిసి తిరుగుచు ముదుసలి యగుటచే ఒకచోట క్రిందపడి జనుల త్రొక్కిడిచే ప్రాణముల గోల్పోయి త్రయస్త్రింశ స్వర్గలోక మున కరిగినది.

తిరుగులేదు. సారిపుత్రుడు తొలగినంతనె దీపముతీసిన యింటివలె భిక్షుసంఘము నిస్తేజముగ చూపట్టుచున్నది. గతించినది. గతించినదెగదా! దానికి పునరాగమన మెక్కడిది? నాయనా! 'అత్తదీపాభవథ అత్తశరణాః' ఆత్మదీపకులుగండు. పర ప్రత్యయనేయబుద్ధులు గాక మీమార్గమును మీరె చూచుకొనుడు. ఆత్మశరణ్యులు గండు. పరావలంబనమును మాని మీకాళ్ళపై మీరు ఊదినిలువుడు. ధర్మమె మీకు యేడుగడ. కాయమునందు కాయానుపశ్యకులరై, వేదనలయందు వేదనాను పశ్యకులై, చిత్తమునందు చిత్తానుపశ్యకులై, ధర్మములందు ధర్మానుపశ్యకులై విహరిం చుడు. ఆత్మశరణ్యులగుట కిదియె మార్గము.''

---

గంధకాష్ఠములతోడ చితియందు సారిపుత్రుని దేహము దహింప బడినది. అనురుద్ధ స్థవిరుడు చితిని సుగంధజలముల నార్పెను. చుందస్థవిరుడు అస్థులనేటి నీటని వడియగట్టు గుడ్డయం దుంచుకొని తన జ్యేష్ఠభ్రాత యగు ధర్మసేనాపతియొక్క పాత్రచీవరములను తోడగైకొని భగవంతుడు నివసించు శ్రావస్తికి బయలుదేరెను. అచిరకాలముననె శ్రావస్తిని జేరికొని జేత వనమునందలి కొలనునందు మునిగి లేచి తన కుపాధ్యాయుడును, సారిపుత్రునకు పరమ మిత్రుడును ధర్మకోశాధ్యక్షుడు ఆనందుని వద్దకుబోయి విషయమును దెలిపి తాను దెచ్చిన పాత్రచీవరములను, అస్థిధాతు పరిస్రావణమును చూపించెను.

పదంపడి చుందుడును ఆనందుడును భగవంతుని చెంతకు బోయిరి. బుద్ధదేవుడు వారి వలన విషయమంతయు నెఱింగి చేతిని చాపి యెముకలమూటను గైకొని అఱచేతిలో బెట్టుకొని భిక్షువుల నుద్దేశించి యిట్లనియె.

''భిక్షువులారా! ఒకానొకనాడు లోకమున ననేక దివ్యశక్తులను ప్రకటించిన మహావ్యక్తి యీనాడు యిదిగో! యీ అస్థిమాత్రముతో మనకు పొడగట్టుచున్నాడు. లక్షలాది కల్పముల నుండి దానాది పారమితల నార్జించిన మహాభిక్షు వితడు. నాకు కుడిభుజమై ధర్మచక్రప్రవర్తనము నకు తోడుబట్టిన మహాప్రజ్ఞ డితడు. అల్పసంతుష్టుడు; యేకాంతసేవి; ఉద్యోగ శీలుడు; పాపదూరుడు; యేనూరు జన్మలనుండి సుఖభోగములను కాలదన్ని భిక్షుదీక్షను గ్రహించుచు వచ్చిన పుణ్యు డితడు, భిక్షువులారా! ఈ యెముక లతనివి.

సీ. అయిదువందల జన్మలాదిగ సుఖభోగ – వాంఛల నెడబాసి వచ్చువాడు
శాంతికి భూమితో సముడయి యేనాడు – కోపమంచెఱుగని కోమలుండు
చండాల సుతుభంగ జనపదంబులయందు – తలవంచుకొని దారి తొలగువాడు
కరహీనమైనట్టి కరిరాజమునువోలె – నిరుపద్రవంబుగ నెగడువాడు

నేడు తనువుబాసి నిర్వాణసామ్రాజ్య సార్వభౌముడయ్యె సారిపుత్రు
డమ్మహాత్మునకును అభినందనంబులు ప్రీతి జేయుడయ్య భిక్షులార!

# మౌద్గల్యాయనుని పరినిర్వాణము (వి. పూ. 427)

[1] ఒకసమయమున తైర్థిక మతాచార్యులును, మతానుయాయులును సమావేశమై శ్రమణగౌతమునకు లభించు లాభసత్కారములకు, కీర్తిప్రతిష్ఠలకు మూలభూతుడు మౌద్గల్యాయనుడె కాన వానిని పొరిగొనవలెనని నిశ్చయించిరి. మహాబుద్ధిమంతుడగు మౌద్గల్యాయనుడు మడిసినచో శ్రమణగౌతముడు గట్టున బడిన చేపవలె ఉక్కిరిబిక్కిరి కాగలడు. లోకమున మన ప్రతాపమునకిక యెదురు లేదనియు తలంచిరి. వేయి కార్షాపణములు (ఆనాటికాలపు నాణెములు) యిచ్చి మౌద్గల్యాయనుని చంపునట్లు గూండాలతో (హంతకులు) ఒప్పందము చేసికొనిరి. ఆ తరుణమున మౌద్గల్యాయనుడు కాలశిలయందు నివసించియుండెను. ఆ దుండగీం డ్రతని నివాసమును చుట్టుకొనిరి. మహాసిద్ధిమంతుడగు నత డొకపరి అదృశ్యుడయ్యు, మఱియొకతూరి ఆకాశమున కెగిరియు వారిబారిని పడకుండ తప్పించుకొనెను. హంతకులు పంతముబట్టి కాచుకొనియె ఉన్నారు. తన కాకర్మ విధి తప్పరానిదిగ నెఱింగి మౌద్గల్యాయనస్థవిరుడు మూడవపర్యాయమా క్రూరాత్ముల చేతికి జిక్కెను. వారును నలినలి గుల్లగుల్ల జేసి ఖండించి పైచిరి. బుద్ధదేవుని దర్శింపనిదె పరినిర్వాణము జెందరాదని తలంచి స్థవిరుడు కడికండలైన శరీరఖండములను తన దివ్యశక్తి వలన జోడించుకొని ఆకాశపథమున శాస్తవద్ద కరుదెంచి దండప్రణామములు జేసి నిర్వాణప్రాప్తికి అనుజ్ఞ నపేక్షించెను. తథాగతుడు సప్రేమముగ ననుమతి యిచ్చినంత వెండియు కాలశిలకు వెళ్ళి పరినిర్వృతుడయ్యెను.

## ఉల్కాచేల సూత్రము

[2] ఒకానొకదినము. సారిపుత్రమౌద్గల్యాయనులు పరినిర్వృతులైన పిమ్మట బుద్ధభగవంతుడు భిక్షుసంఘములతోగూడి వజ్జిదేశమునందు గంగాతీరమున ఉల్కాచేలపురమున విహరించుచుండెను. అట్టియెడ విన్ననైయుండు భిక్షువుల నామంత్రించి యిట్లనియె.

''భిక్షువులారా! నా అగ్రశ్రావకయుగళమగు సారిపుత్రమౌద్గల్యాయనులుండునపుడు యీ సంఘము నిండి కళకళలాడునట్లుండెడిది. నేడో నిస్తేజమై తోచుచున్నది. గతకాలమునందు గలిగిన బుద్ధులందఱికిని యిట్టి ఉత్తమశ్రావకుల జోడు తోడనుండెడిది. భవిష్యత్తునందు సముత్పన్నులగు బుద్ధులకు గూడ సారిపుత్ర మౌద్గల్యాయనులవంటి ఉత్తమశిష్యుల జంట అవశ్యముండగలదు. గురుశాసనము

(1) ధమ్మపద; అ. క. 10 - 7.

(2) సం. ని. 45 - 2 - 4.

పరిపాలించుటయందు చతురులు; ధర్మప్రచారమునందు దక్షులు; భిక్షుభిక్షుణీ ఉపాసక ఉపాసికా సంఘములకు ప్రాణప్రియులు నగు సారిపుత్ర మౌద్గల్యాయను లున్న దిక్కున నేలోపమును లేకుండెడిది. అపురూపమైన అట్టివారి నెడబాసికూడ తథాగతుడు వ్యాకులుడుగా లేదు. ఆయుష్మంతులారా! వెతజెంది వెతజెంది యేమి మూట గట్టికోవలెను. పుట్టునదంతయు గిట్టునదే. సముదయధర్మమంతయునిరోధ ధర్మమే. నాశస్వభావముగల వస్తువులనుగూర్చి హా! పోయెను. గతించె' నని వగచుట కొఱమాలిన పని. మహావృక్షమువలె భిక్షుసంఘమెంత గొప్పదయ్యుగూడ సారభూత మగు కొమ్మలు గూలిన పిమ్మట నీడలేనిదైనది.

భిక్షువులారా! ఆత్మద్వీపకులు గండు. ఆత్మశరణ్యులు గండు. పరావలంబన మును వీడి స్వావలంబతత్పరులు గండు. మీ జీవనాభ్యున్నతికై పరముఖాపేక్ష లేక స్వయముగ మార్గదర్శకులు గండు. 'అత్తదీపాః భవథ అత్తశరణాః - ఇదియె నా హితవు.' [1]

## ౧౦

## మహాపరినిర్వాణ సూత్రము (వి. పూ. 427 - 426)

[2] గౌతమబుద్ధుడు రాజగృహపురమున గృధ్రకూట పర్వతముపై విహరించు చుండెను. ఆ సమయమున మగధరాజగు అజాతశత్రుడు వైశాలిపై దండెత్తి [3] వృజి (వజ్జి) జాతివారగు లిచ్ఛవీ రాజులను సర్వనాశము చేయవలెనని సంకల్పించి తన ప్రధానామాత్యుడగు వర్షకారబ్రాహ్మణుని పిలిచి యిట్లనియె.

---

(1) అ. క. ధర్మసేనాపతియగు సారిపుత్రుడు కార్తికమాసమున పూర్ణిమయందు పరి నిర్వాణమును బొందెను. మహామౌద్గల్యాయనుడు తదనంతరము పదునైదుదినములకు అమావా స్యనాడు పరినిర్వృతుడయ్యెను. ఆ యిరువురును గతించిన పిమ్మట బుద్ధుడు భిక్షుసంఘముతో గూడి చారిక నొనర్చు కొనుచు క్రమముగ ఉల్కాచేల నగరమునకు (హాజీపూర్, ముజఫ్ఫర్ పూర్‌జిల్లా) వచ్చి గంగాతీరమున విహరించుచుండెను.

(2) దీ. ని. 2 - 3 (16)

(3) అ. క. గంగాతీరమున అర్ధయోజనము పొడవు అజాతశత్రుని రాజ్యము, అంత మాత్రమె వృజిరాజులకును గలదు. ఆ హద్దునందలి పర్వతభూములం దనేక విధములగు సుగంధ ద్రవ్యములు లభించును. వాటిని తెచ్చుకొనుటకు అజాతశత్రుడు "రేపు - ఎల్లుండి అని బద్ధకముతో కాలము గడపును. ఆలోగా వృజి (విచ్ఛలి) రాజులుబోయి సమస్తమును ఊడ్చి తెచ్చుకొందురు. అజాతశత్రుడు వెనుకబోయి తనకేమియు లభింపకుండుటచే అగ్రహోదగ్రుడై మండి పడును. అట్లు వరుసగ రెండేండ్లు జరిగినది. ప్రజాసత్తాకమగు వృజిరాజ్యముతోడి పోరు తేలికగాదని యెఱింగియు కోపము నాపుకొనలేక భగవంతుని సలహాను గోరెను.

''బ్రాహ్మణా! బుద్ధభగవంతుడున్నెడకు బోయి నామాఱుగ నమస్కరించి నా మాటలలో కుశలప్రశ్నలడుగుము. ఆపై అజాతశత్రుమహారాజు వృజిరాజులపై దాడివెడల నున్నాడనియు దాని విషయమున తమ అభిప్రాయ మడిగిరమ్మని నాడ నియు మనవి చేసి ఆ మహానుభావు డేమి పలుకునో తెలిసికొనిరమ్ము.''

రాజాజ్ఞ మేఱకు వర్షకారబ్రాహ్మణుడు ఉత్తమరథము నెక్కి పురమునుండి గ్రక్కదలి గృధ్రకూటపర్వతమునకు అంచంచులకు బోర రథమును డిగి పాదచారియై దశబలుని చేరబోయి సమ్మోదన మొనర్చి యొకచో గూర్చొని యిట్లనియె.

''గౌతమా! మారాజు అజాతశత్రుడు మీకు శిరసా వందనము లనెను. తమ ఆరోగ్యమును ఆనందమును గూర్చి ప్రశ్నించెను. స్వామీ! వృజజాతిని సర్వసంహా రము చేయవలెనని మారాజు ఉద్దేశించినాడు. తామేమి సెలవిచ్చెదరు?''

ఆ సమయమున ఆయుష్మంతుడు ఆనందుడు బుద్ధదేవునకు వెనుకవైపుగ నిలిచి పంకా వేయుచుండెను. భగవంతు డిట్లనియె.

''ఆనందా!''

''భగవన్!''

''వజ్జియులు నియమపూర్వకముగ పరస్పరము కలిసికొని సభాగృహము లందు సమావేశము కాగలుగుదురని నీవు వినియున్నావా?''

''దేవా! వినియున్నాను.''

''ఆనందా! వారు ★ సన్నిపాతభేరి వినినంతనె ఆయాపనుల నట్టట్టె వదలిపెట్టి సంఘసమావేశమున పాల్గొని కార్యరంగమున దుముకువారని నీవు వినియు న్నావా?''

''దేవా! వినియున్నాను.''

---

★ అతి విపత్కరములగు అవసరసమయములందు సభాగృహములలో సన్నిపాతభేరి మ్రోగింపబడును. ప్రజానాయకు లదివిని తినుచున్నను త్రాగుచున్నను యేయేపని చేయుచున్నను అన్నిటిని వదలి పరుగిడివచ్చి సమావేశమై కర్తవ్యమును నిశ్చయింతురు.

''ఆనందా! మఱియు వారు తాము నిర్మించిన నియమములను శాసనములను జవదాటకుండ, ప్రాచీన ★ వజ్జిధర్మమునుకూడ అక్షరాల పాలించువారని నీవు వినియున్నావా?''

''దేవా! వినియున్నాను.''

''ఆనందా! ఆవజ్జియులు పెద్దలమాటలను ఆలకించువారనియు, వృద్ధజన సేవయందు ఆసక్తులనియు నీవు వినియున్నావా?''

''దేవా! వినియున్నాను.''

''ఆనందా! మరియు వారు కులస్త్రీలను – కులకుమారికలను చక్కగ సన్మానింతురనియు, పరస్త్రీలను బలాత్కరింపరనియు నీవు వినియున్నావా?''

''దేవా! వినియున్నాను.

''ఆనందా! వారు తమ రాజ్యసీమయందలి దేవస్థలములను, పూజ్యస్థానములను సత్కరించుదురనియు, ధర్మానుసారముగ వాటికి వలయు వృత్తిప్రవృత్తుల యందు లోపము జేయరనియు నీవు విని యున్నావా?''

''దేవా! వినియున్నాను.''

''ఆనందా! ఆవజ్జి ప్రజలు తమరాజ్యమున ప్రవేశించు అర్హత పురుషుల నాదరించుచు వారి ధర్మప్రచారమునకు వలయు సౌకర్యముల నేర్పఱింతురని నీవు విని యున్నావా?''

''దేవా! వినియున్నాను.''

''ఆనందా! ఈ యేడును రాష్ట్రమునకు అపరిహార్యధర్మములు. వీటి ననుసరించు రాష్ట్రమునకు ఊర్ధ్వగతియెకాని పతనము లేదు.''

అని పలికి భగవంతుడు వర్షకారబ్రాహ్మణుని వైపు మళ్ళి యిట్లనియె.

---

★ తొలుత వృజిరాజులు, దొంగదొరికినా డన్నంతన కారాగృహమునకు బంపుడని చెప్పక, విచారించుటకు న్యాయాధీశుని వద్దకు బంపుదురు. ఆ తీర్మానములో దొంగ కాదని తేలినచో వదలిపెట్టుదురు. దొంగయనియె తీర్మానమైనచో ఆ పై విచారణకు వ్యావహారకుని వద్దకు బంపుదురు. అటపై సూత్రధారుడును, ఆ మీదట అష్టకులికుడును, మరియు మీదట సేనాపతియును, రాష్ట్రపతియును, రాజును విచారించి చోరుడె యని నిశ్చయమైనచో చట్టము మేరకు శిక్షవిధింతురు. తప్పిపోయినచో వదలివేయుదురు. ఇది ప్రాచీనవజ్జి ధర్మము.

"బ్రాహ్మణా! త్రోసిపుచ్చరాని యీ యేడు ధర్మములను నేను వైశాలియందు సారందద చైత్యమున విహరించుచున్న వేళ వజ్జియుల కుపదేశించితిని. వీటికి కట్టుబడి యున్నంతవఱకు వారికి అవనతి లేదు. హాని లేదు. అభ్యున్నతిని అభివృద్ధినె పొంద గలరు."

ఆ మాటలు విని వర్షకారబ్రాహ్మణు డిట్లనియె.

"గౌతమా! ఈ యేడింటియందొక్కటి యున్న గూడ అభివృద్ధికి చాలినదై యుండ నిక యేడును గూడినచో చెప్పవలసినదేమి? అట్టివారిని దానభేదముల నాశ్రయించి వంచుకొనుట తప్ప దండోపాయమున వారు లొంగెడువారుకారు. శ్రమణగౌతమా! బహుకార్యలంపటులము గదా. పోయివత్తును." అని పలికి భగవంతునితో సెలవంది వర్షకారబ్రాహ్మణుడు మగధనాథుని చెంతకరిగెను. ★

బ్రాహ్మణు డరిగిన కొంతసేపటికి భగవంతు డానందుని బిలిచి "ఆయు ష్మంతా! భిక్షుసంఘము నంతటిని ఉపస్థానశాలయందు ప్రోగుచేయుము. ధర్మముల నుపదేశింపవలె' నని ఆదేశించెను. ఆనందుడు అట్లే చేసెను. ఉపస్థానశాలయందు భిక్షుసమ్ముఖమున గూర్చొని బుద్ధదేవు డిట్లానతిచ్చుచున్నాడు.

---

★ అ. క. ప్రధానామాత్యుడు నరపాలుని చెంతకుబోయి "నరేంద్రా! బుద్ధుడు తెలిపిన చొప్పు వట్టి వజ్జియులను దండోపాయముచే జయింప వీలుగాదు. దాన భేదోపాయముల రెంటనె వారు సాధ్యులు. అందులోను లంచములిచ్చి దానము లొసగి వారిని వశము జేసికొనదలంచినచో మనబలము వెలితి యగును. కావున యెటు ద్రిప్పియు వారిలోననె పరస్పరము కలతలు బుట్టించి కార్యమును సాధించుట ఒప్పును. అందుచే వారియెడ భేదోపాయ ప్రయోగమె మనకు తగినద' ని నివేదించెను.

మంత్రియు మహీపాలుడును తమకు వలయు పథకము నేర్పఱచిరి. ఒకనాడు నిండుకొలువు. రాజు అజాతశత్రుడు వజ్జియుల ప్రసంగము నెత్తికొని తూలనాడమొదలిడెను. అమాత్యుడగు వర్షకారబ్రాహ్మణుడది సహింపనివాడుంబోలె మొగము చిట్లించుకొని "రాజా! యెందుకు బకవాదము లాడెదవు? వారిని చెడనాడుటచే మీకు ఒఱిగినదేమి? మీ పనిపాటలు మీరు చూచుకొనుడ" ని వచించి సభనుండి లేచిపోయెను. "ఓహో! ఇతనికిని పగవారగు వజ్జియు లకును లాలూచీ యున్నట్టున్నది. లోగుట్టెవ్వరెఱుగుదురు? ఈ విషపురుగు మనకు కొఱగాదు. వెడలనడచుటయె మంచిద" ని రౌద్రమూర్తియై రాజు నుడువుచుండగనె గూఢచారు డొకడువచ్చి వర్షకారబ్రాహ్మణుడు గుప్తముగ కొన్నికాన్కలను వృజిరాజులకు బంపినాడని వార్తనొకటి దెలిపెను. భూపాలుడు నేయిపోసిన అగ్గివలె మండిపడి మంత్రిపుంగవుని తలగొఱిగించి పరాభవము జేసి నగరమునుండి బైటికి ద్రోపించెను.

''భిక్షువులారా! అవసరమైనపుడెల్లను మీ రందఱు గలిసి సమావేశమై మంచి చెడ్డలను గూర్చి విచారించుకొనుచున్నచో అదియే మీకు అభివృద్ధికి త్రోవ. హాని యనున దిక మీకు లేదు. 2 ఎంతవఱకు వచ్చుటయందు కూర్చొనుటయందు లేచుటయందు సమైక్యతను ప్రదర్శించి, కర్తవ్యకార్యనిర్ణయములందు సమన్వయ భావమున మెలగుదురో, అంతవఱకు హానియనునది మీకు లేదు. అభివృద్ధియే మీ పాలిటిది. 3. అవునది కాదని, కానిది అవునని వితండవాదము లాడక ఋజు మార్గవర్తనులై ఎంతవఱకు భిక్షు నియమముల నతిక్రమింపకుందురో అంతవఱకు అభ్యున్నతి మీ హక్కు. కీడు మిమ్ము మూచూడదు. 4. ధర్మవేత్తలను, సంఘనాయ కులను, కులపెద్దలను, వృద్ధభిక్షువులను ఆదరించుచున్నంతవఱకు క్రుంగుబాటు మీకు లేదు. 5. తృష్ణామూలములగు కోరికలకు మీ రెంతవఱకు బానిసలు గాకుం దురో అంతవఱకు అభ్యుదయము మీ కొంగుబంగారు. 6. యదృచ్ఛాలాభ సంతుష్టియు, యేకాంతసేవనమును మరగియున్నంతవఱకు వికాసము మీ అఱ చేతిలోది. అవనతి మీకు లేదు. 7. మున్ముందు వచ్చువారి శుభమును, వచ్చితోడై యున్నవారి సుఖ మును దృష్టియందుంచుకొని ప్రవర్తించుచున్నంతవఱకు కుశలము మీతోడు నీడ.

---

నగరములోని అనుపానులన్నియు నేనెఱిగినవే. ఊరక విడుతునా? మున్ముందు చూతువు లెమ్మని బిరములాడుచు బ్రాహ్మణుడు వజ్జిరాజులవద్దకు బోయి తనకు వాటిల్లిన స్థితిని గతిని చెప్పుకొని ఆశ్రయ మిమ్మని కోరెను. ''ఇదంతయు కట్టుకథ. ఈ మాయలమారికి చోటివ్వరాదు'' ని కొందఱనిరి. మరికొందఱు ''పాపము మనమీది అభిమానమున ముప్పుతిప్పల పాలైనాడు. త్రోసిపుచ్చ దగునే, రానిండ'' ని జాలిమూపి చేర్చుకొనిరి.

మేధావియగు విప్రుడు తన ప్రజ్ఞాబలమున వృజిరాజుల మెప్పునొంది ప్రధానామాత్య పదమును బొంది సుచారురూపమున నిర్వహించుచు నందఱిని వలయందు వేసికొనెను. కొన్నాళ్ళు గడచినంత లేనిపోని మాటలుచెప్పి పరస్పరము కల ప్రేమలను విఱిచి లోలోపల విప్లవమును విద్రోహమును ఱేకెత్తించి మూడేండ్లు ముగియుసరికి వృజి (లిచ్ఛవి) రాజ్యమునొక అగ్నిపర్వతము చేసి పెట్టెను.

(వి. పూ. 425 - 423.)

వృజిరాజులలో ఒకనిమాట ఒకనికి నచ్చదు. ఒకనినీడ నొకడు త్రొక్కడు. ప్రజాతంత్ర భవనమున మ్రోగించబడు సన్నిపాతభేరిని పరాకు చేసెడివాడు లేడు. అట్టి తరుణమునకై వేచి కొనియున్న మగధరాజు అజాతశత్రుడు వైశాలిపై దండెత్తెను. విపత్తును సూచించుచు వజ్జియులు సంస్థాగారములోని సన్నిపాతభేరిని మ్రోగించిరి. కాని వారు పోదురు వీరు బోదురు లెమ్మని యెవ్వరును పూనుకొనక పోవుటచే అజాతశత్రుడు చెక్కుచెదరని సైన్యముతో నిరాటంకముగ వైశాలిని ఆక్రమించుకొనెను.

ఓ భిక్షువులారా! ఈ అపరిహార్యములగు ధర్మముల నేడింటిని గమనించు కొనుడు. మరియు అభ్యున్నతికరములగు ధర్మముల నేడింటిని చెప్పెద వినుడు. 1. నిరంతరము పనిపాటలయందె రుచిగలవాడై యుండరాదు. 2. వదరు బోతుతన మును మరగియుండరాదు. 3. నిద్రాలోలుడు కారాదు. 4. జనసమ్మర్దమును కోరువాడు కారాదు. 5. పాపవాసనలకు నివాసము కారాదు. 6. దుష్టుల చెలిమి చేయరాదు. 7. అల్పఫలములను పొందినంతనె కృతార్థులమని కూర్చొనరాదు. ఈ యేడును మీకు మేలొనగూర్చు పద్ధతులు.

ఆయుష్మంతులారా! ఇదిగో! మరియు వినుడు. భిక్షువు 1. శ్రద్ధ గలవాడు. 2. బిడియముగలవాడు. 3. వినయపరుడు. 4. శాస్త్రవేత్త. 5. ప్రజ్ఞాశాలి. 6. జ్ఞాపక శక్తిగలవాడు. 7. ప్రయత్నశీలుడును కావలెను. ఇవన్నియు మీకు పరిహరింపరాని ధర్మములు.

వెండియు నాలకింపుడు. శ్రావకుడు 1. స్మృతి, 2. పుణ్య, 3. వీర్య, 4. ప్రీతి, 5. ప్రశ్రబ్ధి, 6. సమాధి, 7. ఉపేక్ష యనెడి సంబోధ్యంగముల నేడింటిని భావించుచు, 1. అనిత్య, 2. అనాత్మ, 3. అశుభ, 4. ఆదినవ (దుష్పరిణామ), 5. ప్రహాణ (త్యాగ), 6. విరాగ, 7. నిరోధము లనెడి సంజ్ఞల నేడింటి ననుశీలించుచు నుండవలెను. ఇట్టివానికి యేనాడును అధోగతి లేదు.

భిక్షువులారా! విడువదగని ధర్మముల నాఱింటిని మరియును చెప్పెద నాకర్ణిం పుడు. 1. తోడి సబ్రహ్మచారులయందు శారీరక సద్భావమును, చెలిమియు కలిగి యుండవలెను. 2. వాచిక సద్భావమును స్నేహమును కలిగియుండెవలెను. 3. మానసిక సద్భావమును మైత్రియు కలిగియుండవలెను. 4. ఏ కొంచెము దొరికినను పంచి తినువాడుగ నుండవలెను. 5. సదాచారమును శీలమును భద్రముగ పదిలము జేసి కాపాడుకొనువాడు గావలెను. 6. ధర్మప్రాణి కావలెను.

ఇట్టి అపరిహార్యధర్మములతో ఆర్యశ్రావకుడు శోభిల్లవలెను. నిర్వాణమార్గ మున వాడు పెట్టినది పేరు. ఇదియే మీకు అర్పించు నాధర్మధనము. సావధానమున మనస్కరించుకొనుడు. భిక్షువులారా! శుభమగుగాక.''

అని యిట్లు గృధ్రకూట పర్వతముపై విహరించుచు బుద్ధభగవంతుడు భిక్షు సంఘమునకు ఉపదేశించెను. మరియు నప్పుడప్పుడు విశేషముగ శీలమును, సమాధిని ప్రజ్ఞనుగూర్చి బోధించుచువచ్చెను. శీలముతో కూడిన సమాధి, సమాధితో గూడిన ప్రజ్ఞ. మహాఫలవంతములు. అత్యంత శోభాసమృద్ధములనియు ప్రజ్ఞతో గూడిన చిత్తమున ఆస్రవదోషములు లేవనియు ఉపదేశ మొనర్చుచుండెను.

# పాటలి గ్రామమునందు

నాలందాపురియందు కొంతకాలము యథేష్టముగ విహరించి భగవంతుడు భిక్షుసంఘముతో గూడి పాటలీగ్రామము జేరెను. బుద్ధగురుడు తమ గ్రామమునకు వచ్చినాడనుట విని ఉపాసకులు (గృహస్థశిష్యులు) భక్తిసత్కారములతో చేరబోయి ప్రణమిల్లి పూజించి ''గురుదేవా! మా గ్రామమునందు ★ ఆవసభాగారము నూతనముగ నిర్మింపబడినది. ఆ అతిథిశాల భిక్షుసంఘముతో తాము విడియుటకు యెంతయు దగియున్న'' దని మనవి జేసిరి. బుద్ధుడందుకు అంగీకరించెను.

సాయంకాలము పాత్రచీవరములను ధరించి భిక్షుసంఘ సహితముగ అతిథిశాలను ప్రవేశించి భగవానుడు సభామధ్యస్తంభము నానుకొని తూరుపు మొగమై కూర్చొనెను. అంతట తన్ను పరివేష్టించి కూర్చొనిన ఉపాసకులను జూచి అమ్మహాత్ము డిట్లనియె.

''ఓ గృహస్థులారా! దురాచారియగు గృహమేధి అయిదు విధములగు చెడుగులకు ఆలవాలమగుచున్నాడు. 1. శీలభ్రష్టుడగు వాడు సంపదకు దూరుడగుచున్నాడు. 2. అపకీర్తికి పాల్పడుచున్నాడు. 3. సభాసమాజములందు సన్మానమును గోల్పోవుచున్నాడు. 4. అశాంతితో మరణించుచున్నాడు. 5. మరణించి నరకమును ప్రాపించుచున్నాడు. ఓ గృహపతులారా! శీలవంతుడును సదాచారియునగు గృహస్థుడు యిందుకు విపరీతముగ అయిదు విధములగు లాభములను పొందుచున్నాడు. 1. జీవించియుండగనె మహాసుఖములకు పాత్రుడగుచున్నాడు. 2. సత్కీర్తిని నాల్గు మూలలను వ్యాపింపజేయుచున్నాడు. 3. సభాసమాజములందు సన్మానితుడగుచున్నాడు. 4. శాంతితో దేహము నెడబాయుచున్నాడు. 5. మరణించి సుగతిని భోగించుచున్నాడు.''

అని యిట్లు ఆ రాత్రి మరింత ప్రొద్దుపోవువరకు ఉపాసక గృహపతులకు బోధించి వారిని బంపించి తథాగతుడు శూన్యాగారములోనికి బోయెను.

వృజిరాజులతోడి ఆటంకమును అరికట్టుటకు మగధరాజగు అజాతశత్రుని పంపున సునీథుడును వర్షకారుడు నను మహామంత్రులిద్దరు పాటలి గ్రామమునకు జనుదెంచి గంగాతీరమున నొక మహానగరమును గట్టించుచుండిరి. తెల్లవారినంత భగవంతుడు లేచివచ్చి ఆనందుని పిలిచి యిట్లనియె.

---

★ తమ గ్రామమునకు అప్పుడప్పుడు వచ్చు ప్రభుత్వాధికారులు నివసించుటకు ప్రత్యేకముగ పౌరులందఱును గలిసి ఒక ధర్మశాలను నిర్మించిరి. అదియే ఆవసభాగారము.

''ఆనందా! పాటలిగ్రామమున నగరమును గట్టువార్వెవరు?''

''దేవా! అజాతశత్రుడు పంపగా వచ్చిన సునీథుడు - వర్షకారుడను బ్రాహ్మణు లిరువురు వజ్జియులతోడి ఉపద్రవమును నివారించుటకై నగరమును నిర్మించుచున్నారు.''

''ఆయుష్మంతా! ఆనందా! వీరు త్రయస్త్రింశ దేవతలతో పరామర్శజేసి నగరనిర్మాణమునకు పూనుకొనియున్నారు. నేనును గతరాత్రి దివ్యనేత్రముతో కనుగొనియున్నాను. వేలకొలది దేవతలు పాటలి గ్రామమును నివాసముగ జేసికొని నివసించుచున్నారు. ఏ ప్రదేశమునందు ఉత్తమశ్రేణికి చెందిన దేవతలు వసింతురో అట్టిచోటు మహామంత్రులను, మహారాజుల నాకర్షించి వారికి ఉనికిపట్టై వెలయ గలదు. మధ్యమ శ్రేణికి చెందిన దేవతలు తిరుగాడుభూములు మధ్యమ రాజులను వారికిదగిన మంత్రులనె ఆకర్షింపగలవు. అధమదేవతలు వసించు పొలములు అధములగు రాజులకును అధములగు మంత్రులకును నివాసస్థలములు కాగలవు. ఆయాచోట్ల నివసించు దేవతలె అట్టి సన్నివేశమును - అట్టి ప్రేరణను కల్గించగలరు. ఈ పాటలీగ్రామము మున్ముందు పాటలీపుత్రమను పేర ప్రఖ్యాతమై సభ్యతయందును సమృద్ధియందును వాణిజ్యమునందును సర్వశ్రేష్ఠమై విరాజిల్ల గలదు. చివరకు అగ్నితో - నీటితో - అంతఃకలహములతో సర్వనాశమగుట తప్పదు.''

అని యిట్లు ఆనందునితో సుగతస్వామి ముచ్చటించుచుండ మగధమంత్రులు సునీథుడును వర్షకారుడును జనుదెంచి ఆనాటి తమ భోజనమును అంగీకరించవలసి నదిగ వేడికొనిరి. భగవంతుడును సమ్మతించెను.

ఎప్పటివలె పూర్వాహ్ణసమయమున పాత్రచీవరములను ధరించి భిక్షుసంఘ సహితముగ భగవంతుడు మంత్రిపుంగవులు నివసించుశిబిరములకరిగి వారిచేత సత్కృతుడై వివిధాహారములచే సంతర్పితుడయ్యెను. భోజనానంతరము బుద్ధదేవు నకు క్రిందివైపున సునీథుడును వర్షకారుడును కూర్చొనిరి. వారొనర్చిన దానసత్కార మును గూర్చి ప్రశంసించుచు ఆ మహానుభావు డిట్లనియె.

''ఓ పుణ్యాత్ములారా! సాధువులను సదాచారులను, పండితులను పరమజ్ఞా నులను భోజనాదికములచే యే పురుషులు సన్మానించుచున్నారో వారియెడ సమస్త దేవతలును ప్రసన్నులగుచున్నారు.''

అని హితము నుపదేశించి ఆసనమునుండి లేచి గౌతమబుద్ధుడు బయలు దేరెను. మంత్రి పుంగవులిద్దరు కూడ వెంటవెంటనె యున్నారు. ''గౌతముడు

ప్రవేశించి పోయిన పురద్వారమునకు గౌతమద్వారమనియు, గౌతముడు దిగిన గంగాఘట్టమునకు గౌతమతీర్థమనియు పేరిడి వ్యవహరింతుముగాక'' యని వారు తలంచిరి. తర్వాత నవి యట్లే ప్రసిద్ధములయ్యెను.

భగవంతుడు గంగాతీరమున నిలువబడి యున్నాడు. భిక్షుసంఘమంతయు వెనుకవైపు నిలిచియున్నది. గంగాప్రవాహము వెల్లువలతో, దరులనొరిసికొని ప్రవహించుచున్నది. సాహసవంతులు యీదుకొని పోవుచున్నారు. మరికొందఱు తెప్పలకును నావలకును ప్రాకులాడుచున్నారు. భిక్షుసంఘముతోగూడి బుద్ధదేవుడవలీలగ యీ తీరమున నంతర్ధానమై ఆవలితీరమున తోచినిలిచెను. అట్లా యుత్తర తటమున నిలువబడి యిట్లు గీతమునొక్క దానిని బాడెను.

తే. గీ. పిల్లకాల్వలపై దృష్టిపెట్టబోక, భవసముద్రంబు దాటంగ ప్రాజ్ఞజనులు
మధ్యమంబు అష్టాంగికమార్గమనెడి, సేతువునుగట్టి యావలజేరుచుంద్రు
కర్మలంపటులగువారు కానిపోని, చేష్టలందు వృథా భ్రమించెదరు గాదె.

## కోటిగ్రామమునందు

ధీరసమీరమగు గంగాతీరమున కొంతవడి విహరించి తథాగతుడు బుద్ధుడు కోటిగ్రామమును జేరికొని భిక్షువుల నుద్దేశించి యిట్లనియె. ''భిక్షువులారా! ఆర్య సత్యముల నాలిగింటియొక్క యథార్థతత్త్వ మిట్టిదని యెఱుంగ లేక మోహజీవియగు మానవుడు పదింపది జన్మమరణ చక్రమున పరిభ్రమించుచున్నాడు. స్వపర భేదములచే నాదియని - నీదియని వృథాభ్రమలకు పాల్పడుచున్నాడు. దుఃఖము - దుఃఖకారణము - దుఃఖధ్వంసము - ఉపాయము ననెడి నాలుగును ఆర్యసత్యములు. వీటియొక్క యథార్థజ్ఞానముతో భవతృష్ణ నివర్తించి జన్మబంధములు తొలగుచున్నవి. జ్ఞప్తి పెట్టుకొనుడు. శీలము నాశ్రయించి పరిశుద్ధమగు సమాధిని, అట్టి సమాధిద్వారా పరిశుద్ధమగుప్రజ్ఞను, అట్టి ప్రజ్ఞామూలమున పరిశుద్ధమగు చిత్తమును బొంది కామాదిక్లేశములనెడబాసి నిర్వాణసుఖమును చూఱగొనుడు.''

ఇట్లు వివిధభంగుల నుపన్యసించుచు భిక్షుసంఘముతో గూడి భగవంతుడు ★ నాదికా గ్రామమును చేరుకొనెను. ఆ గ్రామమునందు గింజకావసథమున విహారము జేయుచు భిక్షువులకు ధర్మోపదేశము లొనర్చుచు క్రమముగ నటనుండి కదిలి వైశాలీనగరము జేరెను.

★ ముజప్ఫరపురము జిల్లా రత్తిపరగణములు.

# వైశాలీనగరములో

బుద్ధదేవుడు వైశాలీపురములో ఆమ్రపాలియనెడి వేశ్యయొక్క ఉద్యానవనము నందు భిక్షుసంఘముతోడ విడిసి స్మృతిని ప్రజ్ఞను గూర్చి భిక్షువులకు ఉపదేశించు చుండెను. ఆమ్రపాలీగణికయు తనతోటయందు భగవంతుడు బుద్ధుడు వచ్చి విహరించుచున్నాడని విని అభిరామములగు వాహనములను బూన్చి ఉత్తమ రథమునెక్కి ఆరామమునకు జనుదెంచి ఆ పుణ్యమూర్తిని దర్శించి నమస్కరించి కూర్చొనెను. దశబలుడును వివిధధర్మ కథాప్రసంగములచే అంబాపాలికను ఉద్బోధితను, ఉత్సాహితను, ఉత్తేజితనుగ జేసెను. అంతట ఆ కామిని చేతులు జోడించి "భగవంతా! తాము భిక్షుసంఘసహితముగ రేపు నాయింటి భోజనమును స్వీకరింపవలె" నని ప్రార్థించెను. ఎప్పటివలె మౌనావలంబనమున ధర్మప్రభువు సమ్మతిని సూచించెను.

అలభ్యలాభమును బొంది అంబాపాలి తన అపూర్వభాగ్యమును కొనియాడు కొనుచు ఆరామమును దాటి రథమునెక్కి నగరాభిముఖముగ బయలు దేరెను. లిచ్ఛవీ నాయకులును బుద్ధభగవంతుడు వైశాలికి వచ్చి ఆమ్రపాలీవనమున నున్నాడని విని దర్శన కుతూహల సంభ్రములై వన్నె వన్నెల వలువలను గట్టి వివిధ భూషణములచే నలంకృతులై రమ్యములగు రథములనెక్కి బుద్ధునికడకు వచ్చుచుండిరి. వడివడిగ యెదురై చనుదెంచు ఆమ్రపాలియొక్క రథము తటాలున వజ్జియులయొక్క రథముతో ఢీకొన్నది. అది జూచి వారు ' ఆమ్రపాలీ! పట్టపగ్గములు లేని పరవశోత్సాహములతో మా రథములను సైతము గెంటుకొని పోవుచున్నావే విశేష మేమిటి'' ని యడిగిరి. ఆమెయు ''ఆర్యపుత్రులారా! రేపటి నా యింటిభోజ నమునకు భిక్షు సంఘసహితముగ బుద్ధభగవంతుని నిమంత్రించినాను. పతితపావను డనుగ్రహించి అంగీకరించినాడు. అందుకు వలయు సన్నాహములకై త్వరితగతిపోవు నా రథము ప్రమాదవశమున మీ రథముతో పోటు తగిలినది. క్షమించు'' డని చెప్పెను. వారును విస్మయులై యిట్లనిరి.

''అంబాపాలీ! ఆ పవిత్రమగు విందును మా వంతుకిమ్ము. నీకు లక్ష నాణెము లిచ్చెదము.''

''అయ్యలారా! వైశాలీనగరము నంతటిని యిచ్చిన కూడ యీ భాగ్యమును వదలుటకు వీలు లేదు.''

అని మాఱుపలికి ఆ కాంత తన గృహమున కరిగినది. ''అంబాపాలిక గెలిచినది. మనమే ఓడిపోతిమిగదే'' యని వగచుచు లిచ్ఛవినాయకులు వనమును ప్రవేశించి

రథములను దిగి భగవంతుని చెంగటకు బోయిరి. వారు వచ్చుచుండుట దూరము నుండియే చూచి బుద్ధదేవుడు భిక్షువులను పిలిచి "దేవతల యందుకూడ లేని శోభా సమృద్ధి వీరియందు పొడగట్టుచున్నది. చూడుడ" నుచు వృజినాయకులను జూపించుచుండెను.

వారును సమీపించి నమస్కరించిరి. తథాగతుడును వివిధ ధర్మకథలచే వారిని సంతృప్తుల జేసెను. అంతట వృజిగణము కేలుమొగిడ్చి "స్వామీ! రేపటిదినము భిక్షుసంఘసహితముగ తాము మా భోజనమును గ్రహింపవలె" నని వేడికొనిరి. "కుమారులారా! ఆమ్రపాలి ముందుగనే ఆహ్వానించినది. ఆమెకు వాగ్దానమ్మొసగితిమి. మీ కోర్కె మన్నింప వీలులే" దని భగవంతుడు సమాధానముజెప్పెను.

"అరెరే! ఆమ్రపాలి గెలిచినది – గెలిచినద" ని వేళ్ళు గొఱికికొనుచు సెలవంది వృజినాయకులు స్వస్థలములకు బోయిరి.

మఱునాడె మధ్యాహ్నము కాకముందె పాత్రచీవరములను ధరించి భిక్షుసంఘ సహితముగ బుద్ధస్వామి ఆమ్రపాలి యింటి కరుదెంచెను. ఆమెయు ఉచితాసనముల నందఱిని గూర్చుండబెట్టి వివిధఖాద్యభోజ్యములచే సంతృప్తులుగ జేసెను. భోజనానంతరము విశ్రాంతియందుండు బుద్ధదేవుని సన్నిధానమునకు బోయి "ప్రభూ! బుద్ధ ప్రముఖ భిక్షుసంఘమునకు నా ఉద్యానవనమును దాన మొసగ్గు చున్నాను. అనుగ్రహించి స్వీకరించవలసినద" ని మనవి జేసెను. భగవంతుడు సంప్రీతితో నంగీకరించి వివిధ ధర్మకథా ప్రసంగములతో నామెను సంతోషమొందజేసి తిరిగి తన నివాసమున కరుగుదెంచెను.

## వేణువనగ్రామమునందు

భగవంతుడు బుద్ధుడు మహాభిక్షుసంఘముతో గూడి వైశాలినుండి వేలువ గ్రామమునకు వచ్చిచేరెను. అచ్చట విహరించుచు భిక్షువులను చూచి, "భిక్షువులారా! వైశాలికి నలుగడలను మీకు అనుకూలమున్నట్లు ఈ చతుర్మాసములను గడిపుడు. నేను ఆనందునితో గూడి యీ వర్షావాసమును యీ వేలువగ్రామమునందె నిర్వర్తించెదను" అని ఆదేశించెను.

వారును వల్లెయని వీడ్కొనిపోయిరి. బుద్ధదేవున కిది అంతిమ వర్షావాసము. ఈ కాలమున ఆయనకు గొప్ప జబ్బు చేసెను. శరీరమున భరింపరాని పీడ కలిగిన కూడ స్మృతి సంప్రజన్యములతో కూడి ఆ మహానుభావుడు అంతను సహించెను.

శరీరత్యాగమునకు సమయమనికూడ తోచినది. కాని భిక్షుసంఘము దూరమై యుండు యీ తరుణమున పరినిర్వాణముజెందుట యోగ్యముకాదని తలంచి ఘోర పీడాకరమగు వ్యాధిని తొలగించుకొని ప్రాణశక్తిని ప్రజ్వలింపజేసి భగవంతుడు విహరించుచుండెను.

రోగపీడనుండి విముక్తుడై కొంత కొంత ఆరోగ్యమును కూర్చుకొనుచు గురుదేవు డొకనాడు విహారచ్ఛాయయందు సుఖాసనమున గూర్చొనియుండెను. ప్రియశిష్యుడు ఆనందుడు భక్తితత్పరుడై చెంతకు చేరబోయి నమస్కరించి "దేవా! ప్రభుదేవుని స్వస్థతతో చూడగల్గి చిత్తము శాంతి బొందినది. తాము రోగగ్రస్తులై యుండు వేళ నాకు లోకమె పాడైయుండినది. హృదయము నిప్పులు బొరలినట్లుండె డిది. నా చుట్టుముట్టు చీకటి కాపురము జేసెడిది. సారభూతమగు అంతిమ ఉప దేశమును భిక్షుసంఘమున కొసగనిదె భగవానులవారు పరినిర్వాణము జెందరని యిప్పుడు నా హృదయమునకు ఊటట కల్గినది" అని ప్రేమవిహ్వలుడై విన్నవించెను.

"ఆనందా! ఇంకను భిక్షుసంఘము నా పై యేమని ఆశపెట్టుకొన్నది? లోపల వెలుపల నున్నదంతయు గ్రుమ్మరించి వారికి ఉపదేశించితిని. ఆచార్యముష్టిని మిగి లించుకోలేదు. గుప్తరహస్యములను దాచియుంచుకోలేదు. ఏ ఉద్దేశమున భిక్షు సంఘము సృష్టించబడినదో అందుకు వలయు సమగ్రసాధన సంపదనంతయు కూలంకషముగ బోధించితిని. అయ్యా! ఎనుబదియేండ్ల వయస్సు చెల్లినది. పాత బడిన కుక్కి బండివలె శరీరము యెట్లెట్లో ఆయుశ్శేషమును వెళ్ళద్రోయుచున్నది. ప్రయత్నపూర్వకముగ కాపాడుకొన్నచో (బాహ్యకర్మములందలి ఒత్తిడి లేక సమా హితచిత్తమున ప్రవర్తించినచో) తథాగతుని శరీరము మఱికొన్నినాళ్ళు లోకమున విహరించగలదు. ఆనందా! పదింబది నొక్కి నొక్కి చెప్పితిని. "ఆత్మ దీపాః భవథ ఆత్మశరణాః" మీ కండ్లతో మీరు చూడండి. మీ కాళ్ళతో మీరు నడవండి. పరావ లంబకులు, పరప్రత్యయనేయబుద్ధులు యేనాడును కావద్దు. ధర్మమే మిమ్ము రక్షింప గలదు. ధర్మప్రాణులు గండు."

అని యిట్లు ఆనందున కుపదేశించి సమీపమందుండు వైశాలీపురములోనికి భిక్షాచారమునకు వెళ్ళి భిక్షను గొనివచ్చి భుజించి ఆయుష్మంతుడగు ఆనందునితో కూడి భగవంతుడు పగటిపూట విహరించుటకై చాపాలచైత్యమునకు బోయెను. ఆ ప్రదేశమును చేరుకొని నెమ్మదిగ నొకచోట గూర్చొని ఆనందుని సంబోధించి యిట్ల నియె.

''ఆనందా! వైశాలీనగరము రమణీయమగు ప్రదేశము. దానినానుకొని యుండు ఉదయనచైత్యము, గౌతమకచైత్యము, సప్తామ్రకచైత్యము, బాహుపుత్రక చైత్యము, సారందదచైత్యము, చాపాలచైత్యము యివియన్నియు మరింత రమణీయ మగుచోట్లు. రాజగృహమందలి గృధ్రకూటము, కపిలవస్తువునందలి న్యగ్రోధారా మము, చోరప్రపాతము, వైభారగిరి ప్రాంతమందలి కాలశిల, సీతవనమునందలి సర్పశౌండికము, వేణువనములోని కలందకనివాపము, తపోదారామము, జీవ కామ్రవనము, మద్రకుక్షియు, మృగదావమును అత్యంత రమణీయములగు తావులు.

ఆనందా! మొదటినుండియు చెప్పుచునె వచ్చుచున్నాను. ఎంతప్రియమైన గారాబమైన, అపురూపమైన వస్తువులైనను ఒకానొకనాడు విడిచిపోవునవే. సర్వము నకు యెడబాటు తప్పనిసరి. తథాగతుడు పరినిర్వాణమును జెందుటకు మూడు నెలలు మాత్రమె వ్యవధియున్నది.

''ఆయుష్మంతా! మహావనకూటాగారశాలకు పోవుదము రమ్ము.''

పావనమూర్తి బుద్ధదేవుడు ఆనందునితో గూడి వైశాలియందలి మహావన కూటాగారశాలయందు జొచ్చి భిక్షుసంఘమునంతను సమావేశపఱచి యిట్లనియె.

''భిక్షువులారా! చిరశాశ్వతముగ ధర్మము నెలకొనునట్లు సదాచారమున దానికి మెఱుగుబెట్టండి. బహుజన హితార్థముగ, బహుజనసుఖార్థముగ ధర్మమును భావించండి. ధర్మమును సేవించండి. నా ఉపదేశరూపములైన స్మృతిప్రస్థానముల నాల్గింటిని, సమ్యక్ ప్రధానముల నాల్గింటిని, ఋద్ధిపాదముల నాల్గింటిని, పంచేం ద్రియములను, పంచబలములను, సప్తబోధ్యంగములను, ఆర్యాష్టాంగిక మార్గమును చక్కగ మననము జేయుడు. జ్ఞప్తి పెట్టుకొనుడు. కృత్రిమమంతయు కూలిపోవునదే. కృతకములన్నియు గతించునవే. కలుగునవన్నియు తొలగునవే. కూడునవన్నియు వీడునవే. ప్రమత్తులు గాక జీవితలక్ష్యమును సాధించుడు. మూడునెలలకు తథాగతుడు పరినిర్వాణము చెందగలడు.''

ఇట్ల నేకభంగుల భిక్షుసంఘమునకు వివిధ ధర్మోపదేశములు జేయుచు భగవంతుడు కడసారి వైశాలినగరమును పరికించిచూచి కుశీనారపురమునకు బోవు మార్గముబట్టి క్రమముగ భండగ్రామమును, ఆమ్రగ్రామమును, జంబూగ్రామమును గడచి భోగనగరమునకు విచ్చేసెను.

## భోగనగరమునందు

బుద్ధభగవంతుడు భోగనగరమును ప్రవేశించి అందలి ఆనందచైత్యమున విహరించుచు ఒకదినము భిక్షుసంఘము నుద్దేశించి యిట్లనియె.

''ఓ భిక్షువులారా! మీకు నాలుగు హెచ్చరికల నిచ్చుచున్నాను. సావధాన మనమున గుర్తించుకొనుడు.

నా అనంతరమున నెవడేని భిక్షువు ధర్మవిషయకమగు ప్రసంగము నెత్తుకొని 'దీనిని నేను స్వయముగ భగవంతుని నోటినుండి విని గ్రహించితిని. ఇదియె ధర్మ పద్ధతి. ఇదియె వినయ యపద్ధతి. బుద్ధుని మతముగూడ నిదియె' అనిచెప్పినచో ఆమాటను మీరు తటాలున నమ్మకుడు. తృణీకారముకూడ చేయకుడు. జాగ్రత్తతో అక్షరాల ఆ మాటను పరీక్షించి నేను చెప్పిన సూత్రమునకును వినయమునకును యెంతమాత్రము పొసగియున్నదో పోల్చి చూచుకొనుడు. అది సూత్రవినయము లకు సమన్వయమైయున్నచో నిజమునకు భగవంతుని వచనమెయనియు, భిక్షువు నిక్కమాడెననియు, ఆ పలుకు అవశ్యమాదరింపదగినదనియు తలంచండి. సూత్రవినయములతో దానికి పొత్తుకుదురనిచో అది భగవంతునకు మాన్యముగాద నియు భిక్షువు లెస్సగ గ్రహించలేదనియు, ఆ వచన మాదరణీయము గాదనియు తలంచుడు. ఇది మొదటి హెచ్చరిక.

భిక్షువెవ్వడైనను యేదేని ధర్మవిషయకమగు ప్రసంగము నెత్తుకొని 'ఫలాన చోట భిక్షుసంఘము చెప్పుచుండ నేనీ మాట వింటి' ననియు, 'ఇదియె ధర్మము, ఇదియె వినయము, ఇదియె బుద్ధునిమత'మనియు చెప్పినచో ఆ పలుకును మీరు వెంటనె నమ్మకుడు. నేను బోధించిన సూత్రవినయములతోడ నొఱిచిచూచి దాని నిక్కపు విలువను తెలుసుకొనుడు. ఇది రెండవ హెచ్చరిక. మఱియు ఎవ్వడైనను భిక్షువు యేదేని ధర్మవిషయకమగు ప్రసంగము నెత్తుకొని 'ఫలానా ప్రదేశమున యోగ్యుడగు నొకానొక భిక్షువు చెప్పుచుండ స్వయముగ దీనిని నేను వింటిని. ఇది ధర్మపద్ధతి. ఇది వినయపద్ధతి. ఇది బుద్ధుని మతముకూడ' అని చెప్పినచో ఆ పలు కును అమాంతమట్లె నమ్మకుడు. అవహేళనకూడ చేయకుడు. నేను తెలిపిన సూత్ర వినయములతో సరిపోల్చిచూచి గ్రహింపదగినది యవునొ కాదొ నిశ్చయించు కొనుడు. ఇది మూడవ హెచ్చరిక.

భిక్షువెవ్వడైనను యేదేని ధర్మవిషయకమగు ప్రసంగమును తీసికొని 'ఫలానా ప్రదేశమునందు బహుశాస్త్రజ్ఞుడు, వినయధరుడు, పరంపరాగతమగు ధర్మము నెఱిగినవాడు నగు వృద్ధస్థవిరుడొకడు చెప్పుచుండుట యీ వచనమును నేను స్వయ

ముగ వింటిని. ఇది ధర్మానుకూలము. ఇది వినయానుకూలము. ఇది బుద్ధశాసనము కూడ' అని చెప్పినచో ఆ మాట నట్లె మ్రింగకుడు. వెంటనె త్రోసిపుచ్చకుడు. నేను బోధించిన సూత్రమునకును వినయమునకును ఆ పలుకు లెంతమాత్రము పొసగి యున్నవో అక్షరాల పోల్చి చూచుకొనుడు. అది సూత్రవినయములకు పొందియు న్నచో భగవంతుని వచనమె యనియు భిక్షువు చక్కగ గ్రహించినాడనియు నిశ్చయిం చుడు. అటుగానిచో దానిని నిరాకరించుడు. ఇది నాల్గవ హెచ్చరిక.''

అని యిట్లు చతుర్విధ శిక్షణలను భగవంతుడు భిక్షువుల కనుశాసనము జేసెను.

## పావాయందు

భోగనగరమునందుండి కదలి మహాభిక్షుసంఘముతో భగవంతుడు బుద్ధుడు [1] పావానగరమునకుబోయి అందు కమ్మరివాడగు చుందునియొక్క మామిడి వనమున విహారము చేయుచుండెను.

భగవంతుడు తన ఆమ్రవనమునకు వచ్చియున్నాడని విని చుందకర్మార పుత్రుడు పరమానందముతో తన సౌభాగ్యమును కొండాడుకొనుచు సాదరముగ తథాగతుని చేరవచ్చి గోత్రనామము లుచ్చరించి దీర్ఘదండనమస్కారము లర్పించి యొకచో గూర్చొనెను. దయామయుడగు సుగతుడు వివిధ ధర్మోపదేశములచే చుందుని ఆనందతుందిలునిగ నొనర్చెను. అంతట చుందస్వర్ణ కారుడు భగవంతు నకుమ్రొక్కి ''దేవా! భిక్షుసంఘసహితముగ తాము రేపు నా యింటి భోజనమును గ్రహింపవలసినది.'' అని మనవి జేసికొనెను. బుద్ధుడును యెప్పటివలె మౌనభావ మున తన స్వీకారమును సూచించెను.

మఱునాడు మధ్యాహ్నము కాకముందె చీవరవేష్టితుడై భిక్షాపాత్రను చేతగొని భిక్షుసంఘసహితము మహానుభావుడు బుద్ధదేవుడు చుందుని యింటికి దయచేసెను. ఆ గృహస్థుడును పరమాదరముతో నెదుర్కొని ఉచితాసనముల నందఱిని గూర్చుండ బెట్టి వివిధ ఖాద్యభోజ్యములను [2] సూకర మద్దవమును వారికి వడ్డింపజేసెను. సూకరమద్దవమును తక్కినవారిని భుజింపవద్దని నిషేధించి భగవంతుడు తానొకడు

---

(1) ఉదానము 8. 5.

(2) అ. క. సూకరమద్దవము = శూకర మార్దవము. పిల్లయుగాక పెద్దయుగాక ఒక్కయేడు యీడుగల పందిమాంసమని కొందఱందరు. పంచగోరసములును బియ్యమును కలిపి వండిన ఒకానొక పాకమని కొందఱందురు. ఇదియొక రసాయన విధియనియు భగవంతుడు నిర్వాణమును బొందరాదను ఉద్దేశ్యముతో చుందుడు సిద్ధపఱచెననియు కొందఱందురు.

మాత్రమె భుజించెను. ఇట్లు భోజనములు జేసి ఆయాధర్మకథలచే చుందుని సంతుష్టుని జేసి తథాగతుడు ఆసనమునుండి లేచి యథాస్థానమున కరిగెను.

చుందుడు పెట్టిన ఆహారమును తినిన కొంతసేపటికి బుద్ధదేవునకు శరీరమున విపరీతమగు బాధ యుదయించినది. ప్రేవులు మెలివేయదొడగినవి. రక్తస్రావ మారంభ మైనది. మరణమె మేలనిపించెడి మహావేదనకు పాల్పడికూడ మహాపురుషుడు స్మృతి సంప్రజన్యయుక్తుడై శాంతితో విహరించుచు ఆనందుని జూచి యిట్లనియె.

''ఆనందా! లెమ్ము. [1] కుశీనారమునకు పోవుదము పద.'

''దేవా! మంచిది.''

భగవంతుడు కొంతదూరమరిగి దారికి వైదొలగి ప్రక్కనుండు ఒక చెట్టు క్రిందికి పోయెను. ఆనందుడును వెంటబోయెను.

''ఆనందా! ఆయాసమధికముగ నున్నది. కొంతసేపు గూర్చొందును. పైమీది శాటీవస్త్రమును నాల్గుమడతలు వేసి క్రింద బఱువుము.''.

ఆనందుడట్లే చేసెను. మహాప్రభు వాయాసనముపై గూర్చొనియున్నాడు. అంతలో ఆలారకాలాముని శిష్యుడు పుక్కసుడను మల్లపుత్రుడు ఆ దారియందు బోవుచు వృక్షతలమునగూర్చొనియున్న బుద్ధదేవుని జూచి సమీపించి అభివాదనములు జేసి యొకచో గూర్చొనెను. భగవంతుడు వివిధ ధర్మప్రసంగములను బోధించి వానిని సంతృప్తుని జేసెను. అంతట పుక్కసుడును భక్తివివశుడై ''దేవా! మీ ఉపాసక గణమునందు నన్నొక్కనిగ గ్రహింపదగు'' నని ప్రార్థించి శరణాగ మనములను బలికి నమస్కరించి తన దారిని పోయెను.

''ఆనందా! ఈనాటి రాత్రి కడజామునందు కుశీనారముయొక్క ఉపవత్తన సాలవనమునందు జంట టేకుచెట్ల మధ్య తథాగతుడు నిర్వాణమును ప్రాపింపగలడు. నాయనా! కకుత్సానదికి పోవుదము పద.''

అని వచించి భగవంతుడు తనతోడ ఆనందుడును మహాభిక్షుసంఘమును వచ్చుచుండ కకుత్సానదికి పోయి అందు మునిగి లేచి పరిశుద్ధజలముల స్నానము

(1) కుశీనారమునకున పావాకును ఆఱుక్రోసుల దూరము. ఈ మధ్యయందు యిరువది యైదు తావులందు కూర్చొని లేచి మహాసాహసముతో మధ్యాహ్నమునుండి సాయంకాలము వఱకు పయనించి భగవంతుడు కుశీనారమును జేరెను.

జేసి ఆవలిగట్టుననుండు ఆమ్రవనమును చేరుకొనెను. అంతట అనుచరభిక్షువై యుండు చుందకుడనువాడు వస్త్రమును పఱచి ఆసనము నేర్పఱచెను. భగవంతుడు దానిపై యడుగిడి కూర్చుండి మెల్లన కుడివైపు ఒత్తిగిలి సింహశయ్యపై (కాలిమీద కాలు వైచుకొని) పరుండెను. ఆయుష్మంతుడు ఆనందుడు దాపుననె ఉన్నాడు. ప్రియశిష్యుని బిలిచి నిజగురు డిట్లనియె.

''ఆనందా! స్వర్ణకారుడు చుందుడు నాకు భోజనమునిడి సంకట పడుచుండును గాబోలు. 'అయ్యో! నా భోజనమును భుజించి భగవంతుడు శరీరమును వదలెనుగదా! అకటా! నేనెంతటి దౌర్భాగ్యుడ' నని పరితాపము చెందుచుండును. పరులుగూడ అట్టి పరితాప మతనికి కల్గించుచుందురు. ఆనందా! మీదట నీవు అతని నిట్లు ఓదార్చవలెను. 'చుందా! నీ భాగ్యమె భాగ్యము. భగవంతుడారగించిన విందులలో రెండు సర్వోత్తమములు. మహాఫలయుతములు. మొదటిది అనుత్తర సమ్యక్ సంబోధికి కారణమైన సుజాత పెట్టిన భిక్ష. రెండవది అనుపాధిశేష మహా పరినిర్వాణమునకు దారి చూపినట్టి నీవిచ్చిన భోజనము. వీటికి సాటి మఱొకటి లేదు. ఇది బుద్ధదేవుడు నోటార జెప్పగ వినినమాట.' అని చుందుని ఓదార్చవలెను.''

అని యానతిచ్చి అటనుండి కదలి హిరణ్యవతీనదికి ఆవలతీరమున కుశీనార ప్రాంతమున మల్లక్షత్రియుల శాలవనమున ప్రవేశించి శాలవృక్షముల రెంటినడుమ ఉత్తరమువైపు తలగడ జేసి మంచమును వేయించి పడకను బఱపించి దానిపై భగవంతుడు పఱుండి ఆనందునితో నిట్లనియె.

''ఆనందా! శ్రద్ధావంతుడగు బుద్ధశిష్యునకు దర్శనీయములగు పవిత్రస్థానములు నాలుగు. 1. తథాగతుడు జన్మించిన లుంబినీవనము. 2. తథాగతుడు జ్ఞానసిద్ధినిబొందిన బుద్ధగయ. 3. తథాగతుడు మొట్టమొదట ధర్మచక్రమును సాగించిన సారనాథము. 4. తథాగతుడు పరినిర్వాణము చెందిన కుశీనగరము. ఈనాల్గు ప్రదేశములును శ్రద్ధాలువులగు కులపుత్రులకు దర్శనీయములు. భవిష్యత్తునందు శ్రద్ధాలురగు భిక్షు భిక్షుణీ ఉపాసక ఉపాసికలు ఈ స్థానములను దర్శించి ఆరాధింతురు.'

అంతట ఆనందు డిట్లడిగెను.

''దేవా! స్త్రీలయెడ మేమెట్లు ప్రవర్తింపవలెను?'

''అదర్శనము. మీరు వారిని చూడరాదు.''

''చూడవలసివచ్చినచో?''

''అనాలాపనము. మాట్లడరాదు.''

''తప్పనిసరి మాట్లాడవలసినచో?''

''స్మారకము చెడకుండ, ప్రజ్ఞను తెలివిని కుదటబెట్టుకొని మాట్లాడునది.''

''స్వామీ! తథాగతుని శరీరముపట్ల మేమెట్టి ఆదరము చూపవలెను?''

''ఆనందా! జడమగు శరీరపూజలె సర్వస్వమని తలంచకుడు. సత్యవస్తువునకై పాటుపడండి. ప్రమత్తులుగాక ఆత్మసంయములై తథాగతుని ధర్మసౌధమునకు ఆధార స్తంభములు కండు. పరమానురక్తితో తథాగతుని శరీరమును సత్కరించుటకు పూజించుటకు గృహస్థభక్తులు యెందఱో గలరు.''

''గురుదేవా! దేవరవారి శరీరసంస్కార మెట్లు చేయవలెను?

''ఆనందా! చక్రవర్తి శరీరమునువలె మొదట నూతనవస్త్రముతో చుట్టవలెను. ఆ పైన మెత్తనిదూదితో చుట్టవలెను. వెండియు వస్త్రముతోడను మఱియు దూదితోడను చుట్టవలెను. అంతట నూనెతో నింపిన పెట్టెయందుంచి భద్రముగ మూసి వివిధ సుగంధ కాష్ఠములతో చితిని బేర్చి దానిపై శరీరమును దహింపజేయవలెను. అస్థి శేషములను సేకరించి నాలుగు మార్గములు కలియు చోటులందు స్తూపము (సమాధు) లను నిర్మింపవలెను.''

అని బుద్ధదేవు డుగ్గడించుచుండ ఆ కరుణాస్వరూపుని చిర శాశ్వత విరహమును భరింపలేక ఆనందుని చిత్తము తత్తఱపడినది. పరితాపమును నిబ్బరించుకోలేక అతడు ప్రక్కకుబోయి చెట్టునొక్క దాని గఱచుకొని ''కటకటా! ఇంకను మేమెంతయో నేర్వదగినది యుండగనె కృపామయుడగు సద్గురుడు దిగవిడిచి పోవుచున్నాడే'' యని వెక్కి వెక్కి యేడ్చుచుండెను. ఆనందుడు కానరాకపోవుడు కారణమడిగి తెలసికొని భగవంతుడు 'ఆనందా!' యని బిగ్గఱగ బిలిచి చేరదీసి చేయిపట్టుకొని యిట్లనియె. ''పిచ్చివాడా! యేడ్చెద వెందుకొఱకు? ఎంతటిప్రియవస్తువునకైనను యెడబాటు తప్పదు. 'అయ్యో! యెడబాసిపోయెనే' యని మిడుకుట అజ్ఞానమునకు ఆనవాలు. పుట్టునది గిట్టకపోవునా? దానికై శోకమెందుకు? నాయనా! చిరకాలము తథాగతునకు త్రికరణపూర్వకముగ సేవాశుశ్రూషలు జేసితివి. కృతపుణ్యుడవు. కృతార్థుడవు. భిడ్డా! చిత్తమలముల నెడబాసి సత్వరముగ ఉత్తమ జ్ఞానలాభమును బొందుము. దుఃఖింపకుము.'' అని సమాధానపఱచెను.

అంతట కొంతవడికి భగవంతునితో ఆనందు డిట్లనియె.

''స్వామీ! అడవికొంపయగు యీకుశీనారగ్రామమున తాము పరినిర్వాణము జెందుట నా కేమియు నచ్చలేదు. అందుకు యోగ్యమగుమహానగర ములు చంపా, రాజగృహము, శ్రావస్తి, సాకేతము, కౌశాంబి, వారాణసి మొదలగున వెన్నియొ గలవు. వాటియందు తమకు గృహస్థభక్తులగు మహాధనవంతులు మహా సమర్థు లెందఱెందఱొ యున్నారు. వారు యథేష్టముగ తమ శరీరపూజల నిర్వర్తింపగలరు.''

''ఆనందా! అట్లనకుము. దీని పూర్వచరిత్ర గౌరవనీయమైనది. ఈ నగరమును తొల్లి యొకప్పుడు మహారాజు సుదర్శనుడనువాడు పాలించుచుండెను. కుశావతి యనుపేర అప్పుడతనికి రాజధానియై యొప్పియుండినది. ఆయుష్మంతా! పురములోనికి పోయి పౌరులందఱితో నేటిరాత్రి కడజామునందు ఊరివెలుపలి సాలవనమున బుద్ధుడు పరినిర్వాణమును జెందుననియు, పైన చింతించిన ఫలము లేదు. కాన వలయువారు ముందుగనె వచ్చి సందర్శింపదగుననియు చెప్పిరమ్ము.''

ఆజ్ఞ యని పలికి ఆనందుడు ఒంటరిగ కుశీనారమును ప్రవేశించెను. అందు వసించువారు వసిష్ఠగోత్రులగు మల్లక్షత్రియులు. ఏదో కార్యావసరమున వారందఱును సంస్థాగారమున సమావేశమైయుండిరి. అట్టియెడ ఆనందుడు బోయి భగవంతుడు చెప్పి పంపిన వర్తమానమును తెలియజేసెను.

ఆనందుడు చెప్పిన వార్త పురమంతటను విద్యుద్వేగమున వ్యాపించి పౌరజనమునంతటిని కలగుండు పెట్టినది. పిల్లలు పెద్దలు – స్త్రీలు పురుషులు మల్లక్షత్రియులందఱును పెన్నిధిని గోల్పోయినట్లు గొల్లున వాపోవుచు 'ధర్మసూర్యుడస్తమించును. లోకచక్షువంతర్ధానము కాగలడు. పదండు' పదండు అని యొకరి నొకరు త్రోసికొనుచు శాలవనమున కరుదెంచిరి.

ఆనందుడిట్లు వితర్కించెను. 'వీరందఱును ఒక్కొక్కరు విడివిడిగ భగవంతునకు నమస్కరించుచు బోయిన యీ రాత్రియంతయైనను చాలదు. ఒక్కొక్క గుంపును ఒక్కొక్కసారి వందనములు జేయింతు' నని తలంచి, 'భగవంతా! ఫలానా పేరుగల మల్లక్షత్రియుడు తన గణముతో నమస్కరించుచున్నాడు' అని చెప్పుచు ఆ రాత్రియందలి మొదటిజాములోపలనే వారి దర్శనముల నంతటిని ముగించెను.

ఆ సమయమున కుసీనారమునందు సుభద్రుడను పరివ్రాజకుడొకడు నివసించుచుండెను. నేటి కడజామునందు శ్రమణగౌతముడు పరినిర్వృతుడు కాగలడను

వార్త ఆతని చెవిని బడినది. ''పూర్వీకులగు ఆచార్యులు పెద్దలు అర్హతులగు సమ్యక్ సంబుద్ధుల జన్మము మఱింత అఱుదుగ గల్గునని చెప్పగ విని యుంటిని. ఈ రాత్రి గడచిన నిక గౌతమశ్రమణుని దర్శనముండబోదు. అవకాశము జాఱకముందే పోయి నమస్కరించి అమ్మహానుభావుని మూలమున ధర్మశ్రవణము జేసి ధన్యుడ నౌదును గాక'' యని తలంచి సుభద్రపరివ్రాజకుడు సాలవనమును ప్రవేశించి ఆనందునితో బుద్ధభగవంతుని దర్శనమును చేయింపుమని కోరెను. ఆనందు డిట్లనియె.

''ఆయుష్మంతా! సుభద్రా! భగవంతుడు అలసి సొలసి పరినిర్వాణశయ్యపై నున్నాడు. ఆయనకు ఆయాసమును కల్పింపకుము.''

సుభద్రుడు మఱియు మఱియు ప్రార్థించెను. ఆనందుడును ముమ్మాఱు నిషేధించెను. ఆ సందడి యొక్కింత జాడపట్టి భగవంతుడు ఆనందుని బిలిచి ''ఆనందా! సుభద్రుని కోరికను నిరాకరించెదవేల? ఇది తథాగతుని అంతిమ దర్శనముగదా? అతండడుగ దగినది అడుగనిమ్ము. నన్నాయాస పెట్టవలెనని అతనికి ప్రొక్కుబడి యున్నదా? పొమ్ము. నాకడకు పంపుము'' అని యాదేశించెను.

సుభద్ర పరివ్రాజకుడు భగవంతుని చెంతకు వచ్చి సమ్మోదన మొనర్చి యొకచో గూర్చొని యిట్లనియె.

''గౌతమా! ప్రసిద్ధగణాచార్యులు పూర్ణకాశ్యపుడు, మస్కరీ గోశాలుడు, అజిత కేశకంబలుడు, ప్రకృధకాత్యాయనుడు, సంజయవేలట్ఠిపుత్రుడు, నిర్గ్రంథజ్ఞాతృపుత్రుడు ననువారు పలువురు గలరు. వీరందఱును యెఱుగదగిన విషయమును చక్కగ నెఱుగ గలిగిరా? లేదా కొందఱైనను గ్రహింపగల్గిరా? ఎవ్వరును గ్రహింపనెలేదా?''

★ సుభద్రా! అవ్యర్థమైన చర్చలతో పనియేమి? సత్యధర్మము నుపదేశించెదను. సావధానచిత్తమున వినుము.''

''భగవంతా! మంచిది.''

''సుభద్రా! ఏధర్మమునందు ఆర్యాష్టాంగికమార్గ విధానము లేదో ఆ ధర్మమున ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ శ్రేణులకు చెందిన స్రోతాపత్తి, సకృదాగామిత్వ, అనాగామిత్వ, అర్హత్వము లనెడి శ్రమణజీవనములు లేవు. ఆ ధర్మము

★ మొదటి జామునందు మల్లురకు దర్శనమిచ్చి, మధ్యమయామమున సుభద్రునకుపదేశించి, కడజామున భిక్షులకు ధర్మబోధచేసి భగవంతుడు వేకువవేళ పరినిర్వృతు డగును.

వెదురుబొంగువలె శూన్యగర్భమైనది. అందుచే భిక్షువగువాడు యోగ్యమగు ధర్మ మార్గమును బట్టివిహరింపవలెను. ధరాతల మేనాడును అర్హతులతో గొడ్డుపోరాదు. ఉపదేశ మిచ్చుటకు నిజమైన అధికారి అర్హతుడే.

సుభద్రుడా! ఇరవైతొమ్మిదేండ్ల యీడువాడనై యున్నప్పుడు ప్రవ్రజించితిని. ఆ పైన ధర్మము నన్వేషించుచు యేబదియొక్క సంవత్సరము సమాధిని ప్రజ్ఞను సమకూర్చి యనుష్ఠించితిని. ఈ నా ధర్మమును అనుశీలన మొనర్చనవాడు వాస్తవము నకు శ్రమణుడు కాబోడు. శ్రమణధర్మమనునది దీనికంటె వేఱుగ నెందును లేదు.''

భగవంతుని ధర్మోపదేశమును విని సుభద్రు డంజలి జోడించి ''భగవంతా! దేవరవారి శ్రీముఖమునుండి ధర్మామృతమును పానము జేసి జ్ఞానలాభమును బొందితిని. బుద్ధుని శరణుజొచ్చుచున్నాను. ధర్మమును శరణుజొచ్చుచున్నాను. సంఘమును శరణు జొచ్చుచున్నాను. నాకు ప్రవ్రజ్యను ఉపసంపదను దయ చేయుడు'' అని విన్నవించెను. అంతట భగవంతు డిట్లనియె. ''సుభద్రా! ఇతర ధర్మమునందు ప్రవర్తించెడి వ్యక్తి నా యీ ధర్మమునందు ప్రవ్రజ్యను, ఉపసంపదను అభిలషించినచో నాలుగు నెలలవఱకు పరీక్షించినగాని వానిని చేర్చుకొన వీలుం డదు.''

''దేవా! నాలుగునెలలేమిటి? నాలుగేండ్లయినను శిక్షాధీనుడనై పరీక్షకు నిలుచుటకు సిద్ధమైయున్నాను.''

''సుభద్రా! సాధు సాధు.'' అని ప్రశంసించి బుద్ధదేవు డానందుని బిలిచి ''ఆనందా! సుభద్రునకు ప్రవ్రజ్యను ఉపసంపదను ఒసంగు''మని ఆదేశించెను. ఆనందుడును అటులనె సుభద్రుని శిష్యత్వపదమున నభిషిక్తుని జేసెను. ఇట్లు బుద్ధదేవుని సన్నిధానమున ఉపసంపన్నుడై సుభద్రు డచిరకాలమున నర్హతులం దొకడయ్యెను. అతడె భగవంతుని యంతిమ శిష్యుడు.

తదనంతరము సుగతదేవుడు ఆనందుని సంబోధించి ''ఓ ఆనందా! నా శరీరముతో బాటు నా ధర్మోపదేశములకు నీళ్ళువదలకుడు. గురుడు గతించినాడు. ఆయనతోడ నతని ధర్మముగూడ గతించినదని తలంతురు గాబోలు. నా పిదప నా ధర్మమె మీకు గురువు. శాస్తలేడని చింతింపకుడు. నా ప్రతినిధిగ నా ధర్మవినయముల నాదరింపుడు. ఆనందా! 1. ఇంతవఱకు భిక్షువు లొకరినొకరు 'ఆయుష్మంతా' యని పిలుచుకొనుచున్నారు. 2. నాయనంతరము అట్లు వ్యవహారిం

చుట తగదు. ముందుగ ఉపసంపన్నుడైన ప్రాచీనభిక్షువు నవీనభిక్షువును పేరుగొని యైనను, గోత్రనామమునన్నైనను, 'ఆయుష్మంతా!' యని యైనను పిలువ వచ్చును.. వెనుక నుపసంపన్నుడైన నవీనభిక్షువు ప్రాచీనభిక్షువును 'భంతే' యని సంబోధించ వలెను. 3. ఆనందా! నేను పరినిర్వాణము జెందిన పిదప అవసరమైనచో భిక్షుసంఘము చిన్నచిన్న శిక్షానియమములను ద్రోసిపుచ్చవచ్చును. 4. మరియు నానందా! ఛందుడను భిక్షువునకు నేను గతించినమీదట బ్రహ్మదండమును విధింపుడు.''

''భగవంతా! బ్రహ్మదండమన నేమి?''

''ఆనందా! ఛందభిక్షువు తన యిష్టానుసారము మాట్లాడవచ్చును. భిక్షువు లెవ్వరును వానితో సంభాషింపకుడు. సలహా నివ్వకుడు.'' అని ఆనందునితో ముచ్చటించి భిక్షువులనందఱిని ఎలుగెత్తి పిలిచి ''ఓ భిక్షువులారా! బుద్ధుని గుఱించి ధర్మమునుగూర్చి సంఘమును సంబంధించి యేమైన సందేహములు శంకలున్నచో యిప్పుడే అడిగి తెలిసికొనుడు. మీదట వగచిన లాభము లేదు.'' అని భగవంతు డానతిచ్చెను.

భిక్షువు లందఱును మౌనమున నున్నారు. భగవంతుడు ముమ్మాఱు అట్లు పలికి వెండియు నిట్లనియె.

''ఆయుష్మంతులారా! సమస్తమును నశించునదె. సావధానులై జీవితలక్ష్య మును సాధించుకొనుడు.''

అని చివరిమాట బలికి బుద్ధదేవుడు ప్రథమధ్యానమును ప్రవేశించెను. అచ్చటి నుండి ద్వితీయధ్యానమున ప్రవేశించెను. దానిని దాటి తృతీయధ్యానమున జేరెను. ఆచోటు నతిక్రమించి చతుర్థధ్యానమున ప్రవేశించెను. ఆస్థితినుత్తరించి ఆకాశానంత్యా యతనమును బొందెను. అట్లే క్రమముగ విజ్ఞానానంత్యాయతనమును, ఆకించ న్యాయతనమును, నైవసంజ్ఞానాసంజ్ఞాయతనమును, సంజ్ఞావేదయిత్ర నిరోధ మును పొంది యుండెను.

ఆనందుడు అనురుద్ధునితో ''అనురుద్ధా! భగవంతుడు పరినిర్వాణమును చెందినాడా?'' అని యడిగెను.

''ఆనందా! ఇంకను పరినిర్వాణమును చెందలేదు. సంజ్ఞావేదయిత్ర నిరోధ మును ప్రాపించినాడు.'' అని అనురుద్ధుడు సమాధాన మిచ్చెను.

వెండియు భగవంతుడు సంజ్ఞావేదయిత్రు నిరోధమునుండి నైవసంజ్ఞా నాసంజ్ఞాయతనమును, అచ్చటినుండి ఆకించన్యాయతనమును, అటనుండి విజ్ఞానానంత్యాయతనమును, ఆకాశానంత్యాయతనమును, చతుర్ధధ్యానమును, తృతీయధ్యానమును, ద్వితీయధ్యాయమును, ప్రథమధ్యానమును పొంది తిరిగి మరియు ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ ధ్యానములను ప్రాపించి పరినిర్వాణమును జెందెను.

ఇట్లు పరమకారుణికుడు జగద్గురుడు మహామానవుడు యిహలీలను జాలించి పరినిర్వాణము జెందినంతనె విరాగశీలురగు భిక్షువులు 'సర్వ మనిత్యము గదే' యని భావనజేయుచు సంతాపమును సంభాళించుకొనిరి. నిబ్బరించుకొనలేని భిక్షువులు 'హో' యని చేతులెత్తి ఆక్రందించుచు నేలపై బడి పొరల్లాడుచు మిగుల వేదన జెందిరి. అనురుద్ధుడు వారినందఱ నూఱడించి ఆనందునితో నిట్లనియె.

''ఆనందా! కుశీనగరమును ప్రవేశించి భగవంతుడు పరినిర్వాణము చెందినాడను వార్తను మల్లురకు తెలిపిరమ్ము.''

ఆ మాటకియ్యకొని ఆనందుడు పాత్రచీవరములను ధరించి యొంటరిగ కుశినారమును ప్రవేశించెను. మల్లక్షత్రియులును మంత్రణాగృహమునందు ప్రోవై యుండిరి. ఆయుష్మంతుడు ఆనందుటచ్చోటికరిగి ''వసిష్ఠగోత్రులరగు మల్లులారా! బుద్ధదేవుడు దేహమును త్యజించి మహానిర్వాణమును పొందినాడు. మీకు యోగ్యమగు కార్యములు జేయుడు.'' అని వచించెను. ఆ వార్త మాట మాటలోనే ఊరంతయు ప్రాకిపోయినది. మల్లురు, మల్లయువకులు, మల్లస్త్రీలు, మల్లకన్యలు మొత్తము పురమంతయు శోకనాదములచే నిండిపోయినది. 'అక్కటకటా! లోకబాంధవు డస్తమించెనే? ఇక మాకు ధర్మజ్యోతిని చూపువారెవరు? ఆ దయను, ఆ శాంతమును, ఆ ప్రేమను మే మెచ్చట పొందగలము? దిక్కు లేనివారమైతిమే' యని ఆబాలగోపాల మల్లాడి పోయినది.

కొంతసేపటికి అందఱును ధైర్యమును దెచ్చుకొని వివిధ వాద్యములతో గంధమాల్యాదికములతో ★ ఉపవత్తనసాలవనమున కరుగుదెంచి భగవంతుని శరీరమును వివిధోపచారములచేత పూజించిరి. వారి పూజాపురస్కారములతో ఆనాడంతయు నట్లే గడచినది. మఱునాడు దహింతము లెమ్మనుకొనిరి. మఱు నాడును అట్లే నడచినది. దేవతాసంకల్పమున ఆఱుదినము లట్లే గడచినవి. ఏడవనాడు శరీరమును

★ ప్రస్తుతము 'మాథాకురవసము' గోరఖ్‌పూర్ జిల్లా.

నగరమునకు వెలివెలిగనె గొంపోయి దక్షిణభాగమున దహన క్రియ జరుపవలెనని నిశ్చయించి మల్లనాయకు లెనిమిదిమంది తలకు జలకమాడి బుద్ధదేవుని దేహమును భుజములపై నెత్తుకొనుటకు సమీపించి వచ్చి ప్రయత్నించిరి. మహాబలవంతు లెనిమిదిమంది పూని యెత్తినను ఆ శరీరము కదలలేదు. అందఱును విభ్రాంతులై అనురుద్ధునితో కారణమేమని ప్రశ్నించిరి.

''వాసిష్ఠులారా! దేవతల సంకల్ప మిందుకు భిన్నముగ నున్నది.''

స్వామీ! అనురుద్ధా! అదియెట్లు?''

''వాసిష్ఠులారా! ఊరికి బైటబైటను గొంపోయి దక్షిణదిశయందు శరీరమును దహించవలెనని మీరు తలంచియున్నారు. గంధమాల్యపుష్ప వాద్యములతో నగరమున కుత్తరముత్తరముగ కొంపోయి ఉత్తరద్వారముగుండా పురములోనికి ప్రవేశించి పుర మధ్యమునుండి తూరుపుగవని జొచ్చి బైటికి వచ్చి నగరమునకు తూరుపు దిశ యందు మల్లుర దేవమందిరమగు ముకుటబంధనమున భగవంతుని శరీరమును దహించవలెనని దేవతల యభిప్రాయమైయున్నది.''

''స్వామీ! అట్లే నెరవేరుగాక.''

ఆకాశమునుండి ముమ్మరముగ కురిసిన మందారకుసుమవృష్టితో కుశీనార మందంతట పిక్కలబంటితో నిండి తాండవించినది. కొట్టి కోలాహలముగ మల్ల వీరులు నృత్యవాద్యములతో గూడి భగవంతుని శరీరమును మూపుపై బెట్టుకొని నగరమునకు ఉత్తరమువైపున వెళ్ళి క్రమముగ ముకుటబంధచైత్యమునకు గొంపోయి అందు బుద్ధదేవుని దేహమును దింపిరి.

తదుపరి మల్లక్షత్రియులు ఆనందునితో సంప్రదించి తథాగతుని శరీరమును దూదితోడను, క్రొత్తగుడ్డలతోడను అనేక పర్యాయములు చుట్టి రాజయోగ్య సత్కా రమున సుగంధ కాష్ఠభరితమై యుండు చితిపై బెట్టిరి.

ఇది యిట్లుండ మహాకాశ్యపుడు యేనూర్వురు భిక్షుసంఘముతో గూడి పావానగరమునుండి కుశీనారమునకు వచ్చుచు దారి ప్రక్క నొకచెట్టుక్రింద కూర్చొని యుండెను. అంతలో ఆజీవక సంప్రదాయకు డగు నొక వ్యక్తి కుశీనారమునుండి అచ్చోటికి వచ్చెను. అతనిచేత నొక మందారపుష్పము సైత ముండినది. ఆయుష్మం తుడు మహాకాశ్యపుడు వానింజూచి 'అయ్యా! మా ఆచార్యుడగు బుద్ధదేవుని విష యము నీ కేమైన దెలియునా?' అని ప్రశ్నించెను. అంతట నాతండును 'ఆయు ష్మంతా! తెలియును. శ్రమణగౌతముడు నేటికి యేడుదినముల క్రిందట పరినిర్వా ణము చెందినాడు. ఇదిగో! నా చేతిలో నుండు మందారపుష్ప మాచోటినుండి తెచ్చి నదే' యని మారువచించెను.

ఆ మాటను విని భిక్షుసంఘమంతయు గొల్లున వాపోయినది. ముసలితనమున ప్రవ్రజ్యను బొంది వారిలో నొకడై యుండెడి సుభద్రుడను భిక్షువు తోడి భిక్షువులను జూచి 'ఆయుష్మంతులారా! పలవింపకుడు. మన చిక్కు లూడినవి. మహాశ్రమణు డున్నంతకు నానా కట్టుబాట్లతో నలిగిపోయితిమి. ఇక హాయిగ యథేష్టముగ మీరు మీరు చెలగుడు – మెలగుడ' ని విడ్డూరమగు పల్కు బల్కెను.

అంతట మహాకాశ్యపు డందఱిని శాంతింపజేసి వారితోడ గూడి కుశీనగరమునకు వచ్చుచుండెను. ఇచ్చట కుశీనారమునందు మల్లురు చితిపై నుంచిన భగవంతుని శరీరమును దహించవలెనని యెంత ప్రయత్నించినను అగ్ని ప్రజ్వాలింప లేదు. దానిం గాంచి అనురుద్ధు డిట్లనియె.

''వాసిష్ఠులారా! దేవతాసంకల్ప మన్యథా యున్నది. ఆయుష్మంతుడు మహాకాశ్యపుడు వచ్చుచున్నాడు. ఆయన వచ్చునంతకు మీ రెంత ప్రయత్నించినను చితి రగుల్కొనదు.''

అని అనురుద్ధుడు చెప్పుచుండగనే మహాకాశ్యపుడు తన యేనూర్వురు భిక్షుసంఘముతో భగవంతుని దేహమునకు దహన సంస్కారమును జరుపబడుచున్న ముకుటబంధన చైత్యమును చేరవచ్చెను. సొదపై జేర్చబడియున్న భగవంతుని భౌతిక శరీరమును దర్శించి ముమ్మాఱు ప్రదక్షిణము జేసి పాదమూలమును జేరి అంజలి ఘటించి శిరసావందనములర్పించెను. భిక్షుసంఘము కూడ తమ ప్రణామముల నర్పించుకొనిరి. అంతట చితి భగ్గున మండినది. ఎముకలు దప్ప శరీరమున మరేమియు మిగిలియుండలేదు. తైలమువలె నిరవశేషముగ దహించిపోవుటచే బొగ్గును లేదు బూడిదయు లేదు. అస్థులు మాత్రము శేషించినవి. దేహమంతయు సంపూర్ణముగ దగ్ధమైనంతనే ఆకసమున మేఘమావిర్భవించి చితిని చల్లార్చినది. మల్లురు కూడ సుగంధజలముల చితానలమును శాంతము జేసిరి.

అనంతరము కుశీనగర మల్లక్షత్రియులు, భగవంతుని యస్థుల నేరి యొక కలశమున నుంచి ఆ కలశమును మహోత్సవముతో ప్రజాతంత్ర సభాగృహమున జేర్పించి ధనుర్బాణధారులగు మహావీరుల పలువుర దానికి కావలినుంచిరి. వివిధ పూజా సత్కారములు ఆ కలశమునకు దినదినమును నడచుచుండెను.

బుద్ధదేవుడు పరినిర్వాణమును చెందినాడను వార్త నాల్గు మూలలను వ్యాపించినది. మగధరాజు అజాతశత్రుడు, వైశాలియొక్క వజ్జియులు, కపిలవస్తువాస్తవ్యులు శాక్యక్షత్రియులు, అల్లకప్పమునందలి బూలియరాజులు, రామగ్రామ వాసులు కోలియులు, పావానాగరకులు, మల్ల గణములును తమతమ దూతలను కుశీనారము

నకు బంపి ''బుద్ధభగవంతుడు క్షత్రియుడు. మేమును క్షత్రియులము. అవశ్యము మాకు అస్థిభాగమిచ్చి పంపవలసిన'' దని ఆగ్రహపూర్వముగ నాజ్ఞను చెప్పి బుత్తెంచిరి. బేఠద్వీపవాసులగు బ్రాహ్మణులును తాము బుద్ధునియందు శ్రద్ధా గౌరవములు గలవారమనియు, అస్థిభాగము తమకును బంపవలెననియు దూతముఖమున వర్తమానమంపిరి.

''భగవంతుడు మాగ్రామప్రాంతమున – మాపొలిమేరయందు పరినిర్వృతుడైనాడు. అస్థిభాగ మితరుల కివ్వవలనుగాద'' ని మల్లురు బదులు చెప్పి పుత్తెంచిరి. ఆ విషయమును పురస్కరించుకొని రాజలోకమున కల్లోలములు చెలరేగుట నాశంకించుకొని బుద్ధభగవంతునకు ప్రగాఢ భక్తుడగు ద్రోణుడను బ్రాహ్మణుడు మధ్యవర్తిత్వమును కల్పించుకొని క్షత్రియగణముల నందఱను సమావేశపఱచి యిట్లనెను.

మ. వినుడో క్షత్రియులార! నా పలుకు వైవిధ్యంబు మానుండు శాం
తినె యెల్లప్పుడు గోరు బుద్ధునకు నంతేవాసులై గూడ నా
యనఘుండేగినమీద నాతని శరీరాంశంబె వ్యాజ్యంబుగా
జనునే కయ్యములాడ, దీననగునే సద్ధర్మసంధానముల్.

అని యందఱిని దేర్చి సమాధానముజేసి అస్థిసమూహమును యెనిమిది భాగములుగ జేసి ద్రోణబ్రాహ్మణుడు కుశీనగరపౌరులకును, పావా వాసులకును, వైశాలి లిచ్ఛవీలకును, ★ అజాతశత్రునకును, కపిలవస్తు శాక్యులకును, రామగ్రామ కోలియులకును, అల్లకప్ప వాసులగు బులియరాజులకును, బేఠద్వీపబ్రాహ్మణుల

---

★ అ. క. కుశీనారమునుండి రాజగృహము యిరువదియైదు యోజనములు. కుశీనార మందలి సంస్థాగారమునుండి భగవంతుని పవిత్రాస్థిభాగమునుగొని అజాతశత్రుడు దారిపొడువునను నృత్యగీతవాద్యములతో నిత్యపూజాసపర్యలతో మహావైభవముగ రాజగృహపురము చేరుసరకి యేడేండ్లు యేడునెలలు యేడుదినములైనది. నగరమునుజేర స్తూపము (సమాధి)ను నిర్మించి పూజలు చేయించెను.

కొన్నాళ్ళకు ఆ అస్థిధాతువులు చెడిపోగలవని యూహించి మహాకాశ్యపస్థవిరుడు రామగ్రామమునందలివి తప్ప తక్కిన యేడుతావులందలి అస్థిసమూహమును ప్రోవుజేసి యెవ్వరికి తెలియకుండ రహస్యముగ అజాతశత్రుని సహాయముతో లోహపేటికలయందు వాటిని భద్రపఱచి రాజగృహపురముయొక్క అగ్నేయభాగమున భూమియందు యెనుబదిచేతుల లోతులో ప్రతిష్ఠింపించెను. దేవరాజగు శక్రుడు దానిని రక్షించుటకై దేవసైన్యమును నియమించెను. భవిష్యత్తునందు ధర్మమూర్తియగు అశోకుడను రాజు యీ ధాతు నిధానమును వెలికిదీసి జంబూద్వీపము నంతటను విస్తరింపజేయ గలడని దివ్యజ్ఞానయుతుడగు మహాకాశ్యపుడు స్వర్ణఫలకముపై శాసనమును లిఖింపజేసెను.

తదనంతరము అజాతశత్రుడును, మహాకాశ్యపుడును కాలగర్భమున జీర్ణించిరి.

కును సమముగ నొక్కొక్కభాగమును పంచియిచ్చి అస్థులను ఉంచియుంచిన కలశ మును తన భాగమునకు గైకొనెను.

తదనంతరము పిప్పలీవనముయొక్క మౌర్యరాజులు భగవంతుని శరీరాంశ మును తాము అభిలషించి కుశీనారమునకు వచ్చిరి. అప్పటికే పంపకము ముగిసి యుండుటచే చితియందలి బొగ్గును కొంతసమకూర్చి వారికిచ్చి ద్రోణబ్రాహ్మణుడు సమాధానము జేసి పంపెను.

అస్థులను గొంపోయి వారు వారు తమ తమ నగరములందు స్తూపములను (సమాధులను) నిర్మించిరి. ఇట్లు అస్థిస్తూపము లెనిమిదియు, అంగార(బొగ్గు) స్తూపమొక్కటియు, కుంభస్తూపము నొక్కటియునై యొప్పినవి. రామగ్రామము నందలి అస్థిధాతువులు కాలాంతరమున లంకాద్వీపము జేరి నాగగణముచే పూజింప బడుచుండినవి.

## ౧౧

## ప్రథమసంగీతి (వి. పూ. 426)

మహాకాశ్యపస్థవిరుని శిష్యసంఘములో నొకడు సుభద్రకుడను భిక్షువు బుద్ధుని పరినిర్వాణమునకు హర్షమును ప్రకటించుచు భిక్షువులకు స్వేచ్ఛాచారిత్వ మునకు సూచన నిచ్చుటను గత చరిత్రలో చదివితిమి. ఆ ప్రసంగము మహాకాశ్యపు నకు హృదయమున శల్యమై గ్రుచ్చుకొనియెయున్నది. ★ అతండొకనాడు భిక్షువులను సంబోధించి ''ఆయుష్మంతులారా! మన యెట్టయెదుటనే అనాచారము ప్రబలి అధర్మము పైకొనుట యెంతయు నోర్వలేని విషయము. యోగ్యులగు స్థవిర భిక్షువులను సమావేశపఱచి ధర్మమును వినయమును సంగాయనము జేయుదుము'' అని ఆనతిచ్చి అందుకు దగిన వారుగ అర్హతులైనవారిని ఒక్కరుదక్కువ యేనూర్వు రను యేర్చి సూచించెను.

అంతట భిక్షువు లిట్లనిరి. ''స్వామీ! మీరు ఆనందుని గ్రహించలేదు. అతడు అర్హత పదవిని పొందక పోయినను రాగ ద్వేషమోహభయ దుర్గుణములకు దూరుడు. ధర్మవినయ పరిజ్ఞానమాయనకు మెండు. సాక్షాత్తు భగవంతునినుండియె ధర్మము లను గ్రహించినవాడు. కావున ఆనందునిగూడ మీలెక్కలోనికి చేర్చుకొనుడు.''

★ చుల్లవగ్గ 11.

ఆనందునితో కలిసి నిర్వాచితు లేనూర్వురైరి. ధర్మవినయ సంగాయనము (అందఱును కలిసి పాడుట - నిశ్చయించుట) నకు రాజగృహపురమె తగిన తావని నిశ్చయమునకు వచ్చినది. అంతట మహాకాశ్యపుడు సంఘమున కిట్లు సూచన నిచ్చెను.

''ఆయుష్మంతులారా! సంఘము యీ విషయమును ఆలకించుగాక. ఏరు కొన్న అయిదువందల భిక్షువులును యీ వర్షావాసమును రాజగృహపురమున నిర్వర్తించుచు ధర్మవినయములను సంగాయనము చేయవలెనని నిర్ణయమైనది. ఇతర భిక్షువు లచ్చోటికి రారాదు. ఇందు మీ అభిప్రాయమేమి?'' అని యిట్లు ముమ్మారడిగి సంఘము మౌనముగ నుండుటచే దానినె సమ్మతిగ గ్రహించెను.

'అర్హతపదమును పొందని తాను ఆ సభయందు పాల్గొనుట యోగ్యముగాదే' యని ఒకానొక రాత్రి ఆనందుడు విచారించుచు తెలతెలవారువేళ పరుండుటకై మెల్లన భూమిపై సోలెను. శరీరము భూమిని తాకియు దాకకముందె చిత్తము ఆస్రవని ర్ముక్తమైనది. ఆనందుడు అర్హతసిద్ధిని ప్రాపించెను.

సంఘమంతయు సమావేశమైనది. మహాకాశ్యపుడు సర్వప్రథమభిక్షువగుట బట్టి ఆతనినందఱును 'భంతే' యని సంబోధించుచు వచ్చిరి. అతండు తక్కినవారిని 'ఆయుష్మంతులారా! యని పిలుచుచు వచ్చెను. బుద్ధునకు మంగలి శిష్యుడగు ఉపాలితో వినయసంబంధమగు చర్చలను మొదట నడపిరి. ఉపాలివైపు జూచి మహాకాశ్యపు డిట్లనియె.

''ఆయుష్మంతా! ఉపాలీ! ప్రథమ పారాజిక యెచ్చట విధింపబడినది?''

''స్వామీ! రాజగృహమునందు.''

''ఎవరిని గుఱించి?''

''సుదిన్న కలందక పుత్రుని గూర్చి''

''ఏ విషయమున?''

''మైథున ధర్మమున''

అంతట మహాకాశ్యపుడు ఉపాలిని ప్రథమపారాజికయొక్క వస్తువును నిదానమును పుద్గలుని ప్రజ్ఞప్తిని అనుప్రజ్ఞప్తిని ఆపత్తిని అనాపత్తిని గూర్చి ప్రశ్నించెను. అతండును సమాధాన మొసగెను. అట్లే ద్వితీయ తృతీయ చతుర్థ పారాజికలను గూర్చియు, మరియు ననేక భిక్షు భిక్షుణీ నియమములను గూర్చియు నడుగుచు వచ్చెను. ఉపాలియు నుత్తరము లిచ్చుచుండెను.

తదనంతరము సంఘమునకు సూచన నిచ్చి అనుమతిగొని ఆయుష్మంతుడు మహాకాశ్యపుడు ఆనందునివైపు మళ్ళి ధర్మవిషయమును గూర్చి యిట్లు ప్రశ్నించెను.

''ఆయుష్మంతా! ఆనందా! శ్రామణ్యఫల మెచ్చట జెప్పబడినది?''

''స్వామీ! రాజగృహమున జీవకామ్రవనమునందు.''

''ఎవరితో?''

''వైదేహీ పుత్రుడు అజాతశత్రునితో.''

''ఆయుష్మంతా! బ్రహ్మజాలసూత్రము నెచ్చట జెప్పిరి?''

''స్వామీ! రాజగృహ - నాలందాపురములకు నడుమ ఆమ్రయిష్టికా రాజాగారమునందు.''

''ఎవ్వరితో!''

''సుప్రియ పరివ్రాజక బ్రహ్మదత్తమాణవకులతో.''

అని యిట్లు మహాకాశ్యపుడు ఆనందునితో ప్రశ్నించుచు వచ్చెను. ఆనందుడును సమాధాన మిచ్చెను. అయిదు నికాయములను గూర్చియు చర్చలు జరిగినవి.

అంతట ఆనందు డిట్లనియె ''స్వామీ! భగవంతుడు పరినిర్వాణము చెందు సమయమున నన్ను పిలిచి, 'ఆనందా! అవసరమైనచో నేను విధించిన నియమములలో చిన్న చిన్న శిక్షాపదములను మీదట మీరు త్రోసిపుచ్చవచ్చు' నని సెలవిచ్చినారు?''

''ఆనందా! ఆ చిన్న చిన్న నియమము లనిన నేవి?''

''స్వామీ! ఆ విషయము నే నడుగ లేదు.''

పదంపడి ఆ ప్రసంగముపై సభయందు వాదవివాదములు చెలరేగెను. ఎవ్వరును యేదియు నిష్కర్షగ తేల్చ లేక పోయిరి. మహాకాశ్యపుడు సంఘమును జూచి ''ఆయుష్మంతులారా! భగవంతుడు జీవించియుండినపుడు పాలించిన నియమము లన్నింటిని మన మవశ్యమికమిదట కూడ పాలించవలసియెయున్నది. మనము కొన్నింటి నతిక్రమించినచో పలువురకు స్వేచ్ఛాచారితకు దారినిచ్చిన వార మౌదుము. దీనినందఱును అంగీకరించవలెనని వాక్రుచ్చి ఆనందునితో నిట్లనియె.

''ఆనందా! అప్పుడే భగవంతుని వివర మడుగక నీవు తప్పుజేసితివి. ఇది నీకు దుష్కృతమను దోషము.''

''స్వామీ! జ్ఞప్తిలేక అడుగలేదు. అది దోష మెట్లగును? అయినచో క్షమ వేడుకొందును.''

''ఆనందా! మఱియొక విషయము. ఒకనాడు నీవు భగవంతుని శాటీవస్త్రమును కాలితో త్రొక్కి పట్టి కూర్చితివి. అది యొక తప్పు.''

'' స్వామీ! అనాదరబుద్ధితో నే నట్లు చేయలేదు. అవసరమై జేసితిని. తప్పైనచో క్షమార్పణ వేడుదును.''

''ఆనందా! తథాగతుని ఒత్తిడి పెట్టి స్త్రీలకు ప్రవ్రజ్య నిచ్చునట్లు జేసితివి. అది దుష్కృతమను ఆపత్తి.''

''పూజ్యుడా! సాక్షాత్తు భగవంతుని తల్లియగు మహాప్రజాపతీ గౌతమీదేవిని ఉద్దేశించి అట్లు చేసితిని. అదెట్లు దోషము కాగలదు? అయినచో మన్నన వేడుకొందును.''

అని యిట్లు వాదవివాదములు నడచెను. అంతట కొన్నాళ్ళకు దక్షిణాగిరియందు విహరించుచున్న పురాణుడను భిక్షువు రాజగృహమునకు బఱతెంచి అచ్చట జరుగు ధర్మవినయ సంగీతిని విని ''వీరు చేయు నిర్ణయములకు నేను లొంగను. భగవంతుడు బుద్ధుని మూలమున స్వయముగ నేను వినిన నియమములనె పాటింతును. తక్కినవి నాకు కొఱగావ''ని పలికెను.

ఆనందుడు మహాకాశ్యపునితో మరియు నిట్లనియె.

''స్వామీ! ఛన్న భిక్షువునకు బ్రహ్మదండము విధింపుడని భగవంతుడు చెప్పెను.''

''ఆనందా! బ్రహ్మదండమనిన యేమని అడిగితివా?''

''స్వామీ! అడిగితిని. వాడెట్లు మాట్లాడినను అది యిది యని మాఱుపలుకకుండుట.''

''ఆనందా! నీవే పోయి ఆ ఛన్న భిక్షువున కావిషయము తెలిపిరమ్ము.''

''స్వామీ! వాడు చండపురుషుడు. కఠోరభాషి.''

''ఆనందా! అటులయిన కొంత భిక్షుపరివారముతో బొమ్ము.''

అంతట ఆయుష్మంతుడు ఆనందుడు యేనూర్వురు భిక్షుసంఘముతో గూడి ఛన్న భిక్షువు వసించుచున్న కౌశాంబీ నగరమునకు నావపై ప్రయాణము

జేసెను. కతిపయ ప్రయాణములలో కౌశాంబి నధిగమించి ఉదయన మహారాజు యొక్క ఉద్యానవనమునం దొక చెట్టుక్రింద విశ్రమించి యుండెను.

ఆచార్యుడగు ఆనందుడు ఉపవనమున వచ్చియున్నాడని విని ఉదయన నరేంద్రుని రాణులు అమ్మహాత్ముని దర్శింపదలంచి వల్లభుని యనుజ్ఞగొని ఆనందుడున్నెడకు వచ్చి నమస్కరించి యొకచో గూర్చొనిరి. ఆయుష్మంతుడు ఆనందుడును వారిని వివిధ ధర్మకథాసల్లాపములతో సంతృప్తుల నొనర్చెను. అంతట నంతఃపుర కాంతలాయనకు అయిదువందల వస్త్రముల (ఉత్తరాసంగముల) ను ఉపాయనముగ నర్పించి సెలవుదీసికొని వెళ్ళిరి.

అచ్చట ఉదయన రాజేంద్రుడు తన వల్లభలు ఆనందశ్రమణునకు యేనూరు వలువలిచ్చుట విని విస్తుపోయి ఆనందునివద్ద కరుదెంచి యిట్లనియె. ''ఆనంద శ్రమణా! నా రాణివాసము యిట వచ్చియుండెనా?''

''మహారాజా! వచ్చియుండిరి.''

''వారు మీకు ఏనూరు చీవరములు నిచ్చినారా?''

''అవును. యిచ్చినారు.''

''అన్ని వస్త్రములను తీసికొని వ్యాపారము జేయుదురా?''

''మహారాజా! వస్త్రహీనులగు భిక్షువుల కొసగెదను.''

''ఆ భిక్షువులు ధరించియుండిన పాతగుడ్డల నేమి చేయుదురు?''

''వాటితో పఱుపు ముసుగులను తయారు చేయింతును.''

''ఆర్యా! ఆ వెనుకనుండిన పాతముసుగుల నేమి చేయింతువు?''

''మహారాజా! వాటితో బొంతలను నిర్మింతుము.''

''వెనుకటి పాతబొంతల నేమిచేయుదురు?''

''కాళ్ళు తుడుచుకొను (రాచుకొను) తివాసీలు చేయింతును.''

''అంతకు వెనుకటి తివాసీలను యేమి చేయగలరు?''

''అలుకుడు చుట్టలకు, మసిపాతలకును పనికివచ్చును.''

''ఆచార్యా! ఆనందా! సెబాసు. సెబాసు. ఏ చిన్నవస్తువు కూడ మీమూలమున వ్యర్థముగాదు. ఇదిగో! మరియు నైదువందలు చీవరము లిత్తును. గ్రహింపుము.''

ఉదయన భూపాలునిచే నిట్లు సన్మానితుడై పదంపడి ఆయుష్మంతుడు ఆనందుడు ఛన్నభిక్షువున్న కడకు బోయి సంఘము విధించిన బ్రహ్మదండమును తెలియజేసెను. ఆ భిక్షువు ఆ మాట విని మొదలు నఱికిన వృక్షమువలె మూర్ఛితుడై నేలబడి సంఘమునకు దూరమైతినే యని మిగుల వాపోయెను. అదే విచారముతో గూడి అప్రమత్తుడై విహరించుటవలన అనతికాలములోనే యథార్థ బ్రహ్మచర్యఫలమును బొంది అర్హతులలో నొకడయ్యెను. అర్హత్వమును పొందుటచే బ్రహ్మదండ దోషము స్వయముగ నివృత్తమయ్యెను.

ఈ విధమున రాజగృహమునందు యేనూర్వురు భిక్షువులతో ప్రథమసంగీతి నడిచినది. అది పంచశతికా సంగీతియని పిలువబడెను.

సుత్తపిటకమందు అయిదు నికాయములు గలవు. 1. దీర్ఘనికాయము. 2. మధ్యమనికాయము. 3. సంయుక్తనికాయము. 4. అంగుత్తరనికాయము. 5. ఖుద్దక నికాయము.

1. దీర్ఘ నికాయమునందు బ్రహ్మజాలము మొదలగు ముప్పదినాలుగు సూత్రములును, మూడువర్గములును గలవు. సూత్రములు దీర్ఘములై యుండుట బట్టి దీర్ఘనికాయమని పేరువచ్చినది. 2. మధ్యమ నికాయమునందు మధ్యమ పరిణామములగు పదునైదు వర్గములును, మూలాపర్యాయము మొదలగు ఒక్క నూట యేబదిమూడు సూత్రములును గలవు. 3. సంయుక్త నికాయమునందు వేదనాసంయుక్త ప్రభృతికములగు సంయుక్తసూత్రములు యేబదినాలుగును, ఓఘతరణాద సూత్రములు యెడు వేల యెడువందల అఱువదరండును గలవు. 4. అంగుత్తర నికాయమునందు పదునొకండు నిపాతములును, చిత్త పరియాదానము మొదలగు తొమ్మిదివేల అయిదువందల యేబది యేడు సూత్రములును గలవు.

5. దీర్ఘనికాయము మొదలుకొని నాలుగింటిని వదలి మిగిలిన బుద్ధవచనములను ఖుద్దకనికాయమని చెప్పబడును.

ముప్పదిరెండు అక్షరముల చొప్పున పరిమితితో బుద్ధుని ప్రమాణ వచనములు ఎనుబదిరెండువేలు శ్లోకములును, భిక్షువుల మూలమున రెండువేలును గలిసి మొత్తము ఎనుబదినాలుగు వేల వచనములు బుద్ధుని ధర్మమునకు సమ్మతమైనవి.

## ౧౨

## ద్వితీయ సంగీతి (వి. పూ. 326)

బుద్ధభగవంతుడు పరినిర్వృతుడైన వంద సంవత్సరములకు వైశాలీ నివాసి యగు వాత్సీపుత్రు (వజ్జిపుత్తకు) డను నొక భిక్షువు వినయ నియమముల నుల్లంఘించి, 1. శృంగిలవణకల్పమును 2. ద్వ్యంగులి కల్పమును 3. గ్రామాంతర కల్పమును 4. ఆవాస కల్పమును 5. అనుమతి కల్పమును 6. ఆచీర్ణ కల్పమును 7. అమథిత కల్పమును 8. జలోగీపానమును 9. అదశకమును 10. స్వర్ణ రజతము లను, భిక్షువు లుపయోగించుకొనవచ్చునని ప్రచారము చేయుచుండెను.

ఆయుష్మంతుడు యశుడను భిక్షువు చారిక నొనర్చుకొనుచు వైశాలీ జను దెంచి వజ్జి పుత్తకుని, తదనుయాయులగు భిక్షువులను కలిసికొని వారి పద్ధతియును, వారి ప్రచారమును తనకు సహింపరాని వగుడు అందందుండు భిక్షు సంఘములను ప్రేరేపించి ద్వితీయ సంగాయనమును వైశాలియందె నడచునట్లొన రించెను.

ఆయుష్మంతుడు సర్వకామి, సాధువు, క్షుద్రశోభితుడు, వార్షభగ్రామికుడు నను ప్రాచీనక (తూరుపుదేశమువారగు) భిక్షువులు నలువురును, రేవతుడు, సంభూతుడు, యశుడు, సుమనుడు ననుపావేయక (పడమటి దేశపు) భిక్షువులు నలువురును ఆ సంగీతియందు కార్యవర్గ సభ్యులుగ నెన్నుకొనబడిరి.

రేవతుడు ప్రశ్నించుచు వచ్చెను. సర్వకామి సమాధానమిచ్చుచు వచ్చెను.

1. ''స్వామీ! శృంగిలవణకల్పము భిక్షువులకు విహితమేనా?''

''ఆయుష్మంతా! శృంగలవణకల్ప మనగా నేమి?''

''స్వామీ! శృంగము (కొమ్ము) నందు ఉప్పునుంచుకొని అవసర మున్నచోట వాడుకొనుట.''

''ఆయుష్మంతా! విహితముగాదు.''

''స్వామీ! ఎచ్చట నిషేధింపబడినది.''

''ఆయుష్మంతా! శ్రావస్తియందు 'సుత్తవిభంగము' లో''

''స్వామీ! దోషమేమి?''

''ఆయుష్మంతా! సన్నిధికారక (సంగ్రహీత) వస్తువును భుజించుటచే 'ప్రాయశ్చిత్తిక' మను దోషము.''

2. ''స్వామీ! ద్వ్యంగులికల్పము విహితమేనా?''

''ఆయుష్మంతా! ద్వ్యంగులికల్ప మనగా నేమి?''

''స్వామీ! మధ్యాహ్నము రెండంగుళముల ప్రొద్దుతిరిగిన తర్వాత వికాలము నందు భోజనము చేయుట.''

''ఆయుష్మంతా! విహితముగాదు.''

''స్వామీ! ఎచ్చట నిషేధింపబడినది?''

''ఆయుష్మంతా! రాజగృహపురములో సుత్తవిభంగసూత్రమునందు.''

''స్వామీ! దోష మేమి?''

''ఆయుష్మంతా! వికాలభోజనవిషయకమగు ప్రాయశ్చిత్తము''

3. ''స్వామీ! గ్రామాంతర కల్పము విహితమా?''

''ఆయుష్మంతా! అనగానేమి?''

''స్వామీ! భోజనముచేసి త్రేపినతర్వాత తిరిగి గ్రామము లోనికి భోజనమున కరుగుట.''

''ఆయుష్మంతా! విహితముగాదు.''

''స్వామీ! ఎచ్చట నిషేధింపబడినది?''

''ఆయుష్మంతా! శ్రావస్తియందు సూత్రవిభంగమున.''

''స్వామీ! దోష మేమి?''

''ఆయుష్మంతా! అతిరిక్తవిషయకమగు ప్రాయశ్చిత్తము.''

4. ''స్వామీ! ఆవాసకల్పము విహితమేనా?''

''ఆయుష్మంతా! అనగానేమి?''

''స్వామీ! ఒకే సరిహద్దులో పలుచోట్ల ఉపోసథ వ్రతమును నిర్వహించుట.''

''ఆయుష్మంతా! విహితముగాదు.''

''స్వామీ! ఎచ్చట నిషేధింపబడినది?''

''ఆయుష్మంతా! రాజగృహమునందు ఉపోసథసూత్రమున.''

''స్వామీ! దోషమేమి?''

''ఆయుష్మంతా! వినయ నియమము నతిక్రమించుటచే దుష్కృతమను దోషము.''

5. ''స్వామీ! అనుమతికల్పము విహితమేనా?''

''ఆయుష్మంతా! అనగా నేమి?''

''స్వామీ! తన్ననుసరించిన వర్గమునకు వినయకర్మమొనర్చుట.''

''ఆయుష్మంతా! విహితముగాదు.''

''స్వామీ! ఎక్కడ నిషేధింపబడినది?''

''ఆయుష్మంతా! చాంపేయక వినయవస్తువునందు.''

''స్వామీ! దోష మేమి?''

''ఆయుష్మంతా! వినయాతిక్రమణమున దుష్కృతమను దోషము.''

6. ''స్వామీ! ఆచీర్ణ కల్పము విహితమేనా?''

''ఆయుష్మంతా! అనగానేమి?''

''స్వామీ! 'నా ఉపాధ్యాయుడు దీనిని ఆచిరించినాడు. కావున నేనును ఆచరించెద' నని తలంచుట.''

''ఆయుష్మంతా! కొన్ని యెడల విహితము, కొన్ని చోట్లకాదు.''

7. ''స్వామీ! అమథితకల్పము విహితమేనా?''

''ఆయుష్మంతా! అనగా నేమి?''

''స్వామీ! పాలు తనరూపమును మాటి పెఱుగుగాక ముందె, అట్టి దానిని భోజనానంతరము భుజించుట.''

''ఆయుష్మంతా! విహితముగాదు.''

''స్వామీ! ఎచ్చట నిషేధింపబడినది?''

''ఆయుష్మంతా! శ్రావస్తియందు సూత్రవిభంగమున.''

''స్వామీ! దోషమేమి?''

''ఆయుష్మంతా! అతిభోజన విషయకమగు ప్రాయశ్చిత్తము.''

8. ''స్వామీ! జలోగిపానము విహితమా?''

''ఆయుష్మంతా! అనగా నేమి?''

''స్వామీ! సంపూర్ణ పాకమునకు రాని సారాయమును గ్రహించుట.''

''ఆయుష్మంతా! విహితముకాదు.''

''స్వామీ! ఎక్కడ నిషేధింపబడినది?''

''ఆయుష్మంతా! కౌశాంబియందు సుత్తవిభంగమున.''

''స్వామీ! దోష మేమి?''

''ఆయుష్మంతా! సురామేరయ పానమనెడి ప్రాయశ్చిత్తిక దోషము.''

9. ''స్వామీ! అదశక నిషీదనము విహితమేనా?''

''ఆయుష్మంతా! అనగా నేమి?''

''స్వామీ! అంచులేని ఆసనముల నుపయోగించుట.''

''ఆయుష్మంతా! విహితముగాదు.''

''స్వామీ! ఎచ్చట నిషేధింపబడినది?''

''ఆయుష్మంతా! శ్రావస్తియందు సూత్రవిభంగమున.''

''స్వామీ! దోషమేమి?''

''ఆయుష్మంతా! ప్రాయశ్చిత్తికదోషము.''

10. ''స్వామీ! వెండిబంగారములు విహితమేనా?''

''ఆయుష్మంతా! విహితముకాదు.''

''స్వామీ! ఎక్కడ నిషేధింపబడినవి?''

''ఆయుష్మంతా! రాజగృహమందు సుత్తవిభంగమున.''

''స్వామీ! దోష మేమి?''

''ఆయుష్మంతా! ప్రాయశ్చిత్తికదోషము.''

''ఓ భిక్షుసంఘములారా! వజ్జిపుత్తకుడు ప్రచారముచేయు దశవస్తువులును – ధర్మవిరుద్ధములు, వినయవిరుద్ధములు, బుద్ధశాసనదూరములు. ఇది నిర్ణయము.''

ఈ విధమున రెండవసంగీతి వైశాలియందు నడిచినది. దాని యందు చక్కగ యేడునూర్ల భిక్షువులు కూడియుండుటచే దానిని 'సప్తశతికా సంగీతి' యని వ్యవహరించిరి.

## ౧౩
## అశోకరాజు – తృతీయసంగీతి (వి. పూ. 212 – 191)

స్థవిరభిక్షువులు ద్వితీయసంగీతిని సంగాయనముజేసి పదంపడి భవిష్యత్తును గూర్చి యిట్లు యోచించిరి. ''ఇకపై నూటపదునెన్మిది సంవత్సరములకు రాగల కాలమున అశోకవర్ధనుడను రాజు పాటలీపుత్రము రాజధానిగ జంబూద్వీపమునం తటిని పాలించగలడు. బుద్ధధర్మమునం దతడు ప్రగాఢ శ్రద్ధాతత్పరుడు కాగలడు. లాభసత్కారములను, రాజకీయగౌరవమును అపేక్షించి అన్యసంప్రదాయస్థులగు తైర్థికులుకూడ బౌద్ధ దీక్ష నవలంబింతురు. భిక్షు రూపధారులైకూడ వారు తమ తమ పూర్వమతములనె ప్రచారము జేయుచు వచ్చెదరు. దానిచే బుద్ధధర్మమునందు భ్రష్టాచారము వ్యాపింపగలదు. ఆ మలమును దొలగించుటకు తగిన సమర్థుడగు వాడు భూలోకమున నా సమయమున నవతరించవలసి యుండు''నని దలంచి బ్రహ్మలోకమునకు జని తిష్యుడను బ్రహ్మను ప్రార్థించెను. ఆయనయు సమ్మతించెను.

బ్రహ్మలోకమును వీడి భూలోకమునందు తిష్యుడు మౌద్గల్యుడను బ్రాహ్మణుని యింట బుట్టి మోగ్గలిపుత్తతిస్స (మౌద్గలిపుత్రతిష్యుడు) అని వ్యవహరింపబడు చుండెను. పదునాఱేండ్లు వచ్చుసరికి త్రివేద పారంగతుడై సిగ్గవుడు, చండవజ్జి యనెడు వృద్ధభిక్షువుల ప్రోత్సాహమున బౌద్ధధర్మమునందు దీక్షితుడై ఉపసంపదను బొంది త్రిపిటకములను కంఠస్థము జేసెను. ఇట్లు మౌద్గలిపుత్ర తిష్యుడు త్రిపిటకధరుడును అర్హతుడునునై యుండెను.

మగధరాజగు బిందుసారుడు బ్రాహ్మణ ధర్మభక్తుడు. అతనికి నూర్వురు కొడుకులు. వారిలో నొకడగు అశోకుడు తన సహోదరుడగు తిష్యకుమారుని నొక్కని వదలి తక్కినవారి నందఱిని జంపి వి. పూ. 212 యందు అభిషిక్తుడుగాకనె సింహాసనము నధిష్ఠించెను. నాలుగు సంవత్సరములలో తథాగతుని నిర్వాణానంతరము 218 వ యేటియందు లేదా వి. పూ. 208 యందు భూమండలమునకు చక్రవర్తియై రాజ్యాభిషేకమును బొందెను.

తర్వాత నశోకుడు మూడు సంవత్సరములు యితర ధర్మములందు మెలగి నాల్గవయేట (వి. పూ.205) బుద్ధధర్మమునకు భక్తుడయ్యెను.

బిందుసారునిపెద్దకొడుకు సుమను డనువాడు తన తమ్ముడగు అశోకునిచే చంపబడునప్పటికి ఆతనిభార్య పూర్ణగర్భిణియై యుండినది. ఆమె అంతఃపురము

నుండి తప్పించుకొని పోవుచు నొక చండాలవాటిక సమీపమున నొక మఱ్ఱిచెట్టుక్రింద కుమారుని ప్రసవించినది. న్యగ్రోధ వృక్షము క్రింద పుట్టుటచే వానికి న్యగ్రోధు డను పేరిడిరి. చండాలురే వారిని పోషించుచు వచ్చిరి. బాలకుడు యేడేండ్ల యీాడు వాడయి నంతనె మహావరుణుడను స్థవిరునిచే ప్రచోదితుడై ప్రవ్రజించి వెంటనె అర్హత్వ మును బొందెను.

ఒకనాడు తన మేడపై విహరించుచున్న ధర్మాశోకచక్రవర్తి వీధివెంబడి పోవు న్యగ్రోధభిక్షువును జూచి ముగ్ధుడై దగ్గఱికి పిలువనంపి యతని మూలమున శరణా గమనములను, పంచశీలములను బొందెను.

అశోకచక్రవర్తి పాటలిపుత్రమున అశోకారామమను మహావిహారమును నిర్మింపజేసి యొకనాడు భిక్షుసంఘమును సమావేశపఱచి వారితో నిట్లనియె.

''పూజ్యులారా! నేను బుద్ధధర్మమునకు భాగస్వామినౌదును గదా?''

''మహారాజా! ఇంతమాత్రముచేతనే ధర్మమునకు వారసుడవని చెప్పుట జెల్లదు. ఎవ్వడు తన ఔరసపుత్రుని పరివ్రాజకుని జేసి ధర్మమునకు అప్పగించుచు న్నాడో వాడే ధర్మమునకు భాగస్వామి.''

అశోకుడు కుమారుడగు మహేంద్రుని వైపు జూచెను. సుతుడును అంగీకా రమును సూచించెను. ప్రక్కనె నిలువబడియున్న కూతురు సంఘమిత్ర కూడ తానును ప్రవ్రజించుటకు ఉత్సాహమును వెల్లడించెను. మౌద్గలిపుత్రతిష్యుని యాజ మాన్యమున వారిరువురును ప్రవ్రజ్యను బొందిరి. ఆ సమయమున మహేంద్రుని యీాడు యిరువది వత్సరములు. సంఘమిత్రకు అష్టాదశవర్షముల వయస్సు.

అన్యసంప్రదాయులగు తైర్థికులు పలువురు లాభ సత్కారవాంఛతో బుద్ధధర్మ మున ప్రవేశించిరి. బౌద్ధభిక్షువులు వారి సంపర్కము నొప్పుకొనకుండిరి. ఇట్లు అశోకారామ విహారమునందలి భిక్షుసంఘమున వైమనస్యము లేర్పడి ఏడు సంవత్స రములు ఉపోసథవ్రతము నడువలేదు. ప్రావారణము జరుగలేదు. ఆతగవుల నడుమనుండలేక మోగ్గలిపుత్తతిస్సుడు అహోగంగా పర్వతమునకు (హరిద్వార – సమీపము) వెడలిపోయెను. అశోకమహారాజు ఆ వివాదమును పరిష్కరించుటకై వెండియు మౌద్గలిపుత్రతిష్యుని సాదరముగ రప్పించెను. అతని సభాపతినిగ జేసి రాజేంద్రుడు భిక్షుసంఘముల నన్నింటిని విహారమున సమావేశపఱచెను. ప్రత్యేకముగ నొక్కొక్క సంఘమును నొక్కొక్క పర్యాయము బిలిపించి యిట్లడిగెను.

''పూజ్యులారా! సమ్యక్ సంబుద్ధునకు సమ్మతమగు వాదము (సిద్ధాంతము) యేది?''

''మహారాజా! శాశ్వత వాద'' మని కొందఱును, ''ఆత్మానంతిక వాద'' మని కొందఱును, 'అమరావిక్షేపక వాద' మని కొందఱును వారి వారి పూర్వసిద్ధాంతముల ననుసరించి చెప్పుచు వచ్చిరి. మహారాజు వారి నందఱిని భిక్షువులు గారనియు, తైర్థికులనియు గ్రహించి వెలుపలికి పంపుచు వచ్చెను. తర్వాత మఱియొక సంఘమును జూచి ''పూజ్యులారా! సమ్యక్ సంబుద్ధుని వాదమేది? అని ప్రశ్నించెను. ''మహా రాజా! సమ్యక్ సంబుద్ధుడు విభజ్యవాది'' యని వారు ప్రత్యుత్తర మిచ్చిరి.

ఇట్లు భిక్షుసంఘమునందలి కల్ల నిజములను దేల్చి యిక ఉపోసథము నాచరిం పుడని వారికి చెప్పి నరేంద్రుడు నగరికరిగెను. ఉపోసథ వ్రతానంతరము మౌద్గలిపుత్ర తిష్యుడు త్రిపిటకములందు నిష్ణాతులైన భిక్షువులను వేయిమందిని యేర్చి కూర్చి ముందటి మహాకాశ్యపుని వడువున, యశస్థవిరుని భాతి ధర్మవినయముల సంగాయ నమును జేయించెను. ఈ తృతీయసంగీతి విక్రమపూర్వము 191 యందు నవమాస ములు నడిచినది.

## ౧౪

## విదేశములయందు ధర్మప్రచారము

1. బుద్ధుడు, 2. ఉపాలి, 3. దాసకుడు, 4. సోణకుడు, 5. సిగ్గవుడు, 6. మోగ్గలిపుత్తతిష్యుడు అని యిట్లు ఆచార్యపరంపర వచ్చినది.

మౌద్గలిపుత్రతిష్యుడు యీ విధమున తృతీయసంగీతిని ముగించి వి. పూ. 190 యందు విదేశములలో దూరదేశములలో ధర్మప్రచారమునకై భిక్షువులను బంపించెను. కాశ్మీరమునకును, గాంధార (పెషావరు) ప్రాంతమునకును మధ్యాంతి కస్థవిరుని బంపెను. మహేశ్వర (ఇందోర్) మండలమునకు మహాదేవస్థవిరుని బంపెను. ఉత్తరకన్నడములకు రక్షితస్థవిరుని బంపెను. అపరాంతము (పడమటి కనుమలు) నకు ధర్మరక్షిత స్థవిరుని పంపెను. మహారాష్ట్రమునకు మహాధర్మరక్షితుని బంపెను. యవనక (బెలూచి - సిరియా - మిశ్ర - యూనాన్) ప్రాంతములకు మహా రక్షితుని బంపెను. హిమాలయ పరిసరములకు మధ్యమస్థవిరుని బంపెను. సువర్ణభూమికి (బర్మాకు) సోణకుడు మొదలగు స్థవిరులను బంపెను.

మహేంద్రస్థవిరుడును అతనితోడ మరి నలువురు భిక్షువులును తామ్రపర్ణీ (లంకా - సిలోన్) ద్వీపమునకు బోయిరి. సీమాంతదేశములందు ఉపసంపద నిచ్చుటకు పంచవర్గీయగణమె చాలును.

తామ్రపర్ణి (సిలోన్) యందు ప్రవేశించి ఆ ద్వీపమునకు రాజగు దేవానాం ప్రియతిష్యునకును, అతని మేనల్లుడగు అరిష్టునకును మరియు ఏనూర్వురు పురుషులకును మహేంద్రుడు భిక్షుదీక్ష నొసంగెను.

రాజు చెల్లెలగు అనులాదేవి మహేంద్రుని ప్రవ్రజ్యనిమ్మని గోరినది. పురుషుడగు తాము స్త్రీలకు ప్రవ్రజ్యమివ్వరాదని చెప్పి పాటలిపుత్రమునుండి తన చెల్లెలగు సంఘమిత్రను రప్పించెను. ఆమెయు తామ్రపర్ణీ ద్వీపమునందు అనులాదేవి మొదలగు యేనూర్వురు స్త్రీలకు భిక్షుణీదీక్ష నొసంగెను.

కొంతకాలమునకు భిక్షుసంఘమంతయు సమావేశమై మానవులయొక్క జ్ఞాపకశక్తి సన్నగిల్లుట గమనించి విక్రమపూర్వము 26 మొదలుకొని విక్రమశకము 56 వఱకు, అంతకుముందు కంఠస్థము జేయుచు వచ్చిన పాలీత్రిపిటకములను చిరకాల ముండుటకొఱకై లిపిబద్ధము జేసి పుస్తకములందు వ్రాయించిరి.

  



# మూలగ్రంథసూచీ

అంగుత్తరనికాయము (అం. ని. సుత్తపిటక)
అంగుత్తరనికాయ అట్ఠకథా (అం. ని. అ. క.)
అపదాన, థేరీ (ఖుద్దకనికాయ, సుత్తపిటక)
ఉదాన ( ,, ,,
ఉదాన – అట్ఠకథా, ( ,, ,,
చుల్లవగ్గ (చు. వ. వినయపిటక)
జాతక అట్ఠకథ (జా. అ. ఖుద్దక – సుత్త)
థేరగాథ – అట్ఠకథ (ఖుద్దక – సుత్త)
దీఘనికాయ (దీ. ని. సుత్త)
దీఘనికాయ అట్ఠకథ. (దీ. ని. అ. క.)
ధమ్మపద అట్ఠకథ (ధ. ప. అ. క. ఖుద్దక)
ధమ్మసంగణీ (అభిధమ్మపిటక)
పారాజికా (వినయపిటక)
పారాజికా అట్ఠకథా (సమంత పాసాదికా)
మజ్ఝి మనికాయ (మ. ని. సుత్త)
మజ్ఝిమనికాయ అట్ఠకథ (మ. ని. అ. క.)
మహావగ్గ (మ. వ. వినయపిటక)
మహావగ్గ అట్ఠకథ (సమంత పాసాదిక)
మహావంస
యమక (అభిధమ్మ పిటక)
సంయుత్తనికాయ (సం. ని. సుత్త)
సంయుత్తనికాయ అట్ఠకథ.
సుత్తనిపాత (ఖుద్దక. సుత్తి)
సుత్తనిపాత – అట్ఠకథ.

